శ్రీ

# ఆంధ్రసాహిత్య

# పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**


సంపుటము ౨౧. Vol. 21

ఆంగీరసనామసంవత్సరము.

చైత్రవైశాఖమాసములు.

సంచిక ౧.





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే పరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1932.

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలలకొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౧. ఆంగీరసనామసంవత్సరము చైత్ర వైశాఖమాసములు. సంచిక ౧.

## విజ్ఞాపనము.

భగవదనుగ్రహమువలనను భాషాభిమానుల దయవలనను బండితుల సహాయమునను బరిషత్పత్రిక తనయిరువదియవసంవత్సరమును బూర్తిచేసినది. ఇరువదియొకటవ సంవత్సరము ప్రారంభ మైనది. పరిషత్తు భాషావిషయ మై చేయఁదలఁచుకొనిన కార్యములను శక్తివంచనలేక యొనర్చుచున్నది. పరిషదభిప్రాయముల నెఱింగినవారును దానికిఁ దగుసహాయము నొనర్చుచున్నందుకు, పరిషత్తెంతయుఁ గృతజ్ఞత చూపుచున్నది. అనేకులు భాషావిదులు, పండితులు, విద్యార్థులు పరిషత్పత్రికకు వ్యాసరూపమున విశేషసహాయముం గావించుచున్నా రని పరిషత్తు వారియెడలఁ బ్రశ్రయభావముం జూపుచున్నది. ఎప్పటిరీతి నెల్లవారును, దమతమతోడ్పాటును జేయుచున్నచో ముందుముందును బరిషత్పత్రిక భాషాసేవ చేయఁగలదు. వ్యాసములు వ్రాసి పంపుచున్నవారిలోఁ జాలమంది విశేషము సంస్కృతభాషను దద్గ్రంథములం గూర్చియే వ్రాయుచున్నారు. దయతో నాంధ్రసాహిత్యవిషయమునఁగూడఁ గొంతశ్రద్ధ పుచ్చుకొని విశేషభాగ మాంధ్రసాహిత్యమును గూర్చియే వ్యాసములను బంపుచుండవలయు నని పరిషత్తు కోరుచున్నది. స్పష్టముగను, నిర్దుష్టముగను, వ్యాసములను, వ్రాయకుండుటచే మరల మే మిక్కడఁ గొంతశ్రమపడి ముద్రాక్షరశాలవారితోఁ జిక్కుపడవలసి వచ్చుచున్నది. కావున మున్ముం దట్టి శ్రమ మాకుఁ గలుగకుండఁ జేయఁగోరుచున్నాము.

పరిషత్ప్రకటితగ్రంథములనుగొనియుఁ, బత్రికాగ్రాహకు లయియు నాంధ్రమహానీయులు స్వహస్తపరహస్తముల నీపరిషత్తును వృద్ధిచేయుచుండఁ బ్రార్థించుచున్నాము. పత్రికాపాఠకులు తమతమ చందాలను వెంటనే పంపఁగోరుచున్నారము.

ష॥ అ॥

# మృచ్ఛకటికము.

కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు-విజయనగరము :—

ఇది చాలఁ బ్రాచీన మైన పదియంకములు కల రూపకము. శైలి చాల సులభ మైనది. వర్ణనలు స్వాభావిక మైనవిగ నుండును. ఈరూపకమందలి ప్రస్తావనను బరిశీలింప ఋగ్వేదము, సామవేదము, గణితశాస్త్రము, అశ్వశాస్త్రము మొదలగు వానిని జక్కగ నధ్యయన మొనరించిన శూద్రకుఁ డను క్షత్రియుఁడు దీనిని రచించె నని తెలియుచున్నది. పస్తావనలోని శ్లోకముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

"ఏతత్కవిః కిల:—

ద్విరదేంద్రగతి శ్చకోరనేత్రః పరిపూర్ణేందుముఖ స్సువిగ్రహశ్చ
ద్విజముఖ్యతమః కవి ర్బభూవ ప్రథితః శూద్రక ఇత్యగాధసత్వః
ఋగ్వేదం సామవేదం గణిత మథ కలాం వైశికీం హస్తిశిక్షాం
జ్ఞాత్వా శర్వప్రసాదా ద్వ్యపగతతిమిరే చక్షుషీ చోపలభ్య
రాజానం వీక్ష్య పుత్రం పరమసముదయే నాశ్వమేధేన చేష్ట్వా
లబ్ధ్వా చాయుః శతాబ్దం దశదినసహితం శూద్రకో గ్నిం ప్రవిష్టః"

పైశ్లోకములోని చివరిరెండుపాదములలోను దానెంతకాలముజీవించెనో చెప్పినాఁడు.

కొంద ఱితఁ డెట్లు భావి యైన తనమృత్యువును జెప్పఁగలిగినాఁడు? అది యసందర్భము కాదా? కనుక, ఎవఁడో యీగ్రంథమును వ్రాసి యాతని ప్రతిష్ఠకొఱకయి ప్రస్తావనలో నతఁడు వ్రాసినట్లు చేర్చినాఁ డని యభిప్రాయపడిరి- కాని యట్లు వ్రాయుట విరుద్ధము గాదు. జ్యోతిష్కులద్వారా తనమృత్యువును దెలిసికొని వ్రాసి యుండవచ్చును. ఇప్పటికిని జ్యోతిష మనిన నెంత నమ్మకమో హిందువుల కందఱికిఁ దెలిసినవిషయమే.

ఇందలి నాయకుఁడు చారుదత్తుఁడు; ఇతఁడు చాలదరిద్రుఁడు, ధర్మపరుఁడును. వసంతసేన యనువేశ్యను బెండ్లియాడెను. ఈతనిదారిద్ర్యమును గవి చాల సారులు చక్కగ వర్ణించినాఁడు. వానిలో రెండుశ్లోకముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను:—

"దారిద్ర్యా త్పురుషస్య బాంధవజనో వాక్యే న సంతిష్ఠతే
సుస్నిగ్ధా విముఖీ భవంతి సుహృదః స్ఫారీభవం త్యాపదః
సత్త్వం హ్రాస ముపైతి శీలశశినః కాంతిః పరిమ్లాయతే
పాపం కర్మచ యఃపరై రపి కృతం త త్తస్య సంభావ్యతే"
"సత్యం నమే విభవనాశకృతా౽స్తి చింతా
భాగ్యక్రమేణ హి ధనాని భవన్తి యాన్తి
ఏతత్తు మాం దహతి నష్టధనాశ్రయస్య
య త్సౌహృదాదపి జనా శ్శిథిలీభవంతి"

శర్విలకునకు దొంగతనమం దున్న ప్రావీణ్యమును జక్కఁగఁజూపినాఁడు-

"దేశః కోను జలావసేకశిథిలః యస్మి న్నశబ్దో భవేత్
భిత్తీనాంచ నదర్శనాంతరగతః సంధిః కరాలో భవేత్
క్షారక్షీణతయా చ లోష్టకకృశం జీర్ణం క్వ హర్మ్యం భవేత్
కస్మిన్ స్త్రీజనదర్శనం చ న భవేత్ స్యాదర్థసిద్ధిశ్చ మే"

ఇంకను వర్షర్తువు మొదలగునవి బాగుగ వర్ణింపఁబడినవి. తత్తత్పాత్రములనుగూడ నాతఁడు చాల నుచితముగఁ బోషించినాఁడు. మూర్ఖుఁడగుశకారుని పాత్రము నెంతచక్కఁగఁ బోషించినాఁడో చూడుఁడు:—

"ఝుణఝుణమితి బహుభూషణశబ్దమిశ్రం కిం ద్రౌపదీవ పలాయసే రామభీతా
ఏష హరామి సహసేతి యథా హనూమాన్ విశ్వావసో ర్భగినీ మివతాం
సుభద్రామ్."

"శృణోమి మాల్యగంధం అంధకారపూరితయా పునర్నాసికయా నసువ్యక్త ముత్పశ్యామి భూషణశబ్దం"

"కథం సృగాలా ఉడ్డీయంతే వాయసా వ్రజంతి తద్యావ ద్వ్యాఘ్రాక్షిభ్యాం భక్ష్యతే ప్రేక్ష్యతే తావ దహం పలాయిష్యే"

ఈమృచ్ఛకటికమును గూర్చి యున్న యభిప్రాయభేదమును గొంతవఱకు వివర్శించుట యప్రస్తుతము కాఁజాలదు.

మహామహోపాధ్యాయ త. గణపతిశాస్త్రి గారి కొకప్పుడు కేరళదేశమందు, పది యొకసముదాయముగను మూఁడు విడిగను సుత్తముపదుమూఁడు రూపకములు దొరికినవి. అవన్నియు గ్రంథకర్తనామముతో శూన్యములై యున్నవి కాని శ్రీశాస్త్రిగారు కొన్ని హేత్వాభాసలచే వానిలో రెండుమూఁ

డింటిని భాసునివిగ నిశ్చయించిరి. వానితోఁ గూడ దొరకుటచే వానినిగూడ భాసునికే యంటఁగట్టిరి, కాని, యవి యన్నియుఁ గూడ వేడుకసమయములందుఁ జూపఁబడు చిన్నచిన్న కృతు లనియు, ఆయానాటకములనుండి తీయఁబడిన శ్లోకములచేతను, వాక్యములచేతను, భావములచేతను గూర్పఁబడిన వనియు వాని నామూలాగ్రముగఁ జదివినవారికిఁ దట్టక మానదు ఇప్పటికీకేరళదేశములో నట్టియాచార మెక్కుడుగ నున్న దఁట

ఇట్టి యాకృతులలోఁ జారుదత్త మను నాలుగంకములు గల కృతి యొకటి గలదు. అది మృచ్ఛకటికములోని మొదటి నాలుగంకములతో సరిపోవుచున్నది. ఒక్కయానుపూర్వియే గలశ్లోకములు వాక్యములు కూడ రెండింటిలోను సరిగ నున్నవి. చారుదత్తములో మాత్రము కొన్ని మృచ్ఛకటికములో నున్నశ్లోకములు విషయము మాత్రము కానరావు. మొత్తముమీఁద రెండింటికి నొకఁడే కర్త యనుట కేమియు సందేహము లేదు. ఇది చూచి శ్రీశాస్త్రిగారు భాసుఁడు వ్రాసిన చారుదత్తమును జూచి శూదకుఁడు దానినే యాఁతగాఁ గొని కొన్నివర్ణనలఁ బెంచి యిం కొకయాఱంకములు గల్పించినాఁడని నిరూపించిరి. "కీతు" మహాశయుఁడు కూడ శ్రీ శాస్త్రిగా రుపపాదించిన విషయమునే యనువదించినాఁడు. కాని బాగుగ మృచ్ఛకటికమును, చారుదత్తమును విమర్శించి చూచిన మహాశయుల కీవిషయము సత్యేతర మని తోఁపక మానదు. ఈ క్రింద నుదహరింపఁబడిన యుభయగ్రంథసందర్భములచేతను మృచ్ఛకటికములోని భాగమే చారుదత్త మనియు, చారుదత్తము నూఁతగాఁ గొని మృచ్ఛకటికము వ్రాయఁబడ లే దనియుఁ జారుదత్తము భాసునికృతిగాదనియు స్పష్టపడఁగలదు.

i భాసునికృతు లని శ్రీశాస్త్రిగారు ప్రకటించిన వాని కన్నింటికిని మొదట "నాంద్యంతే సూత్రధారః" అను తరువాత మంగళశ్లోకము వ్రాయఁబడియుండుటయుఁ జివర భరతవాక్యము వ్రాయఁబడి యుండుట యు లక్షణమైయున్నది. చారుదత్తము మాత్ర మట్లు లేదు. మొదలును, జివరయు లేకుండఁగ నున్నది. మంగళవాక్యము లేదు మధ్యగ; సమాప్తి పొందింపఁబడినటుల భరతవాక్యముకూడఁ జివర లేదు. దీనినిబట్టి చూడ దేనిలోనుండియో తీయఁబడిన యొకభాగ మని యూహ ప్రతివారికిని గలుగక మానదు. కనుక మృచ్ఛకటికలోనిభాగమే చారుదత్తము.

ii అన్నికృతులకుఁగూడఁ బ్రస్తావన చాలఁ జిన్నదిగ నుండుట కూడ నొకలక్షణము. చారుదత్తములో మాత్ర మట్లు గాక యితర మైన పం(డ్రెం)డు కృతులలో నున్న ప్రస్తావనకన్న రెట్టింపున్నది. ఇతరకృతుల ప్రస్తావనలకంటె నిందు వివిధవిషయములు గూడఁ బ్రస్తావింపఁబడినవి. ఈపం(డ్రెం)డుకృతులలోఁ గొన్నిటిలో, చారుదత్తమొదలి ప్రస్తావనలో నాల్గవవంతు కూడ లేదు. దీనిని బట్టి చూచినను భాసకృతులకన్న భిన్న మగుచున్నది. మృచ్ఛకటికములోని ప్రస్తావనయే గ్రంథకర్త్రనామాదులుతీసివేయఁబడి క్లుప్తపఱుపఁబడినట్లు తోఁచు చున్నది.

iii వామనుఁడు కావ్యాలంకారసూత్రవృత్తిలో

"శరచ్ఛంద్రాంశుగౌరేణ వాతావిద్ధేన భామిని
కాశపుష్పలవేనేదం సాశ్రుపాతం ముఖం కృతమ్".

ఈశ్లోకమును స్వప్నవాసవదత్తమునుండియు

"యోభర్తృపిండస్య కృతే నయుధ్యేత్"

ఈపాదమును ప్రతిజ్ఞాయౌగంధరాయణమునుండియు నుదాహరించుచు చారుదత్తము భాసునిదే యైనచో దానిలోని శ్లోకము నేయుదాహరింపక శూద్రకుని మృచ్ఛకటికములోనుండి యెత్తి యేలవ్రాయును.

"యాసాం బలి ర్భవతి మద్గృహదేహలీనాం
హంసైశ్చ సారసగణైశ్చ విలుప్తపూర్వః
తాస్వేవ పూర్వబలిరూఢయవాంకురాసు
బీజాంజలిః పతతి కీటముఖావలీఢః"

ఈశ్లోకము కొంతవఱకుఁ జారుదత్తమును గూడ ననుసరించుచున్నను శూద్రకునిదే యనవలయును. ఏలన:— వామనుఁడు మఱొకచోట:—

"ద్యూతంహినామ పురుషస్య అసింహాసనం రాజ్యం"

ఈవాక్యము నుదాహరించినాఁడు. ఇది మృచ్ఛకటికమందు మాత్రమే యున్నది. చారుదత్తమందుఁ గానరాదు, మఱియు వామనుఁడు—

"ఘటనాశ్లేషాః"; 4 సూత్రము 3 అధికరణం 2 అధ్యాయం.

ఈసూత్రమును వ్యాఖ్యానముచేయుచు

"శూద్రకాదిరచితేషు ప్రబంధేషు అస్య భూయాన్ ప్రపంచో దృశ్యతే"

అని యెక్కువగ శూద్రకునే స్తుతించియున్నాఁడు. కనుక వామనుఁడు

చారుదత్తము ప్రమాణముగాఁ గొని దానిలోని శ్లోకము నుదాహరింపఁబో వుటచే నాతనియాశయము చారుదత్తము మృచ్ఛకటికలోనుండి తీసి వ్రాయఁ బడినయదియే యని మన మూహింపవలయును. కనుక మృచ్ఛకటికమునుండి చారుదత్త మెత్తి వ్రాయఁబడె ననుట కేమియు సందేహము లేదు.

IV మఱియు మృచ్ఛకటికములో నున్న యన్నిభాగములును చారుదత్త మునఁ గానరావు. కాని చారుదత్తములో నుండి మృచ్ఛకటికములో లేనివిష యము లేమియును లేవు. దీనికిఁ గారణ మేమో విచారింతము. మృచ్ఛకటిక ములోని మొదటినాలుగంకములను వేడుకగా నుత్సవసమయములందుఁ జూపు టకుఁ దీయఁబడినవై యందలి ముందుకథాసందర్భమున కుపయోగించెడి విష యము లెక్కువగా నున్నవర్ణనశ్లోకములు, మొదలగునవి కూడ విడిచిపెట్టఁబ డినవి. అందు ముందుకథ కుపయోగించెడునట్టివియు, చారుదత్తమున లేనట్టివి యు విషయము లీక్రిందివి:—

i "రోహసేనవృత్తాంతము" ఈపాత్ర ముందంకములలో ముఖ్యముగ నుపయోగించునది.

ii "ఆర్యకవృత్తాంతము" ఇదియు ముం దుపయోగించెడిదే"

iii సంవాహకుఁడు శ్రమణకుఁడవగుదు నని వసంతసేనతోఁజెప్పి యట్లగుట-ఈశ్రమణకుఁడు శకారుఁడు వసంతసేనను జంపినప్పు డుపయోగించును.

ఇంకను గొన్నిముందుకథ కుపయోగింపక పోయినను దీసివేయఁబడినవి. క్లుప్తముగనుండుటకొఱకుఁ గొన్నిటి నిట నుదాహరించుచున్నాఁడను.

మాథురద్యూతకరదర్దురకాదిప్రవేశము వారిజూదము మొదలగునవి.

అంకములలో మృచ్ఛకటికములోకంటెఁ జారుదత్తములోఁ గొన్నిశ్లోక ములు తగ్గింపఁబడినట్లు చెప్పియుంటిమి. ఏయంకమున నెన్ని తగ్గింపఁబడిన వన మొదటి యంకములో 29, రెండవయంకములోఁ బూర్తిగను, మూఁడవయంక మున 11, నాల్గవయంకమున 26 విడిచిపెట్టఁబడినవి.

V మఱియుఁ జారుదత్తమునందలి యీచివరిభాగ మసంపూర్తిగ నెటు లున్నదో చూడుఁడు:—

గణికా:—ఏహి ఇమ మలంకరణం గృహీత్వా ఆర్యచారుదత్త మే వాభిసరి ష్యావః

చేటీ:—అజ్జుకే తథా! ఏతత్పున రభిసారికా సహాయభూతం దుర్దినమున్నమితం

గణికా:—మాఖలు వర్జయ
చేటీ:—ఏ త్వేత్వజ్జుకా(నిష్క్రాంతే)

చతుర్థోంకః అవసితం చారుదత్తం.

వసంతసేన చారుదత్తుని దగ్గఱకు వెళ్లుటకుఁ బ్రయాణమగుచున్నటుల ఆకాశము మేఘాచ్ఛాదితమయినటుల సూచింపఁబడినది. ఈవిషయము ముందు గ్రంథమున కెక్కుడు ప్రదర్శించి యున్నది. స్వతంత్రగ్రంథమే యైనచో నిట్లుండదు. చివర నిట్లుసంపూర్తిగ నుండి ముందుకథకు ద్యోతకముగ నుండుటచేతను మొదట మంగళవాక్యము లేకపోవుటచేతను చారుదత్తము మృచ్ఛకటికములోని భాగమనుట కేమియు సందేహము లేదు. చారుదత్త మింకను నున్నదనుటకుఁ గూడ వీలులేదు "అవసితం చారుదత్తం" అని చివర నున్నది.

vi ఈపదుమూఁడుకృతులలో నార్షప్రయోగములుండుకతన నివన్నియుఁ బాణినికన్న పూర్వము రచింపఁబడినవనియుఁ గొన్ని భాసుని వగుటచేత వానితో సమ మున్న వానినిగూడ భాసుఁడే రచించె నని చెప్పినవారి హేతువు లాభాసములే. ఏలన, వానిలోఁ బ్రయోగము లార్షములు కావు. అవి యన్నియు విమర్శించి చూచిన వ్యాకరణజ్ఞానము లేనివారిచే వ్రాయఁబడినట్లు తోఁచును. అట్లు వ్యాకరణజ్ఞానము లేకుండుటచేత వ్రాయఁబడిన తప్పులన్నియు నార్షప్రయోగము లైనచోఁ గాళిదాసాదులు కూడఁ బాణినికన్నఁ బ్రాచీనులు కావలసివత్తురు, తరువాత నట్టియార్షప్రయోగము కూడ నీచారుదత్తమున నొక్కటే యున్నది. వ్యాకరణజ్ఞానహీనులచేఁ గూర్పఁబడినను జాలవఱకు మృచ్ఛకటికము ననుసరించుటచేఁ దప్పు లెక్కువ లేకపోయినవి.

vii శైలికూడ రెండిటియందు సమముగనే యున్నది. కొంచెము భేదము మార్పుచేసిన వానియజ్ఞతచే మాత్రము కలిగియున్నను విశేషము లేదు.

ప్రాకృతమునుబట్టి చూచినను దేలుటలేదు. ప్రాకృతము దెలిసినపండితులు ప్రాచీనమైన దని కొందఱు నవీనమైన దని కొందఱు ననేకవిధములుగఁ జెప్పుచున్నారు, గాన, ప్రాకృత మీవిషయమున నంత యుపయోగింపదు.

viii మొదటియంకమందలి చెప్పఁబడిన యీ-

"పాపంకర్మచ యత్పరైరపి కృతం తత్తస్య సంభావ్యతే".

అనువాక్యముచే ముందు చారుదత్తునకు రాఁబోవు వసంతసేనావధవిషయకమయిన యుపవాదము సూచింపఁబడుచున్నది. కనుక, చారుదత్తము

పూర్తియయిన గ్రంథ మనుటకు వీలులేదు. ఇది తప్పక మృచ్ఛకటికనుండి యుద్ధృతమయిన దనుటసాహసము కాఁజాలదు. శ్రీశాస్త్రిగారి కెట్లు స్వతంత్ర గ్రంథమని తట్టెనో తెలియకున్నది.

ఈమహాకవికాలమును సరిగఁ దెలిసికొనుటకుఁ దగిన ప్రమాణములు కానరావు. ఐనను లభించినవానిలోఁ గొంతవఱకు విమర్శింతము.

తొమ్మిదవ శతాబ్దపువాఁ డైనకులశేఖరవర్మ తన తపతీసంవరణములో

"శూద్రక కాళిదాస హర్షదండి పభృతీనామ్" అని చెప్పియున్నాఁడు. కనుక శూద్రకుఁడు కాళిదాసుకన్న పూర్వుఁడని తోఁచుచున్నది. ప్రాకృతము, సంస్కృతము కూడ శూద్రకునిది కాళిదాసుకన్న ప్రాచీనుఁ డని సూచించుచున్నవి.

మఱియు, కాళిదాసు 4 వ శతాబ్దపు వాఁడు-అతఁడు తనమాలవికాగ్నిమిత్రమందు సౌమిల్లకుని గీర్తించినాఁడు. కనుక సౌమిల్లకుఁడు 3 వ శతాబ్దపువాఁ డయి యుండవచ్చును. అట్టి సౌమిల్లకుఁడు శూద్రకుని గీ ర్తించియున్నాఁడు. కావున శూద్రకుఁడు 2 వ శతాబ్దమునకు జీవించియుండవచ్చును.

ఈశూద్రకుఁడు, కాదంబరిలోను, దశకుమారచరితములోను కథాపురుషుఁడుగ వర్ణింపఁబడియున్నాఁడు-మఱియు నీతఁడు నూటేఁడ్లమీఁదఁ బదిదినములు జీవించి నట్లు తన ప్రస్తావనలోఁ జెప్పినాఁడు. ఇ వన్నియుఁ జూ కీతు మహాశయుఁడు-శూద్రకుఁ డనువాఁడు లేఁడు, ఇతఁడు కథాపురుషుఁడు, ఎవరో గ్రంథమును వ్రాసి యీపేరు నటఁ జేర్చినా రని యభిప్రాయపడినాఁడు.

కాని యీవిషయ మెంతయు విశ్వసనీయము కాదు. ఏలన, వామనుఁడు "ఘటనాశ్లేషః" అనుసూత్రమునకు వృత్తి వ్రాయుచు శ్లేషలో శూద్రకుఁడు నిపుణుఁ డని చెప్పినాఁడు.

మఱియు 9వ శతాబ్దపు కులశేఖరవర్మకూడ శూద్రకుని గవిగాఁ గీర్తించినాఁడు.

"శూద్రకకాళిదాసహర్షదండిప్రభృతీనామ్" అని, కనుక కథాపురుషుఁడు గాని వాస్తవిక మైన శూద్రకుఁడు లేఁ డనిన కీతుమహాశయునిమాట యెంతయు విశ్వసనీయము కాఁజాలదు.

# అనర్ఘరాఘవము.

— చేబోలు సుబ్రహ్మణ్యశర్మగారు-కొవ్వూరు. —

ఈ గ్రంథము రచించినవాఁడు భట్టమురారి యను కవితల్లజుఁడు. ఇందలి కథ రామాయణకథ. ఇది దృశ్యకావ్యము. రాముని బాల్యము మొదలు పట్టాభిషేకాన్తమువఱకు నిం దితివృత్త మున్నది. ఈతనితండ్రి శ్రీ భట్టవర్ధనుఁడు. తల్లి తన్తుమతీదేవి. గోత్రము మౌద్గల్యాయనగోత్రము. ఇతనికి బాలవాల్మీకి యనుబిరుదు గలదు.

గ్రంథాన్తమందు "భట్టమురారేః కృతిష్వనర్ఘరాఘవం నామ నాటకం సమాప్తం" అనుటవలన మురారిచే నితర గ్రంథములు కొన్ని చేయఁబడిన వని తెలియుచున్నది. అవి యేవియో కానరాకున్నవి.

కాని మీమాంసశాస్త్రములో భాట్టప్రాభాకరమతములకంటె భిన్నమగుమతమును మురారి స్థాపనచేసె నను లోకోక్తినిబట్టి చూడ మీమాంసశాస్త్రములో నొక గ్రంథమును జేసె నని యూహింప వీలగు.

మఱియు నాలంకారికులు "వైదర్భి, గౌడీ" అని రెండురీతులనే యొప్పి రని యు లోకోక్తిగలదు. ఇతఁడు "పాంచాలీ" రీతిని స్థాపనచేసె నను లోకోక్తియుం గలదు. వీనిని బరీక్షింపఁ నితఁడు, అలంకారశాస్త్రమున నొక గ్రంథము రచించినట్లు తోఁచుచున్నది.

ఈతనికవనమం దుండు కొన్నిచమత్కారములను మాత్రము వివరించెదను. ఈతనిదృశ్యకావ్యమును బండితులు గొప్పగ నెన్నుదురు. ఎందు కనిన శాస్త్రములను గొన్నిఁటిని జదివినవారికే కాని యితరుల కన్వయించుట కష్టముకాన-వ్యాకరణాదిశాస్త్రముల మర్యాదలతోఁ గవనముఁ జెప్పెనుగాన— ఈకవితల్లజుఁ డనేకశాస్త్రములయందుఁ బండితుఁడని చెప్పవచ్చును.

పరిహాసభావ:—

ప్రథమాంకము । విశ్వామిత్రః సోత్ప్రాసమ్ ।

"కిం చాజస్రమఖార్పితేన హవిషా సంఫుల్లమాంసోల్లస
త్సర్వాంగీణవలీవిలుప్తనయనవ్యూహాః కథంవర్తతే"

ఇందలిభావము నవ్వును బుట్టించుచున్నది- కావునఁ బరిహాసభావ యనవచ్చును.

చతు- అం. 14 శ్లో. తరువాతగద్యలో "అహో స్థవిరభల్లూకస్య పరిహాసకుశలతా" అని కలదు. ఇదియుఁ బరిహాసభాషయనఁదగును.

ద్వి. అం. 7 శ్లో. ఉక్షారథో భూషణమస్థిమాలా భస్మాంగరాగో గజచర్మవాసః।
ఏకాలయస్థేపి ధనాధినాథే సఖ్యా దశేయం త్రిపురాన్తకస్య.

ఇట్టియీశ్వరున కిట్టిదశవచ్చిన దనిచెప్పుటచే నిక్కడఁ గొంత యాశ్చర్యము కలుగుచున్నది. ఇది వేళాకోళముగా మాటలాడుటచేఁ బరిహాసభాషయనవచ్చును.

ద్వి. అం. 14 శ్లో. తత్త్రాద్య కృత్స్నపూలకోపనయనక్లేశా చ్చిరద్వేషిభి
ర్మేధ్యావత్సతరీ విహాస్య వటుభిః సోల్లుంఠ మాలభ్యతే.

ఇక్కడ విద్యార్థులభావము కవిచేఁ జక్కఁగ వర్ణింపఁబడుటచేఁ బరిహాసభాషయనఁదగియున్నది. ఇటువంటివి చాలఁగలవు. కొన్ని మాదిరికిఁజూపితిని.

శాస్త్రపరిభాషలు:—

చతు. అం. 42 శ్లో. క్రిందున. క్రియాసమభిహారస్య.
చతు. అం. 44 శ్లో. ఆకృతిగణః. సాధకతమం.
తృ. అం. 57 శ్లో. క్రిందున విద్యావృద్ధసయోగాద్బహిరంగాని.
చతు. అం. 11 శ్లో. క్రిందున-బ్రాహ్మణాదేశోపి స్థానివద్భావేన క్షత్త్రధర్మం"

ఈ పైనాల్గుచోట్ల వ్యాకరణశాస్త్రపరిభాషలు. ఇట్టివి చాలఁ గలవు. దిఙ్మాత్రము చూపఁబడినవి.

ద్వి. అం 62 శ్లో. యదధికిరణం_మీమాంస.
ద్వి. అం. 8 శ్లో. క్రిందిగద్య. చతురక్షరోపిరాక్షసశిక్షాసిద్ధమంత్రః—
మంత్రశాస్త్రపరిభాష.

ఇట్లనేకశాస్త్రపరిభాషలను వాడుటగలదు. విస్తరభీతిచే విరమింతును.

ఇతరకవిచ్ఛాయలు:—

| | |
|---|---|
| క ట | శ్లో॥ ఔత్సుక్యమాత్ర మవసాదయతి ప్రతిష్ఠా |
| నిత్యం చ వహనక్లమః | క్లిశ్నాతి లబ్ధపరిపాలనవృత్తి రేవ |
| శ్రవణానా మలంకారః | నాతిశ్రమాపనయనాయ నచశ్రమాయ రాజ్యంస్వ |
| కపోలస్యతుకుండలమ్. | హస్తధృతదండమివాతపత్రమ్. శాకుంతలము. |

అనర్ఘరాఘవము

ఉత్తరచరితలో వసిష్ఠుఁ డెట్లష్టావక్రునిచేత రామునకు సందేశ మంపెనో

యట్లే యనర్ఘరాఘవములోను వసిష్ఠుఁడు వామదేవునిచే దశరథునకు సందేశ మంపెను.

| | |
|---|---|
| అనర్ఘరాఘవము. శ్చాయంకులస్య తే గృహాత్ప్రతినివర్తన్తే పూర్ణకామాయదర్థినః॥ | శ్లో॥ జామాతృయజ్ఞేన వయం నిరుద్ధాః త్వం బాలవవాసి నవంచ రాజ్యం। యుక్తః ప్రజానా మనురంజనే స్యాః స్యస్మాద్యశో యత్పరమం ధనంవః. ఉత్తర- |
| వాచమేషా మృషీణాంహి శాస్త్రమేవానువర్తతే అనర్ఘరాఘవము. | శ్లో॥ ఋషీణాం పునరాద్యానాంవాచ మర్థోనుధావతే. ఉతరరామ. |
| | ప్ర. అం. 39 శ్లో॥ క్రిందుగద్య. |
| తృ. అం. 16 శ్లో॥ నిస్త్రా...మమార్థవాదః | రామః- అర్థవాదపక్షః. |
| తృ. అం 14 శ్లో॥ మే విహాస్యవటుభిస్సోల్లుంఠమాలభ్యతే. | చతు. అం. 1 వ శ్లో॥ క్రిందుగద్య. "తేనహ్యాగచ్ఛన్త్యైవసావరాకీకపిలాబలాత్కృత్యమడమడాయితా" |

ఇట్లనేకమైన యితరకవిచ్ఛాయలు గలవు. కొన్నిమాత్రము చూపఁబడినవి.

మురారి మూఁడవత్రోవను ద్రొక్కెను:—

ఈలోకోక్తినవేకవిధములుగ సాధింపవచ్చును. కొన్నివిధములు చూపుచున్నాఁడను.

(1) భాష- లోకములోఁ గావ్యభాష, నాటకభాష, యని రెండుతెఱంగులుగఁ గన్పట్టుచున్నది. నైషధము, ఉత్తరరామచరితము, ఈరెంటియందు భాషలను గావ్యనాటకభాష లని వాడుదురు. నాటకభాష యన దృశ్యమునకు యోగ్యమైన దనియుఁ గావ్యభాష యన శ్రవ్యమునకు యోగ్యమైన దనియుఁ జెప్పఁబడుచున్నది. ఈయనర్ఘరాఘవమునం దున్నభాష పైఁజెప్పిన రెండువిధములుగ నున్నది. దృశ్యకావ్య మని పేరిడి శ్రవ్యభాషను, దృశ్యభాషను, కలిపి చెప్పుటచే నితనియనర్ఘరాఘవమునకు మఱొక పేరు పెట్టవలసియుండుటచే నీలోకోక్తి పుట్టె నని యందురు.

(2) మీమాంసశాస్త్రములో భాట్టప్రాభాకరమతములు రెండు గలవని యు వానికంటె భిన్న మగుమతమును మురారి స్థాపన చేసె ననియుఁ గను కనే యీలోకోక్తి పుట్టె ననియుం జెప్పుదురు.

(3) లోకమున "వైదర్భి, గౌడి" యను నీరెండురీతులే యున్న వని యు, మురారికవి"పాంచాలి"యను మఱొకరీతి నొప్పె ననియుఁ గాన నీలోకోక్తి పుట్టె ననియుఁ జెప్పుదురు.

(4) తృతీయఃపంథ-యను వాని యర్థము వెఱత్రోవ త్రొక్కుట యని చెప్ప వలసియున్న దని తోఁచుచున్నది.

"నిష్ప్రత్యూహ ముపాస్మహే భగవతః కౌమోదకీలక్ష్మణః
కోకప్రీతిచకోరపారణపటుజ్యోతిష్మతీలోచనే"
ఇచ్చటఁ గవి గ్రంథాదిని నేత్రములకు నమస్కారము చేసెను.

కవులు సాధారణముగఁ బాదములకు, వ్యక్తికి నమస్కరించుట చూచు చుంటిమి. కాని, యిట్లు నేత్రనమస్కారము చేయుటచేఁ గవి స్వతంత్రతతోఁ బెఱత్రోవను ద్రొక్కెను గాన నీలోకోక్తి పుట్టె నన వచ్చును. మఱియు "జాతాః లూతాతన్తువితానవర్తుల మితో బింబం దధచ్చంద్రమాః (ద్వి 2 శ్లో॥) ఇక్కడ సాలిగూడుతోఁ బోల్చి చంద్రబింబమును జెప్పుటచే నిదికూడఁ బెఱత్రోవయే.

"అయ మపి ఖరయోష్ఠిత్కర్ణకాషాయమీమత్" (ద్వి-44) ఇక్కడ నాఁడుగాడిద చెవివలె ననిచెప్పుటయుఁ బెఱత్రోవ త్రొక్కుటయే.

రఘురాముఁడు:—

"త్రయస్త్రింశత్కోటిత్రిదశమయమూర్తే ర్భగవత
స్సహస్రాంశో ర్వంశే జయతి జగదీశో దశరథః" (తృ. 2)
ఈశ్లోకమువలనను,
యే చత్వారో దినకరకులక్షత్రసంతానమల్లీ
మాలామ్లానస్తబకమధుపా జజ్ఞిరే రాజపుత్రాః" (తృ. 21)

దీనిచేతను మహాకులీనత, (ఆభిజాత్యము) అను మహానాయకగుణము కన్పించుచున్నది.

రామః- శ్రుత్వా సహర్షసంభ్రమ ముత్థాయ సవినయ మంజలిం బద్ధ్వా జగద్గురో గాధినందన—

శ్లో॥ దశరథకులే సంభూతం మా మవాప్య ధనుర్ధరం
దినకరకులాస్కందీ కోయం కళంకనవాంకురః
ఇతి హి వనితా మేనాం హన్తుం మనోవిచికిత్సతే

యదధికరణాం ధర్మస్థేయం తదైవ వచాంసి వః'' ఇతి ప్రతిపత్త్యా మాఖ్యాత్త తపోధనాః!" అని రాముఁ డనియెను. ఇట్టి రామవచనములంబట్టి చూచిన రాముని యొక్క ధర్మకార్యాలోచన స్పష్ట మగుచున్నది. స్త్రీవధయం దిష్టము లేనివానిగఁ జూపించుటచే ధర్మకాష్ఠ, దయ మొదలగునవి స్పష్టమగుచున్నవి. మఱియు గురువగు విశ్వామిత్రునియందు భక్తి వ్యక్తము.

చతు. అం. 46 శ్లో॥ క్రిందిగద్య. ''రామః-సవై లక్ష్మ స్మితం ప్రసీద భగవన్ సయేవాయం యావనా దర్వాచీనే నిరపరాధమఘురవయసి వర్త మానో యాని కాని చి దక్షరాణి ప్రలపతి''- ఇట్లనుటచేఁ బరశు రామునియందు భక్తి, లక్ష్మణునితప్పు తెలిసికొనఁగల శక్తి, రాముని యందుఁ గన్పట్టుచున్నవి. లోకములోఁ దమపిల్లలు వీధులలో నల్ల రిచేసినప్పుడు తాము వెళ్ళి మాపిల్లలు తెలియక చేసిరి కోపపడ కుండీ యన్నట్లు రామునిచే ముద్దుగఁ బల్కించెను.

చతు. అం. 74 వ శ్లో॥ క్రిందిగద్య. రామః- సరోషం నేపథ్యాభిముఖః- ఆః కో యం వత్స! అద్యతన స్తే దుర్వినయప్రరోహః య గ్గురూ నపి క్షేక్త్రీకరోషి'' అని రాముఁ డనుచు. దీనిచే రాముఁడు గురుతిర స్కారము నొప్పనివాఁ డని స్పష్టము. పున ర్నేపథ్యే, ఆర్య తూష్ణీ మస్మి క్షమస్వ, జామదగ్న్య నియన్త్రితోహ మార్యేణ—లక్ష్మణుఁ డిట్లనుటచే రాముని గొప్ప కన్పించుచున్నది.

పం. అం. 32. శ్లో॥గద్య. లక్ష్మ—సాధుదర్శినీ బుద్ధి రార్యస్య—ఇట్లనుటచే రాముని బుద్ధికుశలత కన్పించుచున్నది.

ష. అం. 5 శ్లో॥ గద్య. మాల్య—సహస్రం, కిముచ్యతే యావద్దివ్య భావాహి గుణో విజగీషూణా ముదాత్తతా విశేషేణ పునరయం రామభద్రః॥ ఇట్లనుటచే రామునిగుణవిశేషములు సువ్యక్తములు.

స. అ. 10 శ్లో॥ రా- దేవి, త్వన్నే నిశాచరపతౌ రవిబింబవర్తీ తాతా మయా దశరథస్త్వయమేవదృష్టః! తస్యాజ్ఞయా రఘుపురీం ప్రహితః పురైవ రాజ్యాభిషేకవిధిసంభృతయే హనూమాన్॥ ఇట్లనుట చే రాముఁడు

కేవలము దశరథాజ్ఞానుసారిగనే కన్పట్టుచున్నాఁడు, కాని, స్వార్థపరుఁడుగ నున్నాఁడని చెప్పవీలులేదు.

స. అం. 122 శ్లో॥ గద్య. సుగ్రీవవిభీషణౌ సానురాగం, అత్ర భగవతః పార్వతీజీవితేశ్వరస్య ధను రన్తేవాసినా వజగవభార్గవా భవతో భంజత స్సహపాంశుక్రీడాదీర్ఘసఖీయంవీరలక్ష్మ్యాః॥ అని వారిద్ద అనిన తరువాత—

రామః—సలజ్జస్మితం—అన్యతోదర్శయన్, అని రాముని చేతఁ గవి పల్కించెను. ఇట్లు పల్కించుటచే ననాత్మశ్లాఘుపరాయణుఁడుగఁ గన్పించుచున్నాఁడు రాముఁడు. (సశే)

# త్రిశిరగిరీశశతకము.

సు. మురుగేశన్ పిళ్ళెగారు-వడగరై

## కందపద్యములు.

శ్రీమాతృభూత శంకర, కామిత ఫల దోర్ధ్వకామ కామవిరామా
సోమార్ధమౌళి సోమా, శ్రీమహితామృతనిధాన త్రిశిరగిరీశా! ౧
భూమీరథ చాపీకృత, హేమాద్రి సుగంధకుంతలేశ తవాంఘ్రిన్
నేమమునఁ గొలిచి నీపయి, దీమసమునఁ గృతియొనర్తుఁ ద్రిశిరగిరీశా! ౨
గంగాధర! కొలుతున్ మా, తంగాస్యున్ వీరభద్రు ధరణీధరపు
త్రిం గార్తికేయు శైలా, దిం గామితఫలము వడయఁ ద్రిశిరగిరీశా! ౩
సురుచిర సుకుమారామృత, సరసోక్తిమ కవితరచన చతురతకును మ
ద్గురువీరరాఘవార్యునిఁ, దిరముగ నేఁ దెలతు భక్తిఁ ద్రిశిరగిరీశా! ౪
నవరస భావాలంకృత, కవితా ధుర్యుల కటాక్ష కారుణ్యమ మత్
కవితకు భావుక మని ప్రతి, దివసంబును దలఁతు భక్తిఁ ద్రిశిరగిరీశా! ౫
పరమేశ్వర పదచింతా, పరుఁడనుఁ గారాళవంశ భవుఁడను ద్రిశిరః
పురిమురుగేశుఁడ ముక్తికిఁ, దెరువుగ శతకం బొనర్తుఁ ద్రిశిరగిరీశా! ౬
మురహరపద్మజ ముఖ్యా, మర బృందము నీదుపాద మహిమలఁబొగడన్
దరతర లాడుదు రన న, స్థిరమతి నాకెంత తెగువ త్రిశిరగిరీశా! ౭
వరశబ్దాలంకార చ, తురకల్పనలకు నలభ్యదూర మహాద్గో
చరమగు నీమహిమల న, స్థిరమతి నెటు వొగడనేర్తుఁ ద్రిశిరగిరీశా! ౮
తనయుల శైశవభాషల, జననీ జనకులు వినంగ సంతస మెదలం
దనియుదురటు నానొడువులఁ, ద్రినయన మదిఁ దనిసిమనువు త్రిశిరగిరీశా!
వందితజన మందారా, కందాధిపసేవ్య గరళకంధర వృషభ
స్యందన సుమనసబృందేం, దిందిర సుందరపదాబ్జ త్రిశిరగిరీశా! ౧౦
కావేరీ రోధస్థిత, గ్రావవిహారణ సుగంధికబరీకుచయు
గ్మావేశితహృత్పంకజ, శ్రీవాక్సంపత్ప్రదాన త్రిశిరగిరీశా! ౧౧
దురితాటోప విదారణ, పరతాప నివారణచణ భంజితశమనా
కరుణారస భరలోచన, ద్విరదానన సేవ్యమాన త్రిశిరగిరీశా! ౧౨

నీపదములఁ జింతించుచు, నీపంచాక్షర జపంబు నిర్మలమతి నే
నేపొద్దుఁ జేయు భాగ్యము, శ్రీపతినుత కరుణ నిమ్ము త్రిశిరగిరీశా! ౧౩
పావనభర్గాక్షంబుల, ధావళ్యవిభూతి మేనఁ దాల్చుచు మదిని౯
భావించి పూజ సేసెడి, ధీవర మీవలెను నాకుఁ ద్రిశిరగిరీశా! ౧౪
శరధీకృతశరధీ వృష,భరథే ధృతదంత కరధి ప్రశమిత చక్రాం
గరథీ దాశరథి వినుత, స్థిరధీప్రద మాతృభూత త్రిశిరగిరీశా! ౧౫
శివభక్తులఁ దలిదండ్రుల, శివయోగుల యతుల గురులఁ జేకొని భక్తి౯
దవిలి పదపూజసేయక, దివిరెదు నాకెద్ది కెలకు త్రిశిరగిరీశా! ౧౬
వినయవివేకము శౌర్యము, కనకము గేహములు జీవకారుణ్యము వా
హన మంగన యశ మలవడుఁ, ద్రినయన నీభూరికృపను ద్రిశిరగిరీశా! ౧౭
తనుకరణ భువనభోగము, లను జీవుల కొసఁగి వారి లయకర్మముల౯
దనివోవ భుజించిన ము, క్తినిఁ జేర్చెడి పతియునీవ త్రిశిరగిరీశా! ౧౮
పతికన్యమైన జీవము, పతి పశువను భేదముడిగి పతితోఁదాను౯
మతిఁ గలసియున్న తత్వ, స్థితిఁ బాశమువీడి ముక్తి త్రిశిరగిరీశా! ౧౯
కరుహాకర కంకపత్రా, కరుహాధిప కరుహామిత్ర కరుహ త్రినేత్రా
కరుహాక్షిసహితగాత్రా, ద్విరసననాథాంక శ్రోత్ర త్రిశిరగిరీశా! ౨౦
డెందము నింద్రియ వశగతి, నందించుచు నాత్మబోధ మరయక గాలం
బిందనుకఁ జెరిపితి న్నను, గ్రిందికిఁ ద్రోయక న మనుపు త్రిశిరగిరీశా! ౨౧
భావజుబారికి లోఁబడి, కావరమున నన్యసతులఁ గామించిన నే
నేవగగతిఁ జెందుదు నిఁకఁ, దీవరమునఁ బ్రోవుమయ్య త్రిశిరగిరీశా! ౨౨
కోపంబునఁ గామంబునఁ, బాపంబుల మిగులఁ జేసి పతితుఁడయిన నా
పాపధ్వాంతము బోధపు, దీపంబిడి యపనయింపు త్రిశిరగిరీశా! ౨౩
కావేరితోయ మాడకఁ, గావేరితోయమాడి గాసిల్లితి నో
దేవా నామనవిని విని, దేవానాంప్రియుని మనుపు త్రిశిరగిరీశా! ౨౪
నాగారిదురితమోచన, నాగారితురంగవరద నాకధునీకా
నాగారిచర్మధరణా, శ్రీగౌరీహృన్నివాస త్రిశిరగిరీశా! ౨౫
శివజంగములకు మృణ్మయ, నవపాత్రము లొసఁగి జవ్వనముగెల్చిన ప్రా
భవు నీలకంఠ కుమ్మరిఁ, దివురఁగ నినుఁ బెనచినట్టి త్రిశిరగిరీశా! ౨౬
గందపుఁజెక్కయు దొరకమి, కం దనకేల్రాచి నీదు కృపచే మధుర౯
బొంది భువినేలు మూర్తినిఁ, గ్రిందొందకఁ బ్రోచినట్టి త్రిశిరగిరీశా! ౨౭

పాలుంచిన వెసలం దన, కాలం ద్రోయించు తం ష కాల్దునిమిన యా
లీలంగని చండిం గృపఁ, దేలించుచుఁ బదమొసఁగిన త్రిశిరగిరీశా! ౨౮
తరణిక్షపణకు లిడఁగాఁ, దరణిగ నా చిట్టునె క్కి తరసింపఁడె నీ
కరుణన్ వాగీశుఁడు మదిఁ, దిరపడు శివభక్తి కలిమిఁ ద్రిశిరగిరీశా! ౨౯
రాజీవాప్తాంబక శివ, రాజీవాంబకవిదార రాజకపర్ది
రాజీవాంచితకర నీ, తేజము నాకింత చూపు త్రిశిరగిరీశా! ౩౦
కావేరి తోయ ముండఁగ, బావిని నీరాడువారి పగిదిని నిన్నున్
సేవింపక పెఱ దయ్యము, దేవునిగాఁ గొలువనీకు త్రిశిరగిరీశా! ౩౧
హరభక్తులు నేనున్ మది, గరఁగుటయుం ద్రాక్షతేవ గలవారము గిం
కరులు శివ చింతయందును, దెఱవలకూటమిని నేను ద్రిశిరగిరీశా! ౩౨
తనువుల కడరెడి యడజడి, పనుపడ నొకకోటియైన బ్రహ్మాజ్ఞానుల్
వనరరు నెలజంకయు మే, దిని పులికిని వెరవఁ గలదె త్రిశిరగిరీశా! ౩౩
ఏను న్మతిమంతులుఁ దుల, మైనన్ వందురుటయందు నన్యులు దొసఁగుల్
పూనిన నార్యులు నేనున్, దీనత నాకెగ్గు లడరఁ ద్రిశిరగిరీశా! ౩౪
సారంగాజినవసనా, సారంగజ్యావలేపశమన వృషాంకా
సారంగాంకవతంసా, శ్రీరంగాధీశ వరద త్రిశిరగిరీశా! ౩౫
కాలముఁగ ర్మముఁ దలఁగిన, మూలమ చెవ్వందిలింగ మోహాధ్వాంతో
న్మూలమ మద్దుష్కృతకు, త్రిశూలమహాభేదకులిశ త్రిశిరగిరీశా! ౩౬
విశదంబుగ సవనంబునఁ, ద్రిశిరంబుల వేల్చివేఁడఁ దృప్తిగఁ బురికిన్
ద్రిశిరఃపురమను పేరిడి, త్రిశిరాసురవాంఛ లొసఁగు త్రిశిరగిరీశా!
నినుఁగాక కదల దణువును, నను జెట్లన నీవుయోగ మందఁగ లోకం
బును భోగమందలేక మ, దిని యోగముఁగొనదె మహినిఁ ద్రిశిరగిరీశా!
మనుజులు దనకర్మచయం, బును మంత్రము పదము వర్ణ భువనము దత్వం
బును కలలున్ శకియు మ్రం, దినఁ బొందెదు పతియునీవ త్రిశిరగిరీశా!
శూలిన్ విధుమాలి దయా, శాలిన్ రక్షిత బుధాలి సరసిజబాణో
న్మూలిం గపాలి వృజినము, ప్రీలన్ నినుదెలతునోలిఁ ద్రిశిరగిరీశా! ౪౦
ఫలమున రసమున్ బాటలొ, నలికిడిగతి సర్వజీవ వ్యాపినిఁ బ్రాఁబ
ల్కులు నిన్ను నేకమనకం, దెలుపవె యద్వైతమనుచుఁ ద్రిశిరగిరీశా!

దేహపు పేరిట నేమను, దేహిగ ననువంది నీవు దేహియుఁ గావా
దేహి నినుఁ బోలదైనం, దేహియు వేఱగుదుమీవు త్రిశిరగిరీశా ! ౪౨
కలుగుం బరమున మిను గరు, వలి కిత్తియు నీరు మన్ను బైరుం గుడుపం
దలిపంచకోశధాతువుఁ, దెలివొందు నొకంట నొకటి త్రిశిరగిరీశా! ౪౩
తనవలన నుద్భవించిన, యనిలానలవారిపృథ్వి నాకసమువిధం
బునఁ గోశములం బ్రహ్మము, ద్రినయన లో వెలిగవిజ్ఞఁ ద్రిశిరగిరీశా! ౪౪
రంగత్తరంగమాలిని,షంగ శిరోన్యస్తగంగ స్మరమదభంగా
రంగాయితగిరిశృంగా, శృంగారకురంగహస్త త్రిశిరగిరీశా ! ౪౫
ఘటజలమున రవిబింబం, బెటు చలియించినను రవికి నెట్లది లేదో
అటువలెఁ బ్రపంచచలనము, దిటముగ శేనట్టిపతివి త్రిశిరగిరీశా ! ౪౬
తనడెందెములోఁ దలఁచిన, పనులే ప్రారబ్ధముగను బాకంబగువా
విని ననుభవింపవలెను మ, దిని నిన్నే తలఁప ముక్తి త్రిశిరగిరీశా ! ౪౭
పాయని యాణవములముఁ, మాయాకర్మములచేత మాన్పి కరుణచే
నాయిత పశువుల నీలో, శ్రేయముగాఁ జేర్చుపతివి త్రిశిరగిరీశా ! ౪౮
పరివర్తి* వార మయనము, నరయ † దయా, కల, కరాంశ మందున‡ బహ్మి
శరదము, మృగరవి నొసఁగితిఁ, దిరముగ నీ శతకమీకు త్రిశిరగిరీశా !౪౯
నారదనీరదదారద, శారద ఘనసారహారశారదశశి సి
హారదరహీరహారిణ, శ్రీరాజితకాంతిదేహ త్రిశిరగిరీశా ! ౫౦

—। అచ్చతెనుఁగు ।—

వలమూరిదాలుపు నలువయు, వెలిగారువజీరు లిబ్బిప్రేపుఁడు లెలమిం
గొలువ మునిమాపు వుత్తడి, దెలిడాలోలగము గునియుఁ ద్రిశిరగిరీశా!
జగము ధొర యనక నిన్నుం, దెగడుచుఁ బెఱ బాసవాల తెగఁగొని దక్కుం
డెగపునఁ జేసిన వెలిమిఁ, దెగటార్చిన మితిగొంగ త్రిశిరగిరీశా ! ౫౨
నలువతలపునుక చేతం, బొలయం బి తలిగ వెదురుపొలము నిరాబా
రుల గరితలఁ బరికించిన, తెలిడాల్ దిరిపరిపిగావె త్రిశిరగిరీశా ! ౫౩
గట్టెత్తు పొలసుదిండిని, బొట్టనవ్రేలదుమ జాలిఁబొగడఁగఁ గొర్కుల్
వెట్టుచు మన్నించిననీ, దిట్టతనముఁ బొగడఁదరమె త్రిశిరగిరీశా ! ౫౪

*పరివర్తి 24. †అయనాంశము భాగలు 21, కలలు 31, వికలలు 18, ‡అనలసంవత్సరము, తెనెల.

ఉక్కరి రక్కసు లిక్కన, ముక్కోటికలు మ్రొక్క నొక్క సుగిఁ గ్రక్కన వి
ల్లెక్కిడి మిక్కిలికంటం, గ్రిక్కిరియంగాల్చి నిక్కఁ త్రిశిరగిరీశా ! ౫౫

తిగతలల నల్లద్రావుఁడు, జగముల దోర నీవయరుచు సరగునఁజూడన్
తిగతలలవ్రేసి వేల్చిన, తెగువం గని కోర్కులిడిన త్రిశిరగిరీశా ! ౫౬

ననుపున నీవే ననుచై, కొనవలయుంగాక నిన్నుఁ గూడుటకే నో
క్కనిగరపుచెయిద మొనరుపఁ, *తెరుగానని కసటుఁడైతిఁ త్రిశిరగిరీశా !

పెఱతెఱవల నేలగలపయి, నెఱతమకముపూని రవళి నిక్కుచు నిన్నున్
గుఱిగొని తలఁపని నన్నే, తెఱఁగున మన్నింపఁ గలవా త్రిశిరగిరీశా! ౫౮

నిను గా కన్నియునోరులే, దని తలఁచుచు డింగరీంద్రు లందిరి నిన్నే
ననదుర్గ జగమెనేటని, దినుచుం గూర్చొనుచుఁజెడితిఁ త్రిశిరగిరీశా ! ౫౯

కొందలిరు టజ్జ డొంపెము, నొంది రహిం గందళించి యూఱట నెందుం
జెందకఁ గొందలమందకఁ, గ్రిందొందకఁ దలఁపఁజేయు త్రిశిరగిరీశా! ౬౦

వారువ మెక్కుకుమెకముం, గారవముం గీము నాలు గలిమియు నిసువుల్
దారికిఁ దోడగునో తుదఁ, దేరుటకీ యజ్జుగాక త్రిశిరగిరీశా ! ౬౧

పెఱవారికెగ్గొనర్చుచుఁ, గొఱ మాటలఁ దూలనాడి కొఱగామికి లో
వెఱవక పీఁగెడు నాకున్, దెఱకువ మెత్తెఱఁగు గలుగుఁ త్రిశిరగిరీశా !

ఆలుం బైకము బిడ్డలె, మేలంచును నీడు తమ్మి మెట్టలఁ దలఁపం
జాలనినన్ బ్రెంద్రోవం, దేలఁగ నెటుసేయఁగలవా త్రిశిరగిరీశా ! ౬౩

పలుగాకులఁ గూడుక చెడి, పలుగాఁకల డప్పి బోటుఁ బాలసుఁడైతిన్
వెలివాఁడని వెలిఁద్రోయకఁ, దెలిజాల్ జడదాల్ప మనుపు త్రిశిరగిరీశా !

కలిమిగల యలవి నులిపులు, మెలకువ నెలకొలిపి తెలిసి మెలఁగిరుబలిమిన్
నెలగలు దలఁగిన నలమరి, తెలియఁగలరు తెలివినెలమిఁ త్రిశిరగిరీశా !

నను నెగ్గాడినసైచుట, యును గా కలవారు గొడిమె నోడఁగూడెడి బి
స్తను బడుదురోకో యనుచ్చు మ. దినివగ చెడికఱదమొనఁగు త్రిశిరగిరీశా !

వెన్నుని తలపూసల చా, లెన్నికగా నఱుతఁదాల్చి యింపుగునియునిన్
వెన్నుఁడు నలువయు నుండఁగఁ, దిన్నం డెదఁ జక్కనెఱిఁగెఁ త్రిశిరగిరీశా!

నిను గని వలచుచుఁ బాలసుం, దిన నిడి నీ కంటఁ జెవుల తెగఁగని తన కం
డ్లను బెఱికి యిడిన కన్నప, దిన మాఱట నిన్నుఁగలసెఁ త్రిశిరగిరీశా! ౬౮

* తెర = తెర్వు = మార్గము.

తనపాపని సిరియాలుని, వనరకఁ దలిదండ్రి గోసి వండిడఁ దినక్
గను మొఱఁగుచుఁ జిఱుతొండనిఁ, దినుమనఁ బెంచెదవుఁ జేస్తు త్రిశిరగిరీశా!
నిక్కముగ నక్కటిక మీా, యక్కున మక్కువయుఁ దక్కు ననవాస్రుక్కుల్
నక్కాడి మనుపు మక్కలఁ, ద్రిక్కులు నెద్దడియు ద్రుక్కఁ ద్రిశిరగిరీశా! ౭౦
ప్రేముడి సుందరుఁ గోరికఁ, బ్రాముడి గోసంగి వగిది వచ్చినసీకున్
సోమాసి మారుఁ డిగిరిక, దీమసమున నిడఁడె యరితిఁ ద్రిశిరగిరీశా! ౭౧
సిగఁ జూచితి నని బొంకిన, దుగినునిఁ దిట్టఁగను మదిని దురపిలి వేఁడన్
డొగరడఁచి మనుపవే యీా, తిగతలగట్టినను బెట్టి త్రిశిరగిరీశా! ౭౨
కావరమునఁ గావించిన, కావలముంగాలిచి కనికరమున నన్నున్
గావుము కావిరికుత్తుక, దేవర దేవుడు నడల్చి త్రిశిరగిరీశా! ౭3
తుప్పటిల న్నినుఁ బూజల, మెప్పింపఁగ లే నసైన మిసిమింతునినా
నిప్పచ్చరములఁ దోర్చుచుఁ, దెప్పునఁ బాతకములనిమ్ము త్రిశిరగిరీశా! ౭౪
అన్నులమిన్నల నెన్నుచుఁ, బన్నుగనన్నొనఁగియున్న బన్నమువడితిన్
గన్నడ పన్నకఁ గన్నతి, దిన్నగ మన్నింపు మన్న త్రిశిరగిరీశా! ౭౫
సాఁకుట కీవుండఁగఁ బెఱ, సోఁకుల వేల్పులుగఁ గొలిచి సొలపొందిమదిన్
జీకాకు వడయనీక నె, తేఁకువ ననుఁ బ్రోవుమయ్య త్రిశిరగిరీశా! ౭౬
నెల ప్రొద్దు గేస్తునేలయుఁ, జలినొప్పుం డిగ్గి గాడ్పుఁ జదలగు నీ ని
ల్వ్వల దచ్చి మదినిఁ గనుఁగొను, దెలివింగ నికరము నొసఁగు త్రిశిరగిరీశా!
తనయాలి కనరు మానుప, నిను గుంటెన వోవఁ బనిచి నీరింకిన గుం
టను మొసలినోట నిసువం, దిన సుందరుఁ బాటనలరు త్రిశిరగిరీశా! ౭౮
తీవంచమోము గ్రుడ్డులఁ, గావించుచు మనిపి దోర్చి కప్పుచుఁ జేస్తుం
జౌవంచమోముఁ దమ్ములఁ, గ్రేవన్ మదినుంపఁ జేయు త్రిశిరగిరీశా! ౭౯
తెగులన్ వగవకఁ దగనన్, దుగమొగముల వేల్పుకంటి తొగ చెలిదాల్పా
నగమేన మగువ బిగిచిన, తిగమొగములజోగి మనుపు త్రిశిరగిరీశా! ౮౦
నరివడు దొరప్రొందిన వం, దురి యచటు దొరంగ లేక నొగులుట తనతీ
పురమనుచు నిన్నెళలఁ చెడి, తెరు వొసఁగుము పదిలముగను త్రిశిరగిరీశా!
తరమెఱుఁగని దొర లందఱిఁ, బరికించుచు లేచి కొలిచి బ్రతుకుగనక వే
సరి వనటకడలిమునుఁగకఁ, దిరముగ నిన్ దలఁపఁ జేయు త్రిశిరగిరీశా! ౮౨

కొండెముఁ జెవిఁగొని చమువని, తండంబుల కేఁగినచ్చు తగవరిగొమువుల్
　మొండుగ వినిమెడి వొరలచు, దిండికిఁగాఁ గొలువనీకు త్రిశిరగిరీశా! ౧౩
జానుగురక్ష వొరలకుఁ గను, జానుగుమే లొకనిఁగఅది చక్కాను వొరల్
　వ్రాని పలుకొంపముంతును, దీనన్నను గొలువనీకు త్రిశిరగిరీశా! ౧౪
చిచ్చుం జొచ్చునె చెద లీ, దచ్చియెుడల్ మెచ్చిమదిఁ దలఁచిన వారిక్
　వ్రచ్చునె నిచ్చలు గాములు, దిచ్చమొగం బచ్చువడక త్రిశిరగిరీశా! ౧౫
జగములఁ దుదిరేయిఁ దన, సెగకంటం గాల్చి మగుడఁ జేయుమఁ గూల్చున్
　జగజెట్టియగుచు నిక్కెడి, తెగువారియు నొక్కఁడీవ త్రిశిరగిరీశా! ౧౬
అన్నిట నుండుచు నెఱుఁగుదు, వన్నియు ననుమాటనిక్క మన నా యెదలో
　నున్నవి నేల యొనర్పవు, తిన్నగ నీవెఱిఁగి తోకఁ ద్రిశిరగిరీశా! ౧౭
వలపిలు ములుచేమంతుల, నలముచుఁ దెక్కలిఁ బరాంతకచోళుక్
　దొలుకించి మంటివానలఁ, దెలియం బ్రోలడఁచిదోర్చు త్రిశిరగిరీశా! ౧౮
సారముని పాపజగముం, జేరి పొదల్ దెచ్చిపెంచి చేమంతినసల్
　గూరిచి నినుఁ బూజించిన, తీరుంగని ముత్తియిడిన త్రిశిరగిరీశా! ౧౯
కనికనకఁ గనులు నలసటఁ, కనికరములఁ బెనఁగు నదను గని కరమునక్
　గని కరమున ననుపుచుప మ, దిఁ దలఁచుచుఁ దెలతునిపుడె త్రిశిరగిరీశా!
కూరిమి నిను మ్రొక్కెడి చను, బేరులకొమ బిక్షకుల్ప పెనఁగొననీక్
　జేరి తలిఁ బోలి ప్రోచిన, తీరెన్నఁగ నాదుతరమె త్రిశిరగిరీశా! ౨౧
రమ్మన్నరావు రానివి, పొమ్మనరాఁ గలవి యెందుఁ బోనేరవనక్
　ఇమ్ముగనీ యరు లలవడఁ, ద్రిమ్మరి యెవియేనివచ్చుఁ ద్రిశిరగిరీశా! ౨౨
తెలివిచెడిమందు నదనున, నలసట నిన్నెదను దలఁప నగుమనొ లేనో
　వలపున నిపుడేతలఁచుచుఁ, దెలతును బెంద్రోవఁజెందఁ ద్రిశిరగిరీశా! ౨౩
తెగులం బడి వగవఁగఁ జముఁ, డెగపునఁ బట్టీడ్చునప్పు డీవెనసి ననుక్
　దిగుచుచు నీలోఁ జేర్పుము, తెగడక నామనవి నింత త్రిశిరగిరీశా! ౨౪
చెడుగడు గుడిచెడి యడజడిఁ, గ్రవడి నీయడుగు లెడఁదఁ గడలెడిబెడఁగల్
　గొడవసుడివడఁగఁ దడయునె, దిడుమని కడకెడలలేక త్రిశిరగిరీశా! ౨౫
నిన్నొక్కటి వేఁడెద మఱి, నన్నిఁకఁ బుట్టంగఁ జేసి నలియింపక నీ
　హొన్నజ్జ దమ్మిగెలపునఁ, దిన్నగ ననుఁ జేర్చిమనుపు త్రిశిరగిరీశా! ౨౬

పొట్టకును జెనఁటి దొరలను, నిట్టూర్పునఁ గొలువనీక నీయజ్జటసల్
పుట్టువుల మదినిఁ దలఁచుచు, డిట్టత సినుఁ గొలువఁజేయు త్రిశిరగిరీశా !
చెలిమిని యలుకం గూటమి, నలసట మెయిమఱచియరితి నైనను దలఁపం
గలవారి జముఁడు సెనకునె, తెలియఁడె నీయజ్జబలిమిఁ ద్రిశిరగిరీశా! ౯౮
మిసుసిక వెన్నెలు *తలమల,యునికిజొహా †రుద్దమోమును త్తరిడింగి
ళ్లన దుక్కణ టెంకణమిడి, తిని మచుపుము చెంగనాలు త్రిశిరగిరీశా ౯౯
చిన్నిదపు గట్టువిలుతుఁడ, చిన్నిపువుల్ గూర్చినిడుచుఁజివురుటడుగులన్
జిన్నిపువుల్ వెట్టెద నను, దిన్నగమన్నింపుమన్న త్రిశిరగిరీశా ! ౧౦౦

## అష్టవిధకందము.

### గర్భప్రథమకందము.

తలఁతును నెలడాల్ నిలువున్, దల నెల నిలుపుని వెలిమల తలగలు నెలవున్
నిలుపునిఁదలజాల్ బలియుని, నెలగలుగలుగను బలుకుల నెలవున్ గలయన్.

### గర్భద్వితీయకందము.

నెలడాల్ నిలువున్ దల నెల, నిలుపున్ వెలిమల తలగలు నెలవున్ నిలుపున్
దలజాల్ బలియుని నెలగలు, గలుగన్ బలుకుల నెలవునిఁగలయన్ దలఁతున్.

### గర్భతృతీయకందము.

తల నెల నిలుపుని వెలిమల, తలగలు నెలవుని నిలుపునిఁ దలజాల్ బలియున్
నెలగలుగలుగనుబలుకుల, నెలవునిఁగలయన్ దలఁతును నెలడాల్ నిలువున్.

### గర్భచతుర్థకందము.

వెలిమల తలగలు నెలవున్, నిలుపునిఁ దలజాల్ బలియుని నెలగలుగలుగన్
బలుకుల నెలవున్ గలయన్, దలఁతును నెలడాల్ నిలువునిఁదల నెలనిలుపున్.

### గర్భపంచమకందము.

నిలుపునిఁ దలజాల్ బలియుని, నెలగలు గలుగను బలుకుల నెలవున్ గలయన్
దలఁతును నెలడాల్ నిలువున్, దల నెలనిలుపుని వెలిమలతలగలు నెలవున్.

### గర్భషష్ఠకందము.

తలజాల్ బలియుని నెలగలు, గలుగను బలుకుల నెలవునిఁ గలయన్ దలఁతున్
నెలడాల్ నిలువున్ దల నెల, నిలుపున్ వెలిమలతలగలు నెలవున్ నిలుపున్.

---

* తలమల=శిరగిరి=త్రిశిరగిరి, † రుద్దమోము=నాలుగుమోములుగల నలువ

గర్భసప్తమకందము.

నెలగలు గలుగను బలుకుల, నెలవున్ గలయన్ దలంతును నెలడాల్ నిలువున్
దల నెల నిలుపుని వెలిమల, తలగలు నెలవుని నిలుపునిం దలజాల్ బలియున్.

గర్భాష్టమకందము.

పలుకుల నెలవున్ గలయున్, దలంతును నెలడాల్ నిలువునిం దల నెలనిలుపున్
వెలిమల తలగలు నెలవుని, నిలుపున్ దలజాల్ బలియుని నెలగలుగలుగన్.

నెలడాల్ — చంద్రజ్యోతివంటి కాంతిగల

నిలువున్ — ఒడలుగలవానిని

తల — తన శిరస్సునందు

నెల — అర్ధచంద్రుని

నిలుపున్ — దక్షప్రజాపతియొక్క శాపపీడితుండై రూపఱకుండునటు తన జటామకుటమందు స్థిరముగాం జెక్కి నిలిపిపెట్టుకొనినవానిని,

వెలిమల — శ్వేతవర్ణమైన రజతాద్రియొక్క

తలకలు — శిఖరమును

నెలవున్ — తనకు వాసస్థానముగాం గలవానిని

నిలుపుని — బ్రహ్మవిష్ణురుద్రాదులును సకలచరాచరప్రపంచములును మహాప్రళయకాలమందు రూపఱి నశింపంగాం దానొక్కండే కాలముం గర్మములుం దలంగి స్థిరముగా నిలుచువానిని

తల — శిరస్సునందు

జాలు — గంగానదిని ధరించుకొన్న

బలియుని — లోకైకవీరుని

పలుకుల — సకలభాషలకును

నెలవున్ — వాసస్థానముగా నుండువాండైన పరశివమును

నెలగలుగలుగన్ — ఇహమందు ధర్మాచరణమునకుం దోడుగానుండు సంపదలు నాకు సిద్ధించుటకును

కలయున్ — పరమందు పశు పతి యనుభేద ముడిగి యద్వైతముగాం గలసికొనుటకును

తలంతున్ — హృదయమందు సదాధ్యానించెదను.

# EPILOGUE.

శ్రీచిల్లవారి కులజల, ధీచంద్రసుధీవిశాలు దీనార్తిహరున్
యాచకజనకల్పకు గృ, ధ్రాచలషణ్ముఖపదస్థితాంతఃకరణున్.
అతిరుద్ర సోమసవనము, నతులిత వస్తు ప్రదర్శ నాదులచే నీ
క్షితి 'రాజ' బిరుదమందిన, హితభాషణు వేంకటేశ్వరెట్టమహీశున్.
వ్రంతలఁ బాపుచు మానిసి, బంతుల యెద్దడిని దోర్చి మన్నించుచు వే
ఱింతుల కూటమిఁ గోరఁడొ, కింతయు శ్రీవేంకటేశ్వరెట్టబిడౌజున్.
మనుపఁదగు మేరగలఁడని, వనటంబడనీక నాదు మనవియొకింతం
గొనికోర్కులొసఁగి మదిఁ జన, వెనసిన శ్రీవేంకటేశ్వరెట్టక్షితిపున్.
మును *నల్లద్రావుఁడేటన్, మినుమణి విల్లందునాఁడు వింటికి నేగన్
గనివనరి పొగలుచుండు మ, దిని దీమసమొదవఁ దలఁచి తేజితినిటులన్.
నాకున్ జననస్థలము పి, నాకియుఁ ద్రిశిరాఖ్యదనుజనాథుని కోర్కుల్
వీక నిడి గ్రావరంగముఁ, జేకొని త్రిశిరఃపురంబుఁ జేరివసించున్.
ప్రేమను మాతృనిధానుం, డై మాతృసురూపమొంది యంగనఁబ్రోవన్
దా మహి సుగంధికబరీ,వాముండౌ మాతృభూతపరమున్ మదిలో.
స్తవమొనరించుచు భక్తిం, దవిలి శివున్ సంతతంబుఁ దలఁచిన హృదికిన్
శివబోధము దృఢశుద్ధియు, భవబంధవిముక్తి గలుగుఁ బరమునటంచున్.
అవివేకతమస్సరణిన్, భవసాగరతరణి శమనభంజకరణుఁ గై
రవపతిధరణుఁ జతుర్దశ, భువనైకశరణ్యు శేషభుజగాభరణున్.
కర్మత్రయపీడితతను, ధర్మత్రయ మణఁచి పరము దానను దెలివిన్
నిర్మలనిత్యానందవి, నిర్మాతునిఁ బొగడ నైతి నిష్కలపరమున్.
మును నాకలోకనాథుం, డనువుగ సేనాని సాయ మందినవిధ మే
ననుపమకవివర్యులదయఁ, గొనిపొగడితినిందుఁగొనము గొందురువిబుధుల్.
సారగ్రాహరసజ్ఞులు, ధీరమతిం బరులతప్పుఁ దేఱరు కుకవుల్
క్రూరమతి లాతినేరము, లేఱితముచిరాకుగుప్ప లెఱుఁగరొకింతన్.

శ్రీసోమాస్కందమూర్తయేనమః.

* రాక్షససంవత్సరము, ధనుర్మాసము మొదటి తేది.

# శృంగారరసము.

కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు—విజయనగరము.

---

రసశబ్దమునకు "రస్యతే ఆస్వాద్యత ఇతి రసః" అని వ్యుత్పత్తి. ఆస్వాదింపఁబడునదిగాన రస మని పిలువఁబడుచున్నది. ఈరసము విభావాదులచే స్థాయి వ్యక్తగఁ బరిపుష్ట మైనపుడే స్ఫూర్తిని జెంది సర్వజన హృదయాహ్లాదకమగును. ఈవిషయమె ప్రతాపరుద్రీయమున నిట్లు స్పష్టపఱుపఁబడినది.

"విభావానుభావసాత్త్వికవ్యభిచారిసామగ్రీసముల్లాసిత స్థాయిభావోరసః—"

ఇట్టిరసమే కావ్యమునకుఁ బ్రధానభూతమైనది. కనుక కవి తనకావ్యమున సర్వప్రయత్నములచేతను రసమునే ముఖ్యముగఁ బోషింపవలయును. ధ్వనికారుఁడు మన కీవిషయమునఁ బ్రమాణము.

కావ్యస్యాత్మా సఏవార్థః తథా చ ఆదికవేః పురా
క్రౌంచద్వంద్వవియోగోత్థః శోకః శ్లోకత్వమాగతః. 1 ఉ. 5 కా.
"వాచ్యానాం వాచకానాంచ యదౌచిత్యేన యోజనమ్
రసాదివిషయేణైతత్ కర్మముఖ్యం మహాకవేః" 3 ఉ. 32 కా.

వృత్తికారుఁడుకూడ నీకారికావృత్తిలో స్పష్టముగఁ జెప్పియున్నాఁడు.
"అయమేవహిమహాకవేర్ముఖ్యవ్యాపారో యద్రసాదీనేవ ముఖ్యతయా కావ్యార్థకృత్య తద్వ్యక్త్యనుగుణత్వేన శబ్దానా మర్థానాం చోపనిబంధనమ్"

ఇట్లు కావ్యమునకుఁ బ్రధానభూతమైన రస మాలంకారికులచే శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాన్తము, నని తొమ్మిదివిధములుగ విభజింపఁబడినది. విద్యానాథునిశ్లోకము నిటఁ బ్రమాణముగ నిత్తును.

"శృంగారహాస్యకరుణాః రౌద్రవీరభయానకాః
బీభత్సాద్భుతశాన్తాశ్చ రసాః పూర్వై రుదాహృతాః" రసప్రకరణము.

ఈ తొమ్మిది రసములలోను శృంగారరసము ప్రధానభూత మయిన దని చెప్పవచ్చును. ఏలన-నిది చాలసుకుమార మైనదయి సర్వజనహృదయాకర్షముగ నున్నదిగనుక-సర్వప్రాణులకు శృంగార మనుభవమునం దుండుటచేతను నదియొ సర్వజనులహృదయముల నాకర్షించుటకు సమర్థమై యున్నది. వీరాదు లన్ననో సర్వజనసామాన్యములు కావు. ఆయాయి పురుషులకే యనుభవవిషయము

లగును. అందుచే సర్వజనసామాన్యము లనుటకు వీలులేదు. శృంగార మన్న నో నిత్యము నందఱకు ననుభవ విషయ మగుటచే నందఱకు నది యాహ్లాదకర మగుచున్నది. కాన శృంగార మితరోన్మిషరసములలోను బ్రధానమైన దనుటకు సందేహము లేదు. యీవిషయమునే ధ్వనికారుఁ డిట్లు చాటుచున్నాఁడు.

"శృంగారఏవ మధురః పరః ప్రహ్లాదనోరసః
తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి" 2 ఉ. 8 కా.

* వృత్తికారుఁడు కూడ నీవిషయమును దృఢపఱిచినాఁడు.

"శృంగారరసోహి సంసారిణాం నియమే నానుభవవిషయత్వాత్ సర్వరసే భ్యః కమనీయతయా ప్రధానభూతః"

రసవిరోధచర్చలోఁ జాల సుకుమారమైన దీరస మని చెప్పియున్నాఁడు. మఱియునిది యితరరసములకంటె మిక్కిలి కావ్యమునకు శోభాదాయక మనియు సర్వజనాకర్షక మనియుఁ గవి దానియందు శ్రద్ధకలవాఁడై యుండవలయు నని యుఁ జెప్పినాఁడు.

"విరోధ మవిరోధం చ సర్వత్రేత్థం నిరూపయేత్
విశేషతస్తు శృంగారే సుకుమారతరోహ్యసౌ" 3 ఉ. 28 కా.
"వినేయా నున్ముఖీకర్తుం కావ్యశోభార్థమేవవా
తద్విరుద్ధరసస్పర్శ స్తదంగానాం నదుష్యతి." 3 ఉ. 30 కా.
"అవధానాతిశయవాన్ రసే తత్రైవసత్కవిః" 3 ఉ. 29 కా.

సాధారణముగ నొకనిని సన్మార్గమునకుఁ ద్రిప్పవలయు నన్న వానిహృద యమున కాహ్లాదకరము లగువాక్యములచేఁ గదా వానికి నీతి గఱపవలయును. వెగ టగువాక్యములచే వానికిఁ బ్రవృత్తి కలుగదు కనుకనే భాసశూద్రకకాళి దాసాదిమహాకవులు సర్వజనహృదయానందకము లగువాక్యములచే నీతి నుప దేశింపఁ బూని తమప్రబంధములు సర్వజనమనోరంజకములుగ నుండుటకుఁ గాను వానిలో సర్వజనసాధారణమైన శృంగారమునే చొన్పినారు.

ఇప్పటికి సంస్కృతప్రబంధములు నూటికి నెనుబది పైఁగా శృంగారరస పూరితము లగుటకుఁ గారణ మేమి? శృంగారరసము సర్వరసములకంటెను సర్వజనహృదయాహ్లాదకరమగుటయే. కనుక శృంగారరసమురసములలోని కెల్ల రాజ మని చెప్పుట యెంతమాత్రము నతిశయోక్తి కాఁజాలదు.

* ధ్వనికారుఁడు, వృత్తికారుఁడు వేఱని పఱొకవ్యాసమున నిరూపింపనున్నాను.

భోజుఁడు కూడఁ దన సరస్వతీకంఠాభరణమున శృంగారమునకే ప్రాధాన్య మిచ్చియున్నాఁడు. శృంగారమే యభిమత మైనరస మఁట. అట్టి శృంగారమందు కవి మగ్నుఁడైననాఁడే కావ్యము మనోరంజకముగనుండు నఁట లేనిచోఁ గావ్యము నీరసమేనఁట.

"రసోభిమానో హంకారః శృంగార ఇతి నీయతే
యోర్థః తస్యాన్వయాత్కావ్యం నీరసం సర్వమేవతత్."
"శృంగారీచేత్కవిః కావ్యే జాతం రసమయంజగత్
సచవచే దశృంగారీ నీరసం సర్వమేవతత్."

మఱియు నాలంకారికులందఱుఁగూడ దీనికే యగ్రస్థానము నిచ్చియున్నారు. శృంగారరసమునకుఁ బూర్తిగ విభావానుభావాదులను సోదాహరణముగ వివరించుచు నితరములకు వానిని వివరించియుండలేదు. ఊహ్యము లనిరి. ఏలన నిదియే సర్వజనాదరణీయముగాన దీనిని బాగుగ వివరించి యితరరసములకు వారె యూహించుకొనఁగల రని కనుక శృంగారమే ప్రధాన మైన దనుటకు సందియము లేదు.

రసముఁ బేర్కొనునప్పుడు గూడ "శృంగారహాస్యకరుణాః" అని మొదట నే పేర్కొనఁబడిన దీశృంగారము కనుక దీనికే ప్రాధాన్య మిచ్చిరి యాలంకారికు లనుటకు సందియము లేదు.

కనుక సుకుమారమైన యీశృంగారరసము సర్వజనహృదయాహ్లాదకర మగుటచేతను అన్నిరూపకములందుఁ జొన్పఁబడుటచేతను నాలంకారికులచే నగ్రస్థాన మీయఁబడియుండుటచేతను వీరము మొదలగు నితరరసములకన్న నిది యందఱికి ననుభవవిషయ మగుటచేతను రసములలో నిది రాజమని యనుట యతిశయోక్తి కాఁజాలదు.

# గ్రంథ స్వీకారము.

(1) బ్రహ్మపురాణము:—ఇయ్యది యష్టాదశ పురాణములలో మొదటి పురాణమున కాంధ్రానువాదము. బ్రహ్మాండపురాణము, వాల్మీకిరామాయణాది మహాగ్రంథముల రచించి ప్రసిద్ధి నొందియున్న కావ్య స్మృతితీర్థ బిరుదాంచితులు బ్ర॥ జనమంచి శేషాద్రిశర్మగారు రచియించినది. ఇతర పురాణములలో నుండు విషయములు పెక్కులిందును గానవచ్చుచున్నవి. శ్రీ కృష్ణావతార కథన మిందు విపులముగా నున్నది. ఓఢ్ర దేశము దద్దేశమున నుండు కోణార్క పురుషోత్తమక్షేత్రముల మహాత్మ్య మిందు విశేషముగ వర్ణింపఁబడినది. 718 పుటల మూలము నైదాశ్వాసములును గలది. ప్రథమాశ్వాసము 33 అధ్యాయముల కథ 1562 పద్యములు. ద్వితీయాశ్వాసము 30 అధ్యాయముల కథ 1299 పద్యములు తృతీయాశ్వాసము 27 అధ్యాయములకథ 1197 పద్యములు. చతుర్థాశ్వాసము 27 అధ్యాయముల కథ 1288 పద్యములు. పంచమాశ్వాసము 18 అధ్యాయముల కథ 772 పద్యములు. శర్మగారి కవితాధారయనర్గళమైనది. శైలి సుప్రసన్నము మృదుపాకము. ఈపురాణము నిజముగాఁ బురాణశైలిం జదివి యానందించుట కెంతయు ననుకూలముగానున్నది. మచ్చునకుఁ బద్యములు.

చ. పరశివ సంశయంబు మదిఁ బాటిలునేని మనుక్తియుం దదే
వరుసను నిన్ను నీక్షణమె భర్తగ నే వరియించుదాన నా
దరమున నన్గ్రహింపుము సతంబును నిక్క మది నిల్పియున్న యీ
తరుణిని బ్రోవఁగాఁ దగదె దర్పకభంజన సోమశేఖరా! పుట180 ప.1519.

చ అనుపమతీర్థరాజమునయం దొగి స్నానము చేసి శ్రీహరిం
గనిన నరుల్ సుపర్వపురకన్యతరస్థలుల న్వసింతు రా
మనుజుల కాయమాలయమునూట వినంబడకుండు; నుత్కలం
బునఁదగుక్షేత్రవర్యమునఁబుణ్యాదమైతగుదానియందునన్.232.పుట401ప.

ఈ పురాణము వెల రు 4-0-0. కడప మునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధాన పండితులుగా నున్న శర్మగారి యొద్ద దొరకును.

(2) కావ్యామృతము:—అల్లంసెట్టి అప్పయ్య కవిగారు రచించినది. రెండు భాగములు ఇందు ధ్యానము, కవి, రాఘవప్రశంస, ప్రబోధము, జన్మము, కోకిలగానము- ఇట్లు ముప్పది విషయములను పద్యములు 69 పుటలలోఁ జక్కని కాగితముల మీఁద ముద్రింపఁబడినవి. ప్రసిద్ధులగు ననేకులు పండితులుఁ గవులు దీనిపై నిచ్చిన సదభిప్రాయములు గూడ నిందాదిని ముద్రింపఁబడియున్నవి. అప్పయ్య కవిగారు రచించిన యీవలి పద్యములు చక్కఁగా నున్నవి. చాలవఱకు లోకానుభవమున వ్రాసినవి. కొన్ని యందందు వాడుకలో నున్న విషయములుం గలవు. విషయములకుఁ దగిన రీతిని పద్యములు పదప్రయోగాదుల నొప్పుచున్నవి. వకుళమాలికలో శ్రీ రామకృష్ణ పరమహంసగారి సూక్తులు కొన్ని గలవు. ఆ పద్యములు చదువ దగినవి. కొన్ని పద్యములు మచ్చు చూపఁబడును.

గీ. అఖిల జగదంతరాత్ముఁ డగు మహేశు, నర్థిఁ బ్రార్థింపు మెచ్చోటనైన నీవు
చీమప్రాకుడు సొద నైనఁ జెవిని దాల్చు, నట్టిదేవుండు వినఁడె నీ యార్తరవము.

గీ. పొలము కములోఁతుగా దున్నుకొలఁది సస్య
సమితి ఫలియించుచుండు విస్తారముగను
బుద్ధి వికసించునంతకుఁ బూతమగుచుఁ
దివ్యతరమై జ్ఞానంబు తేజరిల్లు.

దీని వెల రు. 0-8-0 విశాఖపట్టణము జిల్లాలోని పొందూరులో విద్యాసద్వాణి చమర్తుల నందికేశ్వరరావుగారి యొద్ద దొరకును.

(3) జ్యోతిర్వినోదిని:—కన్నడము. శ్రీ కంఠీరవ నరసింహరాజ పరిపోషిత కర్ణాటక వైజ్ఞానిక గ్రంథమాల కిది ప్రథమపుష్పము. మైసూరు దొరతనము వారి పవనశాస్త్రశాలాధ్యక్షులగు శ్రీయుతులు నంగపురం వేంకటేశ అయ్యంగారు బి. ఏ. గారు దీని యనువాదకులు. కర్ణాటక సాహిత్యపరిషత్కార్యదర్శులచే నాదరపూర్వకముగాఁ బంపఁబడినది. నామముచేతనే యీ పొత్తమున నేమి యుండునో తెల్లమగుచున్నది. 287 పుటలు క్రౌను సైజు. ఆంగ్లగ్రంథము నుండి యనువదింపఁబడినను, ముక్కకు ముక్క చేర్పక కన్నడములో నే రీతిని రచించినఁ బరివర్తన మని తోఁచునో యా రీతిని రచియింపఁబడినది.

సంతోషవిషయము:—కర్ణాటక సాహిత్యపరిషదధ్యక్షు లయిన సర్ శ్రీ కంఠీరవ నరసింహరాజ ఒడయర్ బహద్దరు గారు కర్ణాటకులలోఁ బెక్కుర లోఁ గల మూఢవిశ్వాసమును నజ్ఞానమును దొలఁగించి వారికిఁ బ్రకృతినియ మముల విషయములలోఁ దెలివిని గలిగించుటకయి సులభగ్రాహ్యము లగు వైజ్ఞానికపుస్తకములను వ్రాయించి ముద్రించి ప్రకటించుటకయి 2500 రూపా యలు పరిషత్తునకు దయచేసి రఁట. ఆ ధనములో నుండి పరిషదుపాధ్యక్షు లయిన రాజసభాభూషణ కర్పూర శ్రీనివాసరావుగారు, అనువాదకు లగు వేంకటేశ అయ్యంగారి యొద్దనుండి యీ జ్యోతిర్వినోదిని దీసికొని పరిషత్స భ్యులతో నాలోచించి 500 రూపాయలు బహుమాన మొసఁగి యీ రీతిఁ బరిషత్పక్షమునఁ బ్రకటించిరి ఇట్టి గ్రంథములు మన యాంధ్రమునను వెలసి విజ్ఞానమును వెలయించుటకయి యాంధ్రులలో నుదారు లగు విత్తాధికులు భాషా సంస్థలకుఁ దోడ్పడుదురుగాక. ఆంధ్ర సాహిత్యపరిషత్తు వెనుక నిట్టిదొ కజ్యోతిశ్శాస్త్రసారమును బ్రకటించినది గాని యది జనాదరమునఁ గోరుచున్నది.

ఈ జ్యోతిర్వినోదిని. జ్యోతిశ్శాస్త్రసంబంధము లగు సమస్త విషయము లను దెలుపుచున్నది దీని వెల రెండు రూపాయలు బెంగుళూరు కర్ణాటక సా హిత్య పరిషత్కార్యాలయమున దొరకును.

(4) కృష్ణజీవి:—శ్రీయుత తంగిరాల రామనాథశర్మగారిచే రచియింపఁ బడినది. నెల్లూరు, ఆంధ్రసాహితీగ్రంథాలయమున వెలువడిన మొదటి గ్రం థము. 500 పద్యములు.

క. శృంగారము వేదాంతము, సంగద్వితయంబుగాఁగ నమిత ప్రౌఢిన్
రంగారఁ గృష్ణజీవిని, సంగతి కాంక్షరకు మిగుల సంతస మొదవన్.

గీ. రసికులకు రమ్యమై యించురసముఁ బోల్చు
పోల్కి ప్రతిపద్యమును మేల్మిఁ బొలుచునటుల
రసికురాంత్రకు రమ్యమై రసవ జుంటి
తేనె చందాన నంత వర్ధిల్లునటుల.

గీ. యోగులకుఁ బుణ్యపాప మిశ్రోగ్రకర్మ
కాష్ఠములు గాల్ప శుచియాచుఁ గ్రాలునటుల
యోగినుల కపవిత్ర సంభోగమోహ
జలధి గడవంగ నావయై వెలయునటుల.

క. కవితాకంఠాభరణుఁడఁ, బ్రవిమలమతి రామనాథ ప్రఖ్యాతాఖ్యుం
డవు నే విరచించితి మా,ధవగురు కరుణాకటాక్ష ధన్యాత్ముఁడ నై.

అని కవిగారు గ్రంథములోని సారమును మొదను దెల్పినటులుగా నీపద్య కావ్యము తనరుచున్నది. ప్రతిపద్యమును రసాస్పదముగ నున్నది. తెలుఁగు బద్యంబుల పసగుణము లగు ననేక లోకోక్తులు గలిగి విడువక చదువ మనసు పుట్టించుచుండును. ధారగల కవిత్వము. ఉచితపదయుత రచనగలది. స్త్రీపురుషోప యోగము లగు నీతివాక్యములిందుఁ బెక్కులు గలవు. పద్యోపేతమైన యీ గ్రంథమునఁ గవిగారి నవీన మార్గము మెచ్చఁ దగియున్నది. పాఠకులు చదివి యా నందింతురు గాక. వెల రు 1. మచ్చు చూడుఁడు.

మ తరుణీ వంచనఁ బోకు మిందులకుఁ జిత్తంబందు నెవ్వారికిం
జిరకాలంబును నుండఁబోవు తలఁపక శ్రీసంపదల్ వానిచే
గరువం బొందిన వారు మూఢు లిది నిక్కం బైనఁ గానిమ్ము స
త్వర మీచోటును బాసి పోవుదము కాంతారంబులం జేరఁగన్ 165

చ. ఘనకవితా ప్రతీతుఁ డగుఁ గావునఁ గమ్మని పల్కుఁ దేనియల్
చినుక నుదాహరించి తను చెప్పిన దంతయు వారు భక్తితో
విన మతబోధ సేసె నట వేలకువేల్గుమిగూడఁ జొచ్చి రో
య్యన నిజభక్తి మార్గగుల కబ్బవె శిష్యపరంపరల్ ధరన్. 347

నెల్లూరు ఆంధ్ర సాహితీ గ్రంథాలయము మేనేజరుగారియొద్ద దొరకును.

(5) సీమంతిని:—ఆంధ్ర ప్రచారిణి గ్రంథమాల-౭౧ పుష్పము. శ్రీ వేంకటపార్వతీశ్వరకవులలో నొక రగు పార్వతీశ్వరకవిగారిచే వంగభాషలో, పాంచఖడీదేవుగారిచే రచియింపఁబడిన సతీసీమంతిని యనునవలనుండి తెనుఁగు చేయఁబడినది. ౨౦౩ పుటలును 34 ప్రకరణములును గలది. వెల రు 1-8-౦. పిఠాపురములో నాంధ్ర ప్రచారిణీ కార్యాలయమున దొరకును.

(6) విష్ణుపురాణము:—కలిదిండి భావనారాయణ ప్రణీతము. నాలు గంశములు. చెన్నపురి విశ్వకళాపరిషత్ప్రాచ్యపరిశోధనాలయ ప్రచురణముల లో నాంధ్ర గ్రంథమాలలో నిది మొదటిది. తెనుఁగుపురాణములలో నింత యథామాతృక మయినరచనయే కన్పట్ట దని ప్రకాశకులు తెల్పుచున్నారు. ఆంగ్రకవులలో మొదటనుండి వచ్చు నాచారమునే యీకవియు ననుసరించి

నాఁడు. తనకాలము నెచ్చటను దెలిసికొనుట కాధారములను గనఁబఱుపలేదు. ఇతర గ్రంథములలో నొకయాధార మున్నను దానినిబట్టి యైనను బ్రకాశకులు కాలనిర్ణయము చేయుటకు సాహసింపఁజాల రైరి. వీరు, "కొన్ని వ్యాకరణములను బ్రమాణముగా గైకొని యీగ్రంథమును బరీక్షించినచోఁ దప్పు లని చెప్పఁదగిన ప్రయోగములు కొన్ని పొడగట్టును, కాని మేము వానిని దప్పులనక ప్రయోగవిశేషము లందుము. ఏమన స్వతంత్రుఁడును బహుగ్రంథకర్తయునగు కవిని నసమగ్రలక్షణమునకు విధేయునిజేయుట శాస్త్రవిరుద్ధము" అని వ్రాసిరి. కేశవ! అచ్యుత! అనుటకు కేశవాచ్యుత యనుట తప్పుగాక విశేషమేమైనె, సతులవేయి నుండని అనుటకు సతులవెయ్యింటిఁ గనియె ననునది తప్పుగాక విశేషమే యైనచోఁబండితులు, విద్యాధికులు, స్వతంత్రులు, బహుగ్రంథపరిశీలకులుఁ గూడఁ జివరతప్పొప్పులపట్టిక వేయ నక్కఱయే లేదు. అవియును విశేషములే యనవచ్చును. విశ్వకళాపరిషత్తులోని పండితులుగూడ నసమగ్రలక్షణములకు విధేయులు గావలయునా! దీనివెలరు 2-8-0. మద్రాసు యూనివర్సిటీ ఓరియంటల్ రిసర్చి ఆఫీసులోదొరకును.

మచ్చునకుఁగొన్ని పద్యములు.

ఉ. సాగిలిమ్రొక్కి హస్తజలజంబుల మోడ్చి నృపాలసూనుఁ డ
యోగ్యులఁ జూచి యిట్లనియె నోమహనీయతరప్రభావభ
వ్యాగమవేదులార! ధ్రువుఁ డందురు నన్ను, మదీయపూర్వపు
ణ్యాగమనంబున న్నిము మహాత్ములఁ గంటి ఫలించెఁ గోరికల్. (ప్రథమ 272)

చ. ముసలహలాభిశోభితసమున్నతదోర్యుగుఁ డేకకుండలో
ల్లసనలసత్ప్రపోలుఁ డచలస్వఫణాగ్రమణీగణప్రభా
ప్రసరణరంజితాఖిలధరావలయుండు లయుం డనంతుఁ డు
ల్లసముగఁదాల్చునీభువనపంక్తులతోడి యజాండభాండముల్. (ద్వితీ.72)

చ. వనజదళాక్షు భక్తజనవర్గము డగ్గరఁ బోవరాదు, పో
యినయపుడే మదాంధదనుజేభఘటావిఘటీకృతప్రచం
డనిబిడరోషకేసరి భటా! హరిచక్రము విక్రమించినన్
మనతలలెల్లఁ బోవు ననుమానము లేదిది నీకుఁ జెప్పితిన్. (తృతీ. 103)

శ్రీరస్తు.

# బాలసరస్వతీయపీఠిక.

దేశభాషలు సంస్కృతిగర్హితము లైన వని చెప్పుచు నయ్యవి హేయము లని విశ్వసించు దురాచారము నడఁగఁ ద్రొక్కి దేశభాష యగునాంధ్రమును బండి తాదరణపాత్రముగఁ జేసినవాఁడును దొలుదొలుత నాంధ్రమునఁ గావ్యరచన మునకు దారి చూపినవాఁడును నన్నయభట్టారకుఁడు. నన్నయభట్టునకుఁ బూర్వము కావ్యము లున్న వందురు గాని యందులకుఁ దగినప్రబలప్రమాణ ములు కానిపింపవు. నన్నయభట్టు భారతామ్నాయము నాంధ్రీకరించినట్లును, ఆంధ్రశబ్దచింతామణి యను నాంధ్ర వ్యాకరణమును రచించి శబ్దశాసనుఁ డను బిరుదము నందినట్లును నాంధ్రులకు విశద మయియే యున్నది.

చాలకాలము వఱకును నడఁగి యున్న యీయాంధ్రశబ్ద చింతామణిని, ఎలకూచి బాలసరస్వతి ప్రకటించి దానికిఁ డీకను వ్రాసెను. ఆంధ్రశబ్దచింతా మణిటీకనే గాక "భాషావివరణము, చంద్రికాపరిణయము, రాఘవయాదవ పాండవీయము మొదలగు కొన్నిగ్రంథముల నితఁడు రచించియుండెను. నన్న యాథర్వణుల పిదప నాంధ్రభాషయందు సమగ్ర మైనపాండిత్యమును సంపా దించినవారిలో నితఁడు ముఖ్యుఁ డనుటలో నతిశయోక్తి యుండనేరదు. "భా ష్యాది బహుశాస్త్ర పరిచయోదాత్తుఁడ" అని పీఠికలోఁ జెప్పినదానిని బట్టి యాంధ్రమందే గాక సంస్కృతమునందును దలస్పర్శి యగుపాండిత్య మితనికిఁ గల దని స్ఫుట మగుచున్నది. ఇతని రాఘవయాదవపాండవీయమునకు రాఘవ పాండవీయ హారిశ్చంద్రనలోపాఖ్యానములు మార్గదర్శకము లని చెప్పవచ్చును. ఈగ్రంథము భాషాస్వాతంత్ర్యమును బాండిత్యప్రకర్షమును వెల్లడి చేయును, గాని, రసమయకావ్యవ్యపదేశమునకు యోగ్యము గా దనుటలో విమర్శకులు విప్రతిపన్నులు కాఁజాలరు. ఇట్టి శ్లేషకావ్యములు భాషాసంప్రదాయముల ను భాషానియమములను దెలుపుటలో నెక్కువయుపయోగింపఁగలవు.

ఆంధ్రశబ్దచింతామణి సిద్ధునివలనఁ దనకు లభించినట్టు లీ కవి "శివ యోగివర్యునిచే దేవచోదనం బరిప్రాప్తమైన యాంధ్రశబ్ద చింతామణి" యని పీఠికలో వ్రాసియున్నాఁడు. అప్పకవిమాత్రము "ఆలోకనుతుఁడు మొన్నఁటి, కీలకసమ నామతంగ గిరికడనొసఁగెన్, బాలసరస్వతులకు" (ఆ1-ప50) అని

సారంగధరుఁడు బాలసరస్వతి కిచ్చినట్లు చెప్పెను. బాలసరస్వతి సారంగధరుఁ డిచ్చినట్లు వ్రాయలేదు. శివయోగివర్యుఁ డిచ్చినట్లు చెప్పెను. ఆశివయోగి వర్యుఁడు సారంగధరుఁడే యై యుండు నని యప్పకవి యూహించి యుండును. సారంగధరకథ విశ్వసనీయ మైనను గాకపోయినను నీయాంధ్రశబ్దచింతామణి నన్నయభట్టుచే రచియింపఁబడినది యని యింతవఱకు విమర్శకులచే నిర్ధరింపఁ బడియే యున్నది.

బాలసరస్వతిచేత రచియింపఁ బడిన యీటీక పండితులచేఁ బ్రమాణ భూతముగా గ్రహింపఁబడినట్లు "ఎలకూచి బాలసరస్వతి సకలభాషాకవి మ హోపాధ్యాయ ప్రణీతాంధ్రవ్యాఖ్యానగ్రంథం బాధారంబుగా రచియింపఁ బూని" అను నప్పకవివాక్యమువలన వెల్లడి యగుచున్నది. అహోబలపండి తుఁడు:-- "టీకా బాలసరస్వతీ కవికృతా శుద్ధాంధ్రవాగ్గుంభితా, సూత్రప్రోత పదార్థమాత్ర కథన ప్రక్షీణశక్తి స్తతః, కస్తుష్యే ద్భువి పణ్డితః కవివరః" అని యితనిటీక శుద్ధాంధ్రవాగ్గుంభిత మై (అనఁగా దోషరహిత మైన యాంధ్రవాక్కు లచే) యొప్పుచున్నను సూత్రమందలి పదముల యర్థము మాత్రమే ప్రకటిం చుచున్న దని యు నందువలన నల్పశక్తిగల (అనఁగాఁ దక్కువ యుపయోగము గల) యీటీకవలనఁ బండితులు తృప్తిఁ బొందఁజాల రనియును జెప్పెను. ఈయహోబల పండితుని వాక్యమునందు సత్యము లేకపోలేదు. కాని, యీ టీక సమస్తాంధ్రవైయాకరణులకును మార్గదర్శక మై యున్న దని చెప్పుట కెంతమాత్రము సందేహము లేదు.

ఇతఁడు తనటీకను భాష్యమని "ఆంధ్రవ్యాకరణ భాష్యనిబంధ నోత్సు కుఁడనై" అనువాక్యముచే వ్యవహరించియున్నాఁడు. సామాన్యముగా భాష్య లక్షణము–"సూత్రార్థో వర్ణ్యతే యత్ర వాక్యైః సూత్రానుకారిభిః। స్వపదానిచ వర్ణ్యన్తే భాష్యం భాష్యవిదో విదుః" అని చెప్పఁబడి యున్నను నిది భాష్యమను వ్యవహారమునకుఁ దగియుండ లే దని చెప్పవచ్చును. సంస్కృతవ్యాకరణమహా బ్ధిని నాలోడించిన పతంజలికృతవ్యాఖ్యానమునకును దత్త్వప్రతిపాదక మగు శంకరాచార్యకృత బ్రహ్మమీమాంసా సూత్రవ్యాఖ్యానమునకును నట్టి యాఖ్య తగి యున్నది.

బాలసరస్వతీయము నందలి పీఠికలోని మొదటపద్యమునందు "తెలుఁగు వ్యాకరణంబు" అని కలదు. "సంయుక్తే సంస్కృతాద్యై స్స్యా త్సర్వ మాంధ్ర

పదం లఘు" అనుదానినిబట్టి "తెలుఁగు" అనుపదములోని యంత్యవర్ణము గురువు కాదు గురువు కానిచో ఛందోభంగ మగును (శ్రీనాథుని హరవిలాసములో "సెట్టిశేషండు" (ఆ 2.ప 8) అని యేతాదృశప్రయోగమును గలదు. ఇవి ప్రమాదపతితము లని చెప్పుటయుక్తము. తెలుఁగువ్యాకరణము అనునది సాధువుగాఁ జేయవలయు నన్న "తెలుఁగా వ్యాకరణంబు" అని కాని, తెలుఁగున్ వ్యాకరణంబు" అని కాని దిద్దవలయును "తెలుఁగున్ వ్యాకరణంబు"అను దానిలో నకారపుఁ బొల్లు వ్రాఁతపొరపాటువలనఁ బోయిన దేమో యనియు నూహింపఁదగును.

ఆంధ్రశబ్దచింతామణి చాలకాల మడఁగి యుండిన కారణముచేత దాని యం దనేకము లగు పాఠభేదములు సంభవించెను బాలసరస్వతి గ్రహించిన పాఠ మొకవిధముగను, అప్పకవి గ్రహించినపాఠ మొకవిధముగను, గనఁబడుచున్నది. అహోబలపతి నన్నయభట్టీయమున కనేకపాఠభేదము లగపడుచున్నవనియుఁ దానుమాత్రము బాలసరస్వతి యంగీకరించినపాఠమునే స్వీకరింతు ననియు వ్రాసెను దీనినిబట్టి యప్పకవీయపాఠములు ముఖ్యములుగా లే వనుసంగతి సూచిత మగుచున్నది. సూత్రక్రమములోఁ గూడ భేదము లున్నవి.

"ఏతా స్సంజ్ఞా స్సర్వా జ్ఞాత్వా పశ్చాత్ప్రవర్తయే దత్ర"-ఇది యప్పకవీయములో "స్థిరా ఇతరే" అనుసూత్రము తర్వాత నున్నయది. ఈసంజ్ఞలను దెలిసికొని యిందుఁ బ్రవర్తింపవలయు నని దీనియర్థము. ఇట్లు చెప్పుటవలనఁ బ్రత్యేకప్రయోజన మేమియు లేదు గావున బాలసరస్వతీయములో నిది లేకున్నను నిర్బాధకము.

"బాలేందుపరిధి" ప్రభృతిలిప్యుద్ధారకశ్లోకములు-ఇవి బాలసరస్వతీయములోఁ జూపట్టుట లేదు. అథర్వణాచార్యులు తనకాలమునకు మాఱిన లిపి ప్రకారము "పంచవర్గాదయోవర్ణాః" అనుశ్లోకములచే సంస్కరించి యుండుటచే నథర్వణుని కంటెఁ బూర్వుఁడగు నన్నయభట్టు "బాలేందుపరిధి" మొదలగుశ్లోకముల రచించి యుండె నని యును నవి ప్రక్షిప్తములు కా వని యును దోఁచుచున్నది. "పంచవర్గాదయోవర్ణాః" అను నథర్వణశ్లోకములు "బాలేందుపరిధి"అనుశ్లోకములకు శేషపూరకములు. అప్పటి లిపికి లిప్యుద్ధారకశ్లోకోక్త లిపికిని సరిపడ కుండుటచేఁ గావలయు బాలసరస్వతి "బాలేందుపరిధి" మొదలగుశ్లోకములను విడిచియుండును అతనికి దొరకిన ప్రతిలో నవి లే వేమోయని కూడ ననుకొనవచ్చును.

"ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః ప్రకృతేస్తు తేదశోనాస్యాః సప్తత్రింశదిహ"

ఇది యప్పకవీయపాఠము. బాలసరస్వతీయములో "సప్తత్రింశదిహ"అను చోట "షట్త్రింశదత్ర'' అని కలదు. అక్షరపరిగణనములోఁగూడ "యరయుగ లయుగ సవహాళ్చ హాలః" అని యప్పకవీయములో నుండఁగా ''యరలవసహ ళంతు హాల్వర్గః" అని బాలసరస్వతీయములో నున్నది. "సప్తత్రింశ దిహ" అను పాఠమును గల్పించి యప్పకవియో మఱి యొకరో, నన్నయభట్టు, అలఘులకారమును (ళ) గ్రహించి యలఘురేఫమును (ఱ) విడిచి యుండఁ డను నుద్దేశముతో ''రయుగలయుగ" అని లఘ్వలఘు రేఫములను గూడ సూత్రములోనే స్థూలదృష్టితోఁ జేర్చి యుండవచ్చును. నీళ్లు మొదలగువానిలోని బహువచనమందలి ళకార మలఘులకారము. తల, నెల మొదలగువానిలోని లకారము లఘులకారము. ఇఁకఁ- దళుకు, బెళుకు-ఇత్యాది పదస్థ స్వతస్సిద్ధ ళకారములు వర్ణాంతరములు కాని యలఘులకారములు కావు. కనుక నీవర్ణాంతర మగు ళకారమే "యరలవసహాళంతు హాల్వర్గః" అనుదానిలో గ్రహింపఁబడెను. అలఘురేఫము గ్రహింపఁబడనియట్లే యలఘులకారమును గ్రహింపఁబడలేదు. ఈగూఢాశయముఁ దెలిసికొనలేక యెవరో పైపాఠమును గల్పించి యుందురు. "షట్త్రింశ దత్ర" అనుపాఠమునందే సామంజస్యముగనుపట్టుచున్నది.

''వికృతిపదాదౌ ప్రథమా స్తస్థ తృతీయానునాసికౌ న స్తః''

ఇయ్యది బాలసరస్వతీయములో లేదు. ఇదియుఁ బ్రక్షిప్తపాఠమే. ఈపాఠమున కనుసారముగా "అద్యః క్రియాసు భూతార్థ ద్యోతిన మాద్యగం వినా సర్వః" అను పాఠములోని ''ఆద్యగం వినా"అను దానిని దొలఁగించి "భూతార్థ సముద్ద్యోతినం వినా సర్వః'' అను పాఠమును గల్పించుటలో నన్నయమతమున నాదియందు యకారము లే దనియు నన్నయయే యచ్చ తెనుఁగు పదముల మొదట యకారణకారము లుండ వని చెప్పె ననియు వారి యభిప్రాయము. కాని, వారికల్పనమున కనుసారముగ "సర్వ త్రాజ్వ త్త్వార్యం యస్యద్రుత ప్రకృతికేభ్యః" ఆదియందు యకారము నంగీకరించిననే కాని యీసూత్రము కుదురదు. కనుక నాదియందు యకార మున్నదనియే నన్నయయభిప్రాయము. మఱియు నాదియందు యకారము నంగీకరించి యుండుటచేతనే యథర్వణుఁడును "వికృత్యాదిగతో యోऽత్ర స్యాచ్ఛబ్దాన్తరయోగతః, ప్రాణమాత్రావశేష స్స్యా దత్ర శ్రీకవిసమ్మతేః" అని చెప్పియున్నాఁడు. "వికృత్యా

దాథవే న్నణః" అని యథర్వణుఁడు చెప్పుటచే నన్నయభట్టు ణకారమునుగు ఱించి చెప్పినట్లు కూడ స్పష్టపడుచున్నది గదా. నన్నయభట్టు చెప్పియుండిన నథర్వణుఁడు పునరుక్తముగాఁ జెప్పియుండఁడు.

"అయిగవుగాదేశౌ స్త్రః క్రమేణ వక్రతమయోరాద్వౌ"-ఇది యప్పకవీయ పాఠము. దీనికి బాలసరస్వతి "వాయి రవు ర్వక్రతమా" అను పాఠము నంగీక రించెను. పైనివ్రాసిన యప్పకవీయపాఠములో - ఐ, ఔ లకు అయి, అవులు వచ్చు నని యర్థము చెప్పితీఱవలయును. "వాయిరవుర్వక్రతమా" అనుపాఠ ములో అయి, అవులకు-ఐ, ఔలు వచ్చునన్న యర్థము గూడఁ జెప్పవచ్చును. పైసూత్రములో బాలసరస్వత్యప్పకవులు వక్రతమములను స్థానులుగను, అయి, అవుల నాదేశములుగను జెప్పి-ఐర, అయిర, ఔర, అవుర, యని యుదాహ రించి యున్నారు. ఇట విమర్శింపఁగా, ఐర, ఔర, యనునవి యగుధాతువు మీఁదనైన రూపములు. "క్వచి ద్గకా రో వః" అని వకారము రాఁగా, "అవు" నని యగును. అయి, అయిర, యనురూపములు నగుధాతువురూపము లే. కావున, అయిర, అవుర, అనునవియే ప్రకృతులు. ప్రకృతుల కాదేశములు చెప్పఁదగును, గాని, వికృతములకుఁ జెప్పుట తగదుగదా. పోనీ, "ఔ" ధా తువే ప్రకృతి యందమన్నఁ దెలుఁగున నుదంతధాతువు లే కాని యితరములు లేవు. ఆంధ్రభాషాసంప్రదాయవిరుద్ధముగా నీధాతువు నొక్కదానినే యౌకా రాంతముగా నంగీకరించుట యుక్తము గాదు. కాన, అయి, అవు లే ప్రకృతు లనియు-ఐ, ఔ లే యాదేశము లనియుఁ జెప్పవలయును. అందుచేత "వాయి రవు ర్వక్రతమా" అను పాఠమే శబ్దశాసనుల సమ్మతమై యుండును. అయినను నీసూత్రము దగ్గఱఁ బూర్వవ్యాఖ్యాతలందఱును బొరపడియున్నారు. అహోబ లుఁడు మాత్రము రెండువిధములుగను వ్యాఖ్యానముచేసెను.

" అద్యః క్రియాసు భూతాద్యర్థ సముద్ద్యోతినం వినా సర్వః" ఇది య ప్పకవీయ పాఠము. బాలసరస్వతీయములో " భూతార్థద్యోతిన మాద్యగం వి నా సర్వః " అని కలదు. " వికృతిపదాదా ప్రథమాంతస్థతృతీయానునాసికౌ న స్తః " అనుదానినిబట్టి యీకారికలోని " ఆద్యగం " అనుదానిని దీసివేసి " భూతాద్యర్థసముద్ద్యోతినం " అని దిద్దంబడె నని పూర్వము చెప్పియుంటిని. "సర్వత్రా జ్వత్ర్తార్యం యస్య ద్రుతప్రకృతికేభ్యః " అను దానిని దీసివేయ మఱ చుటచేఁ బూర్వపరవిరోధము ప్రాప్తించినది. "ఆద్యగం" అను దళముచే నా

దియందు యకారసిద్ధి గలుగుచున్నది. కాననే "సర్వత్రా జ్వత్త్వార్యం" అను సూత్రముచే నచ్ఛార్యము విధింపఁబడియెను. లేకున్న నీసూత్రము వ్యర్థము. మఱియు "అద్యః క్రియాసు" అనుసూత్రమునకు "యెవఁడు, పోయెన్" ఇత్యాదులం దెత్వమే కాని యత్వము (అ) గా దని సందేహనివారణమే ప్రయోజనము. కాని, యకారము మీఁద నెచ్చటెచ్చట నెత్వము కలదో చెప్పుటకుఁ గాదు. కానఁ "బోయెడి" ఇత్యాదుల నీసూత్రముచే సాధింపవలసిన యవసరము లేదు. మఱియు నత్వవిధానమే యైనచోఁ "జెయుపు"-ఇత్యాదుల నుత్వాదులు దుష్టము లనవలసివచ్చును. లోకముగోఁ-బోయెన్-ఇత్యాదులం దత్వభ్రాంతి గలుగుచుండుటచేతనే "అయ్యో! నాసుతు గ్రగ్గ యెత్తుకొనిపోయన్" (వేంకటనాథుని పంచతంత్రము) ఇత్యాద్యపప్రయోగములు సంభవింపవలసి వచ్చెను. కాన నప్పకవిపాఠము కల్పిత మనకతప్పదు.

"క్వచిదపి నస్త ఉదోతౌ దన్త్యోష్ఠ భవస్య వికృతిశబ్దాదౌ"-ఇదియుఁ గల్పితమే. ఇది బాలసరస్వతీయములో లేదు. నన్నయభట్టెచ్చటెచ్చట సంశయము గలుగుచుండునో యచ్చటచ్చటనే ప్రత్యేకవిధి చేసియున్నాఁడు. తెలుఁగుపదముల మొదట లేనివర్ణములం జెప్పుట యతని యుద్దేశము గాదు. అట్లే చెప్పఁ దలఁచుకొన్నచో "ళ" మొదలయినవి కూడ మొదట నుండవని చెప్పియుండును.

"శుభవర్ణాః శుభశబ్దాః" ఇది మొదలుకొని "సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః" అనునంతవఱకు నివి బాలసరస్వతీయములో లేవు. ఛందశ్శాస్త్రమును ముఖ్యముగాఁ జెప్పఁ దలఁచినవాఁ డగుటచే నప్పకవియో మఱియొకరో వీనిని జేర్చి యుందురు. ప్రధానముగ వ్యాకరణవిషయములఁ జెప్పఁ దలఁచుకొన్న నన్నయభట్టు వ్యాకరణమున కుపయోగింపని ఛందశ్శాస్త్రవిషయములు నింతగాఁ జెప్పి యుండఁడు. బాలసరస్వతీయములో "ఇంద్రాద్యా అపిచ గణాః" అని ఛందస్సున గుఱించి యొకశ్లోకము మాత్రము గలదు ఇది నన్నయ చెప్పి యుండును. ఇట్లు చెప్పుట యతనికి సహజమై యున్నది.

"ధాతుపదసమ్భవానాం విశేషణానా ముత స్త్రధాను మచి" ఈయప్పకవీయపాఠమును బ్రక్షిప్తమే. నన్నయభట్టుమతమునఁ దద్ధర్మక్రియలును దద్ధర్మక్రియాజన్యవిశేషణములును ద్రుతాంతములు. కావుననే, "నస్యా త్తద్ధర్మతః" అనుదానిచే "రక్షించు నంబ" ఇత్యాదుల సంధి నిషేధింపఁబడినది. తద్ధర్మ మనఁ దద్ధర్మక్రియయుఁ దజ్జన్యవిశేషణమును.

## బాలసరస్వతీయపీఠిక.

"బో రద్భుతశబ్దాక్షే"—ఇది బాలసరస్వతీయములో లేదు. నన్నయభట్టు లక్ష్యసాధనమును దిక్ప్రదర్శనముగ మాత్రము చూపి యున్నాఁడు. అందును సామాన్యము లగువానినే చూపెను గాని ప్రత్యేకముగ నొక్కొక్కశబ్దమును సాధించినట్లు గన్పట్టదు. ఎక్కడనయిన సాధించినను నావ మొదలగు సంస్కృతసమరూపములను మాత్రము సాధించెను. కాన నొక్క యబ్రమను శబ్దముయొక్క నిష్పత్తికై సూత్రరచన చేసియుండఁడు. "అన్యేషాంచప్రయోగమహితానాం" అనుదానిచే నీరూపముకూడ సిద్ధించును. పోనీ, యీరూపమును సాధించెననుకొందమన్నను సజాతీయము లగు కప్రము మొదలగురూపముల నేల సాధింపలేదు దానికిఁ గూడ నొకసూత్రము వ్రాయవలయును గదా! కావున నబ్రము కపము మొదలగునవి "అన్యేషాం చ ప్రయోగమహితానాం" అనువానిచేతనే సాధించుకొనవలయు నని నన్నయ యభిప్రాయమై యుండును, గనుక, నిది ప్రక్షిప్తము.

"వికృతిపదే [illegible]టోరపి" ఈయప్పకవి పాఠమును ప్రక్షిప్తము— ఈ సూత్రమున కుదాహరణములు- అట్లు, ఇట్లు, ఎట్లు- ఇవి "డలటాముదితాం లుక్స్యాత్" అనుదానిచే సిద్ధించును.

"నుమ్యోతో మ ల్యథర్వణాచార్యమతాత్"- ఇది బాలసరస్వతీయములో లేదు. అథర్వణాచార్యుఁడు నన్నయతర్వాతివాఁ డగుటచే నన్నయయథర్వణ మతప్రదర్శనము చేయుట సంభవింపదు. కాన "నుమ్యోతః పరుషాణాం "అను బాలసరస్వతీయపాఠమే సరి యైనది.

"లోపో వాస్యాత్తేషా మితశ్చ తద్వ త్త్రివిక్రమ మతేన"- అని యప్పకవీయములోమాత్ర మున్నది. దీనియర్థము "డలటా ముదితాం తస్యచవా లుక్" అనుదానిచేతనే సిద్ధించుచుండ నిట్లు పునరుక్తముగ నన్నయ సూత్రము రచియించియుండఁడు. త్రివిక్రమ మత ప్రదర్శనమే ఫలమన్నచో "డలటాముదితాం" అనునది యనావశ్యకము.

ఇట్లు ప్రక్షిప్తపాఠము లసంగతముగ నప్పకవీయమునఁ జూపట్టుచున్నయవి. బాలసరస్వతి గ్రంథము నాధారముగఁ దీసికొని కూడ నప్పకవి యేల పొరపడెనో తెలియదు.

పూర్వవ్యాకరణకర్తలు తఱచుగఁ దాము ప్రమాణముగ గ్రహించిన వ్యాకరణగ్రంథములనుండి తదుదాహృతలక్ష్యములనే యుదాహరించుచు నిత

రవిషయములందుఁ గూడ వారి ననుసరించుట యొక యాచారమై యున్నది. అట్టియాచారముచొప్పున నే యప్పకవ్యహోబలపండితులు బాలసరస్వతిటీక నే చాలవఱ కనుసరించి యున్నారు.

"కేవలతయా నుసర్వ త్వ్యథేచ యేయం యథా తథా భాషా"- కొన్ని తెలుఁగుమాటలు సంస్కృతమునకే ప్రత్యేకముగాఁ దద్భవతత్సమము లౌను. అది యెట్లంటేని సముద్రమునకు సంగ్రము, చంద్రునకుఁ జందురుఁడు, మొద లైనవి-ప్రాకృతమున కైన సముద్దము, చందుఁడు, అసిరావలయును. అని బాల సరస్వతి. సంజ్ఞా. 3 శ్లో.

" తెలుఁగు లొక్క కొన్ని దేవతాభాషనె, తద్భవంబు లగుచుఁ దనరుచుండు
ధరణిఁగొన్ని ప్రాకృతమున నే యగుచుండుఁ, దెలియవలయు వాని తెలుఁగులెల్ల.
"ప్రాకృతమునంటకనిలింపభాషనయ్యెఁ, దజ్జముసముగ్రమునకుసంద్రంబటంచు
నాకసద్భాష నంటక ప్రాకృతమున, నైనచో దానిని సముద్ద మనఁగవలదె.
(అప్పకవీయము 1ఆ-192 ప.)

ఇంక లక్ష్మికి లచ్చి ఖడ్గమునకు కగ్గము మొదలయినవి సంస్కృతమును ముట్టక ప్రాకృతమునకే తద్భవములైనవి- (బాలస-సంజ్ఞా- 3. శ్లో.)

క. నాకులభాషను ముట్టక, ప్రాకృతమున లక్ష్మిదాఁ బరఁగు లచ్చియనన్,
నాకోక్తి యైన లక్ష్మికిఁ, బ్రాకటముగ లక్కిమి యని పలుకఁగవలదే-
(అప్పక. 1 ఆ. 193.)

"వించున్నాము, ఘటింపఁగలఁడు, చనఁడు- అనెడివి తిఙర్థ్యములు కాకున్నను బ్రథమాసమానములు గనుక సున్నలోనివే గానే తెలియునది-" (బాలస- సంజ్ఞా- 14 శ్లో.)

గీ. నవ్వుచున్నాఁడు వచ్చుచున్నాఁడు వాఁడు
మనఁగలఁ డటన్నఁ దిఙర్థ్యమంబు లెందుఁ
గాకయును బ్రథమలలోనఁ గలసి సరసి
జాతనేత్ర కళాప్రదేశంబు లగును- (అప్పక-5 ఆ. 30ప )

"వించున్నాఁడు, ఘటింపఁగలఁడు, చనఁడు, ఇత్యాదీనాం తిఙర్థ్యమ త్వాభావేపి ప్రథమాసమత్వేన సంగ్రహణ మితి జ్ఞేయః"- (అహోబల 171 పుట.)

"తస్యస్యాశ్చ పూర్ణబిన్దు రపి"-"బిన్దురపి" యని యపి శబ్దము పెట్టినం దుచేతఁ గొన్నిచోటులరాదు- చనుచు, ఎన్నుచు, పూనుచు-(బాలస-సం-3 శ్లో)

క. చనుచును, బూనుచు, నెన్నుచు, ననుకొన్నిటఁదక్క- (అప్పక- 5-18.)

అపిశబ్దాత్, చనుచున్, ఎన్నుచుఁ, పూనుచు న్నిత్యాది నైవ తత్కార్య మితి జ్ఞేయం- (అహో. 196 పుట)

"మహతోనితో విభక్తౌ టా దా వచనద్వయే క్రమేణ స్తః-" తృతీయా దా యనక టాదా యని యేకవచనప్రధానముగా నిర్దేశించినాఁడు గనుకనీ కార్య మేకవచనములకే యవశ్యము. బహువచనములకును అమహత్తులకును లాగమము వచ్చు నని జ్ఞాపకము. (బాలస. అజన్త- 6. శ్లో.)

అత్రేయం చిన్తా విభక్తా వి త్యేకవచనే నాయ మర్థో జ్ఞాప్యతే నేదేవ ఏకత్వార్థస్య మహతినియమః, బహుత్వార్థకస్య లఘృతు అమహతోపి టాదివిభక్తౌ ప్రాప్తి రస్తీతి, "అన్నలతోనరిగె దయ్య యనుపులకు" నిత్యాదీ న్యాచార్యస్య ప్రయోగశతాని— (అహో. 261 పుట.)

ఔపవిభక్తికలీనా మిల్లుక్ తన్నైవ మశ్చస్యాత్- పెండిలి, ఔపవిభక్తికము గాకున్నను వచ్చెను. పెండిండ్లు— (బాలస-అజన్త-19 శ్లో)

పెండిలి, పెండిండ్లు- అనౌపవిభక్తికత్వేప్యత్ర ప్రవృత్తిః- (అహో. 341 పుట)

ఇద మద సేత ద్యత్త చ్ఛబ్దాశ్శబ్దాన్తరాన్వయే బహుళం
హ్రస్వం ప్రపద్య దీర్ఘా ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి-
శబ్దాంతరము లేకున్నను, ఏది, ఎద్ది, అనుచోట వచ్చును. (ద్విత్వమని భావము) (బాలస- హలం- 9 శ్లో.)

బహుళగ్రహణా దేకాక్షరేపి ద్విత్వం, ఎద్ది, అద్ది, ఇద్ది, ఇత్యాది. (అహో- 401)

పునరాగమః క్రియాణాం- క్రియాణాం= క్రియలకు, పునరాగమః= విశేషాగమమువచ్చును, ఇక్కడఁ బునశ్శబ్దము విశేషార్థవాచకము- ఉదాహరణము- "అవధరింపుమా" అనుచోట, అవధారు అనిపదము- (బాల-క్రి14శ్లో)

పునరాగమః క్రియాణా మిత్యుక్తేః పున రపూర్వే విశేషే చేతి పునరవ్యయార్థవిజ్ఞానాత్. విశేషాగమః క్రియాణా మితి తదర్థః అత ఏవ అవధారు దేవి ఇతి రూపం నిర్బాధం, అవధరింపుము ఇతి తదర్థః. (అహో. 468 పుట.)

నావుడు, అడ్డమగుడు- ఇత్యాదిరూపములు వర్తమానార్థమందు, ఇంచుగాగమము లేకయే "లటి డుజ్ స్యాత్" అని డుజ్జు వచ్చిన నయిన వన్నితెలిసికొనునది. (బాలస- క్రియా. 53 పుటం.)

అనవుడు, అడ్డమగుడు- ఇత్యాది తత్ప్రయోగాత్ అనేనైవ సూత్రేణ (వ్యతిరేకార్థేల్యటి లటిడుజ్స్యాత్ అనుసూత్రముచే) తత్రవర్తమానార్థేడుజ్ భవతీతి ధ్యేయం (అహో-477 పుట) "అనవుడు- ఇత్యాదికము సందర్భపూర్ణమై కనిపింపదు." అని పరిష్కర్తలు వ్రాయుట యవిచారమూలకము. (చూడు. అహో. 477 పుట)

ఇట్లే యనేకస్థలములందు బాలసరస్వతిని, అప్పకవ్యహోబలు లనుసరించి యున్నారు.

అహోబలపండితుఁడు బాలసరస్వతి చేసినవ్యాఖ్యనే యవలంబించుచు నథర్వణకారికల నాయాచోటులఁ బ్రమాణముగాఁ జూపుచు నితరవిషయ విమర్శనము నెక్కుడుగఁ జేసియున్నాఁడు. కాని బాలసరస్వతి చేసిన వ్యాఖ్యానమును దిరస్కరింపలేదు. బాలసరస్వతికి నహోబలపండిత ప్రభృతులకును వ్యాఖ్యానములో విప్రతిపత్తి లేకున్నను లక్ష్యములలో మాత్ర మక్కడక్కడ విప్రతిపత్తి చూపట్టుచున్నది. బాలసరస్వతి "జూదశబ్దము శౌరసేనికే తద్భవము "(సంజ్ఞా 3 శ్లో)'' అని జూదశబ్దమును శౌరసేనీతద్భవముగా వ్రాసెను. ఇట నహోబలపతి జూదశబ్దము శౌరసేన తద్భవము గాని శౌరసేనతద్భవ తద్భవము గాదని ''ఏవంస్థితే జూదశబ్దః శౌరసేనీతద్భవ ఇతి సరస్వత్యోక్తంత ద్విచారమాంద్యేనైవ ఏవ మన్యేపిజ్ఞేయాః" (అహో 271 పుట) అని ఖండించియున్నాఁడు. ''దస్తస్య శౌరసేన్యా మఖోరచో స్తోః'' అను సూత్రముచే శౌరసేనభాషాభవ మైనపుడు దకారము విధింపఁబడినది. ద్యూతశబ్దమునకుఁ బైసూత్రముచేఁ దకారమునకు దకారము. ''ద్యర్యోర్జః' అను సూత్రముచే ద్యకారమునకు జకారము. ప్రాకృత ప్రకాశములోఁ గూడ ''త్యథ్యద్యాం చఛజాః (ప్రాకృత. ప్రకాశ. 2. పరిచ్ఛే 27 సూ.) అనుసూత్రముచే ద్యకారమునకు జకారమును, శౌరసేనీ (ప్రాకృ. ప్రకాశ. 12. పరి. 1) అను నధికారములోని ''అనాదావయుజో స్తథయోర్దధా" (ప్రా. ప్రకాశ. 12 పరి. సూత్రము 3) అను సూత్రముచేఁ దకారమునకు దకారమును విధింపఁబడెను. ఇట బాలసరస్వతి శౌరసేనతద్భవమనుటకుబదులు "శౌరసేనికే తద్భవము'' అని పొరపాటున వ్రాసె నని తోఁచెడిని. జూదశబ్దము ప్రాకృతభాషా భేద మగు శౌరసేనియం దుండును. దానిని దత్సమముగాఁదెలుఁగులోనికిఁ దీసికొనవలయు నని యహోబలుని యభిప్రాయమై యుండును.

ఔపవిభక్తికసంజ్ఞావర్ణా ష్టింట్యాదయో భవన్తిహ
రల్యాదే ర్నామ్నాం స్యు స్తేహి విభక్తౌ సమాసేచ.

అను సూత్రములో బాలసరస్వతి "త్రాకునందు, విభక్తియందు లేదు. (ఔపవిభక్తిక మని భావము) త్రాటిచెట్టు సమాసమునఁ గలదు." అని చెప్పెను. త్రాడు అనుచో రేఫ మచ్చుపొరపాటు. తాళార్థకశబ్దము "తాడు" అనియే యుపలభ్య మగుచున్నది. ఇచ్చోటనే యహోబలపతి "తాటికి, తాటిచెట్టు" అని విభక్తిసమాసముల రెంటను ఔపవిభక్తికము వచ్చు నని చెప్పియున్నాఁడు. వ్యవహారములోఁగూడ నౌపవిభక్తికము వినఁబడుచున్నది. ఒక విభక్తిలో నౌపవిభక్తికము వచ్చి మఱియొకదానిలో రాకపోవుటయుండదుగదా. కనుక బాలసరస్వతి యట్లు వ్రాయుట ప్రామాదిక మనియో లేక యప్పటి తన వ్యవహారమును బట్టి చెప్పె ననియో యనవలయును.

"నిత్యందారాదేశ్చ స్యాల్లో ర్లులయో రురౌచతత్ర స్తః."

అనుసూత్రములో బాలసరస్వతి "ఆండ్రు, జవరాండ్రు, కోడండ్రు" అని యుదాహరించి "వాండ్రు, వీండ్రు, విలుకాండ్రు" అనుస్థలముల డకారము మును పేయున్నది. దారాదులలోనివిగనుక రురలువచ్చెను" అని వ్రాసెను. అహోబలపతిమాత్రము దారాదులకు "ఆండ్రు, జవరాండ్రు, చెల్లెండ్రు, కోడండ్రు" అని యుదాహరించి "అత్రాథర్వణః ప్రాహ- నిత్యం లులౌ రురౌ స్యాతా ముల్లో పో బహులతా డుజః- వాండ్రు, వీండ్రు, అల్లుండ్రు, గండండ్రు"అని యుదాహరించెను. విలుకాండ్రు అనుచోట "కాఁడు ర్గాఁడు ర్భవే దీఁడు రస్తిత్యాద్యర్థయో స్తయోః పుంసి రురౌ మతౌ" అనుదానిచే "విలుకాండ్రు" అగు నన్న యుద్దేశముతో "వన్నెకాండ్రు" అని యుదాహరించెను. అథర్వణుఁడు ప్రత్యేకముగాఁ జెప్పుటచే వాండ్రు మొదలగునవి దారాదులలోఁ జేరవు. ఆలు- అనుదానికిఁ జెల్లెలు, కోడలు, మఱఁదలు-ఇత్యాదులు సజాతీయములు కాని, వాఁడు వీఁడు- ఇత్యాదులు కావని విమర్శకులకుఁ దోఁపకమానదు ఇట బాలసరస్వతి లక్ష్యసాధనమే ప్రధానముగా నెంచినట్లు తోఁచుచున్నది.

ఎచటనెచట నన్నయ యేయభిప్రాయముతో సూత్రరచనము చేసియుండెనో యచటనచట బాలసరస్వతి యాయభిప్రాయమునే వ్రాసి యున్నాఁడు. "సర్వత్రాజ్వత్తార్థ్యం యస్య ద్రుతప్రకృతికేభ్యః లుక్సం శ్లేషౌనాచి" అనుచోట బాలసరస్వతి "కలిగెనెమ్మె, సిరికినెద అని యుదాహరించి "కలిగె న్యెమ్మె" అను

సంశ్లేషము గాని "కలిగెమెన్మి" అనులోపము గాని లేదాయెను. ఆద్యగయ కారము గనుక యెత్వము వచ్చినది. ఓయీ యెత్వమురాఁ జెప్పనేల? అజ్వత్తార్యము వచ్చు ననేల? ఆదిమునందు యకారము లేదు. అచ్చే యయినఁ జాలదా యుండేఁ జాలదు. ప్రయోజనాంతరము లేకున్నను నుచ్చారణ విరోధముగుచున్నది. కనుక యెకార మకారము కానేరదు." అని (బాలసరస్వ. సంధి 9 శ్లో) నన్నయ్య యేయభిప్రాయముతో "అద్యఃక్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః" అని సూత్రించి, "సర్వత్రాజ్వ త్తార్యం యస్య ప్రత ప్రకృతికేభ్యః" అను సూత్రమును వ్రాసెనో స్ఫుటముగాఁ దెలియఁబఱిచెను. కాని యిట "సర్వత్రాజ్వత్తార్యం యస్య" అని యొకసూత్రముగను, "ప్రత్యః కృతికేభ్యః లుక్సంశ్లేషౌ నాపి" అని యొకసూత్రముగను జేయుట నన్నయాభిప్రాయ మగు నని తోఁచెడి. అపుడు "అతఁడు + యెవఁడు = అతఁడెవఁడు-ఇత్యాదులందు నజ్వత్తార్యము సిద్ధించును. ఇటులే బాలసరస్వతి నన్నయాభిప్రాయముల సరిగా వెల్లడిపఱిచి యున్నాఁడు. విస్తరభీతిచే నచ్చట కీ ద్యోక యుదాహరణమే చూపఁబడినది.

కాని యితని టీకయందు నక్కడక్కడ స్ఖాలిత్యములు చూపట్టుచున్నవి. "అహమాదీనాం ద్విత్వం లోపో నను ఆదికే విసర్గస్య" అనుదానికి "అహం మొదలైనవి యనుకరించునప్పుడు వానియంత్యములకు ద్విత్వము వచ్చును. సున్నకు ద్విత్వము రానేరదు గనుక మకారము చేసికొనునది. అహమ్మని, కిమ్మని, ధుఙ్మని (బాలస. సంధి-శ్లో 5) అని వ్రాసెను. సంస్కృతమునందుఁ బదముల చివర సున్న యుండదు. సంస్కృతవ్యాకరణమున "మోనుస్వారః" అను సూత్రముచే హల్లు పరమగునపుడు మాంతపదములకు బిందువు విధింపఁబడినది. కాన హల్లు పరముగా నున్నపుడే సున్న యుండును. అహమ్ + అని యున్న ద్విత్వము వచ్చి "అహమ్మని" అని యగును. కాన "సున్నకు ద్విత్వము రానేరదు. కనుక, మకారము చేసికొనునది." అని వ్రాయుట ప్రామాదికము. "అహమ్, కిమ్ అను సంస్కృతపదములనే యనుకరించుచుంటిమి గానఁ జివర మకారమే యుండును.

అజంతపరిచ్ఛేదములోని "డు ము వు లవః ప్రథమాస్యాత్" అను శ్లోకములఁ దెనుఁగు పద్యములుగ వ్రాయుచు "ఓయీ త్వామన్త్రణంచ విక్రుతౌ స్యాత్" అను దానికి "ఓయి యనఁగ సంబుద్ధి యాంధ్రోక్తులందు" అని తెలిఁ

గించెను. మూలములోని యామన్త్రపదమునకు సంబుద్ధి యనుపదమును వా
డెను ఆమన్త్రమనుపదము సంబోధనమునకు వర్తించునుగాని "సంబుద్ధి"యను
పదముమాత్రము "ఏకవచనం సంబుద్ధిః" సంబోధనే ప్రథమాయా ఏకవచనం
సంబుద్ధిసంజ్ఞంస్యాత్, అను సూత్రముచేత సంబోధన ప్రథమావిభక్తియొక్క యే
కవచనమునకు మాత్రము సంజ్ఞ కాని ప్రథమావిభక్తి కంతకును సంజ్ఞ కాదు.
అథర్వణుఁడును "వికృతౌ వత్ర వాలోప స్సంబుద్ధ్యోయుపదేతు యేః" అని
సంబుద్ధియందలి యోయిపదముయొక్క "యి" యనువర్ణమునకు లోపము
చెప్పెను. ఇచ్చట ను బయికితిగనే సంబుద్ధిపదము వాడఁబడినది యిలోప
మును బొందిన యోయిపదమునకు "ఓరాములార, అని బహువచన ముండి
యోయిపదమునకు లేదనుట యుక్తము గాదు. రెండువర్ణములు, వచ్చినప్పుడు
నిల్చే కనుకనే; "ఓరీ దుష్టవిశాటులార! అను మొదలగు రూపములు సాధు
వులు. "ఓయి రాములార" అనియు ననవచ్చును. వైయాకరణసంప్రదాయ
మున రూఢ మగు "సంబుద్ధి" పదమునే గ్రహింపఁదగును గాని సామాన్యము
గా క్తిన్ప్రత్యయాంత రూపమును గ్రహించి వ్యుత్పత్త్యర్థమును మాత్రము
గ్రహించుట యుక్తము గాదు. వ్యుత్పత్త్యర్థమునే గ్రహింతు మని యాగ్రహము
యినచో దోషము లేదు.

"ఇదుపోత్తమోత్తమానాం బహువచన ఉపోత్తమే త ఉద్వ్యవతి"- దీనికు
దాహరణములు. బలుములు, కలుములు, చెలుములు అయెను. రెండవయు
కారము "ఉద్బహులత్వే" అని వచ్చినది. ఇట్టిలాగుననే వెలుములు, మెలుములు
మొదలైనవి ఇది సాయికలక్షణము అటు గనుక ఇరులు, విరులు ఇత్యాది
స్థలములందు లేదు." అని బాలసరస్వతి వ్రాసెను. ఇట బాలసరస్వతి యుపో
త్తమ పదమున కర్థము చేసికొనుటలోఁ బొరపాటు పడినట్లు తోఁచుచున్నది.
"త్ర్యాదీనా మంత్య ముత్తమం" "తస్య సమీప ముపోత్తమం" అనువానిని బట్టి
మూఁడచ్చులుగల పదములలోఁ జివరి యచ్చు- ఉత్తమము ఆచివరి యచ్చు
నకు సమీపముగా నున్న వెనుకటి యచ్చు- ఉపోత్తమము. (ఇట హల్లులు
పరిగణింపఁ బడలేదు.) ఇకార ముపోత్తమముగను నుత్తమముగను గల
పదములకు బహువచనము పర మగునప్పుడు, ఉపోత్తమ మగు నికారము
నకు నుకార మగునని సూత్రార్థము. నిరి శబ్ద మట్టిదిగాదు గనుక నీసూత్రము
నకుఁ బ్రవృత్తియే లేదు. మఱియు బాలసరస్వతి "ఇసులు" అని యుదాహ

రించుటలో నతనియుద్దేశ మేమో తెలియదు. చివరి లు వర్ణమును జూచి బహువచన మని భ్రాంతిపడి యుండవలయును. ఇరులు అనునది ఇరి యను శబ్దమునకు బహువచన మందమన్న నట్టిశబ్ద మెచ్చటను గనుపట్టదు. ఇరు లనునది చీఁకటి యనునర్థమున నేకవచనాంతశబ్దము. "ఇరులున నొంటిఁబోఁ బరసతి నెట్టుట (విజ్ఞా- ప్రా కాం.) ఇచట నవర్ణక మేకవచనమునందే వచ్చును.

ఈటీకలో నొకటిరెండుచోటుల సరిగా భావము వ్యక్తము కాకపోవుటయు నక్కడక్కడఁ బ్రమాదము లుండుట యుఁ జూపట్టుచున్నది. "నిత్య మనుత్తమపురుష క్రియా స్వితః" అనుసూత్రమున- చనిర పురులు, స్రోచిరమరులు అని యుదాహరించి "ఉత్తమపురుషకైన కొలిచితి నంబను విడిచితి మన్యులను అన్నది (అన్నవియనియేమో) కిమాది గనుక క్రియాగ్రహణమున నంటలేదు- నిత్యం అన్నాఁడు గనుక క్రియాగ్రహణ మనిత్యము" అనువాక్యములను వ్రాసెను. పైవాక్యముల భావ మిట్లు క్లిష్టముగా గ్రహించునది- "నిత్య మనుత్తమ పురుష క్రియా స్వితః" అనుసూత్రముచేఁ బ్రథమ మధ్యమ పురుష క్రియలకు దీనిచే సంధి విధింపఁబడినది. ఉత్తమపురుషమునకు "ప్రాయస్తు స్యాత్త్రిమాదికస్యేతః" అనుసూత్రముచే సంధి ప్రాయికముగా వచ్చును. అనఁగాఁ గొలిచితి నంబను, విడిచితి మన్యులను- అను నుత్తమపురుష క్రియారూపములు కిమాదిలోఁ జేరినవి గనుకఁ గ్రియాగ్రహణమున ననఁగా నుత్తమపురుష క్రియాగ్రహణములో, "నిత్య మనుత్తమపురుష క్రియా స్వితః"అనుసూత్ర మంట లేదు. అనఁగాఁ బ్రవర్తింపలేదు. నిత్యం అన్నాఁడు గనుక క్రియాగ్రహణ మనిత్య మనుమాటకుఁ బ్రథమ మధ్యమ పురుషలలో నిత్యం అన్నాఁడు గనుక నుత్తమపురుష క్రియాగ్రహణ మనిత్యము. అనఁగా నుత్తమపురుషము అనిత్యసంధి విషయకమని భావమై యుండును

క్రియాపరిచ్ఛేదములో 47 వ పుటలో "త్రివిధానా మించుగాగమః" అన్నాఁడు గనుక కొన్ని దేశ్యక్రియలమీఁదను ఇంచుగాగమమురాదు. వచ్చుచున్నాఁడు, కనుచున్నాఁడు, వ్రాయుచున్నాఁడు. ఇత్యాదులు చూచుకొనునది. 'అనిబాలసరస్వతివ్రాసెను. 'త్రివిధానా మించుగాగమః' అనువానిచే మూఁడు విధములైన సంస్కృతధాతువులకే యించుగాగమము వచ్చును గాని దేశ్యక్రియలకుస్వార్థమందున నించుగాగమము రాదు గనుక "కొన్ని దేశ్యక్రియలమీఁదను ఇంచుగాగమము రాదు" అను వాక్యములోని "కొన్ని" అనునది కుదురదు.

కొన్ని యనుచోట నన్ని యని యుండవలయు నేమో. "హేతుమతి చ" అను నుత్తర సూత్రముచేత హేతుమణ్ణిచ్చులయందు, ఆంధ్ర క్రియలయందైనను గాని యించుగాగమమే వచ్చుచున్నది. అను ముందు వాక్యములోని "ఆంధ్రక్రియ లయం దైనను అనుదానిచే స్వార్థమున నించుక్కు రా దనియుఁ బ్రేరణార్థమం దించుగాగమము వచ్చుననియు స్పష్ట మగుచున్నది గదా! కాన నిచ్చటను "అన్ని" యనుపద ముండవలయు నని తోఁచెడిని. అన్ని దేశ్యక్రియలమీఁద ను రా దనఁగా నే దేశ్యక్రియమీఁదను రా దని భావము.

పరిణతి క్రియలను జెప్పుచు బాలసరస్వతి "అథ భూజ్యాదిః పరిణతిః" అన్నాఁడు గనుక, భూసత్తాయాం, జిజయే మొదలైన యజంతహలంత ధాతువులకు (హలంతధాతువులు పరిణతి ధాతువులలోఁ జేరవు గాన నోక్త యజంతధాతువులకే యని చెప్పవలయును. కనుక, హలంతధాతువుల కనుట ప్రామాదికము) వర్తమానార్థ వివక్ష గలుగుచుండఁగా "వర్తమానే లట్" అను వ్యాకరణసూత్రముచేత ల ట్ప్రత్యయము వచ్చి "కర్తరి శప్" అని శ ప్ప్రత్యయము వచ్చి "సార్వధాతుకార్ధధాతుకయోః" అని గుణము వచ్చి "ఏచోయవాయావః" అని అవాదేశము వచ్చిన "భవ" అని యుండ-అనియు వ్రాసి "సా పరిణతి రయవరన్వితైవ భవేత్" అన్న సూత్రముచేత అవ్ అని యంతమునఁ గలది గనుక పరిణతి సంజ్ఞ గలుగుచుండఁగా నుపకృతి ధాతువులయందు వలెనే యించుగాగమము అనుబాధకము డుజ్ మొదలైనవి యన్నియు వచ్చిన నుపసర్గ పూర్వక మైన ప్రభవించుచున్నాఁడు, (బాలస- 47 పుట) అని వ్రాసెను. పైని వ్రాసినట్లు శప్ప్రత్యయము గుణము అవాదేశమును వచ్చిన "భవ" అని యజంత మగును గాని హలంతము గాదు. మఱియు "సాపరిణతి రయవరన్వితైవభవేత్" అను సూత్రముచే యోగ్యతను బట్టి అయ్, అవ్, అర్- అనునవి వచ్చు నని యు నవి పరిణతిసంజ్ఞ కలిగి యుండుననియుఁ జెప్పఁబడెను. శబాదులు వచ్చి నచో "భవ" యని యగును గదా! అపుడు, "సా పరిణతి—" అనుదానిచే అవ్ చేరిన ననిష్టరూప మగును. పోనీ, శబాదులు వచ్చినదానికే యిటఁ బరిణతినామమును వాడుద మన్న నప్పుడు సూత్రములో 'అయావారాన్వితైవ' అని యుండవలసి వచ్చును. కాన, వర్తమానార్థ వివక్ష" అనునది మొదలుకొని అవాదేశము వచ్చిన భవ అని యుండ, అనునంతవఱకు నున్న వాక్యములు యుక్తములై కాన్పింపవు. కాన నావాక్యములను దీసివైచిన మిగిలినవాక్యములు పరస్పర విరోధము లేక యుండును.

బాలసరస్వతి తనటీకలో నక్కడక్కడ నధర్వణకారికల నుదాహరించి యున్నాఁడు. అందుఁ గొన్ని యహోబలపండితీయము మొదలగు గ్రంథములలోఁ గన్పట్టుట లేదు. శేషాద్రియ [ ] ఘటితపాఠములో "అథర్వణాచార్యులును "అకర్మకేషు తు స్వార్థేంచుకో లోపో విధీయతే" అన్నాఁడు గనుక నింమగాగమ మకర్మకధాతువులమీఁద రాదు. ఇఁక నేమనిన నిల్లుగాగమము వచ్చును- (చూ 47 పుట) అని కలదు. ఈకారికను అథర్వణకారికావళి టీకాకర్తయగు ద్వితింత్రిణీ (రెండు చింతల) సీతారామకవిగారు కూడ వ్రాసి టీక చేసియున్నారు. తద్గ్రంథపీఠికలో బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామశాస్త్రిగారు ఇది యథర్వణకారిక కానేర దనియు నహోబలపండితులు వ్రాసిన వాక్యమనియు వ్రాసియున్నారు. అహోబలపండితీయములో "అకర్మకేషు తు స్వార్థేంచుగాగమ లోపో విధీయతే'' అని యున్నది. కాని పై బాలసరస్వతీయములోఁగూడ నీకారిక యుండుటంబట్టి సీతారామస్వామిశాస్త్రిగారి యూహ కాధారమేమో తెలిసికొనవలసి యున్నది.

సంశ్లేషమన నేమి ?——

ఈ విషయమును గూర్చి పూర్వాధునాత నాంధ్రవైయాకరణులకు మతభేదములు చూపట్టుచున్నవి. నన్నయభట్టు గాని యథర్వణుఁడుగాని సంశ్లేషమును గూర్చి తమ యభిప్రాయములను స్ఫుటముగా నెచటను దెలుపలేదు. బాలవ్యాకరణకర్త లగు చిన్నయసూరిగారు "సంశ్లేష మనఁగా మీఁదిహల్లుతోఁ గలియుట" అని వ్యాఖ్యానము చేసి యున్నారు. బాలసరస్వతి "అలుకిచి సంశ్లేషస్స్యాత్" అను సూత్రములో, సంశ్లేషశ్చపైయక్షరముతో సంయోగమును అగును. అని సంశ్లేష పదార్థమును వివరించి చిన్నయసూరికి మార్గదర్శకుఁ డయ్యెను. ఇట నాధునికులు కొందఱు ''ద్రుతము పూర్వాచ్చు సత్తి యుండుట సంశ్లేష మని చెప్పుచున్నారు. అనఁగా, వచ్చెన్ + ఎతఁడు అనుపదములకు సంధి చేయునపుడు వచ్చెన్ అనుదానిలోని ద్రుతము "చ్చె" అను దానితో నత్తి యుండ దనియుఁ (సంశ్లేషము రా దనియు) బరాచ్చుతోడనే యత్తి యుండుననియుఁ జెప్పుచు "లుకస్సంశ్లేషో నాచి" అను సూత్రమును వారు సమన్వయించుచున్నారు. ''లుకస్సంశ్లేషో నాచి" యనుసూత్రము ''సర్వత్రాజ్వత్కార్యం యస్య" అను సూత్రముచే సిద్ధించిన యర్థమునే తెల్పుచున్నది. అంతట నుయకారమున కజ్వద్భావము వచ్చును. గాన నజ్వద్భావమును బొం

దిన యకారము పరముగా నున్నపుడు ద్రుతమునకు లుక్సంశ్లేషములు రావని భావము చెప్పఁగొనవలయును. యకార మచ్చగు నని చెప్పక యచ్చువంటి దగు నని చెప్పుటచే నొకవేళ భూతపూర్వగతి నాశ్రయించి "లుగ్వా ద్రుతప్రకృతికా త్పరత స్సరళే స్థిరేచ నస్య స్యాత్"-అలుకిచ సంశ్లేష స్యాత్" అను వానిచే లోపసంశ్లేషములు చేసికొందు రేమో యనునుద్దేశముతో నైనను "లుక్సంశ్లేషౌ నాచి" యను సూత్రమును వ్రాసె నని చెప్పఁగొనవచ్చును. కాన, లుక్సంశ్లేషౌనాచి, యనుసూత్రములోనిసంశ్లేషపదము, అలుకిచ సంశ్లేషస్యాత్, అను సూత్రములోని సంశ్లేషపదానువాదము. కాఁబట్టి, అలుకిచ సంశ్లేషస్స్యాత్తను దానిలోని సంశ్లేషపదార్థ మెట్టిదో తెలిసికొనవలసి యున్నది. ద్రుతము పూర్వాచ్చు నత్తి యుండుటయే సంశ్లేషపదార్థమైనచో నీసూత్రము వ్యర్థము. వచ్చెన్గోవు- ఇత్యాదులు సంహితచేతనే సిద్ధించును. సంహిత వివక్షింపనిచో వచ్చెన్ గోవు అనియే యుండును. మీఁదివర్ణముతోఁ గూడుకొనుట యని చెప్పిన నీసూత్రము సార్థకము. ద్రుతము ''ను''స్వరూపము కూడ నగును గనుక సంశ్లేషవిధి యావశ్యకము. ద్రుతము "ను"స్వరూపము కూడ నగు ననుటకు నీసూత్రమే ప్రమాణము. ఈసూత్రము సిద్ధార్థబోధక మని ద్రుతము నకారపుఁ బొల్లే యనుట సమంజసము గాదు. ప్రస్తుతమున, వచ్చెన్ + ఎతఁడు-ఇత్యాదులందు సంహితచేతనే, వచ్చెనెతఁడు- ఇత్యాదులు సిద్ధించుచున్నవి. కానఁ "బైయక్షరముతో సంయోగము ను" అని బాలసరస్వతి వ్రాసినయది, సమంజసముగా నున్న దని తోఁచుచున్నది. అధర్వణాచార్యులు ను "ద్రుతస్య హాలి బిందుః స్యాత్ శ్లిష్టత్వంచ క్వచిత్స్వతా" అనుచో నీసంగతిని సూచించి యున్నాఁడు. ద్రుతమునకు హల్లు పరముగా నున్నపుడు బిందువును శ్లిష్టత్వము నొకచో స్వత్వము నగు నని యర్థము. హల్లు పరముగా నున్నపుడు శ్లిష్టత్వ మనఁగా హల్లుతో నని భావము. పూర్వముతో నైనయెడలఁ దిరుగఁ జెప్పుట యేల ? ఇట సహృదయులగు విమర్శకులే ప్రమాణము.

రాముకు- అనురూపమును గూర్చి నన్నయ ప్రసంగించెనా- "టాదివిభక్తౌ నిర్నే త్యేకే" అను సూత్రవ్యాఖ్యానమున బాలసరస్వతి "తృతీయాదివిభక్తులు పరమైయుండిన న్యాగమము లేదు. ఇట్లని కొందఱు పెద్దలనిరి" అని వ్రాసి తదుదాహరణముగా- రాముచేత, రాముకొఱకు, రామువలన, రాముకు, రామునందు అని యుదాహరించెను. అహోబలుఁ డీసూత్రమునకు వ్యాఖ్యను

వ్రాయుచు "టాదివిభక్తౌ పరతో నివర్ణకో నేతి వదన్తి కేచిదాచార్యాః, రాము చేతన్, రాముకొఱకున్, రామునకై, రామువలనన్'—అని యుదాహరించి రాముకు అని మాత్ర ముదాహరింపక "ఇత్యాది" అని వ్రాసి తప్పించుకొనియెను. "నఃకౌ" అను సూత్రవ్యాఖ్యానమున నేరపవాదః నామ్నఃకౌపరే నః స్యాత్, రామునకున్, కృష్ణునకున్ ఇత్యాది యని చెప్పి "నః ప్రాయశ్స్యాదృకారాచ్చ సర్వపండిత సమ్మతే" అను నధర్వణకారికకు "న" యను నాగమము నిత్యమని యుఁ, బ్రాచేతసుకు- ఇత్యాది భాస్కరోక్తులు సిద్ధాలము లనియు వ్రాసి యసందర్భముగాఁ బ్రామో గ్రహణమున ఉదంతములకంటెను నగు నని ఫలము చెప్పెను. న్యాగమమునకు, న అనునాగమము- అపవాద మని చెప్పి "నః కౌ" అనుసూత్రము నిత్య మనునభిప్రాయముతో నహోబలపతి వ్యాఖ్య వ్రాయుటచే సర్వలాక్షణిక సమ్మత మగు రామునికి ననురూపము సిద్ధించుట లేదు. తానుగూడ "టాదివిభక్తౌ నిర్నిత్యేకే" అనుసూత్రముక్రిందఁ (262 పుట) రామునికి అనురూపము సాధించి యుండెను. అందుచే రామునికి అనునది యసాధు వనఁ దగదు. కొందఱ మతమున న్యాగమము రాకుండుటచే నెట్లును రాముకు- అనురూప మగుచునే యుండెను. ప్రాచేతసుకు- ఇత్యాదుల ఖండించుట యెట్లు సరిపడును. నన్నయాభిప్రాయమున "నః కౌ" అనునది యనిత్యమై యుండును. లేక యధర్వణుని వివరణమును బట్టి ప్రాయికమై యైన నగును. న అనునాగమము రానపుడు న్యాగమమును, న్యాగమము కొందఱమతమున రాదు గనుక రాముకు అనురూపమును గలుగుచున్నది. రాముచేత నిత్యాదు లితరమత సిద్ధములైనను గ్రహించి రాముకు అనుదానిని గ్రహింపకుండుట యుచితముకాదు. ఎట్లయినను నన్నయభట్టు రాముకు అనుదానిని గూర్చి చెప్పెననియే యనఁదగు. బాలసరస్వతి రాముకు అని యుదాహరించుటలో విశాల దృష్టి చూపెను.

నిలలు ప్రకృత్యవయవములా విభక్త్యవయవములా ?

నన్నయభట్టు "మహతో నిలౌ విభక్తౌ టాదౌ వచనద్వయే క్రమేణ స్తః" అను సూత్రముచేతఁ దృతీయాదులు పర మగునపుడు నిలలు విధించెను. వీనిని విభక్త్యవయవము లని చెప్పినచో "తమ్ముని నెయ్యము, తమ్ముల నెయ్యము అనుచో సమాసమున, "లోపశ్చ విభక్త్యాదే శ్శ్లిష్టేషుస్యా త్సమాసకాంగేషు" అనుసూత్రముచే యొక్కకు లోపము గలిగి తదవయవమైన నిలలు లోపించి

తమ్మునెయ్యము- అనియే కాని తమ్మునినెయ్యము, తమ్ములనెయ్యము అనురూపము లుండకపోవలసి వచ్చును. ప్రకృత్యవయవ మైన యెడలఁ గేవలవిభక్తి లోపించును, గాని, నిలలు లోపింపక తమ్మునినెయ్యము, తమ్ములనెయ్యము అనునవి సిద్ధించును తమ్మునెయ్యము అనునది "లుక్సస్యాత్" (అజన్త. 21 శ్లో) అను దానిచే సిద్ధించినరూపము చిన్నయసూరి నిగాగమ మని ప్రకృతికి విధించుకొని లడాగమ మని విభక్తికి విధించుకొని "సమాసవిభక్తికి లోపం బగు లట్టు నకుఁ గాదు." అని ప్రత్యేకముగ సూత్రించుకొనియెను. బాలసరస్వతి "విభక్తి లోప మైనను దదాశ్రిత మైన నిలలకు లోపము లేదు. (హల్సన్త ౧౭ శ్లో) అని వ్రాసెను. "నిమిత్త స్యాపాయే నైమిత్తికస్యా ప్యపాయః" అను పరిభాషను మనసులో నుంచుకొని తదాశ్రితమైన నిలలకు=విభక్త్యాశ్రిత మైన నిలలకు అనఁగా విభక్తి నిమిత్తకము లగు నిలలకు లోపము లే దని వ్రాసెను. కాని పై పరిభాష ప్రామాణికసమ్మతముగాదు. (చూ పరిభాషేందు శేఖరము-అకృతవ్యూహపరిభాష) అదియుంగాక సంస్కృతములోని సర్వన్యాయములును దెలుఁగునకు వర్తింపవు. "మహతోనిలౌ ..." అనుసూత్రముచేఁ ద్రుతీయాంతములు పరముగా నుండఁగాఁ బూర్వముందున్న మహద్వాచకపదమునకు నాగమముగా విధింపఁబడెను గాన నిలలు ప్రకృత్యవయవము లగును కాఁబట్టి విభక్తికి లోపము గలిగినను నీయాగమములు లోపింపవు. చిన్నయసూరి విధించిన నిగాగమము నకుఁ గూడ నిదియేపద్ధతి.

మిగిలినపరిచ్ఛేదములకంటెఁ గ్రియాపరిచ్ఛేదములో నెక్కుడుగఁ బాఠభేదము లగపడుచున్నవి. అందుఁ బూర్వపరవిరోధములు లేవు కాని యొక ప్రతిలో నొకసూత్రమునకు వివరణము లేదు, దానికే మఱియొక ప్రతిలో వివరణము చేయఁబడియున్నది. ఒక ప్రతిలో సూత్రార్థమే కాక యితరవిషయములఁ గూర్చి స్పష్టముగ వ్రాయఁబడియున్నది. ఒక ప్రతిలో- 45 వ పొరట మొదలు 50 వ పొరటవఱకు నుపకృతి పరిణతి సంవృతి ధాతు ప్రక్రియ విశదీకరింపఁబడియున్నది. "వ్యతిరేకాదా భావినిచాత్స్యాత్" అనుసూత్రములోని భావినియనుపదమునకొక ప్రతిలో "భవిష్యదర్థమందును" అనియు వే ఱొక ప్రతిలో "అస్త్యనుబంధకము త్తైన భవిష్యదర్థము పర మగుచుండఁగాను" అని యర్థము వ్రాయఁబడి యున్నది. ఇటఁ దాత్పర్య మొక్కటియే.

ఒక ప్రతిలో (52 పొరట) "అద్యః క్రియాసు భూతార్థద్యోతిత మాద్యగం వినాసర్వః"- అని చెప్పినాఁడు గనుక భూతార్థద్యోతితక్రియయందు యకార

మున కెత్వము వచ్చుచున్నది." అని "అద్యః క్రియాసు" అను సూత్రముచే నెత్వము వచ్చు నని వ్రాయఁబడెను. పోయె- ఇత్యాదులందు "ప్రథమైకస్యైద్భవేచ్చ భూతార్థే" అనుదానిచే నెత్వము వచ్చును గాని "అద్యః క్రియాసు" అనుదానిచే రాదు. "అద్యః క్రియాసు" ఇది సందేహనివారణార్థ మని మునుపు వ్రాసి యుంటిని. కాన నీపాఠము యుక్తముగాదు.

రేఖాద్వయ ఘటిత మగు ప్రతిలో "పునరాగమః క్రియాణాం పర్యాప్తో మస్త తేతు సంకేతః" అను సూత్రమునకు వ్యాఖ్య వ్రాయఁబడి, అవధారు, అని యుదాహరింపఁబడియెను. ఇతరమగు ప్రతిలో వ్యాఖ్యచేయఁబడక "ఉత్తర సూత్రము సంప్రదాయవేద్యము" అని వ్రాయఁబడియున్నది. అహోబలుఁడు రేఖాద్వయఘటిత మగు ప్రతిలోని వ్యాఖ్య ననుసరించి యుండె నని చెప్పియుంటిని. దీనిని బట్టి రేఖాద్వయఘటిత మగు పాఠమే సరియైనదని తోఁచుచున్నది.

టీకా సహితముగ నాంధ్రశబ్దచింతామణి సరియగుపాఠములతో నిడిదవోలు వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండు సన్సువారిచేఁ బ్రకటింపఁబడియున్నది. ఆటీక బాలసరస్వతి చేసిన టీకయే యని చాలమంది భ్రాంతిపడియున్నారు. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు సంపాదించి ప్రకటించిన దీనిని బట్టి యది బాలసరస్వతికృతము కా దని తేలుచున్నది. బాలసరస్వతి టీక యేదియో సరిగాఁ దెలియక ప్రఖ్యాతిని బట్టి మాత్రము బాలసరస్వతి టీక యొకటున్న దని యనుకొనుటయే కాని ప్రత్యక్షముగాఁ జూడని యాంధ్రలోకమునకు మహోపకారముగా దీనిని బ్రకటించిన యాంధ్రసాహిత్యపరిషత్తున కాంధ్రలోక మెంతయుఁ గృతజ్ఞత చూపవలసియున్నది.

చర్ల నారాయణశాస్త్రి.

శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటుకార్యాలయ ప్రధానపండితుఁడు.

## — మనవి. —

ఈ బాలసరస్వతి టీకతోడి యాంధ్రశబ్దచింతామణి ప్రతులు రెండు సంపాదింపఁబడినవి. అందొకటి పరిషత్పుస్తకభాండాగారములోని 4095 సంఖ్యగలది. ఇది కొంతకాలముక్రిందట బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారును శ్రీమాన్ రాళ్లపల్లి గోపాలకృష్ణశర్మగారును అనంతపురమండలములో సంగ్రహించిన గ్రంథసంచయములోనిది. వీరి కిది బూదేడు కృష్ణాపురాగ్రహారములో శ్రీమాన్ వీరరాఘవాచార్యులుగారియొద్దనుండి లభించినట్లు తెలియవచ్చుచున్నది. ఇందున్న పీఠికపద్యములు వెనుకనే పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడి కొంత ముచ్చటింపఁబడియున్నవి. రెండవ ప్రతి పిఠాపురము సమీపమునందలి చెందుర్తిగ్రామములో బ్ర॥ క్రొత్తపల్లి గంగయ్యగారి తాళపత్రగ్రంథములలోఁ గనిపెట్టఁబడి యెరవు తేఁబడినది. ఇందుఁ బీఠికపద్యములు లేవు. దీనినే బ్ర॥ నారాయణశాస్త్రిగారు రేఖాద్వయఘటితమగు ప్రతియని పీఠికలో నుగ్గడించుచువచ్చిరి. ఈ రెండుప్రతులనుబట్టి యొక్కప్రతి వ్రాసి యీరీతిగాఁ బ్రకటింపఁగలిగితిమి. దీనిని బ్రకటించుటలో, కాకినాడ శ్రీపిఠాపురము రాజావారి కళాశాలలోని పండితులు, విద్వాన్, శ్రీమాన్ తిరుమల పెద్దింటి రాఘవాచార్యులుగారు మాకుఁ జాలఁ దోడుపడిరి గావున వారికిని, మాకోరికను ద్రోసివేయక విపులవిమర్శనముతోఁ బీఠికవ్రాసియిచ్చి గ్రంథమునకు వన్నెతెచ్చిన బ్రహ్మశ్రీ చర్ల నారాయణశాస్త్రిగారికి ననేకనమస్కారములు. మాప్రమాదమున నక్కడక్కడ సంభవించిన లోపములను సవరించుకొని మమ్ము మన్నింప వాచకుల వేఁడుచున్నారము.

పరిషత్కార్యదర్శులు.

# షోడశకుమారచరిత్రము.

## పీఠిక.

ఇది యెనిమిదియాశ్వాసముల పద్యకావ్యము. కాని, మాకు దొరకిన ప్రతులలోఁ దృతీయచతుర్థాశ్వాసములు లేవు. ప్రథమాశ్వాసమునఁ గృత్యాది లేదు. అచ్చటచ్చట గ్రంథపాతములు గలవు. మొదటి రెండాశ్వాసములు గల ప్రతి యొకదానిని చెన్నపురి బ్ర॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పంపిరి. ఈతాళపత్రప్రతిలో నీరెండాశ్వాసములును ౧౭౪వ పత్రము మొదలు ౧౯౯వ పత్రమువఱకుమాత్రమే యున్నవి. మొదటి ౧౭౩ పుటలలో నేమి వ్రాయఁబడి యుండెనో యాభాగమిందు లేదు. రెండవప్రతి, ౫-౬-౭-౮ యాశ్వాసములు మాత్రమే కలిగి ౨౦౫-వ పత్రము మొదలుకొని ౨౪౮ పత్రములు సంఖ్య వేయఁబడియున్నది. దీనిని, కాకినాడ, మ॥ దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశ రావుపంతులు బి. ఎ., గా రిచ్చిరి. మొదటి ౨౦౪ పుటలలో షోడశకుమార చరిత్రము ౧-౨-౩-౪ ఆశ్వాసములు మొదలైనవి వ్రాయఁబడి యుండవలెను.

శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరములో నిందుండి కొన్ని యుదాహరణముల నిచ్చి యున్నారు. వారిచ్చిన ప్రయోగము లీముద్రిత ప్రతిలో నున్నవియే. వారికిని బూర్ణగ్రంథము దొరకెనో లేదో యని సందేహము కలుగుచున్నది.

కవి, వెన్నెలకంటి అన్నయ్య. సీతారామాచార్యులవారు, ఎల్లన్న యని తలఁచినారు. ఆధార మూహ్యము. ఆంధ్ర విష్ణుపురాణకర్త యగు వెన్నెల కంటి సూరయ్య గోత్రమును నీ యన్నయ్య గోత్రమును హారితసగోత్రమే. అన్నయ్య సూరామాత్యుని పుత్త్రుఁడు, సూరామాత్యుని తండ్రి యన్నయ్య యనియు, కవి యన్నయ్య తన కృతిని దండ్రియగు సూరామాత్యునకే యంకితము చేసెననియు—

ద్వితీయాశ్వాసాదిని— సుకవిస్తోమ నుతౌన్నత్య యన్న సూరమాత్యా
పంచమాశ్వాసాదిని— సూచిత మాహాత్త్య్వ యన్న సూరామాత్యా.
షష్ఠాశ్వాసాదిని— రసిక, వ్యాపార విహార మంత్రి యన్నయసూరా.
సప్తమాశ్వాసాదిని— శోభితషాడ్గుణ్య యన్న సూరవరేణ్యా.
అష్టమాశ్వాసాదిని— శోభిత పాండిత్య యన్న సూరామాత్యా.

అను మాటలం బట్టి తెలియ వచ్చుచున్నది. విష్ణుపురాణకృతికర్త సూరామాత్యుఁ డీయన్నయతండ్రి యనుకొందమన్న నాతనితండ్రి యమరనా

మాత్యుఁ డని కలదు. కవులచరిత్రములో నీయన్నయ్యపేరు నీషోడశకుమార చరిత్రమును లేవు.

జక్కనకవి విక్రమార్కచరిత్రమును సిద్ధనమంత్రికిం గృతి యిచ్చెను. సిద్ధన మంత్రి పెద్దతండ్రి వెన్నెలకంటి సూర్యుఁ (భాస్కరుఁ) డని గ్రంథమునం దెలుపఁబడినది. (౧-౬) ఈసూరనమంత్రి రెడ్డి వేమనరపాలునిచే నగ్రహారముఁ గొనియె నఁట. మఱియు ననపోతారెడ్డికి వెన్నెలకంటి వంశజుఁ డగు మఱి యొక కవి కృతుల నిచ్చె నని విష్ణుపురాణములోఁ గలదు. వీరికిని అన్నయ్యకు నెట్టిసంబంధమైన నున్నదో లేదో తెలిసికొనుటకుఁగాని మఱి యేవిషయమును దెలిసికొనుటకుఁగాని కృత్యాది పద్యములు దొరక లేదు.

కవికాలము:—ఇందుఁ గవి తనకృతిభర్త యగునన్నయ్యను, కృష్ణకందార, భోజ, జగదేకమల్ల, సోమేశ్వరులతోఁ (7-128) బోల్చియున్నవాఁడు. భోజుఁడు ధారానగరాధిపతి. జగదేకమల్లుఁడు పశ్చిమచాళుక్యచక్రవర్తి. వీరు పదునొకండవ శతాబ్దమువారు. సోమేశ్వరుఁడు భూలోక బిరుదాంకితుఁడగు పశ్చిమ చాళుక్యచక్రవర్తి (A. D. 1126-38) ఇతఁడు సంస్కృతమున నభిలషితార్థచింతామణి యను మానసోల్లాసమును రచించెను. ఇతనికి సర్వజ్ఞభూపుఁ డను బిరుదు కలదు. కృష్ణకందారుఁడు యాదవరాజు. జైత్రపాలుని తనయుఁడు. పదుమూఁడవశతాబ్దమున సూక్తిముక్తావళికర్త యగు జహ్లణకవిని వేదాంత కల్పతరుకర్త యగు నమలానందుని బోషించెను. కాననీగ్రంథముపదుమూఁడవ శతాబ్దానంతరము రచియింపఁబడి యుండును.

గ్రంథాకృతి:—ఈకవి దశకుమారచరిత్రమును మనస్సున నుంచుకొని యీ షోడశకుమారచరిత్రమును రచియించెను. కొన్ని కథలను కథాసరిత్సాగరాదులనుండి సంగ్రహించి తన కవితాచమత్కృతిచే రసపుష్టిని వర్ణనాధిక్యతను గలిగించి జనమేజయుని రెండవ కుమారుని గథానాయకునిగఁ జేసి- అతనికిఁ దోడుగ నతని మంత్రితనయులను, బురోహితపుత్రులను, దండనాథసుతులను, బదేనుగురనుగూర్చి కథసాగించినాఁడు.

కవిత్వము నిర్దుష్టమైనది. ఉభయభాషాప్రౌఢి మెఱయుచున్నది. శైలి మంచన కేయూరబాహు చరిత్రమును, జక్కన విక్రమార్కచరిత్రమును, కేతన దశకుమారచరిత్రమును బోలుచుండును. పద్యములు హృద్యములై ధారాశుద్ధిగలవిగా నున్నవి. ఎవ్వరియొద్ద నైన సంపూర్ణప్రతి యున్నచో దయతోఁ బంపి రెండవకూర్పులో నీషోడశకుమారచరిత్రమును బూర్ణముగాఁ బ్రకటించుభాగ్యమును వా రాంధ్రసాహిత్యపరిషత్తునకుఁ గల్గింతురుగాక.

దురితంబుల నన్నింటిం, బరిమార్చెడినీదునామమంత్రంబది యే
సరణి న్నాకు లభించునో, తిరుమలగిరివేంకటేశ ! దేవాధీశా ! ౭౩

దరిలేనిపాపచయముల, నిరతం బొనరించినాఁడ నే ననఘాత్మా !
కరుణ నవి క్షమింపవె శ్రీ,తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా ! ౭౪

ధరలోఁ బుట్టెడియపుడే, పరమేష్ఠి లిఖించె నాదుఫాలమునం దే
సరణినిఁ గలదో యెఱుఁగను, దిరుమలగిరివేంకటేశ! దేవాధీశా ! ౭౫

తరులపయిన్ వెన్నెల, ప్రసరముపయిం గురియువాన సరియయ్యెను నీ
కరుణ యెటనేనిఁబఱపుటఁ, దిరుమలగిరివేంకటేశ ! దేవాధీశా ! ౭౬

హరనుత ! పీడను నీదగు, చరణద్వంద్వంబుఁ జిత్తచాంచల్యముచే
దరయఁగఁ బరీక్ష సేయుము, తిరుమలగిరివేంకటేశ ! దేవాధీశా ! ౭౭

ధరలోఁ బుట్టువు లెన్నో, మరణించుట లెన్నొ గడచె మఱినాకింకన్
మరుజన్మవలదు తండ్రీ ! తిరుమలగిరివేంకటేశ ! దేవాధీశా ! ౭౮

అరిషడ్వర్గము విడి నీ, చరణంబులఁ గొల్చుచుండ సంతతమును నీ
కరుణ పఱపుటే భారమ ? తిరుమలగిరివేంకటేశ ! దేవాధీశా ! ౭౯

ధరఁ దండ్రికాత్మజుపయి నె,నరు గలవిధమునను నీవు నామీఁదఁ గృపం
బఱపుము సకలాభీష్టద ! తిరుమలగిరివేంకటేశ ! దేవాధీశా ! ౮౦

అరమర లేక త్వదీయసు,చరితంబుల నెల్ల రాగసరళిని నేనున్
నిరతముఁ బాడుచునుంటిని, దిరుమలగిరివేంకటేశ ! దేవాధీశా ! ౮౧

వరములనీయక నన్నిట, నరమర వెట్టంగ నీకు న్యాయ్యం బేనా !
ధరణీధర ! కరుణాకర, తిరుమలగిరివేంకటేశ ! దేవాధీశా ! ౮౨

పరిమళముల నాశింపను, సురపోషక ! నిన్నె యెపుడు స్తోత్రమొనర్తుం
గరుణం బఱపుము నాయెడఁ, దిరుమలగిరివేంకటేశ! దేవాధీశా ! ౮౩

పరులకు మేలుగలిగినన్, దురితాత్మకు లోర్వకుండుదురు నే నటులం
దిరిగినవాఁడను గానో, తిరుమలగిరివేంకటేశ దేవాధీశా ! ౮౪

ఇర వెక్కడఁ గన కిక్కడఁ, బరమేశ్వర! నిన్నుఁ జేరి, ప్రార్థించుచునుం
టి రమేశా! ననుఁగావుము, తిరుమలగిరివేంకటేశ దేవాధీశా ! ౮౫

సురుచిరకిరీ! యహముం, బరిత్యజించి వెస నిన్నుమదిలో భజియిం
తు రమేశా! నను బ్రోవుము, తిరుమలగిరివేంకటేశ దేవాధీశా ! ౮౬

స్మరజనకా! మహిలో నిం, దఱిఁ బ్రోతువు నన్నుఁ బ్రోవ దయరాదా! నీ
తరమేగాదా? నుడువుము, తిరుమలగిరి వేంకటేశ దేవాధీశా! ౮౭

మరణము మరలన్ జన్మం, బరయఁగ లేనట్టిఁడవు మహాత్మా! నీకున్
సరిలేరని చాటించెదఁ, దిరుమలగిరి వేంకటేశ దేవాధీశా! ౮౮

అరయఁగ భార్యయుఁదనయులు, సిరియున్ సంపదయుమానసిక వాంఛితముల్
సొరిదిఁ దనవెంటరావో, తిరుమలగిరి వేంకటేశ దేవాధీశా! ౮౯

మురహర! ధరపై నాటిన, తరులకు జలమిడని భాతిఁ దనరును నను నీ
వరయక పెడమోమునిడం, దిరుమలగిరి వేంకటేశ దేవాధీశా! ౯౦

కరమున్ ఖేదము నందెడి, నరులన్ దరిఁజేర్చునీదు నామం బది యే
సరణిన్ నాకులభించునో, తిరుమలగిరి వేంకటేశ దేవాధీశా! ౯౧

మొఱలిడెదఁ బ్రోవు మంచును, సురముఖగణవంద్య దివ్యసుందరపాదాం
బురుహద్వంద్వా! మాధవ! తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౯౨

సురవాంఛితములనెల్లన్, వరుస నొసంగెదవు నాదుప్రార్థన విని స
త్వరుణను గానవదేమో, తిరుమలగిరి వేంకటేశ దేవాధీశా! ౯౩

అరిభీకర! సుగుణాకర! వరదా! ద్వారదేశవరద- వరదాసజనా
దరణా! కరుణాభరణా! తిరుమలగిరి వేంకటేశ దేవాధీశా! ౯౪

కరుణను నెట్టుల సఫల మొ,నరిచెదవో నాదుజన్మ నతజనపోషా!
సురుచిరకల్యాణగుణా! తిరుమలగిరి వేంకటేశ దేవాధీశా! ౯౫

దరిఁగానకయుంటిని నీ, సరి లేరని తలఁచుచుంటి సద్గుణనిధి! పా
మరతను వే పోఁగొట్టుము, తిరుమలగిరి వేంకటేశ దేవాధీశా! ౯౬

సురవైరినాశకా! నీ, కరుణను నాపైనిఁ బఱపఁగాఁజాలవె నా
దురితచయంబులఁ ద్రుంపవె, తిరుమలగిరి వేంకటేశ దేవాధీశా! ౯౭

సురవందిత త్వచ్చరణాం, బురుహద్వయి దిక్కటంచుఁ బూజింతును న
న్గరుణింపుము భరియింపుము, తిరుమలగిరి వేంకటేశ దేవాధీశా! ౯౮

పరిరక్షించుట నీకే, భరమగునెడ నాదు జిహ్వపై నీనామా
క్షరములనేనియు నిలుపుము, తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౯౯

ధరలోపల సౌఖ్యములను, సిరులను బరమందు ముక్తిఁ జేకూర్పు మిదే
సరగునఁ గైకొను శతకముఁ, దిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౧౦౦

పరమాదర మాధర గో, పరమాభర మాన్యవపుర పరమార నుతిం
ప రమాకర మాతరమా ! తిరుమలగిరివేంకటేశ ! దేవాధీశా ! ౧౦౧
వరదా ! నీనామము తా, ల్చిరహిన్ నినుఁ బూజనంబు సేయుచునుంటిం
గరుణను గావఁగ రావా ? తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా ! ౧౦౨
అరయుము బాలుఁడ నాచే, విరచితమగు నీశతంబు విని యాపైనీ
కరమునఁ గైకొను ముదమునఁ, దిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౧౦3
పొరపాటుల కొకదండము, సరియని భావించి వేయి పారులును భవ
చ్చరణాబ్జములకు మ్రొక్కెదఁ, దిరుమలగిరివేంకటేశ ! దేవాధీశా ! ౧౦౪
సరగున నీశతకము నే, సరణిం బల్కించినావొ చక్కఁగ నీవా
తెఱఁగున దీనిం జేకొను, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా ! ౧౦౫
గరుడధ్వజ ! యీశతకము, ధరనెన్నాళ్ళుండఁ జేయఁ దగు నన్నాళ్లుం
బరఁగును నీనామంబులఁ, దిరుమలగిరివేంకటేశ ! దేవాధీశా ! ౧౦౬
సొరిది నిది చదువువారికి, సిరులను సౌఖ్యములఁ గూర్చి చెన్నారంగాఁ
బరమున మోక్షం బొసఁగుము, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా ! ౧౦౭
ధరలో నక్షయసంవ, త్సరవరభాద్రపదబహుళ(?)చవితీగురువా
సరమున రచియించితి నిది, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా ! ౧౦౮

---

## కవి వృత్తాంతసంగ్రహము.

ఈశతకమును జగ్గయ్యపేట నివాసులు శ్రీమాన్ తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార వేంకటరాఘవ చక్రవర్తి అయ్యంగారు పంపుచుఁ గవిం గూర్చి యీ క్రింది వాక్యములు వ్రాసిరి:—

"ఈశతకము రచించిన కవిగారు నాకు మూఁడుతరములపైవారు. అనఁగా నాకు ముత్తాతగారగుదురు. దానిం బట్టి చూడ వారిది రచించుట మొన్నటి యతుయకాక, పైయతుయకాక, ఆపైయతుయయని నిర్ణయింపుటకవకాశమున్నది ఆకాలమున వారు కృష్ణాతీరమునఁ గల ముక్త్యేశ్వరపురమునఁ గాఁపురముండి శ్రీవైష్ణవమతసిద్ధాంత బోధనార్థము భగవద్రామానుజాచార్యులవారిచే నియమింపఁబడిన చతుస్సప్తతి సింహాసనస్థులలో నొకరగుటచే ననేకదేశములలోఁ బర్యటనము గావించుచు......నందిగామ తాలూకా యంకుల్లల శ్రీతిరుమలగిరి క్షేత్రమున కేతెంచి, యచ్చట శ్రీస్వామివారి సన్నిధి నీశతకము రచించినట్లు తెలియవచ్చుచున్నది...వీరి తాతగారిది వీరి నామధేయమే. తండ్రిగారు రాఘవాచార్యులుగారు. కుమారుని పేరు తిరువేంగళాచార్యులు గారు. వీరి కుమారుని పేరు జగన్నాథాచార్యులుగారు. వీరే మాతండ్రిగారు...మానాయనగారును జిన్నతనములో 15 సంవత్సరములు ముక్త్యేశ్వర పురములోనే కాఁపురముండిరి. తరువాత నీయూరు వచ్చినారు" అని.

# ౫- శ్రీ శ్యామలాంబాశతకము.

మల్లంపల్లి మల్లికార్జునపండితారాధ్యులు.

## సీసపద్యములు.

శ్రీమద్రమాసుందరీహస్తసందర్శితాదర్శభాస్వన్ముఖాబ్జబింబ
శారదైకాంతభాషానమూకర్ణనాసక్తకర్ణాగ్రభూషావిడంబ
గిరిభిత్కుటుంబినీ భరితాభినవచామరమరుచ్చలచ్చికురనికురుంబ
నిజపురస్సౌదామినీనటద్వేల్లితానిమిష వారనితంబినీకదంబ
సేవకమనస్సరోవర శ్రీవిలోల, బాలకాదంబ పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామి వామభాగ, చంద్రశాలాసభాలంబ శ్యామలాంబ.
మహిలోన నీమహామహిమ వర్ణింపంగ నహికులాధిపతికి సహిత మద్రి
దుహిత దుర్భరమైనఁ దొడరితి జడబుద్ధిఁ గ్రిందఁగూర్చుండి మాకంద శాఖి
శాఖాశిఖాగ్రసంస్థానశలాటు వందికొనంగఁ జేతులెత్తికొనఁ జూచు
వామనుభంగి నా వలన నయ్యె నిదేమి కరుణించు పూన్కి సాంగంబుగాఁగ
నాకవిత కేమికొదవ రానీక చంద్ర,రేఖపోలిక పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామివామభాగ, చంద్రశాలాసభాలంబ శ్యామలాంబ.
వందనంబులు గైకొనందగు మందాకినీభుజంగాగ్రరాణీ పురాణి
స్తుతిశతం బిదియె సంతోషింపఁదగు సూత్రనిపుణతాకరధృతైణీ పురాణి
ప్రార్థనం బిదె సదా భావింపఁదగు హితనిఖిలార్థవరదపాణీ పురాణి
విజ్ఞాపనంబిదె వినఁదగు నాగమ నిగమార్థసత్యవాణీ పురాణి
భక్తి శక్తి విరక్తి సంయుక్తియుక్త,రీతిఁ గరుణింపు పెడనపురీలలామ- రామ. ౩
పార్వతీదేవి నీపాదసరోజాతసేవానురక్తి సంశ్రితవిముక్తి
కాత్యాయనీ నీత్రికాలనిర్ణయసపర్యాసక్తి బుద్ధిశ్రేయస్సమృద్ధి
హైమవతీ నీమహన్నామ మనుచింతనావృతవృత్తి తత్త్వార్థవేత్తి
భద్రకాళీ నీశుభప్రాప్తి హేతుక దర్శనస్ఫూర్తి పాతకనివర్తి
నీచరణధూళి భృతిదుర్వినీతిమతిప, రేతపతిహృతి పెడనపురీలలామ-రామ. ౪
పరిచరులై శచీప్రముఖ బర్హిర్ముఖాంగన లొక్కగుమిగూడి పనులు వేఁడ
గెడతోడునీడలై వడిరమాభారతీసతు లొక్కజత చేసి సరసమాడ
గాయినులై చిత్రగంధర్వముఖకళావతు లొక్కశ్రుతిఁగూడి కృతులు పాడఁ

జెలికత్తెలై కొల్చి లలి నిరాబారికన్నియల్గొక్కవలగొని నిలిచి చూడఁ
గడిమిపూఁదోఁటలోనాడు గరిమఁగన్నఁ, జాలు నొండేలపెడనపురీలలామ-
అచ్చరలాడ వియచ్చరుల్ పువ్వుల వానలు గురియఁ జెలువ్వొని దేవ
దుందుభిధ్వానముల్ సందడిమొరయ నా మేనక గదిసి లోలోన మురియ
మునులు సన్నుతిసేయ ముస్సుకుమారివై యెలమితో హిమవంతు నింటఁబుట్టి
గట్టువిల్తుని చెట్టఁ బట్టిన సౌభాగ్యవల్లిమతల్లి నాతల్లి జగము
తల్లి పర్వతవంశవర్ధని ధనీప్ర, కృతవినిర్ధని పెడనపురీలలామ-రామలిం. ౬
నీమోముతో మంచి సామెత యచుట కా పరిపూర్ణచంద్రబింబం బదెంత
నీపాదనఖరసాన్నిధ్యం బనుట కా సుపర్వతారాకదంబం బదెంత
నీనీలవేణితో నెనయని యనుట కా బాధతమోవిడంబం బదెంత
నీదరహాససన్నిభకాంతియనుట కా వరచంద్రికావలంబం బదెంత
రాత్రిదప్పిన పొడఁగన ... ... ... ...
... ... ... యానమధ్యాహ్నవేళ
నతిథిజనంబుల కమృతాన్నమిడు నన్నపూర్ణ కళాపరిపూర్ణ స్వర్ణ
భూషణీకృతగోకర్ణపుణ్యభూమి, భృత్తపోదీర్ణ పెడనపురీలలామ- రామ. ౭
లోకంబులను వీఁకఁ జీకాకు గావించు రాకాసిమూఁక నిరాకరించి
బృందారకులు సదానందులు గా నెల్ల చందంబులను గనువిం దొనర్చి
కష్టంబు లుడిపి సర్వాష్టాంగయోగవిశిష్టయోగీంద్రుల కిష్ట మొసఁగి
కర్మఠులకు నిత్యకర్మంబులు యథార్థ ధర్మంబులై యొప్పఁ బేర్మిఁగూర్చి
చూచి సుజనులఁ గుజనులఁ ద్రోచి భవము, రేచి కాచితి పెడనపురీలలామ-
నిజకథామరవాహినీవారి ఘనజగత్కల్మషంబుల నెల్లఁ గడిగి వేసి
వరవర్ణనీయభవన్నామమధురామృతం బంతకును జీవనంబుఁ బోసి
నిర్మలాత్మధ్యాననిష్ఠ లోకంబులకు దయారసంబుతోఁ గుదురు చేసి
విపులాద్భుతకటాక్షవీక్షణానిశితాసిధార దుర్భవలతాతతినిఁ గోసి
లోకపావనివై మిన్నువాఁక తాల్పు, ప్రోల నలరితి పెడనపురీలలామ-రామ.
కన్నతండ్రినిఁ జాల జిన్నఁబుచ్చితివింత కవి......బజనక్త్రుఁ డగుట కేమి
తగనన్నసమముగాఁ దలఁచిచూచితి వింతకమర రామాకారుఁ డగుట కేమి
సవతి నిల్వ్వన నీరు క.........చితివింత కది పతి తలబిందు వగుట కేమి
మగని యంతటివాని సగము సేసితి వింత నర్ధనా రుం డగుట కే మి
దేమి యింకేమి సేయ నీ వేసమర్థు, రాళవోయమ్మ పెడనపురీలలామ- ౧౧

శరణాగతుఁడ నేను నిరతాంతికాభ్యాగతనమజ్జనాభయదాత వీవు
నేను చానిపుణ ష్టప్రదాత వీవు
తనయుండ నేను సంతతచరాచరజంతుమహితసంతతి జగన్మాత వీవు
ప్రియభుజిష్యుఁడ నేను బృధులలోకాలోకనిఖిలరాజ్యరమాధినేత వీవు
నన్ను మన్నింపవలదె నీ కన్న నెవ్వ, రే మదీయులు పెడనపురీలలామ-
ముల్లోకములఁ గన్న తల్లి వీవని నమ్మి మరుగుఁజొచ్చితిని నా మనవి చెవుల
విని నన్నుఁ గన్నులఁ గని నేరమేమున్న సవరించి మన్నింప సమయ మరుగు
దెంచెఁ గాచి కొనంగ మంచిది గాదన్న నందాఁక నొదిఁగి నీయడుగుదోయి
కడఁ బడి యుండుదుఁగాక బత్తి గలుంగ విడువనేర్తురె వట్టి నుడువు లేల
యెన్నివిధముల నీకన్న నన్నె మెఱుఁగ,నోలిఁ బాలింపు పెడనపురీలలామ-
నీజేఁడుగొనియాడ నీరేడుజగముల లేఁడునీకొడుకుల జాడఁ జూడ
నొక్కఁడొక్కఁడు సమగ్రోదగ్రవేధోండభాండావళులఁ గేలఁబట్టి బంతు
లాడఁ గాపాడ మహాసమర్థులు నీపవతి సర్వలోకపావని గణింప
నందఱ కరయ మూలాధారశక్తివి నీవయె నిఖిలంబు నిర్వహింపఁ
బెంపుదీపింప బడుగులఁ బెంప నక్షభ, రింప భారంబె పెడనపురీలలామ-
ఊర్ధ్వరేతస్కుఁడత్యుగ్రుండుదగ్రయోగీంద్రపుంగవుఁడనిస్తంద్రహృదయుఁ
డంగజన్మాంగభస్మాంగరాగోజ్జ్వలుం డబ్జయోనికపాలహస్తుఁ డఖిల
సంగపరిత్యాగి సాంబసదాశివుం మహామహుని మోహాబ్ధిముంచి
పతిశరీరార్ధంబు యనుసూక్తి సార్థకముగ దేహా మర్థంబు గొన్న
దానవై దాన నీసగమేను గూర్మి తేచి కిచ్చితి పెడనపురీలలామ-రామ. ౧౫
సర్వజ్ఞుఁ డధికారసంపదచే నొక నాఁడు నీదృఢశక్తిఁ జూడఁ దలఁచి
ప్రమథుల నధికసంభ్రమమున సా తారులఁ గావించి తాను నిర్వి
కారుఁడైయుండి నిన్గన్నంతలో నరనిముసమైన గణంబు నిలుపలేక
గణము లెప్పటిరూపు గైకొన నెదురు నిన్గానితప్పు సైరించుమని యెంగాంతుఁ
డింత సులభుండు నీకైనఁ నెంతకైనఁ,జాలు నీనేర్పు పెడనపురీలలామ-
వరునకు నీమీఁది వలపెట్టిదో కాని తనమేన సగపాలు గొనఁగనోర్చె
ధవునకు నీమీఁది తలఁపెట్టిదో కాని తనతోడ విడిదగాఁ దనరఁజేర్చె
భర్తకు నీమీఁది భ్రమ యెట్టిదో కాని తనమది నిల్వుటద్దముగఁ జేర్చెఁ
బ్రియునకు నీమీఁది దయ యెట్టిదో కాని తనచూపుతిలకంబునొనరఁగూర్చె
వలచి వలపింప నేర్చిన కలికిమిన్న,యోలతాతన్వి పెడనపురీలలామ-రామ.

అసమాక్షదృక్చకోరాండజంబులకు నీ దరహాసలక్ష్మి చంద్రప్రకాశ
పంచాస్యముఖచక్రవాకంబులకు నీదు సురుచిరతనుకాంతి సూర్యరశ్మి
మారారియానమయూరంబులకు నీదు మృదులకుంతలపాళి మేఘమాల
శర్వమనోరథచక్రాంగములకు నీ లావణ్యజలధి విలాససరసిఁ
జేసి స్వాధీనపతిక వై శివుని సౌఖ్య, కేళిఁ దేల్చితి పెడనపురీలలామ- ౧౮

చాలింపు మ్మల్ల కుయ్యాలింపు జిగిగ్భుల్లఁ బాలింపు ననుఁ బరా కేల వలదు
వారించు మరుల న న్నూరించు సిరుల విఁక సైరించు నేరముల్ దూరమరుగ
నాటింపు మది భక్తి పాటింపు తుది ముక్తి దాఁటింపు జన్మాబ్ధి నీ...ము
భావింపు సదపత్యుఁగావింపు కృతకృత్యుగావింపు ననుమంచి దోవదరియ
నరయ నీదయ విమలంబు లయ్యె నాసు, కృతములెల్లను బెడనపురీలలామ-

స్థాణునిఁగూడి ముచ్చటపడి వడి ముద్దుఁ గొమరు విశాఖుని గొమరుమీఱఁ
గన్నదానవు నిను దిన్నఁగన్గొన్న ని న్వేఁడికొన్నజనాళి వేడ్కఁగాంచి
ప్రతివాసరముల నాశ్రితకల్పశాఖివై కోరినక్కోర్కె లీడేఱ వారి
కించుకంత కొఱంత నుంచక యిచ్చి రక్షింతువు మది వెగటింత లేక
యమితచిత్రచరిత్రంబు లరయ నీచ, రిత్ర లెల్లను బెడనపురీలలామ.- ౨౦

ముదమున నాదు నెమ్మదిపదంపడి నీదు మృదుపదంబులయందుఁ గుదురుపడియె
వదలదు వలదని వారింప రుచిఁగొన్నఁదా గట్టిపట్టునఁ దనరిమిగులఁ
గసుగంది కెంజాయ కన్పట్టెఁ గాఁబోలుఁ గాకున్న నిలువెల్లఁ గారుకొన్నె
హరినీలమణిరశ్మి యడుగుఁ దమ్ముల లేకఁ నరుణపల్లవకాంతి నలరుటేమి
గాన నీయుపచారము మెత్తైన నోర్చు, కృపఁ గనుంగొను పెడనపురీలలామ-

జగ మంత శివుఁడు సాక్షిగఁ గని వృద్ధిఁ బొందించిన జనని వీ వంచు నే భ
జింతు నిదంత నీ సంతతి యనుచు భావింతు నన్నేన దలంతు నెప్పు
డందు నే న్నొక్కండ నని కాని వేఱొక వింతవాఁడను గాను జింతమాను
మున్న మోహంబున కన్నఁ బెంచినమోహ మెక్కుడంచు వచింతు రింతకీవు
పెంచిన శరీర మిది దీని మంచి నీదు,పాలు గాకున్నె పెడనపురీలలామ-

ఫలితశుద్ధసువర్ణ ఫలకాసదృశకపోలకళానిరాకృత ముకురలీల
నిబిడాంధకారసన్నిభనీలకుంతలద్యుతిసముద్ధూతమధుకరజాల
మత్తమాతంగసమానయానమనోజ్ఞనిర్జితకలహంస నికరఖేల
కలమగర్భప్రతీకాశజంఘారుచిమహిమపరాభూతమకరహేల
వికసితకటాక్ష, చకితకామకరవాల,శైలకులబాల పెడనపురీలలామ-రా.౨౩

గాఢమోహవ్యూహకాంతారములలోనఁ జనిచని దుస్తరాశాపలాశ
శాఖాశిఖల నెక్కి జవమున నూదాఁటి వారవధూకదంబకుచవ
సుంధరాధరముల సుఖకేళి ... ... ... నెఱుంగక దా
వచ్చి ... ... లత్రాటబంధింప బడె మన్మనఃకరి చెడుగు గడఁగి
మగుడరానీకయందభిమానముంచి, దృఢముఁజేయవె పెడనపురీలలామ-
ఆర్యవై మొదలింటి భార్యవై యర్ధాంగ మునఁ బెనఁగొని నీవు దనకుఁగల్గ
ముక్కంటి తలమీఁద నెక్కించుకొనియె నా, ।మందాకిని నిదేటి మగతనంబు
కాదైన సర్వజ్ఞుఁ డేదిచేసినఁదప్పు లే దందుకే నీదు పాదపద్మ
ములకు మ్రొక్కిన నంత ముదమెద సవరించి ప్రీతి నీతోఁగూడి నీతులాడి
కామితము వేఁడఁ బూలవిల్తాని కేళి, నేలి తేలీలఁ బెడనపురీలలామ-రామ.
అనుదినంబుఁ ద్రిసంధ్య లందుఁ గాయత్రి నా సావిత్రి నా సరస్వతియనంగఁ
ద్రివిధనామముల భూదివిజుల తలఁపులఁ దగిలి త్రిమూర్తుల మిగిలికాళ
రాత్రివై రాత్రించరప్రభువుల నెల్లఁ గడలు నిల్లడలు గ్రక్కదలఁ ద్రోలి
తాలిమిఁ గని దేవతాసభలను సర్వమంగళాభిఖ్యఁ జెలంగి, మోహ
నాంగివై తి మనఃప్రియోత్సంగపీఠి, నృత్యమాడుచుఁ బెడనపురీలలామ-
కుడిచేత గడుసువా లెడమచే గుడుసుడా లడర గ్రక్కున నుక్కు పిడుగుపడ్డ
పగిదిఁ బగతుల పైఁ బడి వడిఁ దాఁకి పో నడఁచి యొక్కుమ్మడి సుడివడంగఁ
జక్కాడుచోఁ జేరి మ్రొక్కిన పగఱఁ బెన్నక్కువఁ బెనిచితి మరువుదూర
దండెత్తి వచ్చిన దనుజులఁ బనిచితి హాళిమహాకాళి యసితచూళి
గర్వితంబౌనె శత్రునిబర్హణంబు, కృత్యమే కాక పెడనపురీలలామ-రామ.౨౭
మన్మథుం డింద్రాద్యమరముఖ్యకార్యధురంధరుండై స్నేహబాంధవంబు
కొఱఁ కరుదెంచి దార్కొన్న ముక్కంటి మూఁడవకంటిమంటలఁ దవిలి రవిలి
నివురైన త ... నిగ్రహంబున కోర్వ రా ...మునికభయ
దానంబు సౌభాగ్య దాన మింతికిఁ బునఃప్రాణదానంబుఁ దత్పతికి నిచ్చి
నెగడి రతిశోకదావాగ్ని నిగుడనిక, ప్రియునిఁ గైకొంటి పెడనపురీలలామ.-
కైసేయ రెండన్నాలపుర్వులే కాని మణిహారము లటన్నమాట సున్న
కబళింప కటికిపాల్లడలి చేఁదే కాని మధురాన్నము లటన్నమాట సున్న
కలియఁబూయఁగ వల్లకాటి బూడిదె కాని(మంచిగంద)మటన్నమాటసున్న
వలెవాటు మఱి పెద్దపులి చర్మమే కాని మడుఁగు వల్వ లటన్నమాటసున్న

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## ద్వితీయభాగము. *

## షష్ఠాశ్వాసము.

—॥ పదుమూఁడవకథ ॥—

క. శ్రీకరుణారసమయ విభ, వాకరనయనద్వయప్రభామితు ఘననా
భీకమలస్థితసుతు విను, తాకారు వికారదూరు నఖిలాధారున్.

క. మనమునఁ దలఁచుచు భోజుం, డను వగులగ్నమున నెక్క నరుదేరఁగ నా
సనపాంచాలిక నిలునిలు, మని జనులకు నెల్ల విస్మయంబుగఁ బలికెన్. ౨

క. సత్వము సాహసమును దా, తృత్వమ్మును విక్రమార్కు తెఱఁగునఁ గనకే
సత్వరగతి నరుదేరఁ బ్ర, భుత్వము ఘన మానె యతని బురుడించెదవే. ౩

క. మదిఁ దలఁచి చూడు నావుడు, విదితంబుగఁ దద్గుణములు వినిపింపుము స
మ్మద మొదవ నిచట ననినం, బదుమూఁడవబొమ్మ భోజపతి ట్లనియెన్.

ఉ. ఖండితవైరిమండలుఁ డఖండపరాక్రమదర్పశాలి యా
ఖండలవైభవుండు త్రిజగద్భరితామలకీర్తిచంద్రికా
మండితమండలాగ్రుఁడు సమగ్రజయాస్పదబాహుయుగ్ముఁడై
చండతరప్రతాపుఁ డగుసాహసభూషణుఁ డుర్వి యేలుచున్. ౫

గీ. ఆఱునెలలు గడపి యంత దేశాంతర, మరిగి వనము లూళ్లుఁ దిరుగుచుండి
కనియె గంగపొంత జనమేజయుం డను, ధర్మశాలి దైనధర్మపురము. ౬

క. ఆయగ్రహార మొయ్యన, డాయఁగ మా పైన నొక్కటన్ ద్విజునింటన్
రే యుండి రేపకడ నది, తోయంబులఁ గ్రుంకఁ జనుచు ధూర్జటిఁ దలఁచెన్.

ఉ. కామునిఁ గాల్చి బూడిదను గంధముగాఁ గొని యొద్దు నెక్కుచుం
బాములుఁ దోలు నెమ్ములుఁ గపాలములుం దనమేని సొమ్ముగా
గాములఁ గూడి యాడుచును గాడు గృహంబుగ నున్నవాఁడు గం
గామృత మౌఁదలం జిలికి నంత సదాశివుఁ డయ్యె నెల్లెడన్. ౮

క. అనుచుం గనుఁగొనెఁ గృతముని, జనసంగన్ ద్విజసురంగఁ జపలతరంగన్
ఘనకంకణలసదంగన్, జనితామితదురితభంగ జాహ్నవిగంగన్. ౯

వ. కని మ్రొక్కి శుచియై సచేలస్నానంబు సేయుచు. ౧౦

---

* ప్రథమభాగము, అయిదాశ్వాసములు, ప్రత్యంతరము లేమిచేఁ బ్రచురింప నవుపడలేదు.

క. మలినుఁడు మైఁ గడఁగిన ని, ర్మలుఁ డౌ టది చెల్లు లోకమాతా నీలో
దలఁ దడిపినఁ జలి లే దని, వెలయుట యాహా రుసి నుదుటి వేఁడిమిఁ జుమ్మీ.

గీ. ఒకనియడుగుఁ జేరి యొకని యౌఁదల యెక్కి, యొకని వెంటవచ్చి యొకనిఁ గలసి
వెడలి పాఱి తనుచు విందు మ ట్లయ్యు నీ, జీవనంబు లోకపావనంబు. ౧౨

చ. అని కొనియాడుచున్ జలకమాడి శివార్చన దీర్చి సూర్యు నిం
పునఁ బ్రణుతించి యూరిదెసఁ బోవఁగ వీనుల కెల్లఁ దేనియల్
చినుకఁ బురాణవాక్యములు చెప్పెడి విప్రుని జూచి యమ్మహా
జనసభఁ జేరి మ్రొక్కి సరసస్థితితో వినుచుండ నయ్యెడన్. ౧౩

గీ. దానధర్మములకుఁ బూనక తనపొట్ట, నినుపుకొనఁ దలంచుజనుఁడె పశువు
పసరమైన మెఱుఁగు బండియీడుచు దున్ను, నంతకంటెఁ గష్టుఁ డంద్రుబుధులు.

క. వదనము ప్రసాదసదనము, హృదయము సదయంబు మాట లింపుల తేటల్
మెదలుట మేలునఁ బొదలుట, సదమలవర్తనుల కివియ సహజగుణంబుల్.

క. సురలకు ధరణీసురులకు, హరిహరులకుఁ బ్రియమొనర్చుయాగము లెల్లన్
సరిగూర్చి యెత్తుచోటను, శరణాగతరక్షణంబు సరిగా వెందున్. ౧౬

చ. అని చదువం బురాణవచనార్థము సత్యముగా నెఱింగి స
జ్జనులు మనంబులోనఁ గడు సంతసమందుచు నుండఁగా భయం
బున మదిఁ దల్లడిల్లుచును బొబ్బలు వెట్టుచు నొక్క వృద్ధకా
మిని పఱతెంచి వారలసమీపమున న్మొఱచేసి యేడ్చుచున్. ౧౭

గీ. పొలములోన జింకఁ బులి వట్టుకైవడి, వడి నెదిర్చి సంధ్యవార్చువేళ
గంగలోన మొసలి మ్రింగెను నాపతి, ననదఁ గావరయ్య యయ్యలార!

వ. అనుచుం బెదవులు దడుపుచు దీనవదనయై మ్రొక్కిన నక్కజంబుగా నక్కామిని యక్కఱఁ జక్కఁబెట్టలేమి నక్కటా యనుచు నొక్కటియు ననలేక విప్రజాతి గావున నొండొరులమొగంబులు చూచుచు నున్నెడ నిగుఱు గప్పిన నిప్పు చొప్పున నున్న యప్పురుషరత్నం బప్పుడ దిగ్గున లేచి. ౧౯

క. తల్లీ యిఁక నుల్లంబునఁ, దల్లడ మందకుము మొసలితలఁ ద్రెంపుదు నీ
వల్లభు విడిపింతును నే, కల్లోలిని గలఁతు హల్లకల్లోలముగన్. ౨౦

గీ. అనుచు నభయమిచ్చి యటఖడ్గసహితుఁడై, గంగఁ జొచ్చి రాజపుంగవుండు
కొంకు లేక యీఁది యుంకెలు వేయుచుఁ, గడిఁది మొసలిఁ దృణముగాఁ దలంచె.

గీ. పిడుగుకంటె మిగుల బెడిదమౌ నడిదంబు, పూని డాసి వ్రేసి దానిఁద్రుంచి
యంటుఁగోఱలెడపి గంటి మంత్రించుచు, బడుగు బాఁపనయ్య వెడలనడిపె.

క. నిజనామము దలఁచిన నం, బుజనాభుఁడు వచ్చి మొసలిఁబోరిగొని కరుణన్
గజపుంగవుఁ గాచిన క్రియ, ద్విజపుంగవుఁ గాచి మనుజదేవుఁడు వెడలెన్.

శా. ఆవేళన్ జను లెల్ల నుల్లములఁ జోద్యం బందుచు న్నేలు మే
లీవీరాగ్రణి సాటిచెప్పఁ గలరే యేవీరు లైన న్భువిన్
దైవం బీతనిపాలఁ గల్గె నని వింత ల్గాఁ బ్రశంసింపఁగా
నావిప్రుండు నిజప్రియాసహితుఁడై హర్షించి దీవించుచున్. ౨౬

ఉ. సాహసికాగ్రగణ్య రభసంబున నీ వరుదెంచి యుమ్మహా
గ్రాహముఁ దుంచి నన్నుఁ గృపఁ గాచితి దీనికి మాఱు మేలుగా
నీహిత మే నొనర్చెదను నీ వతిదుర్లభ మంచు దీని సం
దేహము లేక కైకొనుము దేవసమానుఁడ వీవు గావునన్. ౨౭

క. ఓపురుషవర్య నే నొక, తాపసు దయఁ దొల్లి నర్మదాతీరమునన్
గోపాలమంత్రజపమున, నేపినక్రియఁ దపము సేయుచుండఁగ నాకున్.

వ. ఒక్కనాఁటి రాత్రి సుఖస్వప్నావసరంబున. ౨౮

సీ. మేనుంబు కడఁబొల్చుమెఱపుకై వడినున్న పీతాంబరముదిండు బిగియఁగట్టి
తరుణాతపద్యుతి హరిచందనం బొప్ప రవిభంగి నురమున రత్న మలర
యమునాజలమ్ముపై నమరు నెత్తమ్ముల తమ్ములౌ తెలిగన్నుఁదమ్ము లమరఁ
గరిరాజుశిరమున ఘనరత్నఖచిత మౌ దండచాడ్పునఁ బిలిదండ యమర
వన్నెలన్నియుఁ దనలోనివన్నెలనఁగఁ, గరుణఁబోడవై నరూపశృంగారమనఁగ
గోపికల మరులుకొల్పిన తీపులాఁడు, రమణఁగనుపట్టెగోపాలరత్న మెదుర.

వ ఇట్లు సన్నిహితుండై. ౨౯

శా. ఆదేవుండు మహాప్రసన్నవదనుండై యాస్యహాసం గృపా
ర్ద్రైవాఱఁగ నన్నుఁ జూచి తలఁపు ల్సిద్ధించు నీ కిప్పుడో
భూదేవోత్తమ నీజపంబును దపంబు న్నాత్మఁ గైకొంటి నే
నీదైవంబ ఫలంబు దీనికిఁ దగన్ నిర్మించి నీ కిచ్చెదన్. 30

వ. వినుము స్ఫటికసోపానంబులును గనకఘంటికలును నింద్రనీలస్తంభంబులును మహారజతకుడ్యంబులును రమ్యహర్మ్యంబులును చీనాంశుకధ్వజంబులు గుసుమితపర్యంతవనంబులు విద్యాధరీగణంబులును గామగమనంబులును గలుగు ద

వ్యవిమానంబు దేహావసానసమయంబునఁ బ్రాపించు నని యానతిచ్చి చని
యె నట్టిఫలంబు నీ కిచ్చి కృతార్థుండ నయ్యెదఁ గైకొను మనిన నమ్మను
జేంద్రుండు. ౩౦

క. ఆర్త్యాతురుఁ డని నిను నా, నిత్యకృపావృత్తిఁ గాచి నిలిపితిఁ గాకేఁ
బ్రత్యుపకారంబున కీ, కృత్యము సేయుదునె దీనికిం బియ మేలా. ౩౨

గీ. అనదఁ గాచుట కులవిద్య యండ్రు మాకు, రాజపుత్రుండ నిదియధర్మంబుగాదె
నీకుఁ జేసిన మేలుగాఁ గైకొనకుము, క్షత్రియకులంబు భువి వాచపాత మగునె.

ఉ. నావుడు విప్రుఁ డిట్టివచనంబుల నాతని నిక్కమార్గ్యుఁగా
భావములోపలం దెలిసి పార్థివశేఖర నేఁడు నీ వనం
తీవిభుఁ డౌట నే నెఱిఁగితి న్నటి యన్యుల కీర్తిచిత్రము
న్నావును సాహసంబు శుభలక్షణము ల్వినయంబుఁ గల్గునే. ౩౪

చ. ఇది కడు మేలు చేకుఱె నరేశ్వర నిన్గనుఁగొంటి బ్రహ్మకున్
వదన భుజోరుపాదముల వర్ణము లుద్భవమందె నాల్గు చ
క్కఁదనమునందు విప్రులకు క్షత్రియజాతికి నొక్క వేళ మే
లొదవఁగఁ బెట్టుకుం గొనుట యుం దమలోపలఁ జెల్లుపెద్దవర్. ౩౫

ఉ. ఈదురవస్థ కడ్డుపడి హీనుని విప్రునిఁ గాచె నంచు నీ
మేదినిలోనఁ గీర్తియును మేలుఁ దలిర్చెదె విన్నవించుచో
నాదరణంబు సేయఁ దగదా సుకృతం బిది దుష్టదానమే
కా దననేల కొమ్మనుచుఁ గైకొనఁ బ్రార్థనచేసి యిచ్చినన్. ౩౬

ఉ. కైకొని విప్రు వీడుకొని గంగకు భక్తి నమస్కరించి కం
ధాకరవాలయోగవిధిదండసమన్వితుఁ డై నృపాలుఁ డ
స్తోకమనఃప్రసాదమున జోగివిధంబున నంతనంత ను
త్సేకము లేక యేగి బహుదేశములుం గలయం జరించుచున్. ౩౭

సీ. రుచిరసరోలంబరోలంబకలకంఠకలకంఠకులవృతకలకలంబు
బంధూకబంధుసౌగంధకగంధినికేతనకేతకీకేతనంబు
పరిభూతభూతప్రపంచాస్యనాగేంద్రనాగేంద్రభోగభూమి
సేకసముత్సేకభీకరసూకరకాసారకాసారభాసురంబు
చలపలాశపలాశరసాలసాల
తాలహింతాలశీతలోత్తాలతలము

మృగమృగాదనమృగనాభిమృగమయంబు
వింధ్యవనము సొత్తెంచె నవంధ్యబలుఁడు. ౩౮

క. అక్కడఁ గడు దూరము చని, యొక్కెడ నిలుచుండి హాహా మొలయఁగ జలమే
దిక్కునఁ గానక చీఁకటి, నక్కజముగ నిండి శూన్య మగుచుడిఁ గనియెన్. ౩౯

క. శాశ్వతముగ నాయుందటు, నీశ్వరలక్ష్మీశభారతీశ్వరమయ మై
విశ్వజనాశ్రయముగ నొక, యశ్వత్థముఁ జూచి చేర నరుగఁగఁ గ్రిందన్.

క. వెడఁద మొగంబులు గోళ్ళు, నిడుగ్రుడ్లును గుజ్జుదచెవులు నిడిమీసములున్
సుడిగొన్న వెండ్రుకలతో, నుడియఁగ నొక బ్రహ్మరాక్షసుం గనుఁగొనియెన్.

చ. కని నిశ్శంకుఁడు సాహసాంకుఁడు మహాకౌతూహలుం డై రయం
బున డాయం జని యిట్టి కాఱడవిలో భూతంబవై యున్ని యె
వ్వని మూలంబున నయ్యె నెవ్వఁడవు సర్వంబుం దగం జెప్పుమా
యనిన న్విప్రుఁడుఁ గంది నాఁకు నిజవృత్తాంతస్మృతిన్ న్నస్రుఁడై. ౪౨

క. ధరఁ గలపురాణముల వ్యా, కరణంబుల శాస్త్రములం నిగమములఁ గవితం
బరిణతుఁడ మాళవేంద్రుని, పురోహితుఁడ జన్మనామ్నుఁ బురుహూతుండన్.

గీ. అధిపుకొలువున నేఁ బరిహాసకారి, నగుటఁ జేసియు నొకనాఁడు డెగడి పుచ్చి
యట్టికీడున నిట్లయం బైనయుసపుఁ, జచ్చి గతి లేక బ్రహ్మరాక్షసుఁడ నైతి. ౪౪

క. ఈయెడ నేనుండఁగ నిదె, వేయేండులు చనియెం గీడు వినుమ బలిమిన్
నీయట్టిపురుషరత్నం, బీయులజడి బాపనోపు నీశ్వరుఁ పుణ్.  ౪౫

ఉ. నావుడు వానిదీనవచనంబులకుం గరుణార్ద్రచిత్తుఁ డై
భూవరుఁ డాత్మలోనఁ దలపోసి వినిశ్చయబుద్ధి నీయుప
ద్భావముఁ బాపనోపెడు నెపంబుగఁ జిత్తమునం దలంచి నా
జీవము వేఁడినం గొఱంత సేయక యిచ్చెద వేఁడు మియ్యెడన్. ౪౬

చ. అనవుడు వాఁడు సంతసము నచ్చెరువుం గడుఁ బిచ్చలింపఁగా
మనమునఁ బొంగి పాపము క్రమంబునఁ బాయఁగ గంగలోన వి
ప్రునిఁ దగఁ గాచి చేకొనిన పుణ్యము నొకడఁ గల్గఁబోలు విం
పెనయఁగ ముక్తిమార్గమున నేగెద నాఫల మిమ్ము నావుడున్. ౪౭

గీ. బ్రహ్మరక్షణమునఁ బడసిన సుకృతంబు, బ్రహ్మరక్షకుండు భక్తి నొసఁగ
బ్రహ్మరాక్షసుండు బ్రహ్మమీఱిననపర, బ్రహ్మపదముఁ జేరి భవ్యుఁ డయ్యె.

క. నిష్పాపదేహుఁడై గతి, నిష్పన్నం బైన నెగసి నెలఁతలు గొలువం
బుష్పాయుధసముఁడై మణి, పుష్పకమున నుండి మ్రొక్కి పోయె దివికిన్.

వ. ఇట్లు తం డరిగిన తదనంతరంబ ౫౦

శా. ధాత్రీపాలకశేఖరుండు నటఁ దత్త్వార్థ్యంబు సంధిల్లఁగాఁ
జిత్రం బంది విదేశపర్యటన మీమాంక్షింపంగ నాకున్ జగ
న్మైత్రీకారణ మయ్యె నంచు మది నానందించుచు న్గాఢచా
రిత్రుండై మగిడె న్యశంబు దిశలన్ రెట్టింప నుజ్జేనికిన్. ౫౧

క. కావున నీకీగుణములు, లే వీజన్మమున న్క్రతే వీ వనినన్
భావం బెడలఁగ ధారా, భూవల్లభుఁ డంత నంతిపురమున కరిగెన్. ౫౨

## —। పదునాల్గవకథ ।—

వ. మఱియును గతిపయదినంబులు చనిన. ౫౩

క. కదలనివిల్లును గాలిం, బొదలెడు నారియును నిద్రవోయెడుశరముం
బదనుండు జడముడియుఁగల, ముదిజోదున్మొదలి వేల్పుముదఘునఁదలఁతున్.

క అని భోజుఁడొక్కవేళం, గనకాంబరభూషణములు గడు బెడఁ గడరం
జని సింహాసన మెక్కఁగఁ, గని పదునాలుగవబొమ్మ కలకలఁ బలికెన్. ౫౫

క. ఓనరనాయక చెల్లని, పూనిక లవి నెఱపనేల భువి నుజ్జయినీ
మానవనాథుని కెనయగు, గానగుణము లేక యెక్కఁ దరమే నీకున్.

క. నావుడు నాతని వితరణ, మే నెరవున నెచట నొదవె నెఱిఁగింపు మనన్
భావజ్ఞులు మనమున సం, భావింపఁగ నిట్లు సాలభంజిక పలికెన్. ౫౭

క. ఆయవనీపతి కీర్తి, స్థేయుఁడు పరన్పృహకులాభిధేయుఁడు ధృతిగాం
గేయుఁడు వితరణగుణరా, ధేయుఁడు జనసత్త్వనైన తేయుఁడు చుమ్మీ. ౫౮

ఉ. పార్థివుఁ డొక్కనాఁ డవనిభారము మంత్రికి నప్పగించి ధ
ర్మార్థము మేన నించుక ప్రయాసము దోఁపఁ జరింపకుండినన్
వ్యర్థము జీవనం బని నయంబున వెల్వడి యోగివేషి యై
తీర్థములుం బురంబులు విదేశములుం దగ సంచరించుచున్. ౫౯

క. అగణిత సౌధోజ్జ్వలరుచి, గగనస్థలి యభ్రగంగగతి నమరంగా
నగపక్షవైరినగరము, నగి మెఱుగతి నున్న యొక్కనగరముఁ గనియెన్. ౬౦

క. ఆనగరముచేరువ ను,ద్యానవనాంతరమునందు నలరెడునదిలో
స్నానంబు చేసి సిద్ధస్థానం బగు నచటిగుడికిఁ జని సంప్రీతిన్. ౬౧

అంబురుహాంబులు దనహ, స్తాంబురుహంబులఁ దెమల్చి యతిధీరుం డై
త్ర్యంబకునిదేవి యగు జగ, దంబకు నంబికకు భక్తి నర్చన లిచ్చెన్. ౬౨

ఉ ఆకడ మున్ను చండికకు నర్చన లిచ్చుచుఁ గొల్చియున్నయ
స్తోకతపఃప్రసిద్ధుఁ డవధూతుఁడు చూచి యుదారమూర్తి నీ
వీకడ కేల వచ్చి తను డేచు విదేశిఁ బరిభ్రమించుచున్
మీకృపఁగోరి తీర్థములు మెట్టుచు నిక్కడ కేగుదెంచితిన్. ౬౩

క. అనవుఁడు నాతఁడు నవ్వుచు, ననుమానము లేదు విక్రమార్కుఁడ వగుటం
గని యెఱుఁగుదుఁబూర్వంబున, ననుమూర్ధుని జేసె మొఱఁగ నాయంబగునే.

వ. అనిన నతం డే నియ్యెడం బరదేశి నగుట దప్పదు సకలరాజ్యభారంబున
నీతిధురంధరుం డగు మంత్రిశిరోమణి భట్టిం బురంబున నిల్పి భవాదృశు
లగు పురుషరత్నంబులం జూచుట కారణంబుగాఁ దీర్థంబులం దిరుగుచున్న
వాఁడ ననిన నజ్జనవల్లభునకు బుద్ధి సెప్పుచు సిద్ధవల్లభుం డి ట్లనియె. ౬౫

క. పూజ్యుఁడవు సకలతిమిరహ,రజ్యోతీరూప మైనరవిమూర్తివి నీ
రాజ్యంబు నిఖిలధర్మ, ప్రాజ్యం బది విడిచి యిటకు రాఁ దగ వగునే ౬౬

క. ధనముం గృషియును విద్యయు, వనితయు నృపసేవనంబు వాణిజ్యంబుం
దనగర్మంబుఁ జికిత్సయు, ననుదినమును గట్టిగాఁగ నరయఁగ వలయున్. ౬౭

గీ. ధరణిఁ దిరుగ నన్యధరణీపతులచేత, నచట నొండు కార్య మయ్యెనేని
దిక్కు గలదె వేల త్రిమ్మరు టది యేల, చాలు నింక మగిడి చనుము పురికి.

ఉ. నావుడు భూవరుండు మునినాథ ననుం గృపఁజూచి పల్కుచో
నీవచనంబు దప్ప దది నీతియుతం బగు వస్తురక్షకున్
దైవికమానుషంబు లనఁ దద్గుణముల్ ద్వివిధంబు లందులో
వేవురు దైవ మెక్కుడన వేవురు నుద్యమ మెక్కుడం డ్రిలన్. ౬౯

ఉ. ఈయెడఁ గర్మభూమియగు డెవ్వరి కైనను బుద్ధి నేర్పునం
జేయఁగ లేదు కాల మెడచేసిన నేతిము లెత్తి కాల్వలుం
బాయలుఁ గొల్లు నూతులును బావులు రాట్నములున్ జలార్థమై
చేయఁగనాయెఁ గాక మఱి చేయనినాఁ డవి తామె పుట్టునే. ౭౦

క. ధాత మును నోరుఁ గన్నులుఁ, జేతులుఁ దగ నిచ్చి కుడువఁ జేకూర్చినచోఁ
జేతఁ గడి యందుకొనఁడే, నాతఁడెఁ గడి యేగి వచ్చి యంగిటఁ బడునే.

క. ఉత్తముఁ డుద్యోగఫలా, యత్తుండగు భాగ్యాభిలాషి యధముఁడు రెంటం
జిత్తంబు గొల్పు మధ్యముఁ, డుత్తముకడ నుండ లక్ష్మి యొడఁబడు నెపుడున్.

వ. అట్లయ్యును మానుషకృత్యంబున కుపహతి గలదు గాని దైవకృతంబు
నకుఁ జేటు లే దని మున్ను నాకుఁ బ్రసన్నుం డైన పరమేశ్వరునిమీఁద
భారం బిడి నిశ్చింతుండ నై చరియింపుము. ౨౩

గీ. లావు లేనివేళ దైవంబు గలిగిన, నెచట నైన లక్ష్మి యేఁగుదెంచు
నడవిఁ జొచ్చినంత యక్షులకృపఁ జేసె, రాజశేఖరునకు రాజ్య మయ్యె.

ఉ. నావుడు రాజశేఖరుఁడు నా నతఁ డెవ్వఁడు యక్షదైవసం
భావన యెట్లు గల్గె జనపాలక యాకథఁ జెప్పు మన్న నా
భూవరుఁ డిట్లనున్ ద్రవిళభూమి నెఱుంగ నతఁ డాజిశత్రులం
బ్రోవులుగా నొనర్చి సిరి వొందఁగ రాజ్యము సేయుచుండఁగన్. ౨౪

ఉ. నొచ్చినవారి సూను లగునూర్వరి రాజులు దండుగూడి పై
వచ్చినఁ గోటలోనఁ బరివారము గొంచెము గాఫున న్వడి
న్విచ్చి చనంగ నానృపతి వేగమ పత్నియుఁ దానుఁ గానలోఁ
జొచ్చి నిగూఢమార్గమున స్రుక్కుచుఁ గందుచు లోనఁ గుందుచున్. ౨౫

ఉ. అక్కడఁ బ్రొద్దు గ్రుంకఁగ మహావటవృక్షముఁ జేరి విన్ననై
చెక్కిటఁ జెయిఁ జేర్చి తనచేడియ చింత మునుంగ నాత్మలోఁ
బొక్కుచు నిద్ర లేక తలపోయఁగ నానడురేయి వింతగా
నెక్కటి మఱ్ఱిమీఁద గల యేవురు యక్షులు కార్యదక్షులై. ౨౬

చ. మనకు విహారదుర్గ మగు మద్రపురంబున కీశుఁ డైన యా
జనపతి నిన్నఁ జచ్చె మఱి సంతతి లేదు తదీయరక్షకె
వ్వని నిఁక నిల్పి రాజ్యసుఖవైభవ మిత్తుము చెప్పుఁ డంచు నే
ర్పునఁ దమలోనఁ గూడి తలపోయుచునుండఁగ నొక్కఁ డిట్లనున్. ౨౭

ఉ. ఇంతవిచార మేల మన కీవటవృక్షము క్రిందనున్న భూ
కాంతుని నప్పురంబునకుఁ గర్తగఁ జేయుద మెల్లి నావుడున్
సంతసమంది యందఱును సమ్మత మా నిది యంచుఁ బల్కి నం
జంత దొలంగి యానృపతి చెల్వయుఁ దానును నుల్లసిల్లఁగన్. ౨౮

ఉ. ఆకమలాప్తసూతుఁ డుదయాద్రికిఁ జేరుచుఁ దూర్పుదిక్కునం
జేకొని కెంపుగుంపు గొనఁ జేయుచుఁ దారల పెంపు డింపఁగా

## ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు. పరిషద్యావజ్జీవాధ్యక్షులు.
కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.
శ్రీరాణీ వత్సవాయి వేంకట సుభద్రయ్యమ్మజగపతిబహద్దరుగారు-తుని రాణీగారు.
కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు-

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.
వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు.
రావుసాహెబ్ డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ., ఎల్. టి. Ph. D
(ఉపాధ్యక్షులు )
శ్రీ ప్రరాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.
కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.
శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., యల్. టి.
దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. ఎల్.
అళక్కి వేంకటాద్రియయ్యగారు.
కేశవరపు కామరాజుగారు.
కోకా వేంకటసుబ్బారావు నాయుడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.
పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.
పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయుడుగారు.

# కాకినాడ-ఆంధ్రసాహిత్యపరిషత్తులో

## వెలకుదొరకు గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి .. | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు ... ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము- శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... .. | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము- జ రామయ్యపంతులుగారు, | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి- విన్నకోట పెద్దయకవి ... ... | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు ... | 0 | 8 | [illegible] |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు ... | 0 | 4 | 0 |
| 18 | హాస్యరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు ... ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు ... ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ ... ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁకుఁడు ... | 0 | 12 | 0 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి ... | 1 | 4 | 0 |
| 23 | రెడ్డివారిరెండుశాసనములు ... ... | 0 | 4 | 0 |
| 24 | ఆంధ్రధాతుమాల ... ... | 0 | 12 | 0 |
| 25 | శాసనపద్యమంజరి ... ... | 0 | 12 | 0 |
| 26 | శతకసముచ్చయము (ప్రథమభాగము) ... ... | 0 | 12 | 0 |
| 27 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) ... ... | 0 | 8 | 0 |
| 28 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి ... ... | 0 | 8 | 0 |
| 29 | రసాభరణము—అనంతకవి. ... ... | 0 | 8 | 0 |
| 30 | చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) ... ... | 1 | 8 | 0 |
| 31 | ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు ... ... | 1 | 0 | 0 |
| 32 | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య ... ... | 0 | 8 | 0 |
| 33 | ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతీవ్యాఖ్యతో ... ... | 0 | 8 | 0 |

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada

శ్రీ

# ఆంధ్రసాహిత్య

# పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**

సంపుటము ౨౧. { ఆంగీరసనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢ మాసములు. } సంచిక ౨.



కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1932.

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౧. { ఆంగీరసనామసంవత్సరము జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౨.

## ఆంగీరసగౌతమీపుష్కరము.

(1-7-1932)

వడ్డాది సుబ్బారాయఁడుగారు, రాజమహేంద్రవరము.

మ. భువనక్షేమవిధాయి ! పుష్కరజనంబుల్ వేనవేల్ గౌతమీ
సవనం బాడగ రాణ్మహేంద్రనగరిన్ సర్వాశలందుండి తీ
ర్థవిధుల్ సల్పికొనంగ మూఁగెదరు; చోరవ్యాధిబాధాదివి
ప్లవ మాంగీరస నొందనీకు ప్రజ; దేవా ! భక్తచింతామణీ. 1

శా. ఓయాంగీరస ! యర్వదేండ్ల కొహాహో యుష్మత్పునర్దర్శనం
బాయెన్ రాజమహేంద్రమందు, వ-సు- రాయస్వాగతం బందుకో;
న్యాయం బౌజరమార్పు నీయెడలఁ గానన్, గౌతమీపుష్కర
శ్రీయుక్తాబ్దమ ! పౌరతైర్థికసుఖక్షేమార్థ మర్థింతు నిన్. 2

తే. అరుదు, క్రిందటి యాంగీరసాబ్దమందు, వాడపల్లి గోదావరివారినుండి
పుష్కరదినంబులను ధూమపుంజము సుర,గాలి కైవడి మింటికెగయుట గంటి.

తే. పుష్కరాద్యదినము ప్రొద్దుట నాంగీర,సాబ్దమునను బుష్కరాధిపతిని
బుష్కరంబునుండి బుధు లభిషిక్తుఁ గా,వించి రనఁగఁ గుంభవృష్టి గురిసె. 4

(జ్యేష్ఠ బ ౧౩ శుక్రవారము.)

ఉ. వేగురు తోఁటివాండ్రఁ బురవీథుల నూడిచి పుష్కరంబునం
బా గొనరింపఁ గూరిచిరి పాలకవర్గము వారు; వారిచే
సాగనిశుద్ధికార్య మొకజామునఁ జక్కఁగ నెగ్గె, హోరునన్
వాఁగులు వాఱఁగాఁ గురియు వారిధరంబులనీరధారలన్.

ఉ. తెల్లనివాఁడు నల్లనయి, త్రిప్రభ లొక్కటఁ దోఁప గట్లతే
నల్లుఁడు చీఁకటిం దెఱచి యక్షులు పుష్కరశోభ గన్గొనన్,
జల్లనిదాన జల్లును, బ్రచండములన్ బిడుగుల్ మెఱుంగులుం
బెల్లుగ నుప్పతిల్లెఁ బ్రజ భీతిల రెండవనాఁటి రేయిటన్.

చ. శివునకు మాత్రమే నుదుటఁ జిచ్చుఱక న్నొకఁ డుగ్రముండు న
న్చు వినుదుఁ గాని, యిప్పుడు గనుంగొనుదున్, బహుశాశనిస్ఫులిం
గవిసరవిద్యుదక్షితతి కాయమునంతటఁ గల్గి నేఁటి రే
భువనము లెల్ల రౌద్రరసపూరితముం బొనరించునిన్ ఘనా?

చ. అమరులు తెప్పవా ల్పెఱుఁగ రందురు; మేఘుఁడ! నీవు వారివ
ర్గమునకుఁ జెందినట్టిఁడవె గా; యమృతంబును గ్రోలి వ్యోమమా
ర్గమునను సంచరించెదవు, గావున నీబహుళత్రియామ బ
త్తిమిరమునందుఁ గన్ను చికిలించునినుం గనుదున్ వెలుంగునన్.

చ. దినమును వేనవేల్ ప్రజలు దేపకుఁ బాపముఁ బాపికో, జలా
వనిగగనత్రియానముల వచ్చుట, హెచ్చుగ రాజ్మహేంద్రప
త్తనమునఁ బుష్కరాన బహుధా ఘటియిల్లెడుమైల సర్వమున్
మనుజులు మాప నోప రని నాక మహర్నిశ మూనె నాపనిన్.

మ. అరుదారం జదలన్ విమానములు పూర్వాహ్ణాపరాహ్ణంబులం
దిరుగుం బుష్కరమధ్యమందు; బురినట్టిక్కుల్ త్రుటిన్ వేడుకన్
దరిసింపన్ దరిసించి మెదులు పదుల్ దార్కొక్కి. పైనుండి ని
ర్జరులుం బోలెను డిగ్గెద ర్దనులు రాజద్రాజ్మహేంద్రమ్మునన్. 10

మ. ఒకకాల్ వ్రేలఁగ మోడ్పుఁగా లడుగుపై, నుయ్యాలఁ గూర్చుండి, పు
త్రకుఁ డంకంబునఁ గూర్కఁ నూఁచును యశోదాదేవి తడ్డోల; యా
త్రికు లాయంత్రపుఁబుత్రికం బణమునన్ దేశీయవస్తుప్రద
ర్శకశాలం గని కాంతు రెంతయు భ్రమాశ్చర్యాదు లాంగీరసన్. 11

ఉ. ఆరసి *కీలకం జరిపినట్టులె పాలకు తీరుపాటు లాం
గీరస పుష్కరాన జరిగించిరి వీటను దైర్థికాళికిన్;
బోయిలు నాల్గువందలకు బ్రత్యహ మిష్టలు దుర్భసత్రమం
దారఁగ నారగింపు లిడి రంత్రది స్వామిప్రసాద మిత్తఱిన్. 12

మ. అరయం గీలక †బ్రాకెటుంబలె ఘనుం డాంగీరసన్ సబ్ కలె
క్టరు కృష్ణయ్యరు పుష్కరప్రజకు సౌకర్యంబులున్ రక్షయున్
జరిగెన్, దత్పటుశాసనంబునను రాజమ్రాణ్మహేంద్రాఖ్యపుం
బురి, నష్టాదశవారముల్ సుమహితామోదంబు సంధిల్లఁగన్. 13

క. పూరుమయత్నమునకు సహ,కారిగ దైవంబుతలఁపు గలుగుట నీయాం
గీరసపుష్కరమున ము,య్యారు దినంబులును గడచె ననపాయముగన్. 14

చ. పితరులవిందు, వైదికపు విపులవిత్తపుఁబంటచేను, దే
వతలయు సర్వతీర్థములవాసము, భిక్షుకధర్మసత్రమున్
వితరణు లీవు లాఉపది విత్తెడుకాత్రె, యలంకరించె న
ద్భుతమహిమన్ సగౌతమిని బుష్కరపర్వము రాణ్మహేంద్రమున్. 15

మ. "నరు లా ముప్పదిమూఁడుకోట్లసురలున్, సార్ధత్రికోటుల్ మహా
త్తరతీర్థంబులుఁ, దీర్థరాజు, నిట సిద్ధశ్రేణితో నిల్చి యుం
దురు పండ్రెండుదినాలు, పుణ్య"మని వత్తుర్ దూరమందుండి పు
ష్కరపర్వాన నఖండగౌతమిని దోఁగన్ రాణ్మహేంద్రానకున్. 16

తే. అమరరాజమహేంద్రపురాధిపత్య,మునకు నుచితంబుగా వేయికనులతోడ
సబుకలెక్టరు బాలకృష్ణయ్య రాత్మ,శాసనంబునఁ బుష్కరజనులసాఁకె. 17

ఉ. పట్టెను నాగవల్లికళ పౌరగృహాళికి; రాజవీథిఁ జా
పట్టెను జక్రయానములు; బాడిగ తగ్గెను బండ్ల కిండ్లకున్;
ఘట్టములందు నొత్తడి బికారులగోల యడంగె; నంగడుల్
గట్టిరి వర్తకుల్ రకరకాలవి; పుష్కర మేగె బాగుగన్. 18

* కీలక పుష్కరసన్నాహాదిప్రశంస మదీయ మగుముద్రితచాటుప్రబంధమునఁ జూడఁ దగ్గది. ఇటఁ దద్వర్ణనము చర్వితచర్వణమని తలంచితిని.

† కీలక పుష్కరమున బ్రాకెటుదొర సబుకలెక్టరు.

# ఊడింపు.

తి. వ. నారాయణస్వామిగారు-యసి-గిఅగ్రహారము. —

ఉ. తమ్ములతేనె వంగడపుఁ దమ్ములసూడయి వేడ్క నజ్జపా
స్దమ్ములప్రాపుఁజేరు మెయితాల్పుల నేదెసు రాముఁ డెంతో నే
మమ్మునఁ దండ్రియానతిని మానక నొఁదలఁ దాల్చి కానకుం
దమ్ముఁడుఁ గూర్మితొయ్యలియుఁ ద న్వెనుకోఁ జని యందు నిల్వఁగన్. ౧

ఉ. నాఁగలిచాల్పువేరి యెలనాఁగ కడానిమొడ ల్వెలుంగ నం
దేగెడు జింకఁ గన్గొనుచు నేకట నస్మకము న్గడింపఁగా
నేగు మటంచు రాముఁ గడు నెచ్చరియించి తలంచె నిట్లు లో
వేఁగయి క్రచ్చుఁదెమ్మెరలు వేమఱు డె దంపుఁదీవ నూపఁగన్. ౨

క. గొంగబలుమత్తుగారుల, సింగంబయి యులరు నాదుచెలువుఁ డెలమితో
బంగరురంగున నెంతో హా,రంగగు జింక న్గడించిరా; నటుపిదపన్. ౩

శా. మావీట న్ననదోఁట వాటమగు రేమన్నీనిఖామేఢ కా
క్రేవన్ జాదికురాళ్ళపు న్దెవలకున్ గ్రిందై చొకాటంపు నె
త్తావుల్ జిమ్మెడి తమ్మిపూడిగియచెంత న్జింకఁ గట్టించి యొం
తో వేడ్క న్గమికాఁడు చూడ మనిపింతు న్గ్రచ్చు దై వాఱఁగన్. ౪

ఉ. ఆమని రేల వెన్నెలల నాదటఁ జెల్వనిఁ గూడి చల్వకుం
గీమగు నాటతోఁటఁ దమిగ్రోలున దాఁగురుమూఁత లాడు నో
బూమెకుఁ బూవుటీరములఁ బొంచిన నన్గనిపించు నెంతయున్
దీమసమొప్ప బంగరువుతెమ్మెరతేజి యొడంద జేనికిన్. ౫

క. రాచతెఱవా మెకం బగు, నాచెలువుఁడు కూర్మి మీఱ ననుఁ గూడి రహిన్
బాచికల నాడ మెక మెద, నేఁచిన తమి నత్తమిల్లు నెకిమీనికడన్. ౬

చ. అని తలపోయుచున్నతఱి నావెనుఁగానలనుండి "లక్ష్మణా
ననుఁ గను" మన్న నవ్వడి వినంబడఁగాఁ గడ గానరాని జం
కెనకడలి న్మనింగి తనక్రేవలఁ దోడుగ నున్న లక్ష్మణుం
గని యిటులాడె నెమ్మదిని గల్గిన యంజిక చిమ్మిరేఁగఁగన్. ౭

క. బేరజపుటెత్తిఁ జేకొనఁ, గోరి యనిపి బెడఁదఁ దెచ్చికొంటిని చాల్పం
దేరులధొరకూరిమికొడు, కారాటంపడెడు నెట్టి యంగద గనెనో?" ౮

ఉ. ఈరువుబోనపుద్దులువ లీపెనుఁగానల నుండ్రు; వారితో
వేరమిఁ గొన్న జోదనుచు విన్రతనంపుకొలంపువింపుసిం
గారపు రేవెలుంగుఁ గని కచ్చెకుఁ బిల్చిన నోహటించి యా
తీరున నిన్నుఁ బేరుకొని తేఁకువ నేదెనొ చూడు లక్ష్మణా. ౯

క. అగిసెనవచెన్ను నెన్నడి, సొగసగు మేనెండ నెంత సొక్కెనొ? కానన్
దగఁ గొనెనో వగఁగొని వ,చ్చుగరాసులపాలఁ బడుచు స్రుక్కెనొ?మఱఁదీ.

క. అని వల్కుచు వాలాయం గనుఁగొనలం జిలుపచిలుప గ్రమ్మెడు తడినే
త్రి నెగులుఁ గొనెడు మనుమా,లిని గని లక్ష్మణుఁడువల్కు లేనవ్వొలయన్.

చ. అడలకుమమ్మ యింత దనయల్లెఁ గదల్ప జగమ్ములెల్లఁ దుం
డుడుకు వడంగఁ జేయఁగల తోరఁపుబీరమునం జెలంగు నీ
యొడయని కించుకంతయిన నోటమి గల్గిన గుండు లుర్ల వే!
కడలియు నెండదే! యడలి గాములుఁ దొల్లిఁటిజాడ వీడవే. ౧౨

ఉ. తాలిమి యిక్కమై యలరు తల్లికిఁ బట్టివి గాఁగఁ బుట్టి పే
రాలములందుఁ గీడ్వడని యయ్యయుఁ బెన్పఁగఁ బెద్దవొచు మా
స్టిలకు మేలుబంతియగు చెల్వునిఁ జేకొని మించునీకు నే
డేల విశాకునంది వగసీగఁగఁ; జాగురె వింత యయ్యెడిన్. ౧౩

క. కొలఁది యిడరాని మగఁటిమిఁ,జెలువారెడు రాముఁగలనఁజెనకివిలువఁగాఁ
గలజెట్టి బిరుదు పుడమిని, గలనే గ్గలఁడనుట వెఱ్ఱి కాదె వెలందీ! ౧౪

సీ. చెలువంపుజిఱుకూఁకటులనాడెతులువయూపొలది-డితాగనుబిలుకుమారెఁ
నలవోకమై:శేఁతనెలతాల్పు లలిఁదాల్చు బలువిల్లుతునియలై వెలయఁజేస్చె
బలుగాకిరేధిన్మరులమొత్తములఁ దమ్మిచెలి చీఁకటులరేవఁ దలఁగసేసెఁ
బలువరక్కసితెమ్మెరలదిండులకుఁగ్రిడిచెలితేరివగ నెంతొ యశుకు గూర్చెఁ

తే.గీ. గలనఁ గలితన మెుయఁగ నలఁతి నగవు
చెలువమున మోము వెలయఁగ ములుచగముల
నలఁగఁ జేయుచు వలఁతియై యలరునతని
నులుకఁజేయఁగఁ దలకొను ములుచ గలఁడె? ౧౫

క. విల్లెక్కిడ జగమంతయు, నల్లాడెడి కడిమిగల్గు నాతనిఁ జెనకన్
మల్లచఱచు పోటరి యిం,దెల్లెడ వెదకినను గలఁడె యింతీ చెపుమా? ౧౬

ఆ.వె. అగ్గితత్తడి కడు నడరి కలనఁ గట్టుఁ, జెనకి దొరయలేక చనినమాట్కి
రాముఁ గలనఁ బొమవు రక్కసిమొనలెల్ల, జమునయన్నవీటి జాడఁ గనవె ?

చ. చలిపగవాఁడు గ్రుంకుముల చాయలఁదోఁచిన జంటదోయి క
న్నులదొర వేఁడిమి న్విడచి నూఱ్ఱాను నే నివమట్లు బాతితే
రులమొకిమీాని పున్నెములప్రోవగురాముని కొందునైన సి
ల్గు లగునటన్న వెజ్జిపలుకుల్ విని నమ్మకు మమ్మ నెమ్మదిన్. 18

ఉ. దుంతహనుమావజీరు గుదెతో నెనయాచును మిత్త్రికోఱికొ
క్కింతయు లొచ్చుఁగానకను గిత్తిసెకం గదుమీాటి యొంతయున్
వింతలఁ గూర్చెదున్ రుసుల చేలుపుఁజెట్టగు రాముఁ డెంతయున్
బాతమెసంగఁగా విడుచువాఁడిజిరా నెఱిపోరితమ్ములన్. 19

చ. కడిమి నొకింతయు న్గొఱఁత గానని గామిడులెల్లఁ దీసియె
క్కిడఁగఁ దలంకు మిన్వఱఁతకీల్జడివానికడిందివిల్లు లే
వడి యగునించువుం గొనుచు వంచెడు మత్తిలు హత్తితేన్నికై
వడి వడి వంచి పేర్వడిన వాఁడిమగం డతఁ డొడ్డ కట్టనే. 20

మ. కనలేదే మును? కూళరక్కసులు పెక్కండ్రొక్కఁడై రేసి యే
చినకిన్ఫ న్గడున్బల్మి డాయునెడ నొచ్చెం బింతయున్లేని తెం
పునఁ దానొక్కటి యాచు లేటిబలుగుంపు న్గిడ్డిదిండీనిచా
డ్పునఁ జక్కాడుచు నంగవించుటలు వేల్పు ల్చూచి మేల్మేలనన్. 21

మ. పొలదిండుల్ బలుగుండులం గొనుచుఁ బెంపు న్దెంపును న్జాపుచుం
గలనన్ధాయ వితాకుఁ జెందక తలకంబోక నెమ్మోముపై
నెలనవ్వొప్పఁగ రాముఁ డాపలుపల న్నిల్గించుకయ్యంబు క
న్నులఁగన్గొన్న వలంతినై పిఱికితెన్ను ల్పాడ వింతయ్యెడిన్. 22

చ. తలఁకఁగఁబోకు మమ్మ యెడఁదన్ విను మన్నయెలుంగుతో మముం
దలఁకఁగఁజేయ నిట్లన కతంబగు నెవ్వరో? కాక యాతసిన్
దలకడవంగఁబూను నెఱదంట జగమ్ముల లేకయుండ ని
ట్లలుకఁగ నేల? రామునకె యంజిక ? నమ్మఁగఁబోకు నెమ్మదిన్. 23

సీ. గాలిబోనపుమేటి మేలిపానుపుపయిం బండువాఁ డసురులఁ జెండువాఁడు
నొడికారపుఁగటారి యొడయుల యొడఁదలు నెలవువాఁడు కడానివలువవాఁడు

తొలికారుమబ్బుల చెలువెన్నఁదగువన్నె మేనివాఁ డెద నింతి నూనువాఁడు
గుడుసువా ల్వాలకేల వెడఁదజాల్వాలకాలఁదనరువాఁడును నెనరెనయువాఁడు
తే.గీ. నయిన వెన్నుఁడు పుడమి వ్రేఁగడఁచుపొంటె
వేడబము నూని మానిసి వితము దోఁపఁ
బుడమిఁ బొడమినవాఁ డౌటఁ బొలఁతి యతని
కంగద యెసంగ దొక యిసుకంతయైన. 24

చ. అదియునుగాక కాన నిను నాద వడంకగ డించి యన్న కై
కదలినఁ గూళరక్కసులు కంటున నెంతయు మచ్చరించి నిన్
బొదివిన బాసలై నిలుచు పోటరిఁ గానకఁ గాసిఁజెందె దో
వదినియ! యన్నకున్ సిలుగు వచ్చుట దబ్బఱ యంచు నమ్ముమా. 25

చ. అని యిటు వల్కి యుల్కి కడు నాఁగక నెమ్మది నుమ్మలించు న
మ్మనువిరిబోఁడికూఁతుఁ గని మచ్చెపుడా ల్గలయట్టిజెట్టిత
ల్లిని బురుడించి మించఁగల లేమరో! తెల్పితి నింతవట్టు నన్
బనిగొను మెట్లొ లెంక" నని పల్కి యడంకువదోఁప నిల్చినన్. 26

# ఆంధ్రధ్వని

— కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు, పర్ణశాల —

ఇప్పటిదినములలో భాషాంతరీకరణములు చాలఁ బ్రబలముగ నున్నవి. కొంచెము ప్రసిద్ధిఁజెందిన ప్రతిసంస్కృతగ్రంథమున కథమ మైదాఱు భాషాంతరీకరణము లున్నవి. బాగుగఁ బ్రసిద్ధిఁజెందిన గ్రంథములకు (శాకుంతలము మొదలగునవి) ముప్పది నలువది భాషాంతరీకరణము లున్నటుల మన మెఱుఁగుదుము. భాషాంతరీకరణ మన్న మూలగ్రంథము ననుసరించి వ్రాయుటయే గాన నెంతమంది భాషాంతరీకరించినను విశేషము లంతగ నుండవు, కనుక, నొక పుస్తకమునకు నిన్ని భాషాంతరీకరణము లనవసరములు. ఇంతమంది వ్యర్థముగ నిన్నిగ్రంథముల భాషాంతరీకరించుటకన్నఁ దమపాండిత్య ముపయోగించి యంతగ్రంథము వ్రాయలేకపోయినను జిన్నదియగు నొక కావ్యమునో నాటకమునో వ్రాసికొనిన నెంతయొ బాగుగ నుండెడిది.

మఱొకవిషయము. ఈభాషాంతరీకరణమునకుఁ బ్రతివారు సిద్ధమగుట యుచితము గాదు. అట్లయినచో లోకమున కాభాషాంతరీకరణము వలన నెక్కువ యుపకారము లభింపదు. సమర్థు లయినవారు మూలమునకు సరిగ భాషాంతరీకరించి పండితులకుఁ గూడఁ జూపి ముద్రింపించినచో దేశమునకుఁ గొంత యుపకారము గలుగును.

ఇప్పుడు మనకు దొరకుచున్న భాషాంతరీకరణము లన్నిటినిఁ దిరుగ వైచినచో నెన్నియైనను దప్పులతడకలు దొరకుచున్నవి. ఇటువంటి భాషాంతరీకరణములు చక్కని గ్లేజు కాగితములమీఁద నచ్చొత్తించి కాలికో బైండు చేయించి ప్రకటించుట తా మానందించుటకో, దేశమున కుపకరించుటకో తెలియకున్నది.

ఓభాషాంతరీకరణముచేయు భాషాభిమానులారా! వినయపూర్వకముగ నమస్కరించి చేసికొనుమనవి. మీభాషాంతరీకరణములు లోకమున కుపయోగించి చిరకాలము వర్థిల్లుట కిదివఱకు భాషాంతరీకరింపఁబడని గ్రంథముల భాషాంతరీకరించుటకుఁ బ్రయత్నింపుఁడు. మీరు వ్రాసినది కూడఁ బండితులకుఁ జూపి యచ్చొత్తింపించినచో మిక్కిలి లోకోపకారముగ నుండును.

నేను నాంధ్రధ్వని యను నొకభాషాంతరీకరణ మీామధ్యఁ జూచితిని. అది బ్రహ్మశ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిది. లఘువివరణముతోఁ గలిపి యేఁబదిరెండు పేజీల గ్రంథము. తప్పొప్పులపట్టిక గూడఁ జివర సమృద్ధిగనే కూర్పఁబడినది. అయినను నక్షరముల తప్పులు మిగిలియే యున్నవి. అచ్చు సరిచూచువారి యజ్ఞతచేఁ గలిగె ననుకొందము. విషయములలోఁ గూడఁ జాల చోట్లఁ బొరపాట్లు గనఁబడుచున్నవి. ఇటువంటి గ్రంథమును దొందరగా నచ్చొత్తించి యాంధ్రలోకమున కేవిధముగ మేలుచేయుదమనుకొనిరో తెలియకున్నది. మచ్చునకు రెండుమూఁడువిషయముల నీక్రిందనుదాహరించుచున్నాఁడను.

(1) "కావ్యస్యాత్మా సఏవార్థ స్తథాచాదికవేః పురా
క్రౌంచద్వంద్వవియోగోత్థః శోకఃశ్లోకత్వమాగతః" 1. ఉ. 5. శ్లో.

దీనికి వారియాంధ్రీకరణము.

"అర్థమదియ కావ్యఁబున కాత్మయగును
అట్లగుటఁ బూర్వకాలమం దాదికవికిఁ
గ్రౌంచవిహగయుగళవియోగమున నాత్మ
లోజనించినశోకంబు శ్లోకమయ్యె." 10

ఇచ్చట-క్రౌంచవిహగయుగళవియోగమువలన నాదికవికి నాత్మలో జనించిన శోకము శ్లోకమయిన దని శ్రీ శాస్త్రిగారియభిప్రాయ మైనట్లు స్పష్టమగుచున్నది. కాని యది యుచితముగఁ దోఁపదు. ఆదికవియాత్మలోఁ బుట్టిన శోక మనినచో విరోధమున్నట్లు లోచనకారుఁ డభిప్రాయపడియున్నాఁడు. ఆతని మాటల నీక్రింద నుదాహరింతును.

"నతు మునే శ్శోక ఇతి మన్తవ్యమ్. ఏవం హి సతి తద్దుఃఖేన సోఽపి దుఃఖిత ఇతి కృత్వా రసస్యాత్మేతి నిరవకాశం భవేత్. నతు దుఃఖసంతప్తస్యైషా దశా." ... ... 27-పుట.

(2). "శషౌ సరేఫసంయుక్తౌ ఢకారశ్చాపి భూయసా
విరోధినస్స్యుశ్శృంగారే తేన వర్ణా రసచ్యుతః" 3. ఉ. 3 శ్లో.

దీనికి శ్రీ శాస్త్రిగారి యాంధ్రీకరణము:—

"శషలు రేఫసంయుక్తముల్ చాలఁ గలిగి
బహుళముగ ఢకారంబులు వాడఁబడియు
వైరము వహించుచుండు శృంగారమందు
నట్లగుట వర్ణములు రసవ్యంజకములు." 3. 3

ఇచ్చట " తేన వర్ణా రసచ్యుతః " అను పాదమునకు "నట్లగుట వర్ణములు రసవ్యంజకములు " అని యాంధ్రీకరించిరి. కాని లోచనకారుఁ డట్లభిప్రాయపడుటలేదని యీక్రింది యాతనివాక్యములఁ జూడ స్పష్టమగుచున్నది.

" యతః తేవర్ణా భూయసా ప్రయుజ్యమానా న రసాం శ్చ్యోతయంతి స్రవంతి యది వా తేన శృంగారవిరోధిత్వేన హేతునా వర్ణా శ్శషాదయో రసాత్ శృంగారాత్ చ్యవంతే తం న వ్యంజయంతీతి వ్యతిరేక ఉక్తః"130పు.

వృత్తికారుఁడు గూడ లోచనకారుని యభిప్రాయమునే బలపఱుచుచున్న ట్లాతనివాక్యములవలనఁ దెలియుచున్నది.

" శ్లోకద్వయే నాన్వయవ్యతిరేకాభ్యాం వర్ణానాం ద్యోతకత్వం దర్శితం భవతి." ... ... 130 పు.

కనుక నట్లగుట వర్ణములు రసవ్యంజకములు కావని యుండుట యుచితము.

(3) " అర్థాంతరగతిః కాక్వా యాచైషా పరిదృశ్యతే
సా వ్యంగ్యస్య గుణీభావే ప్రకార మిమ మాశ్రితా." 3. ఉ. 39శ్లో.

దీనికాంధ్రీకరణము:—

"కాకువున నితరార్థావగమన మెద్ది, కలుగుచుండెడినో మంచికావ్యమందు
అయ్యదియునీప్రకారంబునందుఁజేరు,వ్యంగ్య మప్రధానీకృతమగునుగాన.

"ఇచటఁ గాకువుచే నర్థాంతరావగమన మయినపు డాయర్థాంతర మప్రధాన మగును గాన గుణీభూతవ్యంగ్య మగును" అని యభిప్రాయమును సూచించిరి. కాని యీయభిప్రాయము సరి గాదు. కాకువుచేత నర్థాంతరావగమన మయినపు డాయర్థాంతర మప్రధాన మయిన యెడల గుణీభూతవ్యంగ్యమగును. అని గ్రంథకారుని యాశయము. ప్రధాన మైనచో వ్యంగ్యమే యగును. వృత్తిలోఁ గూడ నీవిషయము స్పష్టపఱుపఁబడినది.

"యాచైషా కాక్వాక్వచి దర్థాన్తరప్రతీతి ర్దృశ్యతే సా వ్యంగ్య స్యార్థస్య గుణీభావేసతి గుణీభూతవ్యంగ్యలక్షణం కావ్యభేద మాశ్రయతే" 212 పు.

కనుక "వ్యంగ్య మప్రధానీకృత మయినయెడల" అని సవరించిన బాగుగ నుండును.

ఇంకను నిటువంటి చిన్నతప్పు లచ్చటచ్చటఁ గలవు. గ్రంథవిస్తరభీతిచే నీమూఁటినే యుదాహరించితిని. పండితు లగు శ్రీశాస్త్రిగారినిఁ దిరస్కరించుట నాయాశయము గా దని వినయపూర్వకముగ మనవి చేసికొనుచున్నాఁడను. తప్పులు క్షమింతురుగాక.

# ఆంధ్రవ్యాకరణములధోరణి విమర్శనా పరిశీలనము.

—( ఎండమూరి వేంకటరమణగారు, బి. ఏ. )—

---

శ్రీప్రజోత్పత్తినామసంవత్సరము మాఘఫాల్గునమాసములందున వెలువడిన "ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక" యందు మ॥ రా॥ శ్రీ, మ్యుక్క సర్వేశ్వరరావుగారు, "ఆంధ్రవ్యాకరణములధోరణి విమర్శన" మనుపేరిట మకుక్తవ్యాసమునందలి కొన్ని యభిప్రాయభేదములు వెలిపుచ్చుటం జేసి వానికి నాశక్తి కొలఁది సదుత్తరముల నొసఁగుటకై యీ వ్యాసరచనకుఁ గడంగితిని. ఇందలి యాథార్థ్యన్యాయ్యములు పరసులును గుణగ్రహణపారీణులు నగుపత్రికాపాఠకులే గుర్తింతురుగాత

ఇట్టివిమర్శనలకుఁ బూనుట కెట్టివా రర్హులో యనువిషయమున విమర్శకులు సూచించినవిధమున మాకిరువురకు నేకాభిప్రాయంబులే యుండుటచే మరల వ్రాయుట నిరర్థక మని విడుచుచున్నాను.

శ్రీవిమర్శకుల విమర్శన మెంతసహేతుకమో, విచారించి, తద్గతాభిప్రాయభేదము లెంతసప్రమాణంబులో విమర్శించి యందలిసత్యము వివరించుటయే యీ వ్యాసస్వరూపము.

౧. వారివ్యాసమున విమర్శకులు ప్రథమమున విమర్శించిన దొక లేఖనస్ఖాలిత్యమై యున్నది. అందు నాయుద్దేశము మ॥ చిన సీతారామశాస్త్రిగారి వ్రాఁతయు "ఆంధ్రశబ్దచింతామణిలో లేని విశేషము" లని కాని "ఆంధ్రశబ్దచింతామణిలోని" యని కాదు. ఈవిషయము సత్యసముద్యోతక మగు విమర్శనము వ్రాయఁగడంగిన శ్రీరావుగారు- ఇట లే యను వర్ణము లేకుండుట ప్రమాద మని గ్రహింపఁగల్గియు "నాంధ్రశబ్దచింతామణిలోని" యన్నపాఠము వారి కెచట లభించినదో యని దీర్ఘసందేహార్థక చిహ్నముతోఁ బ్రశ్నించుట వారితత్త్వజిజ్ఞాస చెప్పకచెప్పుచున్నది. అది యటు లుండనిండు. "ఆంధ్రశబ్దచింతామణిలో లేని లక్షణవిశేషములు మాత్ర మథర్వణకారికలలో నగపడుచున్న" వనుశాస్త్రిగారి వ్రాఁత ప్రమాద మగుటసత్యము. దీని నిదివఱకే సోదాహరణముగా వివరించితిని. కావలయు నేని మఱి కొన్ని యుదాహరణము లిచ్చుచున్నాను.

ఆం. శ. చింతామణి—తిర్యగ్జడేషు కర్తృషు బహువచనం త్వేకవచనమేవస్యా ద్భాతేతద్ధర్మేచ.

అ. కారికావళి—తుదీతిర్యగ్జడస్త్రీషు తేష్వన్యేష్వేకతాంగతౌ.

అ. శ. చి—ఋఋతౌ తునప్లుతస్స్యాత్సంబుద్ధా విత్యుతాం విదుః కేచిత్.

అ. కా—సంబోధనేప్లుతః స్యాహుః కేచిత్.

ఆ. శ. చి—నచదేశ్యపదే నచైకవర్ణేఽపి.

అ. కా—నైకవర్ణేనదేశ్యేఽపిహ్రస్వః.

ఇట్టి వింక ననేకములు గలవు. విస్తరభీతిచే విడిచితిని, కావున, రావుగారు శాస్త్రిగారి వ్రాఁత ప్రమాదయుతము కాదని ఋజువుచేయుట న్యాయ్యము గాని, ముద్రణలోపము లెన్నుట విమర్శన మనిపించుకొనునా ?

౨. విశ్వకర్మ్మఁడను రూపము నీతఁడే (చిన్నకోట పెద్దన్న) స్పష్టపఱిచియుండలేదు...... ఈవిషయ మపూర్వము కానేర" దని విమర్శకులువ్రాసిరి.

ఈవిషయ మపూర్వ మని కాని, చి. పెద్దన్న సృష్టించినాఁడని కాని నేను వ్రాయను లేదు, నాభావమును గాదు, నాయభిప్రాయము నేఁటివఱకు వివాదాంశమైన విషయము స్పష్టపఱిచినాఁ డనియే. ఈవిషయ మింతవఱకు వివాదాంశమైనటుల ముందు వాక్యముతే తెలుపును.

వైయాకరణ సన్మత మైనవిశ్వకర్మ్మఁ డనుశబ్దము నసాధువుగా నెంచి సవరించిన గుప్తార్థప్రకాశికాకారులమత మేవిధముగా ననూహ్యమో పరిశీలింత మని ప్రారంభించిన విమర్శకులు "నేఁటివఱకీప్రయోగంబునెడ నున్న వివాదంబును గోచరింపకున్న" దని ముగించిరి. వేఱొకచో శ్రీ రావుగారు "ఆంధ్రశబ్దచింతామణి యథర్వణకారికలచే నీరూపము సాధు వగుచునేయున్న" దని యంగీకరించిరి. ఇందు వీరి యభిప్రాయ మిదమిత్థ మని నిర్ణయించుటయే కష్టము. ఈరూపము సాధు వగుచున్న దని యొప్పికొనుచు నీరూప మసాధువుగా నెంచి సవరింపఁ గడఁగిన మత మనూహ్యము కా దని సమర్థింపఁబూనుట యెంత సందర్భమో సహృదయు లగుపాఠకు లూహింతురుగాక. గుప్తార్థప్రకాశికాకారులు బాలవ్యాకరణమతానుసారముగ దానిని సవరింపఁ గడఁగిరని వారు వ్రాసిరి. బాలవ్యాకరణమునకు లొంగనిమాత్రమున నెల్లపద్యములందలి విశేషరూపములను సవరింపవలసినదేనా? ఒకవేళ లొంగకపోయినను బాలవ్యాకరణమునకు విశేషవిపులవ్యాఖ్య వ్రాయుచు విశ్వకర్మ్మఁ డను రూ

పము కూడ సాధువే యని యన్యమతము గానైనఁ జెప్పెనరా నా? ద్వంద్వం బున ఋకారమునకు రవర్ణం బగు నను సూత్రమునొద్ద నీ యుభయపక్షము లనుఁ జెప్పెన లేదా? ఇట్టియెడ సుప్రసిద్ధప్రకాశికాకారులు సవరింపఁ గడఁగుట కేవల మనూహ్యము గాఁ, సాహసము కూడను. విశ్వకర్తఁ డనురూపము సాధు వనుటకు నభినవదండినుండి రెండుపద్యము లిచ్చెదను.

క. తుదియుకారస్థు లుడిపిన, గవిసినఋత్వాంతపద మొకండును వెలిగా
మదమున డులుతల మోమను, విదితపుఁ బురుషాఖ్యయందు వివరింపంగన్.

గీ. హోత జాత యనఁగ నేత దాత యనంగ
బ్రహ్మ వేత్త యనఁగఁ బరఁగుచుండుఁ
బూరితాత్ముఁ డనఁగఁ బుణ్యకర్తుఁ డనంగఁ
బుష్పధన్వుఁ డనఁగఁ బొలుచు జగతి.

...   ...   ...   ...

శర్మన ర్మనాఁగ శర్మఁడనఁగ, వర్మఁడనఁగఁజెల్లు   ...

౩. "రామమాంధాతృరఘుక్షితీశులు" అను ద్వంద్వసమాసమునం దలి ఋకారంబునకు రేఫము రా''దని విమర్శకులు వ్రాయుచు నీవిషయమున సుప్రసిద్ధప్రకాశికయందు సమాసపరిచ్ఛేదమునందు విమర్శించినవిషయము లెల్ల వివరించియున్నారు కాని, అహోబలపతి తరువాతివాఁ డగు ద్వితింత్రిణీ సీతారామకవి ''అనజపాన్య నృతో ద్వంద్వే రేఫ శ్చారిక వేర్ణతః'' యను నథర్వణ కారికకుఁ డీక వ్రాయుచు ''నేష్ట్రోద్గాత'' లని యుదాహరణ మిచ్చి తత్సూత్రమును సమర్థించినాఁడు.

ఈవిషయమున, అడిదము సూరకవి-

గీ. ధరఋకారాంతశబ్దంబు ద్వంద్వమైన
రేఫయగుచుఁ బ్రవర్తిల్లు ధృవము గాను
పణి వరహాయవాగ్వధూనేత్రముఖసు
రాభివందితపాదాబ్జ యన్నయట్లు.

అని వ్రాసి "క్షత్రియవంశ్యులై'' యనుపద్యము నుదాహరణముగా నిచ్చి రామమాంధాతృరఘుక్షితీశు లన్నద్వంద్వసమాసము సరేఫ యనియే వెల్లడించినాఁడు. ఈవిషయ మంతయు సుప్రసిద్ధప్రకాశికయందే సుప్రసిద్ధప్రకాశికాకారులు ప్రకీర్ణకపరిచ్ఛేదమునందు వ్రాయుచు వారి పూర్వాభిప్రాయము

మార్చికొని "ఈపద్యము రేఫశ్లిష్టముకొద్ద నుదాహరించుట కేవలము ప్రమాదాయత్త" మనియు, నచటనే "కావునఁ మాంధాత్రరఘుక్షితీశులు ముదంబునఁగాచిరె యేయుగంబునన్' అను రేఫయుక్తమే పద్యలక్షణానుకూలంబు గాన ప్రశస్తం''బనియు (పుటలు-498-499) నంగీకరించిరి.

విమర్శకు లిది పూర్తిగ గమనింపకయే యప్పకవిది ప్రమాదము కాదని వ్రాయుట నప్రమాణికముగాక సాభిమానమగును. "హరికారికావళీ కర్తృత్వ నిర్ణయము సూరిచౌర్యముం దొలఁగించుట" కని విమర్శకులు భావించి, దానికిదియ మార్గముగాఁ దలంచుట న్యాయ్యముకాదు. హరికారికావళీకర్తృత్వ నిర్ణయమున సూరిచౌర్యప్రతీతి తొలఁగుటయును దొలఁగకుండుటయుఁ గాక తాళీయన్యాయమే. ఇఁక హరికారికలు హరికృతములు గావనుటకు వీరిఖండనోక్తులను బరిశీలింతము.

"హరికారికామతమును దెల్పె నని వ్యవహరించిన కారికల కర్థము తుల్యము కా" దని విమర్శకు లాక్షేపించిరి. "దంద్వే పదోపరిస్థానాం పరుషాణాం భవం త్యమీ" అను హరికారికకును "స్యుర్భిన్నాదేవ తస్మాత్తే వినా ద్వంద్వే హరేర్మతే" యను కారికకును భేద మేమి? అప్రయుక్తదోషము హరిమతమున విరుద్ధము కా దని యథర్వణుఁడు "శాస్త్రప్రయుక్తవచసో శాస్త్రం బలవదుచ్యతే, అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణాం హితమ్" అను తనమతము నిలువఁబెట్టుటకుఁ జెప్పి ప్రయోగప్రాధాన్యమును దెల్పుటచేఁ "బెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యం బైనను గ్రహింపఁదగు'' నను హరికారికయొక్క భావము నొక్కటే. కావున నీయుక్తి పొసఁగ దనుట సరియైన విమర్శనము కానేరదు.

అథర్వణుఁడు హరిమతమును దెలియఁజేయఁ దలఁచినచో నేవ్యాకరణమునందును లేని లక్షణవిశేషము లీహరికారికలయం దుండఁగా వానిని విడిచియుండె నని, విమర్శనకారుల యభిప్రాయము. విమర్శనకారు లుదాహరించిన చేయక మొదలగు వ్యతిరేకక్త్వార్థకరూపము, నథర్వణుఁడే సాధించియుండుటచే వేఱె హరిమతము నుదాహరింపలేదు. ఉ చేయక యనురూపమునకు—

"భవేత్ క్త్వే స్త్రీసమా న్నామ్ను ఉత్వం తస్మిన్నరేఫ వేత్ ।
క్త్వార్థే చ వ్యతిరేకార్థే ధాతో స్తత్రైవ మిర్భవేత్ ॥

మఱియు, "నిల్లు లేని పోని నామములు దమసూత్రములందు నేదియో ఘనతకై పేర్కొనుట మనవారి యాచారము. బృహస్పతి, కణ్వుఁడు,

శౌరి మున్నగువార లాంధ్రమునకు లక్షణగ్రంథములు వ్రాసిన లాక్షణికులు లేరా ? వారు వ్రాసిన గ్రంథములు లభించునా ?" యని శ్రీ రావుగారు వ్రాసిరి. అట్టిలాక్షణికులును గలరు. అందుఁ బేర్కొనిన కొన్నిగ్రంథములు లభించినవి. కొన్ని లభింపవచ్చును. కాని, తెలియక యె యిట్టినామములు ఘనతకుఁ బేర్కొందు రనుకొనుట భ్రమయే. వ్యాసకర్తగారి దృష్టిలో లేనంతమాత్రమున బృహస్పతి రచించిన సూత్రగ్రంథము లేదా? ఈబార్హస్పత్యసూత్రములను గ్రంథరూపమున నేను గనులారఁ జూచితిని. వానిని బరిశీలింపఁగా నవి కేవల మాంధ్రభాషాశబ్దవిషయములఁ గూర్చి ప్రస్తావించుచున్న వని తోఁచినది. మఱియు నవి కేవల ప్రాథమికవిషయములనే తెల్పుచున్నవి. సాధారణముగా మనము వాడుకయందుఁ గాంచు నట్టియు గ్రంథములందుఁ (దఱచు) గన్పట్ట నట్టియు "అమ్మణ్ని" మొదలగు రూపముల కిందు సూత్రములు గలవు. మచ్చున కొకటి యుదాహరించెదను.

"దయావాచకార్థే అమ్మ మామాదిశబ్దేభ్యః పరతః అణ్ని అల్లాద్యాస్యుః। అమ్మణ్ని, అమ్మల, మామణ్ని, మామల, ఇత్యాది"- బార్హస్పత్యసూత్రాణి. ఇటులనే కణ్వాదుల వ్యాకరణములంగూడ లభ్యము కానగును. లేకయే తాళపత్రగ్రంథములందో జీర్ణించుచుండవచ్చును. కావున మనకుఁ దెలియనంతమాత్రమున నాగ్రంథములు లేవనుకొనుట పొరపాటు. వ్యాకరణవిషయమున, నేకృషియు నొనర్పని వానికి బాలవ్యాకరణము గూడ నలభ్యమే కావచ్చును. అంతమాత్రమున గ్రంథము లేదనుట తగవా ?

అదియుంగాక కీ. శే. కం. వీరేశలింగకవిగారు నయుక్తికముగా హరికారికలు నన్నయఁడు వ్రాసిన వని నుడివిన మాత్రమున నది వేదముగా గ్రహింపవలసినదేనా ? వీరేశలింగకవిగారు నిర్ధారించిన విషయము లెన్ని, నవీన పరిశోధనములందు మార్పుఁజెంది వేఱువిధమున ఋజువు కాలేదు. నమంజసములు, సహేతుకములు నగు ప్రమాణములను రావుగారు చూపి యీ విషయనిర్ధారణ మొనర్పఁగలిగినచో వారియెడ నెంతయుఁ గృతజ్ఞులము.

"వృత్తిం నాన్నవ సూత్రాణాం కృష్ణమూర్తి రిహ కుర్వే" యనుశ్లోక భాగము నుదాహరించి "కృష్ణమూర్తి రిహ కుర్వే" యని వ్రాసినతర్వాత నెవ్వరైన నాతఁడు వ్రాయలేదందురా ?" యని విమర్శకుల యాక్షేపణము. పైశ్లోకము కృష్ణమూర్తికవియే రచించినచో నాతఁడు వ్రాయలే దని యెవ్వరు ననలేరని

నా సమాధానము. కాని తద్గ్రంథప్రకాశకులు, "నాన్నవ" యను పదముఁ జొనుపుటకుఁ బైశ్లోకము సృష్టించి,

శ్లో॥ శ్రీకృష్ణమూర్తిరచితా వృత్తి ర్హరికారికావళీ శేషా
నికటేనివస త్వవనా వాచంద్రార్కం కవీంద్రరింఛోళేః॥

అను కృష్ణమూర్తికవిగారి శ్లోకమును—

శ్లో॥ శ్రీకృష్ణమూర్తిరచితా వృత్తిరియం నన్ననార్యసూత్రాణామ్।
జ్యోత్స్నా సతతం వసతా దాచంద్రార్కం కవీంద్రరసనాసు॥

అని మార్చి ప్రకటించిరి. ఇట్టి మార్పు గల్పింపఁగలిగిన ధీశక్తి ప్రభావమెంత యాశ్చర్యకరమో, యెంత సాహసయుక్తమో, యంతహేయ మనుటకు, లేఖిని వెనుదీయకున్నది. నేను జూచిన హరికారికావళి వ్రాఁతప్రతియందు "వృత్తిం నాన్నవసూత్రాణాం" అను శ్లోకము గన్పింపకపోవుటయే కాక యీ చిత్రసంఘటనము కూడఁ గన్పట్టినపుడు కలిగిన యాశ్చర్యమునకు మేర లేదు. ఆవ్రాఁతప్రతి నాయొద్ద లేకున్నను మీరు కోరినపుడు చూపఁగలను. ఇట్టి యభూతకల్పనలతో విమర్శనములకుఁ గడంగి వారి వాదములను నిలువఁ బెట్టుకొను నాంధ్రభాషాయోషాసుతులంగూర్చి సంతసింపవలెను. ఇందలి సత్యాసత్యముల నిపుడు నిష్పక్షపాతహృదయులును బండితశేఖరులు నగు పాఠకులే యెఱుంగుదురుగాక.

౫. వాక్యపదీయకారుఁడును, అధర్వణుని చేఁ బేర్కొనఁబడిన హరియు, న్యాకర్తఁడు గాఁ డనుటకు సంస్కృతమున లేని గసడదవాదేశమును జెప్పినవాఁడు గనుక నాభర్తృహరి కానేరఁ డనుయుక్తి సరిపడునా ?.............సంస్కృత ప్రాకృతములయందు వైదుష్యము కలవారికిఁ దెలుఁగున నుండఁగూడదా ?" అని వ్యాసకర్తలు వ్రాసిరి.

ఇచ్చటి వీరి విమర్శనము పూర్వాపరసందర్భరహితమై స్వోక్తిఖండనముతో నొప్పుచున్నది. వీరట హరికారికావళి కృష్ణమూర్తిప్రణీత మని తెల్పుటకుఁ బూని పరస్పరసంబంధము గలయుక్తులను విడిగా సందర్భరహితముగా విమర్శించిరి. వారి యభిప్రాయము ప్రకారము కారికలు హరిరచితములు కావేని హరియే లేఁడు. అట్టియెడ నీహరి భర్తృహరియా వేఱొకహరియా యను ప్రసక్తి లేనేలేదు. అటుగాకుండ నీతఁడు భర్తృహరియా వేఱొకహరియా యని విమర్శించు నపుడు తెనుఁగు వ్యాకృతి వ్రాసిన హరి యొకఁ డున్నాఁ డని వి

రంగీకరింపవలసివచ్చును. వీ రటు లంగీకరింతురా? ఐనను హరికారికావళీ కారుఁ డగుహరి భర్తృహరి యెటుల కానేరఁడో విమర్శింతము.

1. హరివ్రాసినది తెలుఁగునకు వ్యాకరణము. భర్తృహరి కాంధ్రమున (వ్యాకరణము వ్రాయఁగల) వైదుష్యము లేదు. ఏలయన:- నాంధ్రభాషకుఁ బ్రథమవైయాకరణుఁడు నన్నయభట్టు. నన్నయభట్టు పదియవ శతాబ్దములోని వాఁడు. భర్తృహరి యేడవశతాబ్దమువాఁ డని చరిత్రకారులునిశ్చయించినారు. అదియుఁ గాక నన్నయకుఁ బూర్వము వ్యాకరణమే లే దని లోకప్రసిద్ధి. ఇట్టి సందర్భములో నాంధ్రభాషకు సరియైన స్వరూపమే యేర్పడని దినములలో భర్తృహరి తెనుఁగునకు వ్యాకరణము వ్రాసె ననుట యపూర్వము.

2. సంస్కృతప్రాకృతములందు వైదుష్యము కలవారికిఁ దెలుఁగున నుండఁ గూడదా? సంస్కృతప్రాకృతములందు వైదుష్య మున్నంత మాత్రమునఁ దెలుఁగున నుండవలె నని నియమమా? అటులేని సంస్కృతభాషలో మహాకవి యగు కాళిదాసు తెలుఁగునఁగూడ నొక మహాకవి యై యుండఁగూడదా యని వాదించిన నింకను బాగుగ నుండెడిది.

రెండియు విమర్శకులు "కావున వ్యాసకర్తగారు నా కాదేశముగా నన్ను రాలేదు. నన్నులోనిది విభక్తి యుకారమె కాని వేఱు కాదని నిరూపించుట యుక్త" మని వ్రాసిరి. ఇచ్చట నన్ను శబ్దమునందలి యుత్వసమేతద్రుతము ద్వితీయావిభక్తిప్రత్యయము కావునఁ బూర్వ ముదాహరించిన సూత్రము లిచట వర్తించును. కూర్చి, కంటె నితరము లగుద్వితీయావిభక్తిప్రత్యయములు ద్రుతప్రకృతికము లగుటంజేసి ద్రుతము కలుగును. కావున, "నన్ను + ఏలు = నన్నేలు, నన్నునేలు" అని రెండురూపములు చాల్చును. దీనికిఁ జింతామణి సూత్రము "అనాద్యేషువిభక్తిషూతో వా" అని. దీనిపై బాలసరస్వతి టీక "అనాద్యేషు = ప్రథమావ్యతిరిక్తమైన, విభక్తిషు = విభక్తులయందు, ఉతః = ఉకారమునకు, వా = వికల్పమున, సంధికలదు. మమ్మునేలు, మాకొఱకునిచ్చు, నీకు నారోగ్యము.

.........ద్రుతప్రకృతులు గనుక నకారము నిలిచినది. మమ్మేలు నిత్యాది. కేతనయు నిటులే వ్రాసినాఁడు.

క. నన్నును నిన్నునుఁ దన్నును, నన్నందుల కునులకినులయందును మునుపై
నున్ననకారపుఁబొల్లులు, పన్నుగఁ బోఁజూపు నచ్చుపై నున్నయెడన్.

క. నన్నెఱుఁగు నన్ను నెఱుఁగుక్, దన్నెఱుఁగును దన్ను నెఱుఁగుఁదత్త్వజ్ఞుఁడిలన్
నిన్నెఱుఁగు నిన్ను నెఱుఁగును, నన్నం బరువడిగ నివియుదాహరణంబుల్."
ఆంధ్రభాషాభూషణము.

'వృద్ధిఁ బొందిననాఁడు భాషకు వర్ణములఁ జేర్చుట వెనుకటి భాషకు న్యూనత్వాపాదకము కానేర' దని వ్యాసకర్తగారి యభిప్రాయము. భాషాభివృద్ధిని సూచించునది వర్ణములసంఖ్య గాదు. భాషాభివృద్ధి సూచించునది నవవిద్వత్తవిశ్రేష్ఠుల యుద్గ్రంథములందు వెలుఁగు సారస్వతజ్యోతి. ఉత్తమమగుబుద్ధివికాస మెక్కుడగు కొలఁది ప్రతిమానవునకు నాలుగుచేతులు, నాలుగుకాళ్లు నావశ్యకమా ? ఇట్లు వృద్ధిఁబొందుట జీవభాషకు సహజ మని వ్రాసిన నేఁజీవభాషయం దిది గన్పట్టుచున్నది.

ప్రస్తుతవ్యాస మితరుల వ్రాఁతలను ఖండించుటకుఁ గాక విమర్శకులు వెలిపుచ్చిన యభిప్రాయభేదములకు నాకుఁ దెలిసినంతవఱకు సదుత్తరముల నొసఁగుటయే యని మరల మనవిచేయుచున్నాఁడను. ఇందలి నా ప్రమాదములను మన్నించి గుణలేశములను గ్రహించి సత్యాసత్యము లెఱుంగుదురు గాత మని సరసు లగువిద్వజ్జనులను బ్రార్థించుచున్నాఁడను.

# అనర్ఘరాఘవము.

— చేబోలు సుబ్రహ్మణ్యశర్మగారు, కొవ్వూరు. —

(వెనుకటి సంచిక తరువాయి)

## లక్ష్మణుఁడు—వీని యసహనము.

తృ. అం. 38 శ్లో. క్రిందన "ల-(సామర్షం జనాన్తికం) ఆర్య కథ మసౌ సహస్రార్జునవాలిభ్యా మవలీఢశౌర్యసారో దురాత్మా రావణః ప్రస్తూయతే" రావణుని గుణములను సహింపనివాఁ డని తెలియుచున్నది.

## సోదరభక్తి.

చతు. అ. 47 శ్లో. క్రిందన "రా- సరోషం నేపథ్యాభిముఖం ఆః వత్స కోఽయ మద్యతనస్తే దుర్వినయప్రరోహో యద్గురూనపి క్షేత్రీకరోషి." అని రాముఁ డనినపిమ్మట- లక్ష్మ- (నేపథ్యే) ఆర్య తూష్ణీ మయమస్మి క్షమస్వ జామదగ్న్య నియన్త్రితోహా మార్యేణ'' అని లక్ష్మణుఁడు పల్కుటవలన సోదరభ వ్యక్తము.

## సౌందర్యాదికము.

షం. అ. 39. శ్లో.

"ఏకో వేషపరిగ్రహః పరికరః సాధారణః కర్మణా
మాకృత్యోర్మధురత్వ మేవ సదృశం తుల్యైవ గంభీరతా
తం ద్రష్టుం చిర ముత్సుకోస్మి కతరో వాం రామభద్రః పునః
సర్వక్షత్రవధవ్రతీ భృగుపతి ర్యేనావకీర్ణీకృతః."

రాముఁడు సర్వలోకైకసౌందర్యుఁ డనియు సర్వలోకైకవీరుఁ డనియు నింతకుఁ బూర్వము వర్ణింపఁబడియెను. అట్టిరాముఁడు లక్ష్మణుఁడు నొక్కచో నిలిచియున్న రాముఁ డెవరో లక్ష్మణుఁ డెవరో తెలియుట లే దని చెప్పుటవలన నీలక్ష్మణుఁడును రామునకుంబలె సౌందర్యాదికములను గలిగియున్నాఁ డని తెలియనగును.

## దశరథుఁడు—వీనిగురుభక్తి.

"తస్యాజ్ఞయైవ పరిపాలయతః ప్రజాం మే, "అహో బహుధా శ్రుత మపి భగవతో వసిష్ఠస్యానుశాసనం నవం నవ మివ ప్రమోదయతి మాం"

'వామదేవ మమహి గురువచనశ్రవణతృష్ణా మంకుశీకరోతి శ్రోత్ర వృత్తి రింద్రియాన్తరానుసారిణో హృదయమహాగజస్య తన్నకించి దపర మవశిష్యతే" "సహస్రం సుప్తుశిరసికృతం ఆచార్యవచనం" ఈవాక్యములవలన దశరధునికి గురువగు వసిష్ఠునియందుండు భక్తివ్యక్తము.

## పరాక్రమము.

ప్ర. అం. 2 "జనయతి త్వయి వీర దిశాంపతీ నపి గృహాంగనమాత్ర కుటుంబినః। రిపు రితి శ్రుతి రేవ నవాస్త్రపీ ప్రతిభయోన్నతి రస్తు కుతస్తు నః"

అపిచ. ప్ర. అం. 27 శ్లో. "దత్తేంద్రాభయదక్షిణాద్భుతభుజాసంభార గంభీరయా। త్వద్వృత్త్యాశిధిలీకృతత్రిభువనత్రాణాయ నారాయణః। అన్తస్తోష తుషారసౌరభమయశ్వాసానిలాపూరణ। ప్రాణోత్తుంగభుజంగతల్ప మధునా భద్రేణ నిద్రాయతే" దిక్పతులు త్వదాయత్తు లనుటచేతను నింద్రాదులకు నభయమిచ్చువాఁడ వనుటవలనను నీభుజపరాక్రమమువలన రక్షావ్యాకులరహితుఁడై నారాయణుఁడు నిద్రించుచున్నాఁ డనుటవలనను దశరధునిపరాక్రమ మనిర్వర్ణనీయము.

## అవికత్థనత్వము.

ప్ర. అం. 26, 27 శ్లో. లను విశ్వామిత్రుఁడు చదివినపిమ్మట-

"దశరథః-సవైలక్ష్యస్మితం భగవన్ విశ్వామిత్ర అభ్యమిత్రీణస్య తత్రభవతః సునాసీరస్య నాసీరపూరకేణ పదాతిపరమాణునా మయాపి కదాచి దుద్ధృతం ధనుః యస్మాలోయ మలీకలోకప్రవాదో భవన్త మప్యాప్యాయయతి" అని దశరధుఁ డనుటవలన నాత్మశ్లాఘాపరాయణత్వమందు విముఖుఁ డని తెలియుచున్నది

## పుత్రవాత్సల్యము.

"దశ-భగవన్ పర మనుగృహీతా వయ మేవం తత్రభవతా సంభావ్యమానాః కింపున రగృహీతాస్త్రః క్షీరకంఠో వత్సోయ మితి ప్రముగ్ధోస్మి"

"దశ-సవిషాద మాత్మగతం-కథ మిద మస్మాకం సకలలోకశోకశంకాధరణశీలశీతలేభ్యః కౌశికప్రసాదేభ్యో రామభద్రప్రవాసవైమనస్య ముత్పత్స్యతే" "దశ-తౌ సస్నేహ మాదాయ భగవన్ కౌశిక ఇత్యర్థోక్తే మన్యూత్పీడ నిగృహ్యమాణకంఠో వామదేవస్య ముఖమీక్షతే" ఈమూఁడువాక్యములవలనను దశరధుని పుత్రవాత్సల్యము తెలియుచున్నది.

ధర్మతత్పరత.

"దుష్టం వా నిఃశేషానన్దనిఃష్యన్దినీనా మమన్దకరకన్దలీనాం కమలవనీ మిీలనం కలంకస్థానం (విహాస్య) కాగతిః-

ప్ర. అం. 39 శ్లో. "కూర్మరాజభుజగాధిపగోత్రగ్రావదిక్కరిభిరేకధురీణః। మాం ప్రసూయ కథమస్తు విగీతో హాపరార్థవిముఖో రఘువంశః" రఘువంశము పరోపకారవిషయమై విముఖమైనది కాఁగూడదని యెంచి పిన్నవయస్సు గలవాఁడైనప్పటికిని రాముని యాగరక్షణార్థము పంపుటయే యుక్తమని తలంచుట ధర్మతత్పరతను సూచించుచున్నది.

చ. అం. 35 శ్లో. క్రిందున, దశ-నిర్వర్ణ్య సస్నేహం సఖే సీరధ్వజ రఘురాజధర్మాధికారసర్వధురీణః శిశురపి వత్సోయం తదస్మిన్నరసా దుర్వహాం వర్ణాశ్రమభార మారోప్య వయమపి క్వాపి తపోవనే దిలీపకులోచితేన విధినా శేషమాయు రుపభుఞ్జామహే" గృహస్థాశ్రమమును విడనాడి తనపూర్వులవలెనే వానప్రస్థము మొదలగు ధర్మమార్గముల ననుసరించుటయందు కుతూహలము కన్పట్టుటచే ధర్మతత్పరత తెలియుచున్నది.

జనకుఁడు—అవికత్థనత్వము.

తృ. అం 15 శ్లో. విశ్వా-భోమహాయోగిన్ "కిం యాజ్ఞవల్క్యో జనకః కిమేవం నవః స్వరూపం కవయోపి విద్యుః। ప్రవాహనిత్యా నధికృత్య యుష్మాన్ సహ సశాఖాః శ్రుతయః ప్రథన్తే'' అని జనకుని స్తోత్రముచేసిన వెంటనే-శతానన్దః-భగవన్ కౌశిక ఏవమీాదృశాః ఖల్వమీా త్రిభువనమహనీయమహిమానో మనీషిణః'' అని శతానన్దుఁడనును. తరువాత జనకః-సవ్రైలక్ష్యస్మితం. తృ. అం. 16 శ్లో.

నిర్మాయ కార్మణమృచామషమర్షణీనా। మున్మార్జనీర్జగదఘానితవాదృవాచః
శ్రోతుం చిరప్రణయి కౌతుకమస్తి చేతో। దుఃఖాకరోతిపున రేషమమార్థవాదః"

త ద్వైరమ, ఇతి శిర స్యంజలిం ఘటయతి,-ఇట్లనుటచే నవికత్థనత్వము స్పష్టము.

జ్ఞానవైభవము. తృ అం. 13 శ్లో.

"యజూంషి తైత్తిరీయాణి మూార్తాని వమతిస్మయః
సయోగీ యాజ్ఞవల్క్య స్త్వాం వేదాన్తాః

తృ. అం. 12 శ్లో. "యత్ర త్వం బ్రహ్మమీామాంసాతత్త్వజ్ఞో దండధా

రకః" పైదానివలన వేదాన్తము బ్రహ్మమీమాంసాశాస్త్రము మున్నగుశాస్త్రములయందును గొప్పవాఁడని తెలియుచున్నది.

వసిష్ఠుఁడు. సప్త. అం. 136 శ్లో.

"రఘుబ్రహ్మక్రియాచార్యం పురాణబ్రహ్మవాదినం
బ్రహ్మర్షిం బ్రహ్మజన్మాన మేవరామోభివాదయే"

దీనివలన వసిష్ఠుఁడు పురాతనుఁ డనియు వేదవక్త యనియు బ్రహ్మర్షియనియు బ్రహ్మనుండి పుట్టినవాఁ డనియుఁ దెలియుచున్నది. వీనిని శ్రీమహావిష్ణువగురాముఁడు నమస్కరించుచున్నాఁ డనిన వీనిమహాత్త్వ విష్ణునిమహాత్త్వకంటె గొప్ప దని తెలియుచున్నది.

రావణుఁడు, వీనిభక్తి.

"సంతుష్టేత్రిస్పృశాం పురామపి రిపౌ కంఠాలదోర్మండలీ। క్రీడాకృత్తపునః ప్రరూఢశిరసో వీరస్యలిప్సో ర్వరం।యాచ్ఞాదైన్యపరాంచి యస్య కలహాయన్తే మిథస్త్వంవృణు।త్వం వృణ్వేత్యభితో ముఖాని స దశగ్రీవః కథంకథ్యతాం." ఇందు రావణుఁడు విలాసగాఁ దనశిరస్సులఁద్రుంచి యీశ్వరునికి హోమముచేసిన మహాదేవుఁడు వరమును గోరుకొమ్మనిన వీనికి మరల మొలచినశిరస్సులు యాచించుటకు సిగ్గును బొందుచున్న వని చెప్పుటచే నీశ్వరసేవాతత్పరుఁ డనియు భక్తులలో నగ్రగణ్యుఁ డనియుఁ దెలియుచున్నది.

వీనిపరాక్రమము. తృ. అం. 58 శ్లో.

"యచ్చేష్టా స్సమనీకసీమని పరిత్రస్తః పరాంచన్నపి।
ప్రత్యక్షీకురుతే సహస్రనయనః పృష్ఠోద్భవై రక్షిభిః।
చక్రే వర్తచనాగలోకజయినీం యాత్రామివ ప్రస్తువన్।
యః కైలాసముదస్య కీదృశ మపాదానంతు తస్యాపదాం"॥

దీనివలన వీనిపరాక్రమము వ్యక్తము.

మహాకులీనత. పం. అం. 9 శ్లో.

"కులే యేషాం కింతు త్వమసి గణితాస్తేపి గురవో
న సప్తబ్రహ్మాణః కథమివ పులస్త్యప్రభృతయః"

పం. అం. 14 శ్లో.

సిద్ధశ్రోత్రపరంపరాపరిగతై రేభిః ప్రపౌత్రస్య తే
వృత్తైరద్య పులస్త్యవర్ణ మభితః స్మేరేషు దేవర్షిషు.

ఈ రెండుచరణములవలనను వీనియొక్క సద్వంశము తెలియుచున్నది.

వాలి—ఆత్మశ్లాఘ. పం. అం. 50 శ్లో.

"అస్మద్దోర్మూలకూలంకష విషమభుజగ్రన్థిభంగ ప్రసంగ
క్రోశల్లంకేశదత్తత్రిభువన విజయఖ్యాతిసర్వస్వదాయః.

దీనివలన వాలియొక్కయాత్మ శ్లాఘ యున్నట్లు తెలియుచున్నది.

వాలిపరాక్రమము.

"పౌలస్త్యావయవౌఘసంకటభుజామూలక్షణోన్మీలిత
ద్వైరాజ్యామమరావతీం కృతవతే వీరాయయస్మైహరిః".

వీని భుజామూలమందు త్రిలోకైకవీరుఁడును దశకంధరుఁడును, ఇరువదిచేతులు గలవాఁడును, నగురావణుఁ డున్నాఁ డనిన వాలిపరాక్రమము చెప్పనలవిగాదు.

పరశురాముఁడు- -వికత్థనుఁడు.

చ. అం. 25 శ్లో.

"రే కాకుత్థాః కథం వః శ్రుతివిషయమయం నాగ మద్భార్గవీయో
దుఃసామన్తాపచారప్రచితపితృవధామర్ష నిస్తారబంధుః
వారానాసన్నవింశా న్విశసితవిషమక్షత్రజాతిప్రరోహః
క్రోధాదుత్కృత్తగర్భామిషరుధిరవసావిస్రగన్ధిః కుఠారః".

ఓరోరీ కకుత్థవంశజులారా! నాతండ్రిని జంపినకోపమువలనఁ గార్తవీర్యార్జునిగర్వమును, బోఁగొట్టినట్టియు గర్భవతు లగుక్షత్రియస్త్రీలనుబఱపఱఁ గోసినట్టియుఁ బుట్టినరాజశిశువుల నందఱను జంపినట్టియు నాపరశును మీరు వినియుండలేదు. అని చెప్పుటవలన నాత్మశ్లాఘ గలవాఁడని తెలియుచున్నది.

అరణ్యమందు నివసించువాఁడును, శస్త్రసన్న్యాసము చేసినవాఁడును, సత్త్వగుణప్రధానుఁడును నైయున్న పరశురాముఁడు పరనిందాపరాయణుఁడును, ఆత్మశ్లాఘాపరాయణుఁడును, గోష్ఠియును నైయుండుట భావ్యమైనది కాదని యనవచ్చును గాని యిన్నిమంచిగుణము లున్నవాఁడు మరల నిన్నిచెడ్డగుణములలోనికి దిగుటకుఁ గారణము కేవలము మహోత్తరం బగు గురుభక్తియే గాన నాయాత్మశ్లాఘాపరాయణత్వము, కోపము మున్నగుదుర్గుణములు దుర్గుణములుగ నెంచఁదగినవి కావని చెప్పవచ్చును.

మాల్యవంతుఁడు.—శత్రుగుణగ్రాహి.

"సార-తతశ్చ రాఘవేణ నిజసచివనిర్విశేషముపగృహ్య పుర్కస్కృత్య చ ప్రహితోస్మి" అని సారణుఁడు మాల్యవంతునితోఁ జెప్పినతర్వాత—

"మాల్య-సహర్షం కిముచ్యతే యావద్ద్రివ్యభాపి గుణోహి విజిగీషూణా ముదాత్తతా విశేషేణపున రయం రామభద్రః" ఇట్లనుటవలన శత్రుగుణగ్రహణము గలదు మాల్యవంతున కని తెలియుచున్నది.

కవి.

చ. అం. 43 శ్లో. క్రిందున-

"నేపథ్యే ఆః పాపక్షత్రియాయాః పుత్ర! క్షత్రియభ్రూణహత్యాపాతకిన్" అని పరశురాముని శతానందుఁడు తిట్టెను. జామ-సరోషహాసం- అరే బ్రహ్మబంధో! బాంధకినేయ, గౌతమగోత్రపాంసన" అని శతానందుని జామదగ్న్యుఁడు తిట్టెను.

తత్త్వతపోవేదియు, సత్వగుణప్రధానుఁడు నగుపరశురాముని చేతనుయాజ్ఞవల్క్యునితో సమానుఁ డగుజనకుని పురోహితుఁడైన శతానందుని చేతను నిట్టిమాటలాడించుటచేఁ గవి బ్రాహ్మణులయందు హీనత్వమును జూపె నని తెలియుచున్నది. ఇట్లు బ్రాహ్మణులయందు హీనత్వమును జూపుటచేతను, ఈకవికి భట్టమురారి యనుపేరును తండ్రికిభట్టవర్ధనుఁ డనుపేరును నుండుటచేతను నితని భట్టశబ్దము భట్టరాజులను శాఖను సూచించును గాన నితడు బ్రాహ్మణేతరుఁడని చెప్పవచ్చు నని తోఁచుచున్నది. చదువరులు క్షీరోదన్యాయముగా గుణము లుండిన గ్రహింపుఁ డనివేడుక.

# తారకాపచయవిమర్శనము.

—దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు, కొవ్వూరు—

శ్రీమంత మైనమనయాంధ్రదేశమునఁ బెక్కుభాషలు వాడఁబడుచుండు ట సర్వవిదితము. అట్టిభాషలలోఁ బలువురచే వాడఁబడుచు జీవద్భాషయని పేరందినది యాంధ్రభాష. ఇయ్యది యించుమించు, ఎ. డి. 11 వ శతాబ్దము కంటెఁ బూర్వమందు లేదనియు నీవలనే భారతాదిగ్రంథము లుత్పన్నము లై తెనుఁగునకు మెఱుఁగు వెట్టె ననియు విమర్శకుల యాశయము. నాఁటినుండియు ననేకశాఖలతోఁ బెంపొందుచున్న యీవాఙ్మయమునఁ బ్రబంధములు, గద్యకావ్యములు, నాటకములు మొదలగు వివిధగ్రంథము లుద్భవించుచునేయున్నవి. ఇందు, ప్రాచీనములగుకొన్నిగ్రంథరాజములు ముద్రణాదిసదుపాయములు లేక నశించుచున్నవి. ఆధునికకృతులలోఁ గూడ ననేకప్రబంధము లుదయించుచున్నవి. వీనిలో "తారకాపచయ" మనునది యొకప్రబంధము. తారకాసురనాశనమే ముఖ్యోద్దేశ మగు నియమమున నిద్దాని కీనామ మంకించియుండును. ఇయ్యది రాజవోలుతాలూకా క్రొత్తపేటవాస్తవ్యుఁడగు ఇవటూరి సూర్యప్రకాశకవిమణిచే రచింపఁబడినది. ఈకవికులతిలకుఁడు సంవత్సరము క్రిందటనే దివంగతుఁ డయ్యెను, గావ్యశరీరావశిష్టుఁడై యచ్చటచ్చట దాఁగియేయుండె ననఁదగును. మఱియు దీన నితివృత్తము కృత్తికలార్వురకుఁ, బార్వతీపరమేశ్వరులకు, నగ్నికి, గంగకు నిందఱ కెట్లుగా స్కందుఁ డొక్కరుఁడు పుత్త్రుఁ డయ్యెనో యావిషయమును దెలుపుచుఁ దారకహననము గూడఁజెప్పఁబడినది. ప్రకృతమున నీప్రబంధవిషయమున గుణాగుణములఁ గొంచెము విచారింతము.

ప్రథమమున నీతనికవిత్వశైలి యతిగంభీరమై యుండును. కొన్నిచోటుల నోజోగుణయుతముగను, గొన్నిపట్టుల జాను తెనుఁగుపదములతోను, గొన్నిపట్టుల శబ్దాలంకారభూయిష్ఠముగను, రసోచితపదరచనగలిగియుండును. అల్లికయందలి జిగిబిగి యతిస్తుత్యము కాని యచ్చటచ్చట ఝడిత్యర్థస్ఫూర్తిలేని పదముల విస్తారముగాఁ బ్రయోగించియున్నాఁడు. వర్ణనలవిషయమున నలంకారములతో, నతిహృద్య మగును త్ప్రేక్షాతిశయోక్తులతో వర్ణించియున్నాఁడు.

"ఓజ స్సమాసభూయ స్త్వమ్" అనునట్లు క్రిందిపద్యములలో దీర్ఘసమాసము లుండియున్నవి.

"నిశ్శేషమానుష్యకాంతరంగికవ్యథావకరాత్యుల్లకప్రవర్తమానసమ్మార్జనీభవన్మలయమారుత"

"అంచితసౌందర్యవిశేషసంహననరోచిస్స్ఫూర్తితోద్యత్త్వసాంపతి ... ... ..."

"తామరసజన్మశచీదయితాదినిర్జరేశ్వరమకుటోపలద్యుతిపిశంగితమంగళపాదపీఠుఁడు"

"ప్రసూతితనూజసభాస్థితాహిభుగ్ఘోరణవాసవాద్యమరకూటము... ..."

"సురసారంగవిలోచనానుతతనూశోభ, స్మదభ్యస్తభాసురసాహిత్యరుగీతికా
దికకళాసూద్దామ నభ్యంచితాసురసామ్రాజ్యరమావతారన్ ... ... ..."

ఇట్టివనేకము లీప్రబంధమునఁగలవు. దీనివలన సీతనిపాండిత్యము స్పష్టపడుచున్నది. ఈ క్రిందిపద్యములలో జానుతెనుఁగుపదములే తప్ప సంస్కృతపదము వెతకుటకుఁ గూడఁ గానరాదు. చూడుఁడు-

"మొగములతిగ యగపడకుం,డఁగఁబుడమికి దిగినపల్లునవలాయొడయం
డగుతబిసిచేఁజదువులె,ల్లఁగఱచినవలంతి పీవలఁతివె తలఁచన్."

"ప్రాచియర్జ సీమాటి పడమటినేస్తకత్తియకుఁ బంపిన కెంపుతెలె యనంగ
హాదనుపౌన్నారిరేయతివసొమ్ములకుఁ గాఁ గరఁగిన యపరంజికరుడనంగ

తమ్మితీవియబోఁడికి నెమ్మికాఁడు, నిగ్గపుంజీఁకటికిఁ దీరనిపగవాఁడు
తొవలయుల్లాస మడఁగించుదుండగీఁడు ... ... ... ...పవలుఱేఁడు."

ఇత్యాదిపద్యములు కేవలము నచ్చతెనుఁగుపదములతో వ్రాసియున్నాఁడు. ఇంక నిట్టి వనేకము లున్నవి. విస్తరభీతినుదాహరింపమానితి. ఈ క్రింది పద్యములలో శ్రుతికటు వగుశబ్దాలంకారములు రసహీనములై వ్యర్థపదయుతములై యున్నవి, చూడుఁడు-

"మట్టుమీరినట్టి యిట్టలంపువిరాళి పుట్టునట్టికొట్ట కొట్టుపెట్టి
గట్టినట్టుదిట్టఁజెట్టవట్టుటకట్టు గట్టిపట్టుపట్టి గట్టుపట్టి"

పైపద్యమున ద్విత్వటకారములు ప్రోగుగాఁ జేసినట్టు లగపడుచుఁ జదువుట కెంతయో యసహ్యము కలిగించుచున్నవి. మఱి యొక చిన్నపద్యమున "సాటి, యేటి, జోటి, నిశాటి, తాటి, మేటి, మాటి, మాటి, చేటి"యని వర్ణావృత్తిం జేసి ప్రాణము విసువునట్లు చెప్పియున్నాఁడు. మఱియొకచోట,

"వాహాయువాహాయమాననాగాహితాయ
వృజినకలంకాయ లంకాయతాక్షీ ........."

ఇట్లే నాలుగుసీసపాదములందు నావృత్తియగు పదమే మరల నావృత్తిఁ జేయుచు యమకములఁ జెప్పినాఁడు.

"లోకనాయక ............లోచనాయ
లోచనాయతినికృత ............నలినాయ"

అనుచు ముక్తపదగ్రస్తముగా వ్రాసియున్నాఁడు. ఇట్టి వింకను గలవు-కొన్నిటినే చూపినాను.

ఇంక ఝుడిత్యర్థస్ఫూర్తిలేని పదము లీతనికృతియందు కుప్పతిప్పలుగ నున్నవి. అవి వ్యాకరణము చదువుకొనిన వారికిని రెండుమూఁడు నిఘంటువులు కంఠాగ్రమం దున్నవారికేగాని యితరుల కర్థమగుట దుస్సాధ్యము, చూడుఁడు.

"వాచంయమ, చైరకాలికైకత్రవాస, ఓతువాఖువు, క్షేపిష్ఠపాతంబు, ద్వయాతిగప్రవేశుఁడు, వికుర్వాణ, నైర్ఘృణ్య, ప్రాహుణిక, సంస్ఫోట, ప్రత్యాలీఢ, ఖామరాఘస, జఘ్ను, క్ష్వేళ............"

ఇత్యాదులు పద్యమున కధమము రెండు మూఁడుండును. కాని యిట్టి పదములు కవికున్న జ్ఞానమునే తెలుపును గాని రసమును బాడుచేయుటయే గాక సర్వజనసాధారణముగా నుండవు. కావ్యము రచించుట ముఖ్యముగాఁ బరుల నానందమునందించుటకుఁగదా ?

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే సద్యః
పరనిర్వృతయే..........."

అని యలంకారజ్ఞుల యాశయము. పైపదప్రయోగముల సద్యఃపరనిర్వృతి కలుగ దని యనుకొనుట కష్టము కాని కవి తనశక్తిఁ జూపుట కట్టివి ప్రయోగించె ననుకొన్నఁ బ్రకృతమున కంతగా నాక్షేపణ కలుగదు.......

మఱియు నీతని కవిత్వమందు జాతీయతగూడ నచ్చటచ్చట నున్నది...

"పాలన్ముంచిన నీటముంచినను" "దేశముగానిదేశముల" "ముక్కులపచ్చలారని యారకుండినన్" "శ్రీతాన యేతేర మోఁకాలడ్డంబిడి" "గోచిపాతరాయఁడయిన వృద్ధతాపసుఁడు"

మొదలగు సామెతలు ప్రయోగింపఁబడి ప్రకృతార్థమున కెంతయో సహాయములై యుత్కటప్రేమను నీతిని నైరస్యమును దెలుపుచుఁ గవియొక్క

హృదయవైశాల్యమును దెలుపుచున్నవి. మఱియు వర్ణనలవిషయమున మంచి మంచి యలంకారములతో హృదయంగమము లైన భావరాసుల గ్రుమ్మరించి నాఁడు. సూర్యాస్తమయవర్ణనావసరమున—

"పతివచ్చు నని నిశావాసకసజ్జిక కట్ట కిప్పిన కావిపుట్టమేమొ ?
ప్రొద్దుతో నైనపోరున నింగిఁబాఱు మందేహదేహాసృక్ప్రవాహ మేమొ ?
సవితతో దినలక్ష్మి సహగమించుటకుఁ బేర్చిజ్వాలింపఁజేసిన చిత్య యేమొ?"

ఈసమయముననే చీఁకటిని హృదయాహ్లాదముగఁ బొగడినాఁడు.

"అసదృశమున్ స్థిరంబు నగునంబరరత్నమువోవుటన్ బిత్ప
ప్రసువను కింతివంతగదురన్ విలపించుటయున్ దదీయశో
కసమయమందు జొబ్బిలుసకజ్జలరోదనవర్షమో యనన్
విస్మృమరమయ్యె నెల్లెడల వెగ్గలమై తిమిరమ్ము రోదసిన్.

ఇట్టివర్ణనము లిఁక రెంటి నుదాహరింతును. అట్లే నక్షత్రములతోఁ గూడిన యాకసమును గూడఁ జక్కగ వర్ణించియున్నాఁడు.

"......రాజువచ్చునని......నింగి చం, దువకల దిష్టముండనుఁడు తొల్తగఁ
గట్టిన ముత్తియంపు చేఁ, దువ లన నొప్పె ఋక్షనికురుంబము లాకసమందు"

మఱియుఁ జంద్రోదయమును వర్ణించుచు—

"మిత్రుని జాడలేమికిఁ బొక్కుచుఁదలెత్తి నెమకుచుండిన తూర్పు నెలఁత యేమొ?
హేలకై శచిబిడ్డఁ డెగురవైచుడుఁ బూర్వగిరిపైఁ బడిన బంతివిరులచెండొ
సమయమాంత్రికుఁడు ధ్వాంతముమాపమంత్రవిభూతికై తెచ్చినబూదిపండొ?"

అని యచుంబితార్థసంపత్తిగాఁ జదువరులహృదయకమల వికసనశీలము గ వర్ణించియున్నాఁడు. ఇంక ననేక స్థలముల నీతని గభీరభావతరంగ లానంద సముద్రమున నోలలాడింపఁగలవు.

ఇంకొక విషయము-ఈకవితల్లజుని గ్రంథమం దచ్చటచ్చటఁ గొన్ని భావ చౌర్యములు గనవచ్చెడి-స్వల్పముగా ననుకరించినవి విడిచి యనుగతములగు వాని నుదాహరింతును. సురస యనురాక్షసకాంత చేయఁబోవు ఋషిసేవను వర్ణింపుచు-

"కడువాఁడిమైనట్టి కౌక్షేయకమువాయి నాల్కయంతయుఁ జాచినాకినట్లు,
త్యక్తనిర్మోకంబు దారుణంబును నైన కోడెచిల్వను ముద్దుగొనినయట్లు,
గళముదాఁక శిరంబు ఘాతుకంబైన శార్దూలంబునోటి లోఁ దూర్చినట్లు"

అని చెప్పియున్నాఁడు. ఈపాదత్రయము కువలయానందమున నిదర్శ నాలంకారమునకు గ్రంథాంతరమునుండి లక్ష్యముగా నుదాహరించిన శ్లోకము నకు సరిపడు తెనుఁగుపద్యము లాగున్నది.

"రాజసేవా మనుష్యాణా మసిధారావలేహనం
పంచాననపరిష్వంగో వ్యాలీవదనచుంబనమ్"

ఈశ్లోకమును జూచిన చదువరులు తప్పక నిద్దానిని తెనుఁగున మార్చి రేమో యని యనుకొనక మానరు. మఱియొక స్థలమున నడవిని వర్ణింపుచు నిట్లు వాక్రుచ్చియున్నాఁడు -

"క్రాలు గాలవశాండిల్యకౌశికాదు, లైన ఘనతరుల్ గలిగి యక్కానసంబు
క్రాలు గాలవశాండిల్యకౌశికాదు, లైన ఘనతరుల్ గలిగి యక్కాననంబు"

ఈపై పద్యము చక్రనిశ్లేషతో నిమిడియున్నది. ఒకపక్షమున మునీ శ్వరపరముగను మఱియొకపక్షమున వృక్షపరముగను నర్థము చెప్పుకొనవలె ను. ఇట్టి శ్లేషయే గలిగి రెంటను సమానమగు నర్థము నిచ్చుపద్య మొకటి రామరాజభూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యాన మనుద్వ్యర్థికావ్యమున నున్నది. అచ్చటప్రకృతవర్ణనావిషయములు - నదియు సెలయేఱును.

"గాలవశాండిల్యకౌశికాదిపరార్థ్యతరులక్షువటయుక్తి దరులనెసఁగ"

ఇచ్చటఁగూడ నొకపక్షమున నాయాపేరులు గలఋషులును రెండవప క్షమున వృక్షములును వాచ్యార్థములు. ఇట్టి సంపూర్ణమైన పోలిక గలపద్య ములఁ జూచిన భావచౌర్యమే గాక పద్యచౌర్య మని కూడఁ జదువరు లనక మానరు-మఱికొన్ని పట్టెల,

"నెమ్మొగమువర్ణనముసేయ నెలయగుంగ్రు, శావలగ్నముపొగడఘనాయనమగు
తత్ప్రిశేణినుతింప నబ్దంబగు పద,ములను శ్లాఘింప దొరకొనఁబుష్కరమగు."

తత్తన్నాయికాంగముల వర్ణింప దీర్ఘకాల మగు ననియు నుపమాన భూతచంద్రపద్మాదుల శ్లేషచేఁ జెప్పియున్నాఁడు. ఇంకను బ్రాచీనతమములయి యిక్కాలమున నామమాత్రావశిష్టములు గానున్న భద్రక మదన తరలి శుద్ధవ రాటి మొదలగు బహువిధవృత్తములు చాల వాడినాఁడు. ఛందఃకర్త లెట్టిప్రా సల దుష్కరప్రాస లని చెప్పిరో యట్టిప్రాసల ననఁగా ష్ట, స్త్రీ, న్ద్ర, శ్చ- మొదలగు రెండుమూఁడు హల్సముదాయములు గలవాని వాడి నిరాటంకముగాఁ బద్య ముల వ్రాసినాఁడు. దీనినిబట్టి చూడ నీతనియకలంకకవితాప్రవాహమున కడ్డు

లేదని తేలుచున్నది. ఈతఁడు తఱచుగా శత్రర్థచువర్ణమందలి యుకారమున కు సంధిచేయుచు గొన్నిరూపముల వాడినాఁడు. ఇది వ్యాకరణసమ్మత మైనను శ్రుతికటు వగుస్థలముల నిట్టిసంధి చేయరా దని నాయభిప్రాయము-ఉ:—"అను చతఁడు, అంచభయంబొనంగి, ఒనర్చుచచ్చటిదానిన్"అని ప్రయోగములున్న వి. వీనిలో మూఁడవదానియందలి మొదటి మూఁడక్షరములు తీసివేచిన నెం తయపార్థ మిచ్చుచున్నదో! కాన నిట్టివి జాగ్రత్తగా వాడిన బాగుండును. మఱి యు, అట్టి యిట్టిశబ్దములపైఁ దచ్ఛబ్దవకారలోపరూపముల "అట్టెఁడు, ఎట్టెఁడు" ప్రయోగించినాఁడు. ఇట్టివి సర్వజనగోచరములు గాక బంధపారుష్యమును గలిగించుచుండును. తనజ్ఞానసూచకముగా కవివాడినాఁడు, కానిచో-

"కలరె యిట్టిరు సౌందర్యఖనులు మహిని"

అనెడి గీతపాదమును,

"కలరె ? యిటువంటిసౌందర్యఖనులు మహిని"

అని ప్రయోగించుకొన్నఁ బై పాదసారస్యము రాదా ? తప్పక కవితన పాండిత్యము చూపుటకే యట్టిపదముల వాడినాఁడు-

ఇఁక రసవిషయమును విచారింతము. ఈవిషయమున విపులముగ రసని ష్పత్తిని జూపిన నధమ మిరువదిపేజీలవఱకు గ్రంథ మధిక మగును గానఁ గొ న్నిపట్టుల వాని నెత్తి స్పృశింతును—

ఇందుఁ బ్రథమద్వితీయాశ్వాసములలో సురసను ఋషిసేవనిమిత్తము పంపునపుడు శోకము స్థాయిగాఁ గలకరుణరసము నాటఁబడినది-

"విద్యకై యాచార్యునొద్ద కేగినయప్డె చాలసేపుంటకు జలదరింతు,
బోటికత్తియలతో నాటలకై పోవ తడవుగాన్పడమికిఁ దల్లడిలుదు,
ఎటకైన పయనమేగుట తటస్థంబైన నినుబాసి చనుటకు నెగులుపడుదు,

మామకతపఃఫలమ! నీవు మగిడి వచ్చి,కంటఁబడుదాఁకనీప్రతీక్షణమహాయు గంబులెటువలె యాపింపఁగలుగువాఁడ,నక్కటా! యెంతనిర్దయుఁడ య్యెనియతి"

"నీవు లేనన్నినాళ్లను నావసథము, గహనభూప్రాయమై యుండుఁగద వెతల్లి"

"గోచిపాతరాయుఁడయినవృద్ధతాపసునకక్కటయీవలసెఁ ద్వితీయగాఁక"

"ఎదలోని బెంగనెవ్వతె మఱపించునింక, ముద్దు పలుకుల నెవ్వతె తెలు పునింక, విస్మయంబెవతె గావించు నింక."

ఇత్యాదివాక్యములచేతను, "హార్ద్రమున నశ్రువు లొల్కెడితండ్రిఁజూచి" అనెడి సురసవాక్యముచేతను గరుణకు స్థాయియైన శోకమును కవినిబద్ధించెను. కాన, కరుణమనవచ్చును—

అచ్చటచ్చట శృంగారరసస్పర్శలు గూడ నున్నవి. సురసకుమారులఁ జూచుటకు వచ్చెడినగరకాంతలఁ గొందఱినివర్ణించినాఁడు. ఇచ్చట శృంగారోద్దీపనవిభావనాదులు లేశములు గా నున్నను వర్ణనమాత్రము పూర్వకవుల ననుసరించుచున్నది.

ఇఁక వీరరసమును గుఱించి వేఱె చెప్పనక్కఱలేదు. చాలచోటుల యుద్ధారంభము లుండుటచే రౌద్రరసము ముఖ్యముగా దీన నంగిరస మనవచ్చును. ఈరౌద్రరసమందు మహాస్త్రగ్ధరాదివృత్తములచేఁ బ్రకృతపాత్రమేతానో తానేప్రకృతపాత్రమో? యనునటుల వర్ణించినాఁడు. ఇతరము లగు రసము లచ్చటచ్చట నుండి యంగిని బోషించుటచే నియ్యది నవరసభరిత మగుకావ్యమనఁదగును, గ్రంథవిస్తరభీతిని రౌద్రాదిరసముల కుదాహరణముల నీయనైతి.

మఱియొక సర్వకవివిలక్షణ మగుసుగుణ మీతనియొద్ద నున్నది. ఏమన పూర్వకవిశ్రేష్ఠులు తామేదియో కలలోఁ దమతమతాతతండ్రులు గాని భగవంతుఁడుగాని ప్రబంధరచన చేయు మని చెప్ప మొదలుపెట్టితి ననునాచారము వారివారిప్రబంధములఁ గనఁబడుచున్నది. ఈయాచారము నీతఁ డనుసరించియు నిట్టిమహాప్రబంధమున నసృత ముండరా దని మదలదానిని తగ్గించినట్లు తన పీఠికలో వ్రాసికొనియున్నాఁడు. ఇదియే యీతని యందలి స్తోత్రార్హమైన గుణము. మనపూర్వులు శతాంధన్యాయమునఁ దమతమగ్రంథముల వ్రాసిరి గాని యిట్టిస్వతంత్రబుద్ధిని వినియోగింపరైరి. ఇన్నిసుగుణములు గలిగి సాహిత్యజ్ఞానమునకుఁ గేలూఁత యొసఁగు నీప్రబంధము ప్రపంచాకాశమున నక్షత్రమువలెనున్నది. ఇట్టిగ్రంథము నుచ్చదశలోనికిఁ దెచ్చిన మనయాంధ్రభాషామతల్లికిఁ గోటియలంకారము లొసఁగుటయేయని యింతటితో ముగింపుచుఁ బైనావ్రాసిన విషయము లన్నియు నీయుద్గ్రంథమునఁ గల్గు గుణములలో కణము లని తెలుపుచు నింతటితో విరమించుచున్నాను.

# గ్రంథ స్వీకారము.

(1) ఓడబేరము—ఇది విద్వాన్ నారాయణవనము కూరత్తాళ్వారు అయ్యంగారు రచించినది. 36 పుటల చిన్నవచనము. అక్బరురాజ్యము, అక్బరు ద్రవ్యాదాయము, నౌకాయుద్ధములు, ఓడనిర్మాణము, ఓడదండు, ఔరంగజేబు, ఐదవ జార్జిసార్వభౌముఁడు నను విషయములు గలవు. పూర్వకాలమునందలి యోడలవిషయమిందుఁ దెల్పఁబడినది-విషయముకొంతమచ్చుచూడుఁడు-

"ఇఁక అగ్బరుకాలపు నౌకాయుద్ధములను గుఱించి కొంత విచారింతము 1580 న రాజాతోడర్‌మాలుని అగ్రాలో 1000 దోనెలను ఘ్రూబ్‌ను సిద్ధము చేసికొని ఘూర్జరదేశపు పన్నులను కుదుర్చుటకై అగ్బర్‌చక్రవర్తి పంపెను. 1590 న అగ్బర్‌చక్రవర్తి తాత్తానాయకుఁడగు మీర్జాజానీబేగునకు స్వాతంత్ర్యము ప్రకటింప వలయు నను తలఁపు కలిగినందున నతని మీఁదికి ఖానికానునతనిని బంపెను. అందునకై మీర్జా 120 శస్త్రాస్త్ర సంభరితమైన ఘ్రూబ్‌లను 200 దోనెలను ఖానిమీఁదికి వదలెను. వానిలో నొక్కొక్క ఘ్రూబ్‌లోను దారుశిల్పులు, తక్షకులు, కట్టెపనివారు, తమకొఱముట్లతో సిద్ధముగానుందురు. ......"అగ్బర్ నౌకానిర్మాణస్థానములను స్థాపించిన సమయమున మూఁడు వేల యానపాత్రములుండెను. పిమ్మట 768 యుద్ధపుటోడలుగా నేర్పడెను. ఇవిగాక జమీన్దార్లు జాగీర్‌దార్లు తాము సర్వమాన్యముగా ననుభవించు చుండు భూములకై చాక్రవర్తికి పెక్కుఓడలు దోనెలు సిద్ధము చేయుచుండిరి."

దీని వెల రు 0-4-0 లు. చెన్నపురి, కోమలేశ్వరన్ పేట, నారాయణవనము వకుళాభరణముగారియొద్ద దొరకును.

(2) వ్యాసావళి:—కాకినాడ, నాట్యకళావిజ్ఞానమండలిలోని, మాధ్వశ్రీ దొల్తాబాదు గోపాలకృష్ణారావుపంతులు, బి. ఏ., గారు రచించినది. వచన గ్రంథము. 1923 సం॥ మొదలు నేఁటివఱకు నప్పుడప్పుడు రచించిన అపేక్ష, సగుణనిర్గుణమూర్తి, సచ్చిదానందుఁడు, అజ్ఞానము, సప్తసోపానములు, చక్రములు, యోగాభ్యాసము, పునర్జన్మ, లోకములు, బ్రహ్మాండములు, విజ్ఞానము నను పదివ్యాసములు గలవు. చక్రము లనువ్యాసములోఁ జక్రాకృతి, మూలాధారచక్రము, స్వాధిష్ఠానచక్రము మొదలగు చక్రములు పటములతో సోదాహరణముగఁ జూపఁబడినవి. డెమ్మీ సైజులో 123 పుటల గ్రంథము.

ఈకవిగారు "విశ్వమంతయు నసత్యమని కొంతకాలము నమ్మియుంటిని. ఈయభిప్రాయము మాఱినది. విశ్వము భగవంతునికంటె వేఱుకాదని తోఁచినది. భగవంతుఁడు విశ్వరూపమున నావిర్భవించుటకుఁ గారణ మేమని పరిశోధించితిని నూతనభావము లుద్భవించినవి. స్థిరపడినవికావు. ఇట్టి యాందోళనసమయమున దైవికముగా శ్రీయరవింద ఘోషుగారి యోగసంకలనము (The Syntheses of Yoga) దివ్యజీవితము (The Life of Devine) గీతావ్యాసములు (Essays on Gita) చదువుటచే ననుమానము తీఱినది. మద్గురుండగు శ్రీప్రయాగ పురుషోత్తంగారి ప్రసాదమున స్వకీయానుభవమునందుఁ గొన్ని యధ్యాత్మిక విషయములు గోచరించినవి. అంత నూతనభావములు సిరపడినవి." -అని యుపోద్ఘాతములో లిఖించియున్నారు. వీరికి బాలమిత్రులగు వారణాసి సీతారామయ్యగారు జ్ఞానాభివృద్ధి విషయములో వారి వాగ్దానప్రకారము పరస్పరము తోడ్పాటుగలిగి యుండినందున—నింతమంది యూహాలతో నిండియుండిన యీ గ్రంథము జిజ్ఞాసువులకు సాయపడకమానదని తలంతుము. వీరి శైలిని జూపుటకై కొన్ని బంతులు—

"మిత్రోత్తమా? అజ్ఞానమహత్త్వమెరుంగఁ బ్రయత్నించుట వ్యర్థమా? దానికి హద్దులెచ్చట? ఎంతవరకు వ్యాపించినది. పరిశీలింతము. విచారింతము. మనుజునిఁ బరిశోధింతము. మానవుఁడనగా నెట్టివాఁడు? వానియందే తత్వములు కలవని వాడుచున్నారు. స్థూలప్రాణ మనోచిత్తబుద్ధి సమ్మేళనమేకదా మానవుఁడు. అట్టితత్వములలో నన్నిటికన్న శ్రేష్ఠమైనది వ్యక్తేకదా? ఆవ్యక్తినే వస్తుపరిజ్ఞానమనుచున్నారు. (Consciousness) ఈవ్యక్తి జాగ్రతునందు స్థూలప్రాణములం దేకాగ్రతనొంది స్వల్పముగా బహిర్గత మగుచున్నది. ప్రస్తుత విషయమే గోచరించుచున్నది. కాని భూతభవిష్యత్తులు తెలియకున్నవి. వర్తమానము సహితము పూర్తిగా గోచరించుటలేదు."

దీని వెల 1-0-0. కాకినాడ సూర్యారావుపేటలో నాట్యకళావిజ్ఞాన గ్రంథమండలిలోఁ గవిగారియొద్దనే దొరకును.

(3) వామనచరిత్రము—సటీకము. రాజమహేంద్రవరము, ఆర్యపుస్తకాలయాధికారులచేఁ బ్రకటింపఁబడినది. శ్రీమదాంధ్ర మహాభాగవతములోని పోతరాజామాత్యుని సహజపాండిత్యప్రకర్ష చూపించు పద్యములకే టీక, తాత్పర్యము మున్నగునవి వ్రాయఁబడినవి; ఉన్నతపాఠశాలల విద్యార్థుల కిది

యుద్దేశింపఁబడియుండును. వారికిఁ దగిన భాషాభివృద్ధికిఁగా వలసిన పుస్తకమిది. బాలురజ్ఞానవిద్యాభివృద్ధులంగోరు విద్యాధికారులు తమతమ యధికారములలో నుండు పాఠశాలలలో దీనిని పాఠ్యగ్రంథముగా నొక్కొక్కసారి నిర్ణయించి, బాలురతోపాటు ప్రకాశకులకును లాభము గల్గింతురుగాక.

ఈయార్యపుస్తకాలయమువా రిదివఱ కనేక బాలకోపయోగ పద్యగ్రంథములను, శతకములను టీకాతాత్పర్యములతోఁ జక్కగా నచ్చువేయించియున్నారు దీని వెల 1-0-0.

(4) తొలకరిచినుకులు — ఇది యనంతపురము రాయలసీమ కవికుమార సమితినుండి వెలువడినది. అనంతపురము కళాశాలలోని విద్యార్థులగు ఉ. మ, ఆచార్య, మూర్తి యను మువ్వురు రచయితలు. వీరి గురువర్యులగు ప్రయాగ వేంకటరామశాస్త్రులుగారు, పీఠికలోఁ దెల్పినట్టులు వీరికవితావాహిని గంగాస్రవంతివలె ముత్త్రోవలంజనక చాలవరకేకముఖముగనే ప్రవహించుచున్నది." ఇందు ఆత్మగీతము, పుష్పము, ఆహ్వానము, ఆతిథ్యము, ఇత్యాదిగా నిరువది రెండు ఖండకావ్యములు గలవు. ముగ్గురివి మూఁడుపద్యములను మచ్చుచూపుచున్నారము.

చ. వగచితి రేయియంత బలవంతపు వంత రవంత దాళకన్
మొగిచితిఁ గన్నుల న్నిదురఁ బోవక తావక దివ్యరూపమున్
దగస్మరియించుచున్ విరహతాపమునోర్చితి నేడ్చి వల్లభా!
విగళితమైనబాష్పములు వీని దుషారమటంద్రు చూడుమా. (మూర్తి)

చ. ఇఁక నొకసారి యగ్గిబడి యెల్లరకున్ భవదీయపారిశు
ద్ధ్యకలన చాటఁగా వలయు నంట; భవాబ్జభవాదివాక్కులే
యొకయవివేకి చాకికడ నుత్తవి యయ్యెను; దుర్మదాంధులో
క్కొకరనినప్పుడెల్ల నగునొక్కొ కృశానునికీలలంబడన్. (ఉ. మ.)

చ. అమృతమునిత్తు వేఁడకయె ప్రాణవిభుండని యెంచి నిన్ను దే
హమున కలంద పుప్పొడి నహర్నిశమున్ ముదమార నిత్తు, స్నే
హమున పొలంగ నెంచితి ననంగుని బాధల కోర్వఁజాల నో
భ్రమరకులేంద్ర! యిట్టి నను వంతల ముగ్గఁగఁ జేయఁ బాడియే. (ఆచార్య)

ఇందు మొదట "కులపతితొలిపలుకు" అని యొకపాట వంటిది ౬ పుటలు గలదు. అదియుఁ దక్కిన పద్యములవలె నిర్దుష్టముగా సలక్షణముగానే యుండిన

నీహాత్మ్యమునకెంతో తగియుండెడిని. దీనివెల రు 0-6-0 కావలసినవారికి అనంతపురములో సాధనపుస్తకాలయములో దొరకును.

(5) భక్తచింతామణి—కవిశేఖర వడ్డాది సుబ్బారాయ విరచితము. ఇంతవఱకు భక్తచింతామణి యిరువదిసారులు ముద్రింపఁబడినది. ఇది యిరువది యొకటవకూర్పు. ఇందు వెనుకటికూర్పులలోని పద్యములకంటె నెక్కుడు పద్యములు గలవు. వెనుకటి కూర్పులో 270 పద్యములు. ఈ 21వ కూర్పులో 352 పద్యములు. మనయాంధ్రదేశములో నేకవి పుస్తకముగాని యిన్నిసారులు ముద్రింపఁబడినది కనఁబడదు. ఇందలి పద్యములు భక్తిరసప్రధానములగుటయే యిన్ని ప్రకటింపఁబడుటకుఁ గారణము. హిందువులకేగాక యితరమతస్థులకును నిష్పాత్త్రము పఠనయోగ్యముగానుండుట మఱియొక విశేషకారణము. కవిగారే యిన్నిసారులును ముద్రించు భాగ్యము పట్టుటచే గ్రంథము వన్నెకెక్కుచున్నది.

మచ్చునకుఁ గ్రొత్తపద్యములు.

శా. బాలున్ జాలికిఁ దగ్గిగుండమున నిల్వంబెట్టి యాభీలత
జ్వాలాజాలములోన వానిఁ బదముల్ పాడించు, నాడించు; న
న్నాలీలన్ బహుళాపవాప్పదపు మర్త్యంబాదుఁ బుట్టించి క్రీ
డాలోలుం బొనరింతమేయమును మాయన్ భక్తచింతామణీ. ౩౩౮

మ. మమతాశృంఖలముల్ దగిల్చి పటుకామక్రోధలోభాది వ
ర్గముఁ బైఁ గాపిడి బొందిబందియల నిర్బంధించి, జీవాత్మచే
శ్రమసంధాయక హేయకార్యచయముల్ సల్పించె; దెందాఁక నీ
యమబాధల్ ? పరమాత్మ! నిత్యసుఖమిమ్మా! భక్తచింతామణీ. ౩౩౯

ఇది రాజమహేంద్రవరములో గ్రంథకర్తగారియొద్ద దొరకును. క్రౌను సైజు పుస్తకము 5 అణాలు. జేబులో నిముడు చిన్న సైజు క్యాలికో బైండుది 9 అణాలు.

# వర్షము.

విద్యాప్రవీణ-బులుసు వేంకటరమణయ్యగారు. (విజయనగరము)

---

సీ. జలపూరితంబులౌ సస్యంబు లెల్లెడ రతనతివాసీల రహిఁ జెలంగ
ఘనవితానము మింటఘనముగ వ్యాపించి ఘనవితానపుసొంపుఁ గడలుకొల్ప
మేఘనిర్ఘోష మమోఘరీతిఁ జెలంగి దుందుభిధ్వానము పొందుఁ గూర్ప
మబ్బుచాటున నుండి యుబ్బుచుం దెసల నెలవిద్యుత్ప్రదీపంపు వినుతిఁ గూర్ప
విశ్వసామ్రాజ్యధుర్యుఁడౌ శాశ్వతునకుఁ
బ్రకృతికల్యాణలక్ష్మితోఁ బరఁగు పెండ్లి
కొఱకు నౌవస్తునిచయంపుఁ గూరు పనఁగ
వర్షఋతుశోభ జగమున వ్యాప్తమయ్యె.

గీ. పిడుగుంబఫిరంగులధ్వనిఁ గడలుకొల్పె
మెఱుపుపచ్చతాబాలమెఱుఁగునించె
పొలిచె మిణ్గురుఁబురుగులు పొలుపుమీఱి
యూమతాబాలతేజఃకణాళియనఁగ.

గీ. పారిజాతాదివృక్షముల్ భూరిపుష్పలాజలం జల్లె; కాన్కగా లలితవర్ష
బిందుముక్తాఫలంబులఁ బొందుపఱిచె, నావధూవరు లూరేగు నవసరమున.

* * * * *

గీ. స్వర్గలోకము నంటితిఁ జాలు నింక, నలరసాతలలోకంపు విలువఁ జూడ
వలె ననుచు నవి క్రిందుగా వఱలె ననఁగఁ, బర్వతపునీటిజలమునఁ బరిఢవిల్లె.

ఉ. మర్త్యవ మాళిఁ దాల్చి బతిమాలిన నిర్ఝరిణీమతల్లి తా
నక్కడ నిల్వలేక వెస నబ్ధిని గూడఁగఁ బోయె నంచుఁ దాఁ
బొర్క్కుచు నద్రి లజ్జఁ దనమో మొఱుకంటఁ బడంగనీయకే
సుకి మసుంగు దాల్చె ననఁ జోద్యము గూర్చెఁ బయోద మద్రిపై.

ఉ. నీరము కల్గుచోటువలె నిర్జలభూమితలంబు లేమియున్
వారి నొసంగవంచు ననివార్యమహాక్షుధ కల్గ, మేఘముల్
ధారల జల్లువెట్టి భువి ధ్వానముచేయఁగ నెంచి యేఱులం
బారఁగఁ జేసె భూమిపయి వర్షబలంబులఁ జూపి యెంతయున్.

# పాణిని-అలంకారశాస్త్రము.

— సాహిత్యవిద్యాప్రవీణ- బు. సు. వేంకటరమణయ్యగారు —

---

పాణినిమహర్షి గీర్వాణవాఙ్మయమునఁ బ్రసిద్ధవైయాకరణుఁడు. ఇతరము లగు వ్యాకరణములు చాలగ నున్నను పాణినీయవ్యాకరణమే నాఁటినుండి నేఁటివఱకును సుస్థిరమై పఠనపాఠనములయందుఁ బ్రసిద్ధమై యున్నది. ఇతనియష్టాధ్యాయి సూత్రపాఠముపైనే పూజ్యుఁ డగుపతంజలిమహర్షి మహాభాష్యమును వ్రాసియున్నాఁడు.

వ్యాకరణమున నీముని యనుపముఁడై యుండియు విషయాంతరములను గూడ బాగుగ గుర్తెఱుఁగు నని యతనిసూత్రముల వలననే దెలియుచున్నది. పాణినిముని కవిప్రవరుఁ డని ప్రసిద్ధి. ఇతనిశ్లోకములు కొన్ని సుభాషితావళి మొదలగుగ్రంథములయం దుదాహరింపఁబడి యున్నవి. ఆలంకారికులుదాహరణముగఁ దీసికొనుచున్న "ఉపోఢరాగేణవిలోలతారకం" మొదలగుపద్యములు కొన్ని పాణినికర్తృకము లని ప్రసిద్ధి. పాణిని యుపజాతిచ్ఛందస్సున నేర్పరి యని క్షేమేంద్రుఁడు వ్రాయుచున్నాఁడు.

పైవిషయములఁబట్టి పాణినిమహర్షి గొప్ప వైయాకరణుఁడే గాక కవియునని తేలుచున్నది. అతఁడు వాఙ్మయమును బాగుగ నవలోడనము నొనర్చియుండుటచేతనే సమగ్రమగుశబ్దవ్యాకరణమును వ్రాయఁగలిగి యుండె నని మన మూహించుచున్నాము. వాఙ్మయమును బాగుగఁ బరిశీలించియుండుటచే నతఁడు వాఙ్మయరహస్యములను దెలుపు నలంకారశాస్త్రమును గూడ బాగుగ గుర్తెఱింగి యున్నాఁడని చెప్పవలెను.

పాణిని కవిప్రవరుఁ డనుటకుఁ దత్కర్తృకముగ సుభాషితగ్రంథములలో నుదాహరించిన పద్యములేగాక వేఱొండాధారములేదు. అతనియష్టాధ్యాయినిబట్టి యావిషయ మించుకయుఁ దెలియదు. కాని యతఁ డలంకారశాస్త్రము నెఱుఁగు ననుటలోను, దాని నెఱుంగుటయే కాక తద్రహస్యములను వివరములను బాగుగ గ్రహించె ననుటకును దత్కర్తృకము లగునష్టాధ్యాయిసూత్రములే కొంతవఱకుఁ జాలియున్నవి.

వైదికవాఙ్మయమున నలంకారాదికములు కొన్ని కన్పించుచున్నను శాస్త్రీయము లగుపారిభాషికపదములు దెచ్చటను గానరావు. నిరుక్తనిఘంటు

వును వ్రాసినయాస్కాచార్యులు "ఉపమ, లుప్తోపమ" మొదలగుఁ కొన్నిపదము లను వాడియున్నారు పాణినిముని యాలంకారికసముయసిద్ధము లగుశబ్దము లను జాలవఱకు వాడియున్నాఁడు.

1 ఉపమానాని సామాన్యవచనైః. 2-1-55

2 ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే. 2-1-56

3 జీవికోపనిషదావపమ్యే. 1-4-79.

4 అవ్యయం విభక్తిసమీపసమృద్ధివృద్ధ్యర్థాభావాత్యయ సంప్రతిశబ్దప్రా దుర్భావపశ్చాద్యథానుపూర్వ్యయౌగపద్య సాదృశ్య సంపత్తి సాకల్యాంతవ చనేషు. 2-1 6.

5 తుల్యార్థై రతులోపమాభ్యాం తృతీయాఽన్యతరస్యామ్. 2-3-72.

6 ఉపమానా దాచారే. 3-1-10.

7 ఉపమానాచ్చ. 5-4-167.

ఈమొదలగుసూత్రములం దుపమాలంకారవిషయము చెప్పఁబడుటయే గాక పారిభాషికపదములు "ఉపమా, ఉపమానం, సామాన్యం[సాధారణధర్మ]" అనుమొదలగునవి చెప్పఁబడినవి. వీనింబట్టి యుపమాలంకారమున నుపమా నము, ఉపమేయము (విశేష్యము) సాధారణధర్మము నుండవలె ననునంశము వ్యక్తము చేయఁబడినది. సామాన్యపదప్రతిపదము లగుసాదృశ్యాదిపదములు మీఁదిసూత్రములలోఁ గొన్నింటియందుఁ గానవగును.

1 తేన తుల్యంక్రియాచే ద్వతిః 5-1-115

2 తత్ర తస్యేవ. 5-1-116.

అను నీసూత్రములఁ బట్టి యుపమాలంకారమున నుపమావాచకము లగు "ఇవ" మొదలగునవి యుండవలె ననియు వానికిఁ దద్ధితాదివృత్తులయం దు వతిప్రత్యయమువచ్చు నని యు నిశ్చయించుచున్నాము. ఇందుఁ గ్రమము గ నార్థి- శ్రౌతి- యనునుపమాభేదములు చెప్పఁబడియున్నవి. ఈపాణినిముని మతము ననుసరించియే ప్రాచీనార్వాచీనాలంకారికు లుపమయందు శ్రౌతార్థభే దముల నుదాహరించుచుఁ బ్రమాణముగఁ బైసూత్రములనే యె యుచు న్నారు. పైసూత్రములంబట్టి పాణిని యుపమాలంకారవిషయమునఁ జేసినపరి శ్రమ వ్యక్తము కాఁగలదు,

1 మయూరవ్యంసకాదయశ్చ. 1-2-72.

వృత్తి- మయూరఏవ వ్యంసకః మయూరవ్యంసకః వ్యంసకోధూర్తః. ఈమీఁది సూత్రమునుబట్టి రూపకాలంకారమును పాణినిమహర్షి బాగుగ గుర్తెఱిఁగినట్లు నిశ్చయింపవలెను. ముఖమే చంద్రుఁ డనురీతిని మయూరమే వ్యంసక మనునర్థమున సమాసము చేయఁబడినది కాన రూపక మనవచ్చును.

2 యథాసంఖ్యమనుదేశః సమానామ్. 1-3-10.

3 ఏచోఽయవాయావః 6-1-78.

ఈ రెండుసూత్రములను బట్టియు యథాసంఖ్యాలంకారము కొంతవఱకు సూచింపఁబడుచున్నది.

షష్ఠ్యాఆక్రోశే. 6-3-21. దాస్యాఃపుత్రః ఆక్రోశేకిం? దాసీపుత్రః.

మీఁదిసూత్రముచే నిందయందు షష్ఠి కలుక్సమాసము [సమాసమున "సుపోధాతుప్రాతిపదికయోః" అనుసూత్రముచే సుప్ప్రత్యయమునకు లోపము రావలసియున్నను రాకుండుట] విధింపఁబడియున్నది. కావున "తొత్తుకొడుకా!" అని తిట్టునపుడు "దాస్యాఃపుత్ర" అనియే యుండును. "దాసీపుత్రః" అనినచో నింద గమ్యమానము కాఁజాలదు. తిట్టుటయందు "దాసీశబ్దమునకుఁ బ్రాధాన్యము కాని పుత్రశబ్దమునకుఁ బ్రాధాన్యము లేదు. కావున దానికిఁ బ్రాధాన్యము షష్ఠివలననే తెలియుచున్నది. అది ప్రధానము కానిచో విధేయావిమర్శ మనుదోషము వాటిల్లఁగలదు. కాళిదాసునికుమారసంభవమున "ద్వితీయమౌర్వీ మివ కార్ముకస్య" అనినచో మౌర్వి ప్రధానమై ప్రకృతోపయోగి యగు "ద్వితీయత" అప్రధానమై మీఁదిదోషము సంభవించుఁ గావున నచట "మౌర్వీం ద్వితీయా మివ కార్ముకస్య" అని పఠించుచున్నాము. మీఁదిషష్ఠీతత్పురుషసమాసమున నదియుత్తరపదార్థమే (పుత్రఅనునదే) ప్రధానము కావలసివచ్చును, గాన నలుక్సమాసమును విధించినఁ గాని యభీప్సితార్థసిద్ధి కలుగఁజాలదు. కావున నీయాచిత్యమును బాగుగ గుర్తించినపాణినిముని ముఖ్యదోష మగువిధేయావిమర్శమును బాగుగసూచించె నని మనము నిశ్చయింపవలెను. ఈదోషము లాలంకారికసంకేతితము లగుట నిర్వివాదాంశము.

పాణినిమహర్షి మీఁదియలంకారదోషవిషయములనే గాక నాట్యమును గూడ బాగుగ నెఱుంగుటయేగాక నాట్యవిషయకము లగుగ్రంథములను గూడ గుర్తెఱిఁగినట్లు నిశ్చయింపనవకాశము కలదు.

ఛందోగౌక్థిక యాజ్ఞికబహ్వృచనటాఞ్ఞ్యః. 4-3-29.

వృత్తి:-ఛందోగానాం ధర్మ ఆమ్నాయోవా ఛాందోగ్యమ్, నాట్యమ్ (నటానాం ధర్మ ఆమ్నాయోవా)

మీఁదిసూత్రమున నటులయొక్కధర్మము నాట్య మనియు, లేక వారిశాస్త్రము నాట్య మనియుఁ జెప్పఁబడినది. ఇట్లు సామాన్యముగనే గాక విశేషముగ నాట్యశాస్త్రము గల దని చెప్పఁబడినది.

1 పారాశర్యశిలాలిభ్యాం భిక్షు నట సూత్రయోః 4-3-110.

2 కర్మందకృశాశ్వాదినిః 4-3-111.

1 శైలాలినోనటాః, (శైలాలినా ప్రోక్తం భిక్షుసూత్ర మధీయతే)

2 కృశాశ్వినోనటాః (కృశాశ్వేనవా ,, ,, ,, ,, )

మీఁదిసూత్రములలో శిలాలినటసూత్రములు, కృశాశ్వనటసూత్రములు విశేషముగఁ జేర్కొనఁబడినవి. ఇట్లు పాణినిసూత్రములందలంకారవిషయములు కొన్ని కలవు. దిఙ్మాత్రము ప్రదర్శించితిని.

నీమగని కేమిచూఁ దిమన్నించి మును వరించితే రాము పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామి వామభాగ, చంద్రశాలాసభాలంబ శ్యామలాంబ.

బూడిదలోఁ బడి పొర్లాడువానికి గంధంబు మేన నలందఁగలిగెఁ
దోలు గప్పుకొనిగంతులు వేయువానికిఁ జలువదుప్పటిఁ గప్పుకులుకుగలిగెఁ
బాములఁ దాల్చి సంబరమందువానికి మేలిమితొడవుల మేలుకలిగెఁ
గాడుల నెపుడు నిల్కడ గల్గువానికి నింటఁ బూఁబాన్పున నుంట గలిగె
నింత నిన్నుంచి కాని మున్నెఱుఁగునటవె, కృత్తివాసుండు పెడనపురీలలామ-

చట్టుజాతికి ముద్దుఁబట్టివైనప్పు డాగట్టితనం బెట్లు పట్టువడదు
గట్టువిల్తునిఁ జెట్టవట్టినయప్పు డాగట్టితనం బెట్లు పట్టువడదు
మెట్టదారికిఁ దోడఁబుట్టు వైనప్పు డాగట్టితనం బెట్లు పట్టువడదు
తిట్టలఱేఁ డున్నిపట్టైన యప్పు డాగట్టితనం బెట్లు పట్టువడదు
పట్టువడకున్న వజ్రసంఘట్టనంబు, హృదయమున కేల పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామివామభాగ, చంద్రశాలాసభాలంబ శ్యామలాంబ. ౩౦

మూఢుండు కాలాబ్దములఁ జూచి తనయింటి కడవనీ రెల్ల వెల్వాడల నూకి
మొరగెడుమ్మాడ్కిఁ గాముకుఁడు వారాంగనాసంగమంబున నగ్నిసాక్షిగా వి
వాహమాడిన వరారోహను విడనాడు కైవడిఁ దుచ్ఛభోగంబు లనుస
రించి సాన్నిధ్యంబు గాంచిన యంత విసర్జించి ఘోరసంసారజలధి
మునిఁగి కొందఱు తిరుగుదు ర(నవరతము), రేవు గానక పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామివామభాగ, చంద్రశాలాసభాలంబశ్యామలాంబ.

నీయాన దుష్ట ... ... ... ...
జొరక తద్భీతిసంహరణార్థ మరసి నీచరణంబు లెద సదా భరణములుగఁ
బూని మానుగ నున్నవాని కేనాఁటికి నైనఁ బునర్జన్మ మావహింపఁ
జేయఁదలంచుట నాయమే వెఱచినవానినే వెఱపింప వచ్చినట్లు
గాదె నామీఁద నీదయ లేదె వేడ్క, నేలుకోరాదె పెడనపురీలలామ-

నిన్నుఁగన్గొన్నవాఁ డెన్నన్ని పూర్వజన్మములపున్నెంబు లొనర్చినాఁడొ
కాని యాతండె కులీనుండు లోకవిఖ్యాతుండు లక్ష్మీసమేతుఁ డధిక
నిశ్చలజ్ఞాని సూనృతమాని తత్త్వాభిమాని మానితముక్తిజాని మఱియు
నది లేనివాఁడు నిరర్థకుం డిందునందును లేనివాఁడు గావునఁ దదర్థ
మంత నాయందు సార్థకంబనక కరుణ, వృద్ధిసేయవె పెడనపురీలలామ- ౩౨

హరిశరుండే షడ్గుణైశ్వర్యసంపన్నుఁ డతివ సౌభాగ్యదేవతవు నీవు
సతి వైనకతమున నతఁడు హాటకమున కమితసౌగంధ్యం బహర్నిశంబు
గల్గినట్లె మఱి కమలాసనాది బృందారకసిద్ధవిద్యాధరప్ర
ధానసంతానంబు దాఁ గన్నవాఁడయ్యె శంకరుం డోదేవి సంతతంబు
హిత మొనర్చితి పశుపతి కింత కతని, రేఖ మంచిది పెడనపురీలలామ-

లోకు లనేకులు నీకు నీ వేకాకి వై కోర్కె నందఱ నేకకాల
మందు సృజించి మున్నందులోఁ గొందఱి కిందొక భాగ్యంబు గొందఱకు వి
శేషదారిద్ర్యము చేఁజేతఁ జేసితి పక్షపాతం బేమి భాగ్యవంతు
లనఁగ శుష్కదరిద్రులనఁగ నీకన్న కానుపు కాదె తప్పలే దపయశంబు
కప్పు నెఱకొప్పు నెపమున విప్పుదనరి, కూలె నౌఁదలఁ బెడనపురీలలామ-

మందహాసము కౌముదీందిర మధురాధరమరందమహితసారంబు నవ్వ
మృగనాభితిలక ముత్కృష్టక ... నీదువదనరాకాసుధాంశు
మండలంబు కటాక్షతండోపతండమరీచులలోకవిలోచనప్ర
కాండచకోరసంఘంబుల కెడ లేని కవఁగూర్చి సురనేత్రకైరవముల
కెప్పుడువికాసమొనరించెనిందునాద,రించి యెమందుఁ బెడనపురీలలామ-

అసితఘోరాకారుఁ డత్యంతశూరుఁ డుత్కృష్టమదాంధుఁ డూర్జితబలుండు
మహిషాసురుం డుగ్రమహిషి దురాగ్రహుం డై విగ్రహంబున కరుగుదేర
నట్టహాసంబున నరిగుండె వగిలించి తోన కాలాహిసమాన మైన
శూలాగ్రమున వాని నేలకుఁ బడఁగ్రుమ్మి మో మెట్టితామర మురువుమీఱ
నసువులకుఁ బాపి దివిజులకభయమొసఁగి, ప్రీతిఁ జెందితి పెడనపురీలలామ-

దేవతామకుటప్రదీప్తమాణిక్యనీరాజితపాదసారసవికాస
శాసరాసురకులాగ్రేసరామృతముగ్వ్వలయసమయమహానిలప్రభావ
భావజారాతిసంభావనామూలజగన్నుతాకారరేఖావిశేష
శేషఫణీంద్రభూషితభూషితాదిసత్వగుణప్రధాననిత్యస్వభావ
భావనాతీతసుమహత్వ భవనభువన, పాలనామోద పెడనపురీలలామ-

ధ్యానంబు లేని ప్రాతస్స్నానసంధ్యాద్యనుష్ఠానకర్మసందోహ మేల
జ్ఞానంబు లేని శాస్త్రపురాణ(కావ్యే)తిహాసపారపఠనాభ్యాస మేల
కంఠంబు లేని రాగతరంగసంగీతలాస్యాభినయదోర్విలాస మేల

భామినిలేని పుష్పసుగంధకర్పూరతాంబూలతూలికాతల్ప మేల
భవదనుగ్రహ మిల లేని పంచజనుల, కేలొకో భక్తి పెదనపురీలలామ-
బహులోభమతికి ద్రవ్యం బగ్గలం బైన నేమి మొదల్ తగ్గనేమి ఫలము
విశ్వస్తకు సమస్త విధభూషణము లుండె నేమి లేకుండిన నేమిఫలము
షండున కంగనాసాంగత్య మబ్బిననేమి యబ్బకయున్న నేమి ఫలము
వసుధ నంధున కక్షివైశాల్య మెంతైననేమి కాంసంతైన నేమిఫలము
గుణముసూత్రంబుపుంస్త్వంబుగోచరంబు, గోలుపోయినఁబెదనపురీలలామ
రామలింగేశ్వరస్వామి వామభాగ, చంద్రశాలాసభాలంబ శ్యామలాంబ.
బాల్యవైధవ్యసంప్రాప్తకులాంగనాకుల మనముంబలెఁ గోర్కె లబ్ధి
కల్లోలముల భంగిఁ గడువడి జనపడి పుట్టి పుట్టినయట్లు మట్టఁపడు ద
రిద్రులం దెప్పు డుర్వీతలంబున దుర్మదాంధసంబంధభాగ్యంబు ముందు
గలుగుఁ దోఁత్తోడనె తొలఁగు నొక్కింత తిరంబుగా నేర దప్రాప్త మైన
స్వప్నలబ్ధపదార్థంబు సరణివట్టి, జాలమే కాదె పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామి వామభాగ, చంద్రశాలాసభాలంబ శ్యామలాంబ.
బాలేందుసంకాశఫాలదేశాంకితకస్తూరితిలకాతిగంధసార
సార కాశ్మీరసంభారసీమంతని(రంత)రసౌభాగ్యరాణివాస
వాసవనీలాశ్మవారవిస్తారభాస్వరకచరచితపుష్పప్రకాశ
కాశనీకాశసంకలితరోమావళీకల్పవల్లిస్తబకస్తనాభి
రామ రామామణిశ్యామర(ణతలా)గ్ర, రిపుగణవిరామ పెదనపురీలలామ-
పాండిత్య మొక్కింత పాటిల్లునంత దుర్వాదియై బుధులఁ దిరస్కరించు
భాగ్యం బొకింత సంప్రాప్త మైనంత యున్మత్తుఁడై ధనికు ననాదరించు
భుజశక్తి యొక్కింత పుష్టి యైనంత నిర్దయుఁడై యితరుల బాధలఁ గలంచుఁ
బడుచు నిచ్చుడొకింత పదిల ప్రత్యర్థి యైత లపహరించు
మూ ందుసాధు, వృత్తి యానటె పెడనపురీలలామ-
తఱచుగా మొసలివాతను నున్న మానికంబును బెకలించి మే లెనయవచ్చుఁ
గడలేని కరడుల వడి మొరంగెడు సముద్రంబు నొక్కుమ్మడి దాఁటవచ్చుఁ
జటులకర్కోటకజాతిపామును బువ్వుదండపోలికఁ దలఁదాల్ప వచ్చుఁ
బొంచి మంచితనంబు గాంచి పంచాస్యంబు నింపుగాఁబట్టి యాడింపవచ్చుఁ
గాని మూర్ఖునిఁ దెలుపఁగాఁ గా దనాక, యేలుకోవమ్మ పెడనపురీలలామ-

నీవాఁడ నంటి మన్నించుమంటి నింకేమనందునటంచు నెంతదాఁక
వేఁడుకొందు నటంచు విసువక మఱియు నెన్నెన్నివిధంబుల నెన్నినామ
నవి విన్నపము చేసినను నూరకుంట న్యాయంబుగా దంటి నే మన్నఁ గరుణ
రాదాయె నామీఁద లేదాయెఁ గనికరం బాఁడువారిమనంబుఁ జూడ వజ్ర
నిష్ఠురం బనుశాస్త్రోక్తి నిక్క మనఁగ, నేలుకోవమ్మ పెదనపురిలలామ-
ఇలలోన నెన్ని యోనులఁ బుట్టి గిట్టినో కాని పునర్జన్మకాంక్ష వదలె
భువిలోన నెన్ని జంతువుల హింసించెనో కాని ఘాతుకధర్మక(లనతొలఁగె)
జగతిలో నెన్ని దుర్జాతులఁ గూడెనో కాని పుమ్మధర్మవికార మణఁగె
వసుధలో నెన్ని పాపము లొనరించెనో కాని దుర్మార్గసాంగత్య మరిగె
నెప్పు డెట్లైన నీజీవుఁ డే స్వతంత్రుఁ, డేలుకోవమ్మ పెదనపురిలలామ- రగి
పుట్టినయది మొదల్ పొట్టకై హీనుల యాచించుచో బిడియమ్ము లేక
పొట్టనిండిన యంతఁ బొలఁతుల పై నాస గాసిల్లుచోఁ దన వాసి లేక
పొలఁతి గల్గినమాత్ర భోగంబు గొన నుత్సహించుచో నేమైన నెగ్గులేక
భోగంబు లమర నపూ                    లార్జించుచో వినయమ్ము లేక
క్రాలె నీఘట మెంతదుష్టమనాక, యేలుకోవమ్మ పెదనపురిలలామ-
మతమొండు గల దని మద్యమాంసంబుల భక్షింపఁ జూతు రపేక్షఁ గొలఁది
మహి వింత కా దని మహిషమార్జాలాది దానముల్ గొందు రుదారకాంక్ష
స్వర్గభోగంబు నిశ్చయ మని పశువధఁ జేయఁ బాల్పడుదు రన్యాయబుద్ధి
విధ్యుక్త మని మునివేషంబు దాల్చి యింటింట భుజింతు రూర్చ్వడలకుండఁ
గాని హానికి వెఱవ రెంతేని బైసి,మాలి కలిమాయఁ బెడనపురిలలామ-
సత్యంబు శూన్యం బసత్యంబు మాన్యంబు ధర్మంబు కఱవు దుష్కర్మ మురవు
నీతిదూరం బవినీతి సారంబు సౌజన్య మొక్కింత దౌర్జన్య మింత
యని చెప్ప నలవిగా దక్కటా యీప్రపంచంబునం దేమైన సంతతంబు
నను గన్నతల్లి వీ వని నమ్మి యున్న నా కేల నో యమ్మ నీకృపగలుంగఁ
గా నెట్టి యపవాద లేని కుచ్చితులు గూర్చినఁ జెందునే విమలుని దమంబు
రవినిఁ బొందునె నిర్విచారమిది నామొ,ఆలకింపుము పెదనపురిలలామ-
తనతప్పు లెన్నెన్ని తలఁదన్నుచున్న నూహింపక యొరులతప్పే గణించుఁ
దనవృత్తి కొఱగాని దని విచారింపక యితరవృత్తిఁగుఱించి యేవగించు
దనధౌర్త్య మెంతైనఁదలఁపక పరులందుఁగలుగు ధౌర్త్యమునకుఁగలవరించుఁ

దనబుద్ధి లేమిలోఁగొననేరకత్యంత మత్యబుద్ధికొఱంత కపహసించుఁ
దనకుఁదోఁచెడురాముడు శ్మనుజుఁ డెందు,(శీలమెఱుఁగక)పెడనపురీలలామ-
భువి మగవాఁడయి పుట్టినందుకు ముందు తనకుఁ గల్గినకొలందిని గడించి
కలమాన్నమైన నాఁకలిదీఱఁ గలిమైన గంజియైనను మహోత్తరంర నొక్క
రికిఁ బెట్టి తాను గోరిక మీఱఁ గుడుచుట యదిగాక పౌరుష ముదరపోష
ణముమాత్ర మొకలక్షణమె గ్రుక్కికొక్కెర ముక్కునఁబరిగెలనొక్కి మెక్కి
తనకడుపుఁ బ్రోచికొనలేదె తనసుఖం బెఱింగినదికాదె పెడనపురీలలామ.
ధనికులైయుండి కొందఱు దురాశల నొక్క వేల్పుపై నెపపెట్టి చాల్పుగట్టి
యొక్కొక్కరిని బట్టి గ్రుక్కద్రిప్పక వట్టి మఱుమాటలాడఁ బల్గాఱు వేఁడి
విత్త మాదిమధనద్విగుణంబుగాఁ దెచ్చి కలదానిలోపలఁ గలిపికొందు
రది యిది కూడ ముందరుగునం చెఱుఁగరు క్రొత్తను బ్రాఁతనీ రెత్తిపోదె
తలబరువు చాలఁ గల్గిన తరువుమొదలు, నేలఁగూలదె పెడనపురీలలామ-
శాంభవీ శుంభనిశుంభవీరభటసంరంభవీతూలతారంభహేతి
యోగధీహృతదుష్ప్రయోగధీరవిహారి వాగధీశనుత శీతాగసూతి
ధారణీధరగదాధోరణీచంద్రమోధారిణీ భావుకాధారజాతి
వాహినీసుషమాప్రవాహినీ హర్యక్షవాహినీచం రాహివీతి
హోత్రనేత్రకళత్రపవిత్రసచ్చరిత్ర మాంపాహి పెడనపురీలలామ- ౬౧
ఆఁడుబిడ్డమగండు వేడుకతోఁ దాళగాఁడయి లయతాళగతులఁ దెల్ప
మద్దెలగాఁడయి మఱితోడఁబుట్టిన యతఁడు మృదంగవాద్యంబు నెఱప
మఱఁదలు కిశబ వ్యస్తహస్తాంబుజలై స్వరప్ర
మాణ మేర్పఱుప నెమ్మది ఱేఁడు తాండవం బాడ మాణిక్యసింహాసనమున
నెలమిఁ గూర్చున్న నీకెవి నెన్నఁదరమె, త్రిపురసుందరి పెడనపురీలలామ-
పుట్టిని ల్వాడలి తపోవనంబున నిష్టభవభక్తి నిష్ఠఁ దపంబొనర్చు
చున్నెడ జడదారి మిన్నయై వచ్చిన తెల్లడాల్వేల్పు గుట్టెల్ల బట్ట
బయలు గావించి సంభావించి యతని నిజస్వరూపంబు సర్వస్వతంత్ర
రాలవై కైకొని కైలాసశైలంబుఁ జేరి తయ్యారె నెచ్చెలులమొఱఁగి
కోరినమగండు దొరకిన కోమలాంగి, కేల పరచింత పెడనపురీలలామ-
సంతతం బాజవంజవసౌఖ్యమూలం బనంతజీవంజీవనయన లనుప
దార్థనిర్ణయము యథార్థంబుగా వట్టిజోగి సదానందయోగి పుట్టు

భోగిఁ గావించితే యోగనిష్ఠాగరిష్ఠత నెంత దృఢమైన పతిమనంబు
సతి హావభావచేష్టాలతావలి వలగొన్నంత సెకపొంత వెన్నగాదె
కానిచో మేని సగము నీలోనఁగలిపి, త్రిస్మరుటయెట్లు పెడనపురీలలామ-
దక్షుఁ డుగ్రాక్షనిందాపరుండయి చేయునధ్వరంబున కాదిమైన నీయు
దాసీనమున కాత్మ రోసి పద్మాసనాసీనవై సోలి నీచిత్త మీశ్వ
రార్పణ సేయుచో నఘుక్రర్మి తలవంప యాగదగ్ధ మొనర్చి యలరి తింతె
కాసి తండ్రని యల్పమానితే పతినింద కోర్తురె సుచరిత్ర లుర్వి నీప
తివ్రతామహిమంబు నుతింపఁ దరమె, కృతను(నిస్తోత్ర)పెడనపురీలలామ-
కనుఁగొన్న నీకు నే ననుఁగుభృత్యుఁడఁ గాని కలనైన నన్యుఁడఁగాను దలఁపఁ
గనికరఁబునఁ గావఁగా దిక్కు నీవని నమ్మియున్నాను నిజమ్ము సంశ
యమ్ము లేదమ్మ నేననేల నాగుణమ్మెఱుఁగవే నీవు నన్నేలమిఁ బ్రోవు
తనయుల గుఱుతెఱుంగని తల్లికలదె లోకముల నైకడనైనఁ గంటివే వి
శేషసర్వజ్ఞురాల వశేషధర్మ,మూల మాలించు పెడన పురీలలామ- ౯౯
శరణుసొచ్చిన నెంతశాత్రవునైన మున్గరుణింతు ననుపంత మరుగ నన్ను
శరణన్నవాని వంచనసేయ నగునె నీ చరణారవిందసంస్మరణ మనిశ
మఖిలదుర్భరరోగహరణము కళ్యాణకరణ మాభరణముగా రచించి
తీవి మద్రసనానటీవిలాసినికిఁ గల్పించి యాడించి పాడించి మెఱతు
నేమి లోపము లేదు తే దేలుమేలు, చాలుఁజాలును పెడనపురీలలామ-
తరుణేందురేఖావతంసంబు వికసితపుండరీకశిరోవిభూషణంబు
కీలాకరాళదృగ్గ్రస్తంబు లోహితకుంకుమాంకితతిలకాంకురంబు
విశదప్రభాపూరభసితాంగరాగంబు సురభిచందనగంధశోభితంబు
కాకోలకాంతిసంకలితలాంఛనము ప్రసిద్ధకస్తూరికాచిహ్నితంబు
నేకమూర్తి వహించిన నీశ్వరేశ్వ,రివి మొఱాలించు పెడనపురీలలామ-
పోషింపవలయు మత్పూర్వజన్మార్జితదురితసంహతి నంత దొలఁగఁద్రోచి
మన్నింపవలయు సన్మానించి పైవచ్చు నిరపవాదమునెల్ల నీరుచేసి
రక్షింపవలయు నుపేక్షసేయక దుర్విపక్షశిక్షణమున దీక్షఁబూని
పాలింపవలయు నాపాలిదైవంబవై విపదంబుధిఁ దరింప వెరవుఁ జూపి
శరణు వేఁడెదఁ గరుణించు చరణధూళి, పాళి పైఁ జేర్చి పెడనపురీలలామ-
మాతంగనందనీ మాయాజగన్మోహినీ సింహవాహినీ నిగమమార్గ
సంచారిణీ నిత్యసత్యస్వరూపిణీ వాగ్వాదినీ ప్రణవప్రధాన

కేళీవినోదినీ కాళీకళామాలినీ లసన్మోదినీ కాలనియమ
వేదినీ కలుషవిభేదినీ మధుసుధామోదినీ ప్రాలేయమేదినీధ
రాన్వయపయోధి భాగ్య పద్మాలయా శరీరధారిణి పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామివామభాగ, చంద్రశాలాసభాలంబ శ్యామలాంబ. ౭౦

ఓయమ్మ! నీవు రా రా యని పిల్వఁ దా నరుదెంచి మ్రోల సాష్టాంగదీర్ఘ
దండప్రణామంబు దగఁ జేయఁగా నేల నుదర ముబ్బునను లంబోదరుండు
కరచరణంబు లక్కడ మోపలేకున్కి యరసి దైవాత్మజుం డపహసించి
క్షయవృద్ధు లుభయపక్షముల నీదయఁ గాంచెఁ గానిచో నెట్టివారైన నేమి
సాధుసంతాపమునఁ గులక్షయముగాంతు, రేకదా ధాత్రిఁ బెడనపురీలలామ-

అఖిలజగంబు దైవాధీన మాదైవ మరయ మంత్రాధీన మనఁగ మంత్ర
దేవత వస్మదధీనవౌటరుదె మంత్రంబు సూత్రంబు సూత్రంబునందు
మనువర్ణ్యములమాల్యమణులు నాయకరత్నమీ వనిమంత్రార్థమెఱిఁగిసుమతి
జపియించు జపితనై తిపుఘ నందొలఁగిపోఁ గలవె యీతెల్వినీ నెలవుదేట
మరువు దెల్పితి నీమేలు మరువఁ జాలఁ, (జాల) బైలయ్యెఁ బెడనపురీలలామ-

మా మాయజిమ్ముగృపాయత్తచిత్తవై యేయపాయ
మేమెడ నను దాయనీక సహాయమ్ముఁ జేయకున్నఁత నన్యాయమొందు
వినఁబడదు గదమ్మ వేమేలనిఁక నిన్నుఁ బాయఁజాలఁ దొలంగఁద్రోయకవల
నాయమ్మెఱుంగ నుపాయమ్ముఁజూపి నా సేయువిన్నప మెల్లఁ జిత్తగించి
కాచి రక్షించి వర్ధిల్లు కల్పవల్లి, శ్రీలు వెదచల్లి పెడనపురీలలామరామ-

ఓదేవదేవి మహాదేవి నీదివ్యకరుణాకటాక్షవీక్షణము లొలయు
నందాఁకఁ గాక సంధ్యావిధు లన్న సన్నుతు లన్న నిరశనవ్రతము లన్న
జపము లన్నను దపశ్చర్య లన్నను మహాత్ములకనంతరమొందు కిలఁగలుంగు
తపనిధి దొరకునంతకుఁ గాదె ధూపదీపాంజనవివిధమాయాభియంత్ర
మంత్రతంత్రఖనిత్ర సామగ్రులెల్లఁ, గ్రియలుశోధింపఁ బెడనపురీలలామ-

నీకు మాఱిలలేని నీకుమారులలోని వానిఁగా నన్నుఁ బ్రోవంగవలదె
నీకరాసి దొలంగనీక రాసిగలంగ నాయతాతులపాలు సేయ వలదె
నీకథామహిమల నేకథామహిమాన్యులరర నాకెఱిఁగింపఁ దలఁప వలదె
నీకృపాలోకనానీకపాలనము దీనులయందు ముందుగాఁ దెలియవలదె
వలదు వలదు పరాకు నాపలుకు లవధరింప నవనిదె పెడనపురీలలామ-

చెల్లుఁబో నీ వేమి సేయనూహించిన వలదనువార లెవ్వార లెవ్వ
రిని నైన నీళ్ళ ముంచినఁ బాల ముంచిన నీవకా(కొరు లేరి) నీయుదార
మాయావిమోహితాత్మకులయిపలు వే... మకలుషత్వము గాంచుటంతె కాని
భవదాజ్ఞ లేని దే ప గేవణ
బాఱనేర్చునె వలఁబడ్డ పక్షిజాతి, శ్లోకలల్లార్పఁ బెడనపురీలలామ, రామ.
ఉండుండి తా నొండు రెండుఁ బండ్రెండంచు నాకన్ను లెన్నుచున్నాఁడు చూడు
మెడ లేదు నాముక్కు పాడు గుమూ రెఁడు బారెఁడనిముసుగొల్చి నాఁడడిగి చూడు
మదిగాదు నామోము లాఱంచుఁ బల్మాఱు వెక్కిరించుచు నాడు విధముఁ జూడు
వెక్కిరించుట కేమి నిక్కమా డెద ముందు నులిపె నా చెవి జోడు దెలిసి చూడు
మనెడి తనయులఁ గని ముద్దుగొని యెద వల, రినమదంబవు పెడనపురీలలామ-
నను బరిపంథిమండలమధ్యవర్తినిఁ జేసితే నీపాదసేవకుని మ
నోదృఢశక్తిఁ గన్గొనవచ్చు నాకడ శత్రుసంహారైక సాధనంబు
గలదు భవత్కటాక్షంబను సితమండలాగ్రంబు దానిసహాయ మూని
నిమిషమాత్రంబున నిర్జింతుఁ జుట్టుముట్టిన రిపుకోటి నెల్లను జలింప
నాత్మ నేమియు సర్వమాయామహేంద్ర, జాలనాశని పెడనపురీలలామ-
స్వప్నదశలయందు సహితంబు నీపాద సేవ యేమఱ భక్తి సేయుచుండు
బాల్య చేష్టలనైనఁ బలు తెఱంగులఁ బోక వేడుక నినుఁ గొనియాడుచుండు
జాగ్రదవస్థల సతతంబు నీకథాసల్లాపముల గోష్ఠి సల్పుచుండు
నేకాల మెలమితో నీకటాక్షంబె నాకారవంచు మదిలోన మురియుచుండుఁ
గాని యొక్కప్పుడితరమార్గంబెఱుంగఁ, దృణముమాత్రంబు పెడనపురీలలామ-
హీరతాటంకద్వయీకృత ప్రద్యోతనద్విజరాజ లనిరంత
రవశీకృత ప్రభుకర్ణకుండల కరు ఖండలభరి
తసమస్తభువనజాతభవాండభాండపిచండిలచండిలసన్మహార
జతమయాభరణవిద్యుతిమిశ్రహారిద్రవిశ్రుతస్థండిలవిశ్వవిభవ
సాంద్రసౌభాగ్యమండలేశ్వరి యనశ్వ, రీమహేశ్వరి పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామివామభాగ, చంద్రశాలాసభాలంబశ్యామలాంబ. ౮౦
నరకుంజరులకెల్ల 'నాస్తి తత్త్వం గురోః పర' మను నీతి సర్వంబు గురుఁడు
గురుఁడు చరుండు నీశ్వరుఁ డన్న నీపతి కన్న వేఱొక్క పేరెన్న లేదు
తత్పరంధామసంధాతకాద్యంతరహితున కెల్లాల వాశ్రితుల నేలు

జీఁకటి రాజశేఖరుని చీఁకటితోడన కూడి పాయఁగా
నాకడ యక్షు లాతనికి నప్పురమార్గముఁ జెప్పి యంపఁగన్. ౮౦

ఉ. భాస్కరుఁ డంతలో నుదయపర్వత మెక్కఁగ భూవిభుండు శ్రే
యస్కరి యైనలక్ష్మిక్రియ యంగన తోడుగ నేగి కానలోఁ
దస్కరమార్గము ల్గడచి దవ్వులఁ *గాంచెఁ దటాంతకీలితా
హస్కరరత్నజాలవలయం బగుయక్షవిహారదుర్గమున్. ౮౧

ఉ. ఆనగరంబుచేరువ వనాంతముఁ జొచ్చి సరోవరంబులో
స్నానము చేసి భాస్కరుని సారజపంబునఁ గొల్చుచుండఁగా
మానవు లెల్ల నెవ్వనికి మద్రపురాధిపతిత్వ మిత్తు మం
చూనినచర్చ నున్నయెడ నొయ్యన యక్షులు బుద్ధి గొల్పినన్. ౮౨

క. మదకరిణిచేతి కొక చ, క్కఁదనపు వనమాల† యిచ్చి కదలించినచో
నది యెవ్వనిమెడ నిడియెను, విదితంబుగ నతఁడె మనకు విభుఁడౌననుచున్.

క. అందఱు నొక మదహస్తిని, నందముగ నలంకరించి హస్తాగ్రమునం
జెందొవలదండ యిడి వెం, డ్రం‡ దూర్యధ్వనులు చెలఁగఁ గదలించినచోన్.

క. జంభారి నెదురుకొనఁ జను, కుంభీంద్రునితోడి పిడియొకో యిది యనఁగాఁ
గుంభిని పురి వెల్వడి యా, కుంభినిపతియఖుత దండ కొమరుగ వైచెన్.

వ. ఇట్లేనుఁగు పువ్వులదండ మెడ వైచిన. ౮౬

ఉ. అద్రవిశేషుఁ డాత్మసతి యప్పురలక్ష్మియుఁ బోలె మున్నుగా
భద్రగజంబు నెక్కి కవిపారకగాయకకీరసీయుఁ డై
మద్రపురంబు సొచ్చెఁ దను మంత్రులు గొల్వ మహాసనస్థుఁడై
రుద్రసఖుండు వోలె నతిరూఢికి నెక్కె నుదారసంపదన్. ౮౭

మ. రమణీచందనగీతవాద్యకుసుమస్రగ్వస్త్రభూషాదిభో
గములం గోరికి మీఱఁబోవ నతిసౌఖ్యం బందుచు న్మంత్రివ
ర్గము కార్యంబులు దీర్పఁ బౌరు లనురాగం బంది నందింప రా
జ్యము సేయంగ సహింపలేక బలిమి న్సామంతభూమీపతుల్. ౮౮

ఉ. ఎక్కడివాఁడొ వీఁడు మన మిందఱ ముండఁగఁ దేరకాఁడు దా
నిక్కడఁ జేరి మద్రపుర మేలెడి వీనికి రాజ్య మిం కిటం

* గాంచెను రత్నకారితా,హస్కరరత్నరాజినిలయంబగు- † చక్కదమగువనమాల-‡ వెను
కం దూర్యధ్వనులు.

దక్కిన హాని యగా నని కడంగి తదుద్ధరణాభిలాషులై
యొక్కెడ దండు గూడుకొని యుక్కునఁ గోటకుఁ జుట్టుముట్టినన్. ౮౯

గీ. అపుడు సంధిమాట లైన నాడింపక, దొరల నైనఁ బోరి కరుగుఁ డనక
ధరణివల్లభుండు తానైనఁ గదలక, యతివతోడ నెత్త మాడుచుండె. ౯౦

వ. అయ్యవసరంబున మంత్రులును దొరలును బరివారంబును వైరు లెత్తి వచ్చి
కోటమీఁద విడిసినప్పుడు నీ వూరకుసికె రాజధర్మం బగునె మాకునైన సెల
వాన తిమ్మనిన విని యు వినవిభంగి నున్నఁ దత్కాంతారత్నంబు పాచికలుచే
తంబట్టుకొని. ౯౧

గీ. తఱిమి సామదానదండభేదములలో, నొకట నైన వైర ముడుపవలయుఁ
బగతురెల్లఁ గూడి *పై నెత్తివచ్చిన, నెత్త మాడుచుండ నీతి యగునె.

క. అనవుడు జనవల్లభుఁ డిది, మనచేఁతల నౌనె †దైవమాయాగత మై
చననున్నవి చను నెచటను, మననున్నవి మను జలాగ్నిమధ్యములందున్.

క. వృక్షముననున్న యేగురు, యక్షులు మనరాజ్యమొసఁగ హరయింపఁగ న
ధ్యక్షులు మన కిది పనియే, యక్షంబులు వైవు చాలు నాడుద మబలా.

వ. అని యనంతరంబ తత్తృతస్మరణంబుగాఁ బలికిన మనంబున నెఱింగికొని
యయ్యక్షు లక్షణంబ మన మిచ్చిన రాజ్యంబున కుపద్రవంబు పుట్టుచున్న
యది యొక యుపాయంబు తక్కిఁపవలయు నని వచ్చి యాకూడిన రాజుల
లోఁ బరస్పరవైరంబును మనోవైకల్యంబును బుట్టించిన నాదండు రెండ
ట్టలై. ౯౨

మ. తమలోఁ బోరుచు నస్త్రఘట్టన సముద్యద్భూరివహ్నిస్ఫులిం
గము లాశాంతములం బిశంగములుగాఁ గావింపఁగా బాహువి
క్రమముల్ చూపి గజాదిసైన్యములు మగ్గం దోం మై రక్తపూ
రము కెందూళి నణంపఁగాఁ గడఁగి రారాజన్యు లాజి న్వడిన్. ౯౩

ఉ. అక్కలహంబు చూచి చని యానృపశేఖరుఁ డాజిభూమిలోఁ
జిక్కిన యశ్వరత్నములు సింధురబృందములు న్రథంబులుం
బెక్కుధనంబు లస్త్రములు భేరులు జోళ్ళును గోటలోనికిం
గ్రక్కునఁ గొంచు నేగి యధికం బగుసంపద నేలె నప్పురిన్. ౯౪

*వైవచ్చి విడిసిన, యపుడు నెత్తమాడ నర్హమగునె †దైవగత మేగతియో, ననున్నవి
వేగమ చను.

వ. అనిన విని యయ్యవధూతకుం డిది భాగ్యం బంటి వేని పూర్వకృతసుకృతవిశేషంబున నిది లభించెం గాక కానినాఁ డిట్లు గా నేర్చునే తొల్లి నేఁడునుం జేయవేని నింతియ కాదు యక్షసహాయంబు గలిగియు నుద్యోగి యయ్యరణ్యంబు గడచి మద్రపురంబుఁ జేరిన కతంబున రాజ్యంబు గలిగెం గావున దైవంబున కుద్యోగంబు ఫలసాధకం బగు నదికారణంబుగ నీవును రాజ్యంబేమఱక పాలింపు పొమ్మని వీడ్కొలుపుచు. ౯౮

క. నీమహిమకుఁ గడు నెలవగు, భూమీశ్వర భూమి నిది యపూర్వం బనుచుం
గామితఫలదాయక మై, లేమి యుడుపు చంద్రకాంతలింగము నిచ్చెన్.

క. ఇచ్చినఁ గైకొని పురికి, న్వచ్చు నెడ న్విప్రుఁ డొకఁడు వదనము వాడ
న్వెచ్చని యూర్పుల నాఁకట, వెచ్చుచుఁ జనుదెంచి మనుజవిభు దీవించెన్.

గీ. మూఁడు దినము లయ్యె వేఁడంగ నెచ్చట, గమికెఁ డన్న మైనఁ గలుగదయ్యె
గ్రాసమాత్ర మేమి గలిగిన నాకిచ్చి, నన్నుఁ గరుణఁ బ్రోవు మన్నఁ జూచి.

క. ఇక్కడ నన్నము దొరకదు, దిక్కితనికి నెద్ది పసిఁడి దినరా దిఁక నీ
యక్కఱకు నడ్డ మగు నని, లెక్కింపక చేతి సిద్ధలింగము నిచ్చెన్. ౧౦౨

వ. ఇచ్చిన. ౧౦౩

శా. ఆవిప్రుండు మణిప్రభావమున దివ్యాకారుఁడై క్షుత్పిపా
సావైకల్యము లెల్లఁ బాసి చనియెన్ క్ష్మాపాలు దీవించుచున్
దేవేంద్రప్రతిమానుఁ డౌనతఁడు నాదేశాంతరవ్యాప్తి నా
కీవెంటన్ హిత మయ్యె నంచుఁ గళతో నేతెంచె నుజ్జేనికిన్. ౧౦౪

గీ. నీకు నట్టిగుణము లేక యీగద్దియ, నెక్కరాదు చలము దక్క మనిన
నచ్చెరువుఁ బ్రియంబు నొచ్చెముఁ బెనఁగొనఁ, దిరిగి భోజుఁ డంతిపురము సొచ్చె.

వ. అంతటఁ గొన్ని దినంబు లరిగిన. ౧౦౬

— పదునైదవకథ. —

క. కమలారిఁ గమలహిత దృ, క్కమలుని గమలాంక నాభికమలాకరునిం
గమలాంకరమణిరమణుం, గమలాసనహృదయకమలకమలప్రియునిన్.

క. మదిఁ దలఁచుచు భోజుం డొక, సుదినంబున నెక్కఁ గోరుచుం జనుదేరన్
మొదలనె వారించుచు నా, పదియేనవబొమ్మ యిట్లు పలికెం బెలుచన్.

క. మర్యాద యెఱుఁగ విది తగు, కార్యమె యీవిక్రమార్క కరణిని నీకున్
ధైర్యము సాహసమును నౌ, దార్యమ్మును లేక యెక్కఁ దగవే దీనిన్.

వ. అనవుడు నతని సాహసాదికోదారభావంబు లెట్టి వనిన నప్పాంచాలిక సప్రపంచంబుగా నిట్లని చెప్పం దొడంగె. ౧౧౦

ఉ. ఏమనిచెప్పఁ దక్షిణ నరేశ్వరు లెవ్వరుఁ గారు గాని నేఁ
డీమహి విక్రమార్క విభు నీడున కాదు రమోఘబాణ సం
గ్రామమున న్రతి న్విమతఖండన మై బలిమి న్మఖప్రభ
రాముఁడుఁ గాముఁడుం బరశురాముఁడు భీముఁడు సోముఁడుంగదా. ౧౧౧

గీ. అట్టి మనుజవిభుఁడు భట్టి ప్రధానిగా, నయ్యవంతి నేలు నాదినములఁ
గలఁడు వేదవేది ఘనుఁడు ధర్మజ్ఞుఁడు, సుశ్రుతుండు నాఁగ నాశ్రితుండు.

ఉ. సుశ్రుతుఁ డెల్లతీర్థములుఁ జూచెద నంచు దృఢవ్రతస్థుఁడై
యాశ్రితకల్పవృక్ష మగు నాపతిపంపున నేగి ధర్మన
న్మిశ్రముగా సుదేశములు ముట్టుచుఁ బుణ్యముఁ గూడఁబెట్టుచు
న్విశ్రుత మైనతన్మహిమ వించు వెసం జనియెం బ్రయాగకున్. ౧౧౩

మ. తరఁగ ల్చేతులు పక్షిజాతములకూఁత ల్కింకణక్వాణముల్
*నురువు ల్తెల్లని చామరంబు లన నన్యోన్యంబు నుప్పొంగుచు
న్సరి గంగాయమునల్ తగం గొలువఁగా ఛాయావటచ్ఛత్రసం
స్ఫురణం జెల్వగు తీర్థరాజ మచటం జొచ్చెం బ్రశంసించుచున్. ౧౧౪

క. నీలము ముత్యముఁ గూర్చిన, పోలిక హరిహరులు గూడుపొందున నొకచోఁ
గ్రాలెడి గంగాయమునల, నోలాడె నినుండు మకరయుతుఁ డౌవేళన్. ౧౧౫

మత్తకోకిల. అందు భక్తులు ముక్తిత్రోవకు నందుకోలగు నందమా
బిందుమాధవదేవునిం గని ప్రీతిఁ గొల్చి వినీతుఁడై
యిందుశేఖరు విశ్వనాథు ననేకభంగులఁ గొల్చునా
పొందుచేకుఱ నేగె విప్రుఁడు పుణ్యరాశికిఁ గాశికిన్. ౧౧౬

వ. అచ్చటంగదలి యట్లేగి యక్షభైరవేశ్వరంబును, భూతభైరవేశ్వరంబును, గాలభైరవేశ్వరంబును, గపాలేశ్వరంబును, బాతాళభైరవేశ్వరంబును, మతంగేశ్వరంబును, జంబుకేశ్వరంబును, మణికర్ణికేశ్వరంబును, సాంబాదిత్యంబును, గరుడాదిత్యంబును, లోలార్కంబును, బిందుమాధవంబును మున్నుగాఁగల బహుకోటితీర్థంబులచేత నలంకృతంబైన పంచక్రోశంబుఁ బ్రవేశించుచుఁ దద్గుణప్రశంసోన్ముఖుండై. ౧౧౭

*అరుదౌఫేనము వెల్లచామరలనన్.

క. శివుఁ డిందుఁ బద్ధవానికిఁ, జెవి మంత్రముఁ జెప్పఁ బూని శిర మటు వంపన్
శివముపయిఁ బడినసురనది, శివపదరాజ్యోచితాభిషేకము సుమ్మీ. ౧౧౯

క. ఉకు నైనఁ దొండ నైనను, గజఁ జైనను దుప్పి యైనఁ గడువెస వీటం
బడునప్పుడె పురుషుండును, బడఁతియు నగుహూపు వడసి పడనేరద తే.

వ. అని కొనియాడుచు. ౧౨౦

శా. ప్రాలేయాచలచందనద్రవసుధాప్రాచుర్యవీచీలస
త్తైలీడోల విశాలశీలసుమనఃస్త్రీజాలఫాలస్థలా
వ్యాలోలాలకమాలికానుకలనావ్యాలంబరోలంబలీ
లాలోలాంబుజచిహ్నితం గనియె మధ్యాహ్నంబునన్ జాహ్నవిన్. ౧౨౧

వ. కని యందు నిమజ్జనం బొనర్చి భస్మత్రిపుండ్రాదిశైవలక్షణలక్షితుండై సకల
దైవతారాధ్యు విశ్వేశ్వరశ్రీమన్మహాదేవుని సందర్శించి సాష్టాంగదండప్ర
ణామంబు లాచరించి నిటలతటకరకమలపుటుండై నుతియించుచు. ౧౨౨

శా. వింటి న్సర్వపురాణము ల్గివిజు లేవెంట న్నినుం బోలలే
రంటం దీర్థవిలోకనా జపతపోయజ్ఞాదిపుణ్యంబు లొం
డొంటి న్మీఱఁగ భాగ్యవైభవము నేఁ డుప్పొంగ ముక్కంటి ని
న్గంటిన్ జన్మఫలంబు గంటి నిచటం గాశీశ విశ్వేశ్వరా. ౧౨౩

మ. నినుఁ జూడం జనుదెంచు నప్పట నెద న్నెక్కొన్న మార్గశ్రమం
బున విచ్ఛాయములైన భక్తులపదాంభోజంబు లత్యంత న
మ్రనిలింపావళిమౌళిరత్నములచే రక్తాతిరక్తప్రభం
గనుపట్టున్ శివరాజ్యపట్ట మగుచుం గాశీపురాధీశ్వరా. ౧౨౪

వ. అని కొనియాడి కృతకృత్యుండై యందు మానసత్రయంబు గడపి పదంపడి
ఫల్గునవర్ధనంబును, జిహ్వాలోలంబును, దక్షిణమానసంబును, నుత్తరమా
నసంబును, బ్రహ్మసరోవరంబును మున్నుగాఁ గల స్థలంబులఁ బితృపిండ
ప్రదాన తర్పణపరుండై, పితృముక్తికారణంబు లగు నీశానవిష్ణుకమలాసనకార్తి
కేయవహ్నిత్రయార్కరజనీశగణేశ్వరాది దేవతాచతుర్దశపాదంబులను, నక్ష
యవటచ్ఛాయయు, జనార్దనహస్తంబును, మొదలగుస్థలంబులఁ గల్పితపితృ
తర్పణుండై గదాధరునకుం బ్రణమిల్లి, యంగళగారికి మ్రొక్కి మగిడివచ్చుచో
నొక మహావనంబున. ౧౨౫

సీ. కన్యకాధీన మై ఘనవైభవంబుతో మణిమయప్రాకారమహిమ గలిగి
పురుషవర్జిత మైన పురము గనుంగొని యట నొక్క దేవాలయంబుఁ జేరి
దానిచేరువ నున్న నూనెకొప్పెర ప్రాంత విపులమౌ కనకమండపము క్రింద
మోహనం బైన వివాహవేదికమీఁది *రత్నపట్టికలోని వ్రాఁత చూచి
నరుఁడు తైలకటాహంబు నడుమఁ బడిన, నెఱయఁ గందర్పసంజీవినీసమాఖ్య
నమరుకన్యయు రాజ్యంబు నతనిసొమ్ము, లనుచు నేర్పడియున్న పద్యంబు చదివి.
వ. దానికి విస్మయభయసంశయాన్వితుం డై. ౧౨౮
క. ఈయుడుకునూనె దగ్గఱఁ, బోయినఁ దాఁ జచ్చుఁ జచ్చెఁబో యీవిభవం
బేయనుభవమున కగు నని, డాయక మది నులుకు మిక్కుటం బై మగిడెన్.
క. ఉజ్జయిని కరుగుదెంచి సు, హృజ్జనములఁ గూడి వారలెల్ల బ్రీతిం
బజ్జం జనుదేరం జని, యుజ్జనవల్లభుని నుతుల నభినందించెన్. ౧౨౯
క. ఆవిక్రమార్కుఁ డతిసం, భావనమెయిఁ గుశల మడిగి పరభూముల నీ
వేవెంటఁ దిరిగి చోద్యము, లేవేఁ జూచితివొ చెప్పు మేర్పడ నన్నన్.
సీ. ధరణీశ యెల్లతీర్థంబులు చూచుచు వెలసిన క్షేత్రములకు నేగి
మగిడి యేతెంచుచో మాణిక్యమయ మైనపురములో గుడియొద్దఁ బొంగి క్రాఁగు
నూనెకొప్పెరఁ గంటి నానూనెలోపలఁ బడ్డవారికి నట్టిపట్టణంబు
నందులకన్యయు నగపడు నని యున్న పద్యంబుఁ జూచితిఁ జోద్య మదియు
ననిన సాహసాంకుఁ డచ్చెరువందుచు, నాపురంబు చూత మనుచుఁ గదలి
చనియె నతనిఁ గూడి శస్త్రసహాయుఁ డై, దుర్గమంబు లైనమార్గములను.
వ. చని చని యచట దేదీప్యమానం బైనపురంబు సొచ్చి తద్వైభవంబు వర్ణిం
చుచు ముందఱ నతి సుందరం బైన పందిరిక్రింద సువర్ణమయ జలపూర్ణక
లశంబులను మృగనాభిలేపనంబులను ముక్తాఫలరంగవల్లికలను, గనకరం
భాస్తంభంబులను, రత్నతోరణంబులను నలంకృతం బైన వివాహవేదిపై పల
కలోని పద్యంబు చూచి సముత్సుకుం డై. ౧౩౨
క. చేరువగుండములోపలఁ, గోరికతో జలకమాడి గుడిలో లక్ష్మీ
నారాయణులం గాంచియు, ఘోరం బగు నుడుకునూనెకొప్పెరఁ జేరెన్.
వ. ఇట్లు చేరి. ౧౩౪

* పసిండి ఘంటికలోని.

క. సలసలఁ గ్రాఁగెడు తైలము, కొలఁది మెఱుఁగఁ దలఁచు భంగి గుణరత్నసము
జ్జ్వలుఁడు గుబేలున నుఱికెను, జలనిధిలో నసమించు జలజాప్తు క్రియన్.
వ. అంత సంధ్యాంగనయుం బోలె హరిచందనారుణపయోధరభారయు నార
క్తాంబరయు వికసదిందీవరాక్షియు రాగవతియు నైనకందర్పసంజీవనీ నాగ
కన్య చనుదెంచి నిజవిద్యాప్రభావంబున నారాజుం బునరుజ్జీవితుం జేసిన.
గీ. జలజకాంతి మెఱయ జలధివెల్వడి తూర్పుఁ, గొండ యెక్కునట్టి యెండతేని
చొప్పు దోఁప నూనెకొప్పెర వెల్వడి, నిలిచె విప్రుమోము తెలివికెక్క.
ఉ. ఆతనిఁ జూచి కన్య వినయంబున మ్రొక్కి యమేయసాహస
ఖ్యాతచరిత్ర నాదువ్రతకల్పత నేఁడు ఫలించె నే నిఁక
న్నీతగుదాసి నైతిఁ గరుణింపుము రాజ్య మనుగ్రహింపు సం
ప్రీతి యొనర్చుదానఁ దగురీతి ననుం బని వంపు మిత్తఱిన్. ౧౩౮
ఉ. నావుడు దాసివేని విను నావచనం బిఁకఁ ద్రోపుసేయ కీ
దేవసమానునిన్ ధరణిదేవుని శుశ్రుతు నాశ్రయింపు త
ద్భావము పల్లవింప నని పార్థివుఁ డానతి యిచ్చె నంత ల
జ్జావనతాస్య యాచు నెదురాడక లేమ వరించె విప్రునిన్. ౧౩౯
మ. ధరణీనాయకుఁ డిట్లు చేకుఱిన కాంతారత్నమున్ రాజ్యమున్
ధరణీదేవున కిచ్చి నిల్పి తనయత్నం బీగతిన్ ధర్మసం
చరణాసక్తి ఫలించె నంచు మదిలో సంతోష ముప్పొంగఁగా
నరుదెంచె న్నిజదాసధర్మగుణాగణ్యుం డైన యుజ్జైనికిన్. ౧౪౦
క. విను మదికారణముగ నో, జననాయక యొక్కఁ దగదు చను మనవుఁడు నె
మ్మనమున నచ్చెరు వందుచు, మనుజేంద్రుఁడుసదనమునకుమగుడంజనియెన్.
శా. ఉష్ణాంశుద్విజరాజలోచను నపాయోపేతతావచ్ఛిదా
విష్ణాతస్థిరతత్త్వబోధమయమహానిస్వాంతపంకేజవ
ర్తిష్ణుఁ న్వివిష్ణు నగణ్యపుణ్యధనవర్ధిష్ణు న్గదాధృష్ణు భ్రా
జిష్ణు న్నంతితకృష్ణకాంతిచయరోచిష్ణుం దమోజిష్ణునిన్. ౧౪౧
ఉ. నిర్జరసిద్ధసాధ్యభజనీయపదాంబుజయుగ్ముఁ దిగ్వపా
డార్జునరశ్మిమారుతహితాత్ముని రక్షితయక్షరక్షకున్
గర్జితభాసురప్రళయకాలసమంచితపంచవక్త్రు న
తూర్జితతర్జనాచరణదుర్జయు దుర్జనుదూరు ధూర్జటిన్. ౧౪౨

మాలిని. ప్రవిమలతరచిత్తా బ్రహ్మసంస్తుత్యవృత్తా
భువనభరితకీర్తి పుణ్యలావణ్యమూర్తీ
దివిజభరణలోలా దీనరక్షానుకూలా
భవమురరిపురూపా భాగ్యభోగ్యస్వరూపా. ౧౭౮

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలీకభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళకళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్రమహారాష్ట్రభూపాలరూపనూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాంటిపృథివీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి పెన్నయామాత్యపౌత్ర హారితసగోత్ర పవిత్రసకలసుకవిమిత్ర కసువరాజతనూజ గోపరాజప్రణీతంబైన సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు విక్రమార్కునిధైర్యసాహసౌదార్యప్రశంస యన్నది షష్ఠాశ్వాసము.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## సప్తమాశ్వాసము.

క. శ్రీసంపన్నకుబేర, ప్రాసాదోపవనపవనపానస్ఫురదు
ల్లాసఫణీంద్రఫణామణి, భాసురనిజమూర్తిఁ బరమపావనకీర్తిన్. ౧

క. మదిలోపలఁ దలఁచుచు న,భ్యుదయం బగువట్టిలగ్నమున గద్దియపైఁ
బదమిడు నెడ వారించుచుఁ, బదియాఱవబొమ్మ భోజపతి కిట్లనియెన్. ౨

—॥ పదాఱవబొమ్మ చెప్పినకథ ॥—

క. అతిశయముగ నుజ్జయినీ, క్షితిపతిక్రియ దానగుణము సిద్ధింపక సం
గతిమాలిన చేఁతల సుర, పతిసింహాసనముమీఁదఁ బదమిడఁ దరమే. ౩

వ. నావుడు నతనియతిశయగుణజాలం బెట్టి దనిన. ౪

మ. వినుమీ భోజధరాతలేంద్ర త్రిజగద్విఖ్యాతకీర్తిప్రియుం
డనుకూలక్షితిపాలరక్షణకళాయత్తప్రభావుండు స
జ్జనచిత్తాంబుజమిత్రుఁ డిష్టవనితాసంభోగపంచాయుధుం
డనఘుం డుజ్జయినీవిభుండు నిజరాజ్యం బింపుతో నేలఁగన్. ౫

శా. ఆరాజన్యశిరోమణిం గొలువ నెయ్యం బొప్పఁగా నింపు పెం
పారం దక్షిణభూమిపాలురు మహాయత్నంబుతో రత్నము
ల్నారీరత్నములుం దురంగములును న్నాగంబులు న్మున్నుగాఁ
జేర న్వచ్చి వనంబులో విడిసి రాసీమావిభాగంబులన్. ౬

ఉ. ఇఁతులమానభంగము మహీరుహపంక్తులదర్పమూల మ
త్యంతమహోత్సవంబుల విహారము జాణలభోగభాగ్య మా
కంతుని ప్రాపు కోకిలశుకంబుల వాచవిపంట నాఁ బ్రజల్
సంతసమంద నఁతట వసంతము వచ్చె వనాంతభూమికిన్. ౭

మ. మొదలన్ దక్షిణమారుతంబు వనభూమి లోఁకుచు న్వ్రేఁక ను
న్మదపంచాయుధవహ్నిచిహ్న మగు ధూమంబో యన న్వ్రేవఁగాఁ
దుద లొక్కించుక యెండఁ గందు వెడలం ద్రోచెం గడల్ స్రుక్కఁగాఁ
బద నింకెన్ బిరు సయ్యెఁ బండెఁ బడియెం బర్ణంబు లుర్వీస్థలిన్. ౮

క. కాకులలోఁ గోకిలములు, కాకులఁ బడలేక కులము గలయఁగఁ బవనుం
డాకులపా టొనరింపఁగ, నాకులపా టయ్యె విరహు లగులోకులకున్. ౯

క. శీలము వదలనిపథికుల, తాలిమిఁదూలించు మారుతము వెల్లున నా
భీలం బగుమదనాగ్ని, జ్వాలలక్రియ బాలపల్లవము లొప్పారెన్. ౧౦

శా. ఏచెం గ్రొన్నన మాధవీలతలపై సంపెక్కి సంపెంగలుం
బూచె న్మావులుఁ బొన్నలుం బొగడలుం బొల్పొందె రాచిల్కలు
న్వాచాలత్వము సూపెఁ బుప్పొడి దిశ ల్వ్యాపింప సొంపారఁగా
వీచెం గమ్మనితెమ్మెర ల్మరునకు న్వేచోపులై ప్రాపులై. ౧౧

శా. కాయం జొచ్చె రసాలము ల్విరహు లాకంపింపఁగాఁ గోయిల
ల్గాయం జొచ్చె మనోజదిగ్విజయ మాఘోషించుచుం దుమ్మెదల్
మ్రోయంజొచ్చె నవీనపుష్పశరము ల్మొత్తంబుగాఁ జిత్తజుం
డేయంజొచ్చె సతు ల్మదిం గలఁగఁగా నెచ్చోటులం దానయై. ౧౨

సీ. గంధబంధురుఁ డైన గంధవాహుండు మున్నేర్చినపట్టపుటేనుఁ* గనఁగఁ
బచ్చపక్కెరలట్లు పక్షంబు లొప్పారు వరకీరములు వారువము లనంగఁ
బదహతిఁ బుప్పొళ్లు పర్వఁగా నేతెంచునలులమూఁకలు కాలిబలములనఁగఁ
బంచమస్వరములఁ బరిణమింపఁగఁజేయు పికములు కీర్తిగాయకు లనంగ
నేచియున్న మావు లెల్ల గొల్లైన లన, లలిత మైనరాజ్యలక్ష్మి మెఱసి
యితరనృపులభంగి బుతుచక్రవర్తియు, నతనిఁ గొల్వవచ్చి యచట విడిసె.

క. ఆవృత్తాంతము దెలియం,గా విని సచివేంద్రుఁ డచట గందర్పసఖున్
భూవరులను సత్క్రియ సం,భావింపఁ దలంచి సార్వభౌమున కనియెన్. ౧౪

గీ. ధరణిపాలురెల్ల ధరణీశ మిముఁ గొల్వ, వచ్చియున్నవారు వనములోన
గౌరవంబు మెఱసి వారల కవసరం, బిచ్చి కరుణఁ జూడ నిచ్చగింపు. ౧౫

క. ఇంతియకాదు నరేశ్వర,యింతులతోలు వేఁట†బుతువు లేలెడుఘనుఁ డా
కంతుని ప్రాణసఖుండు వ,సంతుం డున్నాఁడు కొలువఁ జనఁగావలయున్.

క. "కాలో వసంత" యనువా,క్యాలంకృతి నన్నిబుతువులం దధికుఁడు త
త్కాలోచితపూజలచేఁ, గాలాత్మకుఁ డైనవిభుఁడు కడుఁ బ్రియ మందున్.

గీ. పూజ్యులైనవారిఁ బూజింపకున్నచోఁ, మేలు దొలఁగునండ్రు మేదినీశ
యష్టసిద్ధు లాది నగపడ్డ వనక నేఁ, డవ్వసంతపూజ కదుగవలయు. ౧౮

*పట్టపు నేనుఁగు. †తోలుసెట, తలవెంట్రు.

క. అనవుడు నాఁగా కనినం, జని యుపవనమధ్యమున వసంతోత్సవశో
లనమునకుఁ దగినవస్తువు,లొనఁగూర్చియున్నాత్యచంద్రుఁడాయ్యానమగిడెన్.

వ. ఇట్లు మగిడి. ౨౦

ఉ. పంచశరాధిదేవతలపట్టులుగా మణివేదిపంక్తి ని
ర్మించితి రత్నమండపము మించులబట్టల మేలుకట్లు గ
ట్టించితిఁ గాంతి దిక్కుల నటింపఁగఁ గాంచనతోరణంబు లె
త్తించితి విన్నవింప నరుదెంచితి రాఁ గరుణించు భూవరా. ౨౧

సీ. అని విన్నవించిన జనవల్లభుండును జతురంగబలములు సరస నడువ
భేరులు శంఖము ల్పెన్గగారులు మ్రోయ దిక్కుల నినదంబు పిక్కటిలఁగఁ
గవిరాజగాయక స్తవములు నిగుడంగ శూరులు ధీరులుఁ జేరికొల్వ
నమ్మహోత్సవమున కాభరణంబుతో నంగనారత్నంబు లరుగుదేరఁ
బ్రజలకెల్లను గన్నులపండుగాఁచు
వాయువేగ మనుత్తమాశ్వంబు నెక్కి
గతులఁ ద్రొక్కించి మెఱయుచు గవనివెడలి
యరిగె నుద్యానవనములో నవనివిభుఁడు. ౨౨

ఉ. అప్పుడు చేరవచ్చి సమయం బిది దర్శనయోగ్యమంచు న
వ్వొప్పెడుకాంతలుం దురగయానను రత్నచయంబు ముద్దుగాఁ
గప్పము లెల్లఁ దెచ్చి మది గప్పెడుభీతి దొలంగ నమ్రులై
యొప్పన చేసి రాన్నృపతు లుజ్జయినీపతికిం గ్రమంబునన్. ౨౩

సీ. అంగాధిపతి వీఁడె వంగాధిపతి వాఁడె నేపాళపతి వాఁడె భూపతిలక
కర్ణాటపతి వీఁడె కాంభోజపతి వాఁడె సౌవీరపతి వాఁడె సార్వభౌమ
గూర్జరపతి వీఁడె కొంకణపతి వాఁడె కుంతలపతివాఁడె కంతురూప
బర్బరపతి వీఁడె పాంచాలపతి వాఁడె మత్స్యాధిపతి వాఁడె మానవేంద్ర
యనుచు వేఱువేఱ నందఱు నెఱిఁగించి, యధిపుచేతఁ గుశల మడుగఁజేసి
పీడియముల గారవింపించె నీతిస్వ,తంత్రబుద్ధి యైన మంత్రివరుఁడు. ౨౪

క. అజ్జనపతు లందఱుఁ దన, పజ్జం జనుదేర మండపములోనికి వి
ద్వజ్జనచింతామణి యగు, నుజ్జయినీధరణిపాలుఁ డొయ్యనఁ జనియెన్.

ఉ. అందు వసంతుని న్రతి ననంగుని లక్ష్మి నుపేంద్రు గౌరి న
య్యిందుకళాధరు న్శచి సురేంద్రుఁ గ్రమంబునఁ బూజచేయఁగా

దుందుభిమర్దళప్రముఖతూర్యరవంబులు నిండ నేర్పున
నుందరు లాటపాటల వినోదము చూపిరి తీపులంటఁగన్. ౨౬

వ. అప్పుడు కర్పూరాదిసుగంధద్రవ్యంబులు వసంతచాలనం బొనర్చెడి వారి
లో నుండి కలహాకంటకుం డను రాచలెంక వెడలి వచ్చుచుఁ దనమీసము
లను నంటిన సుగంధంబు విదిర్చికొనుచుఁ జూచిన నెదుర నున్న యేకాం
గవీరుం డను నంగపతిలెంక తనదు దురభిమానంబునం గనలి. ౨౭

క. ఏరా ముందఱ గానక, నేరమి పైఁ దెచ్చుకొనుచు నీమీసలు నా
చేరువ వడిపెట్టెద విది, యోరీ యేకాంగవీరుఁ డుంట యెఱుఁగవే. ౨౮

క. నావుడుఁ బరిహాళించెద, నీవుండుట యెఱిఁగి కాదె యిది వ్రేటుగ నేఁ
గావించెదఁ బేరికిఁ దగు, లావించుక కలిగె నేని లటపట లేలా. ౨౯

వ. అనినం దివియు మనుచు నయ్యిద్దఱుం గప్పిన దుప్పట్లు తొలంగవైచి
జిట్టునం గఠారంబులు దుస్సిన దగ్గఱం గల తలవరు లెడసొచ్చి పట్టి తొలం
గం దిగిచి యీమహోత్సవంబులో నిట్టిగలబలు సేయ మీయిట్టి బలుబం
ట్లకు సందిక్రంతలజగడంబులు వల దని తోడ్కొని చని రత్నమండపమాళ
శాల యైన కొల్వుమండపంబులో నున్న గోవిందచంద్రుం డనుపడవాలు
ముందటం బెట్టి యీకలహాకంటకుం డంగాధిపతిలెంకతోఁ బోట్లాడఁగడగ్గ
ఱు నెడ నూనిపించి యిద్దఱం దోడితెచ్చితి మవధరింపు మనిన నతండును.

క. తగునోయి కలహాకంటక, జగడంబులు సేయ కొంకుసమయము లేదే
పగపాటి నీకు నితనికిఁ, దగిలిన దీనిందుతో వితండము గలదే. ౩౦

గీ. అనుచు నతని దూఱి యాతనిదెసఁ జూచి, యితనితోడ జగడ మేల యయ్యె
ననుడు నతఁడు వలికె నను నితఁ డిప్పుడు, వ్రేసెఁగాన నిట్టివివర మయ్యె.*

క. ఆపడవాలును దమభటుఁ, గోపించుచుఁ గవుల బాఠకుల శూరుల నా
లోపలఁ గూర్చుండఁగ నిడి, యాపాడి దగంగఁ దీర్పఁ డని నియమించెన్.

సీ. వారలు నేకాంగవీరుఁడ వ్రేటున కైతగిలినవాఁడ వనుచుఁ జూచి
కలహాకంటక యేలకలహంబు గైకొంటి వనుడుఁ బోట్లాడ వేడ్క య్యెననుడు
మఱి కావు లేదె యీమర్మ మేర్పడఁ జెప్పు మనవుడు వ్రేయుటయదినిజంబు
నామీసములసుగంధము విదిర్చికొనంగ నితఁడు నేనుంచుట యెఱుఁగ ననిన
మాటమీఁద నదియె వ్రేటుగాఁ జేసితిఁ బిఱికి వీఁడు బురుకపిట్టయంత
గాని లేఁడు వీనిఁ గైకొందునా నేను, జెండి పాఱవైతు భండనమున. ౩౪

*వైచెగాన నిట్టివైరమయ్యె.

వ. అని పలికినఁ గలహాకంటకుం గోపించి తుచ్ఛపుంబలుకులు పలుకుమరె పగవాని ఘనతచేసినఁ దనదొడ్డతనం బెక్కుడగు నతని హీనంబుగాఁ బలికిన నరిపూనికెం దానును హీనుం డగు నింతియ కాదు విక్రమార్కుండును నంగాధిపతియును మిత్రులు వారికన్నులం బుట్టిన కొడుకులు మీలో జగడంబు వలవదు. ౩౫

క. మగతనము నెఱపఁ బూనియుఁ, బగ యేమియు లేనిచోటఁ బరిమాళింపం*
దగ దతనికి నది నీకును, దిగులువడ న్నిలువనాడఁ దగ దాతనితోన్. ౩౬

గీ. అనఁ గలహాకంటకుం డనునల్ల నవ్వి, పంతమా మీ రెఱుంగని పాడిగలదె
గుడికొలువుబంటు మల్లనికొలఁది పంత, మయ్యె నిచ్చట నదియెట్టు లంటి రేని.

వ. ఒకడు దేవరభాండాగారంబు నింటికడం బాలెము వడం గొలిచి పళ్లెరంబులఁ బ్రసాదంబు దినుచుఁ బోతుక్రియ నుండ నొకనాఁడు దేవర దర్శింప వచ్చి వారిసందడిలో నొక్క యీడిగ తనకాలు ద్రొక్కినం గోపించి యేమిరా బంటుమల్లు న న్నెఱుంగవా తన్నితి వనిన నతండు నేనెఱుంగన యీ సందడిలోఁ గాలు దాఁకె ననిన నెరయం దన్ని యెఱుంగ ననినం బోనిచ్చెదనా యనుచు నందంద దట్టించిన నయ్యీడిగ డాకేలి కటారి వలకేల నందుకొని తన్నినాఁడ నే మనియెదవురా యనిన నతని బిఱుసు చూచి బంటుమల్లండు స్రుక్కి యేమియు నే మనియెద దేవర కూడిగంపుబంటుం గాన దోస మనియెద ననియెం గావున. ౩౮

క. ఆపంతము గాకుండఁగ, నాపేరును నతనిపేరు నాణెంబులుగా
మీపిన్నవాండ్ర మన్నును, జేపట్టి యొకింత వేడ్క సేయింపఁదగున్. ౩౯

వ. అని ప్రొక్కిన నట యంగపతిభటుండు- ౪౦

గీ. మీకుఁ బిన్నవాఁడ నేకాంగవీరుండ, ఱంకెవైచిన నడబింక మైన
నగినఁ గేరడించిన స్త్రీసలంటినఁ, †బట్టి తివియ నాకుఁ బాడిగాదె. ౪౧

గీ. నృపులుగవులుభటులుఁగృపణులుశూరులు, నొక్కచోటఁగూడియున్నవారు
వీరుమెచ్చమన్నువిడిచిమన్నించుట, ఘనతయిదియుమీకుననుచుమ్రొక్కె. ౪౨

క. అమ్మాటలు విని పెద్దలు, మన్నిట మన్నించి మీరుఁ మాకిట జగడం
బిమ్మనినఁ గలహాకంటకుఁ, డెమ్మెయి మెయికొనక యున్న నిరవడనిమతిన్.

*బగగలిపింపందగదతనికేని నీకును. †చూడ నిదియు నాకుఁ బాడిగాదె.

వ. మీర లిద్దఱు రాచలెంకలు గావున నారాజులు సూడంగఁ బోట్లాడవలయు నాయితపడి రం డనిన మాకు నిదియ యాయితంబు బంటువానికిం గటారి చేత నున్నం జాలదె యనుడు నేమియు బంటుతనంబునకుఁ గొఱఁత గాదు రాజు వెడలివచ్చునంతకుం బోయి రండని యొండొండ యనిపినం జని రనంతరంబ. ౪౪

సీ. కఱకంచువలిపెంబు గట్టిగాఁ గాసించి చెలిత్రాడుకాసెపై బలియఁజుట్టి
దేహంబు కప్పుగా లోహకంచుకలీల జిగిబిగిగల నల్లజిగు రమర్చి
వక్షఃస్థలంబున రక్షపూసలపేరు దండతాయెతులును దగ ధరించి
తిలకంబు దళముగాఁ దీర్చి చుంగులపాగ తలముడితోఁ జొళ్లెమలవరించి
కేలఁ బుల్లతియును నీలి నూలునఁ బూని కేలిగతిఁ గటారికోల వట్టి
సంగడీలుగొల్వఁ జనుదెంచెనొకమత్తగజముభంగి కలహాకంటకుండు. ౪౫

వ. అటఁ గొండఱు సంగడీలం గూడి. ౪౬

క. నగుమొగమలరఁగఁ గస్తురి, తిగురు మెయిన్నలఁది కాసె దిటమై మెఱయన్
మగతనముఁ గటారియుఁ దో, డుగ నయ్యేకాంగవీరుఁడుం జనుదెంచెన్. ౪౭

సీ. అప్పుడు చుక్కలలోన నన్నృతాంశుగతి దోఁప రాజులు గొలువంగ రాజు వెడలి
వచ్చినఁ దత్పరివారసమేతుఁడై పడవాలు డగ్గఱి భటులఁ జూపి
వారివైరముఁ బరివారంబుఁ దగవును మున్నుగా నన్నియు విన్నవించెఁ
దనలెంకఁ దిట్టి యిద్దఱ న్బోటికిఁ జేయ భట్టి నంగాధిపుం బాలుపెట్టె
వారు మాకు సెలవుగా రెండుమాటలు, విడువుఁడనియు నృపుని వెఱపు సూపఁ
బనిచెఁ గర్త గాన బంటుతనమునకు, విడుతురయ్య......... ౪౮

క. నాపుడు నిద్దఱుఁ జని పృథ్వీవరునకు వాంత్రచలము వినిపించిన నే
నీవీరుల నొప్పించుట, భావం బాడఁబడ దటంచుఁ బతి చింతించెన్. ౪౯

క. ఆవేళ నమాత్యుఁడు మ,హీవర నీమాట సేయ రేమనవచ్చున్
లావరులై లెంకల మని, కావరమున నున్నవారు గైకొన రొరులన్. ౫౦

గీ. పసుల కుయ్యిగాదు బ్రాహ్మణుచెఱగాదు, స్వామిహితముగాదు వ్రతము గాదు
లోకహితముగాని యేకాంగిపోరునఁ, జచ్చువాని కేమి స్వర్గమానె. ౫౧

వ. నాపుడు వీరకులోత్తముం డగు వీరకులోత్తముండు. ౫౨

గీ. మానభంగ మైనమరణంబు శూరుల, కదియ చూడ నాత్మహత్య గాదె
యాత్మహత్య పాప మది నీవ యెఱుఁగుదు, పాప మొందకున్న బ్రదుకు బ్రదుకు.

వ. వ్రేసినవ్రేటును గాఁడినమాటయును లేకయుండుటది మహావ్రతంబు. ౫౪
క. బొంకుట సుర సేవించుట, బొంకమి వేయశ్వమేధములఫలము భటుం
డంకమున సత్యమున్నకై, శంకింపక వచ్చెనేని స్వర్గము గాదే. ౫౫
క. అది యెట్లనినను మిత్త్రుఁడు, మదిఁ గలఁగెడుననియు వీండ్రుమడిసెదరనియుం
గొదికెడు నామన మనవుఁడు, నిదియెంత ప్రసంగమనుచుహితమతిఁబలికెన్.
క, *అంగాధిపతి యు నేను ను, ముంగల నిరుదెసల నిల్చి మొనయుకతారుల్
ఖంగనఁగఁ బట్టి బంట్లకు, భంగము గాకుండ మనసుఁ బట్టెద మనఘా.
క. అనునెడ నిద్దఱు బంటులుఁ, జనుదెంచి కడంక మ్రొక్కి జనవర మముఁజూ
డ నవధరించియు విడుమా,యనవుడుఁ బంతముల కొలఁదు లడిగె న్వారిన్.
వ. అప్పు డొక్కదండనె పోట్లాడంబూని యేకాంగవీరుండు. ౫౯
సీ. పుల్లతి వెట్టిన భూమికిఁ గొసరిన నెదిరిపోటునకుఁ జే యొదుఁగుచున్న
దండకైదప్పినఁ దప్పగ్రేళ్ళుఱికినఁ బంతంబుగొన్నఁ జౌబళము గొన్న
దాణికిఁ జొచ్చిన దాఁచిన మానిన నరువనొడ్డిన బయలాసపడినఁ
జాఁగఁబొడువకున్నలాఁగంబునకుఁగొన్నమడమగెంటినవ్రేళ్ళుమగుడఁబడిన
దాఱుమాఱులైనఁ దలవంచి పొడిచిన, బారుగాఁ దలంచు పంతమిదియె
కదిసి యొక్కపోటు పదిముఖంబులుగాగఁ, బొడుచువాఁడ దేవరడుగులాన.
వ. అను నంతకమున్న వానిపంతంబులకొలందిం బుల్లతి మున్నగా నన్నియుం
గొని యున్న కలహాకంటకుండు. ౬౧
సీ. మఱిఁ గాకదృష్టి నేమఱక రక్షించుచు సూకరదృష్టిమై ఢాకగొలిపి
గర్జనసేయక మార్జాలదృష్టిమైఁ దరలక పరుజించి తాఁకఁబూని
భల్లూకదృష్టి నపాంగసంగతి గని కపిదృష్టి వంచించి కాపుసూపి
చేష్టదప్పక గృధ్ర దృష్టి గనుంగొని యొయ్యన ఫణిదృష్టి నొడియఁజూచి
మనసుదేఱఁజూచియును జూడకున్నట్లు, దృఢముగాఁగఁ జోరదృష్టి నడఁగి
జంకిమీఁదఁనొడిసి శార్దూలదృష్టిఁబైఁ, బడుటసురియకాండ్ర పంతమిదియ. ౬౨
క. తొమ్మిదిదృష్టులలో నా, యిమ్మగు పులిదృష్టిఁ జొచ్చి యెదుఱొమ్ము కఠా
రమున నది తొలుపోటుగఁ, గ్రుమ్మెద నే నొండు లేక కుంభినిఁ గూలన్. ౬౩
వ. అనుడు వింతపంతంబుల కచ్చెరు వంది పొందుగాఁ జూచి విడువుం డన
భట్టియు నంగాధీశ్వరుండును నిలువంబడి విస్తారంబు గలుగ వైహాళి దీర్చి

* ఖంగున దాటుచు రాజును, ముంగల.

యెల్లజనులం గూర్చుండ నిడి గలబపుట్టకుండ నెడ నెడం దలవరుల నిలిపి పట్టెడువారల మాట మాటలలోనఁ బట్టుం డని నియమించి నలువురుబంట్ల నడుమనిడి కఠారంబు ల్కొక్కకొలఁదిగాఁ గొలిచి నిమ్మపండ్ల దోడసి యెడ గలుగ బంట్లచేతి కిచ్చినం బమ్ముకొని యవ్వీరులు చూచువారి చూపుగముల కెల్లఁ దార లక్ష్యంబు లగుచు ధీరధీరంబుగఁ జొచ్చి. ౬౭

క. ప్రింగెడు కృష్ణోరగముల, భంగి న్బెబ్బులులక్రియ నిభంబులకరణిన్
సింగములభాతి నలవడు, సంగతితోఁ గదిసి రెల్లజనులుం బొగడన్. ౬౮

వ. కదియుచుం గలహకంఠకుండు తెలిసి పొడువు మోయన్న యని తెలుపుచు ఘాతగొనంగ నోహో చాలుం బట్టుం డని యిద్దఱం బట్టించి భట్టి నృపుని దగ్గఱం దెచ్చి వీఁజగడంబులు సంతసపడియె* ననిన. ౬౯

క. ఏను కహకంటకుఁడ గ్రక్కున నాతని గౌఁగిలించుకొను మనవుడు నే
మని సంతసపడుదు మొకటి, యును వీడము పోటులాట యుడిపితి రేలా.

గీ. అనుడు దెలిసిపొడువుమమాయన్నయంటి,యన్నదమ్ములకొకకలహంబుగలదె
యనిన దక్కలపడుచు నెట్లాడి రేసి, నేమి దప్పగుననుడు మంత్రీశ్వరుండు.

క. ఓకలహకంటకుఁడయిది, నీకొఱకై కాదు శత్రునిన్ డగ్గఱుచున్
రాకొట్టి పిలిచి మది నుద్రేకము పుట్టించి పోటు దెలుపఁగవలయున్.

గీ. కవులు పొగడువేళఁ గాంతలు రతివేళ, సుతులు ముద్దువేళ శూరవరులు
రణము సేయువేళ రాకొట్టి పిలుచుట, పాడి యిదియ మిగుల భజన కెక్కు.

వ. వెండియు నీ వెటతచలంబు గొన్నను గారణంబు లేనిజగడంబు గావున భగవతియు బేతాళుఁడును నట్లాడించి రింకఁ బాడిగాని చేఁతలకుం జొరక రమ్మని డగ్గఱం దిగిచిన నప్పుడ రాజులుం బరివారంబును బ్రజలు నిదియ పంతంబనం గలహకంటకుండును నేకాంగవీరుండును గౌఁగిలించుకొని యొడ యని యడుగులం బడిన. ౭౦

మ. ధరణీనాయకుఁ డిద్దఱి న్సమముగాఁ దాంబూల జాంబూనదాం
బరభూషాదుల నాదరించి పరుసం బార్శ్వంబుల న్రాజులుం
బరివారంబుఁ గవీంద్రులుం గొలువఁగా భద్రాసనాసీనుఁడై
సరసాలాపకథానుకర్షనముల న్సంప్రీతితో నుండఁగన్. ౭౧

క. ధనహీనుం డొకవిప్రుఁ, డనుపగుచోఁ బెండ్లిసేయ నర్థము వేడం
దనయుచెయి పట్టుకొనుచుం, జనుదెంచెన్ దైన్యవృత్తి జనపతికడకున్.

---

*వీరి జగడంబులంతరపడియె.

శ్రీరస్తు.

# పరిషత్పుస్తకభాండాగారము.

## తృతీయభాగము.

### (1) సమయోచితవచనకదంబము. గ్రం-సం. 1345.

ఇం దనేకవిధము లైన సమయోచితము లగుశ్లోకములు గలవు. చాల భాగము వాడుకలో నున్నవియే కనఁబడుచున్నవి. అనేకగ్రంథములలోనివి గాని యొక్కదానిలోనివిగాఁ గాన్పింపవు. గ్రంథాది నేమియు వివరము కనఁబడదు.

శ్లో॥ నక్షత్రభూషణం చంద్రో నారీణాం భూషణం పతిః
స్వదేశభూషణం రాజా విద్వాన్సర్వత్ర భూషణమ్. ౧
హస్తస్య భూషణం దానం సత్యం కంఠస్య భూషణమ్
శ్రోత్రస్యభూషణం ధర్మో భూషణం కిం ప్రయోజనమ్. ౨
ఉదారస్యతృణం విత్తం శూరస్యాపి రణం తృణమ్
విరక్తస్య తృణం నారీ నిస్పృహస్య తృణం జగత్. 3
కళే పాదం తృణే పాదం పాదం రాశద్గుమేవచ
ముద్రపిండ గణేశాభ్యాం సర్వం హరతి పాలికా. ౪
నిర్దయరాజావ్యాఘ్రసమానో నిర్ఘృణభార్యా మృత్యుసమానా
నిర్జలమేఘస్థూలసమానో నిర్ధనపురుషః శవ్వసమానః. ౫
ఏకమహిషీ ద్విభార్యాచ అన్యగ్రామే స్వయంకృషిః
రాజయుగ్మం భిషగ్యుగ్మం పంచైతే ప్రాణఘాతుకాః. ౬

### (2) లక్షణదీపికా-గ్రం. సం. 1391.

ఇది యొక సంస్కృతవచనము. గద్యము- "ఇతి వితరణవిజిత వినుత పారిజాత చాతుర్యగుణాభిరామ శ్రీమదయ్యలు మంత్రిశేఖర గర్భరత్నాకర రాకా సుధాకర గౌరనార్యవిరచితాయాం లక్షణదీపికాయాం" అని: అయిదు పరిచ్ఛేదములు గలవు. ఇది తెలుఁగుకవిత్వమునకే యుపయోగపడునట్లు కవియుద్దేశించియున్నట్లు తోఁచును. తొలుత-

"ప్రణమ్య విద్వజ్జనపారిజాతం కవీంద్రవిప్రార్చితపాదపంకజమ్

విభుం ప్రభుం విశ్వసృజం మహేశం సంవక్ష్యతే లక్షణదీపికాయామ్.
అస్య గద్యప్రబంధానాం ఛందోలక్షణ నియామకస్య గ్రంథస్యాదౌ పత్వప్రి
కారః పరిహరతే. పకారప్రయోగే దోషహానే కథ ముచ్యతే-పః ప్రతాపి
భయో సౌఖ్యం మరణక్లేశతాపకృత్ - పవర్గ ఇత్యలంకారసంగ్రహే-
ఈరీతిగాఁ గవినిర్ణయము, గణవివరణము, నాయకలక్షణము, మాతృకాపూజ
మొదలైన ప్శెక్కులు, కవికంఠపాశము, సాహిత్యచూడామణి, చమత్కార
చంద్రిక, మొదలగు సంస్కృతగ్రంథములలో నుండియే కాక తెలుఁగు
లక్షణగ్రంథములనుండియుఁ బద్యము లెత్తి చూపియున్నాఁడు. చూడుఁడు.
ఆంధ్రగోకర్ణచ్ఛందమునుండి-
క. దేవనృపతిర్యగౌరవ, భావగతుల కులము వేరుపడి నిల్చిన వ
ర్ణావళుల కందువనరగ, దేవతలుం గచటతపలు దీర్ఘము లలఁతుల్.
ఆంధ్రశ్రీధరచ్ఛందమునుండి-
క. సురనృపతిర్యగ్గౌరవ, వరగతులవి భూసురాది వర్ణాక్షరముల్
గురులఘువులు సురనరగతు, లరిరాయవిభాళ సోమయవనీనాథా.
మ. పటురూపాక్షరపంక్తిలో నొకటియుం బద్యాది నూహింప కు
ద్భటనిర్ఘాతకఠోరదారుణమహాప్రాణాక్షరంబుల్ ప్రథా
నటనం బేర్పడఁగా నొనర్పక జనానందంబుగా నెంతయుం
బటుబుద్ధిం గృతిసేయుసత్తవి యశఃపాత్రుండు ధాత్రీస్థలిన్.
ఆంధ్రాథర్వణచ్ఛందమునందు-
క. తగణంబుఁ గూడి చంపును, రగణముతోఁ గూడి ఘోరరణ మొనరించున్
భగణం బిఁక నొకచిత్రము, మగణముతోఁగూడఁ గాలమానము పతికిన్.
ఉత్తమగండచ్ఛందము-
క. శభలంజెప్పిన విభవము, రభఁ జెప్పిన చోటఁ జెట్ట రయమునవచ్చున్
సభఁజెప్పె నేని భువిపై, నుభయము వర్ధిల్లు చుండు నుత్తమగండా.
ఆంధ్రకవిగజాంకుశమునందు-
క. మృతుఁడగుఁ బద్యాదినిఁ దా, మృతనక్షత్రంబు లిడిన మేదిని సౌఖ్యా
మృతుఁడగు నమృతమునన న,ప్రతిమములగు తారకములఁ బద్యాదినిడన్.
ఇత్యాదిగాఁ బెక్కుపద్యము లీఁబడినవి. తప్పులు మెండు-

శ్లో॥ ఏషా లక్షణదీపికా విజయతే విద్వజ్జనానందినీ
ఛందోల ... ణాద్యనేకవివిధ గ్రంథప్రయోగాన్వితా
గర్వాఖర్వకుకర్ణకర్ణశకలి గ్రీవాస్పదాసంశ్రిత
వ్యా ... పిరాజ ... ... ... ...
అని తుద నసంపూర్ణశ్లోక మున్నది. ఇది యిరువదిపత్రముల తాళపత్రగ్రంథము. దీనిలో మొదటఁ గేతనయాంధ్రభాషాభూషణముగూడ నున్నది.

(3) లంకసారథి-గ్రం. సం. 1650

ఇది యొక్క యసంపూర్ణరామాయణకథ. ఒక విధమైనపాటగా రచియింపఁబడినది. మొదట నాలుగు పుటలు లేవు కావునఁ గవిపేరు తెలియరాలేదు. చాలఁ బ్రాఁతపుస్తకము. అక్షయనామసంవత్సరం ఆడినెల ౧౭ తేదివరకు రాయవేలూరిలో మిరియాల రామినాయని కొమారుడు వెంకటస్వామి వ్రాసినలంకసారథిపుస్తకం సంపూర్ణం, అని చివరనున్నది. 175 సంఖ్యగల దియు లంకసారథియే కాని యందుఁ బ్రారంభమున్నను గవింగూర్చి యేమియు లేదు.

శ్రీహరిని దేవతలు కోరుకొన యిలలోన దశరథపుత్రులగుచూ
దృఢమణి కౌసల్యగర్భాన నుదయించి జనులపాలికి దైవమై
రామలక్ష్మణభరతశత్రుఘ్ను లను మంచి రాజీవనేత్రులగుచూ
ఆమహామహులు శృంగారమున బెరిగిరి అవనిభారము మాన్పనూ

ఈరీతిని గథయే ప్రారంభింపఁబడినది. కృత్యాదిలేదు.

అడవులు కొండలు అటుగాన కారడవి అదిగాక వినులక్ష్మణా
ఎడసందులేదు యీయడవులలోపల యెట్లు బోదుము తమ్ముడా
తిన్నగా యీదోవ మెల్లనే పోదాము పుణ్యుడా వినురాఘవా
... ... ... ... ...
శ్రీరామచంద్రమీసీతబోయిన జాడ జెప్పేము వినురాఘవా
హారామ హారామ అని పలవరింపుచు అటుదక్షిణము బోవగా
పోగాను గనుగొని పోకుండ నీబంటు పోరాడె కొంతసేపు.
... ... ... ... ...

ఈసంపుటములోనే పారిజాతనాటకమనుయక్షగానముగలదు. అది ఘాయలూర్తి నారాయణకవిరచితము. ఇక్కడివి గద్య మిట్లున్నది,

"ఇతి శ్రీ యోగాంబికావరప్రసాదలబ్ధకవితాచమత్కారచాతురీమాధురీధురీణవర్ణితసరససాహిత్య సౌజన్యకౌండిన్యసగోత్రపవిత్ర వాయలూరి రామనామసూనునానారాయణాప్రణీతంబగు శ్రీ విష్ణుపారిజాతనాటకాలంకారకావ్యశ్రేంగార ప్రబంధంబునందు రాధికావిలాసంబునను రాధికరాయభారమును"

ద్వి. శ్రీకరంబగుచు లక్ష్మీకటాక్షమున, ప్రాకటసకలసౌభాగ్యముల్ దేరి
దనరుచునుతికెక్కు దక్షిణకాశి, యనఁదగు పంచవన్నగ్రహారంబు
ఘనచెన్నపురి ప్రశయకావేరిమధ్య, మున సరస్వతితీరమున విలసిల్లు
భూమిని గీర్తి పెంపొంది పొన్నేరి, సీమలో జాగీరు శ్రీ వాయలూరు"

అని వాయలూరు పొన్నేరిసీమలోని దని చెప్పుచున్నాఁడు. వాయలూరిని వాసుఁడగు నీకవికి వాయలూరివారను నింటిపేరు కల్గినది, గాని, చల్లవారే మొదటిగృహనామ మని క్రిందఁ దెలియవచ్చును.

చారుమదీయవంశం బెట్టిదనిన, సారసంబుగ యజుశ్శాఖయనంగ
గురుతరకౌండిన్యగోత్రవర్ధనుఁడు ... ... ...
పున్నమచంద్రుండు భువిఁగీర్తిగలిగి, వన్నెకెక్కిన చల్లవంశాబ్ధిచంద్రుఁ
డకలంక నారాయణప్పయ్య పౌత్రు, నకు జనకుఁడౌ రామనామసత్పుత్రు
అనఘుఁడు నారాయణాఖ్యుండనంగ, వినయసజ్జనుఁడ దేవివరప్రసాదలబ్ధ
ఆతనిప్రియసతి శేషమాంబాభిధాన ... ...

ఇత్యాదిగాఁ దనవంశముం జెప్పుకొన్నాఁడు. కవిప్రతిజ్ఞ-

సీ. అక్షరపదపద్య లక్షణలక్ష్యముల్ స్వరయతి ప్రాసవిశ్రమముగణము
వలపలిగిలుక దాపలిసున్న వత్తువుల్ ఎత్వైత్వవోత్వము లైత్వములును
ప్రారావడి విసర్గ ... వట్రువులుకొమ్ము గుడిదీర్ఘములును సున్న
మావత్తు లావత్తు మఱి నకారపుఁబొల్లు ఆదిగాఁగలశబ్ద భేదములును
ప్రాసద్విప్రాసత్రిప్రాసపద్యములంత్య, సీమయమకాదులందును నేర్పు నెరయ
వరకవీంద్రులకృపచేత వాయలూరి, పురిజనార్దనుచరితంబుఁ బొసఁగఁజేతు.

(4) సాత్త్వికబ్రహ్మ విద్యావిలాసము-గ్రం.సం. 1687.

ఇది యొకవచనము. ఎవ్వరు రచించినదో తెలియదు- ప్రారంభమున:-

"శ్రీసాత్త్వికబ్రహ్మవిద్యా విలాసంనామ విస్తృతం
వైదికావైదికానేక మతతత్త్వ సునిర్ణయం

వేదవేదాంతశాస్త్రాది తాత్పర్యార్థ సునిర్ణయం
సందేహాంధతమో భాను జిజ్ఞాసుజనజీవనం.

శ్రీమద్వేద వేదాంతశాస్త్ర ధర్మశాస్త్ర పురాణాగమ సంహితేతిహాసాది ప్రమాణపారంగతుండై శమదమాది గుణగరిష్ఠుండై సదాచార నిష్ఠుండై సాత్త్వికధర్మనిష్ఠాగరిష్ఠుండై సత్పురుషశ్రేష్ఠుండైన యాచార్యుని చిత్తవృత్తు లెఱింగి శుశ్రూషచేసి తనయందుఁ గృపపుట్టిన వేళం దెలిసి జిజ్ఞాసువై వీతరాగియై ముముక్షువైన శిష్యుండు సాష్టాంగదండ ప్రణామములు చేసి తదనుజ్ఞను నుచితగతిం గూర్చుండి వినయశీలుండై యాచార్యునిం జూచి యేమనుచున్నాఁడు.

కృష్ణార్పణ మనుచోటను గొందఱు బ్రహ్మార్పణ మందురు. అయినం గృష్ణార్పణమనియు బ్రహ్మార్పణ మనియు నీరెండునామములును వచించినచోట నిద్దఱు వస్తువులు కారా యన్నను కారు. కృష్ణబ్రహ్మశబ్దములకు శబ్దభేదమే కాని యర్థభేదము వస్తుభేదమును లేదు. లేకుండుట యెట్లన్న:—

శ్లో॥ కృషిర్భూవాచకం శబ్దో ణశ్చ నిర్వృతివాచకం
తయోరైక్యం పరబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే ॥

అని వేదవ్యాసుల వచనమున్నది.

"భృగుశాపమునను విష్ణువు పదిమాఱ్లు చచ్చి పుట్టె ననెడి యుక్తి యుక్తముగాదు. ఇంకను శాస్త్రసమ్మతము గాకుండుట యెట్లన్నను. భృగుశాపముననే దశావతారము లెత్తుట నిజమైన, వేదములు పోఁగొట్టుకొన్న బ్రహ్మదేవుఁడు మొఱపెట్టఁగా మత్స్యావతార మాయె నని చెప్పిన పురాణములు దబ్బరలే కావలెను. తాసృష్టించిన ప్రాణులకు ఆధారము లేదని బ్రహ్మదేవుండు మొఱపెట్టఁగాను హిరణ్యాక్షునిచేఁ బడిపోయిన భూమిదేవి మొఱపెట్టఁగాను వరాహావతార మాయెనని చెప్పిన పురాణములు దబ్బరలే కావలెను"………ఇత్యాదిగా ననేకోదాహరణములతో వ్రాయఁబడినది. (ఇందలిమాటలు కొంచెము సవరించి వ్రాయఁబడియెను.)

"ప్రమోదూతనామసంవత్సర శ్రావణశుద్ధ పౌర్ణమాస్యాం భౌమవాసరే శ్రీమదాత్రేయాన్వయ దుగ్ధసింధునిధునా శ్రీవేంకటార్య సూనునా అప్పళార్యే

౹౹ లిఖిత మిదం హా_త్త్వక బ్రహ్మవిద్యావిలాసం నామ ప్రబంధం సమాప్తం'' అని చివరనున్నది. 82 పత్రముల తాళపత్రప్రతి.

(5) చిదానందమంజరి—గ్రం. సం. 1713.

ఇది యొకద్విపద వేదాంత గ్రంథము, కవి-ఆత్రేయగోత్రుఁడు- ఉమాపతికవి-తన్నుంగూర్చి గ్రంథాంతమున నిట్లు చెప్పుకొనియెను.

ముద మొప్పఁగవులకుమ్రొక్కు గావించి, సదయుండు నాయుండ్ల శాసనాంకుండు
కూరిమి వీరయ కులపవిత్రుండు, నారూఢిదనరు బుధాగ్రగణ్యుండు
అతనిపుత్రుఁడు శేషయామాత్యుఁడనఁగ, నతిపుణ్యుఁడిల వెంగమాంబందుగనియె
సకలవిద్యావిచక్షణుఁ డగునట్టి, యకలంకమతిపుణ్యుఁ డనఘచరిత్రు
గుణనిధి యాత్రేయగోత్రపవిత్ర, మణియగు నార్వేలమంత్రిశోభితుఁడు ...
... ... ... ... ... ...
సర్వ వేదాంత నిశ్చయరహస్యములు, సువ్విదిద్విపదలోకోపకారముగ
గరిమ నుమాపతి గావించెఁ బూని ........... " ఇత్యాది.

ప్రారంభము:—

శ్రీవాసుదేవైకచిరచిదానంద, పావనామృతరాశి బంధూకరాశి
తాపత్రయాంతకుఁ దత్వార్థ వేది, వ్యాపకు నవ్యయు వ్యక్తు సర్వజ్ఞు
నిగమాగమాచారు నిత్యప్రకాశు, జగదుద్భవస్థితి సంహారనిలయు

పాదపద్మమ్ములు భక్తితోఁ గొల్చి, వేదాంతమెల్లను విశదంబుగాను
మాయురే యని బుధు ల్మెన్ననసేయు, మాయాచిదానంద(మహనీయపేర)
... ... ... ఈకథకుమూలము సూతగీతలలోనిదఁట.
అమరినముక్తి చిదానందచరిత, సూతగీతలలోనఁ జూచినవారి
కాతతిఁ దోఁచు నీయతుల నిశ్చయము ... ... ...
అనిమునులకు సూతుఁడానతి యిచ్చె, వినుఁడు చిదానందవిభుఁడొక్క రాజు
పరమాత్ముఁడనఁదగు బ్రహ్మ మవ్యయుఁడు, పరిపూర్ణుఁడయ్యును బ్రకృతనుశక్తి
గలసియీశ్వరుఁడైనకాలంబునందు, బలుగుణంబులుమూఁడుప్రభవింపఁజేసె.

కథాభాగములో:—

ఈవటుకునువిన్న దిది విన్కిగాదు, భావించి యిఁకమీఁదఁ బదిలమైవినుఁడు
జన్మబాధంబులు సరగునఁ దెగును, గన్మయానందంబు తరలకనిలుచు

పరమాత్మ జీవాత్మ బంధముక్తులును, కరతలామలకంబుగా వినిపింతు
అరసి చూడాలకోపాఖ్యానమునను ... ... ...
ఆమూర్తిగనియీశుఁ డమితవేగమునఁ, బ్రేమ నెదుర్కొని ప్రియముతో మ్రొక్కి
అఖిలసద్వాక్యోదయానందమూర్తి, సుఖమె శిష్యులకెల్ల సుస్థిరాకార
తడవాయె సేవించి దయకుఁ బాత్రుండఁ, గడఁగి దర్శనమీని కారణంబేమి

... ... ... ... ... ...

కర్మబంధంబులఁ గడతేరలేక, సృతిజనమృతాదిబాధలను
బారయలేనిఁక మునిపుంగవ నీదు, సరసవాక్యామృతసరణిఁ బాలింపు
మని వేఁడుకొనినను నాశీర్వదించి, వినయమేర్పడఁగ నావిభుఁ జూచిపలికె
కటకటా నీవంటిఘనునకు భ్రాంతి, యెటువలెఁ బ్రాపించె నిదిమహాద్భుతము
నీయందుఁ దోఁచునీనిఖిలంబులోనఁ, బాయనినీకెట్లు బంధముల్గలిగె
నానందమయుఁడవై యలరిననీకుఁ, బూనిదుఃఖంబులు పొందనేమిటికి.

ఈవిధముగా మృదుమధురశైలిని వేదాంతము కథలతోఁ దెల్పఁబడినది. 31పత్ర
ముల పుస్తకము. ఈసంపుటములోఁ బంచదశిప్రకరణములు, గురుపాదుకాశ్లో
కములు, శంకరాచార్యాద్వైత శ్లోకములు మొదలైనవిగలవు.

(6) ఉపదేశకాండము—గ్రం. సం. 1714.

శిథిలభాగములుగలది. శివపురాణములోనిది, కాని దీనిన్యోక్కభాగమునే కవితె
నిఁగించినట్లు:-

౹మ త్రైలోనసనగ, క్షేమవిజితకామ భీమ ధీమహితముని

స్తోమ పరిఫుల్లహల్లక, సోమసతీధామ వామ సోమలలామా.

శ్రీసంభవాసుర వీరమాహేంద్రయుద్ధ దేవదక్షంబు లనునాఱుకాండంబులకుం
గడపటిది యగు నుపదేశకాండంబు కథాక్రమం బెట్టి దనిన చిత్తగింపుము.

అను ప్రారంభవాక్యములవలనఁ దోఁచుచున్నది. సంస్కృతములోనున్నట్లె నడు
మ నడుమ "ఇతి శ్రీయుపదేశకాండే ద్వితీయోధ్యాయః, తృతీయోధ్యా
యః" అని సూచించుచున్నాఁడు. అట్లు పదునెనిమిదింటివఱకు నగపడుచు
న్నవి. కవిపేరు తెలిసికొనుటకుఁ గడపటఁ గొన్నిపత్రములులేవు.

ఈ క్రిందిపద్యములనుబట్టి వేత్త లిదివఱకుఁ బ్రకటింపఁ బడియున్న గ్రంథములో
నిదేమో తెలిసికొనుటకై 8 వ యధ్యాయప్రారంభము నందలి కొన్నింటిని
జూపుచున్నారము.

క. నామాట వింటి తల్లీ, నీమాట వినంగ మతిని నేఁగోరెద నీ
వేమాత్రిదాన వెఱుఁగం, గా మోద మెలర్పఁ జెలువఁగా వలెనన్నన్.

క. అనికూఁతురు వేఁడినఁ ద, జ్జనని వలికె నేను దితిసఖి కశ్యప స
న్మునిపత్నిని దైత్యులుబహు, తనయులు నావలనఁ బుట్టి దర్పోద్ధతులై.

చ. అమరులతోడఁ బోరి విలయంబును బొందిన దుఃఖవహ్నిచేఁ
గుములుచు శ్రీనగంబునకుఁ గూఁతుర యేఁ జని యొంటి జన్మమె
త్తి మరుదకారణప్రళయ తీవ్రులఁ బుత్త్రులఁ గాంతునంచుఁ జి
త్తమునఁ దలంచి వ్రాలితి నదస్థలభూమిని మేను పిడితిన్.

చ. తనువు దొరంగి పుట్టితిని దైత్యకులంబునఁ బుట్టి కశ్యపుం
గనివరియించి యమ్మునికి కంటిని బుత్త్రుల శూరపద్మము
ఖ్యునిగ ననేకుల న్నుతులకుంఠితవిక్రముల్లసిల్లఁగా
ననిమిషుల న్వధించి ముదమందితి నిన్నును గంటి నత్తఱిన్.

ఈపుస్తకములోనే శ్రీధరమల్లి వేంకటరామకవి బ్రహ్మోత్తరఖండమునుగలదు.

(6) విజ్ఞానప్రదీపిక-గ్రం. స. 1772.

ఇది యోగకావ్యము, పద్యమయము. సుమారు రెండాశ్వాసములుమాత్రమె యున్నవి.

గద్యము—ఇది శ్రీమదనగోపాల చరణకమల ధ్యానానంద పవిత్ర కౌశికగోత్రపవిత్ర గోపయామాత్యపుత్ర సుజనవిధేయ ప్రణీతంబైన విజ్ఞానప్రదీపిక యను యోగశాస్త్రమునందుఁ బ్రథమాశ్వాసము.

ఇందు సుజనవిధేయ యని తర్వాత లేఖకుఁడు కవినామధేయము వ్రాయమఱచినాఁడు.

ప్రారంభము:—

క. శ్రీకృష్ణునకును బహువిధ, లోకైకస్తుత్యునకును లోకేశునకున్
గాకోదర వరశాయికి, నాకౌకప్రమదకరణ నైపుణ్యునకున్.

వ. అనేక దండనమస్కారంబులు గావించి నాయొనర్పం బూనిన యోగకావ్యంబునకు నామనిర్ణయం బెట్టెదనిన.

క. పదునెనిమిదివిద్యలలో, సదమలమగుసారమెల్లఁ జర్చించి మదిం
బదిలముగ నెఱిఁగి చెప్పఁగ, నదివిజ్ఞాన ప్రదీపి కననుతికెక్కున్.

## ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు. పరిషదధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

శ్రీరాణీ వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మజగపతిబహద్దరుగారు-తుని రాణిగారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

## అధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

## కార్యని సభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుఁడుగారు.

రావుసాహేబ్ డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ., ఎల్. టి. (Ph. D.

(కోశాధ్యక్షులు.)

శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., యల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. ఎల్.

అళక్కి వేంకటాద్రిమయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయుఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పామగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావు నాయుఁడుగారు.

# కాకినాడ-ఆంధ్రసాహిత్యపరిషత్తులో

## వెలకుదొరకు గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు | 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... | ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు ... | ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము- శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... | ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము- జ. రామయ్యపంతులుగారు, | | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి- విన్నకోట పెద్దయకవి ... | ... | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రితగ్రంథసూచిక ... | ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... | ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... | ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 4 | 0 |
| 18 | హ్రస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు ... | ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు ... | ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ ... | ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁకుఁడు | ... | 0 | 12 | 0 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | ... | 1 | 4 | 0 |
| 23 | రెడ్డినాఁటి రెండుశాసనములు . ... | ... | 0 | 4 | 0 |
| 24 | ఆంధ్రధాతుమాల ... | ... | 0 | 12 | 0 |
| 25 | శాసనపద్యమంజరి ... | ... | 0 | 12 | 0 |
| 26 | శతకసముచ్చయము (ప్రథమభాగము) ... | ... | 0 | 12 | 0 |
| 27 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) ... | ... | 0 | 8 | 0 |
| 28 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి ... | ... | 0 | 8 | 0 |
| 29 | రసాభరణము—అనంతకవి. ... | ... | 0 | 8 | 0 |
| 30 | చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) ... | ... | 1 | 8 | 0 |
| 31 | ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు... | ... | 1 | 0 | 0 |
| 32 | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య ... | ... | 0 | 8 | 0 |
| 33 | ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతీవ్యాఖ్యతో ... | | | 8 | 0 |

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**

సంపుటము ౨౧. { ఆంగీరసనామసంవత్సరము. శ్రావణ భాద్రపదమాసములు. } సంచిక 3.



కాకినాడ:

కొత్తపల్లి సూర్యరావుచేఁ బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1932.

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౧. } ఆంగీరసనామసంవత్సరము శ్రావణభాద్రపదమాసములు. సంచిక 3.

## కృష్ణదేవరాయలు—ఆముక్తమాల్యద.

వేకుమళ్ల అచ్యుతరావుగారు, ఎం. ఏ., ఎల్. టి, రాజమహేంద్రవరము.

---

విజయనగర సామ్రాజ్యమందలి యాంధ్రవాఙ్మయచరిత్రము తుళువ నరసరాయనికాలమువఱకు ననఁగా క్రీ. వె. 1500 వఱకుఁ బ్రథమభాగమం దభివర్ణింపఁబడినది. కొంచెము హెచ్చు తక్కువగఁ బదియేనవశతాబ్దము పూర్తియగుసరికి నరసరాయలు దివంగతుఁ డయ్యెను. ఆయన తరువాత నతనిజ్యేష్ఠపుత్త్రుఁ డగువీరనరసింహరాయలు సింహాసన మెక్కెను. ఈతఁడు క్రీ. వె. 1500-1509 వఱకు సామ్రాజ్యమును గడుసమర్థతతోఁ బరిపాలించెను. ఈ మహానీయుఁడు నిరంతరము శత్త్రురాజులతో సమరములు సలిపి రాజ్యము యద్వ్యధమైనకార్శ్యము నొందకుండ సంరక్షింపఁగలిగియు, వాఙ్మయసేవఁగూడఁ గొంత వఱకు నొనరింపఁగలిగెను.

అయిన, నీభూమీశుఁడు తనపూర్వులవలెఁ గాని, తనకుఁ దరువాతివారివలెఁ గాని పేరొందిన విద్యాపోషకుఁడు గానట్లు తోఁచెడిని. కొన్నిసంస్కృతగ్రంథములును గొన్ని కన్నడగ్రంథములు నీతనికాలమున వెలువడినట్లు కాన్పించుచున్నవి; కాని రాజపోషణము వానిప్రకటన కెంతవఱకుఁ గారణ మయ్యెనో చెప్పవీలులేదు. మఱి యాంధ్రవాఙ్మయ మన్ననో యీతఁడు కృతి నొందిన యాంధ్రగ్రంథము లెవ్వియు నిప్పటికిని వెలువడలేదు. గీర్వాణకర్ణాట

భాషలను బహుశః పోషించిన భూకాంతుఁడు తనమాతృభాష యైనయాంధ్ర భాషను విసర్జించునా? అట్లు జరుగదు. కాన భాషాపరిశోధనలవలన నీతనికాల మందలి కొన్నియాంధ్రగ్రంథములు లభింపఁగల వని విశ్వసింపవచ్చును.

వీరనృసింహరాయలవెనుక నతనిసవతితమ్ముఁ డగుశ్రీకృష్ణదేవరాయలు సింహాసన మెక్కెను. ఈ చక్రవర్తి క్రీ. వె. 1509-1530 వఱకు రాజ్య మేలెను. ఈయనయె విజయనగరసామ్రాజ్యముఁ బాలించినవారిలో నత్యధిక రాజ్యనీతి కోవిదుఁడు ను, ప్రతాపశాలి యు, దేశైకసేవాపరాయణుఁడు నై యుండెను. ఛత్రపతిశివాజీమహారాజునకుఁ బూర్వము దక్షిణహిందూదేశములో నీతనిని మించిన మహాయోధుఁ డెంతమాత్రము గానరాఁడు. ఒకవంకఁ దురుష్కప్రభువులతోడను వే ఱొకతట్టు గజపతిరాజులతోడను నిరంతరముఁ బోరాడుచు నెన్నఁడును మచ్చునకైన నపజయముఁ బొందక, తాను జయించినశత్రురాజులకు సహితము తనయౌదార్యసౌశీల్యములచే బహువిధముల శ్లాఘాపాత్రుఁడై నిజామాత్యదండనాయకులయెడలఁ దండ్రివలెను జెలికానివలెను మెలఁగుచు సరస్వతీ సర్వతోముఖాదరణచే రెండవభోజుఁ డనిపించుకొని యాంధ్రసామ్రాజ్యము నత్యున్నతస్థితికిఁ దెచ్చెను. ఆతనికాలమందు విజయనగరము నిక్కముగ విద్యానగరమయ్యెను. హిందూకళలకు నాటపట్టుగను, గవితాకన్యకు విలాస విహారక్షేత్రముగను, వేదశాస్త్రములకు విశాలపరిషత్ప్రదేశముగ నిసామ్రాజ్య ముపకరించి శాశ్వతకీర్తి గడించినది.

ఈ నిరతిశయధీమంతుఁ డగుభూకాంతుఁడు స్వకీయప్రతిభా గౌరవము చేతను, దనయనుయాయు లగు నమాత్యసామంతాది వీరశిరోమణుల భక్తిపరాయణత్వముచేతను దదీయవిపులదక్షిణహిందూసామ్రాజ్యచక్రమును నిర్వక్రపరాక్రమముతో ననవరతము జయప్రదముగ నిర్వహింపఁగలిగెను. మహామాత్యశేఖరుఁ డగుసాళువ తిమ్మరుసుయొక్క నయవిద్యాచాతుర్యము, మహాదండనాయకుఁ డగుపెమ్మసాని రామలింగనాయని యుద్దండదండనీతియు, నాంధ్రకవితాపితామహుఁ డగునల్లసాని పెద్దనార్యుని సులలితకవితాసుధారసము, నీచక్రవర్తియొక్క సహజోపజ్ఞానము పార్జితకీర్తి ననేకవిధముల భరతవర్షమునంతట వ్యాపింపఁజేయఁగలిగినవి.

శ్రీకృష్ణదేవరాయల తల్లి పేరు నాగాంబ. ఈమె నరసరాయల రెండవ భార్య. కృష్ణదేవరాయలభార్యల సంఖ్యను గూర్చియు వారిపేరులఁ గూర్చియుఁ

గొంత భిన్నాభిప్రాయ మున్నది. "పాయజ్" అను పోర్చుగీసురాయబారి కృష్ణదేవరాయలకుఁ బండ్రెండుగురు భార్య లుండి రనియు వారిలో నలువురు పట్టమహిషులై యుండి రనియు వ్రాసెను. "న్యూనిజ్" అను మఱియొక పోర్చుగీసు యాత్రికుఁడు కూడఁ గృష్ణదేవరాయలకు నల్వురు పట్టమహిషు లుండి రని చెప్పి వారిలో నొకరిత కటకదేశపురాజగు గజపతికుమారిత యనియు, నిద్దఱు శ్రీరంగపట్నపు రాజుకూఁతు లనియు, మఱి యొకయువతి కృష్ణరాయలు చిన్నతనమునఁ బ్రేమించిన భోగపుకన్య యనియుఁ జెప్పి, యాభోగపుకన్య పేరు చిన్నాదేవి యనికూడ నుదాహరించెను.

ఇట్లుండఁ బెద్దన్న మనుచరిత్రలో "తిరుమలదేవి యుఁ జిన్నాదేవి యు దేవేరులుగాన్" అని నుడివెను. ముక్కు తిమ్మన్నకూడ, పారిజాతాపహరణములో తిరుమలదేవినిఁ జిన్నాదేవిని మాత్రమే పేర్కొనెను. తిరుపతిదేవాలయములో నున్నకృష్ణదేవరాయల యిత్తడివిగ్రహమునకు నిరుపక్షముల నున్న యిత్తడివిగ్రహములమీఁదఁ జిన్నాదేవియొక్క యుఁ దిరుమలదేవియొక్క యుఁ బేరులు మాత్రమే లిఖింపఁబడియున్నవి. సింహాచలములో క్రీ. శ. 1516 లోఁ జెక్కించిన శిలాశాసనములోఁ గూడఁ జిన్నాదేవియుఁ దిరుమలదేవియు మాత్రమే యుదాహరింపఁబడిరి. ఇట్లే అమరావతి మొదలగు శాసనములలోఁ గూడ వీ రిద్దఱి పేళ్లె యున్నవి.

ఇట్లుండ నాముక్తమాల్యదలోఁ గృష్ణదేవరాయలు తనభార్యల గుఱించి వ్రాయుచు "తిరుమలదేవియు నన్నపూర్ణాదేవియుఁ గమలాబ్జముఖులు దేవేరులుగన్" అని చెప్పికొనియుండుటచేఁ జరిత్రకారు లీమాటల ననేకవిధములుగ నర్థముచేసికొనవలసివచ్చినది. కొంతమంది యీనాలుగుమాటలును నల్గురుపట్టపుదేవులపే ళ్లని చెప్పిరి. అనఁగాఁ గృష్ణదేవరాయలభార్యలు తిరుమలదేవియు, నన్నపూర్ణాదేవియు, కమలాదేవియు, అబ్జముఖిదేవియు నని వారియభిప్రాయము. ఈసంఖ్య పాయజ్ న్యూనిజ్‌లు చెప్పినసంఖ్యకు సరిపోవుచున్నదికదా? అయినను మఱియొకబాధకము గాన్పించుచున్నది. కుమారధూర్జటి తనకృష్ణరాయవిజయములో గజపతిరాజుకొమారిత పేరు 'తుక్కా' యని చెప్పెను. మఱియొకరు గజపతిరాజుకూఁతురిపేరు 'భద్ర' యని నుడివిరి. రాయవాచకములో నీమెపేరు 'జగన్మోహిని' యని యున్నది. ఇట్లనేకు లనేకవిధములుగా నీతనిభార్యలపేళ్లను గూర్చి వ్రాక్రుచ్చిరి. వీని నన్నిటిని సమన్వయించిచూడఁ

గా నీక్రిందియంశములు విస్పష్టముగఁ గాన్పించుచున్నవి. (1) తిరుమలదేవి యన్ని గ్రంథములలోను సమానముగా నున్నది. కావున నీమెవిషయము నిర్వివాదాంశము. (2) చిన్నాదేవి ప్రశంస కొన్నింట మాత్రము కాన్పించి మఱికొన్నింట లేకపోవుట కొంత సంశయమునకుఁ గారణభూత మగుచున్నది. క్రీ. శ. 1517 వఱకు వెలువడిన కృష్ణదేవరాయల శాసనములలో నీమెపేరు గాన్పించి యటుతరువాత లిఖింపఁబడిన శాసనములలో లేకపోవుటకుఁ దగిన సమాధాన మూహింపవలసియున్నది. ఇంతియగాక మనుచరిత్ర పారిజాతాపహరణ గ్రంథములలో నీమె పేర్కొనఁబడి కృష్ణదేవరాయలచే నతని యాముక్తమాల్యదలో సూచింపఁబడకపోవుటయుఁ బైసందేహమును బలపఱుచుచున్నది. దీనినిగూడ సమర్థింపవలసియున్నది. (3) గజపతికుమారికపేరు తుక్కా, భద్ర,జగన్మోహినియని వేఱువేఱుగ వచింపఁబడుటకుఁ దగినహేతువు నిర్ణయింపవలసియున్నది (4) వీనిలో నెచ్చోటను గానరాని 'యన్నపూర్ణాదేవి, కమలాబ్జముఖులు'అనునామప్రశంస కృష్ణదేవరాయ లేల చేసెనో నిర్ణయింపవలసియున్నది.

ఈచిక్కువిషయములను విడఁదీయుటకుఁ గృష్ణదేవరాయల దండయాత్రలకు సంబంధించిన చరిత్రాంశములను దదితరజీవితాంశములను జరిత్రకారులిదమిత్థ మని నిర్ణయించినవఱకుఁ గ్రోడీకరించిచూచెదము. కృష్ణదేవరాయలు రాజ్యారంభములోనే యుమ్మత్తూరు గంగరాజును జయించినట్లుగఁ జరిత్రకారులంద ఱేకగ్రీవముగా నొప్పుకొని యుండిరి. కావున ఫోర్చుగీసు రాయబారులు చెప్పినట్లు గంగరాజుకొమార్తెను రాజ్యారంభములోనే కృష్ణదేవరాయలు పరిణయమాడి యుండును. అంతకుఁ బూర్వమే యౌవనప్రాదుర్భావమునఁ బరిగ్రహించిన విలాసవతి యొకతె యాతనికి నుంపుడుకత్తెగ నుండనోపు. కావునఁ గళింగదేశముమీఁది దండయాత్రకుఁ బూర్వ మాతనికి నొక యుంపుడుకత్తె యు,గంగరాజుకొమారిత యు భార్యలుగ నుండవలసి యున్నది. కళింగరాజ్యదండయాత్ర క్రీ.శ. 1515మొదలు 1517 లోపుగా మూఁడుసారులు జరిగినట్టులుగా శాసనాదికములవలన నిర్ణయింపఁబడుచున్నది. కడసారి దండయాత్రలోఁ బ్రతాపరుద్రగజపతిని జయించి, యాతనికొమార్తెను రాయలు వివాహము చేసికొనియెను. కాఁబట్టి క్రీ. శ. 1516-17 సం॥నకుఁ బూర్వమే కృష్ణరాయలు కృతినొందిన గ్రంథములలో వీరి యిద్దఱిపేరులు

మాత్రమే గోచర మగుట న్యాయమేకదా ! వీరియిద్దఱిలోఁ జిన్నాదేవిపేరు విస్పష్టముగఁ గృష్ణదేవరాయలు ప్రేమించిన భోగపుకత్తె యై యుండు నని న్యూనిజ్ చెప్పియే యున్నాఁడు కావున రెండవమహిషి పేరెద్దియో నిర్ణయింపవలసియున్నది.

కృష్ణదేవరాయలు కృతినొందిన మనుచరిత్రయుఁ బారిజాతాపహరణమునుఁ, దాను రచించిన యాముక్తమాల్యదయు నీగ్రంథముల రచనాపౌర్వాపర్యము విషయమై యిటీవల మనసుప్రసిద్ధచరిత్రపరిశోధకులగు డాక్టరు నె॥ వెంకటరమణయ్యగారును కుం॥ ఈశ్వరదత్తుగారును మున్నగువారు భారతిలోఁ గొంత చర్చ సలిపియున్నారు. వారివాదప్రతివాదములు జాగ్రత్తగఁ బరిశీలించితిని. కాని నాయభిప్రాయ మేమనఁగా మనుచరిత్ర పారిజాతాపహరణములలో నేది ముందున నేది వెనుకను వ్రాయఁబడినదో స్థిరయింపఁ గడంగుట వృథాప్రయాసము. అది యెప్పటికిని దెగునది కాదు. ఈరెండు నాముక్తమాల్యదకుఁ బూర్వమే రచియింపఁబడిన వని నిర్ణయించుట యథార్థమునకు నెక్కువ చేరువగ నుండును. రాయవాచకమిత్యాది గ్రంథాధారములలో నున్నట్లీగ్రంథములు కళింగదేశముపైఁ గృష్ణదేవరాయలు దండువెడలుటకుఁ బూర్వము రచింపఁబడినట్లు నిర్ణయించుట యెక్కువ సమంజసము. కాఁబట్టి యాముక్తమాల్యదకావ్యరచనను విజయవాడలోఁ గృష్ణరాయలు ప్రారంభింపక పూర్వమే యీ గ్రంథములు సమగ్రముగా నుండినవి. కావున నీగ్రంథములలోఁ గళింగదేశపురాజుకొమార్తె ప్రశంస యుండుట కవకాశము లేదు. ఆకారణమున నీగ్రంథములలోఁ జేర్పఁబడిన యిద్దఱుదేవేరులను భోగస్త్రీ యగు చిన్నాదేవియు గంగరాజుకొమారిత యగు తిరుమలదేవియు నై యుండవలెను.

క్రీ. శ. 1516—17 తర్వాతను బ్రారంభింపఁబడిన యాముక్తమాల్యద కొన్నిసంవత్సరములకుఁ గాని పూర్తి గానేరదు. కావున క్రీ. శ. 1520 నాఁటికి నవతారికభాగముతో గ్రంథము సమాప్త మై యుండ నోపు. ఈమూఁడుసంవత్సరములలోను గాని తదుపరిఁ గాని యేశాసనములలో నయినను లేక గ్రంథములలో నయినను జిన్నాదేవిపేరు కాన్పించుట లేదు. ఈమె మఱి యొకనామాంతరముం బొందిన దని చెప్పుట కేవలము సాహసము, నిరాధారము. అనేకసంవత్సరములవఱకు భర్తయొక్క శాసనాదికములలోఁగూడ నాపేరువనే వ్యవహరింపఁబడిన యాదేవి మఱి యొకపేరున భర్తచేఁ బిలువఁబడుటకుఁ గార

ణము దురూహ్యము. కాఁబట్టి చిన్నాదేవి క్రీ. శ. 1516-17 సం॥రము తరువాత శాసనాదికములలో నేవిధముగా నైనను పచింపఁబడ లేదనియే నిర్ణయించుట యుక్తమైనది. బహుశః, ఈకాలమునాఁటి కామె కేదోవిధముగ భర్తృసన్నిధి నుండి యెడఁబాపు గలిగి యుండవలెను. మరణించిన దని యూహించుటయే యుభయులయశస్సునకు లెస్సగనుండును.

ఆముక్తమాల్యద పూర్తియగునాఁటికిఁ జిన్నాదేవి యంతరించిన దని నిర్ణయించితిమి కద. ఇఁక నాముక్తమాల్యదలోఁ బేర్కొనఁబడిన రాణు లెవరో నిర్ణయింపవలసియున్నది. గంగరాజుకూఁతురగు తిరుమలదేవి సజీవయై యుండుటచేతఁ బూర్వమువలెనే ప్రశంసింపఁబడినది ఇఁక రెండవపేరగునన్నపూర్ణాదేవి యెవరిది ? కమలాబ్జముఖు లెవ్వరు ? కళింగదేశదండయాత్రలు పూర్తియగు నాఁటికిఁ గళింగరాజకుమారికను గృష్ణదేవరాయలు వివాహ మాడినసంగతి నిర్వివాద మగుచరిత్రాంశము. ఆమె యొక్క కులగౌరవములచేఁ బేరొందిన పట్టమహిషియై యుండును గాని యనామకముగ నుండఁ జాలదు. కావున నన్నపూర్ణాకమలాబ్జముఖులలో నేపేరుననో యామె పరఁగి యుండును. ఈసందర్భములో మఱియొకవైచిత్ర్యమును మనము గాంచవలసియున్నది. కమలాబ్జముఖులు ప్రత్యేకముగా స్త్రీనామములా ? లేక స్త్రీనామకవిశేషణములా ? చరిత్రాంశములను బట్టియుఁ గథాసందర్భమును బట్టియుఁ జూడఁ జూడ నీశబ్దములు స్త్రీనామకవిశేషణము లని నిర్ణయించుటయే యెక్కుడు సరసముగానుండు నని నే నభిప్రాయపడుచున్నాను. తిరుమలదేవి యు, నన్నపూర్ణాదేవి యు, వీరిద్దఱు ను గమలాబ్జముఖులుగాఁ గవిచే వర్ణింపఁబడిరి. కాని ప్రత్యేకస్త్రీనామములుగ వీనినిఁ గవి యుపయోగింపలే దని నే నూహించుచున్నాను. కనుకఁ గమల యనియు నబ్జముఖి యనియు వేఱుగ నున్న యిద్దఱురాణులను రాయలు పేర్కొనలే దని నాయూహ. కాని తనభార్య లిద్దఱినిఁ గమలాబ్జముఖు లని వర్ణించుటయందలి స్వారస్య మేమి యనిన నీమాటలచే వారిద్దఱి సౌందర్యమహిమను వర్ణించుటయే గాక వారిసాపత్న్యధర్మమును గూడ నిగూఢముగఁ గవి సూచించె నని నాకుఁ దోఁచుచున్నది. 'కమల' మనఁ దామర పువ్వు- 'అబ్జముఖి' యనఁ జంద్రముఖి. కావునఁ గమలమునకుఁ జంద్రునకును న్న యన్యోన్యధర్మమే వీరిద్దఱియందును గాన్పించుచున్న దని నర్మగర్భముగ సూచించినాఁడు.

'కమలాబ్జముఖులు' అనుపదము శ్రీనామకవిశేషణ మని పైనఁ జెప్పి నరీతిగ నిర్ణయించినయెడలఁ గృష్ణరాయలు పెండ్లియాడిన గజపతికుమారిక యన్నపూర్ణాదేవి యనియే నిశ్చయింపవచ్చును. అయినను, ఆమెకు 'తుక్కా' యని యు 'భద్ర' యని యు 'జగన్మోహిని' యని యు, నిత్యాదినామంబులెట్లు గలిగినవో యాలోచింపవలసియున్నది 'భద్ర' 'జగన్మోహిని' యిత్యాదినామములు సార్థకబిరుదనామము లని సామాన్యముగ గ్రహింపవచ్చును. కావున వానిని గుఱించి మన మంత ప్రయాసము పొందనవసరము లేదు. కాని 'తుక్కా' యనునామ మట్లు కాదు. దీనినిర్వచనముం గూర్చి నా కిట్లు స్ఫురించినది. 'తుక్కా' యనుశబ్దము 'దుర్గా' 'దుగ్గ' యనుశబ్దములకు రూపాంతరము. శాక్తేయమతసంప్రదాయుఁ డగు ప్రతాపరుద్ర గజపతిపుత్రి 'దుగ్గ' యని పిలువం బడుటయం దాశ్చర్య మేమి యుఁ నుండఁగూడదు. ఈ ప్రతాపరుద్రగజపతికి ప్రదుర్గావీరపుత్రయను బిరుదనామము గలదు. కాఁబట్టి యామెకుఁ బుట్టి నింటిపేరు దుర్గ యై యుండవలెను. శాక్తేయమతమునందుఁ బుట్టినయాకన్యను వైష్ణవమతము స్వీకరించిన కృష్ణరాయలు వివాహమాడెను, గావున, నామె పేరు వైష్ణవసంప్రదాయమున కానుగుణ్యముగ మార్పవలసియున్నది. కేవలము వైష్ణవనామ మిడుటకుఁ గృష్ణదేవరాయలకుఁ గాని తనశైవసంబంధిక నామము వీడుటకు నామెకుఁ గాని యిష్టముండక నిర్దేశితనామ మగు 'నన్నపూర్ణ'యను పేరున వ్యవహరింపఁబడిన దని తలంచుట యుక్తియుక్తముగ నున్నది.

కావున నీయావద్విషయములను యోజించినచో మనము చేయఁగలిగిన నిర్ధారణ మే మనఁగా శాసనాదికములలోను గ్రంథములలోను బ్రత్యేకముగఁ జేర్కొనఁబడిన కృష్ణదేవరాయలభార్యలు ముగ్గురని తెలియుచున్నది.

(1) చిన్నాదేవి:-భోగస్త్రీ.

(2) తిరుమలదేవి:-ఉమ్మత్తూరి గంగరాజుకుమారి.

(3) అన్నపూర్ణాదేవి:-ప్రతాపరుద్రగజపతి కూఁతురు.

కృష్ణదేవరాయల కిద్దఱుకుమారిక లుండిన ట్లగపడుచున్నది. ఒకకుమారికను 'ఆర్వీటి రామరాజునకును, (అళియరామరాజునకును) రెండవకుమారికను మట్ల వరదరాజునకును నిచ్చి వివాహము చేసెను. కృష్ణరాయలకుఁ బుత్రులు గలిగినను వారు చిన్నతనమునందే మృతినొందియుండవలెను. కావుననే యితని తరువాత నితని సవతిసోదరుఁడు ను నరసరాయనిమూఁడవభార్య పుత్రుఁడు నైన యచ్యుతదేవరాయలు సింహాసనమునకు వచ్చెను.

శ్రీకృష్ణదేవరాయల జీవితచరిత్రముం గూర్చియు నాతనిసామ్రాజ్య పరిపాలనా విధానముం గూర్చియు నెంత విస్తరించి వ్రాసిన నాంధ్రులకుం దనివితీఱని కౌతూహలము గలుగుచునే యుండు నని తెలిసియున్నను నావిషయ మంతయుం బ్రస్తుతాంశముగాదు కావున స్పృశింపమానితిని. ప్రకృతమున నేం జేయు ప్రసంగ మంతయు నాంధ్రవాఙ్మయవిషయకము. కావున నీసార్వభౌముం డాంధ్ర సరస్వతి కొసంగిన యమూల్యసేవం గూర్చిమాత్రము వక్కాణించెద.

శ్రీకృష్ణదేవరాయలు మహాయోధాగ్రేసరుండే గాక మహాపండితుండును గొప్పకవీశ్వరుండు నై యుండెను. ఈ మహారాజునకుం దనయాస్థాన పండితబృందము "సాహిత్యసమరాంగణసార్వభౌమ" యను నుత్తమ బిరుదము నొసంగినది. ఈవిధమయిన యుత్కృష్టస్తుతికి శ్రీకృష్ణదేవరాయ లెంతయుం దగినవాండె. తాను స్వయముగ నాంధ్రగీర్వాణములం గావ్యగ్రంథముల రచియించియు, గౌరవించియుం దనక్రింది సర్దారులచే నట్టిగ్రంథరచనను వెలయింపం జేసియు నిత్యాదివిధముల వాణీసేవ నొనరించెను.

శ్రీకృష్ణదేవరాయల యాస్థానమం దాస్థానకవీశ్వరుండును మనుచరిత్ర రచయితయు నైన 'అల్లసాని పెద్దనార్యుండు ను, బారిజాతాపహరణ గ్రంథకర్త యగు ముక్కు తిమ్మన్నయు రాజ శేఖరవిలాసకావ్యకర్త యగు మాదయ్యగారి మల్లన్నయుం గాళహస్తిమాహాత్మ్యము రచించిన ధూర్జటికవియు మున్నగు నాంధ్రమహాకవులును, వేంకటనాథ, స్వయంభూనాథ, ఏకామ్రనాథ, ఇత్యాది సంస్కృతమహాకవులు ను రాయల యాజ్ఞానుసారముగం గన్నడభారతమునుం బూర్తిం జేసి కర్ణాటకవికులసార్వభౌమ యనుబిరుదును సంపాదించిన మహాకవి తిమ్మణ్ణయుం గృష్ణదేవరాయల సింహాసనము నెక్కి కొలందికాలము సామ్రాజ్య వైభవ మనుభవించిన వ్యాసరాయరు ను మొద లగు కన్నడమహాకవులు ను, కుమారసరస్వతి జ్ఞానప్రకాశుండు హరిదాసు ప్రభృతు లగు నఱవమహాకవులు ను శ్రీకృష్ణదేవరాయల యభిమానసన్మానములకుం బాత్రులై యాతనియాస్థానము నలంకరించియుండిరి.

కృష్ణదేవరాయలు ప్రథమమున సంస్కృతభాషలోం గొన్ని ప్రబంధముల రచియించినట్లు తెలియవచ్చుచున్నది. *విజయవాడ సమీపమున నున్న శ్రీకాకుళక్షేత్రమందలి యాంధ్రమధుమథనుని సేవింపంబోయినప్పు డాయాంధ్రజలజాతుండు శ్రీకృష్ణదేవరాయలం జూచి యిట్లానతిచ్చె నంట.

---

*ప్రస్తుతము కృష్ణాతీరమందలి బెజవాడ.

సీ. పలికి తుత్పేక్షోపమల జాతి పెంపెక్క రసికు లౌనన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధిగాఁగఁ జెప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘుచ్చటలు విచ్చుగ రచించితి సూక్తినైపుణి జ్ఞానచింతామణికృతి
గీ. మఱియురసమంజరీముఖ్యమధురకావ్య, రచన మెప్పించుకొంటిగీర్వాణభాష
నంధ్రభాషయసాధ్యం బెయందున్నొక్క,కృతివినిర్మింపుమిఁకమాకుఁ బ్రియముగాఁగ.

(ఆముక్తమాల్యద)

దీనినిబట్టి చూడఁ గృష్ణదేవరాయ లీక్రిందఁ జేర్కొనిన గ్రంథములను సంస్కృతమున వ్రాసె నని తెలియవచ్చుచున్నది. 1. మదాలసచరిత్రము, 2. సత్యావధూప్రీణనము లేక సత్యభామాపరిణయము, 3 సకలకథాసారసంగ్రహము, 4.జ్ఞానచింతామణి, 5. రసమంజరి, 6. ఇంకఁ గొన్ని యితరగ్రంథములు. ఈగ్రంథములలో నిప్పటి కెవ్వియు లభింపలేదు. చెన్నపట్టణమునఁ బ్రాచ్యలిఖితపుస్తకాగారమునఁ గృష్ణదేవరాయలు రచియించిన దని జాంబవతీపరిణయమను సంస్కృతగ్రంథ మున్నది. పైనఁ జేర్కొనిన గ్రంథములు వ్రాసినకాలమున నీరాజకవి యాంధ్రమున నేగ్రంథమును రచించినట్లు కాన్పింపదు. ఆవిషయము పై పద్యములో విస్పష్టముగ నున్నది. ఆంధ్రవిష్ణుఁడే కవిపుంగవుని హెచ్చరించుచు నిన్నిసంస్కృతగ్రంథములు రచించినకవీంద్రునకు నాంధ్రమున నొకగ్రంథము వ్రాయుట కష్టముకాదు. కాఁబట్టి తన కొకయాంధ్రగ్రంథము ను వ్రాసి యి మ్మని యాజ్ఞాపించెను. కనుక నాంధ్రవిష్ణుని యాజ్ఞానుసారముగా వ్రాసినగ్రంథ మీకవియొక్క ప్రథమాంధ్రగ్రంథమే యనిస్పష్టము. ఆగ్రంథమే యీ 'ఆముక్తమాల్యద' లేక 'విష్ణుచిత్తీయము'.

సంతతసన్నద్ధసమరయానసంరంభములలోను, మాతంగతురంగస్యందన పదాతిసంకుల స్కంధావారసంఘట్టనములలోను, సర్వదా కాలముఁ గడపవలసివచ్చిన యీసమరాంగణసార్వభౌమునకు నేతద్గ్రంథరచన కె ట్లనుల్లంఘనీయప్రతిజ్ఞ చేయవలసివచ్చినదో యీరాజకవియే తనగ్రంథమందలి యవతారికభాగమున నుడివెను. ఈవాక్యము లేయాంధ్రుని డెందమున నద్భుతామోదకౌతుకము లుద్భవింపఁజేయఁజాలవు ?

" ము న్నే కళింగదేశవిజిగీషామనీషఁ దండెత్తి పోయి విజయవాటిం గొన్నివాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుం డగునాంధ్రమధుమథను సేవింపం

బోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్త్రిచతుర్థయామం బునఁ దదంధ్రజలజాక్షుఁడు దనకలలోఁ గాన్పించి యాంధ్రభాష నింకఁ గృతి విని ర్మింపు" మని యానతిచ్చెనఁట. అప్పు డీనరనాథకవి "ఎన్నిను గూర్తునన్న విను, మే మును దాల్చినమాల్య మిచ్చు నప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పు" మని యాంధ్రవల్లభుఁ డీభూవల్లభున కాజ్ఞ యొసంగెనఁట.

కావున నీగ్రంథముయొక్క యుత్పత్తి మహాద్భుత మయినది. ఆంధ్రవిజ యలక్ష్మి తనతమ్మికేలధరించిన కావ్యాంబుజమే యీగ్రంథము. కృష్ణరాయలు శాంతచిత్తుఁడుగా విజయనగరమం దంతఃపుర కామినీజనపరివృతుఁడై శృంగార కేళీవిలాసంబుల వినోదించుచుఁ దదీయాస్థానపండితకవిరాణ్మండిత సభాసీనజే గీయమానన్నృత్యగీతంబుల కుప్పొంగుచు నీగ్రంథరచనమున కుపక్రమించుట లేదు. ఆహవభూమిసాన్నిధ్యమున ఫిరంగిమ్రోఁతల గుండెయలజడులలో నీగ్రం థము ప్రారంభితమైనది! అట్టిమృతిజీవితసందిగ్ధసమయములే కదా మహామతుల లోకోత్తరకావ్యకరణచణత్వంబునకు సాధనత్వం బాపాదించుచున్నవి.

కావున నీగ్రంథము విజయనగరములోఁగాక విజయవాడలోఁ బ్రారం భించినాఁడు. గ్రంథరచనాకాలనిర్ణయము కొన్నిశిలాశాసనాదికసహాయముచేఁ జరిత్రకారు లిట్లు చేసి యున్నారు. దీనినిఁ గుఱించి మ. రా. రా. శ్రీ. కుం దుర్తి ఈశ్వరదత్తు B A. గా రీక్రిందవిషయము నాకుఁ దెలియఁజేసినారు. "ఆముక్తమాల్యద' పీఠికలో శ్రీకృష్ణదేవరాయలు తాను శ్రీకాకుళని కేతనుఁ డగునాంధ్రవిష్ణువును సేవింపఁబోయి హరివాసరోపవాస మచ్చటఁ గావించితి నని చెప్పుకొనెను. ఆకాలమున శ్రీరాయలవారు శ్రీకాకుళములో నాంధ్ర విష్ణువునకు నొకదానముచేసి శిలాశాసనము చెక్కించిరి. కావున నాశిలాశా సనసహాయమున శ్రీరాయలవారి శ్రీకాకుళతీర్థయాత్రకాలము నిర్ణయింపఁ బడినది. రాయలవారు బహుధాన్యనామసంవత్సర కుంభసంక్రమణకాలము నందు నాంధ్రవిష్ణువు నారాధించినట్లు విస్పష్టముగ నున్నది. ఈకుంభసంక్రమణ కాలము రాయలు చెప్పినహరివాసరముతోఁ గూడ సరిపోవుచున్నది. అనఁగా క్రీ. శ. 1519 సం॥ జనవరి 26 తేదీని రాత్రి సుమారు 50 గడియలకుఁ గుం భసంక్రమణపుణ్యకాలము. మఱునాఁడు కుంభసంక్రమణపుణ్యదినము. అనఁ గా-క్రీ. శ. 1519 సం॥ జనవరి 27 తేదీని రాయలవారు హరివాసరోపవాస ము గావించిరి. ఆదినము మాఘబహుళైకాదశి యైనది. కాఁబట్టి 27-1-1519

తేదీతో సరియైన మాఘబహుళైకాదశి నాఁడు శ్రీకృష్ణదేవరాయలవారు 'ఆముక్తమాల్యద' ప్రబంధరచనకుఁ గడంగిరి."

ఈప్రకారముగ నేతద్గ్రంథనిర్మాణకార్యము కృష్ణదేవరాయలచే నుద్యమింపఁబడిన స్థలము కాలము నితరసాంబంధికసందర్భములు మున్నగునవి సూక్ష్మాంశసహితముగ వర్ణింపఁబడినను నీకర్తృత్వవిషయము, వివాదాస్పదమై పండితావళిమానసంబులఁ గొంత కలఁత పుట్టించుచున్నది. ఈప్రబంధమును గృష్ణరాయలవారే రచించిరని కొందఱును, కాదు కా దల్లసాని పెద్దనగారు రచించిరని మఱికొందఱును వాదించుచున్నారు. ఈవాదప్రతివాదములకుఁ గారణము, ముఖ్యముగాఁ గ్రీడాభిరామకర్తృత్వవిషయమందువలెఁ గొందఱి లక్షణకవుల యుదాహృతిసూచనలు ను బండితసంప్రదాయప్రసంగములు ను మాత్రమ.

ఈచర్చను గూర్చి విపులముగ వ్రాయుటకు నా కిష్టము లేదు. కారణమేమనఁ, గృష్ణరాయలకర్తృత్వము నిరసింప నుద్దేశించిన పక్షమువారును నా చక్రవర్తి యాంధ్రదేశమునకు నాంధ్రభాషకు నొసంగిన చిరంతనస్మరణీయసపర్యను సాకల్యముగఁ జూచి యేతద్గ్రంథకర్తృత్వము నాతనినుండి తప్పించుటకు సాహసింపలేకున్నారు. కావున వారిపక్షము నవలంబించినవారి సంఖ్యయుఁ దక్కువే, వాదనసామగ్రియుఁ దక్కువే- తత్కారణమున నీవిషయమును గొలఁదిమాత్రముగ సూచించి విడిచెదను. ఈవివాదమును సంపూర్ణముగాఁ దెలిసికొనఁ దలఁచినవారు కీ. శే. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులువారు తమ "సంజీవనీ" వ్యాఖ్యసమేతముగ ముద్రింపించిన యాముక్తమాల్యదగ్రంథమునకు వారు రచించిన యపారపాండితీప్రకర్షితమైన పీఠికను జదివినఁ దెలిసికొనఁగలరు. ఈవిషయమును శాస్త్రులువారు బహుసమర్థతతోఁ జర్చించి వారియసన్నిగ్ధనిబద్ధాద్భుతవైదగ్ధ్య మల్లసాని పెద్దనగారిపక్షమునకు ములు మొన నాకర్షించుచున్నను, లోకాభిప్రాయమును మానవప్రకృతి విలక్షణజ్ఞానము ననుసరించి శ్రీకృష్ణరాయలపక్షమునఁ దుదకు నిలిచిరి. పూర్వాచారవితండవాదము ననుసరింపక కళాప్రపూర్ణులగు శ్రీశాస్త్రులవారు తమయమేయ ప్రాజ్ఞయవిజ్ఞానధారేయమును బూన్చికొని పండితచక్రవర్తిపక్షమునకుఁ బ్రబలసహాయము నొనరించినందులకు నాంధ్రులందఱుఁ గృతజ్ఞతాసక్తులయి యుండవలసినది.

ఈవాదమందలి ముఖ్యవిషయములు, 1 రాజు లేడ? కావ్యరచన యేడ?

రాజులును జక్రవర్తులును గ్రంధరచనకు సహజముగ నసమర్థ లనుమతము కొంతమంది విద్వాంసుల మనస్సులలో దాఁగియున్నది. కావున నట్టివారవనిపతులు కేవలము లక్ష్మీపూజకే గాని సరస్వతీపూజకుఁ జాలని వా రని నమ్ముచున్నారు. ప్రాయశః యుద్ధావనిలో నిరంతరముఁ బ్రయాసపడవలసిన పృథ్వీశులకు సారస్వతసేవావకాశ మాకాశకుసుమ మని వారి గట్టినమ్మకము.

ఈవిషయమునుగుఱించి ప్రపంచచరిత్రమును బరిశోధించి చూచి తరువాత భారతవర్ష చరిత్రమును గూడఁ బరికించెదము. మహావీరులు మహామహీభృతులు నెచ్చటనైనఁ గావ్యరచనాధురంధరు లగుట కూడఁ గాన్పించుచున్నదా! తరిచిచూతము.

గ్రీసుదేశమందలి మహాసేనానులలోఁ బ్రథమగణ్యుఁ డగుమహాఅలగ్జాండరు తనసమరయాత్రలలో నిత్యము గవులను బండితులను శాస్త్రజ్ఞులను వెంటఁ దీసికొని వారితో సారస్వతగోష్ఠిఁ జేయుచుండె నని చరిత్రకారులు చెప్పుచున్నారు. ఆరిస్టోటిల్ మహాశాస్త్రజ్ఞుని యెడల నామహామహుని కెట్టిగురుభక్తి యుండెనో యెల్లరకుఁ దెలిసినవిషయమే. అలగ్జాండరు చాలఁ జిన్నతనములో మరణించియుండుటచే నాతని దిగ్విజయఫలము దక్క సారస్వతగోష్ఠిఫలము లోకమున కిచ్చుటకవకాశము లేకపోయెను. తరువాత రోమనురాజ్యములో నలగ్జాండరుతో సమానుఁ డగుదిగ్విజేత యయిన సీజరుచక్రవర్తి యైరోపాఖండము నాసియాఖండములో సాఁబాలు జయించి పాలించుచుఁ "గామెంటరీలను (Commentaries) పేరువహించిన యుద్ధగ్రంథముల నెన్నింటినో రచించి తనదండయాత్రలను దాను జయించిన దేశప్రజల యాచారవ్యవహారభాషాదికములను విపులముగ నభివర్ణించి ప్రపంచమునకు మహోపకారము నొనరించెను. ఆగ్రంథరాజము లిప్పటికిని ల్యాటిన్ (Latin) భాషకు భూషణములుగా నున్నవి.

జర్మనీదేశపు చక్రవర్తి యయిన మహాఫ్రెడిరికు (Frederick the Great) తనరాజ్యము చుట్టు నున్న ప్రబలశత్రురాజులతో ననేకసంవత్సరములు విసువు విరామములు లేక పోరాడుచు నఖండవిజయలక్ష్మినిఁ జేకొని తనసామ్రాజ్యము నన్నివైపులకు విస్తరిల్లఁజేసి ప్రజాక్షేమము కొఱకు ననిశము పాటుపడుచున్నను వాగ్దేవికైంకర్యము విడువఁడయ్యెను. చిన్నతనమునుండియు ఫ్రెంచిభాషయం

దమితాదరణము గలిగి ఫ్రెంచికవివతంసుల స్నేహము సంపాదించి ముఖ్యముగ నానాఁటికవిసార్వభౌముఁ డగువాల్టేరుతోఁ సంతేవాససాహచర్యమున మెలంగి యనేకపద్యకావ్యములను నంతకంటె హెచ్చుగ గద్యకావ్యములను వ్రాసి, సాహిత్యసమరాంగణసార్వభౌముఁ డయ్యెను. తాను వ్రాసిన గ్రంథములను వాల్టేరుమహాకవికిఁ జూపి యాయనచే సరిపఱిపించుకొని ముద్రించుచుండెను.

ఇఁకఁ జక్రవర్తి నెపోలియన్‌ను గుఱించి విచారించెదము. సామాన్యకుటుంబములోఁ బుట్టి తనయతిమానుషప్రతిభచే మహాసామ్రాజ్యచక్రవర్తి యై భువనైకవీరాతిశయమునఁ దన్ను మాఱ్కొనిన యరాతిబృందమ్ముల నెల్లఁ దల క్రిందుఁజేసి మధ్యందినమార్తాండునివలెనే విజృంభించిన యీమహాక్షత్రాపశాలి ఫ్రెంచిభాషాయోషామణికిఁ గొన్ని స్వరచితగ్రంథోపాయనములను సమర్పించెను. చిన్నతనములో ననేకగ్రంథములఁ జదివి తత్సారమును సమయసముచితవ్యాసరూపమున రచించి వెల్లడిచేసి వార్ధక్యములోఁ దనయప్రతిమానానుభవమును గ్రంథరూపమున వ్రాసి తనమాతృదేశమున కొప్పగించెను ఇంతియకాక యీమహాధీరుఁడు కదనరంగమున వైరినికాయములతోఁ బోరాడుచుఁ జిత్రలేఖనముగూడఁ జేయుచుండెనఁట! అతను చిత్రించిన చిత్తరువులు కొన్ని పుస్తకరూపముగ నిటీవల దొరకినట్లు తెలియవచ్చుచున్నది.

ఇంక భారతభూమి యందలి భూధవుల విద్యాకృషి నరయుదము.

ఉత్తరహిందూస్థానమును దక్షిణహిందూస్థానములోఁ జాలభాగమును దనదిగ్విజయమున జయించి యశ్వమేధయాగము నొనరించిన సముద్రగుప్తుఁడు తాను బ్రచురించిన యలహాబాదుశాసనములో "తా ననేకకావ్యముల రచించినకతన కవిసార్వభౌముఁడయ్యె ననియుఁ దనకావ్యములు బీదలకు జీవనాధారము లయ్యె"ననియుఁ దెలియఁజేసెను.

కాన్యకుబ్జదేశాధీశ్వరుఁ డగుహర్షవర్ధనుఁడు 'రత్నావళీ నాగానంద నాటకములను రచించెను. ముంజభూపతి యగుభోజుఁడు శతాధికగ్రంథములను గీర్వాణభాషలో రచించి తనసాహిత్యమును బ్రదర్శించి సంగ్రామరంగమున నసువులఁ గోల్పోయెను.

హిందూదేశము జయించి ఢిల్లీసింహాసన మెక్కిన బాబర్‌ఫాదుషా పారశీకభాషలో ధారాళముగఁ గవిత్వముఁ జెప్పఁగలిగెను. తఱచుఁ దనగుఱ్ఱము మీఁద స్వారిచేయుచుఁ బద్యముల నాశువుగఁ బలుకుచుండెనఁట! తనజీవిత

చరిత్రముఁ దానే వ్రాసికొని యీవిషయముల నన్నిటినిఁ దానే వ్యక్తపఱిచెను. ఇంక మహాబుద్ధిశాలి యగునగ్బరుషాహును గూర్చి వేఱే చెప్పవలెనా? చేవ్రా లయినఁ జేయలేని యీచక్రవర్తి నిరంతరము పండితులగోష్ఠి నెలఁగుచు మతచర్చలను వినుచు ననేకశాస్త్రములయందును గళలయందును బ్రావీణ్యము నలవఱుచుకొని మహావిద్వాంసులను గూడఁ దనయుక్తిజ్ఞతచే డిందుపఱుచుచుండెను.

ఇట్లనేకులగు ప్రాచీనోత్తములు లక్ష్మీకటాక్షపాత్రులై సరస్వత్యుపాసనయందుఁ గూడఁ గాలము గడపుచుఁ దద్దేవీపూజార్హములగు కావ్యకుసుమముల నేర్పుతో నేర్చి కూర్చుచువచ్చిరి. ఈవిషయముఁ గూర్చి యింతవట్టు చెప్పుట కొకటియే కారణము. మనదేశమందు బుద్ధిశాలు లగుగీర్వాణాంధ్ర పండితులలోఁ గొందఱు భూమీశులలోఁ గూడఁ గవు లుందు రన్నఁ గను బొమ్మ లెత్తి పెదవి విఱిచి యీసడింతురు. వారికొఱ కీస్వల్పవిషయమును గూర్చి యింత విరివిగా వ్రాసితిని. చదువరులు క్షమింతురుగాక!

మఱి కృష్ణదేవరాయలతట్టు మరలుదము. కృష్ణదేవరాయల గ్రంథరచనావిషయముల గుఱించి యిదివఱలో వ్రాసినవిమర్శకు లొకగొప్పపొరపాటుఁ జేసియున్నారు. వా రెంతమట్టునకైనను గృష్ణరాయలరాజ్యకాలజీవితమును గూర్చియే యాలోచించుచువచ్చిరి. తత్పూర్వపుజీవితము గుఱించి సూక్ష్మపరిశీలనఁ గావింపరైరి.

శ్రీకృష్ణదేవరాయలు సుమారు ముప్పదియేండ్ల వయసు వచ్చినపుడు సింహాసన మెక్కెను. సింహాసనమునకు వచ్చినతరువాత నతనికి నిరంతరము శత్రువులతోఁ బోరాటములు గలిగినను దత్పూర్వ మాయనకు వలసినంతతీరుబడియు నవకాశము నుండినవి. సుమా రిరువదియైదేండ్ల వయస్సు వచ్చినవఱకుఁ దనతండ్రి యయిన నరసరాయలు జీవించియే యుండెను. తలిదండ్రులసంరక్షణలోను వారికంటె నెక్కువవాత్సల్యముఁ జూపుచుండిన మహామంత్రి తిమ్మరుసుయొక్క స్నేహపూర్వశిక్షణములో, నుండి కృష్ణదేవరాయలు చిన్ననాఁట నుండియు విద్యాబుద్ధు లామహామంత్రియొద్దనే విశ్వాసపూర్వకముగ నేర్చుకొనుచుండెను. ఆహేతువునఁ దిమ్మరుసును 'అప్పాజీ' యనఁగాఁ దండ్రి యని పిలుచుచుండెను. ఈకాలమున రాయ లసమాన మగుగీర్వాణాంధ్రసాహిత్యము సంపాదించుకొని యుండవలెను. కృష్ణదేవరాయల యావనదశను గుఱించి

న్యూనిజ్ మొదలగు చరిత్రకారులు తెల్పినవిషయములనుబట్టి చూడ రాయలవిద్యార్థిదశ యంతయు సంప్రీతికరముగ నుండెను. ఈవిషయమందును మఱి రాజ్యపరిపాలనావిషయమందును గృష్ణదేవరాయలు జర్మనుచక్రవర్తి యైనఫ్రెడరికును (Frederic the Great) నెంతయు సరిపోలియున్నాఁడు.

కృష్ణదేవరాయలకును, అల్లసాని పెద్దన్నకును, గలిగినప్రథమపరిచయమును, దదుపరి క్రమముగా వృద్ధినొందిన స్నేహమును రాయలు రాజ్యమునకు రాకపూర్వమే, యనఁగా, విద్యార్థిదశయందే జరిగియుండె నని యేఁ దలంచుచున్నాను. ఈప్రథమదశయందుఁ గృష్ణదేవరాయలు తనపేరు వహించియున్న మదాలసచరిత్రాది సంస్కృతగ్రంథములను వ్రాసియుండె నని నాయభిప్రాయము. ఈగ్రంథములను, పెద్దనయొద్దఁ గవితాభ్యాసము సేయుచున్నకాలములో రచించియుండుటచేఁ గొంతమంది పండితులు పెద్దన్నగారే రచించి రను ప　లోకమునకు వెల్లడించి యుందురు. జర్మనుచక్రవర్తి ఫ్రెడరిక్ విషయములోను నిట్టిలోకప్రవాదము పుట్టినట్లు కొంత చరిత్రదృష్టాంత మున్నది. ఏలయన, నాతఁడు రచించిన గ్రంథములను దొలుత నాతఁ డనమిత్త్రుఁడును గవిశిరోమణియు నగు వాల్టేరునకుఁ బరీక్షనిమిత్తము పంప నతఁడు సరిచూచి వానిని ముద్రించుచువచ్చెను. ఏతాదృశసారస్వతపరిశ్రమసంబంధమే కృష్ణరాయలకును బెద్దన్నకును గలిగియుండె నని నాయాశయము. ఈసంబంధము క్రమక్రమముగా వృద్ధినొంది పరస్పరగాఢానురాగమయ్యె నని సువిదితమే. కావునఁ గృష్ణదేవరాయలు రచియించిన వని చెప్పఁబడిన గీర్వాణగ్రంథములు నిక్కముగఁ గృష్ణరాయలే రచించియుండె ననియు వానిరచనయం దల్లసాని పెద్దన్నగారి సహాయము మిక్కుటముగఁ బొంది యుండె ననియు నానిశ్చితాభిప్రాయము.

మఱియొకవిశేషము-ఈప్రథమకవితాప్రయత్నము లగుమదాలసచరిత్రయు సత్యావధూప్రీణనము నను సంస్కృతకావ్యములను వ్రాసినపుడు కృష్ణదేవరాయలు కేవలము కవిత్వవిద్యార్థియై యుండవచ్చును; అనఁగాఁ గావ్యశక్తినిఁ గవితాసామగ్రిని మున్ముందు సేకరించుకొనుటయు, వివిధకావ్యధోరణుల నలవఱచుకొనుటయు నభ్యాసకుని లక్షణములు గానఁ గృష్ణదేవరాయలు తన ప్రథమకావ్యప్రయత్నములలో నాయారీతుల నభ్యసించినట్లు గాన్పించుచున్నది. లేనియెడల——

"సీ. పలికి తుత్ప్రేక్షోపమల జాతి పెంపెక్క రసికు లౌనన మదాలసచరిత్ర
　భావధ్వనివ్యంగ్యసేవధిగాఁగఁ జెప్పితివి సత్యావధూప్రీణనంబు"

అను నీపద్యములో నున్న వివిధకావ్యరీతిలక్షణములఁ బ్రత్యేకముగఁ జేర్కొనుటకుఁ గారణము గాన్పింపదు. అల్లసాని పెద్దన్నవంటి యారితేఱినకవి యొకగ్రంథము నొకవిధమైన కావ్యశైలికి నిదర్శనముగాను మఱియొకగ్రంథమును మఱియొకకావ్యశైలికి దృష్టాంతముగాను రచించి యుండునా? ఏగ్రంథమునైనను సర్వావయవపరిపుష్టియు సర్వాంగసౌందర్యమును గలుగునట్లు రచించును గాని యలంకారములకు నిధిగ నొకదానిని భావధ్వనివ్యంగ్యములకు సేవధిగ నొకదానిని రచించుట యస్వాభావికము, నసంగతము కావున నీసంస్కృతగ్రంథములు కృష్ణదేవరాయలే కవితాభ్యాసకదశయం దున్నపు డల్లసాని పెద్దనాదులశిక్షణమున రచించి యుండె నని మన మూహింపవచ్చును.

కొందఱు లక్షణకర్తలును వ్యాఖ్యాతలును గృష్ణదేవరాయలపేరున నున్నసంస్కృతగ్రంథములనే గాక యాతని యాంధ్ర గ్రంథ మగునాముక్తమాల్యదనుగూడ నల్లసాని పెద్దనయే రచించినట్లు నానుడి వెల్లడిచేసిరి.

1. కామునూర్యప్పకవి తనయప్పకవీయములో "నాంధ్రకవితాపితామహుఁడు 'కొనియె' ననుటకు 'కొనె' నని చెప్పె......విష్ణుచిత్తీయమునందు.

2 చ. ఉరు వగువిష్ణుచిత్తతనయోద్వహనంబును సంస్కృతాంధ్రవా
గ్గరిమ నలంక్రియారసస ఖం బగునట్టుగఁ బెద్దనార్యుఁడు
ధ్ధురఫణితిన్ రచించె. శ్రీనివాసవ్యాఖ్య.

3. గుడిపాటి వెంకటాద్రి:—

గీ. పేర్మి నల్లసాని పెద్దన్న యాముక్త, మాల్యదాఖ్యకృతి సమంచితముగఁ
జేసె నీవు టీక సేయుము చెఱకునఁ, బండుపండినట్లె యుండుఁగాక!

ఆముక్తమాల్యదయందు విస్పష్టముగ నాగ్రంథమును శ్రీకృష్ణరాయలు రచించిన ట్లున్నను బైనుదహరించిన వాక్యములఁబట్టి కొంతసందేహము కలుగుచున్నది. కావున నేతద్గ్రంథకర్తృత్వసమస్య నిస్సంశయముగఁ దీర్చుటకుఁ దగినబుజువును సంపాదింపవలసియున్నది. మనయదృష్టవశమున నవసర మగుసాధనసామగ్రి కావలసినంత యున్నది. అల్లసాని పెద్దన్న రచించిన యాంధ్రప్రబంధమగు మనుచరిత్ర కృష్ణదేవరాయలకే యంకితముచేయఁ బడినది. కృష్ణదేవరాయలపేర నొక సంస్కృతగ్రంథము గూడ లభ్యమగుచున్నది. వీని నన్నింటినిసరిచూచి తారతమ్యము లను నిరూపించిన నీసందేహము తప్పక నివృత్తికాఁ గలదని నానమ్మకము. (సశేషము)

# కావ్యలక్షణము.

అయలసోమయాజుల నరసింహశర్మగారు, పర్ణశాల. —

కావ్యమున కనేకు లనేకరీతుల లక్షణముల వ్రాసియున్నారు. అందు మొదటివాఁడు దండి. ఈతఁడు కాలముచేతనే మొదటివాఁడుగాక లక్షణరచనచేఁగూడ మొదటివాఁడే యననగును.

అందునకు ముందుగ నితరలాక్షణికుల లక్షణములఁ బరిశీలించి యీతని మతము విచారింతము.

"తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ క్వాపి" అని మమ్మటుఁడు.

ఇందు గుణాలంకారవర్జితములకుఁ గావ్యత్వవ్యపదేశము లేమింజేసియు దోషసహితములకుఁ గావ్యత్వవ్యపదేశము లోకమునఁ బ్రసిద్ధముగ నగపడుటం జేసియు నీలక్షణ మాలంకారికసమ్మతము కానేరదు. ఇట్లే:—

"అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యం" అను విద్యానాథ లక్షణముగూడ నాలంకారికసమయవిరుద్ధ మవుటఁజేసి గ్రాహ్యముగాదు.

ఇంకను నలంకారసర్వస్వకారాద్యాలంకారికుల మతములందలి దోషముల జగన్నాథపండితుఁడు నిరూపించియే యున్నాఁడు.

పండితాగ్రేసరుఁ డగుపండితుఁడుఁగూడఁ(జగన్నాథపండితుఁడు) దాను సరసముగ లక్షణము రచించితి నని గర్వించియు దోషయుక్తముగనే రచించి యున్నాఁడు. చూడుఁడు:—

"రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యం" రమణీయార్థ మన లోకోత్తరానందదాయకార్థము.

1. ఈతనిమతమున శబ్దముగదా కావ్యము. అట్లయిన శబ్దగతగుణదోషాదులనే నిరూపింపవలెను గాని యర్థగతగుణదోషములఁ గాని, యర్థశక్తిమూలధ్వన్యాదులఁ గాని నిరూపించుట యప్రసక్త మగును. పరంపరాసంబంధముచే నర్థము లోకోత్తరానందదాయి కాన నద్దాని వచియించె నన్నచోఁ దాదృశానందదాయకములగు దృశ్యకావ్యాంగము లగు లాస్యాంగములకుఁ గూడఁ గావ్యస్వరూపనిరూపణమున లక్షణము రచింపవలయును. అట్టు లేయాలంకారికులమతమునను గానరాదు. దృశ్యకావ్యమున శ్రవ్యకావ్యమున నర్థద్వారా వలె లాస్యాంగద్వారమున లోకోత్తరానందము గలుగుట యనుభవదూష్యము కాదు. అచ్చో నీతఁడు శబ్దము కావ్య మని యర్థనిరూపణముఁ జేసి లాస్యాంగముల నిరూపింపకుండుట పూర్వాపరసందర్భహీనతం జూపుచున్నది. అట్లు లాస్యాంగములఁ జూపిన నాలంకారికవిరుద్ధ మగును.

2. ఇంతియకాక కేవలశబ్దమే కావ్య మన్నఁ గానేరదు. శబ్దమునకు రమణీయార్థప్రతిపాదకత్వ మన్న లేదు. హరిః, కృష్ణః, రామః, శంభుః ఇట్టిపద ములవలన రమణీయార్థ మెట్లుపాదేయ మగును. ఆశబ్దముల కెట్లు కావ్యత్వ ము సంభవించును. తాదృశార్థప్రతిపత్తి వాక్యమునకుఁ గాని శబ్దమునకు లేదు.

3. మఱియుఁ గవిసంరంభము కేవల మొక్కిశబ్దమందే యనుట యను భవవిరుద్ధము. వ్యంగ్యార్థప్రతీతియందు కవిసంరంభ మచ్చో నున్న దనుట నిర్వి వాదాంశము. కవికర్మ కావ్యము గదా! అర్థమందుఁ గవిసంరంభ ముండ శబ్ద మే కావ్య మననగునా. కొన్నిపట్టుల వ్యంగ్యత్వమున శబ్దము సహకారి యగు నట్లె యర్థము సహకారియగును.

అట్టిపట్టుల నర్థమునకే ప్రాధాన్య మున్నయెడలఁ గవిసంరంభ మర్థమందే యున్న నద్దానికిఁ గావ్యత్వ మంగీకరింపకుండుట విచార్యము.

ఈరీతి నాలంకారికులు దండిప్రోక్తమగు లక్షణము విడిచి, కావ్యలక్షణ మును సరిగ నిరూపింపఁజాలరైరి.

దండి యెంతవిశదముగ నిరూపించియున్నాఁడో చూడుఁడు:—

"తైః శరీరశ్చ కావ్యానాం అలంకారాశ్చ దర్శితాః।
శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ.

ఇచ్చో నిష్టార్థ మన=లోకోత్తరానందజనకార్థము వివక్షితము.

అనఁగా, లోకోత్తరానందజనకార్థవ్యవచ్ఛిన్నా ఆకాంక్షసహితా పదా వళీ కావ్యం, అని లక్షణము.

ఇష్టార్థవ్యవచ్ఛిన్నా యనుటచే సిం దర్థగతిగుణాదులం జెప్పుట యప్ర సక్తకథనము కాఁజాలదు.

ఋకార్వాదులందు శబ్దార్థోభయవృత్తిచే భాష్యకర్త మొదలగువారలచే "ఋచః పఠంతి" అను మొదలగు స్థలములయందు లక్షణ నంగీకరించుటఁజేసి "కావ్యం పఠితం అర్థస్తు నజ్ఞాతః" అను స్థలమందు లక్షణ నంగీకరించి లోకోక్తు లఁ గుదుర్చుట శాస్త్రదూష్యము కాఁజాలదు.

ఈపక్షమున గుణాలంకారవర్జితములకు దోషసహితములకుఁ గూడఁగా వ్యత్వము సిద్ధించుచునే యున్నది. లోకోత్తరానందజనకత్వము లేమింజేసి "పుత్రోజాతః మృత శ్శత్రుః" అను మొదలగు నవి కావ్యములు కాఁజాలవు.

కాన నేరీతి నాలోచించినను దండికృత మగుకావ్యలక్షణమే నిర్దోష ముగ నున్న దనవలయును.

---

# కొన్నివృత్తములు : తన్నతభేదములు

— దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు, కొవ్వూరు. —

---

వాఙ్మయము వేదకాలమునుండియు గద్యాత్మకముగను బద్యాత్మకముగను విరాజిల్లుచుంట సర్వలోకవిదితము. దాన నొకశాఖగా నుండి చిరకాలమునుండియు వాడఁబడుచు గద్యపద్యాత్మకముగఁ బెంపొందుచున్నది యాంధ్రభాష. ఇయ్యది పద్యాత్మకముగా వాడుకలోనికి రాకమున్న కొన్నిరకములగు దరువులవలెను జిన్నచిన్న గేయములవలెను దాళానుగుణముగఁ బాడుకొనఁబడుచు నుండెడి దని విమర్శకులు తెలిపియే యుండిరి. రాను రాను గద్యమునకన్నఁ బద్యమున శ్రుతిసుఖము హెచ్చుగ నుండుటచేఁ గొన్నివిధము లగు నియమములచేఁ గొన్ని పద్యములు బయలుదేఱినవి. ఇయ్యవి గానార్హము లై హృదయరంజకముగ నుండుటచే జనుల కత్యంతప్రేమపాత్రము లై ప్రబంధరూపములుగను దృశ్యకావ్యరూపములుగను నభివృద్ధి నందినవి. అట్టికావ్యముల నుండువృత్తములు బహువిధము లై నడకలు గలిగి నామాంతరముల నందినవి. వానినామముల ననుసరించి యీవృత్తమున కిన్నిపాదము లనియుఁ బాదమున కిన్నియక్షరము లనియుఁ గూడ నేర్పఱుపఁబడినవి. ఆయానియమ ప్రకారము కూర్చుటలో నడక చెడిపోకుండునట్లను, సుకరముగ నావృత్తముల వ్రాసికొనఁగోరువా రీనియమానుసారముగా నడువవలె ననియుఁ గొన్ని గణము లేర్పడినవి. గణ మనఁగాఁ గొన్ని గురులఘువుల సమూహము. ఈ యవి యక్షరముల నాశ్రయించి యుండును వీనినే "హ్రస్వం లఘు, సంయోగే గురు, దీర్ఘంచ" అని పాణిని మొదలగువారు చెప్పియున్నారు. ఇట్టిగురులఘువులతోఁ గూడినగణములయొక్క నడక నాశ్రయించిన కూర్పే వృత్త మనఁబడును. ఈవృత్తపాదమున కెన్నియక్షరము లుండునో యది యన్నవఛంద మని కూడ మనవారు పేరు పెట్టిరి. ఆఛందము లిరువదియాఱు అని లక్షణకర్తలు విభజించియున్నారు- ఈఛందములఁ బుట్టినవృత్తసంఖ్య కొన్నికోట్లతరబడి కలదు. ఈఛందములలోఁ జేరినవియే సమవృత్తము లనియు నీఛందముల దాఁటినవి విషమవృత్తము లనియు వీనవిభాగము. ఇట్టివృత్తములలో ననేకవిధము లగు వర్ణావృత్తులు రానురాను బయలుదేఱినవి. అట్టియావృత్తిలో ననిర్వాచ్యమైన సుఖము శ్రవణమునకు గలుగు నని మనపూర్వులు తలఁచి యుండుటచే

నిట్టియావృత్తి చేయవలయు ననునొకనియమము కొంతకాలమునకు బయలు దేఱినది. మఱి కొంత నాగరికకాలము రాను శ్రుతిసుఖార్థము నిలుపువర్ణసం తంతి నియమబద్ధమై తప్పక యాయావృత్తములఁ బరిగణింపఁబడుచు శాసనమై నది. ఈశాసనము లనేకరీతు లగునామములతో లక్షణగ్రంథముల నుదయిం పఁజేసినవి. అట్లగుచు మఱికొంతబలమును సంపాదించినవై యట్టినియమముల దాఁటరా దనియుఁ బద్యకవితల నల్లువా రంద ఱీనియమములనే పాటింపవలె ననియు నట్లుచేయక పుస్తకముల వ్రాసిన నట్టికృతి నందినవారికి గొప్పగొప్ప కష్టములు వాటిల్లు ననియు నట్టి గ్రంథము కుగ్రంథమగు ననియుఁ గవి కుకవి యనిపించుకొను ననియుఁ జాటినవి. నాఁటినుండియు భాషాసాంప్రదాయము మాఱుటతప్ప పూర్వనియమములు నిలిచియే యున్నవి. కాని రానురాను గొన్నిబిగింపులు సడలినవి. భీమన పదియతులనే చెప్ప నప్పకవి నలువది యొక్కయతిని, మఱికొంద ఱిరువదియొక్కయతులను చెప్పియున్నారు వారిలో వారే యఖండాదియతులవిషయమునఁ బూర్వమతముల ఖండించుచు స్వమత ధ్వజముల నాటియుండిరి. ఇట్లే వృత్తములలోఁ గూడ లక్షణకర్తలు కొన్నిభా వభేదముల నంది యున్నారు. ప్రకృతమున నావృత్తములఁగూర్చి కొన్నియు స్పష్టవిషయములను వారివారిమతభేదములను నీక్రిందఁ బొందుపఱుతును.

1. జలదరవవృత్తము:—"ననననననలువనలనొడఁబడినయవినయవిధివినుము రే
చన మనుయతిని నిలుపఁగ మహిని జలదరవమగుగురుపుతోన్."

పైవృత్తమున రెండుపాదము లని గ్రహింపవలెను. లక్షణము లక్ష్యము గూడ నదియే. దీనిలో యతిస్థానము "మనువు" అనఁగాఁ, బదునాలుగక్షర ములు దాఁటినవెనుక నని చెప్పఁబడినది. ఇయ్యది యప్పకవీయమున "ధర ణీధరగతి" అను నామాంతరము నంది యీలక్షణముగనే యున్నది. యతులు మాత్రము పాదమునకు రెండేసి గలవు. ఎనిమిదియక్షరముల తరువాత నొక యతియుఁ, బదునాలుగక్షరములు దాఁటినవెనుక నొకయతియు నున్నది. కవి జనాశ్రయమునఁ బాదమున కొక్కయతియే నిలుపఁబడినది. తక్కినలక్షణము లన్నియు సమములు .........

2. మానిని:—కారకముల్ క్రియ గన్గొన నేడుభకారము లొక్కగకారముతో
గారవమై చనఁగా యతిపంద్రెటఁగల్గినమానిని

పైపద్యపాదమునకుఁ మూఁడుస్థానముల యతి కనుపించు చున్నది,

గాని, "పంక్తిట" అని స్పష్టముగాఁ బాదమున క్ష్మాక్షయతియే యని కవి చెప్పి నాఁడు. ఈవిషయ మప్పకవీయమున స్పష్ట మగును. అనఁగా నందు పాదమున విచ్ఛేదత్రయము గానుపింపలేదు. ఇఁక ఛందోదర్పణమున నేతద్భిన్న మార్గ మంగీకరింపఁబడినది చూడుఁడు.

"..............అద్రిభసేవ్యగురున్విలసిల్లురసత్రయచిత్రయతుల్
వన్నుగ నొందత్రిభాసురవిక్రమభంగిగమానిని........"

పై పద్యమున "రసత్రయ" అనుశబ్దముచే షట్క్రమములు గాన నాఱక్షరముల వ్యవధానముగా మూఁడుయతు లని కవి స్పష్టపఱచినాఁడు. ఆశబ్దముచే పదునెనిమిది యగుటకు వీలులేదు, "చిత్రయతుల్" అని బహువచన మున్నది గాన-ఉదాహరణను, చూడుఁడు.

"వన్నె యొనర్చిన, వాహినియాతని, వామపదంబున, వాలెననన్" ఇట్లే నాలుగుపాదములందును నాఱక్షరములు వ్యవధానముగా యతిత్రయము నిలుపఁబడినది. తక్కినవిషయములలో లక్షణకర్తల కైక్యము లేకపోలేదు. పదునెనిమిదియక్షరములు దాఁటిన వెనుక యతియన్నను నితరులకన్న భిన్నమే.

3. లయగ్రాహి:—

ఇంబడరఁగా భజసనంబులకడన్ భజసనఁబులుభకారమునొడంబడలయగ్రా
హింబరఁగఁజెప్పకలశంబిడినయట్లయగణంబుకృతిచిూఁదనమరుంబరహితార్థీ.

పై పద్యమున గణములు తప్ప మఱేవిషయము చెప్పఁబడియుండలేదు. వృత్తమునకువలెఁ బ్రాసకనఁబడుచున్నది. ప్రాసయతులే తత్తత్ స్థానములనిలుపఁబడినవి, కాని, యవెన్నిచోట్లల నిలుపవలెనో తెలియదు, పాదమునకు మూఁడుచోట్లల కనఁబడుచున్నవి. అనంతునిఛందమున "ఏకోనచత్వారింశన్మాత్రాగర్భితంబు త్రింశదక్షరంబులైన లయగ్రాహి యగు" నని మాటలతోఁ జెప్పఁబడినది. లక్షణమున యతులవిషయము కవిజనాశ్రయమునే యనుకరించుచున్నది. "ప్రాసముల్ గ్రందుకొని" యనుటవలన వృత్తప్రాసములు ప్రాసయతులుంగూడ గ్రహింపవచ్చును. అప్పకవీయమున నగమ్యము లన్నియు వాచ్యములైనవి, గాన, దాని ప్రకారము చూచుకొనినఁ బైవన్నియు సరిగనుండును........

4. లయవిభాతి:—పైవృత్తవిషయమున నందఱును నేకీభవించియే యుండిరి. అప్పకవీయము ననుసరించి మూడ నాల్గుయతులు పాదాంత మగువఱకు నిలుపవలె నని తేలుచున్నది. కాని యప్పకవి లక్షణపద్యమును గొంత

దిద్దవలసియున్నది. "ననసద్వయము వెనుక ననగంబులను నిలిపి" అని యు న్నది. ఇది కేవలము లక్ష్యవిరుద్ధము. ద్వయ మనుచోట త్రయ మని యుండ వలెను. ఇయ్యది యచ్చుతప్పో పరిశీలనకర్తలలోటో యయియుండవలెను గాని అన్యథా కాదు.

5. త్రిభంగి:—ఈవృత్తవిషమై భిన్నాభిప్రాయము లున్నవి. కవిజనాశ్ర యకర్త నాలుగునగణములును రెండుసగణములపై భమసగంబు పాదమునకుఁగలిగి యీావృత్త ముండు నని చెప్పెను. మఱియు "వడి దప్పక ప్రాసము లొప్పఁగ" అని యతి లేదనికూడఁ జెప్పియున్నాఁడు. అనంతునిఛందమున నాలుగునగణము లును ననసమసగలనుగణములు పాదమునకు లక్షణ మని చెప్పఁబడినది. ఇత రవిషయము లేమియుఁ జెప్పఁబడియుండలేదు. లక్ష్యదృష్టిని జూడ మొదటి రెండుపాదముల రెండుప్రాసయతు లున్నవి. మూఁడునాల్గుపాదముల మూఁడేసి ప్రాసయతు లగపడుచున్నవి. ప్రాసము కలదు. ఈలక్షణమును గవిజనాశ్రయ లక్షణమును జూడ నేమియు సంబంధ మున్నట్లగుపడదు. ఇఁక, అప్పకవీయ మును జూచిన, ఆఱునగణములును రెండుసగణములును భమసగములు పాద మునకు లక్షణ మన్నట్లు తెలియుచున్నది. కాని పద్యమునందు నగణము లా ఱును ససభసగములును బాదమునకు లక్షణ మని చెప్పఁబడినది. ఇది లక్ష్య విరుద్ధము. ససభమసగలని దిద్దిన విరోధ ముండదు. తక్కినవిషయముల నియ్యది యస్పష్టముగ నున్నది. రెండుపద్యము లుపయోగించి లక్షణము చెప్పినను నీతఁడు స్పష్టముగా నియమింపలేకపోయినాఁడు. "షడ్యతిసంగిన్" అని పద్య మునఁ జెప్పినపదమునకు సరియగు నర్థము గనఁబడదు. ప్రాస కలదు. పాద మునకు రెండుప్రాస యతులైన ట్లగపడుచున్నది. కవిజనాశ్రయమున "వడి దప్పన్" అనెడినియమము దీనిచే బాధింపఁబడెను. ఎనిమిదింట యతిస్థానము- అక్షరములలెక్కనుబట్టి యప్పకవిది నీతనిది నొకఛందముననే పుట్టిన వని మాత్ర ము చెప్పవచ్చును. కవిజనాశ్రయుని త్రిభంగి త్రిభంగిగానే యున్నది. ఇయ్యది విజాతీయమై నామమాత్రసాదృశ్యముగా నున్నది .........

6. విషమసీసము:—ఇయ్యది కవిజనాశ్రయమున నుత్సాహావృత్తము క్రింద గీతిగాని యాటవెలఁదిగాని రచించిన పైవృత్త మగు నని లక్షణము చె ప్పఁబడలేదు. ఈయర్థము స్పష్టముగా లక్షణమునుండి వచ్చుటలేదు. గీతి విష

యము పద్యమున లేనే లేదు. దీని నవ్యలక్షణకర్తలమార్గ మారసి కొందఱు చిన్నమార్పు చేసిరి.

"ఉత్సాహ మయ్యె నిదియు నుం బ్రశస్తముగ నొనర్పఁగన్" అనెడిచోట, ఉత్సాహమయ్యె గీతియును బ్రశస్తముగ నొనర్పఁగన్" అనిదిద్దినారు. అప్పుడు గీతివిషయము స్పష్టపడును. అనంతుఁ డీక్రిందిగీతిలో వృత్తమునకువలెఁ బ్రాస గూడ నుండవలె నని చెప్పియున్నాఁడు. చూడుఁడు.

"ప్రాసములును వడులు భాసురంబుగ నిల్పి లలితముగ నాటవెలఁదియందు
నుత్సుకత నొనర్చి యుత్సాహమది నిల్ప విషమసీస మమరు… … …"

చెప్పుటయే గాని తాను జేసి యుండలేదు. మఱియుఁ గవిజనాశ్రయమున నుత్సాహతుదను గీతి యే యుండవలయు నని తేలుచున్నది. అచ్చటచ్చట నీతఁ డాటవెలఁదికిని గీతికిని యభేదము కల్పించి యున్నాఁడు. అనంతుఁడు గూడ నన్నిసీసలక్షణములకుఁ గ్లుప్తముగా నొకపద్యమునఁ జెప్పుచు, ఉత్సాహ తుదను గీతి పరఁగ విషమసీసం బగు భానుతేజ"అని చెప్పుట పైవిధిని బలపఱుచుచు నేయున్నది. కవిజనాశ్రయుని సర్వసీసలక్షణపద్యమున విషమసీసమునకు "తుదనుగీతి పరఁగవిషమసీసం బగు భానుతేజ" అని లక్షణము చెప్పెను. దేనితుదనో చెప్పకపోవుటచే,

"అది యె సమసీస ముత్సాహ తుదను గీతి, పరఁగవిషమసీసం బగు… … …" అని దిద్దిరి. అప్పకవి యీవిషయమును స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. గీతమందు ప్రాస యనవసర మని లక్ష్యమునుబట్టి తేలుచున్నది. ఈవిషయమున ననంతుఁడే మార్గాంతరస్థుఁ డైనాఁడు.

7. వడిసీసము:—కవిజనాశ్రయమున "మున్నెకొన్న యతీ పాదమం దెల్ల నడరిన వడిసీసమనఁగఁ బరఁగు" అని లక్షణము చెప్పఁబడినది. లక్ష్యముగూడ లక్షణవిరోధముగ లేదు. అనంతుఁడు గూడ నీమతముననే చేరినాఁడు. అప్పకవి మాత్రము "ఆది నేవడి నిల్పి రావడే పదమెల్లఁ జేయనయ్యది వడిసీస మయ్యె" అని లక్షణమును జెప్పి లక్ష్యము తద్భిన్నముగా నిచ్చినాఁడు. చూడుఁడు:—

"విజయసారథిఁగాని, వినుతింపఁగానొల్ల, గిరినాయకునిగాని, కీరిసేయ"

పైపాదాదిని ప్రాణియతి నిలిపి రెండవయర్థమందు వర్గయతి నిలుపఁబడినది. మూఁడవపాదము మాత్రము స్పష్టముగా నున్నది.

'పద్మనాభునిగాని, పాటింపఁ గానొల్లఁ, బాలిసపతిఁగాని, ప్రస్తుతింప"

ఈపాదమున నభిన్న మగు వర్గయతి నిలుపఁబడినది. దీనినిబట్టి చూడ లక్షణమందలి పదశబ్దాభిప్రాయ మెంతవఱకు సార్థకమో తెలియకున్నది. సీస పాదార్ధమే పద మని తాను గ్రహించినట్లు తేలుచున్నది. అట్లు చెప్పుట యనవసరము. అట్టి ఖండమందు నిలుపవలసిన యతి యొక్కటే గాన నిట్టివిషయము న నన్యోన్యము భేదము కనుపించుచున్నది.

8. ప్రాససీసము:—కవిజనాశ్రయంబున నిద్దానిలక్షణ మిట్లున్నది.

"వృత్తంబునకువలె వెలయ నాల్గడుగుల వెసఁ బ్రాసములు నిల్పి
విరతు లునుప ............... ప్రాససీసంబగు"

ఈపాదచతుష్టయద్వితీయాతుల్యహల్త్వము గీతియందుఁ గూడఁ బొడకట్టుచున్నది. ఇచ్చట, అనంతుసిమతమున గీతమందు ప్రాసనియమ మగపడదు. ఈతనిలక్షణమునఁగూడ గీతివిషయమునే చెప్పియుండలేదు. ఈనియమము ననుసరించియే కొందఱుప్రాససీసలక్షణమునందే కలిపి యక్కిలిప్రాససీసమునకు లక్షణము నుభయలక్ష్యభూతిదృష్టితోఁ జెప్పిన కవిజనాశ్రయుని పద్యమును గొంచెము సవరించిరి. "దీనిపశ్చిమార్ధంబున ప్రాసంబు వేఱొక్క ప్రాస మైన" అను చోట దీని, అనుదానిని తీసివైచి గీతి అని నిలిపిరి. అప్పు డర్థము గీతిన్=గీతి యందునను, పశ్చిమార్ధంబునన్=ప్రాససీసపాదద్వితీయభాగమునను, వేఱొక్క ప్రాసమైనన్=ప్రాససీసమం దేప్రాసనిలుపఁబడెనో తదభిన్నమై తదధికమైన మతియొకప్రాసమును నిలుపఁగా నని చెప్పుకొనవలెను. ఇట్లు చెప్పుకొన్నచో, ప్రాసాక్కిలిప్రాససీసములలో ననంతుఁడును సీతఁడును సఖ్యపడుదురు. అప్పుడు కవిజనాశ్రయమందలి పద్యలక్షణమున గీతియందలి ప్రాసనియమమును నాల్గవ సీసపాదఖండద్వయమందలి ప్రాసనియమమును నక్కిలిప్రాససీసమున కుదాహరణములు గాని ప్రాససీసమున కుదాహరణములు గావని గ్రహింపవలెను.

కవిజనాశ్రయునికన్న విశేషముగ వృత్తప్రాస, సర్వతఃప్రాస లనుసీసద్వయములను, అప్పకవి యనంతులు చెప్పినారు. అందప్పకవీయమున "ప్రాసమూరంపులఁ 'బదిలంబుగానిల్ప, నక్కిలిప్రాససీ సాఖ్యమగును' అని లక్షణము చెప్పఁబడినది. వృత్తప్రాససీసమునకే పూర్వముద్రణప్రతిలో నక్కిలిప్రాససీస మనుపే రుండెడి దని యాపేజీలోఁ గ్రిందిభాగమున వ్రాయఁబడియున్నది. అట్లైన నియ్యది పైలక్షణకర్తలతో భిన్న మగుచున్నది. గీతపాదచతుష్టయమందును ప్రాసనిలుపవలె నని వారిరువురమతము. గీతప్రథమచతుర్థపాదము

లలో నే యీనియమ మున్నఁజాలు నని యప్పకవిమతము. ఎట్లైనను భేదము తప్పలేదు. అనంతుఁడు గూడ నీవృత్తప్రాసనియమును జెప్పెను గాన నప్పకవీయమందలి నాయమును మార్చక మాతమన్న నంతుఁడు గీతిలో నేపాదమందునను గూడఁ బ్రాస కావలె నని చెప్పియుండ లేదు. లక్ష్యమునఁ గూడ లేదు. కాన నీవిషయముల భీమనరంగరాజులే కలసిరి గాని యప్పకవిమతము వేఱైనది. సర్వతఃప్రాసనియమున నిద్దఱు నేకీభవించిరి. ఇయ్యది కవిజనాశ్రయమందలి ప్రాసనియమం దంతర్భవింపదు. దీన, పాదచతుష్టయమందునను వృత్తమునకువలెఁ బ్రాస నిలుపవలెను. సర్వతఃప్రాసమునఁ బ్రాసయు యతిస్థానమునఁ బ్రాసయతులును నయి యుండవలెను.........

9. త్రిపద :—ఇయ్యది మూఁడుపాదములతో నున్నది గాన నా నామము నందినది. దీనికిఁ బ్రాస మున్నది. యతి లేనట్లున్నది. ఈవిషయ మప్పకవి చెప్పినాఁడు. "వళిలేక నలరారుఁ ద్రిపద" యని, కాని ప్రథమపాదమధ్యమున యతిస్థానమందువలె గుర్తునిలుపఁబడినది. అయ్యది యచ్చుతప్పయి యుండనోపును. లక్షణకర్తలు సందేహముగాఁ బద్యముల వ్రాయుట యిట్టిప్రమాదములఁ గలిగించుట సహజమే. మఱియు నది పాదచతుష్టయభ్రమ కలుగఁ జేయుచున్నది. ఈ ప్రథమపాదయతివిషయమున నప్పకవీయముననే గాక తక్కిన వారిగ్రంథములఁగూడ నిట్టిభ్రాంతియే కనఁబడుచున్నది చూడుఁడు.

కవిజనాశ్రయము :—త్రిదశేంద్రులాఱగు । పదియగు నెడనకుఁ.

ఛందోదర్పణము :—సరవిఁబ్రాసమునంది । సురపతుల్ నలువురు.

అప్పకవీయము :—తొలుతను నల్వు రిం । ద్రులు రెంటమూటను.

పై వారు యతివిషయమును గూర్చి చెప్పకున్నను గూడ దని చెప్పిన యప్పకవిగూడ నిట్టిసందేహమునకుఁ దావులేకుండ వ్రాయలేకపోయినాఁడా? కాదు. ఇది కేవలము మనస్సంకోచమే. కవిజనాశ్రయమున యతియున్నదా? లేదా? అను నిర్ధారణ లేక యతి కనుపించుచుండుటచే ననంతుఁడుఁగూడ గోడపైపిల్లివాటముగ నెట్లనుకొన్నను బాధకలుగ దని సందిగ్ధముగాఁ జెప్పి యున్నాఁడు. మఱియొకసంగతి. కవిజనాశ్రయుని లక్షణలక్ష్యములకు విరోధమున్నది. దానికి సరియగునర్థము కుదురకున్నది. పై వారిలక్షణమైన నావృత్తము నకుఁ బట్టలేదు. అందువలనఁ దప్పనుటకువీలు లేదు. ఏమందురా? అయ్యది.

"బిసరుహోద్భవగణం బనదశస్థానదొళ్

బిసరుహానేత్రే గణమెఱఁగుళ్లిదవు
బిసరుహానేత్రే త్రిపదిగే''

అనెడి కన్నడలక్షణమునకు సరిపడి యున్నదని క్రింద వ్రాయఁబడినది. పైపద్య ప్రథమపాదమందుఁ గూడ యతి కల దనియే సూచించుచున్నది, గాని, యాభేదముల నేది నిశ్చయమో ప్రమాణగ్రంథలక్ష్యము దొరకువఱకును నిర్ణయింపఁజాలము. ఈపై వారిలక్షణమునకుఁ గవిజనాశ్రయునిలక్షణపద్యముల సరిపుచ్చవలెనన్న రెండవపాదమును-

''గదియరెండిటను మూఁడిటను'' అని సరిచేసిన భేదమువాటిల్లక గణములు మాత్రము సరిపడును.........

10. చౌపద:—దీనిలక్షణ మన్నిటియందునను సమముగానేయున్నది. అనంతుఁడు మాత్రము పాదాంతమందు లఘువునే నిలిపినాఁడు. తక్కినవారి లక్ష్యముల గురువున్నది.........

11. షట్పద :— ఇయ్యది రంగరాట్ఛందమున స్పష్టముగా నున్నది. ఆఱుపాదములచే నుండుట యిద్దానికి సార్థకనామము. ఆఱింద్రగణములు నొక చంద్రగణమును పాదత్రయ మగు నని దీనిలక్షణము. ప్రాస గలదు. వడి లేదు. చంద్రగణము మూఁడాఱుపాదములనే యుండును. కవిజనాశ్రయమున నీ యర్థమే చెప్పఁబడెను గాని పద్యము ప్రభ్రష్టమైనది. ముద్రణ పాదవిభాగము గా లేదు. ప్రాసము కొన్నిపట్టులఁబోయినది. గణములకూర్పు పో లేదు. దానిని

"త్రిదశేంద్ర గణములు
కుదురనిర్మాడిడి
కదియనంత్యంబునఁ జంద్రుఁగూర్చి
తుది యిట్లుగాకూర్ప
నడి యతిలేక ష
ట్పద మగు మల్లియరేచనాఖ్య''

ఈరీతిగా సవరించిన లక్ష్యలక్షణసమన్వయముగా నుండును. ఇంక నప్ప కవీయమున నీలక్షణ మంతయు సరియగురీతినే యున్నది గాని లక్ష్యపద్యమున "పాద మిూనూటితో నాల్గుఁజేసిన" అని యున్నది. ఈనాల్గు అనుదాని కర్థ మున్నట్లు లగపడదు. కొంచెము మార్చిన సరిపడును, గాన, దీనిమైదాఱు పాదముల

"భాసిల్లమూఁడగు, నీసూటిరెట్టించి"
అను చిన్నమార్పుఁ జేయవలెను............

ఇట్లు లక్షణకర్తలలో ననేకభేదము లనేకస్థలములఁ గనఁబడుచున్నవి. ఇంకను గొన్నివృత్తములలోఁగూడ నున్నవి. గ్రంథవిస్తరభీతిని ముగించితి. ఈ యిక్కట్లు సామాన్యముగాఁబూర్వలక్షణముల దిద్దుటవలన వచ్చుచున్నవి. రాను రాను మూఁడునాల్గుశతాబ్దములనాఁటికిఁ గవి తన గ్రంథమునఁ బ్రయోగించిన పదములు నశించి, అధికపాఠమయము లగుచున్నవి. ఇట్లే కొంతకాలమునకు నిరర్థకములు గూడ నగుచున్నవి. ఈదిద్దులు పూర్వమునుండియు వచ్చుచునే యున్నవి. నూతనముగ వ్యాకరణ మొకటి వ్రాయవలెనన్నపండితుఁడు కొన్ని ప్రయోగములఁ బ్రమాణగ్రంథముల మార్పుచేసి యిట్టివిశేషములు తత్పూర్వులు చెప్పియుండలేదని నేనే క్రొత్తగాఁ బరిశీలించితి ననియుఁ గూడఁ జెప్పుట మనము ప్రౌఢవ్యాకరణాదులలోఁ జూచుచునే యున్నాము. ముఖ్యముగా నతి కష్టతరములగు నిట్టిపెద్దవిషయముల నొకపద్యమున నిమిడింపవలె నన్న నస్పష్టత లెక్కువగానే యుండును; గాని యేకచ్ఛందోజాతములై నామసాదృశ్యమును గూడ నందుచు వానివానినియమములలోను గణములలోను భేదము లక్షణకర్తలలోఁ గననగుట వింత. ఇయ్యది వారివారి స్వతంత్రములను దెలుపుచున్నవి, గాని, నియమప్రకార మనుసరించుట లేదు. ఇట్లు వృత్తములలోనే గాక యతులలోఁ, బ్రాసములలో మఱియు ననేకవిషయములలో నిట్టిమతభేదము లుంటచేతనే శాస్త్రము కఠినమై బహుమార్గములఁ ద్రొక్కుచున్న దనుట సర్వవిదిత మని విరమించుచున్నాను.

# సోమనాథస్తవము.

బండారు తమ్మయ్యగారు, కాకినాడ.

పయిపేరుగల చిన్నద్విపదకృతి యొకటి పాలకురికి సోమనాథకృత మని చిరకాలమునుండి వాడుకలో నున్నది. ఈ వాడుకి ననుసరించియే, ఆంధ్రపత్రిక దుందుభి సంవత్సరాదిసంచికలో, పాలకురికి సోమనాథునిఁ గూర్చి నేను వ్రాసినవ్యాసములో "సోమనాథస్తవ మని మఱియొకద్విపదస్తవము తెలుఁగుభాషలోనే యాకవివరుని దొకటి గలదు" అని వ్రాసితిని. ఆంధ్రగ్రంథమాలలోఁ బ్రకటితమయిన బసవపురాణము పీఠికలోఁ దద్గ్రంథపరిష్కర్త లగు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సోమనాథస్తవమును గూర్చి నేను వ్రాసినవ్రాఁత నిరాధార మని యీక్రింది వాక్యములు లిఖించిరి.

"అది యోరుఁగంటిలో ముదిగొండ శంకరారాధ్యులవారిచేఁ బరిష్కృత మై ముద్రిత మైన మోక్షోపాయ" మనుపుస్తకమునఁ గల సోమనాథ స్తవమే యగునేని దానికిఁ గర్త పాల్కురికి సోమనాథుఁ డనుట నిరాధారము. దాని ముగింపి ట్లున్నది. "భక్తుల సంగంబు, భక్తసన్నిధి-భక్తులపదసేవ, పదపడి చేయఁ। గరుణ నొసంగవే, కైలాసవాస, గురునాథ శ్రీపాలకురికి సోమేశ!" తద్రచనము సోమనాథునిరచనమువలె లేదు. తమ్మయ్యగారు పేర్కొనిన సోమనాథస్తవ మింకొకటి కల దేమో! సోమనాథుని గ్రంథములనెల్లఁ బరనపారనాది ప్రచారమునకుఁ దెచ్చినవాఁడు తచ్ఛిష్యపరంపరలోనివాఁడు నగు పిడుపర్తి బసవన్న* యాగ్రంథమును బేర్కొన లేదు."

పూర్వోక్త మయిననావ్యాసమును వ్రాయునప్పటికి నేను శ్రీశంకరారాధ్యులవారు ప్రకటించిన మోక్షోపాయ మనుగ్రంథమును జూచి యుండ లేదు.

---

* పద్యబసవపురాణమును బాలకురికి సోమనాథుని కంకితముగా రచించినవాఁడు పిడుపర్తి బసవకవిపుత్రుఁడు సోమనాథుఁ డని యాగ్రంథమువలనను నందలి గద్యమువలనను గాననగును. కాని శ్రీశాస్త్రిగారు తమవిపరీతపరిశోధనఫలితముగఁ దద్గ్రంథకర్త పిడుపర్తి బసవన గాని సోమనాథుఁడు కాఁడని వ్రాసినారు. అట్లే వీరశైవదీక్షాబోధకర్త పిడుపర్తి బసవన యని యాగ్రంథమువలనఁ దెలియుచుండఁగా సోమనాథుఁ డని వ్రాసిరి. తండ్రి కొడుకులఁ గూర్చి వీరొనర్చిన యీతబ్బిబ్బులు, తొట్రుపాటులు నప్రమాణము లని "పిడుపర్తికవులు" (సమదర్శిని ది 30-4-32) అను వ్యాసమున సప్రమాణముగ నిరూపించియుంటిని.

అప్పటికి నేఁ జూచిన సోమనాథస్తవము, ఏలూరు వాస్తవ్యులు శ్రీ కొండగుంటూరు నాగభూషణముగారు ప్రకటించిన యొకమిశ్రగ్రంథములోనిది. దానిలో నీసోమనాథస్తవమే గాక, కోటప్పరగడ, పంచప్రగణమాలిక మున్నగునవి ప్రకటింపఁబడినవి. అందులో సోమనాథస్తవము చివర "ఇది శ్రీపాల్కురికి సోమేశ్వరవిరచితము" అనికూడ ముద్రింపఁబడినది. దీనినిబట్టియు వీరశైవ ప్రపంచమునఁ బరంపరాగతముగ వచ్చుచున్న వినికిడినిబట్టియు నీకృతి పాలకురికి సోమనాథకృతమే యను విశ్వాసముతో నావ్యాసములో నే నట్లు వ్రాసి యుంటిని. శాస్త్రిగారి వ్రాఁతలను జూచినతరువాత శ్రీ శంకరనారాయణులవారు ప్రకటించిన మోక్షోపాయ మను గ్రంథమును గూడఁ జూచి యందుఁ బ్రకటిత మగు సోమనాథస్తవమును శ్రీ నాగభూషణముగారి గ్రంథమందలిదియు నొక్కటియే యని గ్రహించితిని.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారీద్విపదకృతి సోమనాథకృతము కా దనుటకుఁ గల కారణములను విస్పష్టముగ వివరింపరయిరి. కృత్యంతమున నున్న "గురునాథ శ్రీపాలకురికి సోమేశ, పరమప్రభుండైన పాల్కురికి నిలయ" అనుపంక్తులనుబట్టి యీకృతి యన్యవాదకోలాహలమును సీసశతకమువలెనే పాలకురికి సోమనాథుని కంకితముగా నాతని శిష్యప్రశిష్యకోటిలోఁ జేరిన మఱియొకకవి రచించియుండు నను భ్రమకు లోనయి వీరిట్లు వ్రాసియుండరుగదా! అట్లైనచో నీభ్రమ కేవలము నిరాధార మని యీస్తవమును సవిమర్శముగఁ బఠించువారికిఁ దోఁపకమానదు. పయిపంక్తులలో సంబోధింపఁబడిన పాల్కురికి సోమేశుఁడు పాలకురికి సోమనాథకవి జన్మస్థానమగు పాలకురికి గ్రామమున సోమేశ్వరనామమున వెలసిన శివలింగమే గాని యాపేరుగల యొకమానవుఁడు గాఁడు. పాలకురికి సోమనాథకవి నిజామురాష్ట్రమున నోరుఁగంటి ప్రాంతమున నున్న పాలకురికి వాస్తవ్యుఁడని యాతని గృహనామమును బట్టియు, అన్యవాదకోలాహలమందలి సీ."భవదీయసంబంధభాసురంబయ్యె నేభాగ్యంబు చేసెనో పాలకురికి" అను పద్యమునుబట్టియు గ్రహింపఁదగును.

పాలకురికియందు వెలసిన సోమనాథేశ్వరుని పేరే మనసోమనాథకవి కాతని తలిదండ్రులు పెట్టియుందురు. ఈవిషయములు శ్రీ శాస్త్రిగారు కూడ గుర్తింపకపోలేదు. "సోమనాథుని నెలవు" అను శీర్షిక క్రింద వారు వ్రాసిన వాక్యములు చిత్తగించునది. తనస్వగ్రామమున వెలసిన సోమేశ్వరుని పేర సోమనా

ధుఁడు తన ప్రథమవయస్సులో నీకృతి రచించి యుండవచ్చును. ఈపాలకురికి సోమేశ్వరుఁడు బమ్మెర పోతనామాత్యునకుఁ గూడ మొదట నిష్టదైవముగా నుండినట్లు పాలకురికి ప్రాంతమున నిప్పటికిని వాడుకలోనున్న

"పాలకురికినిలయా- సోమయలింగా పాదములకు శరణు- వురమగ బమ్మెర పోతరాజుకు మీరు కోరిన వరములు కృపచేసినారఁట- పాల్కురికినిలయా......"అను పాటవలన గ్రహింపఁదగును. కావునఁ గృత్యంతమందలి "గురునాథ శ్రీపాలకురికి సోమేశ" ఇత్యాదివాక్యము లీకృతి సోమనాథకృతి మనుటకు బాధకము లెంతమాత్రము కానేరవని విస్పష్ట మగును. ఇఁక నిది సోమనాథకృతమే యని యనుమానించుటకు నాకుఁ దోఁచిన సాధకముల నివేదించుచున్నాఁడ.

సోమనాథుఁడు బసవపురాణ, పండితారాధ్యచరిత్రముల యవతారికలలో ద్విపదకావ్యరచనమును సమర్థించుకొనుచు వ్రాసిన వాక్యములును ద్విపదలలోఁ బ్రాసయతి చెల్లుననుటకు "అనియతగణైః" "యతిర్వా" "ప్రాసోవా" అనిచూపిన ప్రాచీనసూత్రములను జూడ నాతనికాలమునాఁటికే లోకమున ద్విపదకావ్యములయెడ నొకకరణి నిరసనమును ద్విపదలలోఁ బ్రాసయతి కూర్పరాదను నభిప్రాయమును వ్యాప్తమయినట్టు లూహించుటకుఁ జాలనవకాశము కలుగుచున్నది. సంగీతమునందును, ఇంద్రచంద్రగణములతో నేర్పడు సీసగీతాదికములందును జెల్లెడి ప్రాసయతి యట్టిగణములచేతనే యేర్పడి పాటవలెఁ బాడుకొనుటకు మిక్కిలి యనువగు ద్విపదలలోఁ జెల్లనేర దనుట సమంజసముగాఁ దోఁపదు. ద్విపదలలోఁ బ్రాసయతి నంగీకరించుట ప్రాచీనకవి సమ్మతమనియే నాయభిప్రాయము. మన కుపలబ్ధము లయిన ద్విపదకావ్యములలో సోమనాథునికృతులే ప్రాచీనతమములు. అంతకుమున్ను వెలసిన ద్విపదకావ్యములు మనకు లభింపనందునఁ బ్రాచీను లీప్రాసయతి నెంతవఱకు ద్విపదలలోఁ బాటించిరో నిర్ణయింపరాకున్నది. కాని తనకాలమునాఁటికి వ్యాప్తమయిన యీప్రాసయతి నిరసనమును సోమనాథుఁడు గూడ మొదటఁ గొంతవఱకుఁ బాటించి వయస్సుమీఱినకొలఁదిఁ, బాండిత్యము హెచ్చినకొలఁదిఁ బ్రాచీనసంప్రదాయమును గుర్తించి ద్విపదలలోఁ బ్రాసయతి చెల్లు ననుటకుఁ బ్రమాణములను గ్రహించినతరువాత దానిని బాహాటముగ నుపయోగించినట్లు తోఁచుచున్నది. ఇందుల కీసోమనాథస్తవమే తార్కాణము. బసవపురాణ పండితారా

ధ్యచరిత్రములలో సోమనాథుఁడు విపులముగను బాహాటముగను బాటించిన యీప్రాసయతి సోమనాథ స్తవములోఁ గ్వాచిత్కముగఁ గానవచ్చుచున్నది. శంకరారాధ్యులవారి ముద్రితప్రతియందలి యీ క్రిందిపంక్తులు చిత్తగింపుఁడు.

(1) వరుసగా నఖిలంబు నరసిరక్షించు ।
(2) గురుచరేశ్వరుఁడవై ధరణికివచ్చి ।
(3) ఒడయనంబెన్నకు బడిపనుల్ చేసి ।
(4) పిట్టవ్వకై వెట్టితట్టలుమోసి ।
(5) ఎన్నెన్నిచర్యలఁ బన్నితివీవు ।
(6) మృడునిసద్భక్తులు గుడిచినచోట ।
(7) పుడమిభక్తులయిండ్ల బడిపనుల్ చేయు ।
(8) లింగార్పితంబైన మంగళసాద ।
(9) నిరతంబునీభక్తవరులకు మిగుల ।

వీనిలో 1, 2, 5, 8 పంక్తులకు వరుసగాఁ బ్రాసయతి రహితములయిన "అరయఁగా నఖిలంబు హరియింపుచున్న" "గురుచరేశ్వరుఁడవై కుతలంబు సొచ్చి" "ఎన్నెన్నిజన్మంబు లెత్తితినిన్ను" "లింగార్పితంబైన లీలాప్రసాద" అను పాఠములు గూడఁ గొన్నివ్రాఁతప్రతులయందును గంఠపాఠముగ నీస్తవమును జదువు కొందఱు భక్తులపాఠములందును గ న వచ్చుచున్నవి. సోమనాథునకు సమ్మతమయి యాతనిచే సమర్థింపఁబడి బసవపురాణ పండితారాధ్య చరిత్రములలో విపులముగాఁ బ్రయుక్తమయిన ప్రాసయతి విరళముగనయిన సోమనాథస్తవమునఁ గాన వచ్చుటగూడ నీకృతి సోమనాథకృతమే యనుట కవకాశ మొసంగుచున్నది. బసవేశ్వరునిఁ గూర్చియు నాతని సమకాలికు లగు భక్తుల గుఱించియు సోమనాథునికిఁ దెలియవచ్చి బసవనియందు భక్తి యంకురించిన తొలుదొలుతటి కాలమున సోమనాథుఁ డీగ్రంథము రచించియుండు నని నాయభిప్రాయము. ఇందు బసవని ప్రసక్తి స్వల్పమాత్రముగనే యుదాహరింపఁబడినది. చూడుఁడు.

"పరమశివాచారభక్తిమర్మములు । బసవన్న మొదలైన భక్తులకెల్ల ।"

ఉపలబ్ధములయిన సోమనాథుని కృతులలో నెల్ల ననుభవసార మనుపద్యకావ్యమే మొట్టమొదటి దని నాయాశయము. ఆకృతి రచించునప్పటికి సోమనాథునికి బసవనిసంగతి యుంతగాఁ దెలిసి యాతనియందు భక్తి కుదిరినట్లు

గానరాదు. అట్లుగాక యాతనియందు భక్తికుదిరిన ప్రౌఢవయస్సులోనే సోమనాథుఁ డాగ్రంథమును వ్రాసె నన్నచో దానిలో మల్లికార్జునపండితుని మూఁడుపద్యములలోఁ బేర్కొనియు బసవని పేరైన నెత్తకుండుటకుఁ గారణము కానరాదు. ఈవిషయమును "పాలకురికి సోమనాథకవి; కులగోత్ర ప్రశంస" అను వ్యాసమున (పరిషత్పత్రిక సం॥ 19 సం॥ 3-4-5 లో) విస్తరించి యుంటిని. కావున, అనుభవసారరచనమునకు ను, బసవపురాణ రచనమునకు ను మధ్యకాలములో బసవస్తోత్రపరము లగు పంచప్రకారగద్య, నమస్కారగద్య, మున్నగు గద్యకృతులను రచించుట కించుకపూర్వ మీ సోమనాథస్తవము సులభశైలిలో భక్తుల యుపయోగమునకయి రచింపఁబడి యుండునని తోఁచుచున్నది.

ఇందలి రచనము సోమనాథుని రచనమువలె లేదని శాస్త్రిగారు వ్రాసిరి గాని యందులకు దృష్టాంతములను జూపరయిరి. నాకుఁ జూడఁగా బసవపురాణ రచనమునకును నిందలిరచనమునకును బాటింపఁదగిన భేద మేమియుఁ గానవచ్చుట లేదు. సోమనాథునకుఁ బ్రియకరమయి యాతని కృతులందుఁ గానవచ్చెడి యనుప్రాసముమాత్ర మీలఘుకృతియం దంతగాఁ గానరాదు. కాని యిది శాస్త్రిగారి వాదమున కొక ప్రబలాధారము కాఁజాలదు. ఇది సోమనాథుని ప్రాథమికకృతులలోఁ బరిగణింపఁదగిన దని మనవి చేసియే యుంటినిగదా! అయినను శైలీవిషయమున గ్రంథమందలి క్రిందిపాదములను జితగించి బసవపురాణరచనమునకును దీనికిని బాటింపఁ దగిన భేద మున్నది లేనిది విజ్ఞులు నిర్ణయింతురుగాక !

"పాయక కిన్నర బ్రహ్మయ్య పిలువ, హాయని పల్కిన యొడయ రక్షించు
చెన్నయ్యభుక్తావశేషంబుగొన్న, పన్నగకుండలాభరణరక్షించు
జంగమలింగప్రసాదసేవనము, నంగంబుగాఁగఁ దా నంగీకరించి
తనుమనోధనములు తనవనుబుద్ధి, మనమున నెడలించి మక్కువతోడ
నిరతంబునీభక్తవరులకుమిగులఁ, బరిచర్యలొనరించు భక్తి నాకొసఁగు"

ఇఁక గ్రంథస్థసాక్ష్యము ను విచారింతము- ఈకృతియందలి ప్రథమపాదము "శ్రీగురులింగ సుస్థిరదయాపాంగ" అనునది యామద్భేదములతో బసవపురాణపండితారాధ్యచరిత్రములలోఁ గొన్ని యాశ్వాసారంభములఁ గానవచ్చుచున్నది.

శ్రీగురులింగ సుస్థిరదయాపాంగ, యోగాత్మ! భక్తమహోత్తుంగసంగ।
(బ। పు. ఆ 4)

శ్రీగురులింగ సుస్థిరదయాపాంగ, భోగమహాహార పాల్కురికిసూర।
(పం। చ। వాదప్ర॥)

సోమనాథుని కృతులలోఁ దఱచుగాఁ గానవచ్చు నెట్టణయను ప్రాచీనశబ్ద మిందుఁ గూడఁ బ్రయుక్త మయినది. అస్మదర్థమున 'నేను' అనుటకు మాఱు "తాను" అను ప్రాచీనసంప్రదాయము కూడ నిందుఁ గాననగును.

"తిట్టినవారిని దీవించువారి, నెట్టణ నొకటి యన్నేర్పు నాకొసఁగు
తనుమనోధనములు తనవనుబుద్ధి"

అనంతుఁడు మున్నగు లాక్షణికులు చెప్పిన, "గీ. మొదలి తెలుఁగుపై సంస్కృత పదమొకండు। జరగ లోకసాక్షిని సమాసంబు చొరదు, పూని ముజ్జగంబులు ననఁ బోలుఁగాని, యితఁడు ముజ్జగద్వంద్యుఁడనఁగఁ జనదు॥" అనులక్షణమునకు సరిపడని 'ముల్లోకవంద్య' "ముల్లోకినాథుని" మున్నగు ప్రయోగములు సోమనాథుని బసవపురాణ పండితారాధ్యచరిత్రములందును, ఆనాఁటిశాసనములందును గల వని శాస్త్రిగారు బసవపురాణపీఠికలో వ్రాసిరి. ఈసోమనాథస్తవము ముద్రిత ప్రతిలోఁ గానవచ్చు "ముజ్జగములనేలు పురుష రక్షించు" అనుపాఠమునకుఁ గొందఱు భక్తుల కంఠపాఠమునందును, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమందలి నె 1244 రు తాళపత్ర ప్రతియందును "ముజ్జగదాధారమూర్తిరక్షించు" అనుపాఠము గానవచ్చుచున్నది. అదియే కవిపాఠ మయినచో నదికూడ సోమనాథకర్తృత్వమునకు సాధకమే యగునుగదా! అప్పకవి చెప్పిన 'ముకారయతి' ప్రాచీనకవిసమ్మతము గాదని శాస్త్రిగారు బసవపురాణపీఠికలో వ్రాసినారు గాని యీయతిగూడఁ బ్రాచీనకృతులలోఁ గ్వాచిత్కముగఁ గానవచ్చుచునే యున్నది. బసవపురాణముననే యొండు రెండు ప్రయోగములు గలవు.

భువినఱువాడ్డడి ముప్పురిలోనఁ (పుట 48)
పురహరార్చితునకు మున్నెత్తు కేలు (పుట 237)

కావునఁ బయిని జెప్పిన "ముజ్జగములనేలు పురుష రక్షించు" అనునదియే కవిపాఠ మన్నను నదికూడ సోమనాథకర్తృత్వవిషయమున బాధకము కానేరదు.

"అజ్ఞానమనియెడియంధకారమున, మగ్నుండనై మిమ్ము మఱచుచునుంటి"

ఈపాదములు సోమనాధకర్తృత్వవిషయమున బాధకములు కానో పును. ఇట్టిప్రాసము సోమనాథునకు సమ్మతముగాఁ దోఁపదు. పరిషత్కార్యాలయమందలి వ్రాఁతప్రతిలోఁగూడ నిట్లే యున్నది. కాని యిచ్చటఁ గవిపాఠము మఱుగువడి యపపాఠము నెలకొనెనేమో యని నాయనుమానము. మఱియు నీపాదములు ప్రక్షిప్తము లయినను గావచ్చును. ఈసోమనాధస్తవము విశేషముగ భక్తులకంఠపాఠములమూలముననే ప్రచారమందున్న లఘుకృతి యగుటచేఁ గొన్నిప్రతులలో లేనిపాదములు మఱికొన్నిప్రతులలో నుండుటయు నట్లే కొన్నిటిలో నున్నవి మఱికొన్నిటిలో లేకుండుటయుఁ గూడఁ గాననగును. కొన్నితాటాకుప్రతులలోఁ గాన్పించు "ఆదికి నాదినై యఖిలలోకములు, మోదంబుతోఁబ్రోచు ముఖ్య రక్షించు" మున్నగుపాదములు శ్రీశంకరారాధ్యులవారి ముద్రితప్రతిలో లేనే లేవు. కృత్యంతమందలి యాక్రిందిఫలశ్రుతిలో

అనుదినంబీస్తవ మర్థిఁబఠింపఁ, బనిపూనిచదివిన భక్తితోవినిన
నరయంగవ్రాసిన యభవుభక్తులకు,దొరకునుముక్తియుదురితముల్ తొలఁగుఁ
బరమలింగైక్యసంప్రాప్తిచేకూరుఁ, బరిహృతంబగు జన్మబాధలన్నియును
బరఁగంగ షట్స్థల భావంబుచెందు, గురుభక్తి చెన్నొందు గోప్యంబుగాను
పరమప్రభుండైన పాల్కుర్కినిలయ,కరుణతో నొసఁగవే కలకాలమెల."

సంబోధనరూపమున నున్న చివరి రెండుపాదములును బ్రక్రమము ననుసరించి "పరమప్రభుండు పాల్కురికినిలయుఁడు । కరుణతోఁ బ్రోచును గలకాలమెల్ల" అని యుండఁదగు ననియు నదియే కవిపాఠమయి యుండుననియు నాతలంపు పరిషత్కార్యాలయమందలి తాటాకుప్రతిలోఁ జివరపాదము నేను జెప్పినట్లే యున్నది.

ఇఁక నీకృతి సోమనాథకృతము కా దనుటకు శాస్త్రిగారు చెప్పెడి ప్రబలకారణము పద్యబసవపురాణకర్త సోమనాథునికృతుల నుదాహరించుచుఁ జెప్పిన "బసవపురాణంబు, పండితారాధ్యులచరితంబు, ననుభవసారమును......................" అనుపద్యములో సోమనాథస్తవమును జేర్కొనకుండుట యొకటి. ఈపద్యమున సోమనాథునికృతు లన్నియు నొకటి యైన విడువక యేకరువు పెట్టఁబడిన వని యెన్నఁ దగునా? అట్లె యైనచో, ఎత్తుగీతి మూఁడవపాదమందలి "ఆది యగు కృతుల్"

అనుదానికి నర్థప్రయోజన మేమి? సోమనాథుని కృతులలో "మల్లమదేవిపురాణ" మను నొక ద్విపదకావ్యము కూడఁ గల దనియు దాని ప్రతి యొకటి కర్నూలుజిల్లా నందికొట్కూరులో నొకలింగాయతునియింటఁ జూచితి మనియు శ్రీపెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగా రొకపరి వ్రాసియుండిరి. పద్య బసవపురాణకర్త పయిపద్యములో నీగ్రంథమును గూడఁ జేర్కొనలేదుకదా! అతివిస్తరమేల? ఆతఁ డాపద్యము సీసపాదములందును గీతము మొదటి రెండుపాదములందును సోమనాథుని కృతులను జెప్పఁ దగినన్ని చెప్పి తక్కినవాని నాదిశబ్దముచే సూచించుచు మూఁడునాల్గు పాదములను "ఆదియగుకృతుల్ భక్తహితార్థబుద్ధిఁ, జెప్పె నవి భక్తసభలలోఁ జెల్లుచుండు" అని వ్రాసినాఁడు. ఆదిశబ్దముచే గ్రాహ్యము కాఁదగు నితరకృతులలో నీలఘుకృతియుఁ జేరఁదగును. కావున నిదిగూడ శాస్త్రిగారివాదమున కుపకరింపఁజాలదు. కొన్ని సంవత్సరములయి "భారతి"లోఁ బ్రకటించిన "పాలకురికి సోమనాథుని గురుప్రశంస" అనువ్యాసములో విజయనగర వాస్తవ్యులు నామిత్రులు శ్రీ నిడదవోలు వేంకటరమణగారు కూడ నీసోమనాథస్తవము సోమనాథకృత మనియే పేర్కొనిరి. బహుశః వీరు వీరిజనకులును బహుశైవగ్రంథ పరిశోధకులు నగు శ్రీనిడదవోలు సుందరము పంతులుగారివలన నట్లు తెలిసికొని వ్రాసియుందు రని తలంచుచున్నాను. పెద్దలు పలువు రిట్లీలఘుకృతిని సోమనాథకృత మనియే తలంచియుండిరి, తలంచుచున్నారు. పరిషత్పుస్తకభాండాగారమందలి వ్రాఁతప్రతులను గూర్చి పరిషత్పత్త్రికలోఁ బ్రకటించు వివరణలోఁ గూడఁ దత్పత్త్రికా సంపాదకు లీలఘుకృతిని "శివస్తోత్ర" మని పేర్కొని పాలకురికి సోమనాథకృతము కానోపు నని వ్రాసిరి. దీని కర్తృత్వవిషయమున నా కారూఢజ్ఞానము లేకున్నను నిట్లు చిరకాలానుగతముగ వచ్చుచున్న యభిప్రాయమును ద్రోసి వేయుటకుఁ దగిన కారణములు లేక దానినే నేనుగూడ ననుసరించితిని. సోమనాథకర్తృత్వవిషయమునఁ గల సాధకబాధకముల నిప్పుడు వివరించితిని గదా! బాధకములకన్న సాధకములే యెక్కువగఁ గాన్పించుచున్నవి. పాలకురికి సోమేశ్వరస్వామిపేర నట్టిస్తవ మొనర్పుకవి సోమనాథుఁడు తక్క మఱియొకఁ డాకాలమునఁ గానరాఁడు. ఆతని శిష్యప్రశిష్యులు పిడుపర్తి బసవనాదులు దీనిని రచించియుందు రని తలంచుట కవకాశము లేదు. వారికిని పాలకురికికిని సంబంధ మంతగాఁ గానరాదు. వారి స్వగ్రామము పిడుపర్తియు, అగ్రహారముగాఁ బడసిన దోకి

పట్టును కృష్ణా గుంటూరుమండలములలోని వని నాయభిప్రాయము. మఱియుఁ బిడుపర్తి బసవన వీరశైవ దీక్షాబోధయు నాతని తనయుఁడు సోమనాథుఁడు వ్రాసిన ప్రభులింగలీలయుఁ జూడ నందుఁ బ్రాసయతి ప్రయోగములు గానరాకున్నవి. అందులకుఁ గారణము వారి కాలమునాఁటికి ద్విపదలలోఁ బ్రాసయతి చెల్లదను పూర్వాభిప్రాయము మరల వ్యాప్తమగుటయు దానిని ద్రోసివేయు సాహసము వారికి లేకుండుటయు నని నేఁ దలంతును. కావున సోమనాథస్తవమునఁ గ్వాచిత్కముగఁ గానవచ్చు ప్రాసయతి ప్రయోగములు గూడ నీకృతి కర్తృత్వమును వారి కారోపించుటకు బాధకము లగును. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు గాని తదితరులు గాని వట్టిమాటలచేఁ గాక ప్రబలప్రమాణములచే నీకృతి సోమనాథరచితము గాదని నిరూపించినచో నేను గూడ వారియభిప్రాయము ననుసరించుట కెట్టియభ్యంతరమును లేదు.

శ్రీ శంకరారాధ్యులవారి గ్రంథములో నీసోమనాథస్తవము తరువాత "భక్తస్తవము" అను మఱియొక లఘుద్విపదకృతి కూడ నున్నది. ఈ రెంటికిని శైలీభేదము గానరాదు.

సోమనాథస్తవమునకంటె నందుఁ బ్రాసయతి కొంచె మెక్కువగాఁ బ్రయుక్తమయినది. అదికూడ సోమనాథకృతమేమో యని నాయనుమానము. ఆకృతియందలి యీక్రింది పంక్తులకును బండితారాధ్య చరిత్రమందలి ద్విపదపాదములకును గల సాదృశ్యమును జూచి విజ్ఞులు విషయవిర్ణయ మొనరింతురుగాక!

"భక్తపుత్రుండను భక్తపౌత్రుండ, భక్తుల శ్రీపాదపద్మసేవకుఁడ
భక్తులఁబొగడఁ బాల్పడు కవీంద్రుండ, భక్తులదూతను భక్తులబంట
భక్తులలెంకను భక్తసత్పాత్రిణి, భక్తులచెలికాఁడ భక్తబంధుండ (భక్తస్తవము)
బసవనిపుత్రుండ బసవగోత్రుండ, బసవేశుశ్రీపాదపద్మశేఖరుఁడ
బసవనిఁబొగడఁ బాల్పడుకవీంద్రుండ, బసవన్నఁబొగడఁ బాల్పడుపాఠకుండ
బసవన్నదూతనే బసవన్నబంట, బసవన్నయిలుపుట్టుబానిసకొడుక
బసవన్నలెంకనే బసవన్నలెంగి- (పం॥ చ॥ దీక్షాప్రకరణము)

# గ్రంథస్వీకారము.

(1) తంజాపురాంధ్రనాయకరాజచరిత్రము:—గ్రంథకర్త బ్ర॥ కురుగంటి సీతారామయ్యగారు యం. ఏ. ఉపద్రష్ట, సరస్వతీమహాల్ పుస్తకాలయము, తంజావూరు. వెల రు 2—0—0.

గ్రంథకర్తగా రాంధ్ర విశ్వవిద్యాలయమునఁ దామిచ్చిన యుపన్యాసముల నీరూపమునఁ బ్రకటించినందుల కాంధ్రలోకము వీరికిఁ గృతజ్ఞతనుఁ జూపవలసియున్నది విశ్వవిద్యాలయమువా రీగ్రంథము నేలొకో ప్రకటించియుండ లేదు. గ్రంథకర్త విశ్వవిద్యాలయమున వైసుచాన్సెలరుగా రగు, సర్. రాధాకృష్ణగారి కీగ్రంథము నంకిత మొనర్చెను గ్రంథము దేశోద్ధారక కా. నాగేశ్వరరావుగారి సహాయమున నాంధపత్రికా కార్యాలయమున ముద్రింపఁబడినది. ఏదేశమున విశ్వవిద్యాలయములు స్థాపింపఁబడినవో యాదేశచరిత్రమును సమగ్రముగ విశ్వవిద్యాలయ పక్షమునఁ జరిత్రవేత్తలచే నుపన్యాసము లిప్పించి వానిని గ్రంథరూపమున ముద్రింపవలసిన భారము విశ్వవిద్యాలయాధికారులదై యున్నది. అట్టియాశయము నీకనైన నుజ్జీవింపఁజేసి యాంధ్రచారిత్రమును బ్రాచీనకాలమునుండి నేఁటివఱకును దనుచారిత్రోపన్యాసకులచేఁ గాని యితరులచేఁగాని రచింపఁజేసి యాంధ్రులమెప్పును విశ్వవిద్యాలయాధికారులు పొందుదురుగాక యని కోరుచున్నాము.

పాండ్యులచరిత్రమును, గాంచీపురపల్లవుల చరిత్రములో మధురనాయకులచరిత్రమును మదరాసు విశ్వవిద్యాలయమువారు ప్రకటించియున్నారు. తంజావూరు మహారాష్ట్రరాజుల చరిత్రమును కె. యస్. సుబ్రహ్మణ్య అయ్యరుగా రాంగ్లమున రచియించియున్నారు. తంజావూరు నాయకరాజుల చరిత్రము నెవ్వరును రచియించియుండలేదు. ఇందుల కాధారములను గ్రంథకర్తగా రనుబంధమునఁ జూపియున్నారు ప్రథమమున ముఖ్యసాధనములను గూర్చి చర్చించుచు నముద్రితగ్రంథములలోఁ బెక్కు ముద్రితగ్రంథములను జేర్చిరి. మన్నారుదాసవిలాసము, వాల్మీకిచరిత్రము, కంపరాయచరితము ముద్రితగ్రంథములే. మొదటిది సాహిత్యపరిషత్ప్రకాశితము, రెండవది సరస్వతీపత్రికయందు ముద్రింపబడినది. మొదటి రెండుపన్యాసముల గ్రంథకర్తగారు చోళమండల, విజయనగర సామ్రాజ్యవృత్తాంతముల వలయునంతకుఁ జర్చించి, తంజాపురముతో సంబం-

ధించిన దగుటచే మధురనాయకవృత్తాంతమును సంగ్రహముగ నిచ్చిరి. మిగిలిన యుపన్యాసములు తంజావూరునాయకరాజులను గూర్చినవే. రఘునాథాభ్యుదయము, అచ్యుతరాయాభ్యుదయము, వరదాంబికాపరిణయము, సంగీతసుధ, సాహిత్యరత్నాకరము, అలంకారరత్నాకరము మున్నగు గ్రంథములనుండి చారిత్రికవిషయములఁ గైకొని హీరాసు మున్నగువారివ్రాఁతలను ఖండించిరి. అనుబంధమున శైలరు మున్నగువారి గ్రంథములనుండి వలయుభాగములను జేర్చియున్నారు. తగువిమర్శనముతో నాయకరాజులరాజ్యకాలములను నిర్ణయ మొనర్చిరి.

విజయనగరరాజులవలె, తంజావూరు నాయకరాజులు ను సంగీతసాహిత్యాదులను బోషించుటయే గాక తాము గ్రంథములను రచించి యాంధ్రులకు మార్గదర్శకులయిరి. ఆంధ్రవాఙ్మయమునఁ జాలభాగ మీ రెండుసంస్థానములు నుచ్ఛదశయం దున్నపుడు వెలువడినదే. నాయకరాజులకాలమున వాఙ్మయ మెట్టిమార్పులను బొందినదో, యేయేగ్రంథములు వెలువడినవో మున్నగువిషయము లీగ్రంథమునఁ జర్చింపఁబడియుండలేదు. నాయకరాజులు సంస్కృతాంధ్రములఁ బోషించి గ్రంథముల రచింపఁజేసిరని మాత్రము సూచింపఁబడినది. గ్రంథకర్తగారు కేవలము చారిత్రికదృష్టితో గ్రంథమును రచియించిరని తోఁచుచున్నది ద్వితీయముద్రణమున నైన నొకటి రెండధ్యాయముల నీరెండుశతాబ్దములయందు సంస్కృతాంధ్రవాఙ్మయములు, మిగిలిన లలితకళలును నెట్లభివృద్ధిఁబొందినవో చర్చింతురుగాక! రచియించిన గ్రంథ మాంధ్రులకు మిక్కిలి యుపయోగకరము. రఘునాథాదులు వారి కెల్లపుడును స్మరణీయులు. ఇట్టిగ్రంథమును రచించిన సీతారామయ్యగారికిని ముద్రణ మొనరించిన యాంధ్రపత్రికాధిపతులకును మనకృతజ్ఞతావందనము లొసంగుచుఁ బ్రతిగ్రంథాలయమును విద్యాలయములును నీగ్రంథమును గొని గ్రంథకర్తగారి కుత్సాహ మొసంగుదురుగాక యని కోరుచున్నాము—

---

(2) అన్నపూర్ణ - 1-2 భాగములు - శ్రీపులుగుర్త లక్ష్మీనరసమాంబ గారిచే శ్రీ దామోదరముఖోపాధ్యాయుని వంగభాషాగ్రంథమునుండి యాంధ్రీకరింపఁబడి, ఆంధ్రప్రచారిణీగ్రంథమాల ౭౨, ౭౩ కుసుమములుగాఁ బ్రకటింపఁబడినవి. ప్రథమభాగము, నాల్గుప్రకరణములు 205 పుటలు, ద్వితీయభా

గము, ఆఱుప్రకరణములు 203 పుటలును. భాగము 1 కి రు 1-8-0 వెల. పిఠాపురములో ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయములోఁ దత్ప్రకాశకు లగు కవిరాజహంస వోలేటి పార్వతీశముగారియొద్ద దొరకును.

(3) ఆంధ్రకుందమాల- కవిశేఖర వఝ్ఝాది సుబ్బారాయవిరచితము. దేశసేవాపత్రికనుండి పునర్ముద్రితము దిఙ్నాగకృతమూలమునందలి సంస్కృతమ దలాలిత్యముం దెలుప నక్కఱలేదు. సుప్రసిద్ధనాటకాంధ్రీకర్త, లగుకవిశేఖరులును నాంధ్రదేశమున సువిశ్రుతులు. కావున మచ్చునకై వారియిరువురిపద్యములనుఁ గొన్నింటిని పాఠకులకుఁ జూపుచున్నారము.

శ్లో. తస్యాః స్వహ స్తరచితా మివ కున్దమాలాం
　సాదృశ్యవన్తి సికతాసు పదాని తాని
　ఛాయాం చ దేవగణికా విదధాతు యేన
　రామం కథం స్పృశతి హ స్తపటాన్తవాతైః.　　　　5-3.

ఉ. ఆమెస్వపాణిచే రచిత మన్నటు దోఁపఁగఁ గుందమాల, త
　ద్గోమతిసైకతంబునను దుల్యతఁ గానఁగ రాఁ బదాంకముల్
　దామరసాకరంబునను దత్ప్రతిబింబము నల్పుఁగాక యా
　య్యామరవేశ్యఁ గామునిఁ బయంటచెఱంగున నేల వీచెడిన్.

శ్లో. మధ్యాహ్నార్కమయూఖతాప మధికం తోయావగాహోదయం
　నీత్వా వారికణార్ద్రకర్ణపవనై రాహ్లాద్యమానాననః
　మన్దం మన్ద ముపైతి కూల మధునా వక్షఃక్షణున్నైర్జలై
　రాక్రాన్తం కరఘాతఝంకృతిసరిత్కల్లోలచక్రః కరీ-　　　　3-17

ఉ దినమధ్యార్కమయూఖతాపశిఖి శాంతిం బొందఁ దోయావగా
　హనముం జేసి జలార్ద్రకర్ణపవనం బాస్యం బలర్పంగ మె
　ల్లన వక్షఃస్థలనున్నవారి దరిఁ బొర్లంగాఁ గరాఘాతజ
　ధ్వనితోడం ధునిఁ దోఁపఁ బెందరగవృత్తం బేనుఁ గో డ్డెక్కెడున్.

　దీనివెల రు0-12-0. కవిగారియొద్ద రాజమహేంద్రవరములో దొరకును.

(4) పరమయోగివిలాసము- ద్విపద. ఎనిమిదియాశ్వాసములు. తాళ్లపాక తిరువేంగళనాథరచితము. అష్టమహిషీకళ్యాణ మనుద్విపదకావ్య మిదె తనిదే.

(5) ధర్మఖండము- ఈదులపల్లి భవానీశంకరకవీంద్రవిరచితము. తొమ్మిది యాశ్వాసముల పద్యకావ్యము. దీనిని, పరమయోగివిలాసమును, శ్రీ పిఠాపురము సంస్థానాధీశు లగు శ్రీశ్రీశ్రీ మహారాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు పండితపరిష్కృతము చేయించి ప్రకటింపించిరి. పరమయోగివిలాసమునకు బరిష్కర్తలు, శతావధాని, ఓలేటి వేంకటరామశాస్త్రిగారు. బ్ర॥ శ్రీ॥ పెద్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు పీఠిక వ్రాసిరి. ధర్మఖండము విమర్శకాదర్శక నడకుదుటి వీరరాజుగారిచేఁ బరిష్కరింపఁబడినది. మఱియు వారిచేతనే వ్రాయఁబడిన 44 పుటల యుపోద్ఘాతముతో నలరారుచున్నది.

పరమయోగివిలాసము, వైష్ణవభక్తాగ్రేసరులగు పన్నిద్దఱాళ్వారులచరిత్రము. దీనినే తిమ్మభూపాలుఁడను నొకకవిరాజు పద్యకావ్యముగ రచించెను. ధర్మఖండము, స్కాందాంతర్గతము. ఈగ్రంథములోని ప్రధానమైన యితివృత్తము- వాల్మీకిమహర్షిచరిత్రము- నీతి, భక్తి, ధర్మప్రతిపాదకము లగు నుపకథలతో నొప్పియున్నది.

పరమయోగివిలాసము-క్రౌను 8 పుటలయాకృతిని 643 పుటలు గలది. ధర్మఖండము- క్రౌనుసైజుననే రెండుసంపుటములును 877 పుటలు గలది.

భాషాపోషకులగు నీమహారాజావారిదివఱకు, పురాణపండ మల్లయ్యశాస్త్రిగారిచే నాంధ్రీకరింపఁబడిన బ్రహ్మసూత్రభాష్యమును, వ్యాఖ్యానముతోడి ప్రభావతీప్రద్యుమ్నమును, (అల్లమరాజుసుబ్రహ్మణ్యకవికృత) భద్రాపరిణయమును బ్రకటించి యాంధ్రలోకమునకు మహోపకార మొనరించిరి.

ఈగ్రంథము లమూల్యము లగుటంగావలయును మూల్యము నాయాగ్రంథములపై నిర్ణయించి తెల్పియుండలేదు.

జవరాల వస్మదాచార్యురాలవు నన్నుఁ బరిచరుఁగా నేలవలె నటన్న
మాట మఱచితె జగములఁ బాటిగలదె, త్రిదశనుతనామ పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామి వామభాగ, చంద్రశాలాసభాలంబ శ్యామలాంబ. ౮౧

క్షితిలోన నెట్టి విశిష్టకులంబునఁ బుట్టఁగా నేమి తా నెట్టిచదువు
చదువఁగా నేమి ప్రాగ్జన్మకర్మఫలంబు లనుభవింపకతీర దొనర నరున
కిం దైన నం దైన నెం దైన ననుచింత ముందుముందయ్యె నాయందు నీవు
సందు లేకున్కి నిస్సందేహ మందుఁ జరాచరాంతర్వర్తి వగుట వేఁడి
వెలుఁగు గలచోటఁజీఁకటితొలఁగకున్నె, త్రిభువనంబులఁ బెడనపురీలలామ-

బహుభాషలేల నీపాదపద్మముల తోడేసరి కడదోసెఁ డేసిమాడ
లనువొంద రాశివోసిన దాని నేనొల్ల నందు కిందొక సాక్ష్య మనువదించె
దను జిత్తగింపు నాతల్లి శాశ్వతపదార్థంబవు నీవు తిరంబుగాఁగ
(నవనిఁ) గలుంగ నింద్యం బస్థిరం బైన కించిదర్థమున కాసించ నేరఁ
(జేకుఱిన నవ్య)సుధవీడి చేఁదు వెదకు, బేల గలఁడమ్మ పెడనపురీలలామ-

తల్లి సౌభాగ్యమతల్లి కామితకల్పవల్లి చల్లనిచూపు లుల్లసిల్లి
వెదచల్లి సకలసంపదల నాయందెల్ల వేళల వర్ధిల్లి విమలభోగ
ములవెల్లి ముజ్జగంబుల కెల్ల రాగిల్లి యల్లనల్లన గిరిపల్లె నల్ల
మల్లేశ్వరునిఁ దారసిల్లి కొమరుఁగన్న తల్లి నీదయవల్లఁ దొల్లిపున్ని
యములువన్నియ కెక్కె దోసములుసుక్కె, దృఢముమదిఁజక్కెఁ బెడనపురీలలామ-

అది మొద లిది తుద యనలేదు గాని నీ పెనిమిటికన్నఁ జక్కనివిభుం డె
వండన్న యని వావి వరుసలు ప్రియవయస్యలు గాంచి సరసంబు లాడునప్పు
డొదవి నీపెదవులఁ గదిసిన ముసిముసినగవు వెన్నెల మూఁడుజగములకు వి
కాస మొనర్చిన న్నాచుఁగాత మదీయ దేహతాపంబులు దీఱ నీల
లోహితుఁడు చేరఁబాఱఁబురోహితుఁడగు, భృంగిరిటుజేరఁ బెడనపురీలలామ-

నీలమేఘచ్ఛాయ నెనయు మై పసుపునిగ్గుల తటిల్లతకాంతి తళుకులీన
రత్నసానుపయోధరముల కుంకుమరకి గిరికాదులభంగి గడలుకొనఁగ
ముకుర(కపో)లవిస్ఫురితచందనచర్చ ధాళధళ్యద్యుతి మేళగింపఁ
బూర్ణచంద్రునిభాతిఁ బొల్చు నెమ్మోమునఁ దిలకంబు లాంఛనస్థితినిఁ దనరఁ
బ్రియునికౌఁగిట మెఱయు నీహాయలభూత, సృష్టికిరవయ్యెఁ బెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామివామభాగ, చంద్రశాలాసభాలంబశ్యామలాంబ. ౮౨

దివిజాధిపతి పూర్వదిశ బృహద్భానుఁ డాగ్నేయభాగమున దక్షిణహరిత్ప్ర
దేశంబు(ననుగాలుఁ) డాశరపీరుఁ డవాచీనమున వేష్ఠ వరుణదేవుఁ
డపరదిగ్భాగంబునందు సదాగతి వాయవ్యమున నరవాహనుం డు
దీచి నీశానుఁ డాదిక్కోణమునుండి కొలువు గొల్వఁగఁ బెద్దకొలువుకూట
మున వసించిన ప్రభురాణి వనజపాణి, నీలమణివేణి పెడనపురీలలామ- ౮౭

బాలార్కకోటిప్రభాభాసమానమై యుద్భవించిన పరంజ్యోతి వీవ
నియతి సృష్టిస్థితిలయకర్త లగుమూఁడుమూర్తుల కాధారమూర్తి వీవ
జ్ఞానవైరాగ్యనిష్ఠలఁ జెంది వర్తించు సనకాదులకుఁ దపశ్శక్తి వీవ
స్వర్గమానవబలిసద్మలోకనివాసవరుల కుపాస్యదైవంబ వీవ
నిఖిలభువనంబులకు నిఁక నీవు కంటి, తెప్పవలెఁ గాదె పెడనపురీలలామ-౮౮

విశ్వేశ్వరస్వామి వేడుకఁ జెల్లింపఁ బూని కాశిని నన్నపూర్ణవైతి
వరమల్లికార్జునస్వామికోరికిఁ దీర్ప గమకించి శ్రీగిరి భ్రమరి వైతి
వేకామ్రనాథుని కిష్టార్థమొసఁగ నపేక్షించి కాంచి కామాక్షివైతి

* * * * * * *

వైతిభువనైకమాత వేమైన నీవ, యై లభించితి పెడనపురీలలామ-రామ- ౮౯

భ్రమరీచికురజితభ్రమరీకృశానుశుభ్రమ్ఁరీచిగా)త్ర నేత్రత్రయీత్ర
యీస్తోత్రపాత్ర మోహిత...ర్దిని మహిషాసురమర్దిని హాతనితాంత
దుర్దిని దా దుఃఖాటవీదావకీలి కీలితరత్నకింకిణీయు
తామల...తరానందమగ్నదుష్కృతజన్మభగ్న గౌరీసమాఖ్య
నై మరాళమానససరోరుహ, రీకృతసమాఖ్య పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామివామభాగ, చంద్రశాలాసభాలంబశ్యామలాంబ. ౯౦

వేదవేత్తలు నిన్ను వేదాంతసూక్తులఁ గొనియాడుచుందు రేపునఁ జెలంగి
తార్కికు లేవేళఁ దర్కవాదంబుల వాదింతు రొకనిన్ను వరుసఁ జేసి
వైయాకరణులు సువర్ణరూప మొఱంగి చదువుచుందురు నిన్నుఁ బదిలపఱచి
యోగమువిదులు బీజాక్షరంబులు గూర్చి జపమొనర్తురు నిన్నుఁ ద్రిపుటిఁ జేర్చి
మొద్దుఁజేతులు తలదాల్చి మ్రొక్కుదురుధ, రిత్రిజనులెల్లఁ బెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామి వామభాగ, చంద్రశాలాసభాలంబశ్యామలాంబ. ౯౧

ఎల్లలోకంబుల కేలికసానివై ధర సర్వజీవుల తప్పు లరసి
దండింప నొప్పాలు దరిచి వాంఛితముల నిండింప నేర్చిన కొండరాచ
బాసవు నాతొడఁ దప్పుఁ బట్టఁదలంచితే నీకు దొరకదే తెల్విఁగల్గు

రాజు దలంచితే యోజ దెబ్బలు లేకపోవు గావున దయాంభోధివగుచుఁ
గాచి రక్షించు టొక్కటే కార్య మిపుడు, లేవనక నన్నుఁ బెదనపురీలలామ-
నీమహామహిమ వర్ణింపఁగ నాల్కలు రెండువేలున్న శేషుఁడఁ గాను
నిన్ను దర్శింపఁగ మున్నొక్కవేకన్ను లున్న నిలింపముఖ్యుండఁ గాను
నిన్నుఁ బూజింప దండిసహస్రకరసరోరుహముల బాణాసురుండఁ గాను
నిను స్మరియింపంగ నేనాల్గుముఖములు గలయబ్జకలహంసగామిఁ గాను
గాని పూనితి మన్ననఁ గాంచి చిత్తవృత్తిఁ గరుణించు పెదనపురీలలామ-
ఊరకే నీనామ ముచ్చరించుటె కాని జిహ్వకుఁ బరితృప్తి చెందఁగలదె
నీరూప మారయఁ గోరి చూచుటె కాని కన్నుల కేఁకటఁ గాంచఁగలదె
చాల నీకథలు (ముచ్చటవిను)టే కాని వీనుల కాసక్తి విడువఁగలదె
మఱిమఱి నీకు నమస్కరించుటె కాని మనమున కేమైనఁ దనివి కలదె
నిన్ను విని కని భజియింప నేర్పు గలదె, పృథ్వీజనులకుఁ బెదనపురీలలామ-
కాళీ భయప్లవవ్యాళీ విశాలచూళీ వీరసమరకేళీ పరాకు
దుర్గా విధూతదుర్మార్గా శ్రితార్యవర్గా సదాముదితభర్గా పరాకు
రంభానిభోరు విస్రంభా నిరస్తదంభా పృథూరోజకుంభా పరాకు
మారీ కుమారి కౌమారీ కుభృత్కుమారీ యతీవసుకుమారీ పరాకు
గాక చీకాకు మదిసోఁకనీక నన్నుఁ గాంచి రక్షించు పెదనపురీలలామ- ౯౫
శరణు వేఁడెద నన్నుఁ గరుణఁ జూడవు పిన్నవాఁడఁ గాపాడవే వేఁడికన్ను
గలవేల్పుదొరసాని కడలికూఁతురిముద్దుఁగోడలిదయను జేకుఱినవిద్య
కొలఁదిని నిన్ను వేపలుకులు శతసీసపద్యంబులు రచించి ప్రస్తుతించి
తి నిది యొప్పో విధించిన గొప్పతప్పో తెలియ నామనవిని నాలించి తప్పు
లున్న సైరించి రక్షించు నన్నుఁగని విరించినుతనామ పెదనపురీలలామ-౯౬
ము న్ననేకవిధంబుల న్నిన్ను వేఁడుకోఁగా నేఁడె(వింట)నే కనికరింపుఁ
జూడ్కి నాపై మించు సోఁకిన మాడ్కి నింతియె చాలు       కాదేసమస్త
లోకంబు లేకాల మాకాంక్ష నానావిధైశ్వర్యభోగంబు లనుభవించి
తుది ముక్తి సతినిఁ జెందుట కాదికారణం బగునననేమిట నరయ మోక్ష
లాభలోభంబు గలదె చేటీభవ   ,        శ్యామ పెదనపురీలలామ-
నీయనుగ్రహమున నేఁటి కీవిధిఁ గృతకృత్యుఁడనైతి నిఁకేమి చెప్ప
వచ్చు నాభాగ్య ముర్వర నస్మదీయ మిత్రసమూహమున కభ్యుదయపరంప

రాభివృద్ధి ఘటించె నహితుల కెల్లఁ బరాభవం బొనఁగూడెఁ బ్రాభవంబు
శోభించె నత్యంతశుద్ధమానసులకు భవదీయపాదసేవకుని వినుతి
హితమతి గ్రహించి లాలించుకతననతుల, తృప్తిఁజెందవె పెడనపురీలలామ-

బ్రాహ్మణుల కభీష్టఫలదాయివై సదాచారసంపత్తి విశ్వంభరార
ముఖులకు రాజ్యసామ్రాజ్యంబు వైశ్యుల కర్థగౌరవము చతుర్థవర్ణ
మునకు ధాన్యవిశేషములు నిరంతరభోగములు పౌరులకు నెల్లఁగలుగఁజేసి
వెలసి దేవాంగర్షికులసంభవుల కిలువేల్పవై ప్రీతిఁ గావించి జగము
లరసి కాంచితి శాంతగుణాభిరామ, రిపుగణవిరామ పెడనపురీలలామ-౯౯

పెంపుదీపింప మల్లంపల్లిమల్లికార్జునపండితారాధ్యవినుతిపూర్వ
కంబైన యీకవిత్వం బాసుధాధామతారార్క-మఖిలసద్గౌరవంబు
గా విశ్వసించి నన్నావవే కృతకృత్యుఁ జేయవే సౌభాగ్యసిద్ధిదాయి
నీ 'నిత్యమంగళాని భవంతు తే' యని మంగళారాత్రిక లంగనామ
ణీగణ మొసంగ ముదుదధిం దేలి శూలి, పాలి మేలైతి పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామి వామభాగ, చంద్రశాలాసభాలంబ శ్యామలాంబ.

శ్రితకల్పభూజ దాసీభూతదేవతావనితాసమాజ పావనహిమాచ
లాధిరాజతనూజ హరిదశ్వకోటివిభ్రాజితతేజ సంక్రందనాది
బృందారక విరచిత రత్నమయూఖనీరాజితారు
ణాంఘ్రిసరోజ బ్రహ్మజ్ఞానశాసితాశేషపరివ్రాజ శేషఫణివి
భూషణార్ధాంగ రాజ్యవిశేషభోగ, శీలసమ్రాజ పెడనపురీలలామ
రామలింగేశ్వరస్వామివామభాగ, చంద్రశాలాసభాలంబ శ్యామలాంబ.

(ఈశతకము, జగ్గయ్యపేట- ములుగు వీరభద్రశాస్త్రిగారిచ్చినది.)

శ్రీరస్తు.

# ౬- కంచి యేకామ్రలింగశతకము.

సీసపద్యములు.

శ్రీపార్వతీశ్వర శృంగారశేఖర యహిరాజకేయూర యమవిదూర
గంగాజటాధార కమనీయఘనహార హార వైరివిదార యచలధీర
విబుధజనాధార విరహితసంసార నిత్యలోకపరివార సితశరీర
మునిబృందమందార మూర్తిత్రయాకార శరనిధిగంభీర ధరనివార
భువనసంచార సంతతభోగసార, చంద్రకోటీర భీకరసమరశూర
మదనమదభంగ మహితక్షమాశతాంగ, కరధృతకురంగ కంచియేకామ్రలింగ.

అజ్ఞానశిఖినేత్ర యబ్జసన్నిభగాత్ర యఖిలలోకపవిత్ర హర పరాకు
ద్విరదాసురవిదార దివిజాద్రిసమధీర భరితాహికేయూర భవ పరాకు
గళనైల్యజితభృంగ కలుషహిమపతంగ కరుణాంతరంగ శంకర పరాకు
కఠినాసురత్రాస కైలాసగిరివాస శిష్టజనోల్లాస శివ పరాకు
ఆర్యసన్నుత నందివాహనపరాకు, భంజితవ్యాఘ్రదైతేయ బహుపరాకు
మదనమదభంగ మహితక్షమాశతాంగ, కరధృతకురంగ కంచియేకామ్రలింగ.

రజతాచలస్థాన గజచర్మపరిధాన శంభో మహాదేవ శరణు శరణు
సకలలోకాతీత సద్గుణసంఘాత చంద్రార్కశిఖినేత్ర శరణు శరణు
నిగమసన్నుతగాత్ర నిర్మలచారిత్ర శర్వాణివల్లభ శరణు శరణు
పన్నగభూషణ పాపసంశోషణ శారదాపతినుత శరణు శరణు
చండకోదండపాండిత్య శరణు శరణు, జలజజార్చితపాదాబ్జ శరణు శరణు
మదనమదభంగ మహితక్షమాశతాంగ, కరధృతకురంగ కంచియేకామ్రలింగ.

వ్యాసభారద్వాజ వాల్మీకివాసిష్ఠ గౌతమజాబాలికణ్వకుత్స
సుబలగాలవదాల్భ్యశుకశౌనకాత్రేయ మాండవ్యహారిద్ర్యమందపాల
కబలివిశ్వామిత్రఘటవాయుభక్షకగార్గ్యమైత్రేయకటకలాప
భార్గవజైమినిబకకౌత్సజతుకర్ణగోకర్ణకశ్యపగోపవేశ
అత్రిత్రితత్రిరివసుమిత్రయాజ్ఞవల్క్య, శృంగిబృహదశ్వగౌతమసేవ్యమాన
మదనమదభంగ మహితక్షమాశతాంగ, కరధృతకురంగ కంచియేకామ్రలింగ. 4

నాటకాలంకారనైపుణి నహినహి శబ్దశాస్త్రజ్ఞానసరణి సున్న
సాహిత్యరసవృత్తిజాడలే తెలియవు ప్రాసవిశ్రమగణఫణితి నాస్తి

గ్రామ్యదేశీయాది గ్రంథముల్ నేరను రచనాచమత్కృతి రాద యింకను
భవదనుగ్రహబలపాండిత్యమేగాని యితరపాండిత్యంబు లేమి లేవు
గాన జిహ్వాగ్రమున నిల్చి కరుణతోడ, శతకమీడేర్పు వేగమే సార్వభౌమ
మదనమదభంగమహితక్షమాశతాంగ,కరధృతకురంగకంచి యేకామ్రలింగ.5

నీవె నాతండ్రివి నీసతియైనట్టి కామాక్షి దేవియె కన్నతల్లి
గజముఖభైరవక్రౌంచారులగ్రజుల్ ప్రమథగణాదులె బంధుసమితి
వాకిటికావలివారు సామంతులు భక్తసంఘంబులె ప్రాణసఖులు
నీదుసంకీర్తనల్ నిఖిలమంత్రంబులు నీపదద్వయభక్తి నిత్యముక్తి
యనుచు నెఱనమ్మిమదిలోన ననుదినంబు,భక్తియుక్తుండనై చాలఁ బ్రస్తుతింతు
మదనమదభంగమహితక్షమాశతాంగ,కరధృతకురంగకంచి యేకామ్రలింగ.

పరమేశ్వరా భవత్పాదాబ్జయుగ్మంబుఁ గనుఁగొన నెన్నఁడు కలుగునొక్కొ
సాంబ సదాశివ సంధ్యానటనలీలఁ బరికింప నెన్నఁడు ఫలితమొక్కొ
పుణ్యజనాంతక భూతిత్రిపుండ్రంబుఁ జూడ నెన్నఁటికిని సులభమొక్కొ
యిందుశేఖర నీమందిరంబై తగు కైలాసమెన్నండు గాంతునొక్కొ
యనుచు నీమూర్తి మదినుంచి యనుదినంబుఁ,బూజసేయుదు సద్భక్తిపుణ్యచరిత
మదనమదభంగమహితక్షమాశతాంగ,కరధృతకురంగకంచి యేకామ్రలింగ.7

అనఘగుణోదారుఁ డసురవైరివిదారుఁ డబ్జాద్రిసమధీరుఁ డఘవిదూరుఁ
డాశ్రితావనశీలుఁ డమితకీర్తివిశాలుఁ డంచద్విబుధపాలుఁ డతికృపాళుఁ
డార్యరక్షణధుర్యుఁ డంభోధిగాంభీర్యుఁ డకలుషాద్భుతచర్యుఁ డతులశౌర్యుఁ
డహిరాజభూషణుఁ డానమత్పోషణుఁ డార్ద్రసంభాషణుఁ డమితధిషణుఁ
డనుచుఁ గొనియాడఁదగిననిన్నాశ్రయింతు,భక్తవత్సలననుఁబ్రోవుపరమపురుష
మదనమదభంగ మహితక్షమాశతాంగ,కరధృతకురంగకంచి యేకామ్రలింగ.

హారీకృతభుజంగ వారాన్నిధినిషంగ భాసమానపరాంగభరితగంగ
లసితదృక్కాసారరంగలాంఛనాబ్జపతంగ విధ్వస్తమాతంగ వృషతురంగ
రక్షోభయదసంగరపరాక్రమోత్తుంగ తాండవోత్సవసంగ ధవళితాంగ
కంఠరుగ్జితభృంగ గౌరీపరిష్వంగ కరుణామృతతరంగ కనదపాంగ
యాశ్రితావనచంగ కాలాభిషంగ, హరిహరిరథాంగ వరనిర్మలాంతరంగ
మదనమదభంగమహితక్షమాశతాంగ,కరధృతకురంగకంచి యేకామ్రలింగ.

ఐశ్వర్యమొసఁగి నన్నాదరింపక యున్న నీశ్వరుం డనుమాట యొగ్గుగాదె
దారిద్ర్యభూతంబుఁ దలఁగఁ జేయక యున్న భూతేశుఁ డనుమాట పొల్లుగాదె

యొక్క నిరక్షింప నెక్కువై తోఁచినఁ బ్రమథాధిపతియన్నఁ బ్రజ్ఞగాదె
భక్తవాంఛితసుఖప్రదుఁడు గాకుండిన శంకరుఁడనుమాట బొంకుగాదె
యైనఁ గానిమ్ము నీకేమి యప్రతిష్ఠ, యాదిభిక్షుకుఁడనునామ మందినావు
మదనమదభంగమహితక్షమాశతాంగ, కరధృతకురంగకంచియేకామ్రలింగ.

ఈశ్వరా నినునమ్మి యింతదీనతఁజెంద నూరకేయుంచుట యుచితమగునె
ఎంతనిర్దయుఁడవో యిందుకళాధర మందమో నీబుద్ధి మానిరీతిఁ
బలుకకున్నావదె పార్వతీసురధునీకలహంబుచే బుద్ధి కలఁకఁబడెనొ
కటకటా భక్తునిఁ గాసిచేయుట మహాగాంభీర్యమా కాదు కరుణఁజూచి
సకలసంపత్కరునిఁజేయు సార్వభౌమ, లేకయుండిన సత్కీర్తి నీకుఁగలదె ?
మదనమదభంగమహితక్షమాశతాంగ, కరధృతకురంగకంచియేకామ్రలింగ.

మిం-టికి మంటికిఁ గంటకమగుగుంటి నంట గెంటించిన యింటిమేటి
బంటువుంగన్న ముక్కంటి నీచర్యలు వింటివి గంటిని తుంటవింటి
దంటను నీకంటిమంటను నంటించి కంటికి నెడఁబాపి తంట దుఃఖ
మంటినకల్మివాల్గంటి దనంటిన గొంటుకోపంబున నుంట తెలిసి
తంట లేకుండ మదను నుదారఫణితిఁ, దిరిగి బ్రదుకంగఁ జేసిన ధీరుఁడీవె-మద,

ఆగముతో మన్మథాశుగముతో దుర్వర్ణనగముతో (నాదిపన్నగముతోడ)
రసముతో శుభ్రసారసముతో మహితగోరసముతో సురధునీరసముతోడఁ
గరముతో నాదిసూకరముతోఁ దార్క్ష్యకంధరముతో దేవసింధురముతోడ
నాజితో సురరాజవాజితోఁ దారకారాజితో సామజోద్వేజితోడ
ననుగమించి భవద్యశంబఖిలదిశల, మించె బ్రహ్మాండదీప్తిపై మిక్కుటముగ-మద-

అహివైరిరిపుమస్త మబ్జమధ్యంబున యవిభిచ్ఛురాహతి నడఁచువాని
కగ్రజుచేతఁ బరాభవంబును బొందు క్షితిదేవముఖ్యుని శితశరాళి
నొంచి యోర్చినవీరు నురుశిలీముఖముల నవనిఁగూర్చినమేటి కఠినచూర్ద్రి
భావసంకలితుఁడై పరమసాధన మగు కంకపత్రమొసంగుఘనుఁడ వనుచు
నిన్నుమదినుఁతువర్ణింతునియతిఁగాంతుఁ, బన్నగారితురంగ ప్రసన్నుఁడౌర-

గంభీరమగు ఘనాఘనము మ్రోసినరీతి గర్జింప దివి భువి కంగు రనఁగ
నందీశుహుంకారనాదంబుచేతను దిగ్గజకర్ణముల్ దిమ్ము రనఁగ
ఫాలనేత్రప్రభాపటలిచే బ్రహ్మాదిసురమునిదృక్తతుల్ చుఱ్ఱుమనఁగ
ముమ్మొనవాల్కైల మురువుగాధరియింప దనుజులహృదయము ల్దగ్గురనఁగ
సరభసమ్మున నంధకాసురునిఁజుట్టి, పట్టికొట్టిన బల్జగజెట్టి వీవు, మదన-

కొక్కు తేజీగానిఁ బక్కి బాబాపైని నెక్కి యాడెడువాని నొక్క మొగిని
మక్కువ దయను బెంపెక్కఁ జేసిన యట్టి చక్కనిసామి నీయక్కటాక్ష
మిక్కడే. నామీఁదఁ జొక్కముగా నుంచు తక్కువ గాకుండ నిక్కముగను
నెక్కువదారవని మిక్కిలి వేఁడితిఁ జక్కఁగ దయఁజూడు చిక్కులేక
యెక్కడెక్కడ నీసాటి యెంచఁదఱమె, యొక్క దేవతనైన నీయుద్దిగాఁగ, మదన-

"బ్రహ్మోఽహ"మనుచును భాషింపఁగావచ్చుఁ బరతత్త్వమెఱిఁగెడి భావమరుదు
సకలంబు రోసితి సన్న్యాసి ననవచ్చుఁ బ్రకృతివిచారంబుఁ బాయుటరుదు
వేదశాస్త్రంబుల వాదింపగావచ్చు నాత్మార్థసుజ్ఞాన మబ్బుటరుదు
బాహ్యయోగంబులు పాటింపఁగావచ్చు సద్గురుపూజయుఁ జలుపుటరుదు
జ్ఞానయోగంబుగహనంబుగానముక్తిఁ, గాంతురనఘులు భక్తియోగంబువలన
మదనమదభంగ మహితక్షమాశతాంగ- 17

మొదట మూలాధారమునఁ జతుర్దళపద్మమందలిగణపతి నమరనిలిపి
కుండలి భేదించి గురుకటాక్షముచేత నాభిప్రదేశమ్మునందు విష్ణు
నొనరఁగ బూజించి ఘనుని సదాశివు హృత్పద్మకర్ణిక నునిచి ద్విదళ
పద్మముననుభానుఁ బ్రస్తుతిగావించి దగ వేయిరేకుల తమ్మియందు
నిన్నుఁ బరహంసరూపుని నెమ్మిఁగాంచి, చిద్విలాసంబుననుబూజ సేతు నేను
మదనమదభంగ మహితక్షమాశతాంగ, కరధృతకురంగ కంచియేకామ్రలింగ.

బాణాసురుండు నీబావకుఁ దమ్ముఁడా? కరుణతో వానిని గాచినావు
పంక్తికంఠుండు నీపడఁతితోఁ బుట్టువా? సకలసామ్రాజ్యముల్ సంఘటింపఁ
జండీశ్వరుం డేమి శాంభవీజనకుఁడా? సాలోక్యమొనరించి సంతరింప
హరిహయసుతుఁడు నీయగ్రనందనుఁడే మొ? యవ్యాహతాశుగమతని కొసఁగ
నింతకరుణాసముద్రుఁడ వేల నేను, సంతతము నిన్ను నుతియింపసరకుగొనవు-

నతిపతులకు నేమి సంతోషమొనఁగూర్చు సకలసస్యములకు శరణమేమి
భూమిజాజనకుని పుటభేదనం బేమి బిల్లులు కడియును లల్లులేమి
రామపాదము సోఁకి రాయి యేమాయెను గోరక్షకేది హరిగోడుఁగుఁదాల్చె
బలరాముఁడుధరించు పటుసాధనం బేమి యాంజనేయున కేమి యడ్డమయ్యె
నర్థము వచింపమూఁడేసియక్షరములు, యంత్యవర్ణంబు నావలనాదియగును-

వేదవేద్యా భవద్వీర ప్రతాపంబు దక్షాధ్వరధ్వంసతరుణమందుఁ
జూడవద్దా మఱిచుఱుకుముమ్మొనవాలు కెలునఁగీలించి కినిసి భద్ర

చ. దినకరతేజుఁ డా జనపతిం గని దీవన లిచ్చి విప్రుఁ డి
ట్లనియె నృపాలశేఖర దయాపరిపూర్ణ మదీయభాగ్యజీ
వన యిది నాతనూభవ వివాహము చాగదు నేఁడు మేరగా
నెనిమిదియేఁడు లయ్యె ధనహీనుఁడఁ గావున వేఁడవచ్చితిన్. ౨౩

సీ. రాజ్యంబు వదలక రసికత్వ మెడలక జయశీల ముడుగక నయము చెడక
దీనులఁ జంపక దేశంబు నొంపక నిజ ముజ్జగింపక నేర్పు గలిగి
విప్రులఁ జుట్టాల వెన్నుసొచ్చినయట్టివారిని గొల్చినవారిఁ బ్రజల
హర్షంబుతోఁ గాచి యన్యాయమునుపుచు మున్ను చెప్పినరీతిఁ జెన్నుమీఱి
చేఁత లొండు లేక ప్రాఁతల విడువక, యశము కలిమి దమకు వశముగాఁగ
వసుధ యేలు రాజవర్గంబులోన న,య్యాదివిష్ణుమూర్తి వంత్రు నిన్ను. ౨౪

వ. ఈసీసపద్యంబులో గీతసహితంబుగా నాఱుపాదంబుల మొదలియక్షరం
బులు, నందర్భంబుల మొదలియక్షరంబులుఁ గ్రమంబునం గూడుకొనంగ
నైన నా విన్నపం బవధరింపు మనిన నచ్చెరు వంది క్రమ్మఱం జదివించి
మొదళ్ళ నర్థంబులఁ బండ్రెండక్షరంబుల నిడుకొని "రాజ దీని వివాహము
చేయవయ్యా" యని యున్న బంధకవిత్వంబున కతి విస్మితుం డై తద్దైన్యం
బుడుపం బూని. ౨౬

క. జననాయకుండు విప్రున, కెనిమిదికోట్లర్థ మిచ్చి యెల్లనరేంద్రుల్
తనుఁగొల్చినడువఁగా నొ,య్యనఁబురికరుదెంచె వైభవాఢ్యత మెఱయన్.

క. కావున నీవాతని సరి, గావు నృపా మగిడిచనుట కార్యం బనినన్
భావమునఁ దద్గుణము సం,భావించుచు భోజవిభుఁడు మగుడంజనియెన్. ౨౮

వ. మఱియుఁ గొన్నిదినంబు లరిగినఁ బదియేడవవాకిటం జనం జూచి. ౨౯

## —॥ పదునేడవబొమ్మకథ. ॥—

క. నీలాంబరసోదరు రజ,నీలాంఛనదివసచిహ్న నేత్రవిలాసున్
నీలగ్రీవప్రియసఖు, నీలోత్పలనీలవర్ణు నీలారమణున్. ౩౦

శా. తాత్పర్యంబున సంస్తుతించుచుఁ బ్రశస్తం బైనలగ్నంబునన్
సత్పాత్రప్రతిపాదితార్థుఁడయి భోజక్షోణిపాలుండు సం
పత్పూర్ణంబగు వైభవంబు మెఱయ న్భద్రాసనం బెక్కఁగాఁ
దత్పాంచాలిక నిల్వు నిల్వు మని తత్రస్ఫూర్తిగా నిట్లనున్. ౩౧

క. నృపరత్న మైనయుజ్జయి, నిపతిక్రియ సాహసాదినిపుణత్వము న
త్త్యుపకారంబును గలుగక, చపలమతీ దీని నెక్కఁ జనునే నీకున్. ౮౨

క. ఉర్వీనాయకుఁ డయ్యును, నిర్వాణుల మీఱి యర్థనిస్పృహుఁ డగునా
సర్వజ్ఞుని సద్గుణములు, నిర్వచనముగాఁగ వినుము నే వినిపింతున్. ౮౩

క. మాటలయం దెఱిఁగెద వే, నాఁటను ముంజేతికంకణంబున కద్దం
బేటికి వితరణగుణమునఁ, బోటిల్లెడి గుణము లెల్లఁ బ్రభువుల కుర్వీన్. ౮౪

క. మతిగలిగి చదువఁ జిలుకలు, *హతమందంగాను బోటులాడుం బసువుల్
వితరణ మెవ్వని గుణమగుఁ, జతురుఁడు శూరుఁడు నతఁడె జనులం దెల్లన్.

గీ. విక్రమార్కుబాహువిక్రమం బుర్విలో, నరులచేత నెల్ల నరులుగొనఁగఁ
గీర్తనీయ మైన కీర్తిఁ గీర్తించుచు, నర్థు లర్థములఁ గృతార్థు లైరి. ౮౬

సీ. ఆదివసములవర్షార్త్యయోచితముగా దలమైన వానలు వెలుచునంతఁ
దెల్లవాఱినయట్టితెఱఁగున నా వేళఁ దనమేళనం బెల్లజనులు పొగడ
హంసనాదములు కాహళలుగాఁ దత్పక్షలఘుతాడనములు తాళములుగాఁగ
మదములఁ గ్రాలు తుమ్మెదలఝుంకారమ్ము లమరినవీణాస్వరములొయనఁగ
యోగనిద్రఁ జెందియున్నవిష్ణుని మేలు, కొలుపఁగడఁగు గాయకుం డనంగ
బంధుజీవహారపరమాచుఁ దద్రాగ, మయముగా శరత్సమయ మొనర్చె. ౮౭

క. శరదాగమమున నంభో, ధరపటలము విచ్చి చనిన, దపనుండు మహా
కరి తెరవెల్వడుక్రియఁ బు, ష్కరవిలసన మలరఁ జెలఁగెఁ గరసత్త్వమునన్.

క. పంకంబులాఱె నేఱుల, పొంకంబులు డిగ్గె తెల్లు పూచెను భువి ని
శ్శంకముగ నంచపిండు కొ, లంకుల విహరించె నట జలమ్ములు దేఱెన్. ౮౯

ఉ. దీప్రముఖంబులొచు నలుదిక్కులు నేర్పడ దుగ్ధసింధుపూ
రప్రభ నొప్పవెన్నెలలు రాత్రి దివాకృతిఁ దేజరిల్ల లో
కప్రియుఁ డైనచంద్రు నమకక్ష్యలఁ జుక్కలు నిక్కఁగాఁ దదీ
యప్రతిబింబలీలఁ గుముదావళి పొల్చె సరోవరంబులన్. ౯౦

ఉ. తెల్లనిరాజహంసలను దెల్లనికల్వలఁ దెల్లఁదమ్ములం
దెల్లని తెల్లఁబువ్వులను దెల్లనిశీతమరీచిరోచులం
దెల్లనిచుక్కలన్ జగము తెల్లనయై యమృతాభిమీఱినం
దెల్లనికన్నుదోయిగల దేవర వచ్చె శరత్తు చూడఁగన్. ౯౧

*హతముగఁబోట్లాడు పసులు నజ్ఞానకృతుల్ ఇపా.

క. జడి గాక వెట్ట గాకయు, వడ గాకయుఁ జలియుఁ గాక వఱపిడి యనియే
ర్పడక యిలఁ బసిమివండఁగ, బడుగులు ప్రియమాదిరనఁగఁ బ్రభులకుఁదగదే.

చ. అవని నవంతిభూమివరుఁ డాదిగఁ బార్థివులెల్ల లక్ష్మియు
త్సవములు మున్నుగాఁ గడుఁ బ్రశస్తముగా సమయంబులందు న
ర్థ్యపులను బాఠకోత్తముల గాయకుల న్నటుల న్వితీర్ణవై
భవములఁ దన్పఁజొచ్చిరి ప్రభావసమృద్ధుల నిండు పుట్టఁగన్. ౧౩

ఉ. అట్టిదినంబుల న్నృపకులాగ్రణిదానసమృద్ధి యొక్కొకన్
బట్టు నుతింపఁగాఁ బరన్నృపాలకు లచ్చెరువంది మెచ్చ నా
యట్టిమహీశుఁ డర్థులఁ గృతార్థులఁ జేయుచుఁ గీర్తిచేకుఱం
బెట్టెడునట్టిసద్గుణము పెంపున నాతని మీఱనోపఁడా. ౧౪

క. అని యడిగిన నాబట్టో,య్యాన నవ్వుచు నోనృపాల హరుని ప్రసాదం
బున సిద్ధపురుషుఁ డగు నా,జననాథుఁడు గుణములందు సామాన్యుండే. ౧౫

క. దానపాత్రంబులు నా, మానవపతియందకాని మఱి యొందు దెసం
గానము విను మాతని సరి, పూనెద మనఁ దరమె తరణిపుత్రునకైనన్. ౧౬

మ. అనినం జిత్తములోన లజ్జయు వృథాహంకారముం బుట్టఁగాఁ
దనలోఁ దాన యడంచికొంచు మృదువస్త్రస్వర్ణభూషాదు లా
తని కింపొందఁగ నిచ్చి పుచ్చి పిదపన్ దానంబున న్విక్రమా
ర్కునిసాదృశ్యము నొందఁగోరుమతి నాక్షోణీశ్వరుం డుండఁగన్. ౧౭

సీ. ఒకనాఁడుకొల్వులోనికి సిద్ధుఁ డొకరుండు చనుదెంచి సుఖగోష్ఠిజరపునపుడు
తాపసోత్తమ నాకు దానగుణంబున విక్రమార్కుని మీఱ వెరవు గలదె
యనవుడు సాహసహవనంబు చేసిన సిద్ధించు నందుల చేఁత వినుము
యోగినీచక్రంబు నొందుకుండములోన నొకలక్షగోఘృతాహుతులఁ బోసి
పొదలఁజేసి మేను పూర్ణాహుతిగ వేల్చి, వెనుకఁదత్ప్రసాదమున నె బ్రదికి
దాన విభవమునకుఁదగినంత వేఁడుము, మెఱసి సాహసాంకుమీఱవచ్చు. ౧౮

చ. అనవుఁడు నుత్సహించి నృపుఁ డాతని వీడ్కొని రాత్రి సర్వయో
గినులఁ దలంచుచుం జని సకీలకమంత్రజపంబుతోఁ దదీ
యనిలయవహ్నికుండమున నాహుతు లన్నియుఁ బోసి తెంపునం
దనువును వేల్చె నిత్యమగు దానము ద్దేహముకంటెఁ దీపిగాన్. ౧౯

క. ఆయెడ యోగిను లాజన, నాయకు బ్రదికించి నిలిపి నరనాథ మము
న్నీయత్నంబునకుం దగ, నేయిష్టంబైన నడుగు మిచ్చెద ననుచున్. ౧౦౦

క. దండాకృతిగా జనపా, లుండును ధరఁ జాఁగి నిచ్చలును ధనములు నా
భాండాగారము లేదును, నిండం గరుణింపుఁ డనిన నేర్పున వారున్. ౧౦౧

క. నిచ్చలు నీరీటు చేసిన, నిచ్చెద మీకొలఁది నిండు లేదును నిండ
స్వేచ్ఛించుకొమ్ము నాపుడు, నచ్చట నృపుఁ డియ్యకొని గృహంబునకరిగెన్.

ఉ. ప్రాగ్దున లేచి యిండ్లు ధనపూర్ణము లౌట యెఱింగి యాత్మలోఁ
దద్దయు సంతసిల్లి వసుధావరుఁ డుజ్జయినీశు మీఱుచుం
బెద్దల నంధులన్ హితులఁ బేదల నందఱఁ గూర్చి యర్థముల్
దొడ్డలు చేసె దాననిరతుం డనఁ బైకము చిక్కకుండఁగన్. ౧౦౩

క. ఈగతి ననుదినముసు భాం, డాగారము లెల్ల రిక్తలైనం దనువ
ద్యోగినులకు నాహుతిగని, యోగించుచు నిచ్చధనములొసఁగుచునుండున్

ఉ. ఈక్రియఁ బర్వుకీర్తి నుతియించుచు యాచకు లెల్లఁ జెప్పఁగా
నాక్రమ మేర్పడ న్వని ప్రియంబును జోద్యము నగ్గలింపఁగా
విక్రమభూషణుండు ముని వేషముతో నటకేగి యోగినీ
చక్రగృహంబులో నతని సత్త్వముఁ జూడఁ దలంచి యుండఁగన్. ౧౦౫

ఉ. ఆనగరంబులోని నృపుఁ డల్లన రే యరుదెంచి మంత్రని
ష్ఠానిరతాత్ముఁడై జపము సల్పి ఘృతాహుతులిచ్చి యగ్నిలో
మేనును వేల్చి యోగినులమెచ్చునఁ దొల్లిటిరూపుదాల్చి యా
పూనిక నర్థము ల్వడసి పోయి భజించె వితీర్ణిఁ గర్ణుఁడై. ౧౦౬

క. మఱునాఁటిరాత్రి మునుకడఁ, దటి యెఱిఁగి యవంతి విభుఁడు దయదైవాఱం
గొఱఁతపడకుండ వెరవుగ, నెఱమంటలకుండ మున్నయెడ కరుదెంచెన్.

క. ఆహోమకుండమునఁ దన, దేహము వేల్వంగ నచటి దేవత లెలమి
న్సాహసము మానుపుచు నీ, యూహిత మేదేని వేఁడు మిచ్చెద మనినన్.

గీ. ఇచటి భూమిపాలుఁ డీక్రియ నిచ్చలు, మిడుకునగ్నిలోనఁ బడకమున్న
యతనియిండు లెపుడు నర్థంబుచేనిండి, యుండునట్లుగ వర మిండు చాలు.

క. అనవుడుఁ గొనియాడుచు న, ట్లొనరించెద మనుచుఁ బలికి యోగినులంతం
జనిరి నిగూఢుండై నృపుఁ, డు నవంతికి మగిడె నొక్కఁడును బెంపెక్కన్.

సీ. తదనంతరంబ యాతఁడుతొంటిక్రియవచ్చియూగంబుసేయఁగాయోగమాత
లరుదెంచి నృపుని ప్రయాణంబునకు నక్ష మై విక్రమార్కధా త్రీవిభుండు
తనమేనువేల్వఁ గైకొని మున్ను మెచ్చించి నీయుంక్లు ధనమున నిండఁజేసె
నిచ్చలుఁ జావక విచ్చలవిడి ధన మింతైన నర్థుల కిచ్చికొన్ను
నావుడు నతండు దురభిమానంబు విడిచి, విస్మయంబును లజ్జయు విస్తరిల్ల
మీఱఁజూచటు తనుమీఱిమెఱసినట్టి,యతనిఁబొగడుచునగరికినరిగెఁగాన.

క. నీవును నాక్రియ నింటికిఁ, బోవుట మే లనుచుఁ గనకపుత్రిక వలుకం
గా విని యాతఁడు నుజ్జై,నీవల్లభుకృపయుఁ దెంపు నేర్పునఁ బొగడెన్.

క. లగ్నము దప్పినచొప్పుల, భగ్నంబగు యత్నమునకుఁ బొరులు మది ను
ద్విగ్ను లయి చనఁగ లజ్జా,మగ్నుండై భోజరాజు మగుడం జనియెన్.

—పదునెనిమిదవబొమ్మకథ—

వ. తదనంతరంబ యొకదినంబున నష్టాదశద్వారంబునం బవేశోన్ముఖుండై.

క. వెలిపట్టును బులితోలును,మలయజమును బూదిపూఁత మణులున్ ఫణులుం
దిలకము నెఱగన్నుం గల, వెలఁదియు మగవాఁడునైన వేల్పుఁ దలంతున్.

మ. అని భోజక్షితినాయకుం డమరపీఠారోహణవ్యగ్రుఁ డై
చను దేరం గని బొమ్మ వల్కె ధరణీశా విక్రమాదిత్యు చా
డ్పున వర్తిల్లక ఘనధైర్యము న్వితరణంబు న్లేక నీకీమహా
సన మెక్కం దర మౌనె యాతని మహోత్సాహంబు సామాన్యమే. ౧౧౬

క. జనవర నిర్వచనముగా, విను ముజ్జయినీవిభుండు విష్ణునిక్రియఁ బా
లనశక్తి మెఱసి మనుజుల, మన మలరఁగ మనుపుచుండి మహి యేలంగన్.

ఉ. క్రూరుఁడు నీరసాత్ముఁడును గుచ్చితబుద్ధియు దూషకుండు నా
చారవిహీనుఁడున్ ఖలుఁడు సత్యవిదూరుఁడు దుర్నయాఢ్యుఁడుం
జోరుఁడు నస్థిరుండు నలసుండును దుర్బలుఁడు న్మదాంధుఁడు
న్నారవికారకష్టుఁడును మందుఁడు మందున కైన లేఁ డిలన్. ౧౧౭

క. ఆదివసంబులలో నొక, వైదేశికుఁ డరుగుదెంచి వసుధాపతిచే
నాదృతుఁ డై యతనికి నా,నాదేశస్థితులు నేర్పునం జెప్పంగన్. ౧౧౮

గీ. మాటలందె యతని మహిమెల్లఁ దిరిగిన, ఘనుని సిద్ధపురుషుఁగా నెఱింగి
మిగుల నాదరించి జగతీవరుండ

క. నిశ్చయముగ భువిఁ దీర్థపు, రశ్చరణాసక్తి నుత్తరము దక్షిణముం
బశ్చిమముఁ దూర్పుఁ దిరిగితి, వాశ్చర్యం బేమిగంటి వానతి యిమ్మా. ౧౨౧

క. నావుడు నాతఁడు నేఁ బృ, థ్వీవలయం బెల్లఁ గలయఁ దిరిగితి నుదయ
గ్రావసమీపంబున నా, నావిధమణిరమ్య మైన నగరము గంటిన్. ౧౨౨

క. కనకాహ్వయ మగునగరము, కనకాచలతట మనంగఁ గాంతిం బొలుచున్
ఘనమండల మందుచు న, గ్నవిమండల మనఁగఁ బసిఁడిగుడి గల దచటన్.

క. సూర్య ప్రభయను నది త, త్పర్యంతమునందునుండి పాఱఁగ నతిగాం
భీర్యంబు గలిగి నడుకొని, మర్యాదనె నీరు నిలిచి మడుఁగై యుండున్.

గీ. అచటఁ జంద్రకాంతఖచితసోపానమై, నాల్గుదెసలఁ గాంచనంబులైన
హర్మ్యముల భజించు నఘనాశనం బనఁ, గలదు తీర్థము కడ గానరాదు.

మ. విను మావింధ్యమునందుఁ బ్రోద్భవ శిరోవిన్యస్తపీఠాంక మై
కనకస్తంభము పుట్టి పుట్టి యినుఁడాకాశంబు న్రాఁకంగఁ దా
నును నాచొప్పునఁ జక్కఁగాఁ బెరిఁగి భానుం జేరి మధ్యందినం
బునఁ దద్బింబము ముట్టి క్రమ్మఱ నదిం బ్రోద్దున్ దిగం జాఱఁగన్. ౧౨౬

గీ. ఇనుఁడు గ్రుంకువేళ నిక్కడఁ దాఁ గ్రుంకుఁ, బొడుచువేళ నట్ల పొడిచిపెరుఁగుఁ
జిత్ర మిద్ది రాజశేఖర సృష్టిలో, నలువనేర్పు చెప్ప నలవి యగునె. ౧౨౭

క. ఎన్నఁడు నిట్టి విచిత్రము, కన్నది విన్నదియు లేదు కడపట గుణసం
పన్నుని సజ్జనమిత్రు జ, గన్నుత నినుఁగంటి ననినఁ గడుమోదమునన్.

శా. తత్కాలోచితగోష్ఠి దీర్చి యతనిం దాంబూలపూర్వంబులౌ
సత్కారంబుల నాదరించి కొలువుం జాలించి యారాత్రి యు
ద్యత్కౌతూహలుఁ డౌచు ఖడ్గసహితుం డై యొక్కఁడు న్భూవరుం
డుత్కోచంబున నేగె నాదెసకు నాయుగ్రాటవు ల్దాఁటుచున్. ౧౨౯

మ. ఘనుఁ డ ల్లోగుచుఁ గాంచెఁ గాంచనమయాగారప్రకీర్ణాఘనా
శనతీర్థాంతసమున్నమన్నిజవపుస్సంభూతి హేతుప్రచా
లనలీలాకృతడంబరాంబరతలాలంబోన్నరుగ్బింబచుం
బనవిస్రంభవిజృంభితాద్భుతరసప్రారంభమున్ స్తంభమున్. ౧౩౦

సీ. కని విస్మితుం డౌచుఁ జని హేమగృహముల రత్నగోపురముల రమ్యమైన
పురము డగ్గఱి దాని పొంత సూర్యప్రభ నానొప్పు నేఁటిలో స్నానమాడి

గుడిలోని యాదిత్యుఁ గడుభక్తిఁ బూజించి యిష్టదైవముఁ బరమేశుఁ గొల్చి
యుపవాస ముండి సముత్సుకుఁ డై దేవతాయతనమున నా రేయి గడిపి
రేపకడన లేచి పాపవినాశన,తీర్థమునకు నేగి వార్థిపుంజు
జలకమాడి యచట సంధ్యనారాధించి, జలజమిత్రు నాత్మఁ దలఁచునపుడు.

గీ. తెలివిపడఁగ మొదలి దిక్పతి కెత్తిన, గొనగుమీఁది పసిఁడిగుబ్బ యనఁగఁ
దూర్పుకొండమీఁదఁ దోఁచె మార్తాండుఁడు, మండలంబు భువనమండనంబు.

గీ. తీర్థమధ్యమమున దివ్యపీఠాంకమై, జిగి దొలంక బుగ్గ లెగయుచుండ
నవ్యమైనకనకనాళంబు గలమహా,కమల మనఁగఁ బుట్టెఁ గంబమపుడు.

క. కడుచోద్యమంది యీఁదినఁ, దడ వగు నని యాతఁ డద్భుతస్తంభముపైఁ
బడనుఱికి పీఁటమీఁదను, జడియక కూర్చుండి యోగివందము దోఁచన్.

క. *ధరణీశుం డెక్కిన మొగి, తిరుగక కంబంబు తొంటతెఱఁగున నాభా
స్కరుగతికొలంది జంకక, పెరిఁగెఁ గపటవామనుండు పెరిఁగినకరణిన్. ౧౩౫

శా. †కంబం బీక్రియ నిక్కుచున్ బిఱుసుగల్గం బెద్దయు న్నిక్కఁగా
గంభీరుం డగురాజు నైకొనఁడ యాకాశంబు ముట్టంగన
య్యంభోజాప్తుఁడు చేరనిచ్చు టది హైన్యంబంచు మధ్యాహ్నసం
రంభం బేర్పడ నెండ చిచ్చు గొని పర్వం జేసె గర్వంబునన్. ౧౩౬

ఉ. చేసిన నెండపెల్లునకుఁ జిక్కక స్రుక్కక నిక్కి మిక్కిలిన్
డాసినఁ గ్రమ్మఱ న్రవి దృఢంబుగ రశ్మిసహస్రమెల్లఁ బై
నీసునఁ గప్పినంతఁ జలియింపక నిల్చినవానిఁ జూచి యు
ల్లాసముతోడ నిటనియె లావును దాల్మియుఁ దెంపు మెచ్చుచున్. ౧౩౭

గీ. లక్షయోజనంబులను నిల్చియైన నా,యెండ మానవులు సహింపలేరు
నన్నుఁ జేరనోపునా యన్యుఁ డక్లేని, గాలి నేలపాలు గాకయున్నె. ౧౩౮

క. నరనాయక నీ వీయెడఁ, బరమేశ్వరుకరుణఁ జేసి బ్రతికితి నిజసు
స్థిరభావము సాహసమును, బరికించి మనంబు హర్షభరితం బయ్యెన్. ౧౩౯

క. నీవును నేనును నొక్కటి, గావున నాకుండలములు గైకొను మివి సం
భావనతో నిత్యమును మహీవర సౌవర్ణభార మిచ్చుచునుండున్. ౧౪౦

గీ. ఎన్న నాల్గుమాడ లెత్తొక కర్షంబు
నాల్గుకర్షలైన నగుఁ బలంబు

---

*ధరణీపుఁ డెక్కినమొగ్గక, తిర మైఁపా. †కంభంబీక్రియ-రెండుప్రతులలోను.

పలము లొక్కనూఱు తుల యగుఁ దుల లొక్క-
యిరువది మితి భార మిది మతంబు. ౧౪౧

క. అని యిచ్చినఁ గైకొని యా,తనిపదముల కెఱఁగి మగుడుతఱిఁ గంబంబా
య్యనఁ గ్రుంకఁగఁ దీర్థమునకు, మనుజేంద్రుఁడు చేరవచ్చె మాపటివేళన్.

గీ. కంబ మచట మునుఁగఁగా గంతుగొని తీర,భూమి నిలిచి తగిన నేమమెల్లఁ
దీర్చి భక్తితోడ దేవతాలయములో, నుండి రేయి గడపె యొక్కరుండు. ౧౪౩

శా. ప్రాతఃకాలమునందు లేచి ధరణీపాలుండు తీర్థంబులో
స్నాతుండై నియమంబుతోడ శివపూజాకృత్యముం దీర్చి సం
ప్రీతిం గ్రమ్మఱి వచ్చుచోఁ దెరువునం బృథ్వీసురుం డొక్కరుం
డేతెంచెం గడుదీనుఁడై యతని నింపేపార దీవించుచున్. ౧౪౪

క. చేరఁ జనుదెంచి యతఁడో, వీరోత్తమ పేదవాఁడ విప్రుఁడ నేనా
హారంబు వేఁడి వచ్చితిఁ, గారుణ్యము మెఱసి యిచటఁ గావుము నన్నున్.

మ. అనినం జూచి కృపారసం బెనయ నాహారార్థి యీవిప్రుఁ డీ
తని కిచ్చో నశనంబు లే దితని చేతః ప్రీతి గావింప నే
ధనము న్లేదు ప్రదాతకుం దగిన పాత్రం బబ్బినం బ్రాణమై
నను వంచింపక యిచ్చు టొప్పు నని పుణ్యశ్లోకుఁ డుద్యుక్తుఁ డై. ౧౪౬

క. మితిలేని మహిమ నీకిది, ప్రతిదివసము నొకసువర్ణభార మొసంగున్
మతిఁ జింతింపక పొమ్మని, యతిముదమునఁ గుండలమ్ము లాతని కిచ్చెన్.

శా. దానం బీక్రియఁ జేసి యొక్కయెడఁ దీర్థస్వార్థము ల్సేకుఱె
న్నానాచోద్యము లెల్లఁ జూచితి జగన్నాథు న్శివుం గంటి స
న్మానం బచ్చట నొందితిన్ ద్విజుని దైన్యం బంతయుం బాపితిన్
దీనం బుణ్యుఁడ నైతి నంచుఁ బురికేతెంచెం బ్రమోదంబునన్. ౧౪౮

గీ. నీకు నీగుణములు లేక యీగద్దియ, యెక్కఁ దగదు మగుడ నేగు మనిన
మనములోన నతనిఁ గొనియాడుచును భోజ,మనుజవిభుఁడు భవనమునకు నరిగె.

శా. సంసారాంబుధిపూర్ణమగ్నజననిస్తారాంఘ్రిపంకేరుహున్
హింసావర్జితభావభవ్యమతి యోగీంద్రాత్మపద్మావళీ
హంసాకారు వికారదూరుని విమోహధ్వంస నోత్తంసునిం
గంసారాతిఁ బురారిమిత్రుఁ ద్రిజగత్కళ్యాణసంధాయకున్. ౧౫౦

ఉ. కంజభవార్చనీయపదకంజు నిరంజనునిం బురత్రయీ
భంజను నంజనాచలనిభద్విపదైత్యఘన ప్రభంజనున్
సంజనితప్రమోదగిరిజాతనుసుంజులవామభాగు మృ
త్యుంజయు నాంజనేయవిహితోన్నతగీతకృతప్రభంజనున్. ౧౫౧

మాలిని. గిరివిరచితచాపా కృష్ణమేఘాభిరూపా
సురసరిదవతంసా తుణ్ణదైతేయహింసా
గరళగిళనదక్షా కంజపత్రాయతాక్షా
పురహరహరిరూపా పుణ్యాగణ్యాస్వరూపా. ౧౫౨

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలీకభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటదశిలాంధ్రమహారాష్ట్రభూపాలరూప నూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాటిపృథివీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామాత్యపౌత్ర హారితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసువరాజతనూజ గోపరాజప్రణీతంబైన సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు విక్రమార్కునిదానమహోపకారసాహసౌదార్యప్రశంసనం బన్నది సప్తమాశ్వాసము.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## అష్టమాశ్వాసము.

క. శ్రీలలనాతనురుచికం, పాలతికాచిరవిలాసపరికీర్ణవపు
ర్లీలాతిశయవిడంబిత, నీలాంబుదవర్ణుఁ ద్రిభువనీపరిపూర్ణున్. ౧

—పందొమ్మిదవబొమ్మకథ—

మ. మతిలో నిల్పి యతండు సజ్జనుల సంభావించి దైవజ్ఞస
మ్మతమౌ వేళఁ గడంగి నెక్కఁ జనుచో మాన్పించి యేకోనవిం
శతిమద్వారముపొంతబొమ్మ వలికెన్ క్ష్మాపాలకా మూర్ఖ భా
రతపర్వంబు పఠింపఁ బూనుట సుమీ రాగిల్లు నీయత్నముల్. ౨

క. ధారానాయక ధారుణి, నారూఢుం డైన విక్రమార్కునికరణిన్
శూరుండును ధీరుండు ను, దారుండును గాక యెక్కఁ దగ దెవ్వరికిన్. ౩

మ. అది యెట్లన్న నెఱుంగఁ జెప్పెదఁ దదీయం బైనచారిత్ర ము
న్నదవైరిద్విపసింహ మర్థిజనతామందార మాభూవరుం
డుదయాస్తాచలమధ్యభూమి దనకై నొప్పారు నుజ్జేని సం
పదలం బొంపిరివోవ రాజ్యము నయప్రాజ్యంబుగా నేలఁగన్. ౪

ఉ. ఆజననాథుఁ గొల్చి కనకాభరణంబులఁ దెజరిల్లు కాం
తాజనుల న్విచిత్రవసనంబుల బంటుల నందలంబులం
దేజులఁ జామరంబులను *దెల్లని యెల్లుల నేపు సూపుచున్
రాజులు మంత్రులు న్సుకవిరాజులు నుండుదు రొక్కకైవడిన్. ౫

గీ. అట్టిదివసముల సమస్తభూపాలురు, భటులుఁ గవులు హితులు బలసి కొలువ
సురగణంబులోని సురరాజుభంగి న, య్యవనిపాలుఁ డున్నయవసరమున.

క. ముకుళితకరుఁ డై దౌవా, రికుఁ డెదుర న్నిలువఁబడి ధరిత్రీశ్వర కా
నికగా సాళువముం గొని, యొకనల్లని చెంచు వచ్చియున్నాఁ డనుడున్.

క. తత్కారణంబు దెలియ స, ముత్కలికుం డై †నిజాభిముఖమానవసం
పత్కరదర్శనుఁ డగు భూ, భృత్కులతిలకుండు వానిఁ బిలువం బంచెన్. ౮

*దట్టయి నిట్టయి సెటు జూపుచున్ -†ముత్కంఠితుం డై.

మత్తకోకిల. నెమ్మిఁ బచ్చని కుప్పసంబును నీలిచీరయుఁ బీలియుం
దమ్మిపూసలపేరు నెజ్జనిధాతుబొట్టును జూడ నం
గమ్ముపైఁ దగు సొమ్ముగాఁ బిడికత్తి దాసె నమర్చి పా
ఱమ్ముల న్విలుఁ గేలఁ బూన్చిని యంతఁ జెంచరుదెంచె మదున్. ౯

క. దూరంబున నుడుగణపరి,వారుండై వెలుఁగు రజనివల్లభు క్రియ ను
ర్వీరమణులలో నొప్పెడు, నారాజుంజూచి మ్రొక్కి యతివినయమునన్. ౧౦

గీ. నీవు దాడివెట్టి నెగడిన నబురుక, యీఁకకిరిగి గొందు లీఁగు నృపుల
పగిదిఁ బులుఁగులెల్లఁ బఱవ వేఁటాడునీ,సాళువంబు గొనుము మాళవేంద్ర.

క. అని చూపి కొలువులోపలఁ, దనచేతి విహంగమును ధరణీశుని కొ
ప్పన చేసి తాను వచ్చిన, పనిఁ జెప్పఁ గడంగి యతఁడు పతి కిట్లనియెన్.

గీ. నృపులు గానలేని నీమహోవసరంబు, నేఁడు గంటి దొడ్డవాఁడ నైతి
మాళవేంద్ర యేను మందరగిరినుండి, యరుగుదెంచినాఁడ నవధరింపు.

శా. ఓరాజన్యకులావతంసక తదీయోపాంతభాగమ్మునన్
భేరుండాదిమహామృగేంద్రనివహాభివ్యాప్తమై యున్నత
స్ఫారానేకమహీరుహప్రకరవిస్తారావరుద్ధార్కసం
చారం బైనయరణ్య మున్నది తమస్సందోహసందష్టమై. ౧౪

సీ. ఆదివరాహ మాయడవి యేకలములు మచ్చించి విడిచిన గున్నయొక్కొ
దిక్కరు లక్కడ నక్కు నేనుఁగులచేఁ దోలుపడి చన్న దున్నలొక్కొ
చండికసింహ మచటఁ బేర్చు సింగంపుఁ గముపులోఁ దప్పిన కొదమయొక్కొ
కాలునిపోతందుఁ గల కారుపోతులఁ గూడిరాలేకున్న దూడయొక్కొ
మారకమ్మపులి యచట మలయుచున్న, పెద్దమెకములు పెంచిన పిల్లయొక్కొ
యనఁగ వాలుమృగంబుల కదియ నెప్పుడు, నాటపట్టుగుజాడలు తేటపడఁగ.

సీ అందులపందుల దండంబు క్రందున లీలావరాహంబు నేలఁగలసె
నచ్చోటిమదలులాయములతో బెనగి యూ మెనుపోతుయముని లోకమునకుఁ జనియె
నక్కడి కృష్ణమృగౌఘంబుచేఁ జాలఁ దూలి సారంగంబు గాలిఁబోయె
నటకొండగొఱియలయదటునొచ్చి మహామేష మగ్నిపాలయ్యె ననఁగ
నొప్పు నితరజంతువులను జెప్పనేల, *మప్పులెలుఁగులుఁ దోడేళ్లు మప్పులిర్లు
†కొరనువులు మెడినాగులు గుజ్జుఁబిల్లిఁ, గణఁజు పేములుఁ గుందేళ్లుఁ గలవు పెక్కు.

*మప్పులెలుఁగు = వ్యాఘ్రింబు లుప్పతిల్ల-†వరలు మరువాతులున్న గపతులుగల్గి- కొఱను వులు మరినాగులు గుజ్జుకిండ్లు.

ఉ. అయ్యెడ నొక్కయేకల మహాంకృతితో గుహనుండి నిచ్చలున్
దయ్యము కైవడి న్వెడలి దాఁటలు గొట్టుచు బెట్టు రొప్పుచుం
జయ్యనఁ జొచ్చి యేర్చిన గజంబులు ముచ్చుగ నమ్మృగంబులన్
వ్రయ్యలుగాఁ బడం బొడిచి వారకచంపుచు నుండు గండునన్. ౧౭

గీ. ఎదిరిపందులు దానిపైఁ గదిసిపోలియుఁ, బందెగాఁడొక్క వ్రేటుగఁ బంతమూఁడి
రౌలి నిలిపి యడిదమునఁ ద్రోలివ్రేయ, ఖండితములగు గుమ్మడికాయలట్లు.

క. ఆకొమ్ముకాఁడు తొల్లిటి, యేకలమో కాక యముఁడో యిట్టివిచిత్రం
బేకడఁ గానము విను మది, నీకెఱిఁగింపంగఁ బూని నేఁ బనివింటిన్. ౧౯

మ. వసుధానాయక వేఁటకుం గదలు సత్త్వం బెన్న మేనంతకున్
సుసరం బౌ లఘు వౌ జయం బగు రిపుక్షోభం బగు న్సద్గుణ
ప్రసరం బేర్పడుఁ జేతి సూటి మెఱయింపం జోటగు న్వేఁట దు
ర్వ్యసనం బంత్రు ధరిత్రి నిట్టిగతి సౌఖ్యం బొందుచోఁ గల్గునే. ౨౦

క. అంచుం జెప్పినఁ బ్రియపడి, చెంచుం గనకాంబరములఁ జెలువారఁగ మ
న్నించి వరాహముఁ ద్రుంపఁద,లంచి మృగవ్యప్రయాణలాలసమతి యై.

సీ. దీమంపువేఁటలు దామెనవేఁటలు తెరవేఁటలును నేర్పు తెరలికలును
బందెమూఁడినభంగిఁ బందులనొప్పింపఁ బూఁటకాం డ్రనఁదగు వేఁటకాండ్రు
సారమేయంబు లా సారమేయంబుల పట్టెడగొలుసులు పట్టినడువ
భేరుండగండగంభీరత్వ ముడిగించు భేరీరవంబులు బోరుకొనఁగ
వారువము నెక్కి మితపరివారుఁ డగుచుఁ, బోటుకాండ్రనువడిగల యేటుకాండ్రు
వాటపడ వెన్నరుదేర వేఁట గదలె, మందరంబున కవనిపురందరుండు. ౨౧

వ. అట్లు గదలి కతిపయదినంబులకు దుశ్చరంబగు నగ్గిరిపశ్చిమతటంబున గండభేరుండాదిప్రచండమృగాండజప్రకాండపరిగణ్యం బగునరణ్యంబు దరియం జొచ్చి యచ్చటి శిలోచ్చయంబులం బ్రతిధ్వనులను సముదంచితంబుగం బెంచు చెంచులయార్పులును శునకకోలాహలంబులుఁ గాహళాదివాద్యరవంబులు దిక్కులు చెవుడుపడ సమీపించి. ౨౩

క. మెలఁకువ లగుచోటుల మను,కులకందువులను జలంబు గొను నెడలను మేఁ
తలపట్లను మృగములకును, వల లొడ్డుచు వేఁటకాండ్రు వలఁకులఁ జనఁగన్.

క. పులియొదిఁగి మొగసియశ్వము, తలదొడుకఁగ నృపుఁడు సురియఁ దలద్రెంచినమే
నిలఁబడఁగఁ బడక యాతల, లలితాశ్వంబునకుఁ బులితలాటము చేసెన్.

చ. అటఁ జనునంతలోపల నవాంబుధరౌఘము భంగి ముందటం
గిటకిటఁ గోఱలన్ ధరణి గీఱుచు రొప్పుచుఁ గొప్పరించుచుం
గిటిగణ మేఁగుదేరఁ గని క్రేవలఁబట్టిన వేఁటకుక్క లో
క్కటఁ గొలుసు ల్వడి న్విడువఁగాఁ బఱచెం బవమానవేగులై. ౨౬

చ. పఱచుచుఁ గొంకులుం దొడలుఁ బట్టి విదుర్చుచు మాలెగట్టిన
న్నొఱగుచుఁ గ్రమ్మఱం దొడికి మోఁదలఁ ద్రిప్పినఁ జోటు దప్పఁ గ్రే
ళ్లుఱుకుచు సింగము ల్గిరుల నొక్కటఁ బట్టెడు భంగి దాఁటుచుం
గఱచుచుఁ జాగనీక యరికట్టుచు బెట్టుగ నేచెఁ బందులన్. ౨౭

క. కినిసి వరాహము వాఁడిచిన, శునకముతల ద్రెళ్లి యొగసి చొప్పేర్పడ నొం
డునెలవునఁ బడియెఁ గవ్వడి, తునుమాడిన యాజయద్రథునితలవోలెన్.

వ. అంతట వేఁటకాండ్రును నొండొరువులఁ గడవం బాఱి గంటిలేని కుఱుగం
ట్లుం గలిగి మెఱుఁగారెడి సూటిగల పందిపోట్లు దృఢంబుగా నత్తుకొని
యొత్తిలి పోయి మొగము దప్పనూటున బలుమాటునం గదిసి పెద్దగున్న
లను, జిఱుగున్నలను, బిడిపందులను, నెదమల్లరంబులను, గొమ్ముకాండ్రను,
నొక్కుమ్మడిం గ్రుమ్మినప్పుడు. ౨౯

క. గంధగజలీలఁ బంది మ,దాంధంబై యొకని జీరినట్లుగఁ బొదువ
న్సంధింపం బడిన జరా,సంధుని క్రియ వ్రయ్యలొక్కసరసం బడియెన్. ౩౦

గీ. అట్టివేళ నృపుఁడు కట్టెదురను*నారి బెట్టుపొడము, నమ్ము వెట్టి తిగిచి
బొట్టు వెట్టినగతిఁ బట్టెలసం దేసెఁ, దిట్టినట్లు పంది మిట్టిపడఁగ.

వ. ఆసమయంబున బెబ్బులిం గని పఱచుపశువులకరణి నవ్వనమదగజంబులు
మొదలుగాఁగల మృగంబులును వేఁటకాండ్రును నొక్కదిక్కునకుం బఱతెంచిన
నంతం దత్పశ్చిమభాగంబున. ౩౨

సీ. పాతాళ మీఁగినపందిఁ బోరికిఁ బిల్చు కైవడి నందంద కాలు ద్రవ్వఁ
గనుఁగొన్నఁ బ్రాణులఁగాల్పఁబూనినమాడ్కిఁ గన్నులమిణుఁగుఱుంగ్లిమ్ముఁజూచు
దిగ్గజంబులు మది బెగ్గిలి మ్రగ్గఁగా జంకించుగతి వాక్కసముగ రొప్ప
నర్జునిహాయముల నరికట్టఁ జనురీతిఁ గొనవెండ్రుకలు నిక్క గొప్పరించఁ
దిరుగుచోనడ్డమగుకులగిరులఁదునుము,వాఁడియిడుభంగిఁగోఱలుతీఁడికొంచుఁ
గాలమృత్యువు రేఁగిన కరణిలోక, మాకులంబుగఁ గవిసె నయ్యేకలంబు.

వ. అట్లు దవ్వుల మలయుచున్నం జూచి యచ్చెరువంది యిచ్చ మెచ్చుచుఁ
జిత్తంబున నుత్తలపడక యకలం బందుఁకొని. ౩౪

*నారి, జిట్టబొడమికమ్ము వెట్టినగతి పందివోట్లగ్రుచ్చి పట్టెత్తిపద్దెసం—

ఉ. వాహముఁ దోలి రాజకులవర్యుఁడు చేరెఁ గృతోల్లసన్మృగ
ద్రోహము నిత్యవీరరసదోహము సంజనితాంజనాద్రిసం
దేహము సత్యుదగ్రఘనదేహము నుద్ధతకాననాంబుధి
గ్రాహము సర్వభీతికరగర్వనిరాహము నవ్వరాహమున్. ౩౧

క. చేరిన నది మది బెదరక, యీరసమునఁ గడచి యతని నెదిరించెను భ
ద్రారమణుని జెనయఁగ భూ,దారాకృతివచ్చు మూకదానవుమాడ్కిన్.

క. అత్తఱిఁ దనచిత్తంబునఁ, దత్తఱపాటొందులేక ధరణీరమణుఁ
డత్తఱము వైవ నది గని, తుత్తుమురుగఁ బొడిచె లేఁతతుందిలముక్రియన్.

క. పొడిచినఁ దడయక పిడికిట, నడిదము బెడిదముగ నెగడ నతఁ డశ్వము న
య్యెడ కడరించినఁ గ్రోధము,వడి మగుడఁగ మగిడెఁ బుడమి వడవడ వడఁకన్.

గీ. అల్లుదిరిగి చనినన య్యేకలము వెంట,హయముఁ దోలుకొనుచు నరిగె నృపుఁడు
పందిరూప మైన పాతాళకేతువు, నంటనెయిను కువలయాశ్వ పగిది. ౩౫

గీ. తిన్నక్రొవ్వులోన నున్నది నీరుగాఁ, గన్ను లగ్గిమెఱపుగములు గాఁగ
రొప్పుటుఱుముగాఁగఁగప్పుచొప్పడఁ బంది,గాలిఁబఱచు మొగులు కరణిఁ బాఱె.

వ. ఇట్లు పాఱిన ఘోరం బగు కాఱడవిలో దూరంబగు నీరంబులందూఱె.

క. పంది వెనువెంటఁ నరుగుచు, ముందట నరలోకపాలముఖ్యుఁడు గనియెన్
మందరముఁ బురందరరిపు,మందిరకందరము నిందుమణిసుందరమున్.

క. కని డగ్గఱు నెడ సూకర, మనువుగ గుహ సొచ్చె నంత నచటితిమిర మా
తనిదృష్టిఁ గప్పె భయపడి, తనుఁ జొచ్చిన వానిఁ గావఁ దగు ననుకరణిన్.

గీ. ధరణిపాలుఁ డంతఁ దురగంబు నచ్చోటఁ, గట్టి వాలుఁ గేలఁ బట్టికొనుచు
లొంక సొచ్చె నాత్మఁ గొంకక కాలుండు, కదిసి దివియ వట్టి వెదకు పగిది.

ఉ. చొచ్చి మహామృగం బరుగుచొ ప్పటఁ గానక కందరాంతని
ర్యచ్చటులాంశుకూట మగు రత్నకవాటము గాంచి యిచ్చలో
నచ్చెరువంది యందుఁ జని యావల నిండిన చిమ్మచీఁకటిం
గ్రొచ్చుచు నేగ వాలు కడక్రొమ్మెఱుఁగు ల్నిగుడంగఁ గ్రిందికిన్. ౪౧

ఉ. ఆదెసఁ గొంతదవ్వుల మహారజతాంచితసాలమండల
శ్రీగనరార రత్నకలశీపరిచిహ్నితతుంగశృంగసా
ధాదినికేతనప్రసర మైన మహానగరంబు దోఁచెఁ జం
ద్రోదయలీలఁ గన్నులకు నుత్సవమై దిమిరం బడంచుచున్. ౪౨

ఉ. అందులపణ్యవీధుల నహర్నిశముం దిమిరంబు లీను సం
క్రందనరత్నగేహముల కాంతుల నేఁగఁగరా దటంచు న
మ్మందరసీమలందు గరిమంబున దాఁచిన పద్మరాగముల్
క్రందుకొనుం బ్రదీపములకైవడి దివ్వెలపండుగో యనన్. ౪౭

క. అందు బలిచక్రవర్తి ము, కుందుఁడు దన ద్వారపాలకుఁడుగా రక్షో
బృందములు గొలువఁగా నా,నందంబున నుండు నురగనాథులతోడన్.

క. అందులఫణికుల ము: పవన, చందనసంవేష్టిజభుజంగీవదనా
నందనసుందరతరమగు, మందానిల మానుచుండు స్రుగ్గన్నిడుచున్.

క. చెలువారెను నాపురిలో,పలి రక్కసు లొంటుగడలభయ మెఱుఁగక తీ
పులవింటికి జడియుమ మను, నిలువేలుపుగా భజింతు రింతులుఁ దారున్.

ఉ. ఆపురిఁ గాంచి సమ్మదము నచ్చెరువు న్మదిఁ బిచ్చిలింపఁగా
భూపవరుండు పంది యెటువోయె బలంబెటు వోయె దివ్యమా
నీపుర మెట్లు తోఁచె నది యెవ్వని రాజ్యము చూత మంచు ని
చ్చాపర తంత్రుఁడై గవనిచక్కటి డగ్గఱ వచ్చె నయ్యెడన్. ౫౧

ఉ. చేతఁ బసిండిబ్రద్ద విలసిల్లఁగ నొక్కఁడు వచ్చి మ్రొక్కి పృ
థ్వీతలనాథ నాథుఁ డగు విష్ణునిచే సెలవంది దానవ
త్రాత బలీంద్రుఁ డిప్పు డనురాగమున న్నినుఁ బిల్వఁ బంచె ర ౫౨
మ్మా తడయంగ నేల యనుమానము సేయక నీవు నావుడున్.

సీ. ఘనుని సందర్శింపఁ గలిగె నిక్కడ నని యానంద మందుచు వానిఁ జూచి
పురిచొచ్చి రత్నమందిరములసొం పెల్లఁ గోరి చూచుచుఁబైఁడికోట దాఁటి
చని యవ్వటారుమోసలఁదూఱిమణిమండపంబులోదైత్యులుబలసికొలువఁ
గంకణంబులమ్రోఁత గ ల్లనఁగాఁ బాఁపజోటులు వసిఁడి వీచోపు లిడఁగ
మెఱుఁగుముత్తియముల పేరులఱుతమెఱయ,నలరుచుక్కలలోని రేవెలుఁగువోలె
మానికంబులగద్దియపైనిదీర్చి, యున్నబలిఁజూచి మ్రొక్కె నమ్మన్నుఁజేఁడు.

క. అతనిఁ గనుంగొని దానవ,పతి ప్రియమునఁ గౌఁగిలించి భద్రాసనసు
స్థితుఁ జేసి మిత్రకృత్యో,చితసత్కారము లొనర్చి సేమం బడిగెన్. ౫౪

శా. ధర్మం బెల్లెడఁ జెల్లునా ద్విజులవిద్యాగోష్ఠి రాజిల్లునా
దుర్మార్గంబు లడంగునా ప్రజలు సంతోషింతురా సత్క్రియా
మర్మం బేర్పడ జన్నముల్ జరుగునా మర్యాద వర్తిల్లునా
నిర్మూలంబుగ శత్రులం గెడపుదా నీలక్ష్మి సొంపెక్కఁగాన్. ౫౫

శా. హర్షంబొంది పురందరుండు ధరపై నందందుఁ గాలంబుల
న్వర్షంబు ల్గురియించునా తగిలి విద్వాంసుల్ ప్రశంసింతురా
ఘర్షింపంగల రీతి నీతి దెలియంగా విందురా క్కీర్తియు
త్కర్షం బందునె దీనులంగడపుదే దానం బనూనంబుగన్. ౯౬

వ. అనినం గృతాంజలి యై మానవేంద్రుండు దానవేంద్ర నే నెంతవాఁడ నన్నింతకుశలం బడిగితివి నీవు మహానుభావుండవు. ౯౭

సీ. కశ్యపసుతుఁడు రక్కసులమేటి హిరణ్యకశిపుండు నీవంశకర్త యనఁగఁ
బరమవైష్ణవుఁడైన ప్రహ్లాదుఁ డద్భుతఖ్యాతచరిత్రుండు తాత యనఁగ
వీరమాహేశ్వరుం డై రూఢికెక్కిన బాణాసురుఁడు కూర్మిపట్టి యనఁగ
దానవరక్షణజ్ఞానవిజ్ఞానాదిగురుఁ డైనశుక్రుండు గురు వనంగ
నమరలోక మేలుట పరాక్రమ మనంగ, భువనమంతయు వితరణాభోగ మనఁగ
దేవదేవుండు హరి యిష్టదైవ మనఁగ, నీమహత్త్వంబు నాకు వర్ణింపఁదరమె.

మ. ఘనుఁడౌ విష్ణుఁడు జన్నిదంబు శిఖయున్ గాయత్రిపల్కుల్ మృగా
జినము న్గోఁచియు దర్భలు న్గొడుగు మౌంజీబంధము న్గోపిచం
దనము న్వ్రేలిమిబొట్టుఁ గుండలములున్ దండంబు నందంబుగా
నిను వంచింపఁ గడంగి తాఁ గుఱుచయై నీచేత వర్ధిల్లఁడే. ౯౮

క. వెడమాయలవడు గడిగినఁ, దడయక మూఁడడుగు లిచ్చి ధర్మం బిలనా
ల్గడుగులుగా నిల్పిన నీ, కడిమి వొగడ నలవి యౌనె కమలజుకైనన్.

క. ఆలాగు కపటియైనను, వేలుపె యని యొసఁగు నీదు వితరణగుణముం
దాలిమియు మెచ్చి త్రిభువన, పాలకుఁడచ్యుతుఁడు ద్వారపాలకుఁడయ్యెన్.

క. పాత్రత్యాగి యనంగ జ,గత్త్రయమునఁ బరఁగునట్టి ఘనుఁడవు నను నీ
మిత్రునిక్రియఁ గనుఁగొంటి ప,విత్రచరిత్రుండ వైతి విశ్వములోనన్. ౧౦౨

సీ. అనవుడు దనుజేంద్రుఁ డతి సమ్మదంబున నుర్వీశ యీకలియుగమునందు
వీరుండు శూరుండు దారుండు మఱి లేఁడు నివె కాక ని యని నిన్నుఁ జూడ
వేడుకపడి యేను విష్ణుని యాజ్ఞచే వడలి రాలేక యీ వెరవు పూని
నిన్నిటు రప్పించి కన్నులారఁగఁ గంటి నధికలాభం బయ్యె నంచుఁ బలికి
యిదిసువర్ణదాయి యిదిజరామృత్యుని,వ్వారణ మనుచు రసరసాయనములు
పేర్మి నిచ్చి యనిపె బిలమార్గ మెఱఁగింప, నవ్విరాహమైనయసురఁబనిచె.

వ. ఇట్టివిజ్ఞానప్రదీపిక యనుయోగకావ్యంబు సకలజనసమ్మతంబు సకలశాస్త్ర సమ్మతంబు సకలమతసమ్మతంబునునై యుండుం గావున నందు ప్రారంభం బెట్టి దనిన.

చ. చదివితి మంచుఁ గొందఱు ప్రసంగవశంబులఁ గించిదర్థముల్
మదిఁ దలపోసి తన్నియమమార్గమునందుఁ బరిభ్రమించుచున్
ముదమున సంచరించుజనము ల్గననేర్తురె యాత్మయోగసం
పదలఁ దనర్చుశాశ్వతశుభప్రద మైన విముక్తిమార్గముల్.

ఉ. దానములం దపంబులను ధర్మవిశేషతఁ బుణ్యతీర్థస
్నానములం జరించుటను జన్మవిముక్తియు గాన నేర్చునే
మానితరాజయోగనిజమార్గవశంబునఁ బొంది నిర్మల
జ్ఞానపయోధివీచికల సంగతిగానని జీవకోటికిన్ — ఇత్యాది.

ప్రారంభమందైనఁ గవి తననామముం జెప్పుకొనలేదు ద్వితీయాశ్వాసమునకు ముగింపు లేనందున గద్య మటలేదు. ఎట్టును గవిని దెలిసికొనఁజాలము.

ఈ 1772 లో గణపతిదేవుని శివయోగసారము కొంత యును గట్టుప్రభుని కుచేలోపాఖ్యానమును గలవు. రామస్తవరాజ మున్నది.

ఈసంపుటిలోనె "శ్రీరామా, అవిఘ్నమస్తు" అని ప్రారంభించి కొన్నిగీతములు ౧౦౧ మొదలు ౨౯౧ వఱకును గలవు. వేమనపద్యములవంటి నీతి వేదాంతము బోధచేయునవి. ఎవ్వరు రచించిరో తెలియదు. మొదటి ౧౦౩ పద్యములు లేవు. ౨౯౧ మొదలు కొని పూర్తిగా లేదు. వ్రాతతప్పులు కవిప్రమాదములు పెక్కులుగలవు. విశ్వదాభిరామ వినురవేమ యనునట్లు నాల్గవచరణము "కాళి" అని వ్రాసియుండును. పూర్ణపాద మెచ్చటను లేదు. కొన్నిపద్యములు చూడుఁడు.

"యరిగియరగ లేఁడు పెరిగితిరిగి, పురుగుచందంబాయె పుణ్యమేమి
పురుగులద్దపురుగు పూజ్యులు గారయా, కాళి. ౧౦౮

రమ్మని పొమ్మనరాదయా దోషంబు, యెమ్మెలన్ని మాని వెతకవలెను
వెతకి బ్రతికినవాఁడు యోగీశుఁడేకదా, కాళి. ౧౯౦

వందనముతో గురుని వద్ద గూర్చుండును, మధ్యవర్తి వక్తడు ననుజూపె
మనసుపెంబడిపోయి మహాత్ముఁడాయ గనుఁగొంటె, కాళి. ౧౭౮

ఈరీతి పెద్దలు యిహామందు యెవరైన, మారిపోయినవారిమాట పోదు
శూరుని యెంతురుగాని సులభుని యెంతురా, కాళి. ౨౯౧

నీచుఁడు గలచోట నిలిచియుండుట రోఁత, చాడిచెప్పువానిచావు రోఁత
నూఁడు యరుని దొరను చూచికొల్చుట రోఁత, కాళి. గి౨౨
తన్నుగాదని చాల యెన్నాళ్ళు వెదకినా, వెతలు వెతలె కాని యేమిలేదు
మతిలోన నున్నట్టి మర్మమే కనలేరు, కాళి. గి౪౧
యోగులుకొందరు వేషధారులు కొందరు, మూగలవలెఁ గొందరు ము
నులవలెఁ గొందరు, దీక్షలు కొందరు తిండికొరకేనయా, కాళి. గి౬౦
తెలిసినవారు సంపూర్ణ ప్రతిగలవారు దయతో బరిషత్పత్రికమూలమున లోక
మునకుఁ దెల్పుదురుగాక యని దీనింగూర్చి విశేషము వ్రాయుటలేదు.
మఱియు "ఖేచరీముద్రాషదేవతాయైనమః" అని రెండుపత్రములు గలవు. దా
నిలోని ప్రారంభము కొన్ని బంతులు:—
"జయజయజయ శ్రీవత్సలక్షణలక్ష్మితాక్షమవిపక్షపీయూషదుర్లభ కౌస్తుభోపధా
నభవదీక్షణదీక్షితకాంతావిలాస లక్ష్యతటత్సదృక్షవక్షోనిక్షిప్త కల్పవృక్ష
సూనదామాక్షయమాలికా జాలికా డోలికా కేళికాబంధుర గంధభ్రమభ్ర
మద్భ్రమరఝాంకరణభితభిత శుభ్రాబ్ధిసుతాపరిరంభ సంభ్రమ సుఖాదభ్రప్ర
పులకఘనవవా యనఘనా ఘనసనా తనజనా వనధనా ఘనశోభావరా
భూతఘనస్రఘుస్మక లావణ్యారేఖాధఃకృతస్మరస్మరణ శమిత దురితతిమిరజనవల
యిత నదుదకఖగఘనరుతభవతనయ జలజఖనితటతల సుమిత ఫలిత వియద
టనతరువరిత మలయవలయ వలదనిలచలచలదవిరళరిహాలసదళిఘుమితరతివ
లలితసమదవిదయనుదనకదనసదనకుడుంగరంగదభంగధరాధర విబుధమిధు
నమథితవీణావీణారావశుకపికశకునవికరనినదకనదమితమహా గుహా విహా
రిహా శితశకలుషవనకుతారకమతాదపీఠగతహరసదా హతమదా తతవిదా
యతిమదాహ్వాతివికృతి యతిపిరతి..."ఇత్యాది పూర్ణముగలేదు. నాల్గుపు
టలు మాత్రమేకలవు. కడవఱకు నిట్టియమకాదులతో నున్నది.

(8) శైవాచారశిఖామణి-గ్రం. సం. 4538.

అయిదాశ్వాసముల పద్యకావ్యము. కవి నెప్పల్లి అయ్యనార్యుఁడు.

ము-ఇది శ్రీమ దివ్వటూరి రామనారాధ్య చరణాంబుజ సేవాధురీణ శైవ
శాస్త్రార్థపారీణ సరసకవితాచాతుర్య అనవరతగాంభీర్య వీరమాహేశ్వరా
చారనిరత సకలసద్గుణభరిత కౌండిన్యగోత్రపవిత్ర బ్రహ్మలింగార్యసుపుత్ర
నెప్పల్లి అయ్యన నామధేయప్రణీతం బైన శైవాగమశిఖామణి"

ప్రారంభము:—

శా. శ్రీశైలేశుని మల్లికార్జునుని దిక్చేలున్ శివానాయకున్
నీశాను న్భవరోగభేషజుని లోకైకాధినాథు న్వియ
త్కేశు న్నవ్యయు భక్తలోకవరదు న్గీర్వాణసంసేవితున్
దాశార్హప్రవరు న్నిరంతరము సద్భక్తి న్భజింతు న్మదిన్.

గీ. ఋషిగణార్చితునకు జగదేకపతికి, నకుచ దర్వీకరేశకుండలున కచల
జేశునకు శంకరునకు విశ్వైకపతికి, హరునకును మ్రొక్కెదను దాసోహమనుచు.

... ... ... ... ... ...

గీ. అనఘు నివటూరివంశ మహాబ్ధిశశిని, వీరనార్యాత్మజుని సారవినుతయశుని
సకలపరవాదమత్తేభశస్త్రహారిని, రామనారాధ్య మద్గురుస్వామిఁ దలఁతు.

... ... ... ... ... ...

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును గురునాథస్తవంబును కుకవినిరాకరంబును సుకవిప్రార్థనంబునుం జేసి యొక్క ప్రబంధంబు శైవశాస్త్రంబును, సకలపురాణేతిహాససమ్మతంబును శివజ్ఞానసిద్ధాంజనంబునుగా రచియింపఁ దలంచి యున్నయెడ—

... ... ... ... ... ...

కవివంశవివరణము:—

సీ. అఖిలేశ్వరుండు సహస్రశీర్షుం డన నగుపరమేశ్వరు నాననమున
బ్రాహ్మణు ల్తొలుత నుద్భవము నొందిరి ముందు నావిప్రకులవర్యుఁ డైనయట్టి
కౌండిన్యమౌని ప్రఖ్యాతవంశంబున క్షితిలోపలను నతిశ్రేష్ఠుఁ డైన
శస్తయజుర్వేదశాఖ యౌ తైత్తిరీయమున నాపస్తంబవిమలసూత్ర
మునను నార్వేలవారనఁ దనరునట్టి, ప్రాకనాఁటింట ఘనుఁడైన బ్రహ్మవేత్త
పరఁగ బెజవాడసీమ నెప్పళ్లెయందు, ననఘుఁడని యెన్నఁదగు లింగనార్యుఁడెపుడు
ఈలింగనార్యునిసతి యంబను, ఈదంపతులతనయుఁడు మల్లనార్యుఁడు. ఈతని యిల్లాలు చిట్టెమ్మ. ఈచిట్టెమ్మపుత్త్రుఁడు బ్రహ్మలింగార్యుఁడు, బ్రహ్మలింగార్యుఁడు అన్నపూర్ణమ్మను బెండ్లియాడెను. ఈ బ్రహ్మలింగార్యుఁడు మనకవితండ్రి.

క. సలలితచిత్తుఁడ భవపద, జలజసమర్చకుఁడ వీరశైవుఁడ వరని
ర్మలభావుఁడ నఘదూరుఁడ, వలనుగ నెప్పల్లి అయ్యవారనుసుకవిన్.

కథాభాగములోఁ గొంతపద్యశైలికిని విషయబోధకున్ను జూపఁబడును.

గీ. మూఁడుకాలమ్ములందు విప్రులవిభూతి, చేతఁబుండ్రంబు దాల్చినయాతఁడెపుడు
రుద్రరూపంబు దాల్చియుక్కువుఁడగుచుఁ, బరమపదమందు వసియించుబంధురముగ
వాసిష్ఠలైంగ్యే—
క. వేదోక్తభూతిపుండ్రము, నాదట ధరియించి పాపమంతయు వేగన్
ఛేదించు గాఢతమమున్, ఛేదింపఁగనొప్పు జలజమిత్రునిపగిదిన్.

బ్రహ్మోత్తరఖండే.
గీ. మఱియు క్షత్రియవిట్శూద్రమారణములు, గోవధస్త్రీవధాదులు గొసరకెపుడుఁ
జేయువాఁడైన భసితంబుచేఁ ద్రిపుండ్ర, ధారియైనను బాపముల్వాఱిపోవు.

ఇట్లు భగవద్గీతాదులనుండియు నితరపురాణములనుండియు శైవసాంప్రదాయము లన్నియు నేర్చి కూర్పఁబడినవి. భక్తుల మాహాత్మ్యములు గలవు, శివరాత్రి సోమవారము మున్నగు దినములలో శివపూజచేయుటవలని ఫలములు తెల్పఁబడినవి.

ఈపుస్తకమును బరిషత్తునకు శ్రీయుతులు బండారు తమ్మయ్యగా రొసంగిరి. ఇద్దాని కింకొక యసంపూర్ణప్రతిని గూడ నిచ్చిరి. 150 పత్రముల ప్రతి.
సర్వజిత్తునామసంవత్సర కార్తిక శు ౨ సోమవారమువఱకు మక్తాపేఁట మఠం హాత్తినీపట్టద సిద్ధలింగదేవర అయ్యవార్లగారు వ్రాసినది.

---

9. అచ్చతెనుఁగు కిరాతార్జునీయము. గ్రం. నం. 4507.

దీని శ్రీశ్రీ పిఠాపురముమహారాజావా రొసంగిరి. అయిదాశ్వాసములు గలది. సంస్కృతకిరాతార్జునీయమునకు భారవి కిది తెనుఁగు. కవిపేరు తెలిసికొనుటకు వీలులేకుండ గద్యముక్రింద నన్నియాశ్వాసముల తుదను, అచ్చతెనుఁగులో-

"ఇది సిరిగల్లు కల్వదొరసీనిన కన్నలపాఱుటయ్య పెం
పొదవుకొలంబు నేలచెలి నోమెడు వెన్నునిపేరు గల్లు మే
ల్మదిగలయయ్య బిడ్డఁడన మన్నది తేరులజేనిపట్టిపే
రఁ దగిన నాదు చెంచుకఱి రాణపుబైదవత్తున్న పెంపగున్.

అని పేరులుగూడ నాంధ్రీకరించి పెట్టినాఁడు. కవి రామయ్య లేక దశరథరామయ్య యని తోఁచుచున్నది. ఆత్రేయగోత్రము, తండ్రిపేరు "నేలచెలినోమెడు వెన్నుని పేరుగల్లు మేల్మదిగల యయ్యయఁట—గూఢముగానున్నది.

కవి బొబ్బిలినివాసి కావలయును.

క. అబ్బురపుచెద్దియములఁ దగు, నిబ్బలుకబ్బంబు ముత్తె మెనయుపసిఁడినా
బొబ్బిలిగొల్లలరాయని, నిబ్బరపు న్నూతనంబు నెలకొనఁ గూర్తున్.

అని బొబ్బిలిలోని గోపాలస్వామి కంకిత మిచ్చినాఁడు.

సీ. ఆలగాపరిపూప లచ్చటఁ దిగఁద్రోచి నేలగాపరులఁ దా నేలఁగల్గెఁ
దరివెన్నముచ్చిమి దొరలకుండఁగ వెల్మదొరలిచ్చు నులుపాలు దొరకసాగె
రక్కసు ల్గెంటింపరాకుండ మన్నియసొఁజుకాపరికొల్వు బలిమి యబ్బెఁ
దక్కరీఁడను పట్టుదక్క నందఱకోర్కు లిచ్చువాఁ డనుమేలిమెచ్చు వచ్చె
రావు రాయఁడప్పరంగరాయుని కొలం, బయ్యలెల్లఁ దనకునెయ్యులగుచు
నిలువ బొబ్బిలనెడి నెఱప్రోలఁ గఱివేల్పు, గొల్లపల్లె విడిచి కూర్మి నిలువ.

తనవంశమునుగూర్చి నివాసమునుగూర్చి యింతేమియుఁ జెప్పుకొనలేదు.

ప్రారంభము రెండుపద్యములు:—

చ. కలుములజేనితోఁ జెలిమి గాంచుట నచ్చినపేర్మి మించుఁగొం
డలదొరపట్టి మేయఱను డాయఁగ నెమ్మి నమర్చి నంద్రముం
గలయఁగఁ బాలునేలు జడగట్టడవిం దనకేలనంటి లో
నలరఁగ నంటి చూపి ముదమందు బొజుంగులమిన్న నెన్నెదన్.

చ. అలసిరి చిల్వనెజ్జఁ బొలయ్యలను మూర్కొగ మిడ్డఁ బాఁపరా
తలల మెలంగు నేలచెలిఁ దాలిచి కౌఁగిట బుజ్జగించి క్రే
వలలకు నల్లచేడెఁ గలువం దఱి గాంచుచు దాఁగురింతలం
గలకల నవ్వుచుం జెలఁగు కల్లరివేలుపుసామిఁ గొల్చెదన్.

భారవి మొదటి శ్లోకమునకుఁ దెనుఁగు—

చ. సిరి తొలివంగడంబు నది జెందిన రానొకిమీని యేల్బడిం
దెరకువ లెల్లఁ గాంచుటకుఁ దేఁకువ నెవ్వనిఁ బంపె బొమ్మ చా
రిరవణ మొప్ప నయ్యెఱుకుఁ జేఁ డటులం గని డాయవచ్చె న
గ్గరములదిట్ట ముగ్గానమునోవగుపేరిపొలంబుచక్కటిన్.

భారవి యొకానొకసర్గములో నిమిడ్చిన చమత్కారశ్లోకముల ననుసరించి యితఁ
డును గొన్నింటి నిందుఁ జేర్చినాఁడు.

గోమూత్రికాబంధము—విద్యున్మాలావృత్తము.

వీఁడే వేల్పా వీఁడే వెజ్జా, వేఁడ న్రాఁడా వీడంబోఁడా
వీఁడే బొల్పా వీఁడే రజ్జా, వేఁడం గోడా వీడం గీడా.

౪. మేమే మిమ్మో మేమా, మీమీ మామాము మోము మిమ్మమ్మేమో
మేమే మీమీ మమ్మే, మమా మమ్మమ్ము మమ్మె మోమా మమ్మా.

విద్యున్మాలావృత్తము:—

(1) రాలం గ్రాల న్రా దా లీలా, లాలీదారాలంగ్రా లః రా
లాలామే వాలాగాలా వా, వాలాగాలా వామేలాలా.

(2) చాయాజాజా సాగా యోజా, జాయోగా సా జాజాయాచా
వోయీరావో యోడే యీవో, వోయీడేయోవోరాయీవో.

ఇందలి చరణముల ననులోమవిలోమము లెఱుఁగునది.

(1) నీకానాకానేనేకారా, కాకేమేకా గారాకాగా
చీకాకాచే సీదాకాచే, మేకోరామీ మీచాకేమీ.

(2) మీకేవామీ మీరాకోమే, చేకాదాసీ చేకాకాచీ
గాకారాగా కామేకేకా, దాకానేనే కానాకానీ.

పూర్వపద్యమున కుత్తరపద్యము ప్రతిలోమము.

ఇట్టి వనేకము గలవు. కవియెవ్వరో తెలిసికొని యీగ్రంథమునకుఁ బ్రతి యెం
దైనఁ గలదేమో తెలిసినవారు తెల్పెద రని కోరుచున్నారము.

(10) ఘటికాచలమాహాత్మ్యము. గ్రం. నం. .20.

ఇది యొకచిన్న ద్విపదకావ్యము. ౨౦ పత్రములు గలది. కాలువపల్లి అచ్చన
మంత్రికవి.

"శ్రీనందవరకులాశ్రిత లక్ష్మిఁదనరు, వనరభారద్వాజ వరగోత్రశుభగు
డనఁగఁ గాలువపల్లి యతులవంశ్యుఁడు."

ఈతనితండ్రి రామసువ్రతుఁడు, తల్లి అక్కమాంబ, కథ ఘటికాచలమాహాత్మ్య
ములోని చిన్నిగాథ.

"అసమానబలుఁడైన యంజని తనయు, పొసఁగంగ వేడుకపాలుపేది దనర
ఘటికాచలం బనుఘనగిరిమీఁద, నిటలాక్షుఁ దగఁగూర్చి నెమ్మితో వేడ్క
పటుతరనేమంబు పరఁగ వహించి, గట్టిగా బ్రహ్మపట్టముగోరి వేడ్క"

ఇట్టి యీమాటలను బట్టి యీయల్పగ్రంథములోని విషయము బోధపడఁగ
లదు. కవిః       తెలియఁగలదు.

(2) ఈప్రతిలోనే శతకంఠ రామాయణము ద్విపద గలదు. 70 పత్రములున్నవి.
పూర్తిగా లేదు. ప్రారంభములోఁ గవివిషయమేమియు లేదు.

"శ్రీమహితానంద శృంగారకరము, కామితార్థంబులు కడుమోద మమరి
అలమేరుకాంతుల నద్భులనడుమ, వెలయుశాకద్వీపవేదికాస్థలిని
సిరిదనరుపట్నంబు సరగుననొకటి——అని మొదలిడినాఁడు.

సీతావిజయ మనునామాంతరము గలశతకంఠరామాయణములు పద్యకావ్యములును గలవు.

ద్విపద యంత జటిలముగా లేదు. తప్పులు బహువిధములుగాఁ గలవు.

"కాశీపురం బిదేకడుఁ జేరివేడ్క, విశ్వేశు నెదురుగా వీరతపంబు
వదలక గావించువాఁడఁ దాననుచు, మదముసుగఁ బ్రబలెడి మర్కటోత్తములు
దండితనంబుగాఁ దనరు మోదమున, మెండొడ్డి కోపులై మెలఁకువఁ దనర
రఘురాము నానతి రభసంబుతోడ, గెరలి కోపంబున ఘీయని యార్చి
నురవడిగానంత నుగ్రతతోడఁ, బరువడి దనరంగఁ బడనీడ్చువాని
నీడ్చిన శతకంఠుఁ డిదె రాముచేత, వాఁడిద్రుంగెనటంచు వానరులెల్ల
సంతోషులై వేడ్క సాహసం బడర, గంతులు తగ వేసి ఘనగర్జితములు."

పరిషత్పుస్తకభాండాగారములో 1320 సంఖ్యగల లింగాచారికృత ద్విపద యొకటి యున్నదిగాని దీనికిదానికిఁ బోలికలు లేవు.

## (11) సీతాకళ్యాణము. యక్షగానము గ్రం. సం. 354.

"ధరదుండిపల్లి సంస్థానుఁడై చాలఁ, బరఁగఁ గంథము రామభద్రుని పేర
నంకితంబుగ జయతొప్పెపార్థనియతి, శంకరుకంకేజసేవకుం డగుచు
లలితసద్గుణలక్ష్మి లక్షణాన్వితుఁడు, పాలయాకరివంశపాథోధిచంద్రుఁ
డసమసాహస విక్రమాదిత్యకీర్తి, కుసుమసాయకమూర్తి గురిగింజగుంట
పురవరాధిపుఁడు ... భూపాలమణికిఁ,
దనయుండు సంతతదానశీలుండు, ఘనకళాన్వితుఁడు సంగ్రామభీముండు
వరకృపాధారుండు వైరిరాజన్య, గురుతరకోటీర ... ...
మంతుకెక్కినభోజ మల్లభూవిభుఁడు——
వందనాచార సద్వైష్ణవతిలకుఁడ... ... ... ప్రిసేవాభిమానుండు
... ... ... ... ...బోడిమల్లయకుల బుధశేఖరుండు
వేడుక శ్రీరామవిభుని సత్కథను, కమనీయశబ్దార్థ గౌరవాత్యంత
రమణీయనవరసాలంకారసరణి, పరఁగిన జానకీపరిణయం బనెడి
కథమరుదుగ యక్షగానఁబుసేసె.

ఈగ్రంథాంతవాక్యములు కవిం దెల్పుచున్నది. పురుగులు కొట్టివేయుటచేఁబూ
ర్ణముగ దొరకలేదు. ప్రారంభ మిట్లున్నది.

శా. శ్రీకాంతాకుచపద్మకోరకములం జెన్నొందుహారావళుల్
నాకౌకఃపతినీలసద్రుచిమణుల్ నవ్యాంఘ్రికాంతిచ్ఛటల్
జోకల్మించిన తేఁటిగుంపులనఁగా శోభిల్లు లక్ష్మీశుఁడా
సాకేతాధిపుఁ డిచ్చు మాకు సకలైశ్వర్య ప్రభావోన్నతుల్.

వ. అని కృతిరచి...పరుండగు నాశ్రితపోషణుండైన దశరథకులభూషణుం డగు
రఘుపతి నేమని వర్ణించుచున్నాఁడు.

జంపె. విమలపుర శేఖరము విపులధర్మాకరము, సమదరిపుభీకరముసాకేతపురము
కీరభాషోత్తరము వీరనరసింధురము, చారుతరగోపురము సాకేతపురము
సురనగరసోదరము సుజనసంప్రత్తరము సరన్నృవరశేఖరము సాకేతపురము.

కవిత్వము మృదుమధురముగా నుండును.

పరాభవసంవత్సర ఆడినెల శుక్లపక్షము నవమీ చంద్రవారమందు అ
డుసుమల్లి చళువాయి వెంకటపతినాయనివారిశీతాకళ్యాణము, అనిచివరనున్నది.

---

(12) శివరహస్యఖండము—గ్రం. సం. 1758.

వంకాయలపాటి వీరభద్రకవిప్రణీతము—1256 సంఖ్యగల సంభవకాండ మొ
క్కటియే యిదివఱకుఁ బరిషత్పత్రికాముఖమునఁ బాఠకులు వినియుందురు. ఈ
పుస్తకము పై వీరభద్రకవి సంపూర్ణగ్రంథము. సంభవ, అసుర, వీరమహేం
ద్ర, యుద్ధ, దేవ, దక్ష కాండము లిందుఁగలవు. సప్తమకాండమగు నుపదేశ
కాండ మసంపూర్ణముగ నున్నది. మొదట సంభవకాండము, ఆకులుచెదలు
కొట్టివేసినవి. కావున గొంతభాగము పద్యములు పూర్ణముగా దొరకవు.
ఈకవి మందపాటివారి యాశ్రితుఁడు, కావున, వారివంశమును వివరించియు
న్నాడు. కవి వంకాయలపాటి నాగనామాత్యునిపుత్రుఁడు. మోచెర్లవారిదౌ
హిత్రుఁడు. గ్రంథమును బట్టి వివరములు వ్రాయుటకుఁ బద్యములు పూర్తిగాల
భ్యము కాలేదు. ఇతరకాండములలోని కొన్ని పద్యములు.

చ. మలసి యదృశ్య మైనసురమాన్యుఁడు కశ్యపుఁ డంతరంబునం
గలశిధరుం దొరంగి యధికం బగుమోహము గ్రమ్మ మోహాలి
లల విలపించుచుండఁగఁ గలంక యణంగ మనోహరాంగి చె
ల్వలరఁగ నిల్చెఁ గట్టెదుట నద్భుతమందుచుమానిచూడఁగన్. (అసురకాండము)

## ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరుగారు. పిఠాపురము మహారాజావారు. పరిషద్వ్యవస్థాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

శ్రీరాణీ వత్సవాయ వేంకట సుందరీయమ్మ జగపతిబహద్దరుగారు-[illegible] రాణీగారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ, బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుఁడుగారు.

రావుసాహేబ్ డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ, ఎల్. (Ph. D. (కోశాధ్యక్షులు.)

శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., యల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ, బి. ఎల్.

అళక్కి వేంకటాద్రియయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయుఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావు నాయుఁడుగారు.

# కాకినాడ-ఆంధ్రసాహిత్యపరిషత్తులో

## వెలకుదొరకు గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 విప్రనారాయణచరిత్రము- చదలువాడ మల్లయకవి | రు | 0 | 8 | 0 |
| 2 కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి | | 0 | 10 | 0 |
| 3 చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | | 1 | 0 | 0 |
| 4 నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు | | 0 | 2 | 0 |
| 5 జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థళం కృష్ణమాచార్యులుగారు | | 0 | 8 | 0 |
| 6 జ్ఞానప్రసూనాంబికాశతకము-కొప్పు సర్వశాస్త్రికవి | | 0 | 2 | 0 |
| 7 సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు | | 0 | 3 | 0 |
| 8 యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము- జ. రామయ్యపంతులుగారు. | | 0 | 8 | 0 |
| 9 కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | | 0 | 8 | 0 |
| 10 చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి | | 1 | 0 | 0 |
| 11 అకారాద్యముద్రిత గ్రంథసూచిక | | 0 | 8 | 0 |
| 12 ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | 0 | 12 | 0 |
| 13 శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు | | 0 | 12 | 0 |
| 14 Defeuce of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | | 0 | 8 | 0 |
| 15 శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | | 0 | 12 | 0 |
| 16 ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | 0 | 8 | 0 |
| 17 Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | | 0 | 4 | 0 |
| 18 హ్రస్వరంగములు-కొత్తపల్లి సూర్యారావుగారు | | 0 | 8 | 0 |
| 19 నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు | | 1 | 0 | 0 |
| 20 మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ | | 0 | 8 | 0 |
| 21 జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁకుఁడు | | 0 | 12 | 0 |
| 22 కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | | 1 | 4 | 0 |
| 23 రెడ్డినాఁటి రెండుశాసనములు | | 0 | 4 | 0 |
| 24 ఆంధ్రధాతుమాల | | 0 | 12 | 0 |
| 25 శాసనపద్యమంజరి | | 0 | 12 | 0 |
| 26 శతకసముచ్చయము (ప్రథమభాగము) | | 0 | 12 | 0 |
| 27 పరిషత్పుస్తకభాండాగారము (ద్వితీయభాగము) | | 0 | 8 | 0 |
| 28 సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి | | 0 | 8 | 0 |
| 29 రసాభరణము—అనంతకవి | | 0 | 8 | 0 |
| 30 చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) | | 0 | 8 | 0 |
| 31 ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు | | 1 | 0 | 0 |
| 32 షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య | | 0 | 8 | 0 |
| 32 ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతివ్యాఖ్యతో | | 0 | 8 | 0 |

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada

శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**


సంపుటము. ౨౧ { ఆంగీరసనామసంవత్సరము. / ఆశ్వయుజకార్త్తికమాసములు. } సంచిక ౪.





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1932.

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

క్రౌ° ఉ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౧. అంగీరసనామసంవత్సరము ఆశ్వయుజ కార్తికమాసములు. సంచిక ౪.


## ఆంధ్రమున నలంకారవాఙ్మయస్థానము


సాహిత్యవిద్యాప్రవీణ

—బులుసు వేంకటరమణయ్యగారు- రామతీర్థము—


ఆంధ్రవాఙ్మయమున విషయాంతరములతోపా టలంకారవిషయములును సంస్కృతవాఙ్మయము నుండియే గ్రహింపఁబడుచు వచ్చుచున్నయవి. ఇట్టి యాచారము మొదటినుండియును మనయాంధ్రులచే నవలంబింపఁబడుచున్న దనుటకు మన ప్రథమగ్రంథ మగుమహాభారతము నైతము భాషాంతరీకరణమగుటయే ప్రబలప్రమాణ మగుచున్నది.

మీఁదిరీతిని గీర్వాణవాఙ్మయము ననుసరించియే యాంధ్రమున గ్రంథరచన మారంభమై యున్నను గావ్యములరీతిని శాస్త్రగ్రంథములు విశేషముగ నాంధ్రీకరింపఁబడి యుండలేదు. కావుననే సంస్కృతమున నలంకారశాస్త్రము చాలకాలముక్రిందటనే సుప్రసిద్ధమై వ్యాప్తిఁజెంది యున్నను దెలుఁగునమాత్ర మిది చాల నవీనమై యున్నది. అలంకారశాస్త్రవిషయప్రతిపాదకము లగు గ్రంథములు తెలుఁగువాఙ్మయమున లెక్కకు మిక్కిలి తక్కువగ నున్నయవి. కాని యిప్పుడిప్పుడే కొందఱు విద్వాంసులు చాలగ్రంథముల నాంధ్రీకరించుచుఁ గొందఱు కవితావిమర్శన మొనర్చుస్వతంత్రగ్రంథములను రచించుచును సాహిత్యశాస్త్రమును బెంపొందించుచున్నారు. అందాంధ్రభాషాకోవిదుల భాషాం

తరీకరణములును, పాశ్చాత్యవాఙ్మయనిష్ణాతుల స్వేచ్ఛావిమర్శగ్రంథములును మిక్కిలి ప్రఖ్యాతము లైనవి.

సంస్కృతమున నలంకారవిషయచర్చ యెప్పు డారంభ మైనదో గ్రంథరచన యెప్పుడు ప్రారంభింపఁబడినదో సరి యగు సమయమును నిశ్చయించి చెప్పుట కష్టము. కావునఁ దదనుసారి యగు నాంధ్రవాఙ్మయమునం గూడ నేతచ్ఛాస్త్రవిషయ పర్యాలోచనారంభకాలమును గ్రంథరచనాసమయమును నిశ్చయించుటకుఁ దగినయాధారములు కన్పింపవు. కాని వేదవాఙ్మయమునఁ గూడ నలంకారవిషయములు కన్పించుటచే గీర్వాణవాఙ్మయమున నీశాస్త్రచర్చ చాల ప్రాచీన మైన దనియు నాంధ్రమునఁ బ్రాచీనాలంకారగ్రంథములు లేనందున నాంధ్రాలంకారశాస్త్రము చాల నవీన మైన దనియు మాత్రము చెప్పవచ్చును.

గ్రంథరచనంగూర్చిన నిశ్చయము లెట్లున్నను గావ్యవాఙ్మయ మెప్పుడు ప్రారంభ మైనదో యలంకారవిషయవిమర్శనము దానితోడనే యారంభమైన దని చెప్పవలెను. మనలను హితమునందుఁ బ్రవర్తింపఁజేయుటయు, నహితము నుండి మఱల్చుటయు వాఙ్మయమువలని ముఖ్యప్రయోజనములు. అందు వేదపురాణాదులు ప్రభుమిత్రసమ్మితము లగుటచే నవి చేయు నుపదేశములు సరసములు కాకపోవుటచే మనకుఁ బ్రవృత్తి కలుగకపోవచ్చును. కాని కావ్యము కాంతాసమ్మిత మగుటచే నయ్యది చేయు నుపదేశము సరస మై సర్వజనాకర్షకమై యందఱికిని బ్రవృత్తిఁ గల్గించును. కావ్యము రసము చిప్పిలునట్లు చమత్కారముఁ గలుగఁజేయనిచో నయ్యది కావ్యాభాస మగును గాని కావ్యము కాఁజాలదు. అట్టిచమత్కారము వక్రతవలననే గలుగుచున్నది. కావుననే నిండు వెన్నెల కాయుచున్న దని చెప్పుటకు మాఱుగఁ బిండి యారఁబోసినట్లు వెన్నెల కాయుచున్న దని చెప్పుటయు, నామె మిక్కిలి చక్కని దనుటకు బదులామె రంభ యనుటయు మిగులఁ జమత్కారాధాయకము లగుచున్నవి. అట్లే కొన్నికొన్నివిషయములను బహిరంగముగ వెలిపుచ్చక వ్యంగ్యమర్యాద ననుసరించి చెప్పిననే రమణీయముగ నుండును. ఇట్లు చెప్పుచుండుట మానవజాతిస్వభావము. కాన నీయలంకారవిషయోత్పత్తి వాఙ్మయముతోఁ గాని, కావ్యవాఙ్మయముతోఁ గాని ప్రారంభమైన దని చెప్పవచ్చును.

సామాన్యముగ ఛందోవ్యాకరణాలంకారాదు లగుశాస్త్రగ్రంథములు

లక్షణగ్రంథము లని చెప్పఁబడుచున్నవి. ఆంధ్రశాస్త్రమున లక్షణగ్రంథములలో నీమూఁడువిధము లగుగ్రంథములు చెప్పఁబడినవి. అప్పకవి తనలక్షణగ్రంథ మగు నప్పకవీయమునందుఁ దనకంటెఁ బ్రాచీనులగు లక్షణవేత్తలగ్రంథముల పేళ్లు నుదాహరించుచు మీఁదఁజెప్పఁబడిన రీతిని ముత్తెఱంగు లగులక్షణగ్రంథములను జెప్పియున్నాఁడు. అట్టియెడ వానియందు ఛందోవ్యాకరణగ్రంథములకంటె నలంకారగ్రంథములు చాలఁ దక్కువ యనియు, ఛందోగ్రంథములే యెక్కువ యనియుఁ దెలియుచున్నది. (1)

అప్పకవీయమునఁ గవి తాఁ జింతామణికి సుష్ఠ మగువ్యాఖ్య వ్రాయఁబూని యాగ్రంథమును రచింపఁ బూనినట్లు పీఠికాపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. ఆంధ్రశబ్దచింతామణి వ్యాకరణగ్రంథ మైనట్లు మన మెఱుఁగుదుము. కావున వ్యాకరణమును రచింపఁబూను కవి తనకంటెఁ బూర్వము లగువ్యాకరణగ్రంథములనే యుట్టంకింపవలసి యుండుట యుక్తము. కవి యట్లుగాక సర్వవిధము లగులక్షణగ్రంథముల నుట్టంకించుటం బట్టి యాతనిగ్రంథమునందు మువ్విధము లగులక్షణములును నిరూపింపఁబడిన వని మనము తెలిసికొనవచ్చును. అందుఁ గ్రమముగ నలంకారవ్యాకరణచ్ఛందోవిషయములు మనకు గోచరించును.

కాఁగా నప్పకవీయమున నలంకారచ్ఛందోవ్యాకరణ విషయములకు సాంకర్యము కల దనియు, లక్షణగ్రంథము లనఁగా ముత్తెఱంగులలక్షణములను నిరూపించుగ్రంథము లనియుఁ దేలిన సారాంశము. ఇట్టి విషయసాంకర్యమును మనము దోషముగా క్షేపింప వీలులేదు. ఆంధ్రమున లక్షణగ్రంథములు చాల స్వల్పముగ నున్నవి. కావునఁ బ్రత్యేకముగ నొక్కొక్కశాస్త్రమునఁ గృషి చేసి యాంధ్రమునఁ బ్రతిష్ఠ బొందుట దుర్ఘటము. కావున లక్షణము లగుఛందోవ్యాకరణాలంకారముల నొకవిషయముగాఁ జేర్చి యాలక్షణసముదాయమునఁ బరిశ్రమలు సల్పి పేరుపొందుటయే మనవారి యాశయమై యుండవచ్చును.

(1)...కవిగజాంకుశంబును, కవిసర్పగారుడంబును, కవిజనాశ్రయంబును, కవిలోకసంజీవనియును, కవికంఠాభరణంబును, కావ్యాలంకారచూడామణియును, కావ్యచింతామణియు, నథర్వణచ్ఛందంబును, గోకర్ణచ్ఛందంబును, శ్రీధరచ్ఛందంబును, ననంతామాత్యచ్ఛందంబును, ఛందోదర్పణంబును, నలంకారసంగ్రహంబును, నలంకారరత్నాకరంబును......లక్షోపలక్షలుగఁ గలవు.

[అప్పకవీయము, వావిళ్ళవారిప్రతి. సం 1922. ప్రథమాశ్వాసము. పుట. 14.]

మఱియు నాదివాఙ్మయము మఱుగీర్వాణమునఁ బరిపూర్ణముగ శాస్త్రగ్రంథములు రచింపఁబడియుండుటచేతను, సంస్కృతమువలననే శాస్త్రపాండిత్యమును బొందుటకుఁ దగిన సదుపాయము లుండుటచేతను, నొకవేళ నాంధ్రమున శాస్త్రగ్రంథములు విశేషించి రచింపవలసినచో గీర్వాణవాఙ్మయమునుండియే విషయమును గ్రహింపవలసి యుండుటచేతను మన తెలుఁగువారు తక్కుంగల యితిహాసపురాణకావ్యాదుల నాంధ్రీకరించుటకే తొడఁగిరి, గాని, శాస్త్రగ్రంథములను విరివిగను బ్రత్యేకముగను రచింపఁబూనలే దని మనము నిశ్చయింపవచ్చును. అక్కతముననే మనవారు భాషాంతరీకరణముల నొనర్చుటకును, భాషాంతరీకరణముల నర్థముచేసికొని సాధ్వసాధుపరిజ్ఞానమును బొందుటకును నెంతటిపరిజ్ఞాన మవసర మగునో యంతమాత్రపులక్షణములనే నిరూపింప సంకల్పించి ఛందో వ్యాకరణాలంకారములను మేళవించి గ్రంథములను వ్రాయం దొరకొనిరి. కావుననే యాంధ్రలక్షణగ్రంథములందు గీర్వాణలక్షణగ్రంథములందువలె శాస్త్రాంతరములతో సంబంధించిన చర్చలు కనిపింపకున్నవి. ఇట్టి విషయసాంకర్య మించుమించుగ నాంధ్రలక్షణగ్రంథము లన్నింటియందు ను గలదు. ప్రథమాంధ్రలక్షణగ్రంథము నాఁబరగు చింతామణియందు మొదటి రెండుకారికలును గావ్యలక్షణవిషయకము లయి యుండుటచే(2) నలంకారశాస్త్రవిషయము మొదటనే నిబంధింపఁ బడినట్లును, బ్రథమపరిచ్ఛేదమునందలి "వళి రాద్య మనంతరాక్షరం ప్రాసః" అను సూత్రమునుబట్టి యిందు ఛందోవిషయము నిరూపింపఁబడినట్లును మనము నిశ్చయింపవలసియున్నది. ఇట్లే కవిజనాశ్రయమను ఛందోగ్రంథమును రచియించిన వేములవాడ భీమకవియుఁ దనగ్రంథమున ఛందోవిషయములనే గాక యలంకారవిషయము లగు "కావ్యభేదపరిగణనాదులను" "హృద్యానవద్యకావ్యము గద్యము పద్య మని చెప్పఁగా ద్వివిధ మగు" నను మొదలగు రీతులఁ జెప్పియున్నాఁడు. అలంకారశాస్త్రాంగ మగు దోషవిచారమును విపులముగ నొకయధికారమునఁ జెప్పియున్నాఁడు ఆంధ్రమునఁ బ్రథమాలంకారగ్రంథ మని ప్రసిద్ధికెక్కిన కావ్యాలంకార

(2) విశ్వశ్రేయః కావ్యం తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ,
సావా గ్యా గసవృత్తిః సాధ్వీహి రసో యథాయథం కవిభిః.
స్వస్థానవేషభాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః,
లోకే బహుమన్యన్తే వైకృత కావ్యాని చాప్యపభ్రంశాః.

చూడామణిని రచించిన విన్నకోట పెద్దయకవి కూడ నలంకారవిషయములను బ్రాస్తిగ నిరూపించి యంతటితోఁ దనివి నందక మూఁడుల్లాసములలో ఛందోవ్యాకరణవిషయములను గూడ విపులముగఁ జర్చించియున్నాఁడు. ఇట్టి తక్కిన గ్రంథములలోఁ గూడఁ గానవగును.

ఇట్టివిషయసాంకర్యము కేవల మాంధ్రముననే గల దని మనము చెప్ప వీలు లేదు. సంస్కృతవాఙ్మయమునందలి యర్వాచీనాలంకారగ్రంథములలో నిట్టి విషయసాంకర్యము లేకున్నను మొదటిగ్రంథ మగు నాట్యశాస్త్రమున గన్పించుచున్నది. అందుఁ గావ్యవిశేష మగు నాట్యమే ప్రధానప్రతిపాద్య మగువిషయ మై యుండ ఛందోవిషయములు కూడ నిరూపింపఁబడియున్నవి. నాట్యశాస్త్రమునందలి ముప్పదిరెండవయధ్యాయమున ధ్రువలక్షణాధ్యాయమున ఛందస్సు చెప్పఁబడినది. ధ్రువ యనఁగా వృత్త మగుట స్పష్టము. వామనుని కావ్యాలంకారసూత్రములందును, నతనికంటెఁ బ్రాచీనుఁ డగుభామహుని కావ్యాలంకారమునందును శబ్దశుద్ధి యను పేరిట వ్యాకరణవిషయములు ప్రతిపాదింపఁబడి యున్నవి. కాని, యిట్టిసాంకర్యము కల గ్రంథములు గీర్వాణమునఁ జాలఁ దక్కువ యనియు నాంధ్రమున నెక్కువ యనియుఁ జెప్పి తీరవలయును. కాఁగా నిట్టిసాంకర్యమున నాంధ్రులే స్వాతంత్ర్యము నవలంబింప లేదనియు, సంస్కృతవిద్వాంసులు త్రొక్కినమార్గముననే వీ రనుసరించి రనియుఁ దెలియుచున్నది. కాని యట్టిసాంకర్యము కొలఁదిగ్రంథములలోనే యున్న దనియు, నం దలంకారగ్రంథములలోఁ దఱుమాత్రము కల దనియుఁ జెప్పవలెను. ప్రత్యేకమగు శాస్త్రపాండిత్యమును సంపాదింప నెంచువారు గీర్వాణమున నిట్టిగ్రంథములనే గాక గ్రంథాంతరములయొక్క సాహాయ్యమునే యపేక్షింతు రనుట నిర్వివాదాంశము.

మీఁదికారణములనుబట్టి యాంధ్రమున నలంకారవిషయము చాల నవీన మైన దనియును, నయ్యది యుపయోగానుసారముగఁ జాలవఱకు సంగ్రహముచే యఁబడి తక్కినవిషయములతోపాటు చెప్పఁబడిన దనియుఁ, గావున గీర్వాణము నందువలె నాంధ్రమున నలంకారవాఙ్మయమునకుఁ బ్రత్యేకత లేకపోయిన దనియును జెప్పవలసియున్నది.

మనకు లభించిన యాంధ్రాలంకారగ్రంథములలోఁ గావ్యాలంకారచూడామణియే మొదటిదిగాఁ దోఁచుచున్నది. కవి యలంకారవిషయములలో

దండ్యాచార్యునిమతమును రీతులవిషయమున వామనునిమతమును ధ్వన్యలంకారసామగ్రివిషయమునఁ దనకంటెఁ బూర్వము లగు కావ్యప్రకాశాదు లగుప్రసిద్ధాలంకారగ్రంథములమతము ననుసరించె నని చెప్పవలయును. ఇందలిరచనాప్రణాళి యించుమించుగ విద్యానాథుని ప్రతాపరుద్రీయమునకు సరిపడుచున్నది. కాన నిద్దియుఁ బ్రతాపరుద్రీయమును సమకాలికు లగు కవివరులచేత వ్రాయఁబడియుండవచ్చును. లేదా, ప్రతాపరుద్రీయ మింతకంటెఁ గొంచెము ప్రాచీన మైనఁ గావచ్చును. మూర్తికవిరచించిన నరసభూపాలీయము సామాన్యముగ విద్యానాథుని గ్రంథమున కాంధ్రీకరణ మనియుఁ జెప్పవచ్చును. కొన్ని విషయములను విడిచియుఁ, బెఱవిషయములఁ గొన్ని చేర్చియుఁ గొన్నిపట్లఁ గవి స్వతంత్రరీతుల ననుసరించెను. మొత్తముపై నాంధ్రులు గీర్వాణగ్రంథముల నర్వాచీనములనే యాధారముగఁ జేసికొని గ్రంథములను వ్రాయఁ బ్రారంభించి రనుట నిర్వివాదాంశము. అప్పకవి తనలక్షణగ్రంథమున నాంధ్రలక్షణగ్రంథములనే గాక సంస్కృతలక్షణగ్రంథములను గూడఁ బేర్కొనెను. అందుఁ బ్రతాపరుద్రీయముకంటెఁ బ్రాచీన మగునలంకారగ్రంథము నాతఁడు పేర్కొనియుండకపోయెను.(3) చూడామణి యలంకారవిషయములలో దండికావ్యాదర్శమునే యనుసరించియున్నను నప్పకవి కావ్యాదర్శము నుదహరింపకపోవుటచే నతఁడు కావ్యాదర్శమును, నట్లే ప్రాచీనాలంకారగ్రంథము లగుభామహాలంకారము, వామనుని కావ్యాలంకారసూత్రవృత్తి, రుద్రటుని కావ్యాలంకారము, ధ్వనికారుని గ్రంథము మొద లగువాని నెఱుఁగఁ డేమో యని చెప్పవలసి వచ్చుచున్నది. సామాన్యముగఁ గాశ్మీరాదిదూరదేశీయులచే వ్రాయఁబడిన ప్రాచీనాలంకారగ్రంథముల కన్నింటికిని దెనుఁగుదేశమున నక్కాలమునఁ దగినప్రచారము లేక యుండవచ్చును. కావుననే సామాన్యముగ మన యాంధ్రాలంకారికులు దాక్షిణాత్యుఁ డగు దండియొక్కయు, నాంధ్రుఁ డగు విద్యానాథుని యొక్కయు గ్రంథములనే యనుసరించుట యుక్తమై యున్నది. కావ్యప్రకాశము, రసమంజరి మొదలగు కొన్ని గ్రంథాంతరములు కూడ నాంధ్రదేశమునఁ బ్రచారమున నుండె ననుటలోఁ గూడ యుక్తి లేకపోలేదు. మీఁదిగ్రంథముల నొకటి

(3) అవి యెయ్యవి యనినఁ బ్రతాపరుద్రీయంబును, కువలయానందంబును, జంద్రాలోకంబును, రసమంజరియును. [అప్పక. ప్రథమా పుట 14]

రెండింటిని విడిచి మనవారు గీర్వాణాలంకారగ్రంథముల నెఱుఁగ రని చెప్పుటయే నాయభిప్రాయము కాదు.

మిాఁదికీర్తినిబట్టి చూడామణికారుఁడు మూర్తికవి మొదలగువారు తమ గ్రంథరచనమునకు గీర్వాణగ్రంథముల నాధారములుగఁ జేసికొని రనుటలో సందేహము లేదు, అట్లయ్యును, చూడామణి యేదో యొక్కగ్రంథమునే గాక చాలగ్రంథములను బరిశీలించి యనేకవిషయములను సంగ్రహించెను. మూర్తికవి నరసభూపాలీయము నించుమించుగఁ బ్రతాపరుద్రీయమునే యనుసరించి వ్రాయఁబడియున్నను, నందు నాయికాభేద (సామాన్యాది) నిరూపణమునందును, కృతివిషయమునను మఱికొన్ని పట్లను మూలములో లేని విషయము చెప్పఁబడినది. గుణములవిషయమై స్వాతంత్ర్య మవలంబింపంబడి ప్రతాపరుద్రీయమునందలి రీతి విరుద్ధ రెండుగుణములు కాక గ్రంథాంతరములయందలి మాదిరిని పదిగుణములే యంగీకరింపఁబడినవి. కావున నీగ్రంథము లొకమాదిరిగ స్వతంత్రగ్రంథములే కాని భాషాంతరీకరణములు కావని చెప్పవలెను. మనయాంధ్రాలంకారికు లిట్లు తమగ్రంథరచనమునకు సంస్కృతగ్రంథములనే యాధారముగఁ జేసికొనినను, సంస్కృతాలంకారికుల నామముల నుట్టంకించియుండ లేదు. మూర్తికవి గ్రంథము మూఁడువంతుల మువ్వీసములు ప్రతాపరుద్రీయాంధ్రీకరణమే యైనను, గవి విద్యానాథుని పేరైనఁ దలఁచియుండ లేదు. ప్రతాపరుద్రీయనామమైన నందు గోచరించుట లేదు. అట్లు వారు చెప్పకపోవుటకుఁ గలకారణము వారిగ్రంథములు కేవల మొక్కగ్రంథమునకు భాషాంతరీకరణములు కాకుండుటయే యని మన మూహింపవచ్చును. తమగ్రంథములయందు గీర్వాణాలంకారికుల నామము లున్నచో వారిగ్రంథములకుఁ దమగ్రంథములు భాషాంతరీకృతు లని పరులు పొరపడుట కవకాశ ముండవచ్చు నను నభిప్రాయము మనవారికిఁ గలిగి, యట్టి యభిప్రాయము కలుగకుండుటకుఁగూడ వారు నామోట్టంకమును మాని యుండవచ్చును. కాని కేవలము భాషాంతరీకరణము లొనర్చినవారు మాత్రము తమగ్రంథములు మూలగ్రంథములకు భాషాంతరీకరణము లని చెప్పిరి. (4) అందు రసమంజరిని రచించిన

(4) సీ. ... ... ... ... ... ...
... ... ... భాసిల్లు కోదండపతిఘనుండు.
గీ. సరసకవితాచమత్కారసార్వభౌముఁ, డవని శ్రీరంగధామదయాప్రియుండు
నెలమి రసమంజరిని రచియించె నందు, సరవిగాఁగఁ దృతీయగుచ్ఛంబు తనరు. [రసమంజరి.]

కోదండపతియుఁ జంద్రాలోకమును వ్రాసిన సూరకవియుఁ గువలయానంద మును వ్రాసిన రామయకవియు గణనీయులు.

మనయాంధ్రులు తమగ్రంథరచనమున నేదో యొక్కగ్రంథమునే యాధా రముగఁ దీసికొనక యనేకగ్రంథముల సాయము నపేక్షించుటచేఁ బరస్పరవిరు ద్ధము లగునభిప్రాయములు కొన్ని మనవారిగ్రంథములందు గోచరింపవచ్చును. వారియాదర్శగ్రంథము లొక్కొక్కసమయమునఁ బరస్పరము విరుద్ధాభిప్రాయ ములను గాని విభిన్నాభిప్రాయములను గాని దెలియపఱుచుచుండుటచే, వాని ననుసరించి వ్రాయఁబడిన విషయములు కొన్ని భాషాంతరీకర్తల యభిప్రాయ మును గప్పిపుచ్చును. చూడామణికారుఁడు రీతులవిషయము వ్రాయుచు వామ నుని మతము ననుసరించి "అఖిలకావ్యములకు రీతు లాత్మ యండ్రు" (5) యని రీతియే కావ్యమున కాత్మ యని చెప్పెను. కావ్యమున నెట్టిప్రాధాన్యము లుండ వలె ననువిషయమున "ఆరయ వస్తురసాలం, కారప్రాధాన్యవృత్తిఁ గబ్బంబుల" (6) నని మమ్మటాచార్యాదులమతము ననుసరించి వ్యంగ్యములగు వస్తురసాలం కారములకుఁ బ్రాధాన్యము కల దని వ్రాసెను. వామనుని కాలమునకు వ్యంగ్య మను మాటయే లేదు. కావున, నతఁడు రీతులే ముఖ్యము లని చెప్పవలసి వచ్చెను. క్రమక్రమముగ నానందవర్ధనాచార్యులు ప్రారంభించిన ధ్వనివాద మునకే ప్రాధాన్యము కలిగినది. కావునఁ గావ్యప్రకాశమున మమ్మటుఁడు ధ్వని యే ప్రధాన మైన దని వాక్రుచ్చెను. అతనిమతము ననుసరించి మనపెద్దయకవి వస్త్వాదులకుఁ బ్రాధాన్యమునొసంగెను. ఇట్లు విభిన్నకాలికుల యభిప్రాయముల ననుసరించినపుడు పరస్పరము విభిన్నములును విరుద్ధములు నగువిషయములు కన్పించుట కవకాశము లేకపోలేదు గదా! ఇట్టివిషయమునఁ బరస్పరవిరుద్ధ ములు కాని యాశయములనే దీసికొనుట శ్రేయము. ఇట్లే కొన్నికొన్ని విష యము లప్పకవీయాదులయందును గోచరించుచున్నవి. కాని వీని నంతటి గొప్ప

గీ. బాలురకునైనఁ దెలియఁగాఁ గాళిదాసు, మునురచించెఁ జంద్రాలోకమును ద్రిలింగ
భాషఁ జేసితి నీకృప భవ్యముగను, దీని గరుణించి కైకొమ్ము దేవదేవ ? [చంద్రాలోకము.]

గీ. సరసుఁ డకలంకవంశాబ్ధిచంద్రుఁ డనఘుఁ, డైన రంగార్యవర్య సాహాయ్యమునను
గువలయానంద మిలను దెల్గున రచింపఁ, గడఁగితిని దుష్కరంబైనకార్యమునకు.

[కువలయానందము.]

(5) చూ. కావ్యాలంకారచూడామణి. చతుర్థోల్లాసము. ప. 77.

(6) చూ. ... ... ... ప 45.

దోషము లని చెప్పకుండుట మనకుఁ గర్తవ్యము. అలంకారశాస్త్రమునకుఁ బ్రత్యేకత నొసంగక కొన్ని యుపయుక్తవిషయములనే గ్రహింప నెంచిన మనవారు బాగుగ నీవిషయమునఁ జర్చలు సలుపలే దనియుఁ జెప్పవచ్చును.

మనవారు లక్షణగ్రంథములను రచించినపుడు కేవలభాషాంతరీకరణబుద్ధినే గాక యుపయుక్తవిషయప్రతిపాదనాశయమున గ్రంథరచనఁ బ్రారంభించి యున్నను గొన్ని ముఖ్యవిషయము లందుఁ జెప్పవలసినసంగతులను జెప్పక గతానుగతికముగ సంస్కృతమునే యనుసరించినట్లు తోఁచుచున్నది. లక్షణగ్రంథ మేవాఙ్మయమును బరిశీలించి చక్కఁజేయుట కేర్పఱుపఁబడుచున్నదో యావాఙ్మయమున కుపయోగించు ముఖ్యములగు విషయములను నిరూపించుట లక్షణవేత్తల ముఖ్యకర్తవ్యమై యున్నది. ఆంధ్రవాఙ్మయమునందలి దోషములను నిరూపించునపుడు కేవలము గీర్వాణము నాంధ్రీకరించుచోఁ బ్రయోజనము లేదు. ఆంధ్రవాఙ్మయమున వృత్తయతిభంగదోషములవలెనే ప్రాసభంగము కూడ ముఖ్య మగుదోషమై యున్నది. మఱియు వానికంటె నిదియే ప్రధాన మని చెప్పవచ్చును. ప్రాస ముఖ్య మైన దని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. కావునఁ బ్రాసభంగమును మనవారు ముఖ్య మగుదోషముగాఁ జెప్పవలసియుండఁగా నట్లు చాలమంది చెప్పకపోయిరి. కవిజనాశ్రయ, కావ్యాలంకారచూడామణి, నరసభూపాలీయములందు ఛందోయతిభంగములు దోషము లని చెప్పి ప్రాసభంగపు సంగతియే చెప్పఁబడలేదు. దీనింబట్టి కూడ మనవా రలంకారవాఙ్మయవిషయమున మిగుల శ్రద్ధ తీసికొనియుండలే దనియు, నాంధ్రవాఙ్మయమున దానికిఁ జాలినంత యవకాశము నొసంగలే దనియుఁ జెప్పవలయును.

క్రమక్రమముగ నలంకారమునకుఁ బ్రత్యేకత యీయఁబడుచు వచ్చినది. కావుననే తొలుతఁ దక్కినవిషయములతోపాటు చెప్పఁబడు నీవిషయము నరసభూపాలీయమున విషయాంతరసాంకర్యము లేకయే చెప్పంబడినది-రసమంజర్యాదులందు నట్లే కలదు. మొత్తముపై విషయాంతరములం దున్న గ్రంథములకంటె నలంకారమునఁ గలగ్రంథములు చాల స్వల్ప మనియుఁ జాల నవీన మనియుఁ జెప్పవచ్చును-కాని కాలక్రమమున నిందును జాలగ్రంథములు రచింప ననేకు లిక్కాలమున దొరకొనియున్నారు. విద్వాంసులు చాలమంది యనేకగ్రంథముల నాంధ్రీకరించుచున్నారు-ఆంగ్లవాఙ్మయమున నిష్ణాతులైన విద్వాంసులు తమదేశభాషావాఙ్మయపరిపోషణాభిలాష తమవిజ్ఞానము

నకుఁ జేయూఁత నొసంగ ననేకవిమర్శ గ్రంథములను రచియించి వాఙ్మయమున కవసరము లగు నియమములను బ్రతిపాదించుచున్నారు- ఇట్టి గ్రంథములు పూర్తిగాఁ గాకున్నను గొంతవఱ కైనను వాఙ్మయమున కుపయోగింపఁగల వని చెప్పవలెను.

కాఁగా నాంధ్రమునఁ బ్రాచీనకాలమున నలంకారమునకుఁ బ్రత్యేక శాస్త్రత్వము లేకపోయిన దనియు, నలంకారవిషయములు స్వల్పముగ నుప దేశింపఁబడిన వనియు నందుచే నలంకారమున కక్కాలమున నుచితమగు స్థానము లభింపలే దనియుఁ జెప్పవలెను. ఇక్కాలమున మాత్ర మీశాస్త్రము ప్రత్యేకింపఁబడి విషయాంతరములతోడి సాంకర్యము లేక యభివృద్ధిం బొందింపఁబడుచున్న దని చెప్పవలయును. కావున నిప్పటివారు మీఁదిసాహిత్యవి మర్శశాస్త్రమునకు వాఙ్మయమున నుచితమగు స్థానము నీయఁదలంచుచు న్నారని చెప్పుటలో సందేహము లేదు.

# అభిజ్ఞానశాకుంతలము.

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు—కొవ్వూరు.

శకుంతల కొడుకుం గొని పతికడ కేగెను దుష్యంతునియందు మున్ను కణ్వాశ్రమంబునఁ గన్న యనురాగము కనఁబడ లేదు. ఎఱిఁగియు నెఱుఁగ నొల్లనివారిం దెలుపఁగలనా? అని నిరాశ యయ్యు వచ్చి మిన్నక పోవం గాదనుకొనినది.

రాజా! వేఁటనెపమునఁ గణ్వాశ్రమమునకు వచ్చి నాకు నీవిచ్చిన వరముఁ దలంపుము. వీఁడు నీకొడుకు. వీనికి యౌవరాజ్యపట్టాభిషేకము చేయుము. అనినది.

దుష్యంతుఁ డది విని యెఱింగియు నెఱుంగనివాఁడ పోలె, "ఏనెఱుఁగ నిన్ను నెక్కడి, దానవు? మిన్నకయ యనుచితంబులు పలుకం,గా నేల యరుగు మంబురు,హానన యెందుండివచ్చి తందులకు వడిన్" అనినాఁడు.

అపుడు శకుంతల తనపాతివ్రత్యము నూఁతగాఁ గొని పెద్ద యుపన్యాసము గావించెను ఫలింపలేదు. తనయుం దోడ్కొని క్రమ్మఱి పోవుచుండె. అప్పు డాకాశవాణి, "గొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు సేకొని భరియింపు మీతని, శకుంతల సత్యము పల్కె సాధ్వి సద్వినుతమహాపతివ్రత." అని ఘోషించినది. అంత దుష్యంతుఁడు సభాసదులతో,

"ఏను నీయింతియును గాని యెఱుఁగ రన్య,లర్థిఁ గణ్వమహామునియాశ్రమంబు
నందు గాంధర్వవిధి వివాహంబునఁ గరము, నెమ్మిఁ జేసినదీని పాణిగ్రహణము."
"అన్యు లెఱుఁగమిఁ జేసి లోకాపవాద,భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతిఁ దప్పి
యెఱుఁగనంటిని నిందఱకిప్పు డెఱుఁగఁ, జెప్పె నాకాశవాణి యచ్చెరువుగాఁగ."

అని మహానురాగంబునఁ గొడుకు నెత్తికొని హర్షపులక లెసఁగ నాలింగనంబు చేసి, శకుంతలామహాదేవి నతిప్రణయగౌరవంబున సంభావించె. యౌవరాజ్యంబునకు భరతు నభిషిక్తుం జేసె.

ఇతఁడు భారతములోని దుష్యంతుఁడు. ఈతనికన్న నభిజ్ఞానశాకుంతలములో మాఱినదుష్యంతుఁడు బాగుగ నుండెనా? మఱచుట తప్పు. దానికి శాపము కావలసివచ్చినది. శాపము నిర్నిమిత్త మనఁదగియున్నది. కావుననే దుర్వాసుఁడు కావలసివచ్చినాఁడు. ఐనను శకుంతల యభ్యాగతపూజయం

దశ్రద్ధవహించుట ఋష్యాశ్రమములలోని యలవాటులకుఁ దగినపని కాదు. ఇచ్చట మహాకవికి రసపక్షపాతమున మునులశిక్ష లక్ష్యము కాలేదు. మొట్ట మొదటఁ బ్రియంవదానసూయలతో శకుంతల చెట్లకు నీళ్లుపోయునప్పుడును శృంగారమే ముదిరియున్నది ఋష్యాశ్రమములలోని పిల్లలుకదా! ఏచదువు సంధ్యలమాటలో, ఏతపస్సుమాటలో, ఏసత్ప్రవర్తనశ్లాఘలో, ఏగృహిణీధర్మ ములో వారిమాటలలో రాఁగూడదా? ఎంతశృంగారప్రధాననాటక మైనను ముందు వచ్చెడిది యనురాగమయ ప్రసంగమే యయినను గొంచెము ఋష్యాశ్రమములోఁ బెరిఁగిన వైలక్షణ్యము కనుపట్టవలదా? "నా వాం కామశాస్త్రస్య అభ్యంతరే స్వః' అను మాటచేత నయ్యాశ్రమమున బాలికలు చదువుల నాఱితేఱినవా రని మహాకవిగారే సూచింతురు గదా. సాంఖ్యయోగాదిచర్యలు ప్రసంగములోనికి వచ్చినను రావచ్చును. అథవా వాత్స్యాయనాదులు నిర్ణయించిన దాంపత్యధర్మములు మున్నగునవియు వివాహాదివిధులును నాబాలికలవిమర్శములలోనికి మాటలసందర్భమున రావచ్చును. అవి యన్నియు వదలి "పయోధరవిస్తారయితృకం యౌవన ముపాలభస్వ" అని వైఖానసవ్రతములో నున్న శకుంతలచెలులచేఁ బలికించుటయే తప్పనిపనియా?

ఆ మునికన్యక లెప్పుడును శృంగారప్రసంగములనే చెట్లకు జలములు వోయుచుఁ గూడఁ జేయుచుండు రనకపోయినను మహారాజదర్శనమునఁ దారామైత్రిని సమకూర్చి నిష్కపటమైన ప్రణయమును బెంచుకొని శృంగారసామగ్రిని సమకూర్చుట యసాధ్యమా?

కాని యిది యెల్ల మహాకవిగారి శృంగారపక్షపాతఫలితమే. అట్లే కామపరవశ యై శకుంతల దుర్వాసు నాదరింపక శాపమును దిన్నది.

ఇన్నిసమర్థనల కవకాశ మిచ్చిన దుష్యంతుని మఱుపుకల్పన భారత ఫక్కి కన్న మిన్న కాదేమో!

కాని కథ పంచమాంకముతో ముగిసిన దేవేంద్రసాహ్యము లేనిచో దుష్యంతుఁడు ధీరోదాత్తుఁడు కాఁడేమో! అట్లనుటకును వీలు లేదు. వేఁటలో హస్తలాఘవము వైఖానసాజ్ఞచే నెక్కిడినశరము నుపసంహరించుట ఋష్యాశ్రమమున యజ్ఞరక్షణమునకై పిశితాశనులఁ బాఱఁదోలుట మున్నగునవి దుష్యంతుఁడు ధీరలలితుఁడు కాఁడని చాటుచున్నవి. కాని దేవేంద్రసాహా

య్యము వంటి విక్రమకార్యము లవి కా వనవచ్చును. ఇంకొక పెద్దప్రయోజనము కానిపించును. నాటకాంతమున నిర్వహణసంధిలో, అద్భుతము. అది యుత్తరరామచరిత్రాదులలోకన్న నభిజ్ఞానశాకుంతలములో మిక్కుటము కాక పోలేదు. ఇఁకఁ గనఁబడ దని రూఢిచేసికొనిన శకుంతల పిల్లవానితో, యుద్ధకార్యములను విస్మయముతోఁ జెప్పుకొనుచు సారథిద్వితీయుఁడై వీరర సాలంబనముగ వచ్చుచున్న దుష్యంతున కాకస్మికముగ మార్గమధ్యమునఁ గొండమీఁదఁ గన్పట్టుటా? ఇది యద్భుతపోషకము కా దనువా రుందురా? మఱియు షష్ఠాంకములోని ప్రవాసవిప్రలంభశృంగారవర్ణనావకాశసంపాదనముకూడ దుష్యంతుని మఱపుకల్పనకు ఫలమై యుండనోపు. ప్రవాసవిప్రలంభలోలత మేఘసందేశముతో ముగియలే దేమో? లోకాంతరగత నాయికమైన కరుణవిప్రలంభ మనిన నిదియు మఱొకక్రొత్తయే. కరుణమా కరుణవిప్రలంభమా, అనుశంకలకుఁ జోటీయని కరుణవిప్రలంభశృంగారమున మహాకవి తనిసియుండెనేమో!

# కృష్ణదేవరాయలు—ఆముక్తమాల్యద.

టేకుమళ్ల అచ్యుతరావుగారు, ఎం. ఏ, ఎల్. టి., రాజమహేంద్రవరము.

(గతసంచిక శేషము.)

అల్లసాని పెద్దనార్యుఁడు మనుచరిత్రను వ్రాసి యాప్రబంధము సులభశైలిని నుండుటచే నంతకంటెఁ గఠినశైలిని నీయాముక్తమాల్యదను వ్రాసె నని యొకవాదము ఈవాదమునుఁబట్టి చూచిన నీరెండుగ్రంథములకుఁ గలభేదము శైలియందలి మార్దవకాఠిన్యములే యని సూచింపఁబడుచున్నది. ఈరెండుగ్రంథములకుఁ గలభేద మింతమాత్రమే యైనచో నీవాదము నంగీకరింపవచ్చును. కాని యాగ్రంథములను విమర్శదృష్టితో సమ్యక్పరిశీలనఁ జేసినయెడల నొక్కశైలియందే గాక యన్ని విషయములయందును నీరెండుగ్రంథములు భేదించుచున్న వని విశద మగుచు. ఈరెంటికిని యక్కువిధమైన పోలికయు లేదు. శిల్పము, భావము, రసము, భావనాశక్తి, యలంకృతి, శబ్దసామగ్రి, శ్రావ్యత, యిత్యాది యేవిషయముఁ జూచినను నీరెండుగ్రంథములకు నిసుమంతయుఁ బోలిక గాన్పింపదు. కావున నొక్కకవియే యీరెండుగ్రంథములను రచించె నని చెప్పుట కేవలము దుర్గ్రాహ్యము-దురూహ్యము—— మామిడిచెట్టున మామిడిపండును తాటిపండును బుట్టింపఁగల వృక్షశాస్త్రజ్ఞుఁడు, నావుకడుపున నావుదూడను గేదెదూడను బుట్టింపఁగల పశుశాస్త్రజ్ఞుఁడు, నీనానారూపిణి యగుప్రకృతియందుఁబొడసూపెనా యప్పు డొక్కకవియే మనుచరిత్రము, నాముక్తమాల్యదను రచించె నని నేను నమ్మెదను. కాఁబట్టి యీగ్రంథకర్తృత్వయశస్సు కృష్ణదేవరాయల కిచ్చుట కిష్టము లేనియెడల, మఱి యొక పేరు లేని పెద్దమనుష్యున కీపేరుప్రతిష్ఠల నొప్పఁజెప్పవచ్చును; గాని పెద్దనార్యునకు మాత్రము సమర్పించుట యెంతమాత్రము వలనుపడదు.

కావునఁ దక్కిన విషయము లెట్టివియు——ననఁగాఁ గాలనిర్ణయాదులసందర్భము, గ్రంథమందలి వ్యాకరణాదిదోషములు, కొన్ని కల్పనలయసంభావ్యత మున్నగు నంతర్నివిష్టవిషయములను దడవి చూడకయే, సామాన్యపరిశీలన మీఁదనే యీగ్రంథము పెద్దన్నరచించినది కా దనియుఁ గృష్ణదేవరాయలో, లేక మఱి యొకకవియో వ్రాసి యుండవచ్చు ననియు, స్పష్టముగాఁ జెప్పవచ్చును. పెద్దన్ననుండి కర్తృత్వముఁ దప్పించి నపుడు కృష్ణరాయల కీయక మఱి

యొకనిమెడకుఁ జుట్టుట యేటిన్యాయము? కావున శిల్పమును, శైలియుఁ బరీక్షింపఁగఁ బెద్దన్నకృష్ణరాయలలోఁ గృష్ణరాయలదే యాగ్రంథ, మని వక్కాణింపవచ్చును.

కాని, పెద్దన్నగారి పద్యములు కొన్ని దీనియం దుండుటకుఁ గారణ మేమి? పెద్దన్నగారు మనుచరిత్రములోఁ గృష్ణరాయల వంశావళిఁ గూర్చి యాతనిశౌర్యప్రతాపవిజయాదికములఁ గూర్చియు వ్రాసినపద్యము లతిస్వల్పము లైనమార్పులతో నట్లే యాముక్తమాల్యదయందు స్వీకరింపఁబడినవి ఉభయ గ్రంథములలో నీపద్యములు సమముగా నుంటుటచేతఁ గొంతమంది విమర్శకు లీగ్రంథముల నొక్కకవియే రచించె నని వాదముఁ బొసఁగించుచున్నారు. మఱి కొందఱు కృష్ణదేవరాయలకుఁ బెద్దన్నగారిమీఁద నున్న గౌరవాతిశయసూచకముగా నీపద్యములనారాజకవి యుపయోగించెనని యభిప్రాయపడుచున్నారు. మఱికొందఱు కృష్ణదేవరాయ లాత్మస్తుతిఁ జేసికొనుట కిష్టములేక తనయాస్థానకవీశ్వరుఁ డగునల్లసానివారి పద్యములను దనగ్రంథములోఁ జేర్చికొనియె నని తలఁచుచున్నారు.

పైఁ జేర్కొనినహేతువులలో దేనివలనఁ గృష్ణరాయ లీపద్యములఁ దన గ్రంథమున నిమిడ్చికొనియుండవచ్చును? ఆత్మస్తుతి కిష్టములేకపోయిన నాశ్వాసాంతపద్యముల నెట్లువ్రాయఁగలిగెను? కావునఁ బెద్దన్నగారియందలి గౌరవాతిశయముచే నీపద్యములఁ దనగ్రంథమందుఁ జొప్పించి యుండవచ్చును. ఈ యూహకుఁ దోడుగ నేను మఱొకయూహ నిచట సహృదయులకు విన్నవించుచున్నాను.

కృష్ణదేవరాయలకు నల్లసాని పెద్దన్నగారియెడల నత్యంతభక్తివిశ్వాసము లుండిన ట్లనేకనిదర్శనము లున్నవిగదా?

"సీ. ఎదురైనచోఁ దనమదకరీంద్రమునిల్పి, కేలూఁత యిచ్చియెక్కించుకొనియె"

ఇత్యాదిపద్యముల మూలమునఁ బ్రభువాత్సల్యము విశదమే కదా! రాజ్యవిషయములో మంత్రితిమ్మరసు రాయనికి నప్పాజీ యయ్యెను. కవిత్వవిషయములోఁ దనయాస్థానకవీశ్వరుఁ డైనయల్లసాని పెద్దన్న యీరాజకవికి నప్పాజీతుల్యుఁ డయ్యె నని చెప్పవచ్చును. ఇట్లుభయులును బితృసమానులే. వారియెడల నత్యంతప్రేమాతిశయము రాయలు చూపుచువచ్చెను గదా! మఱియు నల్లసానివానిగ్రంథమందుఁ దనయేలిక యగుకృష్ణరాయలప్రశంస కృతిపతికా

రణమున నున్నది. కాఁబట్టి యాగ్రంథముఁ జదివినపు డెల్లఁ గృష్ణదేవరాయలు జ్ఞప్తికి వచ్చును. అట్లే కృష్ణరాయలగ్రంథముఁ జదివినపుడెల్ల నల్లసాని పెద్దన్న స్మరణకువచ్చు నెట్లు ? రాయలు తనగ్రంథముఁ దనయాస్థానకవీశ్వరునకు నంకితము చేయుట యయుక్తము గదా ! ఇంక నేవెరవునఁ దనకవితాగురుసంబంధ మభేదాధ్యవసాయముగఁ గల్పింపవచ్చును ? ఆకవీశ్వరుఁడు తన్నుఁగూర్చి వ్రాసినపద్యములఁ దా నుపయోగించుకొనినయెడలఁ దనకుఁ గలగౌరవము, భక్తి, కవిత్వాదరణము, గాఢానురాగము, నివి యన్నియు నొక్కసారిగఁ జేకూరును ! కావున శాశ్వతప్రేమైకబంధస్ఫోరకముగ నీపద్యములను దా నుపయోగించుకొనె నని నేఁ జెప్పసాహసించుచున్నాను.

వేఱొకవాదము:—అంతఃపురములలోను దర్బారులలోను గాలముఁ గడపుచుండు రారాజుల కెన్నఁడుఁ దెలియరాని జానపదవిషయములును దత్త్వజ్ఞానవిషయములు నీగ్రంథమందు ననేకములు కలవు. కావునఁ గృష్ణదేవరాయలు గాక పెద్దన్న యీగ్రంథము రచించె నని యొకవాదము. రారాజులకు జానపదులజీవితము తెలియనియెడల సామాన్యజనులకు రారాజులజీవిత మెట్లు తెలియుచున్నది ? సామాన్య కుటుంబములకుఁ జెందిన కవీశ్వరులు రాజుల యితివృత్తములఁ గూర్చి వ్రాయుచున్నారుగదా ? వారి కెట్లవి తెలియవచ్చుచున్నవి. అలాగునే రాజులకుఁ గూడ సామాన్యమానవుల జీవితరహస్యములు తెలియఁగలవు. "రవి గాననిచోఁ గవి గాంచునేకదా ?" అన్నట్లు కవితాదృష్టిఁ గలిగిన యేమానవుఁ డైన సామ్రాట్టైనను సామాన్యుఁడైననుఁ బ్రపంచమందలి నానావిధమర్మకర్మములను గుర్తెఱుఁగుటకుఁ బ్రేరేపించెడి ప్రజ్ఞాప్రభావ మెక్కువగఁ గలిగియుండును. అంతియేగాక కృష్ణదేవరాయలు ముప్పదివర్షములవయస్సువఱకు రాజ్యభారము వహించినవాఁడు కాఁడు. స్వతంత్రుఁడుగ సారస్వతదీక్షలోఁ గాలముఁ గడపినవాఁడు. లక్ష్మీనారాయణకవియనుసంగీతశాస్త్రజ్ఞుఁడు కృష్ణదేవరాయలబాల్యముఁ గుఱించి వర్ణించుచు "బాల్యేఽసౌ సకలకలాకలాపయుక్తః" అని చెప్పినాఁడు. అనఁగాఁ జిన్నతనముననే యనేకశాస్త్రములు కళలు సాఁగోపాంగముగా నేర్చినవాడు, అని చెప్పఁబడినది. కావునఁ గృష్ణరాయఁడు తనచిన్నతనమునఁ దనయత్యున్నత నానావిధవిజ్ఞాన సౌధమునకుఁ బునాదులు వేసికొనియుండెను.

రాజ్యమునకు వచ్చినతరువాతనైన సంతతము పండితకవీశ్వరగోష్ఠిలో మెలఁగుచుండెడివాఁడు. యుద్ధయాత్రలలోఁ దనయాస్థానకవిపండితబృందములను దనతోఁ దీసికొనిపోవుచుండెడివాఁ డని యెల్లరకుఁ దెల్లమే కదా? కావునఁ దన గ్రంథమునకు సంబంధించిన విజ్ఞానవిశేషములను జేర్చి కూర్చుకొనుటకుఁ జాల నవకాశ ముండెను. విశిష్టాద్వైతవాదప్రతివాదములసారము నష్టాంగయోగవివరణము, నిత్యాది నిగూఢ తత్త్వసంప్రదాయము లన్నియుఁ దనగురువుల సమ్ముఖమున నేర్చికొని తాను బద్యరూపముగ నల్లి గాని లేక వారిచే వ్రాయించి గాని తనగ్రంథమం దిమిడ్చికొని యుండవచ్చును. కాఁబట్టి శాస్త్రముల యందధికారి గాఁ డనియు, మతవిషయములందలి మర్మము లెట్లు తెలియ వచ్చిన వనియు నిట్టిశుష్కాక్షేపణలు కొఱగానివాదములే.

కృష్ణరాయల కంకితము చేసిన గ్రంథములలో ననఁగా మనుచరిత్రమునందుఁ బారిజాతాపహరణమందుఁ, గృష్ణరాయలు కవిత్వప్రియుఁ డని చెప్పుటయేగాని యతఁడు రచించిన గ్రంథముల వేనినైనఁ బేర్కొని యుండలే దని యొకవాదము. కవిబ్రహ్మ యగుతిక్కన సోమయాజి కంకితముచేసిన దశకుమారచరిత్రమందుఁ దిక్కయజ్వ వ్రాసినగ్రంథములలో వేని నైనను కేతనకవి యుదహరించినాఁడా ? 'మహాభారతము' గాకపోయినను నిర్వచనోత్తరరామాయణము నేనిఁ బేర్కొనియెనేమొ తిలకింపుఁడు. అందున లేనికారణమున మహాభారతముఁ గాని యుత్తరరామాయణముఁ గాని కవితిక్కన వ్రాయలే దని చెప్పఁగలమా? బహుశః యిట్టిమహాపురుషులవిషయములోఁ గవిత్వ మొకయానుషంగికవిలాసముగ మనపూర్వులు పరిగణించిరేమొ యని యే నూహించుచున్నాను. ఆమహాపురుషుల రాజకీయకృత్యముల తేజఃపుంజములో వారి గ్రంథరచన యొకకిరణకణముగ నుండెను. కావున వారికావ్యరచనము గణింపఁబడలే దని తోఁచుచున్నది. ఇప్పటికాలముననో వారి రాజకీయకీర్తికంటెఁ గావ్యములయశస్సే స్థిరమైనది. ఇట్టివియే కదా లక్ష్మీసరస్వతుల యన్యోన్యాతిశయతారతమ్యములు!

వీనియన్నిటికంటె నెక్కువైన కారణము గ్రంథమందే యున్నది. దాని నిదివఱకే కొంత సూచించితిని. శ్రీకృష్ణరాయ లేకాదశినాఁ డుపవసించి శ్రీకాకుళములో నున్నయాంధ్రవిష్ణువును దర్శింపఁబోయి యచ్చట నాథగవత్సన్నిధి నారాత్రి గడపి యుండఁ దచ్చతుర్థయామమునఁ గలలో నాథగవం

తుఁడే కృష్ణదేవరాయల కొక సందేశము తెలిపెను. అది యేమన, 'ఆముక్తమాల్యద' గ్రంథము తెనుఁగున రచింపు మనియే. అట్లానతిచ్చుటలో సంస్కృత గ్రంథములఁ గొన్నిటిని కృష్ణరాయలు రచించినట్లు తెలుపుడు చేసెను. కావున నట్టిపవిత్రస్థలమున, నట్టిపవిత్రసమయమున, సాక్షాద్భగవంతునిచే నబద్ధములాడించుటకు నేరికైన మనస్సు కలుగునేమో యాలోచింపవలెను. సర్వదా, అనృతము లాడెడుచోరులు సహితము, దేవాలయములో నిలఁబెట్టించి దేవుని యెదుట మాటలాడించిన నిజమునే పలుకుదురు! అట్టిస్థితిలో నుపవాసదీక్షలో నుండిన తనకుఁ దనయిష్టదైవము సాక్షాత్కరించి ప్రసాదించునపు డాభగవంతునిచే నేమనుజుఁడైనఁ గల్లలాడించునేమో యాలోచింపఁదగినది. అట్టిసమయమున మృషావచనముల కేమైన నవకాశ ముండునేమో యోచింపఁదగినది. కాఁబట్టి యాగ్రంథములు కృష్ణదేవరాయలు దప్ప యొరులు రచియించి రని యూహించుట కేవల మసంగతము, నన్యాయము, నఘావహము.

కావున నీయాముక్తమాల్యదఁ బెద్దన్న ప్రత్యేకముగా రచియించియుండలే దనియుఁ గృష్ణదేవరాయలు రచించినపిమ్మట పెద్దనాదు లచ్చటచ్చటఁ బరిష్కరించియుండవచ్చు ననియు నానిశ్చితాభిప్రాయము.

కథాసారము:—ఆముక్తమాల్యదకు 'విష్ణుచిత్తీయ' మను నామాంతరము కలదు. ఇందు విష్ణుచిత్తుఁ డను వైష్ణవభక్తాగ్రేసరుని జీవితము నాతనికొమార్తె యగు 'ఆముక్తమాల్యద' లేక "గోదాదేవి" యొక్క పరిణయము నభివర్ణింపఁబడినవి. కావున నీప్రబంధమున కీరెండుపేరులును బొసఁగినవి. ఆముక్తమాల్యదకు నరవమున "చూడికొడుత్తాళ్" అని యందురు. విష్ణుచిత్తునికథ ప్రాయికముగ "గురుపరంపరప్రభావ" మను ద్రావిడగ్రంథమునుండి యెత్తి తీయఁబడినది.

విష్ణుచిత్తుఁడు శ్రీవిల్లిపుత్తూరులో నున్న వటపత్త్రశాయిస్వామి దేవాలయమునం దర్చకుఁడు. ఈతఁడు గొప్పవైష్ణవభక్తుఁడు. అందుచే నీతనికి "పెరియాళ్వార్" అని పేరు వచ్చినది. ఈతఁడు దేవునికి నిత్యము కైంకర్యము చేయుచుండెడివాఁడు. దేవాలయపుతోటలోఁ బూలమొక్కలకు గొప్పుత్రవ్వుట, నీరు పోయుట, పూలను గోసి దేవునికిఁ దోమాలెలను గ్రుచ్చుట, దేవునికి నిత్యము ధూపదీపనైవేద్యాదిక్రియలు చేయుట. ఇట్లే దేవునిసేవయందే కాలము గడపుచుండెను. "ఆరామక్ష్మాఖననక్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణస్తోమాస్నిగ్ధకరుం భవద్భవనదాసున్" అని చెప్పకొనెను.

ఇట్లుండ నాపాండ్యదేశపురాజు గొప్పశివభక్తుఁడుగానుండి తనముఖ్యపట్టణ మగుమధురాపురమునఁ గొండొకరాత్రి భోగినీగృహమునకుఁ బోవుచు మార్గమధ్యమున నొక బ్రాహ్మణగేహమున

“...... నెలల్ చతుష్టయిని వృష్టిదినాళికి రాత్రికై దివం
బున జరకై వయస్సునను, బూని పరంబున కిప్పు డుద్యమం
బనువుగఁజేయఁగావలయు..........................”

అనుమాటలను వినెను. తత్క్షణమే చింతాపరుఁడై గిఱ్ఱునమరలి నగరికేతెంచి మఱునాఁ డుదయమునఁ గొలువుదీర్చి సభకేతెంచిన పండితులను “మీమీశాస్త్రములలో నెవ్వరు మోక్షం బెలయించునో చూచి నిశ్చయింపుఁడనికోరి యట్టిమోక్షమార్గమును జూపఁగలిగినవానికిఁ బారితోషికముగా నిచ్చుటకు వరాలసంచి నచటనే వ్రేలాడఁగట్టెను అటుపైని వారందఱు నొకరితో నొకరు వాదములు చేయ మొదలిడిరి. శివుఁడు మోక్షప్రదాత యని కొందఱును, ఇంద్రుఁడని కొందఱును, అగ్ని యని కొందఱును-ఇట్లు వాదములాడిరి. మధురలో నిట్లు సభ జరుగుచుండఁగా శ్రీవిల్లుపుత్తూరులో వటపత్రశాయిస్వామి విష్ణుచిత్తునికి సాక్షాత్కరించి “వెంటనే మధురకుఁ బోయి రాజసభలో జరుగుచున్న వాదములోఁ బాల్గొని వారి నందఱిని నోడించి విష్ణువుయొక్క యాధిక్యత స్థాపింపు” మని కోరెను. ఆమాటలకు విష్ణుచిత్తుఁడు వెఱగంది తాను జదువులేని మూర్ఖుఁడ ననియు స్వామివారి కైంకర్యమునకుఁ దక్క మఱియెందునకుఁ బనికిరాననియు విన్నవించుకొనెను. కాని స్వామివారభయహస్తముఁజూపి ధైర్యముఁ జెప్పి వెంటనే వెళ్లుమనిరి.

విష్ణుచిత్తుఁడు శీఘ్రముగా సభకుఁ బోయి వాదమందుఁ గలిసి భగవత్సహాయమునఁ దక్కినవారి నెల్ల నోడించి విష్ణుమతమును స్థాపించెను. ఆసందర్భమున ఖాండిక్యకేశిధ్వజసంవాదమును గూడఁ జెప్పి విష్ణుభక్తులకుఁ బరమార్థసాధనమును దెలిపెను. అంతటఁ బాండ్యరాజు సంతసించి రూకలమూట విష్ణుచిత్తుని కిచ్చి యితరబహుమానముల ననేకములఁజేసి తాను వైష్ణవమతమును స్వీకరించి విష్ణుచిత్తుని బ్రహ్మరథము నెక్కించి శ్రీవిల్లుపుత్తూరునకు సపరివారముగ సాగనంపెను.

ఇట్లు శ్రీమహావిష్ణువు తనభక్తుఁ డగువిష్ణుచిత్తునిద్వారా తన కఖండవిజయము గలుగఁజేసికొని తనహృదయేశ్వరి యగులక్ష్మీదేవితో సరసముగ సల్లా

పించుచు దనభక్తులలో నీవిష్ణుచిత్తుఁడును యామునాచార్యుఁడును నగ్రగణ్యులని నుడివెను. యామునాచార్యునిఁగూర్చి తెలిసికొనుట కామెకుఁ గుతూహలము గలుగ నాతనిచరిత్ర మంతయు వెన్నుఁ డామెకు నివేదించెను.

ఇట్లుండ విష్ణుచిత్తుఁ డొకనాఁడు తనపురమందలి యొకయుద్యానవనమునఁ దిరుగుచుండఁగా నాతని కొక యాఁడశిశువు కానిపించెను. ఆశిశువును దీసికొనివచ్చి యనపత్యురాలయిన తనభార్యకు భగవత్ప్రసాదముగ నొప్పగించెను. ఆసాధ్వీమణి చాల ముదమంది బాలికను దనకూఁతురుగాఁ బెంచుచు వచ్చెను. ఇట్లు దినదినప్రవర్ధమాన యగుబాలిక యౌవనవతియై విష్ణుమూర్తియందు బద్ధానురాగయై యాభగవంతునిచర్యలను గూర్చినపాటలను గీర్తనలను వినుచుఁ బాడుచు లక్ష్మీకల్యాణములను జూచి సంతసించుచుఁ దానావిష్ణునిఁ బరిణయము చేసికొనెడి భాగ్య మెన్నఁడైనను గలుగునాయని యువ్విళ్లూరుచు విరాళిఁ గుందుచుండెను. తండ్రి విష్ణుచిత్తుఁడు ప్రతిదినము కూర్చుచుండిన పూలమాలికను దానొక్కసారి మెడలో ధరించి నూతినీటను దన ప్రతిబింబముఁ జూచి యానందించుచు వచ్చెను. విష్ణుచిత్తుఁ డీమాలికను ధరించుచున్న దని యెఱుఁగకయే దానితో స్వామి నలంకరించుచుండెను.

ఇట్లు విరహవేదనలఁ గుందుచున్న కుమారికస్థితినిఁ జూచి యేమియుఁ దోఁపక విష్ణుచిత్తుఁ డామెయవస్థ స్వామికి విన్నవించుకొనెను. అప్పుడు స్వామివారు "నీకొమార్తె ధాత్రీదేవి. భగవంతుఁ డగుకేశవుని వివాహమాడుటకు విరహము నొందుచున్నది. కావున నామెను శ్రీరంగమందున్న రంగనాథస్వామిసముఖమునకుఁ గొనిపొమ్ము'' అని సెలవిచ్చిరి. ఆసమయమున మాలదాసరి బ్రహ్మరాక్షసులకథ విష్ణుచిత్తునికి స్వామివారు దెల్పిరి.

స్వామియాజ్ఞానుసారముగఁ గూఁతుని వెంటఁబెట్టుకొని, విష్ణుచిత్తుఁడు శ్రీరంగమునకు వెడలి స్వామివారియాలయములోఁ దానును గొమార్తయగు గోదాదేవియు రంగనాథునికిఁ గైంకర్యములు సేయుచుండిరి. ఇట్లుండ స్వామివా రనుగ్రహించి గోదాదేవినిఁ బాణిగ్రహణము చేసికొనుట కంగీకరించిరి.

అప్పుడు విష్ణుచిత్తుఁడు కొమార్తతోఁ గూడ శ్రీవిల్లుపుత్తూరు వచ్చి వివాహమునకుఁ దరలివచ్చిన స్వామివారికిని బృందారకబృందములకుఁ దగునమ్మానములు గావించి విశేషవైభవముతో వైవాహికమహోత్సవము జరిపి తన కూఁతు శ్రీరంగనాథుని కర్పించెను.

గ్రంథనిర్మాణము:—సూక్ష్మదృష్టినిఁ బరిశీలించినయెడల, నాంధ్రప్రబంధములలో నెల్ల నీప్రబంధమందలి నిర్మాణ మత్యద్భుతము- విజాతీయము. ఈ నిర్మాణ విలక్షణభావము, ముఖ్యముగా శిల్పమునందును శైలియందుఁ గాన్పించుచున్నది. శైలీ శిల్పవిషయములలో నీప్రబంధమునందుఁ గాన్పించెడు వింతలక్షణము లేతెలుఁగుగ్రంథమందు నుండు నని తోఁపదు. ఇటువంటి గొప్పకావ్య మొకమహాచక్రవర్తి రచించుట యెంత యద్భుతమో దీనియందలి శిల్పమును శైలియు నంతవిలక్షణముగానే యున్నవి. ఈశైలీశిల్పములు సరియైనదృష్టితో మనము గ్రహింపనియెడల నీగ్రంథమందలి నిజస్వభావమును మనము తెలిసికొనలేకపోవుటయే గాక కర్తృత్వవిషయములోఁ గూడఁ బొరపడుట తటస్థించును. కావున నీ గ్రంథమందలి శైలీశిల్పవిచారణ యన్నిటికంటె నెక్కువముఖ్యమైనది.

ఈప్రబంధమందలిశైలీశిల్పము లేలాగున నున్నవి? వీనిస్వభావ మెట్టిది? వీనిలక్షణము లెట్టివి? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పుట యతికష్టసాధ్యమైన పని. ఇతరప్రబంధములతీరు వేఱు. ఈగ్రంథముతీరు వేఱు.

మనయాంధ్రదేశమందలి పశ్చిమభాగమున నున్నదత్తమండలములలోఁ గాని నైజామురాజ్యములోఁ గాని యెన్నఁడైనను దిరిగి యాదేశమందలి ప్రకృతిలక్ష్మి ధరించినయాకృతిలక్షణములఁ దిలకించితివా? ఆదేశమున నున్న కొండలకును మనప్రాంతమున నున్నకొండలకు నెట్టిభేదము, ఎట్టివ్యత్యాసము కానిపించుచున్నదో కనిపెట్టితివా? మనము లోఁతుగా నాలోచించినయెడల నట్టిభేదము, నట్టివ్యత్యాసమే యీప్రబంధమునకు నితరాంధ్రప్రబంధములకు నున్నట్లు భావింపవచ్చును.

ఆదేశపుకొండ లెట్లున్నవి? పెద్దబండరాళ్లు, గొప్పవృక్షములు, చిన్న పొదరిండ్లు, స్వల్పముగా స్రవించు నీటిబుగ్గలు, గఱిక మొదలైనను లేని చట్రాతిబయళ్లు, వానియందుఁ గానిపించుచున్నవి. ప్రకృతిలక్ష్మి యట్లెంతో నానావర్ణసంకీర్ణయై కొంతసుకుమారముగాను కొంతయుగ్రముగాను, దర్శనీయముగాను, భయావహముగాను బరిఢవిల్లియున్నది. గండశిల లున్నతావులఁ జెట్లు లేవు. చెట్లున్నచోట శిలలు లేవు. చెట్లెంతపొడవులో శిలలు నంతేపొడవులు. చల్లనినీటిచెమ్మ చిమ్ముచున్న తావులఁ బచ్చనిగడ్డి పట్టికలు; నటుపైనఁ గనుచూపుమేర మలమలమాఁడుచున్న రాతిబయళ్ళు! ఈవిధముగా వేఱువేఱువిధ

ము లగునై సర్గికలక్షణములు ప్రత్యక్ష మగుచున్నవి. చల్లగ నేత్రానందముఁ జిమ్మెడు తరులతానికుంజపుంజములకును, గొడ్డువడి మొఱకువాఱిన భీషణపాషాణనివహంబులకు సంబంధము లేదు. సమన్వయము లేదు. నయనశుభ మగు స్నిగ్ధత్వము, సుకుమారత, పటుత్వము, నానారూపసమ్మేళనమువలనఁ గలిగిన సౌందర్యము గానరాదు. ఆయారూపము లన్నియుఁ గలయిక లేక వేఱుపడి వైకల్యభావమును బుట్టించును గాని సంయోగముఁ బొంది యేకత్వదృష్టిఁ గలిగించుట లేదు. ఈస్థితియే యీ ప్రబంధమందలి శైలీశిల్పములలోఁ గానుపించుచున్నది.

ఈ ప్రబంధమందునిర్మాణచాతుర్య మంతగఁ గనఁబడదు. తిలతండుల న్యాయము. గుణములు దోషములు విస్ఫుటముగను వేఱువేఱుగను బొడిచి కొని యున్నవి. దీర్ఘమునకుఁ దీర్ఘము! ప్రసాదమునకుఁ బ్రసాదము! అవయవ నిర్మాణములో సౌష్ఠవసౌభాగ్యము మృగ్యము; సమన్వయసౌందర్య మదృశ్యము.

ఈపృథగ్భావ మన్నివిషయములయందుఁ గానుపించుచున్నది. రసము, భావము, అలంకారము, కథాసంవిధానము, భాషాప్రయోగము, ఇత్యాది యన్నివిషయములందును విరోధలక్షణములకు సమీకరణము కలుగ లేదు.

అలంకారమును గుఱించి ప్రథమమున విచారింతము. చక్కనిస్వభావోక్తు లెన్నియో హృదయాహ్లాదకరముగ నచ్చటచ్చట నలరారుచున్నవి. వాని మిసిమితనమును, బరువమును, గ్రొవ్విరినెత్తావిపోలుపును, దలంపునకుఁ దెచ్చుచున్నవి. ఈస్వభావోక్తులను జూచి యొకవిమర్శకశ్రేష్ఠుఁ డిట్లు వక్కాణించియున్నాఁడు. "తిక్కన, శ్రీనాథుఁడు, సూరనార్యుఁడు మొదలగు కతిపయ కవిశిరోమణులు సకలజనమనోహ్లాదకరములైన స్వభావోక్త్యలంకృతసూక్తులనుమెండుగ వ్రాసియున్నారు. ఈకవికూడ నట్టివాఁడే."(మేడేపల్లి వేంకటరమణాచార్యులు.)

ఇది యంతయుఁ జాల బాగుగానే యున్నది. కాని, యీరెండవదృశ్యముఁ జూడుఁడు! అలెక్కకు మిక్కుటమైన దిక్కుమాలిన యుత్ప్రేక్షాతండములఁ జూడుఁడు. ఆయుత్ప్రేక్షలలోఁ గొన్నింటియందుఁ దక్క సామాన్యముగా నొకహద్దు, ఒకసందర్భము, ఒకయందము, నేమైన నున్నవేమో చూడుఁడు! ఏవస్తువైనను మఱేవస్తువునైనను బోల్చి యుత్ప్రేక్షించుటయే! బోడితలకు మోఁకాలికి ముడివెట్టుట! కోడిగ్రుడ్డునకుఁ గొండచిలువకుఁ బోలిక! బదరీబాదరాయణసంబంధములు! వడగండ్లు, సుమారు పదిరకములుగ నుత్ప్రేక్షింపఁ

బడినవి. పులిసినపెరుఁగుముక్కలు, బాల్యదంతములు, వడిసెలయుండలు, ముత్యములు, అమృతబిందువులు, తామరతూఁడులు, ఇత్యాదులు.

2. ఆరుద్రపురుగులనుగూర్చి సుమారయిదాఱువిధములగు నుత్ప్రేక్ష వర్ణన లల్లఁబడియున్నవి:—ఎఱ్ఱనికుచ్చులు, అగ్నికణములు, ఇంద్రధనుస్సు కరఁగినముక్కలు, అంగారకగ్రహముయొక్కపిల్లలు, ఇత్యాదులు.

స్వభావోక్తులను జూచి సంతసించుటయా, యీవెఱ్ఱితలలు వేసిన యుత్ప్రేక్షలనుజూచి విసువుఁజెందుటయా.

ఇఁక భాషావిషయముఁ జూడుఁడు. పూగుత్తులతో నిండారు నిద్దంపు టెలదీఁగలఁబోలు మృదువులై సరసములైన పద్యము లొకతావునఁ, గంటకములవలె మనస్సు చివుక్కుమన గ్రుచ్చుకొను మాఱుమూలకఠినశబ్దములు కలిగిన కర్కశపద్యము లొకతావున—మృదుమధురఫణితిఁ జూచి సంతసమా! శ్రుతికటువులై క్లిష్టపదజటిలమైన రచనఁజూచి విచారమా!

కథాసంవిధానమునఁ గూడ నిట్టివిరోధస్థితియే యున్నది. ఇతివృత్తకథనమందలి కూర్పు, నేర్పు, చిక్కఁదనము, ఔచిత్యము, ప్రయోజనమును జూడుఁడు! వర్ణనములందలి నిరంకుశవిహారములు నిష్ప్రయోజనకల్పనములును జూడుఁడు! మూలకథను బెంచుచుఁ జేర్చిన యితరాఖ్యాయికల యప్రసక్తత, అనావశ్యకతఁ జూడుఁడు. ఋత్వాదిదీర్ఘవర్ణనలు, కథాసరణియం దధికాంతరాయములు గలిగించుట యనుదోషము గాక యీయాఖ్యాయికల యదృచ్ఛాసంబంధమువలనఁ గలిగిన యతుకులబొంతబ్రతుకనఁదగు రెండవదోషముఁ జూడుఁడు. మహావిష్ణువు తనమనోవల్లభ యగుకమలాలయకు నర్మగోష్ఠిని యామునాచార్యచరిత్రముఁ జెప్పఁ బ్రసాదించిరి. కావున భూతభవిష్యద్వర్తమానముల కతీతుఁ డగుభగవంతుఁడు భవిష్యత్పురుషుఁ డగుయామునాచార్యులవారి చరిత్రముఁ బూర్వపుగాథగా వర్ణించినారు. భగవంతునికి దేశకాలపరిచ్ఛిన్నభావము లేదు, గాన మనము, ఔచిత్యానౌచిత్యవిచారము చేయఁగూడదు కాఁబోలు. మఱియు నీసర్వస్వతంత్రుఁ డగుభగవంతుఁడు తన భక్తాగ్రేసరునకు మాలదాసరిభక్తిప్రభావమును జెప్ప నుద్యోగించెను. కావున స్వామివారి నుడువు లచ్చట నవశ్యకములా? యనావశ్యకములా? యను ప్రశ్న కెడము లేదు. మన మందఱము విని తీరవలెను. ఇట్లు సర్వేశ్వరునియంశకణసంభూతుఁడును, భూలోకప్రతినిధియు నైనకృష్ణదేవరాయలునుగూడ శ్రీమహా

విష్ణువవలె స్వచ్ఛందవర్తనుఁడై వాఙ్మయనియమముల కతీతుఁడై యథేచ్ఛా విహారముగా నీకథను గల్పించెను! కాని సామాన్యకావ్యశిల్పసూత్రముల నియమము లిందుఁ గానరావు.

కథాభాగములన్ననో చక్కని యుద్యానవనపంక్తులవలె నిండుసోయగమున నిర్మలానందము నొదవుచుండ, వర్ణనభాగము లంతములేని యరణ్యములవలెఁ బోవంబోవ నలఁటమాత్రమే కలిగించుచున్నవి.

ఈవిధముగఁ గథాసంవిధానమందు విరోధభావమే కాని సంయోగము సమన్వయము, సౌష్ఠవము కానఁబడవు.

ఇవ్విధమైన విపరీతస్థితికిఁ గారణములు రెండు మూఁడు గానోపు నని నాకుఁ దోఁచెడిని. (1) శ్రీకృష్ణదేవరాయలు నైజప్రకృతిచేఁ గవియైనను గావ్యపరిశ్రమయే ప్రధానవృత్తిగాఁ జేకొనిన వాఁడుగాఁడు. గ్రంథరచన యతనికి రాజకార్యవ్యాకులతనుండి యలవోక నిచ్చిన విశ్రాంతిపని. కావునఁ గవిత్వమునకుఁ గావలసినపరికరములు పరిమాణములు సంప్రదాయములు మున్నగునవి దీర్ఘచింతనచేతను దదేకదీక్షచేతను సంతరించికొని, యుపయోగించుకొను నవకాశము నలవాటును లేక యుండెను. కావునఁ గావ్యనిర్మాణమందలి యవయవసమష్టి, సౌష్ఠవము, లాతనియంతర్బుద్ధికి గోచరించియుండకపోవచ్చును. సమన్వయశక్తి కేవలము ప్రజ్ఞాఫలమే గాక పరిశ్రమఫలము కూడను. (2) కృష్ణరాయ లేతత్కృతికావ్యమునందు మహాకవులు రచించిన ప్రబంధములను మేలుబంతిగా నిడికొని నిర్మింపఁబూనుకొనియుండెను. పెద్దన తనమనుచరిత్ర మాఱాశ్వాసముల గ్రంథముగాఁ బెంచెను. ముక్కుతిమ్మన్న తన పారిజాతాపహరణము నైదాశ్వాసములుగలదిగాఁ జేయఁగలిగెను. వీరిద్దఱును దనయాస్థానమం దున్నకవులలో ముఖ్యులు. వీరిచేఁతలకుఁ దాఁ జేయుపని వెలితి పొందఁగూడదు. కావునఁ దన గ్రంథ మైదాశ్వాసములకుఁ దగ్గఁగూడదని యోచించియుండును. కాని తనయాస్థానమందున్న మాదయ్యగారిమల్లన్న రాజశేఖరవిలాసమును మూఁడాశ్వాసముల గ్రంథముగా రచించెను. ధూర్జటి కవి కాళహస్తిమాహాత్మ్యము నాలుగాశ్వాసములలో ముగించెను. వీరి సంకుచితమార్గమును ద్రోక్కక పైఁజెప్పిన పెద్దనాదికవులదారినిఁ బోవనుద్యోగించి తనగ్రంథమును మూఁడునాలుగాశ్వాసములు గాక అయిదాశ్వాసములకుఁ దక్కువగాకుండనుండవలె నని సంకల్పించుకొనెను. మనుచరిత్ర నాఱాశ్వాస

ముల గ్రంధముగా వ్రాసినను గావలసినంతమూలకధ యున్నది. కాన సేగి లేక పోయెను. పారిజాతపుకవి వాగ్దేవికి వరతనూజుఁడు గాలిఁ బ్రోవుఁజేసి మెప్పింపఁ గలమేధావి. వీరితో సమానమగునుద్దిగ రచింపఁబూనుకొన్నకవికిఁ బెద్దన్నవలెఁ గధమైనను వలసినంత యుండవలెను; లేక తిమ్మన్నవలెఁ బట్టిన దంతయు బంగారముఁ జేయఁగల కవితాపరుసవేది యైన నుండవలెను. ఈరెండునులేని కవితల్లజుఁడు తన యాశయమును నవకాశమును బట్టి సర్దుకొనఁగలిగియుండిన బాగుండెడిది. అట్లు సర్దుకొనలేక పోవుటయే కృష్ణరాయలు చేసినగొప్పపొరపాటు. న్యాయముగా "ఆముక్తమాల్యద" మూఁడాశ్వాసములగ్రంధముగరచించినచో నెంతరమణీయముగా నుండెడిదో చెప్పనలవి గాదు. రాజశేఖరవిలాసము, కాళహస్తిమాహాత్మ్యము, నాసికేతోపాఖ్యానము—ఇత్యాదిగ్రంధముల కెంతమాత్ర మీడుతీయకపోవును. అట్టిస్థితిలోఁ జక్రవర్తికవి యనవసర మగు నత్యాశకుఁ బోయి తీరుతెలియని శిల్పివలెఁ దనశ్రమ యంతయు వృథాచేసికొనెను. తన ప్రబంధము నైదాఱాశ్వాసములవఱకుఁ బొడిగించుట కొఱకే గాని మఱియొక యవశ్యప్రయోజనము లేకయే ఖాండిక్యకేశిధ్వజసంవాదము, యామునాచార్యచరిత్రము, ఇత్యాదులు చొప్పింపఁబడినవి యని నాయాశయము. (3) ఇంకొకకారణముఁగూడ నేనూహించుచున్నాను. ఆనాఁటికావ్యములన్నియుఁ బండితసభలలోఁ బ్రామాణికముగఁ బరిష్కృతములైన పిదపఁ బ్రకటితము లగుచుండెడివి. నందిమల్లన ఘంటసింగన తమప్రబోధచంద్రోదయములోఁ జెప్పినట్లు—

క. "పొరిఁబొరి నొప్పసలాకల, నొరసిన కుందనపుఁబూదియును బోలె సభా
　　సరసుల సంఘర్షణమున, వరకవికావ్యంబు మిగుల వన్నెకు నెక్కున్."

అనిన ప్రకార మాంధ్రగ్రంధములను బండితులును గవులును విమర్శించి చర్చించి యంగీకరించినపిదపఁ గాని కృతిభర్త లాకృతుల నంగీకరింపరైరి. మఱియు ముక్కుతిమ్మన్న తనపారిజాతహరణములో

క. "ప్రతివర్ష వసంతోత్సవ, కుతుకాగతసుకవినికరగుంభితకావ్య
　　స్మృతిరోమాంచవిశంకిత, చతురాంతఃపురవధూప్రసాదనరసికా"

అని శ్రీకృష్ణదేవరాయలను గొండాడెను. కావునఁ గృష్ణదేవరాయలు తనపూర్వులవలెనే వసంతోత్సవకాలమున గ్రంధములను బండితసభలో విని చర్చించి బహూకరించుచు వచ్చెను. కాని యట్టివిమర్శనావకాశమీ యాముక్త

మాల్యదకుఁ గలుగ లేదని నాయభిప్రాయము. చక్రవర్తి రచించిన ప్రబంధమును విమర్శించుట కెవ్వరికి సాధ్యమగును? సార్వభౌముఁడు చెప్పిన దంతయు వెన్న యే! అందఱును దలయూఁపవలసినదే! కావున నీగ్రంథమందలి దోషములను సూచింప సాహస మెవ్వరికినిఁ గలుగ లేదు. అట్టిదురవస్థ యేతద్గ్రంథమునకుఁ దటస్థించిన దని నాయూహ. ఏలయన నాకాలమందలి ప్రబంధములలో దేని యందైన నింతవిపరీతముగా విరోధభావములు సమన్వయమొందకుండ నుండ లేదు. ఇంత యెక్కువగా నిర్మాణదోషములు దీనియందుమాత్రమే కానఁబడు చున్నవి. కాఁబట్టి వే॥ వేంకటరాయశాస్త్రులువారు చెప్పినమాటలు "వాఙ్మయమున కెల్ల ముఖ్యముగా నాంధ్రవాఙ్మయమున కెల్ల నెల్లయై యుండున ట్లీగ్రంథము రచించినార"నుమాటలను నేనంతగా విశ్వసింపను. దీనికంటె నెక్కువ సమన్వయపుష్టి గలిగినప్రబంధము లాకాలముననె కాన్పించుచున్నవి. మనుచరిత్రము, పారిజాతాపహరణము, వసుచరిత్రము, ప్రభావతీప్రద్యుమ్నము, మున్నగు ప్రబంధరాజము లీయాముక్తమాల్యద కన్న శైలీశిల్పవిషయములలో మిన్న లని నాయభిప్రాయము.

(సశేషము)

రస్తు.

పరమాత్మనేనమః.

# వ. సు. రాయనివిజ్ఞప్తి.

శ్రీమద్రాజమహేంద్రసజ్జనమనఃక్షేత్రంబులందుం గవి
గ్రామణ్యాదరబీజరోపముఁ గృపం గావించి, సౌవర్ణభూ
షాముఖ్యంబులు తద్బహూకృతివిశేషంబుల్ ఫలింపించు నా
నామర్త్యాదికభూతజాతబహిరంతర్యామి కే మ్రొక్కెదన్. 1

మ. కవిధీశా! వ. సు. నాటకంబును, జగత్కర్తా! శుభాంతంబు స
ల్పవె యంచే మును* చాటుపద్యమున నిన్ బ్రార్థింప, నావాకు నీ
చెవి సోఁకెన్, దొరఁకొం టిటుల్ బహుమతుల్ చేయింప, రెండేండ్లు త
క్కువగా నెన్బది యౌవయస్సునను నాకున్ ; భక్తచింతామణీ. 2

క. శ్రీకాంతుఁడు వ.సు. రాయబహూకరణసమాజమును, దదుద్యమలతకున్
ప్రాఁకగు సుశ్రీకుల, సభ, నాకల్పప్రాయకవిముఖాంగముఁ బ్రోచున్. 3

ఉ. రాజమహేంద్రపౌరగణరత్నము న్యాపతి సుబ్బరావుజీ
మాజలదుర్గయాఢ్యుఁడును, మద్గురుమూర్తి నృసింహముఖ్యులున్
యోజన చేసి యీఁ, గొనితి "సూక్తిసుధానిధి" యంకనంబు, వి
భ్రాజితహేమకంకణము, రాంకవయుగ్మము నేఁ గృతజ్ఞతన్. 4

చ. నలువదియైదువర్షములు నావయ సౌజ్జనమందుఁ జెల్లుటన్,
నలుఁగడ వేనవేల్ గలరు నాలుగువర్ణములన్ మదీయశి
ష్యులు గురుభక్తియుక్తులు; మహోన్నతమంత్రిపదస్థుఁ డత్తెగం,
దలఁచె నొకప్డు కంకణము నా; కది చేకుఱె నిప్డు డీక్రియన్. 5

ఉ. పౌరు లుదారు లీకటకభారము వార్ధకమందు నాకయిం
పేరిమిఁ బెట్టినారు; తమప్రేమమె కాని మదీయశక్తి దా

---

*చ. కడచిననాళ్ళఁ బైఁ బడిన కష్టములం దలపోయ నిప్డు నా
యొడల గగుర్పడంకుఁ జెమ రుప్పతిలుం; బెడగొండలట్టిపె
క్కిడుమలకుం దొలంచి యెటు లీస్థితి నిల్పితో; యంచు నబ్బురం
పడుదు; శుభాంతముం జలుపుమా వ.సు. నాటకమున్ జగత్పతీ.

మారయ; రెండుమీఁద నుఱ వౌబిరు, దాపయి నున్నిపట్టముల్;
దీరమి నిన్ని యీసభను దెంపునఁ బూనుదు లేనిసత్తువన్. 6

క. ఎడమకరముబొట్ట్రవేల్, కడుబాధాధరము నాకుఁ గలిగించు సదా;
కడియపుబరు వక్కడ ని, ప్పుడు; ములుములువోలె నిద్దిపుచ్చునొ దానిన్.

క. కుడికరమ! పయిఁడికడియము, నెడమకయికిఁ దొడిగిరనుచు నీరసపడకే;
కడిమియు గరిమయుఁ బుట్టునఁ, బడయుభవాదృశులకేల బంగరుబిరుదుల్?

మ. పరమేశుండు దయాళుఁ డేకగణి నన్ బ్రోచె, సూక్త్యాదులా
సరణిం బ్రోచిన, మెచ్చి, యందుకయి, భాషాసేవకుం డంచు నా
కురుసత్కారము రాజమహేంద్రపురముఖ్యుల్ సల్పి; రీకార్య మా
గురువర్యున్ గుణధుర్యుఁ జెందు ధ్రువ; మన్నాం చేను హర్షించెదన్. 9

తే. కంకణగ్రహణంబుఁ ద్యాగంబు హాజ, మగురువ. సు. ర్యాగ్రమ్మున; కందొకండె
యిందిపుడుగాంచు బుధులెంతు రేమొ నేతి, బీఱకాయయటంచు నా పేరు నేఁడు.

మ. గురుమూర్త్యాదిమదిష్టశిష్యులకుఁ, దెల్గుంభీష్మముఖ్యాంధ్రసో
దరసంఘంబునకున్, జిరంబుగ మనస్స్వాంబైననామీఁది యా
దరమున్ మొన్నటిమజ్వరామయజసంతాపంబు సుబ్బించె; నం
బరకీర్ణం బగునీటియావిరి ధరన్ వర్షించు ఘర్మంబునన్. 11

ఆ. శ్రావణమున నాదు జనకపాదులతిథి, నాఁడు నాకు వేఁకి; గీడాకపుం
మేలు గూర్చు; బిరుదు, సాలులు, సౌవర్ణ, కంకణముఘటించె లంకణములు 12

చ. మునుపె బుధాదరైకగుణభూషణ వేమురివిశ్వనాథశ
ర్మ నుడివెఁ గంకణాదిబహుమానములన్ నను గారవింపఁ దా
మనుకొనుచుంట; కొంతవఱ కయ్యె మనోరథసిద్ధి యిప్పు; డ
చ్చున నిఁక సంపుటత్రయిగఁ జూడఁబడన్ వలె నన్ని మత్కృతుల్. 13

చ. పటుమతి సభ్యుఁ డీచెఱకువాడకులుండు పరోపకారి వేం
కటపదపూర్వరామయ, ప్రగల్భుఁడు మత్ప్రియశిష్యుఁడుం గదా!
కటకకలాపకల్పనముఖక్రియలన్ గురుకార్యదర్శి కి
ప్పటిగురుకార్యసిద్ధిఁ గుడిబాహు వటండ్రది తత్స్వధర్మమే. 14

చ. కృతి నయదర్పణంబు రచియించితిఁ గృష్ణున కంకితంబుగన్,
మతి నిడి పంచతంత్రమున నాలవతంత్రము లబ్ధనాశ మన్

కత, గతభావనామసమ గద్య; మముద్రిత; షష్టిపూర్తి గా
బ్రతుకున కౌముమహోత్సవముభంగి బయల్పడెఁ జేరు నేఁటికిన్. 15

ఉ. భారతవిశ్రుతాఖ్యమును బంచమవేదము నాంధ్రభాష కా
ధారముగా రచించినస్వతంత్రులు, నన్నయ దిక్క నెఱ్ఱనల్
భూరియశశ్శరీరులు, త్రిమూర్తిసముల్, మును సుప్రమాణవా
గ్ధారఁ గవిత్రయం బని బుధస్తుతిపాత్రము లైరి మువ్వురున్. 16

ఉ. భావను రాణ్మహేంద్రమునఁ బాదము వెట్టితి; నాఁ డిటం గవుల్
వావిల వాసుదేవగురువర్యుఁ డొకండు, వివేకవర్ధనీ
ధీవరపత్రికాధిపతి దేశికవీరపలింగ మొక్కఁడుం,
గావుటచేఁ గవిత్రయముగా గణియించిరి మ మ్మిటీవలన్. 17

క. వ.సు.రాయబహూకృతిసం, ఘసదధ్యక్షుఁడు, పరార్ధఘటకుండు, శతా
యుసుఁ బడసి యాంధ్రభీష్ముఁడు, వసుమతి వాగీశుకరుణ వర్ధిలుఁగాతన్.

తే. ఆంధ్రవిశ్వవిద్యాధ్యపాధ్యక్షుఁ డఖిల
ఖండపాండిత్యవిశ్రుతాఖ్యుండు నాంధ్ర
మౌళి, సర్. స. రాధాకృష్ణమహితుఁ, డస్మ
దీయభాగ్య మేతత్సభాధీశుఁ డగుట. 19

చ. మును పిట నో. జె కూల్డ్రియు విభుండు కళాలయనేత్రుఁ డౌచు నుం
డినతఱి నీమహామహుఁడు నేఁడును నొజ్జల మందు; వీఁడ
ర్శనము తృతీయ మిప్డు; మును రైలున నొక్కపుడీసభాధినా
థున కిటుతన్ విధాత వరదుండు నిరామయతన్ జిరాయువున్. 20

తే. మూలసంఘాన కాంధ్రభీష్ముం డధీశుఁ;
డాంధ్రవిశ్వవిద్యాధ్యపాధ్యక్షుఁడు సభ;
కాంధ్రకళికి సమ్మానంపుటదనిది; బళె !
యెట్లు గురుమూర్తి గూర్చెరా యీత్రయంబు ? 21

చ. అడిగినయట్లు సల్పును శుభాంతముగా వ.సు. నాటకంబు ము
న్విడుమల ముంచియున్నఁ బరమేశ్వరుఁడంచును దోఁచునట్లు పెం
జడి యుదయాదిగాఁ గురిసి సంజకడన్ దెఱపిచ్చె నన్ను మె
ర్వడిఁగొని తెచ్చి సత్కృతులు పౌరు లిడన్ బురమందిరంబునన్. 22

మ. సమ నాంగీరస నాశ్వినప్రథమపక్షప్రాప్త మహాసౌమ్యవా
రముతోఁ గూడుత్రయోదశిన్, బుధకవివ్రాతస్ఫురత్ప్రసా
ధమునన్ రాజమహేంద్రమందు సభ రాధాకృష్ణసత్సన్నిధిన్
సమకూడెన్ వ.సు.రాట్కవీశునకు సన్మానం బనూనంబుగన్. 23

మ. తెలుఁగుంబాసకుఁ బోషకుం డిటనె యాదిన్ రాజరాజేంద్రుఁ; డ
వ్వల మన్నేశుఁడు; వీరభద్రధరణీపాలుండు దర్వాత; వి
ద్యలభోజుం డగురాయ లౌల; నిపుడో, యాధారు లేతత్సభా
స్థలరత్నాభరణాయమానులు జమీన్దారుల్ మహోదారులున్. 24

ఉ. రాజమహేంద్రపట్టణవరంబు పురాతన మాంధ్రభూమి; వా
ణీజగదంబ లేకమతి నృత్యము సల్పెడురంగధాము; మిం
దే జయభూతి; కోడలికి నెక్కుడుగౌరవ మత్తకంటె ని
చ్చోఁ; జిరసంప్రదాయ మిది సుస్థిర మయ్యెడు మెప్పు డిప్పుడున్. 25

వడ్డాది సుబ్బారాయుఁడు.

# అభివందనము.

—వడ్డాది సీతారామాంజనేయులుగారు, ఖాసింకోట-

శ్రీదేవి, లలితహాసా, పాదితవిజ్ఞానయోగవైభవసుప్రా
సాదవిహారిణి మనవ, డ్డాదికులము నోముతన్ గటాక్షశ్రీలన్. 1

మ. శ్రుతితత్త్వేచ్ఛఁ బురాణపూరుషునిఁ, దీర్ఘున్, సూర్యనారాయణున్
దతభక్తిన్ భజియించువాయుజుఁడు సీతారామపాదాబ్జసం
గతశీర్షుం డగునట్లు, నేనిపుడు త్వత్కల్యాణపాదాంబుజా
ర్పితచిత్తభ్రమరుండ నై కొలుతుఁ దండ్రీ! భద్రసంసిద్ధికై. 2

ఉ. రామయతాత ప్రోదియమరన్ విభవాతిశయమ్మునొంది బల్
నీమముతో సరస్వతిని నిత్యముఁ గొల్చుచు మీరుఁగొన్నయు
ద్దామసుధాభిరామకవితారమ తా మనవంశవర్ధన
శ్రీ మెఱయించి మిత్రుల కశేషశుభప్రతిపాది గావుతన్! 3

చ. అమృతరసప్రసారవచనాదృతిమై సుమనోమనోవినో
దము రచియించి యాంధ్రకవితాహృదయేశ్వరులైన విజ్ఞులన్
మిము నతిభక్తి నాంధ్రజగమే భజియింపుచునుండె నన్ను మీ
కొమరుఁడ నైన నేనెపుడుఁ గొల్చుటవాకొననేల వేఱుగన్? 4

గీ. మామనఃపీఠములయందు మీమనోజ్ఞ, పుస్తకసరస్వతిని నిల్పి పూజఁజేసి
తత్ప్రసాదమునొంది, సార్థకతఁగాంచి, యలరుదుముసుబ్బరాయబాబయ్యగారు!

క. నామావశిష్ట మయ్యెను, రామయబుధపుత్రతిమ్మరాజకవికృతుల్;
స్వామీ! నింపిరి పృథుకీర్త్యామోదము దెసల మీర లన్వయ మలరన్.

సీ. నన్నయార్యునకుఁ బ్రసన్నులైన త్రిమూర్తు లేతెంచి మీలో వసించిరేమొ
తిక్కనమఖి కేలనెక్కొని మించుబంగరుగంటమే మీకు దొరకెనేమొ
పోతనామాత్య విశ్వాతీతకవితామృతరసంబు నే మీరు ద్రావి రేమొ
పింగళి సూరకవిప్రవరుండె మీయాకారసంపత్తి నలరునేమొ
కాక గోదావరీదేవి కమలవిలసి, తార్ఘ్యపాద్యమ్ము లిచ్చి మిమ్మనవరతముఁ
బూజల నలర్చునే? రాజరాజనగర, మింత యభ్యుదయమ్మున నెసఁగునొక్కొ!

క. పొందఁగఁదరమే? కవితా, బృందారకభూజనికట మేరికిఁ; దచ్ఛా
యం దరిసితి; ధన్యుఁడ; నివె, వందనములు సుబ్బరాయ బాబయగారూ!

క ఆతతవడ్డాదికులా, బ్జాతవనీరవికి భీమశంకరకవికిన్
మీతమ్మునకున్ దనయుఁడ, సీతారామాంజనేయచిహ్నాంచితుఁడన్.

# వసురాయసన్మాననవరత్నములు.

చంద్రాభట్ల రామమూర్తిగారు- రాజమహేంద్రవరము.

క. వడ్డాది సుబ్బరాయని, దొడ్డకవనమునకుఁ బారితోషికమిడఁ జే
ర్వడ్డజను లీపురంబున, సడ్డను సభ జరుపు టెంతొ సంతసముగదా!

క. వసురాయజీవకవితకుఁ, బసదన మిచ్చుట ప్రజాస్వభావము, గంగా
రసమాని దానిఁ బొగడని, రసనగలాఁ డెవ్వఁ డీధరాతలమందున్.

క. తెలిచానకలిమిచెలువలు, కలసిమెలసి నీగృహంబుకడ నర్తనముల్
సలుపుదురు; భవద్భాగ్యము, సులభముగా దన్యులకు; వ. సు. ఖ్యాతకవీ!

ఉ. శత్రువు లేరు లే, రరయ సంతతముం గడు ప్రేమగూరు స
న్మిత్రులె గాని; విద్దియుల నిర్మలగోష్ఠియె గాని, యన్యమే
మాత్రము లేదు నీకడను, మాదృశు, లో వసురాయ! వృద్ధులే
ఛాత్రులుగా మెలంగుదురు; చాఁగురె! త్వత్కృతపుణ్యమెట్టిదో?

ఉ. చిన్నయసూరివ్యాకృతివిశేషముల వసురాయ! నే భవ
త్సన్నిధి నేర్చినాఁడఁ గద; శాంతివినీతిసుబోధనక్రియల్
నిన్ను వరించియుండుటను, నిచ్చలు వత్తురు పెద్దవారలుం
జిన్నలుఁ బుస్తకంబులను జేకొని నేర్వఁగ నీదుపజ్జకున్.

గీ. ఆంధ్రసారస్వతపరిషదార్యు లిడిరి, వెనుకఁ గవిశేఖరుండను బిరుదు, విజయ
నగరి; వసురాయ! రాణ్మహేంద్రబుధులిడిరి, మరలసూక్తిసుధానిధిబిరుదు నేఁడు.

గీ. సంతసమున రాజమహేంద్రసభ్యజనులు, స్వర్ణకంకణమున రాంకవద్వయమునఁ
జేర్చి సూక్తిసుధానిధిబిరుదున నిను, సత్కరించుట వసురాయ! శ్లాఘ్యతమము.

సీ. ఇంటింటి కూరూరి కేగి పెద్దలయొద్ద రేపుమాపును దేవు రింపకుండ,
నాత్మలాభార్థమై యన్యమాన్యులకుఁ జేకూరునర్థముఁ జెడఁ గొట్టకుండ,
నింతటివాఁడ నే నంతవాఁడ నటంచు స్వీయప్రశంసఁ జేసికొనకుండఁ,
దగుఁదగండనువివాదములు సత్కృతిసభాస్థలమందుఁ బండితుల్ సలుపకుండ,
నాంధ్రభాషామతల్లిక యాదివేద, రూపమునఁ బాదుకొన్న నిరూఢిగన్న
రాణ్మహేంద్రానఁ గనె వసురాయసుకవి, నిరుపమానసమ్మానము నేఁడు; బళిర!

గీ. ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధినాథ, పదవినున్న రాధాకృష్ణపండితుండు,
సాధువసురాయసన్మాన సభకునగ్రి, యాసనాధిపుఁడగుట భాగ్యంబు, నేఁడు.

గీ. సుప్రసిద్ధుని వడ్డాది సుబ్బరాయ, సుకవి సత్కరించుట కగు సూరిజనుల
ప్రకటనముఁ జూచి నవపద్యరత్నములివి, వ్రాసి యొసఁగెఁ జంద్రాభట్లరామమూర్తి.

# రసాభరణము.

కొమ్మనమంచి జోగయ్యశర్మగారు- -విజయనగరము.

ఆంధ్రసాహిత్యపరిషన్మహాశయు లతులితాదరణాభిమానాతిశయములతోఁ బ్రాచ్యలిఖితగ్రంథముల నచ్చొత్తించి యాంధ్రపాఠకలోకమున కర్పించుచున్న యాంధ్రగ్రంథములలో రసాభరణ మనునది యొకయాంధ్రసాహిత్యగ్రంథమై యున్నది. ఏతద్గ్రంథకర్తను గూర్చియును, గ్రంథప్రాశస్త్యాదులను గూర్చియును, టీకాకారచయిత లగు బ్రహ్మశ్రీ కోపల్లి శివకామేశ్వరరావు, విద్వాన్,గారు పీఠికలోనే తెలిపియుండుటచే నావిషయ మిచ్చట ముచ్చటించుట యసంగత మైనను, గ్రంథప్రసంగవశమునఁ దత్కర్తృప్రశంస కొలఁదిగాఁ జేసి విడుచుట న్యాయము రసాభరణకర్త, నియోగియు, కృష్ణామండలతీరనివాసియు, భోజరాజీయ, ఛందోదర్పణాదిగ్రంథప్రణేతయు, నగు ననంతామాత్యుఁడు, తనగ్రంథాంతమునఁ జెప్పికొనిన—

"జానొందన్ శకవర్షముల్ ఋతుశరజ్యాళేందులై యొప్ప నయ్యానందాబ్దమునందు"అను పద్యభాగమునుబట్టి శా. వా. శక 1356 వ, సంవత్సరమున (క్రీ. శ. 1434) నీరసాభరణమును దేవాంకితము చేసినట్లు తెలియుచున్నది. కనుక నీయనంతామాత్యుఁడు క్రీ. శ. 1434 వ సంవత్సరము ప్రాంతమువాఁడై యుండనోపు.

పూర్వము, అనఁగా, రాజరాజనరేంద్ర, కృష్ణదేవరాయ, రెడ్డినాయకులకాలములో, భక్తిపూరితము లగు పురాణములు నవరసభరితము లై మృదుమధురశైలితో నొప్పారి, బహువిధరచనాభూయిష్ఠము లగు, నాశు, చిత్ర, బంధ, గర్భ, కవిత్వములతో నిండియున్న వివిధప్రబంధములును బయలువెడలినవి. కాని, యాంధ్రమునఁ బరివర్తనముగఁ గాని, స్వతంత్రముగఁ గాని, రూపకము లెవ్వియు బయలువెడలి యుండలేదు. రమారమి నూఱు, నూటయేఁబది సంవత్సరముల కీవలనుండియే నాటకరచన యాంధ్రభాషయందు ప్రారంభ మైనది. ఆకారణముచే రూపకలక్షణగ్రంథము లెవ్వి యును నాకాలమున నాంధ్రభాషలో రచియింపఁబడి యుండలేదు. దృశ్యశ్రవ్యకావ్యోభయసామాన్యోపయోగము లగు, రసము, నాయికానాయకులు, విభావానుభావసాత్త్వికవ్యభిచారభావములు, మొదలగు వాని

లక్షణములఁ జెప్పెడు, నరసభూపాలీయము, రసాభరణాది స్వల్పగ్రంథములే సాహిత్యగ్రంథములుగాఁ గన్పట్టుచున్నవి. వీనియందు నాటకలక్షణము లెచ్చోటను జెప్పఁబడి యుండకపోవుటకుఁ దత్పూర్వము రూపకము లెవ్వియు లేకుండుటయే కారణము. వానిలోఁ గూడ నరసభూపాలీయమున గుణదోషాలంకారాది ప్రకరణములైన నున్నవి గాని, రసాభరణమున, నట్టివియుఁ గానరావు. రసము, దానిభేదములును, తత్పరిపోషణోపయోగము లగువిభావాదులును, నాయకనాయికలు వారిభేదములు, మొదలగునవి స్వల్పముగా శ్రవ్యకావ్యోపయుక్తములుగా నిరూపితము లైనట్లు గన్పట్టుచున్నది ఆంధ్రమున సాహిత్యగ్రంథములు విశేషముగా లేవని తెల్పియుంటిని. ఉన్నవానిలోఁగూడ, నరసభూపాలీయము స్వతంత్రగ్రంథము గాక, సంస్కృతములో విద్యానాథవిరచితమగు ప్రతాపరుద్రీయమునకుఁ బరివర్తిత మనియు, నందు లక్షణము లన్నియు సరిగాఁ బ్రతాపరుద్రీయమునుండి స్వీకరింపఁబడి, లక్ష్యములు మాత్రము స్వయంకృతము లనియు, నొకవ్యాసరూపమున నొకప్పుడు, బ్రహ్మశ్రీ విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రిగారు 'భారతి'లోఁ బ్రకటించినట్లు జ్ఞాపకము. ప్రస్తుతము, ఈరసాభరణము, స్వతంత్రమా? లేక నరసభూపాలీయమువలె నెద్దాని లక్షణముల నైన స్వీకరించి యాంధ్రీకృతమా? యనెడువిషయము చర్చింపవలసియున్నది. రసాభరణపీఠికలో బ్రహ్మశ్రీ విద్వాన్ కోపల్లి శివకామేశ్వరరావుగారు-"ఈగ్రంథము స్వతంత్ర మైనదో లేక యేసంస్కృతగ్రంథమున కైనఁ బరివర్తనమో తెలియదు. మాతృక కన్పించువఱకు స్వతంత్రగ్రంథమే యిది యని యనుకొనవలసియున్నది" అని తెలిపియున్నారు. కాని యియ్యది యుఁ బ్రతాపరుద్రీయమునకుఁ బరివర్తన మని తెలియఁజేయుటకే యీవ్యాసరచనకై కడంగితిని. ఆవిషయము మున్ముందుఁ జూపు ప్రమాణములఁ బట్టియు, నుభయగ్రంథస్థోదాహరణలను బట్టియుఁ దేటపడఁగలదు.

అనంతామాత్యుఁడు, తా రచింప నుద్దేశించుకొనిన రసాభరణమునకుఁ గావలసిన లక్షణములలోఁ, బ్రతాపరుద్రీయమున నున్నంతవఱకు స్వీకరించి, లాఁతిలక్షణముల నేకొలఁదినో యితరగ్రంథములనుండి స్వీకరించియున్నాఁడు. తనకవితను దేవాంకితముగాఁ జేయునుద్దేశముతో, కృష్ణుని నాయకునిగను, రుక్మిణ్యాదుల నాయికలఁగను గ్రహించి, లక్ష్యములను మాత్రము స్వతంత్రముగా రచించియున్నాఁడు. నాయకుని, (లేక నాయికను) మాత్రము మార్చి

ప్రతాపరుద్రీయస్థలక్ష్యములఁ గూడ నచ్చటచ్చట నాంధ్రీకరించియున్నాఁడు. ముందుఁ జూపఁబోవు ప్రమాణములవలనఁ బ్రతాపరుద్రీయమును ముందిడుకొని యనంతామాత్యుఁ డీరసాభరణమును రచించె నని పాఠకమహాశయులే తెలిసికొందురు.

వాగనులేపనాభరణాదిపంచవిధశృంగారము కేవల నాట్యవేదమునందే చెప్పఁబడి యున్నది. కాని సామాన్యముగా నేకొంతమందియో తప్పఁ దక్కిన యాలంకారికు లేరును దానిని జెప్పియుండలేదు. ఇతఁ డాపంచవిధశృంగారమును స్వీకరించి లక్ష్యలక్షణములను జూపినాఁడు. ఇంతియకాక శృంగారభక్తి వాత్సల్యములకు నేకకంఠ్యమును గూడఁ జెప్పియున్నాఁడు. ఇయ్యది తని కల్పన కాదు.

"రతి ర్దేవాదివిషయా వ్యభిచారీ తథాంచితో భావః ప్రోక్తః, ఆదిశబ్దా న్మునిగురునృపపుత్త్రాదివిషయా, కాన్తావిషయాతు వ్యక్తా శృంగారః" (కావ్య ప్రకాశిక, చతుర్థోల్లాసము 35 వ శ్లో.) అనువాక్యముల ననంతుఁడు:—

"రతి దా నాయకనాయికాదిపరతన్ రంజిల్లు శృంగారమై
క్షితిలో దేవగురుద్విజాదిపరతన్ చెన్నొందు సద్భక్తియై
సుతమిత్త్రాశ్రితసోదరాదిపరతన్ సొంపారు వాత్సల్యమై"

......అని రతియే యాలంబనవిభావభేదమునుబట్టి భక్తివాత్సల్యాది భావరూపముగా మాఱుచున్న దని తేటపఱిచినాఁడు. తావన్మాత్త్రముచే, భక్తివాత్సల్యములను రసములుగా ననంతుఁడు నిరూపించె నని యనుకొన వీలులేదు. అయ్యవి భావము లనియే చెప్పవలయును. కావ్యప్రకాశికకారాదులమతముగూడ నియ్యదియే. అనంతుఁడు ప్రతాపరుద్రీయమున లేని, నాయికకు స్వకీయ, పరకీయ, పణ్యాత్వాదిభేదములును ఉత్తమ, మధ్యమ, అధమ, భేదములును, వీరవచన, కోప, ప్రసన్నతలును, చాతుర్వర్ణ్యగృహిణుల స్వరూపనిరూపణమును, మొదలుగాఁ గలకొన్నిటినిమాత్త్రము, ప్రతాపరుద్రీయమునకుఁ బూర్వరచితము లగు దశరూపకాద్యాలంకారికగ్రంథములనుండి స్వీకరించి, యిందుఁ జేర్చొని యుండనోపు.

రసాభరణమున నచ్చటచ్చటఁ బద్దెములయందు దనన్వయత్వమును, నిరర్థకా సంపూర్ణార్థక, వ్యతిరేకార్థక, పదములును గనఁబడుచున్నవి. మొదట

నీరసాభరణస్థలక్షణములు, ప్రతాపరుద్రీయలక్షణముల కాంధ్రీకరణము లని నిరూపించి, యనంతర మావిషయముచర్చకుఁ గడఁగుట సమీచీనము.

ప్రతాపరుద్రీయమందలి నాయక-రసప్రకరణముల రెండింటిని మాత్రమే స్వీకరించి, యమాత్యుఁడు రసాభరణమును నాల్గాశ్వాసముల గ్రంథముగా నల్లినాఁడు. తనగ్రంథము స్వతంత్ర మైన దని పాఠకు లూహింతు రనునాశయము చేతనో, లేక తనగ్రంథరచన కనుకూలముగా మార్చి చూపవలయు ననునుద్దేశముచేతనో గాని, యనంతుఁడు ప్రతాపరుద్రీయలక్షణక్రమము నచ్చటచ్చట మార్చి, రసాభరణమున ముందువెనుకలుగాఁ జూపియున్నాఁడు. కాని భావములోను అర్థములోను, బదములకూర్పులోను, దుట్టతుదకు నన్వయక్రమములో నని గూడఁ జెప్పుట సాహసము కాదని తలంతును. ప్రతాపరుద్రీయలక్షణములకును, రసాభరణలక్షణములకును మిక్కిలి సాదృశ్యము గన్పట్టుచున్నది.

ప్రతాపరుద్రీయమునఁ దొలుదొల్త నున్న నాయకప్రకరణమును దన గ్రంథమునం దనంతుఁ డంత్యమునఁ జూపినాఁడు. అందు మధ్యనున్న రసప్రకరణస్థవిషయముల స్వీకరించి, ప్రథమాదితృతీయాంతాశ్వాసములుగాఁ జేసినాఁడు. వానిలోఁ బ్రథమాశ్వాసమున నవరసస్థాయిభావలక్ష్యలక్షణములును, సజాతీయవిజాతీయభావ-విభావానుభావములలక్షణములను జేర్కొని, యయ్యాశ్వాసమునకు సంజ్ఞాప్రకరణ మని పేరిడిన ట్లాశ్వాసాంతగద్యములోఁ దెల్పియున్నాఁడు. ద్వితీయాశ్వాసమున, శృంగారభక్తివాత్సల్యములు, భిన్నభిన్నాలంబనవిభావాశ్రిత మగురతియొక్క విపరిణామములని తెల్పి, యాలంబనోద్దీపనవిభావముల యొక్కయు, నిర్వేదాది సంచారిభావముల యొక్కయు లక్ష్యలక్షణములఁ జూపియున్నాఁడు. తృతీయాశ్వాసమున శృంగారరసవిశేషములును, అవస్థాంతరవిధములును, చక్షుఃప్రీత్యాది ద్వాదశానంగదశలును, సామాన్యముగా నాలంకారికులచేఁ బరిగ్రహింపఁబడనివియు, నాట్యవేదమునమాత్రమే చెప్పఁబడినవియు, నగుపంచవిధశృంగారములును భావోదయాది చతుష్టయ-రససంకరములును లక్ష్యలక్షణములతోఁ జూపి యున్నాఁడు. చతుర్థాశ్వాసమున, నాయక-నాయికా-తత్సఖ-సఖీ-భేదములను జూపియున్నాఁడు.

ఇఁక నీరసాభరణమందలి లక్షణములు ప్రతాపరుద్రీయలక్షణముల నాధారముగాఁ జేసికొని యనంతామాత్యునిచేఁ గూర్పఁబడిన వనుటలో నుదాహరణములఁ జూపుచున్నాను. విశేషప్రమాణము లుదాహరించినచో

గ్రంథము చాల నధికమగునను భీతిచే నొక్కొకయాశ్వాసమునకు స్థాలీపులాక న్యాయముగా నచ్చటచ్చటిలక్షణములఁ దీసి యుభయగ్రంథస్థవిషయములకును సామ్యమును గనఁబఱుచుచున్నాను

అనంతుఁడు ప్రతాపరుద్రీయలక్షణములను యథాక్రమముగ ననుసరింపక తనరచన కనుకూలముగా ననుసరించియున్నాఁడు. ప్రతాపరుద్రీయములో రస మన నేమియో ప్రశంసించి యనంతరము చూపఁబడిన స్థాయిభావములను, రసాభరణమున ననంతుఁడు ప్రథమాశ్వాసారంభముననే పేర్కొనియున్నాఁడు. సరిగా నాసంస్కృతశ్లోకమునే,

"శృంగారహాస్యకరుణా రౌద్రవీరభయానకాః
బీభత్సాద్భుతశాంతాఖ్యాః రసాః పూర్వై రుదాహృతాః"

అని యుదహరించియున్నాఁడు. తరువాత తరుణీతరుణుల యన్యోన్యాలింగనభాషణాదులు సంభోగ మనియు తదేకాయత్తచిత్తత్వమే రతి యనియు, రతిస్వరూపము నిరూపింపఁబడియున్నది. (ప్ర. రుద్రీయములో) "తత్ర సంభోగవిషయి కేచ్ఛావిశేషో రతిః" అని యున్నది. దీనికి సరిగా నిందు,

"తరుణులుఁ బురుషులు నితరే,తరసంభోగేచ్ఛ లెలమిఁ దలకొనఁగాఁ ద
త్పరమతిఁ దిరుగుట శృంగా,రరసజ్ఞులమతమునందు రతి యనఁబరఁగున్"

అని చెప్పఁబడియున్నది.

'సంభోగవిషయికేచ్ఛావిశేషమే రతి' యని కదా! ప్రతాపరుద్రీయములోఁ బేర్కొనఁబడియున్నది. ఆవాక్యమునే యిట గ్రహించి, తదభిప్రాయఘటితముగా "తరుణులుఁ బురుషులు——..." ననుపద్యమును రచించి యనంతుఁడు మఱికొన్ని పదములఁ గలిపినాఁడే కాని, యామూలమున నున్న "సంభోగేచ్ఛావిషయకో రతిః" యనువాక్యమునకు సరియగు నభిప్రాయమును దన పద్దెమునఁ జూపుట మానలేదు. తరువాత,

ఉత్సాహలక్షణము.

"లోకోత్తరకృత్యంబులఁ, గైకొని యవి యొకపకుండఁ గావించు దృఢా,
స్తోకప్రయత్నమది సుగుణాకర యుత్సాహ మనఁగ
నభినుతికెక్కున్" (రసా)

అని చెప్పఁబడియున్నది. నాయకుఁడు లోకోత్తరము లగుకార్యముల స్వీకరించి, వానిని సాధించుదాఁకఁ బట్టినపట్టు విడువక తత్ఫలసిద్ధికై యమో

ఘము లగుప్రయత్నములఁ జేయుట యుత్సాహము. అని దీనియభిప్రాయము సుగమము. దీనికి సరిగా-

"లోకోత్తరకృత్యేషు స్థేయాన్ప్రయత్నః ఉత్సాహః"

అనుప్రతాపరుద్రీయోత్సాహలక్షణము సరిపోవుచున్నది. ఛందముకొ ఆకును, బహ్యపూర్తికొఆకును "అని యొడపకుండ, సుగుణాకర" యనెడునితర పదములున్నవిగాని తక్కిన పదములు సరిగానందలివే యనియుఁ జెప్పవచ్చును.

"ఆలంబనగుణశ్చైవ తచ్చేష్టా తదలంకృతిః,
తటస్థశ్చేతి విజ్ఞేయ శ్చతుర్థో ద్దీపనక్రమః" (ప్ర. రు.)

"ఇల నుద్దీపన మనఁగా,నలి నాలంబన మన గుణం బనంగాఁ దచ్చే
ష్టలునాఁదదలంకృతియన,నలరుఁదటస్థములునాఁగనగునలుఁదెఱఁగుల్"(రసా)

ఉద్దీపనవిభావము రసమునకు నిమిత్తకారణమై యున్నది. ఆలంబనగుణ తచ్చేష్టా—తదలంకృతి—తటస్థ, భేదములచే నాయుద్దీపనవిభావము నాల్గు తెఱఁగులు. ఈయభిప్రాయము రెండుగ్రంథములయందును సామ్యమును బొందుచున్నది.

ఇట్లు, ఆలంబనోద్దీపన విభావముల యొక్కయు, నిర్వేదాద్యుద్దీపనవిభావముల యొక్కయు, స్వరూపము ను దేటపఱిచి సముద్రమునఁ దరంగములు పుట్టుచు నుప్పొంగుచు నందే తిరిగి యెట్లు లయమును బొందునో, యట్లే రత్యాదిస్థాయిభావములయందు నిర్వేదాదిభావములు జనించి మగుడ నందే విలయము నొందు నని-

"ఆదట వర్ధమానవిభవాతిశయంబున వీచులట్లు ర
త్యాదులు, వార్థుల ట్లుదయమా నడఁగుం బెఱభావపం ని
ర్వేదముఖోపభోగరుచివృద్ధిరసం బది నాట్యసంగతిఁ
మోదమెలర్ప సభ్యులమనోగతులందును భావమై చనున్" (రసా)

అనుపద్యమున, ననంతుఁడు చెప్పియున్నాఁడు. ఇట్టి యభిప్రాయము నిచ్చెడు శ్లోకము ప్ర. రుద్రీయరసప్రకరణాంతమున నున్నది. చూడుఁడు-

"భావే స్థాయిని వర్ధమానవిభవే రత్యాదికే సింధువ
త్తల్లోలా ఇవ సంభవంతి విలయం చాయాన్తి భావా ముహుః
నిర్వేదాద్యుపభోగభావితరసాస్వాదాతిరేకో రసో......(రసా)

అని, అనంతుఁడు ప్రతాపరుద్రీయలక్షణములను దనగ్రంథమున ముందు వెనుకలఁగాఁ జేర్కొనియున్నాఁ డని మొదటనే చెప్పియుంటిని. రత్యాదిస్థాయి భావములందు నిర్వేదాదిభావములుపుట్టుచు, మరల నందే విలయము నొందును, అనఁగా, కల్లోలము లెట్లు సముద్రాభిన్నములై,తత్స్వరూపములై యున్నవో యట్లే నిర్వేదాదులు గూడ, రత్యాద్యభిన్నములై యున్న వన్నమాట. ఈవిషయము ప్ర. రు లో, ప్రకరణాంతమునఁ జెప్పఁబడియున్నను, స్థాయిభావ, వ్యభిచారభావప్రసంగవశముచే ననంతుఁడు, ననుపదముననే యీవిషయమును జెప్పె ననుటలో క్షతి యేమియు నుండదు. శృంగారాదిరసస్వరూపనిరూపణముతో విరమింపక, ప్రతాపరుద్రీయమున లేకున్నను దదితరగ్రంథములనుండి స్వీకరించి రసాధిదేవతలను గూడ నమాత్యుఁడు పేర్కొనియెను.

కొందఱాలంకారికులు శాన్తమును రసముగా గ్రహింపలేదు, కొందఱు శాంత మనునది లోకములో లేనేలే దని "నాస్త్యేవ శాన్తో రసః అనాదికాలాగతరాగద్వేషయో రుచ్ఛేత్తు మశక్యత్వాత్" అని యద్దాని నిర్మూలింప నెంచిరి. ఒకకొందఱు రౌద్రాదిరసములలో నంతర్భావము చేసిరి. మఱికొందఱు శృంగారాద్యష్టరసములనే స్వీకరించి, యయ్యవి దృశ్యశ్రవ్యకావ్యోభయసామాన్యోపయోగము లనియు, శాన్తరసము గూడ నున్నది గాని యయ్యది కేవలము నభినయాదిశూన్య మగుటచే నాట్యమునం దుపయోగింప వీలులేదనియు నుడివియున్నారు. కావ్యప్రకాశకకారాదులు,అష్టరసములనే తొలుతఁ జెప్పి యనంతరము-

"నిర్వేదస్థాయిభావో శాన్తోపి నవమో రసః"

అని నుడివియున్నారు. ఈవిషయమున నేరిమతముల స్వీకరింపక విద్యానాథుఁడు "......... శాన్తాశ్చ రసాః పూర్వై రుదాహృతాః" అని యన్నిరసములతోఁ గలిపి శాన్తమును గూడ నొకరసముగానే చెప్పియున్నాఁడు. ఈశాన్తరసవిషయములో మనయనంతుఁడు గూడఁ బ్రతాపరుద్రీయమునే యనుసరించి యాకారికనే రసాభరణమందుఁ "......శాన్తాఖ్యాః రసాః పూర్వైరుదాహృతాః" అని యుదహరించినాఁడు.

శృంగారాదిరసము, అనుకార్యరామాద్యాశ్రిత మని కొందఱును, అనుకరణనటాశ్రయ మని కొందఱును, ప్రేక్షకసామాజికాశ్రయ మని కొందఱును, భిన్నభిన్నమతములఁ జూపి యున్నారు. విద్యానాథుఁ డట్లుగాక

రసము, అనుకార్యనాయకాశ్రయ మనియు, సద్భావనిని నిపుణనటాభినయాదు
లచే, లౌకికనాయికాపరిరంభణాదివాసనావాసితాంతఃకరణు లగుసామాజికు
లనుభవింతు రనియు, నటుఁడు రామాదుల ననుకరించి కృత్రిమాభినయముల
జేయువాఁ డగుటచే రసాశ్రయుఁడు గాఁ డనియు, నొకవేళ రసాశ్రయత్వ ము
న్నచో వాఁడును సామాజికులవంటివాఁడే యనియుఁ జెప్పియున్నాఁడు. ఈ
విషయము—

"అత్ర రసో నాయకాశ్రయ ఏవ, యది పరం నిపుణనటచేష్టయా
తథావిధకావ్యశ్రవణబలేన చ సామాజికైః స్వనిష్ఠాద్భావ్యతే తదా పరగత
స్యాపి రసస్య సమ్యగ్భావనయా పరత్ర నిరతిశయానందజనన మవిరుద్ధమ్,
అథవా మాలత్యాదిశబ్దేభ్యో యోషిన్మాత్రప్రతీతౌ..... స్మృత్యా రూఢేన
తత్తద్యోషిద్విశేషేణ అనుకార్యేణ సామాజికాశ్రయత్వమపి నవిరుద్ధమ్, నట
స్యానుకరణమాత్ర పరతయా నైవ రసాశ్రయయోగ్యత్వమ్, తస్య భావుకత్వా
భ్యుపగమేతు సామాజికత్వ మేవ" అను, వాక్యతతివలనఁ దేటపడఁగలదు.
రసాభరణములో ననంతుఁడు గూడ నీమతమునే—సర్వవిధముల నీవాక్యసర
ణినే యనుసరించినాఁడు గాన—

సీ. రసము నాయకసమాశ్రయమునఁ బ్రాపింప్యుఁడగు నటుచేష్టల నైనఁ దత్క
థాకర్ణనంబున నైన, సామాజిక ప్రకరానుభావమై పరఁగుచుండు
బరగతంబయ్యు, సద్భావనచే రసోదయవిశేషము విరుద్ధంబుగాదు
మఱియు మాలత్యాదిమహిళాప్రసంగంబువినుచు సభ్యులు నిజవనితలందుఁ
దలఁపునిలుపరసాశ్రయత్వంబుగలుగు, ననుకరణమాత్రమైయుండునాశ్రయంబు
గాదు, భావకత్వాదులుగలిగెనేని, వాఁడెసామాజికులయట్టివాఁడె యపుడు.

అని ప్రతాపరుద్రీయవాక్యములయభిప్రాయము నొక్కయెడనైనఁ దప్పక
యట్లే తెనుఁగుసేఁత చేసినాఁడు.

—: ద్వితీయాశ్వాసము :—

రతి యనుస్థాయిభావమే నాయకనాయికాగత మగుచో శృంగారము
గను, దేవద్విజగుర్వాదిగతమగుచో భక్తిగను, సుతమిత్రసోదరాద్యాశ్రిత మగు
చోవాత్సల్యముగను బరిణమించు నని యనంతుఁడు చెప్పియున్నాఁ డని యిది
వఱకే చూపియుంటిని. ఇయ్యది ప్రతాపరుద్రీయమున లేకుంటచేఁ గావ్యప్రకా
శికకారాదులమతము ననుసరించె ననియుఁ గూడఁ బ్రసంగించితిని. హావ-భా
వాదిశృంగారచేష్టల నుదహరించుచు,

"మానితమైన రసాభిజ్ఞానమునకు యోగ్యమగుట ననుభావంబై"

అని, రస మన నేమియో తెలిసికొనుటకు యోగ్యమగు జ్ఞానము గలిగి యుండుట భావ మని యనంతునిలక్షణము. ఇది,

"రసాభిజ్ఞానయోగ్యత్వం భావ ఇ త్యభిధీయతే''

అను ప్ర.రుద్రీయలక్షణమునకు ఛాయ. కాని యీలక్షణమున "యోగ్య మగుట ననుభావంబై" యని యున్నది. "జ్ఞానమున కయోగ్య మనుట" అని పాఠాంతరము గానవచ్చుచున్నది. ఇఁట మూలమునఁ గ్రిందగీటుపెట్టఁబడిన 'నను' అనుపద మంత యభిప్రాయదాయకమై యుండలేదు. ఇఁట "జ్ఞానమునకు యోగ్య మగుట యగు భావంబై" యనియుండి యుండవచ్చును. అట్లైన నర్థము సరిపోయి సరియగుభావము నొసఁగును.

"ఈషద్దృష్టవికారస్స్యా ద్భావో హావః ప్రకీర్త్యతే'' (ప్ర.రు.)

"దాన నొకించుకఁ గానఁగనైన వికాసంబుపేరు హావం బయ్యెన్ (రసా)

ఇఁట దిగువ నుదహరింపఁబడిన లక్షణపద్యపాదము, మీఁద నుదహరింపఁబడిన ప్రతాప రుద్రీయలక్షణపద్యవిభాగమున కాంధ్రీకరణము. ప్ర. రు. లో, "ఈ షద్దృష్టవికారః...'' అని యున్నది. భావమే యొకించుక వికారము గల్గియున్నచో హావ మగు నని యిద్దానియర్థము. దాని కాంధ్రీకరణ మగు (రసా.లో) "దాననొకించుకఁ గానఁగనైన వికాసంబు పేరు హావంబయ్యెన్" అని వికారస్థలము వికాసపదఘటితముగా నున్నది. కాని, వికార-వికాసములకు నలంతిభేదము మాత్రము లేకపోలేదు. కనుక నీస్థలమున "వికారము" అని యుండనోపును. మూలగ్రంథమునఁ గూడ నట్లే యుండవచ్చును.

"భావంబున సువ్యక్తం బై విక్రియదోఁప హేలయగు'' (రసా)

"సువ్యక్తవిక్రియో భావో హేల ఇ త్యభిధీయతే" (ప్ర.రు)

"ఆభరణాభావంబునందు నంచితభావము మాధుర్య మనఁగఁ బ్రస్తుతి
కెక్కున్" (రసా)

"అభూషణేపి రమ్యత్వం మాధుర్య మితి కథ్యతే" (ప్ర.రు)

"శీలము వదలమి ధైర్యము" (రసా)

"శీలాద్యలంఘనం నామ ధైర్యమి త్యభిధీయతే" (ప్ర.రు.)

"ప్రియునియట్లం బ్రియయుం, బోలఁగ నాగతిచేష్టలు చాలఁగ నొన
రించెనేని చను లీలయనన్ (రసా)

"ప్రియానుకరణం లీలా హాగ్భి ర్గత్యాధచేష్టితైః" (ప్ర.రు.)
విచ్ఛిత్తి యనంగాఁ బొల్పగు నా,రయసర్వాభరణములకు రమ్యం
బైనన్" (రసా)

"విచ్ఛిత్తి రతిరమ్యం స్వల్పైరపి విభూషణైః (ప్ర.రు)

ఇటఁ బూర్వోదాహృతరసాభరణస్థశృంగారచేష్టల లక్షణములు, వాని వెనువెంటనే యుదహరింపఁబడిన ప్రతాపరుద్రీయలక్షణములకు సరియైన యాంధ్రీకరణము లనుటలో సందేహ మేమైన నున్నదా? ఇచ్చట, విచ్ఛిత్తి లక్షణమును జేర్కొనుటలో 'విచ్ఛిత్తియనంగాఁ బొల్పగు నారయ సర్వాభరణములకు రమ్యంబైనన్." అని, షష్ఠ్యంతముగా జేయుటలో నర్థ మేమియు బాగుండుటలేదు. దీనికి మూలమగు (ప్ర.రు.) లోని "స్వల్పైరపివిభూషణైః" అనువాక్యములో స్వల్పపదమును తృతీయాంతత్వమును గన్పట్టుచున్నవి. ఆ లక్షణమునే పరిగ్రహించినయమాత్యుని యాంధ్రీకరణముగూడ, 'స్వల్ప'పద ఘటితముగను, తృతీయాంతముగను నుండవచ్చు నని చెప్పుటలో దోషము లేదు. సాత్త్వికభావలక్షణములఁ దెల్పుటకుఁబూర్వము సాత్త్విక మన నేమియో నిర్వచింప నుద్దిష్టుఁడై -

"పరగతసుఖదుఃఖాదిభావనయా భావితాంతఃకరణత్వం సత్వం, తతోభూ స్సాత్త్వికాః"

అనుప్ర.రుద్రీయవాక్యముల నాధారముగాఁ జేసికొని

"అపగతంబగుసుఖదుఃఖాదిభావనంజేసి భావింపంబడు నంతఃకరణత్వంబు సత్వంబు, తత్సంభవంబులై సాత్త్వికంబులు......"

అని తెలిపియున్నాఁడు. కాని యిఁట నొక్క విశేష మున్నట్లు తోఁచును. ప్రతాపరుద్రీయములో "పరగతసుఖదుఃఖాది............"అని యుండఁగా, నిందు "అపగతంబగుసుఖదుఃఖాది..." అని 'పరగత' అనుశబ్దస్థానమందు, 'అపగత' అని ప్రయోగింపఁబడియున్నది. "పరగతసుఖదుఃఖాదిభావనయా" అనఁగా నితరులఁబొందిన సుఖదుఃఖాదులను భావించుటచే ననిగదా యర్థము! సర్వవిధముల ప్ర.రుద్రీయమును, అనుసరించుచున్న యనంతుఁ డీస్వల్పవిషయములో భిన్నముగాఁ జెప్పక 'పరగత' యనియే చెప్పియుండును. శైథిల్యము నొందినమాతృకయం దీవిషయ మస్పష్టముగానుండవచ్చును.

## తృతీయాశ్వాసము.

మొదటియాశ్వాసమున నుగ్గడింపంబడిన శృంగారాదిరసములలో శృంగారమును మాత్రము గ్రహియించి,యీయాశ్వాసారంభమున దానిభేదములఁ జెప్పియున్నాఁడు. శృంగారము సంభోగ, విప్రలంభభేదములచే రెండుతెఱఁగు లనియు, నందు విప్రలంభము అభిలాష-ఈర్ష్యా-విరహ-ప్రవాసభేదములచే నాల్గువిధము లనియు, సంభోగము, ఆలింగన-భాషణ-చుంబన-ఆలోకనాదులచే ననేకవిధము లనియు,

"భువి శృంగారము రెండుచందములు, సంభోగంబు, నవ్విప్రలం
భవిధంబు, న్నతివిప్రలంభము, చతుర్భావంబులై యుండు, నె
య్యవియంటే, యభిలాష, యీర్ష్య, విరహాఖ్యానానువాసంబు లి
ట్లు వివేకింపఁ దగు న్విచక్షణులు త్రైలోక్యైకరత్నామణీ."
"ఆలోకనభాషణములు, నాలింగనచుంబనములు నాదిగ నెన్నం
జాలినబహురతితంత్ర, శ్రీలవిసంభోగనామశృంగారంబుల్"

అని, రెండుపద్యములలోఁ జెప్పియున్నాఁడు. ఈపద్యములు-
..."అథ శృంగారః, స ద్వివిధః, సంభోగో విప్రలంభశ్చేతి..."
"సంభోగస్య పరస్పరావలోకన- సంభాషణా- లింగన- చుంబనాది......
విప్రలంభః పునరభిలాషే-ర్ష్యావిరహ- ప్రవాసహేతుకత్వేన చతుర్విధః"

అను ప్రతాపరుద్రీయవాక్యములకు భాషాంతరీకరణము లని తేటతెల్లముగఁ దెలియుచున్నది.

"అభిలాషోనామ సంభోగాత్ప్రా గనురాగః" (ప్ర. రు)
"కలయకమున్న రాగ మధికం బగునే నభిలాష" (రసా)
"విరహోనామ లబ్ధసంయోగయో ర్నాయకయోః కేనచి త్కారణేన పున
స్సమాగమకాలాతిక్షేపః" (ప్ర. రు )
"ఇద్దఱుఁ, గలిసినమీఁదఁ బాయుట తగ న్విరహంబు" (రసా)
"ఈర్ష్యానామ నాయక స్యాన్యాసక్తభావా చ్చిత్తవిక్రియా" (ప్ర. రు)
"నిజేశుఁ డొండుతో,య్యలిఁగవయంగ నవ్వనిత యల్గుట యీర్ష్య"(రసా)
"యూనో ర్దేశాంతరవృత్తిత్వం ప్రవాసః" (ప్ర. రు)
"విదేశవాసులై నిలుచుటఁ దాఁ బ్రవాసము" (రసా)

ఇట్టఁ బూర్వపూర్వోదాహృతప్రతాపరుద్రీయలక్షణములయొక్క భావ

మును, వానివెనువెంటఁ జూపఁబడిన రసాభరణస్థలలక్షణములు గ్రహించియున్న వని చెప్పవచ్చును. సామాన్యముగా, నేతాదృశ లక్షణాభిప్రాయము లందఱివి సమానముగానే యుండు నని, పాఠకు లూహింతురేమో? ఛందశ్శృంఖల బంధితుఁడై సరిగ నాపదములనే యిం దిముడ్చుటకు వీలులేక మానినాఁడే గాని, సమమైన యాంధ్రీకరణ మని చెప్పటలో నసత్యము గాని సాహసము గాని చూపట్టదు.

: చతుర్థాశ్వాసము :—

ప్రతాపరుద్రీయములో విద్యానాథునిచేఁ జేర్కొనఁబడిన నాయకగుణము లగుమహాకులీనతాదుల విడనాడి, యనంతుఁడు తన గ్రంథమునఁ గేవల నాయకులు, వారిసాధారణ—శృంగారభేదములనే చూపియున్నాఁడు.

"ఉదాత్త ఉద్ధతశ్చైవ లలిత శ్శాంత ఇత్యపి
ధీరపూర్వాఇమేపూర్వైశ్చత్వారోనాయకా స్మృతాః" (ప్ర.నాయకప్రర)
"ఎలమి నుదాత్తోద్ధతులన, లలితుఁడు శాంతుండు నాఁగలరు నాయకులి
మ్ములధీరపూర్వులనువా,రలు నలువురు వీరు సర్వరససామాన్యుల్" (రసా)

ఇఁట మూలగ్రంథమునఁ గల"ధీరపూర్వా" అనుపదమునకు "ధీరపూర్వులనువారు" అని సరిగా శబ్దప్రయోగమును గూడఁ దెనిఁగించియున్నాఁడు. శృంగారనాయికలఁ జూపుసందర్భమున-

"ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికా స్మృతా" (ప్ర. రు)
"పతిచే నెప్పుడు నుపలాలిత యగు స్వాధీనపతిక" (రసా)
"చిరయ త్యధికం కాంతే విరహోత్కంఠితోన్మనాః" (ప్ర. రు)
"విరహోత్కంఠిత యనునది, వరునితడవు సైఁపలేక వగనొందు" (రసా)
"కోపా త్ప్రియం పరాణుద్య పశ్చాత్తాపసమన్వితా కలహాంతరితా"(ప్రరు)
"కలహాంతరిత పతినవమానించి పిదపఁ చిరతప్త యగున్" (రసా)
"దేశాంతరగతే కాంతే ఖిన్నాప్రోషితభర్తృకా" (ప్రరు)
"ఒకదేశమునకుఁ దనపతి యేగినఁ జిన్నవోవునది ప్రోషితభర్తృక" (రసా)

ఈ చూపఁబడినవానిలోఁ, బూర్వోదాహృతలక్షములకుఁ దరువాత నుగ్గడించిన లక్షణములు భాషాంతరీకరణము లని తెలిసికొనుటలోఁ గష్టమేమియు నవసరములే దని యూహింతును. కాని, యంత్యమగు ప్రోషితభర్తృకోదాహరణసందర్భమున, ప్ర. రు. లో. "......ఖిన్నాప్రోషితభర్తృకా" అని

యుండ, ఖిన్నయనుపదముగాని తద్భావఘటిత మగు నొండొకపదము గాని లేక, దానికి మాఱుగా రసాభరణములో ‘ ,.జిన్నవోవునది ప్రోషితభర్తృక” అని యున్నది. ఖిన్నపోవుట యనఁగాఁ జింతనుపొందుట, చిన్నపోవుట యను నది పరాభవాదులవలన సంభవించును. ప్రస్తుతము, నాయికకు, నాయక విషయకవియోగము సంభవించెను గాని, పరాభవము సంభవింపలేదు. కనుక “తననాథుఁడు దూరదేశము పోయెను, ఇంక నెంతకాలమునకు వచ్చునో!” యనెడు ఖేదము నాయిక కవసరము గాన, “చిన్నవోవునది” అనికాక “ఖిన్న వోవునది” అనియే యుండవలయును.

ఇట్లే ప్రాచ్యలిఖితపుస్తకములలో నక్షరము లస్పష్టముగా నుండుటచే, వాని నేదోవిధమున సంస్కరించి ముద్రాపకు లచ్చొత్తించి, ప్రకటించినతరువాత నాగ్రంథముల నున్న కొన్నికొన్నిపదముల కర్థములు, నిఘంటువులలోఁ గూడఁ గనఁబడక, సందర్భమును బట్టి పాఠకు లనేకార్థములఁ గల్పించుకొని, యథార్థములగు నర్థములను విడనాడి యెంతయో చికాకులు పడుచుండుట యెందఱికో యనుభవమై యున్నది. అట్టిచికాకు లీరసాభరణమున నెన్నియో గలవు. ఉదాహరణముగాఁ గొన్నిఁటిని జూపుచున్నాను.

ప్రథమాశ్వాసములో బీభత్సరసోదాహరణసందర్భమున-

దురమున నందికేశ్వరుఁడు దుర్దముఁడై నుఱుపంగ రాక్షసో
త్కరవరగాత్రముల్ మెదిగి కాళ్లును జేతులు నుత్తమాంగముల్
బరులును వీఁపులుఁ బిఱుసుఁబ్రక్కలుఁ రూపర స్రగ్గిరొంటెమైఁ
బురపురమ్రింగుచుఁ గదురు భుగ్గున నామటనున్న వారికిఁ.” (రసా)

ఈపద్య మనన్వితముగాఁ గన్పట్టుచున్నది. ఇందు, కర్త యేది ? రాక్ష సోత్కరవరగాత్రములా ? అయినచో, పిక్కలు మొద లగునవి రూపర స్రగ్గిన వియు రొంటెమైఁ బురపుర మ్రింగినవియు, రాక్షసోత్కరవరగాత్రములేనా ? గాత్రము లనఁగా శరీరములనిగదా యర్థము! శరీరములు రొంటెమైఁ బురపుర మ్రింగుటయేమి ? పోనిందు, కామేశ్వరరావుగారు పీఠికలో “బీభత్సరసోదా హరణపద్యమునఁ బ్రకాశకు లాదరించిన పాఠమున కెట్లర్థము చెప్పవలయునో నాకు బోధపడుటలేదు.” అని వ్రాసి యున్నారు. ఈసందర్భమున నాయనకుఁ గూడ విసుఁగు గలిగినట్లు తోఁచుచున్నది. కాని, యీమాటవ్రాసి, తరువాత

ద్రా యుదహరింపఁబడిన పాఠభేదము నంగీకరించిన నేరైనఁ నర్థ

గా లేదనఁగలరా? యని నాకుసందేహము" అనినుడివియున్నారు. 'రొంటెమై' ననుపద్యస్థపదమునకు 'రొంటిమై' ననియు "మ్రింగుచుఁ" అనుపదమునకు "పొంగుచుఁ" అనియుఁ బాఠాంతరములు గానవచ్చుచున్నవి. అప్పుడుమాత్ర మొకవిధముగా, రాక్షసవరగాత్రములు, ప్రక్కలు మొదలగునవి రూపరస్రగ్గ రొంటెమైఁ బొంగుచు నామగంధమును విడుచుచున్న వని యర్థమును జేయవచ్చును. ద్వితీయాశ్వాసములో ఋతువుల నుదహరించుచు-

"వివ్వలి ఘనమంచు వెన్నునితోఁదీఁగె చప్పరంబునఁ బ్రొద్దు జరుపఁగలరు" అనుచో నిచ్చటి వివ్వలి శబ్దమున కర్థమేమి? మఱియు స్తంభోదాహరణసందర్భమున 'ఒడ్డారపుఁబట్టి కడు న్వొడ్డరియగుశౌరిఁజూచి' యనునపుడిచ్చటి 'ఒడ్డారపుఁబట్టి' యనఁగా నే మని యర్థము, చెప్పవలయును? ఇట్లే పరిశీలించినచో లేఖనప్రమాదములు, నాలేఖనములుసరిగా నుండకపోవుటచే ముద్రాపకులు చూపిన ముద్రణప్రమాదములు, నిటీవల నచ్చగుచున్న ప్రాచ్యలిఖితగ్రంధములయం దెన్నియో గలవు. ఇయ్యది పాఠకుల కనుభవములోనున్న విషయమే యని యూహింతును—

ఇప్పటికే యీవ్యాసము చాల గ్రంధము పెరిఁగినది. ఇందలి లక్షణము లన్నియుఁ బ్రతాపరుద్రీయస్థలక్షణములయొక్క ఛాయానుసరణము లనియు, దనకుఁ గావలసినవియుఁ బ్రతాపరుద్రీయమున లేనివియు నగు కొన్నింటిమాత్ర మితరగ్రంధములనుండి యనంతుఁడు స్వీకరించినాఁ డనియు, నంతియ కాని యియ్యది స్వతంత్రగ్రంథము గా దనియుఁ, దెలియఁజేయుచుఁ,దద్విషయనిర్ధారణకై, ప్రతాపరుద్రీయ లక్ష్యానుకరణములు రసాభరణమున నచ్చటచ్చటఁ గానవగుచున్న వనువిషయమునకుఁ బ్రమాణములఁ జూపి యింతతో విరమించుచున్నాను.

చింత కుదాహరణము:—

"సన్నిహితమపి గురుజనం నచ ప్రేక్షతే పృష్టాపి నాలపతి
ఏషాపి మార్గతి గతిం హృదయస్య ప్రియానుబన్ధస్య" (ప్ర. రు)
"గురుజనములు చేరినఁ జె,చ్చెరఁజూడదు, పలుక దెంతచీరిన నభ్యం
తరయుతుఁ డగుపురుషోత్తము, కరుణవడయుపనికినతివగతియూహించుఁ"

మోహోదాహరణము:—

"కథమపి గమయిత్వా వాసరం దీర్ఘదీర్ఘం విరచితనవవేషా ప్రేషయిత్వా

ధమాతిః, చిరయతి హృదయేశే ప్రాంశుభి శ్చంద్రపాదై రభిహతసకలాం
గీ మూర్ఛితా కోమలాంగీ" (ప్ర. రు.)

"ప్రకటమనోభవాతపనిరంతరదీర్ఘదినంబు లెట్టకే
లకుఁ గడతేర్చి, దూతిఁ దగులాగునఁ బిల్వఁగఁబంచి యొక్కగో
పిక యభిరామవేషమునఁ బ్రీతినలంకృతిచేసి కృష్ణుఁడిం
చుకవడి రాకయున్న యెడ సోమకరావళిఁ దాఁకి మూర్ఛిలున్." (రసా)

ధృత్యుదాహరణము:—

"వీరరుద్రనృపతౌ హృదయ! త్వ ద్వల్లభే త్రిభువనైకధురీణే
సాధు! సాధు! కృతకృత్యమసి త్వం మన్యసే జగదశేషమసారం" (ప్ర. రు)

"నీవల్లభుఁడరయఁగల, క్ష్మీవల్లభుఁ డమ్మఁ మేలు మేలు లతాంగీ!
నీవుకృతకృత్యురాలవు, పోవీక్షించెద వసారముగ జగమెల్లన్" (రసా)

హర్షోదాహరణము:—

"యత్పూర్వం సరసీషు పద్మముకుళవ్యాజాత్తపస్సంచితం
వక్షోజౌ యువయో స్తదద్యఫలితం జాతౌ కృతార్థౌ యువాం
దత్తా కాకతివల్లభేన భవతో రేషా స్వవక్షఃస్థలీ
కస్తూరీద్విగుణీభవత్పరిమళా కల్హారమాలాయతః" (ప్ర. రు.)

"సరసులఁ బద్మకుట్మలమిషంబునఁ జేసినతొంటిమీఁతప
శ్చరణఫలంబ యిప్పుడు కుచద్వయమా? యివె పూనె మన్ననో
హరుఁ డగు కృష్ణుఁ డిచ్చిన నిరంతరకల్పలతాప్రసూనసుం
దరవనమాలికామృగమదద్విగుణీకృతగంధబంధురన్." (రసా)

సాధారణముగాఁ గవులు తమకుఁ బ్రత్యక్షముగా మనోహరము లగు భావములు గన్పడుచున్నయపుడు, ఆభావముల విడనాడి, యితరము లగుభావములఁ గల్పించుకొనలేరు. అట్లే యనంతుఁడు గూడ లక్షణములను మాత్రమే ప్రతాపరుద్రీయమునుండి గ్రహింపవలయు నని యెంచి, చాలవఱకు నట్లేయొనర్చి, లక్ష్యములను స్వతంత్రముగాఁజూపినను, గొన్నికొన్నిమధురము లగు— భావమును మరలింపనీయని— భావములు కన్నుల కెదురుగాఁ గనుపించుటచే నచ్చటచ్చట లక్ష్యములనుగూడ స్వీకరించి, యాంధ్రీకరించినాఁ డనుటలో మీఁద నుదహరింపఁబడిన పద్యః ప్రబల్ర-  ఁగుచున్నవని భావింతును.

పాఠకులకొక విజ్ఞాపన:—అచ్చటచ్చటఁజూపఁబడిన యుభయగ్రన్థస్థల క్షణభాగసామ్యోదాహరణ సందర్భమున రసాభరణలక్షణములలోఁ గొన్ని కొన్నిపదములు సరియగు నభిప్రాయము నీయలే దనియు, దీనికి మూలగ్రంథ మగు ప్రతాపరుద్రీయమునందలి లక్షణములఁబట్టి యాయాభాగములు సవరిం చుకొనవలసియుండు ననియు, నట్టిపదములే రసాభరణమాతృకయందుఁగూడ నుండవచ్చుననియు, ప్రాచ్యలిఖితగ్రంథమగుటచే నక్షరములపోల్కి సరిగానుండ కపోవుటచే ముద్రాపకులు సవరించి యిట్లచ్చొత్తించియుందు రనియు వ్రాసి నిర్బాధకము లగు కొన్నిసవరణలఁగూడ మూలగ్రంథము ననుసరించి చూపి యుంటిని. ఇట్టి సర్దుబాట్లు చేయనిదే, రసాభరణమందలి లక్షణములు ప్రతా పరుద్రీయలక్షణములకు సరిపోక యిట్లు "అవకతవకగా" వ్రాఁతలు వ్రాసినాఁ డని మాత్రము పాఠకులు శంకింప నవకాశము లేదని మనవి. ఒకవేళ నట్టిస వరణలఁ జేయనిపక్షమునఁ గూడ, నీలక్షణములు ప్ర. రుద్రీయలక్షణములఁ బోలియుండుటలో సందేహములేదని పాఠకులుమాత్ర మూహింపకుందురా ! అట్లు సరియగుసవరణలు చేయవలసినభాగములు, ఏకొన్నిలక్షణములయందో గన్పట్టుచున్నవి గాని, గ్రంథమంతయు సవరణ చేయవలసిన యవసరము లేదు గదా ! సర్వవిధములను, రసాభరణము ప్రతాపరుద్రీయము ననుసరించియు న్నట్లు మనకుఁ గోచరించుచున్నపుడు, కొన్నిటియందుమాత్రము, యథాయో గ్యాభిప్రాయానభివ్యంజకము లగుపదము లున్నవిగాన వానిని మూలగ్రంథము ననుసరించి సవరణచేసినను, క్షతి యేమియు లేదని యేతద్గ్రంథపరిచితులకుఁ దెలియకుండునా ? వారుమాత్రము యోగ్యమగు నాకార్యమున కొడంబడ కుందురా ?

చారుతరవ్యాసరచనాభ్యాసపాటవములేని నాయీవ్రాఁతయం దెచ్చ టనైన, వాక్యసరణి, యర్థమందుఁగాని యన్వయమందుఁ గాని, సరియగునభి ప్రాయ మీయఁజాలకున్నను, అనంతుఁడు తనగ్రంథరచనకుఁ గావలసిన లక్ష ణముల నన్నింటిని ప్రతాపరుద్రీయమునుండి స్వీకరించి యచ్చటచ్చట మనోహా రము లగు లక్ష్యములను గూడ ననుకరించి, యితరములకు నేకొన్నిలక్షణము లనో మఱికొన్నిసంస్కృతసాహిత్యగ్రంథములనుండి సంగ్రహించి రసాభరణ మును జేసినాఁడే గాని, యీగ్రంథ మీతనిస్వంతకల్పన గాదని, యీనావ్యా సమునకు ముఖ్యాభిప్రాయముగా గ్రహించి, యద్విధమగు దోషము లున్నను మన్నింతురుగాక!

ఉ. వంచిన, వాఁడు చేరి జనపాలక యీమొగసాలఁ గాచి న
క్తంచరవైరి యన్యులకుఁ గానఁగరాక వసించు, నట్టిరా
త్రించరనాయకుండు నినుఁ దెమ్మని పుచ్చిన నేకలంబనై
వంచనఁ దెచ్చి యిన్ని దురవస్థలఁ బెట్టితిఁ దప్పునైఁపుమీ. ౬౪

ఉ. దానవనాథుఁ జూచితి సదాతనమౌ రససిద్ధిఁ గంటి వో
మానవనాథ నాపని క్రమంబున నీహిత మయ్యె నంచు స
న్మానముతోడఁ గొల్చి బిలమార్గము సూపఁగ వచ్చి వెల్వడ
న్వాని నతండు వీడ్కొలిపి వార్వము నెక్కె నుదాత్తచిత్తుఁ డై. ౬౫

చ. మగిడి మహామృగౌఘము సమానుమభూములు నిర్ఝరంబులు
న్నగములుఁ గంటకద్రుమవనంబులు దాఁటుచు వచ్చి యాత్మభృ
త్యగణము రోయుచుఁ జనపదంబును గానక కానలోన నా
మృగయునిఁ గాంచి యొయ్యన సమీపముఁ జేరఁగ వాఁడు మెచ్చుచుఁ.

క. మనుజేంద్ర నీవు క్రోడము, వెనువెంటం జనిన నిన్ను వెదక బలంబుల్
గనుకని చనియె న్ననోక, యనువునఁ దురగంబు జాడయరసెద నిచటన్.

క. కంటిఁ బని చెల్లె ననుచుం, గంటకములుఁ గండ్లు దప్పఁగాఁ దోడ్కొని రా
జొంటిపడకుండమృగయుఁడు, బంటుతనము మెఱసియొక్క బయలికిఁ దెచ్చెన్.

గీ. అచటనృపుఁడుసిల్చియుసహాయశూరుండఁ, దోడువలదుహయముఁదోలువాఁ
డ। నీవు గూడ లేవు సిలువు నీవని చెల్లె, ననుచు వేఁటకాని నాదరించి. ౬౯

క. రసఘుటికలుగట్టిన మృదు,వసనంబులు వారువంబు వాలుం దక్కం
బసదనము రత్నపథకా,ది సమస్తవిభూషణములు దిగ్గన నిచ్చెన్. ౭౦

వ. ఇట్లిచ్చి యనిపి తదనంతరంబున జోడన యు, జంగనడక యుఁ, దురికినడ
యు రవగాలునడయుం గల వారువము నదలించి వాగె వదలి రాగసంజ్ఞం
గదలించి త్రోలిన. ౭౧

క. వలకుం జలెడె లాదిం, గలత్రొక్కులకరణి నెగయఁగా నశ్వము ని
శ్చలగతి నాదిత్యునిహయ,ములనుం దనకాలిధూళి బోవంబాఱెన్. ౭౨

వ. తదనంతరంబ ఫేనిలరక్తకరకాననం బై ఖలీనచర్వణంబగు గంధర్వంబు నాఁగి
నాగంబుల సమలునాగాంతకుపై నున్న ముకుందునిచందంబునఁ గంద
మున్పళించుచుఁ గలంకదీర్చునప్పుడు. ౭౩

మ. ధరణీనిర్జరుఁ డొక్కఁ డాత్మసుతుఁడుం దానుం బుభుక్షాజరా
పరితాపంబున మేను దూలి పడఁగాఁ బ్రాణంబు లుద్వేగముం
బొరయంగాఁ జనుదెంచి మూఁడుదినము లొప్పైయె న్నిరాహారతా
పరిఖిన్నాత్ముల మేము నేఁడు దయతోఁ బాలింపవే నావుడున్. ౭౪

గీ. అన్న మిచటఁ బట్టెఁడైనను దొరకదు, తనియనిత్తు నన్న ధనము లేదు
మేనితొడవులెల్ల మృగయుని కిచ్చితి, నిప్పు డిద్దఱికిని నేమి యిత్తు. ౭౫

క. ఆతురుఁడు దానపాత్రము, చేతం గలయదియె దానసిద్ధి యగుట ధా
త్రీతలపతి దలఁచి కృపా, న్వితుండై యొక్క ఘుటిక నిచ్చెద ననుచున్. ౭౬

వ. రెండు ఘుటికలు రెండుచేతుల నిడుకొని రసమిది సర్వలోహకాంచనీకర
ణంబు రసాయనం బిది జరామృత్యుహరణంబు వీనిలో నొకటి మీ రిద్ద
ఱుం బుచ్చుకొనుం డనినం దండ్రి జరాజీర్ణుం డగుటం జేసి (రసాయనం బి
మ్మనిన.) ౭౭

గీ. ఇతనిమాట పొసఁగ దెల్లలోహంబుల, నూనిసంతఁ బసిఁడిగా నొనర్చు
రసమె యిమ్ము నాకు రాజనయ్యెదనన్నఁ, దండ్రి వచ్చి కొడుకుఁదలఁగఁద్రోచె.

వ. ఇట్లు పరస్పరభిన్నమనోరథం బగు దుర్వాదంబున శిఖ లూడ దోవతులు
వదలఁ దమఛాందసోక్తుల నేన ము న్నాశ్రయించినవాఁడ నింక నీ వడుగకు
మనుచుం ద్రోపుత్రోపులాడంగ నెడసొచ్చి. ౭౮

క. ఇటు మీలోపల నూరక, చిటిపొటి వల దైన మీకుఁ జిత్తప్రియసం
ఘటనము సేసెద నని రస, ఘుటికలు నృపుఁ డిద్దఱకును గొంకక యిచ్చెన్.

శా. ఇష్టార్థప్రతిపాదనన్ ద్విజులఁ దా నీరీతి సత్యంతసం
తుష్టస్వాంతులఁ జేసి వీడుకొని ప్రత్యుద్యోతమా సేన సం
దష్టంబై నలుదిక్కులం గొలువఁగాఁ దానేకసిద్ధక్రియా
హృష్టాత్ముం డగుచు న్మహీవరపరుం డేతెంచె నుజ్జేనికిన్. ౮౧

ఉ. వింటివె భోజరాజ పలుమాటలఁ బూనియు వానిఁ బోలఁ దే
వంటిఁ బ్రయత్నము ల్సలపడంటి విచారము లుజ్జగించి నీ
కింటికిఁ బోవు టొప్పు నన నిట్టి గుణశ్రవణోత్సవంబునం
గంటకితాంగుఁడై యతఁడు క్రమ్మఱ నేగె గృహాంతసీమకున్. ౮౨

వ. తదనంతరంబ కొన్ని దివసంబులరిగిన నిరువదియగువాకిట నెక్కంబూనుకొని.

— ఇరువదియవబొమ్మకథ —

క. నాగారిగమనమిత్రుని, నాగాననజనకు ననఘు నాగాభరణున్
నాగాసురహరుని సువర్ణాగధనుర్ధరుని సందనాగవిహారిన్. ౧౪

ఉ. నిష్ఠఁ దలంచి సర్వధరణీసురసమ్మత మైన వేళ భూ
యిష్ఠము లైన వాద్యము లనేకవిధంబుల మ్రోయ న్నాసన
శ్రేష్ఠము పొంతఁ జేరఁగఁ బసిండి నొనర్చిన బొమ్మ న్యాయవా
జ్నిష్ఠురవృత్తి దోఁపఁ బలికెం బృథివీపతి నడ్డపెట్టుచున్. ౧౫

ఉ. పొందొకయుం దెలుంగక ప్రభుత్వము సూపెద వష్టభోగసం
క్రందనుఁ డౌ నవంతిపతి కైవడి నీగియుఁ దెంపు లేక యె
క్కందర మాని నీవు నినుఁ గానవు గాక తలంచి చూడఁగా
నందని మ్రానిపండులకు నఱ్ఱులు సాఁచుట గాదె భూవరా. ౧౬

ఉ. ఆతనివర్తనంబు దెలియన్వినుకోరికి వచ్చినాఁడ వౌ
నీతలఁ పిప్పుగంటి ధరణీశ్వర చెప్పెద నాఁటదాన నా
చాతురి లెక్కకెక్కదు ప్రసాదముపెంపున నాదరింపు సం
ప్రీతి యొనర్చుదాన నిఁక మిన్నక మాటలు వేయునేటికిన్. ౧౭

గీ. అయ్యవంతినాథుఁ డష్టదిక్కులఁ గీర్తి, నిక్క నచటనచట నేర్పు మెఱసి
యాఱునెలలు రాజ్య మర్ధవర్షము ప్రవా,సంబు నియతిగాఁగ జరపుచుండు.

మ. దిననాథప్రతిమానరూపుఁ డెలమిన్ దేశాంతరాసక్తిమైఁ
జని యాశ్చర్యకరంబుగాఁ బురములన్ శైలంబులు న్వాఁగులు
న్వనమధ్యంబులుఁ జూచుచుం దిరిగి దివ్యస్ఫూర్తిఁ బద్మాలయం
బన సార్థం బగుపట్టణంబు గనియెన్ హర్షంబు రెట్టింపఁగన్. ౧౯

చ. అట చని పణ్యవీథిఁ గలయం బరికించుచు నొక్కచోట ను
త్కటశశిదీధితిప్రకరధౌతము లైన గతి న్విశంకట
స్ఫటికమయంబు లైనగృహపంక్తులలోపల హేమరత్నసం
ఘటనమునం దనర్చు గుడిఁ గన్గొని దగ్గఱ నేఁగున య్యెడన్. ౨౦

ఉ. అర్కుఁడు గ్రుంకెఁ జీఁకటి దిగంతముల న్నిగిడెం బ్రియాంగసం
పర్కము లేని మానినులమానముదూల మరుండు మిక్కిలిం
గర్కశుఁడై చెలంగె నిలఁ గల్వలచెల్వము చూచి వానితోఁ
దర్కము పెట్టఁబూనినవిధంబున నెక్కున నిక్కెఁ జుక్కలున్. ౨౧

క. ఆసమయంబునఁబతి సం, ధ్యానుచితవిధులు దీర్చి యాగుడిలోఁ గై
లాసనివాసునిఁ గోరి సు, ఖాసీనుండైన నలువు రటఁ దమలోనన్. ౯౨

సీ. మనము నేర్పున నిన్నిదినములు భూలోక మంతయుఁ దిరుగుట వ్యర్థమయ్యె
సిద్ధయోగీంద్ర, ప్రసిద్ధచారిత్రునిఁ గాలవంచకునిఁ ద్రికాలనాథుఁ
జూడలేకైతిమి చూడంగఁ గన్నులు గలిగియు నిచట నిష్ఫలములయ్యెఁ
బ్రాలేయగిరిప్రాంతఁ బన్నగాటవి నాతఁ డున్నతతపమున నున్నవాఁడు
తెరువులహితములానీనము ప్తరములనుచుఁ, బోవశైలితిమని తలపోసికొనఁగ
విని మనంబున నతనిదర్శనముఁగోరి, రాజశేఖరుఁ డచట నారాత్రి గడపి.

క. అరుణుం డుదయింపఁగ స, త్వరగతి నుత్తరము గదలి తఱచైనమహా
తరులును గిరులును దాఁటుచుఁ, దెరు వెడలకనడిచికొన్నిదివసంబులకున్.

క. దుర్వారశరభగండక, దర్వీకరసింహదంతిదంష్ట్రులనెలవై
శర్వాణిజనకుఁ డగు నా, పర్వతపతిప్రాంతఁ జేరె భయరహితుం డై. ౯౫

మ. హిమవత్ప్రాంతము చేరి శీతళము లౌసీరంబులు న్నిర్ఝరం
యమిసద్మంబులు దేవదారుమయ దివ్యశ్రీకుటీరంబులున్
భ్రమరానందమరందబిందువిలసత్పద్మాకరశ్రేణులుం
గుముదప్రోజ్జ్వలకుంజకుంజరమహాకుంజంబులం జూచుచున్. ౯౬

క. చల్లనికొండ నయంబున, నల్లన కింపయినయట్టి యాభరణగణం
బెల్ల నమకూర్చి దాఁచిన, యిల్లనఁ దగు సర్పవనము నెదురం గనియెన్.

సీ. కన్నులమిణుఁగురుల్ గ్రమ్మంగ గ్రొక్కుచు బుస్సనుచో వేఁడిపొగలునిగుడఁ
బ్రల్లదంబున మస్లె నల్లనాగులు నాగపెంజెరలును బెంటిపెంజెరలును
శంఖపాలకులును జాతినాగులు నుగ్గఁబెంజెరలును నెట్టఁబెంజెరలును
కూఁకవేటులుఁ జిన్నగులియలుఁ ద్రాఁచులుఁ బెరజులుగుట్టపుఁబెరజులచటఁ
గలవు తక్కినజెట్టిపోతులునుదుంప, నాగులునుగొంటిగాఁడులునరియకొక్కు
లేనవాలముజెడుగులు? నిరుమొగముల, పాములును బెక్కుతద్వనభూమినుండు.

క. ఇవ్విధమున ఘోరంబగు, నవ్విపినాంతంబు సొచ్చి యరుగఁగఁ బాముల్
క్రొవ్వున నెగ్రాగుచు నాతని, నెవ్వెంటలఁ దామెయగుచు* నెగురుచుఁ బట్టెన్.

గీ. పట్టి వరుణనాగపాశంబులట్లు మైఁ, జుట్టుకొనిన నతఁడు పట్టువడక
యట్టివేళ జలగ లంటినకరి వోలె, దిట్టతనము మెఱసి తిరుగఁ డయ్యె.

---

* నెగడుచుఁ,

వ. అట్లు దిరుగక యుగభూషణుండు నుండు బోలె మృత్యుంజయుండ నిశ్చలుండై
ముందఱం జని. ౧౦౧

సీ. పులితోలు కచ్చడంబుగ మొలం గాసించి సర్వాంగములను భస్మంబుపూసి
శిరమునం గెంజెడ వెరవార బిగియించి విమలాక్షమాల హస్తమునం దాల్చి
యాసనశక్తికి నాధార మగుయోగదండంబుపైం బాహుశికలము సేర్చి
పట్లుగ్గిన యోగపట్టె పూనిన మేను స్వస్తికాసనమునం జక్క నిలిపి
కంధరము వంచి నాసికాగ్రమునదృష్టి, గదియం గదలకముక్కన్ను గానరాని
శూలిపోలిక నున్న త్రికాలనాథుం, జూచిసాష్టాంగమొరంగె నాక్షోణివరుండు.

వ. ఇట్లు సాష్టాంగదండంబు గావించిన. ౧౦౩

క. అప్పరమయోగి యోగం, బప్పుడు వారించి లేచి యాతనిం గరుణం
దప్పక చూచిన మేనం, గప్పినసర్పములు విడిచి కనుకనిం బఱచెన్. ౧౦౪

శా. దృష్టిం బాములం గ్రోలి యాతండు ధరిత్రీనాథు మన్నించి సం
తుష్టుండై పలికెన్ జనోత్తమ జగద్దుర్వారదర్వీకరా
శ్లిష్టప్రాంతరమౌ మహాటవి మది నైక్షింప కీమంచులో
నిష్టోద్యోగముపూని వచ్చితివి నీయీ డెవ్వరిం జెప్పుమన్. ౧౦౫

గీ. ధరణిలోనం బాముతలగాము లుండునం, ద్రొక్కిపాములు మెయిం జుట్టుకొనంగ
నీవు శంకలేక నేనున్నచోటికి, వచ్చినాండ వెద్ది వాంఛితంబు. ౧౦౬

క. వినిపింపుము సురలకునై, నను బడయంగరాని ప్రార్థనలు నీకిత్తున్
ఘనుండని చేరినచోం గై, కొని యతనికి నొక్కమేలు గూర్పం దగదే.

మ. అనిన న్సంతసమంది సాంజలిపుటుండై విక్రమాదిత్యుం డి
ట్లనియె న్నిర్ధయతీంద్ర విష్ణుక్రియ నిత్యానందవారాశిం జొ
క్కినచిత్తంబున నాత్మయోగవశముక్తిశ్రీసమేతుండ వై
యనువేలంబుగం దేలియాడు నిను డాయంగంటి నేం జాలదే. ౧౦౮

క. నినుం జూచినయవి కన్నులు, నినుం బొగడినయదియ జిహ్వ నీగుణగణము
ల్వినినయవి చెవులు నీకుం, బనిచేసినయవియ పాణిపద్మము లనఘా. ౧౦౯

శా. నిత్యానందపదప్రతీతచరితా నీదర్శనం బైనచోం
బ్రత్యక్షంబుగ మేననున్న ఫణభృద్బృందంబు లిట్లాడె న
ప్రత్యక్షంబుగం గర్మబంధములు నీభంగి న్వెసం బాసె నా
దిత్యోగ్రద్యుతి పర్వినం న్నిల్చునే. ౧౧౦

చ. కమలవనైకమిత్రుని ప్రకాశ మొకించుక పర్వ సూర్యకాం
తమునకు దీప్తు లిచ్చినవిధంబున నీకరుణార్ద్రదృష్టి సం
యమివర నాపయిం బొలసినంతనె పాపమువాసి యెల్ల పు
ణ్యములును గల్గె నేఁడె నినుఁ బ్రార్థన చేయఁగ నేల నాకిఁకన్. ౧౧౧

క. అనినఁ దనయిచ్చ నిష్టం, బొనరింపఁ గడంగి యోగి యొక నిజబలపం
బును లాతము బొంతయు గ్ర, క్కున నాతనికిచ్చి వాని గుణములు చెప్పెన్.

వ. ఈబలపపుఁగొడుపున వలసినయన్ని లెక్కలొడ్డి వ్రాసి యీలాతపుఁగోల సవ్యహస్తంబునఁబట్టిముట్టించిన నన్నియు నీవుదలంచిన ప్రాణులై నిల్చి నీవుసెప్పిన పని సేయు; నవి యుడుగవలసిన నెడమచేత నావ్రాఁతలు క్రమంబునం దుడిచిన నడంగు; నెచట నైన నీబొంత దులిపినఁ గోరిన యంతధనంబు నీకిచ్చు నదుగు మని వీడుకొల్పిన. ౧౧౩

ఉ. మ్రొక్కి వినీతుఁడై మగిడి ముందట ఘోరము లైన పాములం
ద్రొక్కుచుఁ గ్రంప లీరములుఁ దూఱుచుఁ గాఱడవి స్థలంబులో
స్రుక్కక మార్గము ల్గడచుచుం గడు దూరము వచ్చి భూవరుం
డొక్కెడఁ గాష్ఠము ల్వెఱుచుచున్న మనుష్యుని గాంచె ఖిన్నునిన్. ౧౧౪

గీ. వానిఁ జూచి యేల వగచెద కట్టెల, కింతదవ్వు రాఁగ నేమికతము
నావుఁ డేను హూణనరపతిబంటఁ ద, త్పుత్రుతోడఁ జావఁ బూనినాఁడ.

గీ. ఆకుమారుఁ డగ్ని నదె పడుచున్నాఁడు,చూడు మనినఁ గెలన సొదయొనర్చి
చిచ్చు పెట్టి కూల నిచ్చగించెడువానిఁ, జేర నేగి రాజశేఖరుండు. ౧౧౬

క. నరవరసుత నీ కీదు, ర్మరణమునకుఁ బూననేల మదిలోపల నే
పరిఖేదము గల దది యె, వ్వరిమూలము చెప్పు మనిన వాఁ డనుమతుఁడై.

సీ. ఏ మని చెప్పెద నిటక్రింద హూణదేశాధీశుఁడైన మాయయ్య తీఱె
నా యెడరున వచ్చి దాయాదు లందఱు రాజ్యంబు చేకొని ప్రాభవమున
వెడలఁ ద్రోపించినఁ గడు దుఃఖితుండనై యొకహితుం డైన సేవకుని గూడి
యేతెంచి యిచట నాజ్ఞాతులచేనైన యభిమంగ మోర్వంగ నలవి గాక
యొంటి నడవి నిట్టిమంటఁ జాఁ గడఁగితిఁ, బరిభవంబునొంది బ్రదుకుకంటె
నిదియ మేలుగాఁగ మది నిశ్చయించితి, ననిన నాతఁ డతిదయాళుఁడగుచు.

క. పగవా రొత్తినయప్పుడు, జగ మెఱుఁగం దెగుట యొండె సైరణయొండెం
దగుఁ గాక మిగుల నొగులుచు, మగవాఁడై మగువపగిది మడియుట తగునే.

చ. ఇటు విను చేటులేని బ్రతు కేనొనరించెద నీకు వైరిసం
కట మడఁగుం బదాతి తురగద్విరదంబులు గల్గు నర్థము
త్కట్టు మగు వీని గొ ప్పని విధానము లేప్పడఁ జెప్పి చేతియా
ఖటికయు యోగదండమును గంధయు వానికి నిచ్చెఁ జెచ్చెరన్. ౧౨౦
శా. తత్సామర్థ్యమునం బదాతితురగ స్తంబేరమౌఘంబు న
త్యుత్సేధంబగు సర్వముం గలిగినన్ హర్షాణ్క్షితీశాత్మజుం
డుత్సేకంబు మనంబునం బొదలఁగా నుత్సాహసంపన్నుఁ డై
మాత్సర్యంబున భూమిఁ గొన్నరిపుల న్మర్దించు నేగె న్వెసన్. ౧౨౧
వ. అట్లక్కుమారుం డరిగిన యనంతరంబున నిజాయుధధైర్యసహాయుం డును నన
హాయశూరుండును నగు విక్రమార్కుండు. ౧౨౨
ఉ. సజ్జన దర్శనంబును బ్రసాదముఁ గల్గెఁ బరాభవవ్యథా
లజ్జల నగ్నిలోఁ బడఁ దలంచిన చక్రనిరాజపుత్రునిన్
బుజ్జవ మేర్పడం గరుణఁ బ్రోవఁగఁ జేకుఱె నంచుఁ బ్రీతుఁడై
యుజ్జయినీజనాధిపతి యొయ్యన వచ్చె నవంతిభూమికిన్ ౧౨౩
వ. ఇట్టి గుణాఢ్యుండు గావున. ౧౨౪
క. అవ్విక్రమార్కుసరిగా, నెవ్విధముల నింటి కేగు డిది తగ వనిన
న్నవ్వుచు నందుల కోర్చులు, దవ్వులుగా మగిడె భోజధరణీపతియున్. ౧౨౫
వ. మఱియుఁ గతిపయదినంబు లరిగిన. ౧౨౬

—: ఇరువదియొకటవబొమ్మకథ :—

క. సింధుపతివైరిహితు సుర, సింధుప్రభవాదిచరణు సింధువిహారిన్
సింధురరూపాసురహరు, సింధుతనూజాత్మబంధు సింధురవరదున్. ౧౨౭
మ. హృదయాంభోజములోపలం దలఁచి భోజేంద్రుండు ధర్మార్థకో
విదులున్ జ్యోతిషు లాగమజ్ఞులును సేవింపంగ సొంపారు సం
పద పెంపొంద శుభగ్రహోద్ధరణలబ్ధం బైన లగ్నంబునం
ద్రిదివేంద్రాసన మెక్కవచ్చినఁ బ్రియోక్తిన్ బొమ్మ పల్కెం దగన్. ౧౨౮
చ. విను మిటు భోజరాజ యొకవిన్నప మే నొనరింతు విక్రమా
ర్కునిక్రియఁ బెంపు నీగియును రూఢికి నెక్కక యొక్కఁ జెల్ల డే
మనఁ దగు నిన్ను నిచ్చలుఁ బ్రియంబున వచ్చెదు వచ్చి క్రమ్మఱం
జనియెద వాళ మానవు యశంబును నేర్పును దీనఁ గల్గునే. ౧౨౯

కం. అతనిచరిత్రము వినఁగోరితి వేని నృపాల యవధరింపుము నాకే
చతురతయు లేదు తెంపున, నతివకు నృపుసభల మాటలాడం దరమే.

శా. నామాట ల్విన నిచ్చగింపు మతఁడా నాకేశుఁ డిష్టుండుగా
సామంతార్చితపాదపీఠుఁ డగుచున్ సామ్రాజ్యలక్ష్మీకళా
సీమం బౌ భుజసార మొప్పఁగ నయశ్రీమంతుఁ డా భట్టి ము
ఖ్యామాత్యుండుగ నేలె నుజ్జయిని నిత్యం బైనసత్కీర్తితోన్. ౧౩౧

ఉ. ఆదివసంబులందుఁ బ్రజలందఱు సంతతుల న్సమృద్ధుల
న్మోదము నంది సత్రములు మున్నుగ ధర్మము లాచరించుచు
న్వేదన లేవియుం గనక వేడ్క మనంబుల నిండి యుండఁగాఁ
బేదలు మూర్ఖు లల్పులను పేరును లేదు పురంబులోపలన్. ౧౩౨

కం. నిలుపు గలనీతి భట్టికిఁ, జెలికాఁ డనఁ బొలిచి బుద్ధిసింధు వనంగా
వెలసినయమాత్యుఁ డొక్కఁడు, గలఁడతనికిసుతుఁ డొకండు గ్రహిలుఁ డనంగన్.

ఉ. ఆగ్రహిలుండు బుద్ధియు నయంబును శీలముఁ దప్పఁగాఁ బిశా
చగ్రహదష్టుఁ డైన క్రియ సభ్యవిచారము పొందు మాని మి
థ్యాగ్రహవృత్తిఁ ద్రిమ్మరుచు నాడఁగఁ జూడఁగ లేక యాత్మలో
నిగ్రహ మంది తండ్రి సుతునిం దెగి తిట్టుచుఁ జాల దూఱుచున్. ౧౩౪

గీ. ఓరిపాపకర్మ యున్న*మంత్రికుమారు, లవనిపాలుఁ గొలిచి యచట నచటఁ
బనులు సేయఁగఁ జడుఁ డనుచు నాకును దల,వంపు సేసితి సరివారిలోన.

కం. అను వగుతనయుఁడు పుట్టిన, జనకుని కిహపరసుఖములు సమకూరు నన
న్నను వింటి నేను నినుఁగని, †మని మని నేఁడిట్టు నరకమగ్నుఁడ నైతిన్.

కం. ఒడ్డును బొడవును రూపును, దొడ్డతనము గలిగి ప్రజతోఁ బొదలనియా
బిడ్డని గనుకంటెను సతి, గొడ్డయినను మే లనంగఁ గుందుటగలిగెన్. ౧౩౭

గీ. ఎట్టకేనియుఁ దగు పుట్టువు గల్గియు, గట్టియైన వెఱుకపట్టు లేక
యుట్టిభంగి వ్యథలఁ బెట్టుటకంటెను, బుట్టినపుడె యేల గిట్ట వైతి. ౧౩౮

చ. గృహమున నుండి నన్నుఁ గలఁగింపక యొండెడ కేగు మన్న నా
గ్రహిలుఁడు సిగ్గుదాల్చి యధికం బగు మానము పూని లేచి యా
గ్రహమున శాస్త్రము ల్చదివి కా నిఁక నింటికి రా నటంచు నా
త్మహితము గోరుచు న్వెడలి దక్షిణభూమికి నేగె నొక్కఁడున్. ౧౩౯

* మంత్రికుమారకులు కొందఱు నీయట్లుగాక చెడుగుణనులు సేయఁగడఁగి నాకిట దల.
† మనుకడలేనట్టినరక.

వ. ఇట్లేగుచు నొక్కనాఁడు *భవనగిరియొద్ద నొక్కయగ్రహారంబు డగ్గఱి యందుఁ గొందఱు సభ్యులు పురాణశ్రవణంబు సేయుచున్న నట తానును జేరి వినునెడ నప్పౌరాణికుండు తీర్థఫలంబు లెఱింగించుచు. ౧౪౦

గీ. ఏకభుక్తములు ననేకదానములు న,యాచితములు జపము లనశనములు
†జరపి వెచ్చుకంటె సరగునఁ గాశిలో,బొంది విడిచి ముక్తిఁ బొందవచ్చు.

క. మెట్టక పెట్టక పట్టక, గిట్టక తీర్థముల ముక్తికిం జనరా దే
తొట్టును బొరయక మెయిమెయి, కట్టెదురన్ శ్రీనగంబు గనినంజాలున్.

క. తనువు దొఱంగక యిది మొ,క్కనలవి గాదంచు శివుఁడు కైలాసము గ్ర
క్కనవిడిచి బొంది తోఁజనఁ,దనభక్తులకొఱకు నందుఁ దరలక యుండున్.

క. శిలలెల్లను లింగంబులు, సలిలంబులు దివ్యసింధుపూరంబులు తీఁ
గలు సంజీవను లౌ ద్రుమ,ములు మందారములు చఱులు ముక్తిపదంబుల్.

మ. అని చెప్ప న్విని చిత్తకల్మషము వాయం జేయ శ్రీపర్వతం
బునకే పోవుట మే లటంచు నతఁడా పుణ్యాత్ముఁ లం బాసి చ
య్యన నాదిక్కున కేగుచున్ హృదయభృంగాఖ్యన్నగత్ఖ్యాతమై‡
ననగం బల్లన దాఁటి తీర్థసలిలస్నానార్థి యై ముందఱన్. ౧౪౫

మహాస్రగ్ధర. కనియెం గ్రీడద్విహంగన్ ఘనజలరవజాగ్రద్భుజంగ న్మహాపూ
రనిరూఢవ్యూఢదుర్వారభృతరుచితటీరంగభంగ త్తరంగన్ §
జనితశ్రేయానుషంగన్ జలధిహితపరిష్వంగ నార్ద్రాంతరంగన్
జననిర్ధూతాభిషంగన్ క్షతగిరికటకోత్సంగఁ బాతాళగంగన్. ౧౪౬

వ. కని యందుఁ గల దక్షిణావర్తంబునఁ గృతస్నానుం డై మల్లికాకుండంబును, ఘటికేశ్వరంబును, భ్రమరికాశ్రయంబును, గాలహ్రదంబును, దేవహ్రదంబును, సంధ్యామానంబును, జారుకేశ్వరంబును, నందిమండలంబును మున్నగాఁ ద్రింశద్యోజనాయతంబును ద్రింశద్యోజనవిస్తీర్ణంబును నగుటం జేసి బహుకోటితీర్థమయంబు నగు నారమాక్షమాధరంబుమీఁదికిం జని కనకమయప్రాసాదంబు సొత్తెంచి- ౧౪౭

క. ఆర్జవమున నచ్చటఁ బూ,ర్వార్జిత మగు పుణ్యసముదయమునం గనియె
న్నిర్జరగణసంసేవితు,నర్జునకిరణాంకు మల్లికార్జునదేవున్. ౧౪౮

*శ్రీమహాజననంబున నొక్కయగ్రహారంబు-ప. మాఘనగిరియొద్దఁ గొందఱుసభ్యులు. †జరపి చచ్చుకంటె. ‡హృదయభంగాఖ్యన్ జగత్ఖ్యాతమై- §రంగదుత్తుంగలరంగన్-రంగన్నృత్యత్తరంగన్.

వ. కని సాష్టాంగం బెరంగి. ౧౪౯

క. గోపతివాహానునకు నల, కాపతిమిత్రునకుఁ ద్రిపురఖండనసమయా
రోపితగిరిచాపునకును, శ్రీపర్వతవిభున కార్తచింతామణికిన్. ౧౫౦

వ. అర్చన లిచ్చి తనఫాలంబునఁ గేలుదోయి గీలించి. ౧౫౧

సీ. పెద్దమెకముతోలు నిద్దంబుగాఁ గట్టి గాలిగ్రోలెడుసొమ్ము లీలఁ దాల్చి
చలికొండకూఁతుకై సామేన నిమ్మిడి చదలేఱు నెలయును జడలఁజెరివి
యేనికమోముతో నెలుకనెక్కినచిన్నిబొజ్జపాపఁడు నీదుపజ్జ నడువ
ముజ్జోడుమొగముల ముద్దులకొమరుండు పురిగలపులుఁగుపై నరుగుదేర
వెన్నుఁడునునలువయునుబల్వేలుపులును, గొలువ*గుబ్బలికొమ్ములగుజ్జునెక్కి
కలిమికొండకునేతెంచినిలిచితనుచు, వింటి ముక్కంటి నినుఁగనుఁగొంటిమంటి.

క. అనుచు ననేకవిధంబులఁ, దననేర్చినకొలఁది నతఁడు తప్పనిభక్తిన్
వినుతించి పాపముల వీడ్కొని మగిడెం జిత్తశుద్ధి కొనసాఁగంగన్. ౧౫౩

ఉ. ఆదెసనుండి సర్వజగదాశ్రయు వేదపురాణవేద్యుఁ బ్ర
హ్లాదమనోవిధేయు నసురాంతకు శ్రీనరసింహమూర్తిఁ గా
కోదరరాజతల్పుని నహోబలనాథునిఁ జూడనేగి త
త్పాదసరోరుహంబులకు భక్తిఁ దగం బ్రణమిల్లి ధన్యుఁడై. ౧౫౪

చ. హరిహరసేవనాసుమతు లైన జను ల్వొలసింప సంపదా
కరమగుసొంపుపెంపు గల కన్నడభూమికి నేగి యొక్క భూ
సురవరునాశ్రయించి తగు సుస్థితి నక్కడనుండి యాస్థతో
సురగురునీతిశాస్త్రమును శుక్రునయక్రమముం బఠించుచున్. ౧౫౫

ఉ. అకడ నీతిశాస్త్రవిదుఁడై గురు వీడ్కొని యేగి వేడ్కతోఁ
గాకితమూలశక్తి గనిగా నొనరించిన పైఁడిచట్టునా†
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కి ధరిత్రిలోన నే
పోకలఁ బోనియట్టి సిరిపుట్టినయింటికి నోరుగంటికిన్. ౧౫౬

క. పసిఁడియు రత్నము మున్నుగ, నిసుమంత్రియం బెక్కుధనము లీనఁగ నిలకు
న్వసుమతియు రత్నగర్భయు, వసుధయు ననుపేళ్లు నిక్కువము లొనచటన్.

ఉ. చందనగంధులు న్విటులు జాణలు దానవినోదులుం బ్రభా
సుందరమూర్తులుం గవులు శూరులుఁ బెద్దలు నుల్లసిల్ల సం

*గద్దరికొమ్ముల- †పైఁడిపట్టునన్-

క్రందనవైభవాఢ్యుఁ డగు కాకతిభూపతి రాజ్యలక్ష్మిఁ బెం
పొందెడు నప్పురంబున మహోత్సవ లీలల నుండె నేర్పునన్. ౧౫౮

వ. అట్లు కొన్ని దినంబు లుండి తత్పురజనపరిచయంబున సకలకళాప్రవీణుండై మగుడం గడంగి మహాతీర్థవిలోకనార్థియై యట చని దూరంబున. ౧౫౯

క. ఆతఁడు త్ర్యంబకశిఖరో,ద్భూతను విఖ్యాతఁ బరమపూతఁ ద్రిలోకీ
మాత మహాపాతకసం,ఘాతవిఘాతానుయాతఁ గనియెన్ గంగన్. ౧౬౦

క. ఆనదికి మ్రొక్కి ముఖ్య, స్నానం బొనరింప డిగ్గి చని యుదకం బా
లోనం దెకతెక నుడుకం, గా నద్భుతమైన మడుఁగుఁ గని వెరఁగందెన్.

క. పిట్టలు దివిఁ బాఱఁగ నా,కట్టావ్రల నెఱక లెల్లఁ గమరిన నచటన్
మట్టుపడి కూలుఁ దొడిమల,పట్టూడినయట్టి మేడిపండులభంగిన్. ౧౬౨

గీ అట్టిఘోరమైన యయ్యుష్ణతీర్థంబు, చేర వెఱచి శిశిరవారిలోనఁ
గలన జలక మాడి వెలి కేగి యట గుడి,లోన నున్నశివునిఁ గానఁబోయి.

వ. అద్దేవు నుచితోపచారంబుల నారాధించి యచట నొక రాత్రి గడపం గడంగి యుండె. ౧౬౪

క. ఆవేళ నాకాశంబున, నాయుష్ణాంబుప్రల యూవు లంటినఁ దప్తుం
డై యపరాంబుధి మునుఁగఁ,బోయెనొకో యాతఁ డన నభోమణి గ్రుంకెన్.

మ చదలం జుక్కలు పిక్కటిల్లఁగఁ దమస్సందోహము ల్భూమిభా
గదిగంతంబుల నిండ రేయి నిగుడంగా నుష్ణతీర్థంబులో
నుదకం బుబ్బఁగ గొబ్బున న్వెడలి సాంగోపాంగసంగీతులం*
జదురాం డ్రౌ నెనమండ్రు వచ్చి రట కాసర్వేశ్వరుం గొల్వఁగన్. ౧౬౬

ఉ. మోహనదివ్యమూర్తు లగుముద్దియ లాశశివకాళికి న్మహో
త్సాహముతోడ హేమజలజంబులఁ బూజ లొనర్చి నాట్యస
న్నాహము సేయుచో నొకతె నాదవిశోధన† చేయుచుండె నాఁ
గాహళ వల్లె గానగమకశ్రుతితానవిధాన మానఁగన్. ౧౬౭

గీ. గానభిక్షు వేఁడ హీనస్వరంబున, వదరుకాయ లంది వచ్చినట్టి
వీణియలకు లయలు విప్పిచెప్పెడు భంగి, నందు ముగురు వాడి రందముగను.

క.‡ సాళాదిగీతములును సు,తాళము ధ్రువ గురువు లఘుయుతంబులుఁ దమలో
మేళనమునఁ జెడకుండఁగఁ, దాళము వాయించె నొకతె తద్గతికొలఁదిన్.

---

*సంగీతలై— †నాదవినోదము— ‡సూళాదిగీత—

గీ. కళరవంబు లమర గమకంబుతోఁ బేర్చు, రాగమున మనంబు రంజిలంగఁ
బ్రియుఁడు వోలె నధరబింబంబు చుంబించు, వాసిగ్రోలువట్టె వనితయోర్తు.

గీ. మూర్ఘునైన బట్టి ముఖరునిఁ జేయుదు, ననినభంగి సతి మృదంగ మంది
కంకణములు తాళగతి మ్రోయవాయించెఁ,*దొయ్యలులకు నెద్దిదుష్కరంబు.

చ. తతఘనమర్దళాదినినదంబులు సర్వదినాల్గు హస్తని
ర్గతులును దృగ్విలాసములుఁ గన్నులపండుగ గాఁగఁ దాళసం
గతులు చెలంగఁ బాదకటకంబులు మ్రోయఁగ నాట్యమాడె నో
క్కతె తొలుకారుక్రొమ్మెఱుఁగు నైవడిఁ దద్రసభావపుష్టిగన్.† ౧౭౩

క. ఎలనాఁగలు మఱి తమలో, పల నృత్తాంగములు పీడుపడ నాడుచుఁ గ్రొ
న్నెలతాల్పువేల్పు నీక్రియఁ, గొలిచి మగిడి యేగునపుడు గుడిలో మూలన్.

శా. విస్మేరాకృతినున్న మంత్రితనయు న్వీక్షించి ప్రేయాంత్రు మం
దస్మేరానన లౌచు నీకు సుఖమందం గోరుకు ల్గలైనే
నస్మద్భూమికి రమ్మటంచుఁ జనఁగా నయ్యుష్ణతీర్థోష్మల
న్భస్మం బయ్యెద నంచు భీతి నతఁ డాప్రాంతంబున న్నిల్చినన్. ౧౭౪

క. పాతాళంబున కేగిన, యాతరుణులదీప్తి భూతలాంతంబున ను
ద్యోతించునాయనఁ దూర్పున, నాతతమగు కెంపుదోఁపనరుణుఁడు వొడిచెన్.

మ. దిననాథుం డుదయింపఁగా వెడలి భక్తిన్ గౌతమీతీరకా
ననము ల్దాఱుచు నొక్కనాఁడు కడుఁ బుణ్యంబైనకాళేశ్వరం
బున కేతెంచి మహోపచారపరుఁడై ముక్తీశ్వరుం గొల్చి నె
మ్మన ముప్పొంగఁగ ధన్యుఁడై మగుడఁ దన్మార్గంబున న్వచ్చుచున్. ౧౭౬

క హరిహరు లేకం బనియెడు, పురాణవచనంబు దృష్టముగ నొకచోటన్
నరసింహుండును రామే, శ్వరుఁడును గలధర్మపురికి వచ్చెఁగడంకన్. ౧౭౭

చ. అట చని గంగలో జలకమాడుచుఁ గొందఱుచే నెఱింగి మి
క్కుటముగ నింపుతో యముని కుండము దూఱి కడంక బ్రహ్మకూఁ‡
కటియును ముట్టి వెల్వడి జగత్పతి యౌ నరసింహమూర్తి ముం
దటి కరుదెంచి మ్రొక్కి యుచితంబుగఁ బూజ యొనర్చి భక్తితోన్. ౧౭౮

*దొయ్యలులకు వేడ్కతొంగలింప. †ఈచంపకమాలకు, ప్రత్యంతరములో- గీ. కంకణము
లు తాళగతి చెలంగఁగఁ బాద, కటకములును మ్రోయ నటనచూపెఁ, దరుణి యొకతె క్రొత్తమె
ఱుపుకైవడి నిండి, రసము భావపుష్టిఁబొసఁగుచుండ. ‡మూకటి యను వేల్పుగొల్పుచు-

ఉ. నర్మద తుంగభద్ర యమునానది జాహ్నవి కృష్ణ గౌతమిం
గర్మము వాయ నెన్ని జలకంబులు దీర్చితినో దయామతీ
ధర్మము లెన్ని చేసితినొ దానము లెన్ని యొనర్చినాఁడనో
ధర్మపురీనృసింహ నిజదైవమవౌ విభు నిన్నుఁ జూచితిన్. ౧౭౯

వ. అనుచుఁ బునఃపునఃప్రణతుండై వెడలి తదాసన్నం బగు దేవాలయంబున
కుం జనుచు నద్దేవు నుద్దేశించి. ౧౮౦

ఉ. శాశ్వత మాకృపారసముచాఁ ద్వన ముందఱ గంగ వాఱఁగా
విశ్వజనీనవృత్తిఁ బృథివింబడగురూపున నిల్చి సంతతా
నశ్వరభుక్తిముక్తిసదనం బగు ధర్మపురీశుఁడైన రా
మేశ్వరుఁ డెల్లకాలమును నీవృత మాకు నభీష్టసంపదల్. ౧౮౧

చ. అని గుడి సొచ్చి యీశ్వరున కర్చన లెల్ల నొనర్చి మ్రొక్కి యిం
పున మఱుకం గడంగి భువిఁ బుణ్యపదంబులు చూచుచుం గ్రమం
బున నొకయేఁడు వుచ్చి తలఁపు లనుకూడిన నిర్వికారుఁడై
జనకునిఁ జూడవచ్చె నయశాస్త్రవిశారదుఁ డయ్యవంతికిన్. ౧౮౨

సీ. వచ్చితండ్రికిగౌరవముదోఁప మ్రొక్కుచుఁ బ్రియవాక్యములఁగడునయముసూప
బుద్ధిసింధువుఁ దనపుత్త్రుఁ గౌఁగిటఁ జేర్చి నన్నుద్ధరించితే యన్నయనుచు
సంతసం బందుచు జననాథు దర్శింపఁ జని వాఁడు పోయి వచ్చిన తెఱంగు
చెప్పి మ్రొక్కించిన క్షితిపాలకుండును మోదంబుతో వాని నాదరించి
రాజనీతులుమంత్రికార్యక్రమంబు, లడుగుచును గొంతతడవున కట విదేశ
మేగిచోద్యంబులచ్చట నేమిగంటి, చెప్పుమనవుడు గ్రహిలుండు చెప్పెనదియు.

గీ. కడిమి నంధ్రభూమి గౌతమితో జల, ముడుకుచుండ నుండు నొక్కమడువు
లోననుండిరాత్రిలోలాక్షు *లెనమండ్రు, వెడలివత్తురచటిమృడునిగొలువ.

క. వచ్చి తమయాటపాటల, నచ్చంద్రాభరణుఁ గొలిచి యరుగుచు నను వా
రచ్చటికిఁ బిలువ నుదకపుఁ, జిచ్చు సొర న్వెఱచి పోక చిక్కితి గుడిలోన్.

చ. అనవుడు వేడ్క వానిఁ గనకాభరణాదుల నాదరించి పి
డ్డాని నృపుఁ డొక్కఁడు న్వెడలి కొన్నిదినంబుల కంధ్రభూమి కా
ననములు దాఁటి పాపహిమనాశనసార్థము నుష్ణతీర్థముం
గని వెఱఁగంది పొంత నుదకంబులఁ గ్రుంకి శివార్చనామతిన్. ౧౮౬

*మీనాక్షు.

క. ఆగుడికిం జని హారు నను, రాగంబునఁ గొలుచు నంత రవిగ్రుంకె నను
ద్వేగంబునఁ జీఁకటి ది, గ్భాగంబుల నిండె మేఘపటలము భంగి౯. ౧౮౭

క. గుడగుడ నుడికెడి యుదకము, ముడివడ గర్జితములట్లు మ్రోయఁగ దెసల
న్వెడఁ గడర మెఱపుఁదీవల, వడువున నమ్మడువు వెడలి వచ్చిరి పడఁతుల్.

గీ. అట్లు వచ్చి పంచమాదిస్వరంబుల, శ్రుతుల లయలఁ దాళగతుల యతుల
గానగేయగీతగాంధర్వభేదంబు, లలవరించి పాడి యాడునపుడు. ౧౮౯

క. నరలోకము నహిలోకము, సురలోకముఁ జూచినాఁడఁ జూచినసతు లె
వ్వరుఁ గారు వీర లని భూ, వరుఁ డచ్చెరువంది యుత్సవముతో నుండె౯.

క. ఆలోన నాటపాటలు, సాలించి యొకింత మగిడి జనపతిఁ గని నీ
వాలోకమునకు రమ్మని, లోలాక్షులు పిలిచి మడుఁగులోనికిఁ జనిన౯.

క. కడుఁదెంపరియై భూవరుఁ, డుడికెడు వెడమడుఁగునడుమనుఱికెను మును గ్రాఁ
గెడునూనియకొప్పెరలోఁ, బడి వెడలినవాఁడు నీళ్ళఁ*బడు టచ్చెరువే.

క. ఉఱికి తదభ్యంతరమున, నెఱమంటలు దాఁటి వెనుక నేతేరఁగ న
త్తెఱఁగెఱిఁగినిలిచి ప్రియమునఁ, దెఱవలు చెయివట్టిభూపతిందోకొనుచు౯.

గీ. రజతసౌధములును రత్నగేహంబులుఁ, గనకమండపములుఁ గలుగుపురము
సొచ్చి వైభవములు సూపుచు మాక్తికా, సనముమీఁద నతని నునిచి రంత.

క. కనకకలశోదకంబుల, జనపతిచరణములు తొడసి సత్కారము లిం
పునఁ జేసి సఖులు లోచన, వనజంబుల దీపముల నివాళింపంగ౯. ౧౯౫

వ. అందు నొకసఖీశిరోమణి నృపశిఖామణికి నయ్యైనమంత్రను జూపుచు.

సీ. అవనీంద్ర యష్టమహాసిద్ధు లీరామ లాఖ్యానగుణము లిం దమరి యుండు
నతిసూక్ష్మరూపమీయణిమచేఁ జేకుఱు మహిఁబెద్దగాత్రమీమహిమనొదవు
†జలమున మింటను జులక నయ్యెడునట్టి లాఘవం బొనరు నీలఘిమచేత
బరువైనభావ మీగరిమచే నగపడు నీప్రాప్తిచే నగు నిష్టగతులు
నెనయుదలఁపులీప్రాకామ్యమునఫలించు, మనుపఁ జెఱుపనీయీశత్వమునఁ గల్గు
‡నమరవరులైన నీవశిత్వమునఁజిక్కి, మాఱువల్లరుకైకొన్నుమమ్ముఁగూడ.

వ. ఈయష్టసిద్ధులకు మేము పరకాయప్రవేశాద్యుపసిద్ధులము. తత్పరిచారికా
సహస్రసహితంబుగా నీరాజ్యంబు గైకొని యందఱ నేలుకొమ్మనిన
విస్మితుం డై యతండు నయవినయంబుల నిట్లనియె. ౧౯౬

*దీనఁబడు టచ్చెరువే- †జలముల మునుఁగఁగఁ జులకగానయ్యెడు. ‡అమరవరు లౌదు
నఁ గాన, మాఱువల్కక కైకొమ్ము మమ్ముఁగూడ.

క. మీరలు దేవత లన్యులఁ, గోరం దగ దేను దీర్ఘగుణమెఱుఁగఁగ నా
నీరఁబుల మునిఁగితి మీ, కారుణ్యవిలోకనంబు గలిగినఁ*జాలున్. ౧౯౯

క. అని మ్రొక్కి లేచి చనఁజూ, చిన నాతలఁ బెటిఁగి యష్టసిద్ధులు నగుఁ గై
కొను మని యొనిమిదిరత్నము, లనిమిషసతు లిచ్చి వెడల ననిపిరి నృపతిన్.

మ. అకలంకుం డగు నమ్మహీవరవరుం డానందసంస్ఫూర్తిచే
వికసన్మానసుఁ డై ప్రసిద్ధవనము ల్వీక్షించుచు న్వింధ్యభూ
మికి గోదావరి దాఁటి కాఱడవిఁ జేర్చిం బోవుచో నొక్కవి
ప్రకుమారుం గనియె న్నిరంతరగళద్బాష్పాకులప్రేక్షణున్. ౨౦౧

చ. కని యిది యేల యేడ్చెదవు కానలఁ గ్రుమ్మర నేటికన్న నో
మనుజవరేణ్య నాజనని మజ్జనకుం గడు దూఱ దూఱిన
న్మనమునఁ గంది యాతఁ డభిమానముతో వనభూమి కేగె నా
తని వరయంగఁ ద్రిమ్మరుచు దవ్వుగ వచ్చితిఁ గాన నావుడున్. ౨౦౨

క. మాతకడనుండు పొమ్మిదె, నీతండ్రిం బాపువాఁడ నిజమని యతిదుః†
ఖాతురుని మగుడననిపి. మ, హీతలపతి రత్నగుణము లెఱుఁగం దలఁచెన్.

గీ. ఇతనితండ్రి యున్నయెడకు నిప్పుడ యేగ, వలయు నతనిఁ బ్రోవవలయు ననుచు
రత్నసిద్ధి నంబరంబునఁ జ్వలనై, యర్థమార్గి విక్రమార్కుఁ డేగె. ౨౦౪

క. అప్పురిఁ జేరి తెలియఁగ, నెవ్వఁడ వీవనుఁడు నాతఁ డిట్లనియె ధనం
బెవ్వింట లేక బ్రతుకుట, నెవ్వ యనుచు నింటితగులు నీఁగినవాఁడన్.

ఉ. కాశ్యపిలోఁ బ్రసిద్ధమగు కంచిని నుండుదు విష్ణుశర్ముఁడం
గశ్యపగోత్రజాతుఁడ వికారవిదూరమనస్కుఁడన్ జగ
ద్వశ్యకళావిశారదుఁడ దైవము చెడ్డి దరిద్రభావనా
కార్యము నొంది భార్య గడుఁ గష్టపుఁబల్కులు వల్క నోర్చితిన్. ౨౦౬

క. పడఁ గుక్కి లేదు నేలం, బడి పొరలఁగ ‡రొండఃలూఁడఁ బడితిని దల డా
జడగట్టెఁ గట్టఁ గోకయుఁ, గుడువం గూడును నెఱుంగఁ గొందుట దక్కన్.

సీ. కుండలముందఱఁ§గూర్చుండి పడుచులు గంజికి నేడ్చుచు॥గదల లేరు
మోఁకాళ్ళఁ దల లిడి ముడిఁగి నిద్రింతు రేకాలంబునను మేనఁ గప్పు లేక

*గలిగెం జాలున్. †యాయ్యదోత్యతమునిమగుడననిపి. ‡లాండాలాడ్;—కన్నులూడఁ
బడవెంద్రుకలు—§గుంటలముందఱ- ॥గంజికేడ్చుచునదిగానలేరు.

యతిదరిద్రునకు నిల్లాలౌటకంబెను జచ్చుట గడుమేలు సతుల కెల్లఁ
బాపకర్ముని జెట్టవట్టుట మొదలుగా నిడుమ లేకాని యొం డెఱుఁగననుచు
మగువ తెగివల్క నవ్వగ మాన్ప లేక
జీర్ణదేహుండ ధనము లార్జింప లేక
యూఁతకోలయుఁ దోడుగా నొయ్య వెడలి
దూర మరుదెంచి *యడవిలోఁ జేరినాఁడ. ౨౦౮

చ. అనవుడుఁ జింత నొంద కది యట్టిద యెమ్ములు బూదిపూఁత దు
న్నని పసరంబుఁ దోలు మసనంబుల యున్కియుఁ జూచి నిర్ధనుం
డని శివుఁ బాసి రత్ననిధి యైన సముద్రునిఁ గూడె గంగ భా
మినులు ధనంబు లేనిపతి మెచ్చరు లేమియె కీడు గావునన్. ౨౦౯

క. ధన మొకటి యేల తలఁచిన, పను లన్నియు వీనిచేత ఫలియించుం గై
కొను మని మహిమలు చెప్పుచు, నెనిమిదిరత్నములు నతని కిచ్చెంగరుణన్.

శా. ఆవిప్రుండు మణిప్రభావమున దివ్యంబైనదేహంబు స
ద్భావంబున్ ధనలబ్ధియుం బడసి యుత్సాహంబుతోఁ గంచికిం
బోవం గోరి నభోగతిం జనియె, నాభూపాలుఁడున్ దానవి
ద్యావైచిత్రి నటించి వచ్చె నతిమోదం బైన యుజ్జేనికిన్. ౨౧౧

శా. తత్సామాన్యగుణంబు లిట్లొదవినన్ ధారాపురాధీశ నీ
యుత్సాహంబు ఫలించు నిట్టిగతి నీ వూహింపుమా నావుడు
న్మాత్సర్యంబున నెక్కఁజెల్ల దని యాత్మం జూచి భోజుండు వి
ద్వత్సంఘంబులు గొల్వఁగా మగిడె నాధాత్రీశు నగ్గించుచున్. ౨౧౨

శా. దుగ్ధాంభోనిధికన్యకారమణు నస్తోకప్రభామండల
స్నిగ్ధశ్యామలదివ్యదేహు నుచితశ్రీగోపవేషక్రియా
ముగ్ధస్త్రీహృదయాపహారిఁ గరుణాంభోరాశిఁ దేజఃకళా
దగ్ధానేకమహాసురున్ సురహితుం ద్రైలోక్యరక్షామణిన్. ౨౧౩

శా. గీర్వాణాచలరూపచాపశిఖరాంగీకారదీర్ఘోరుస
స్మార్వీభూతఫణీంద్రసంయుతమహానారాయణాస్త్రున్ జగ
ద్దుర్వారాకృతికాలకూటగిళనాస్తోకాసితగ్రీవు గం
ధర్వేంద్రార్చితపాదపీఠు నిజభక్తవ్రాతచింతామణిన్. ౨౧౪

* చాలంగఁ గోరినాఁడ.

కాళీసమేతుఁడై కరినికరంబులఁ గంఠీరవము దాఁకు కరణి మెఱయ
సురనికరంబుపై నుఱికి ధే, యని యార్చి బ్రహ్మాదులెల్లను బరువులిడఁగఁ
దఱిమి నుగ్గాడి పోఁద్రోలి దర్పమణఁచి, జయము చేకొన్న సద్గురుస్వామివీవె
మదనమదభంగ మహితక్షమాశతాంగ, కరధృతకురంగ కంచి యేకామ్రలింగ.

క్షోణి శతాంగంబు సూర్యచంద్రులు కండ్లు నజుఁడు సారథి శ్రుతు లశ్వపంక్తి
మేరుశైలము మహామేటికోదండంబు యహిపతి నారి శ్రీహరి శరమ్ము
ప్రణవంబు మునికోల పాలసంద్రము పొది రౌప్యాద్రి పీఠంబు రాహుకేతు
వమరఁగా భజియించి యతిరౌద్రమూర్తివై యరదంబుపై నెక్కి యసురవైరి
శరముచేతను క్షణములో శత్రులగలఁ, త్రిపురదహనంబుఁ జేసిన దేవుఁడీవె—

అఱపదియమ్ములగుఱికాని గర్వంబు మాయఁ జేసిన జగన్మాన్యుఁ డీవె
జంటత్రాగుడునొంటిదంటరాకాసిని మంటఁగల్పిన శితికంఠుఁ డీవె
సుడివాలుఁ గేలునఁ బిడిగొన్న జేజేకుఁ బరమమిత్రుండైన భర్గుఁడీవె
చట్టుగూఁతురును జేపట్టి లోకములెల్లఁ బట్టఁగా నేలిన భవుఁడ వీవె
భక్తజనులను రక్షింప బ్రహ్మమీవె, యనుచు మదిలోన నిన్నెంతు ననుదినంబు-

మూఁడుపట్నముల నిర్మూలంబుగాఁ జేయు దామోదరాస్త్ర మేదారి జరిగె
నంధకాసురుశిర మవలీలఁ ద్రుంచిన ఘోరరౌద్రాస్త్ర మేగొందిజణిఁగెఁ
దారకాసురుఁ బట్టి దర్పమణంచిన పాశుపతాస్త్ర మేబారిసురిగె
సింధురాసురుఁ గిట్టి చించి చెండాడిన ఘుమ్మనవాలు నేమూల నణఁగె
శ్రీమహాదేవ యిప్పుడు చెండరాదొ, యశివతతులను భవదుగ్రవిశిఖములను
మదనమదభంగ మహితక్షమాశతాంగ, కరధృతకురంగ కంచి యేకామ్రలింగ.

వేషధారుఁడటంచు వెఱచుక యుందురా యెండలో నిల్పి సొమ్మియ్య మనక
గరళకంఠుం డని గడనగాఁ జూతురా హక్కుదార్వెంబడి నంటుకొనక
ఫాలనేత్రుఁ డటంచు భయపడి యుందురా పైకంబుఁ దెమ్మని బాధలిడక
నురగభూషణుఁ డని యూరకె యుందురా జీతంబు దెమ్మని జిద్దుపడక
సర్వకాలంబు గొల్చిన సంబళములు, విడిచిపెట్టరు భక్తులు వెంటఁబడక—

నీనామకీర్తన నిగమాంతసారంబు నీనామకీర్తన నిత్యసుఖము
నీనామకీర్తన నిర్గుణబ్రహ్మంబు నీనామకీర్తన నిత్యపదవి
నీనామకీర్తన నిత్యకల్పసమాధి నీనామకీర్తన నిత్యముక్తి
నీనామకీర్తన నిఖిలమంత్రంబులు నీనామకీర్తన నిత్యయోగ

మనుచునీనామమాత్మలోనను దినంబు, మననసేయుచునున్నాఁడ మఱపులేక
మదనమదభంగమహితక్షమాశతాంగ, కరధృతకురంగ కంచియేకామ్రలింగ.

శివశివా యని నిన్నుఁ జింతన సేయక ప్రారబ్ధ మేరీతిఁ బాసిపోవు
హరహరా యని నిన్ను నభినుతిసేయక కర్మంబు లేరీతిఁ గడఁదొలంగుఁ
బరమేశ్వరా యని భజన సేయక యున్న జననమరణము లేసరణివీడుఁ
బరమశివా యని పలుమాఱు దలఁపక సాయుజ్య మేరీతి సంఘటించు
ననుచునెఱనమ్మి నిరతంబు నాత్మలోన, భక్తియుక్తుఁడనై చాలఁబ్రస్తుతింతు—

వేదశాస్త్రపురాణవిద్యలు నేరను జపతపోవ్రతనిష్ఠజాడ లెఱుఁగఁ
దీర్థయాత్రలు సల్పఁ దిరుగులాడఁగలేను నతిథిపూజ లొనర్ప నలవిలేదు
అష్టాంగయోగంబు లభ్యసింపఁగలేను నాత్మవిదుఁడ గాను నల్పమతిని
దీనజనావనదీక్షవహించిన దేవదేవోత్తమ తెలియవినుము
నాదువిజ్ఞాపనంబునానందముగను, బరమపదమిమ్ముమఱియేమిభాగ్యమడుగ-

అదెరా కయ్యాసరి యాలోచనలఁజేసి కయితకట్టిప్పుడు గట్టినావు
కట్టితే నేమాయెఁ గాసైననీయను నూరిలో నీవింక నుండవద్దు
వెట్టికూఁతలు కూసి వెఱపిఁచవచ్చేవు పద్యాలుమామీఁదఁ బాడవద్దు
కాటమరాజుల కగ్గమైనా సరి సిద్ధురాజులుగారి సుద్దులైనఁ
దానగించుక చెప్పితేతక్కువయినఁ, గాని యిరుసొడ్లు కొల్లనుగష్టలోభి,మద-

సురగరుడోరగనరకిన్నరులఁ ద్రోలి సాధుజనులమానసములు చెఱచి
యగ్రజు నదలించి యతనిపట్నము గొని యనుజన్ముఁ బడఁదన్ని యవలనడిచి
కడుఁ గ్రూరుఁడై మించి కైలాస మగిలించి ప్రమథగణంబులఁ బాఱఁద్రోలి
యింత చేసినఁ గాని యేమనఁజాలక యత్యంతకరుణచే నరసి ప్రోచి
భక్తియే ముఖ్యముగ నెంచిపంక్తిముఖునిఁ, బావనముగాను నేలినవరదుఁడీవె
మదనమదభంగమహితక్షమాశతాంగ, కరధృతకురంగకంచియేకామ్రలింగ.

అఖిలదర్పోజ్జ్వలుం డగువాయుసూనుండు చిక్కుపడఁడె యింద్రజిత్తుచేత
వివధినీరం బెల్ల విప్రవరేణ్యుని పుడిసిటిలో నాఁగెఁ బొంక మాఁగి
యాచక్రవాళపర్యంత మేలెడిరాజు వీరబాహునిఁగొల్చి వెతలఁ జెందె
సకలసురాసురసమితి నోర్చినవీరుఁ డాటఁ జెప్పుటకుఁ దా నాథ్యుఁడయ్యె
నీదుదయలేకయుండిననేర్పులేల, నన్నిటికి నీకటాక్షంబెయతిశయంబు, మ-

భక్తరక్షకుఁ డని భజన చేసితిఁ గాని యింతనిర్దయుఁ డని యెఱుఁగ నైతి
శంకరుం డనుచును జాల నమ్మితిఁ గాని కఠినచిత్తుఁ డటంచుఁ గాననైతి
దీనావనుం డని తెలిసి మ్రొక్కితిఁ గాని విషగళుం డనుచును వెదకనైతి
నిందుశేఖరుఁ డని యిందుఁ జేరితిఁ గాని మదనారియనుమాటమఱచిపోతి
మంచిదా యెటునీ వెన్నిమాయలైనఁ, జేసితేమా యెవరుఁ బాయసిద్ధముగను-
దండంబు దండంబు దైవశిఖామణి దండంబు దండంబు ధవళగాత్ర
దండంబు దండంబు దండధరాంతక దండంబు దండంబు దహననేత్ర
దండంబు దండంబు దాసజనావన దండంబు దండంబు దానవారి
దండంబు దండంబు ధైర్యజితనగేంద్ర దండంబు దండంబు దర్పకారి
దండములు నీకుఁ గోటిమార్తాండతేజ, దండములఁ బాయు నేఁ జేయుతప్పులెల్ల-
శ్రీకంఠుఁ బూజించు చేతులు చేతులు దితిజారిఁ దలఁచిన దినము దినము
గంగాధరుని జూచు కన్నులు కన్నులు శివునకు మ్రొక్కెడి శిరము శిరము
విశ్వేశుకథ విను వీనులు వీనులు సితమూర్తి నుతియించు జిహ్వ జిహ్వ
పరమాత్ము వలగొను పదములు పదములు భూతేశ్వరుని మీఁది బుద్ధిబుద్ధి
యనుచు విబుధుల చే విని యనుదినంబు, సన్నుతించుచు నున్నాఁడ సత్యమనుచు-
రాజశేఖర విను రజతాచలంబునఁ బార్వతీదేవియుఁ బ్రమథగణము
నమరేంద్ర యమ వరుణాదిదేవతలును మునివర్గమును జాల ముదముతోడ
సేవింపఁగా రత్నసింహాసనమ్మున వేంచేసి యున్నట్టి వేడ్కఁ జూడఁ
గోరియున్నాఁడను గొబ్బున దయచేయు మిఁకమీఁద జన్మ మే నెత్తఁజాల
రమ్మనుచుఁ బిల్వనిటనీ ప్రరాకయున్న, నీకునీపాదములతోడు నిజముగాను,మ-
హారిహరాదులపూజ లభ్యంతరము లాయె గ్రామశక్తులు మహాఘనములాయె
సత్యశౌచంబుల జాడలు చెడిపోయె నన్యాయ మశుచియు సర్వమాయె
బ్రాహ్మణుచదువులు పసపసలైపోయె నన్యజాతులవిద్య లధికమాయె
వేదశాస్త్రపురాణవిధులెల్ల నుడివోయెఁ దామసోక్తులు మహాధట్టమాయె
మోసకులు చాలఁగలియుఁ గాముఖ్యులైరి, సజ్జనుల నెట్లు ప్రోచెదో సాంబమూర్తి-
కలకొద్ది నతిథికిఁ గరుణతో రమ్మని యుపచరించెడివాఁడ యుత్తముండు
మాపురా రేపురా మళ్లిపొమ్మని త్రిప్పి మఱియొసంగెడివాఁడు మధ్యముండు
కఠినోక్తులాడుచుఁ గళవళపెట్టుచు నటుమీఁద నొసఁగువాఁ డధముఁ డండ్రు
లేనియాసలు చెప్పి లేదు పొమ్మనువాఁడు నధమాధముం డందు రవనిలోన
ధర్మములయందు నంతరాంతరము దెలిసి, దాన మొసఁగిన పురుషుండు ధన్యుఁ డౌను-

సురగరుడోరగనరకిన్నరులకైన నీమాయ మించంగ నేర్పు లేదు
హారిసోమహిమగిరిసురభూజములకైన నీకీర్తి మించంగ నేర్పు లేదు
తపనకాలాంతకదహనులకైనను నీప్రతాపము మించ నేర్పు లేదు
శేషబృహస్పతిభాషాపతులకైన నీవిద్యలను మించ నేర్పు లేదు
గాన సర్వజ్ఞుఁ డనునభిధాన మరుదె?..................మదనమదభంగ- 38

కరటిచర్మమె నీకు ఘనముగాఁ దోఁచెనా పీతాంబరంబుపైఁ బ్రియము లేదొ?
ఫణులకంకణములే భాగ్యమై తోఁచెనా బంగారుసొమ్ములు బాగు లేవొ ?
యెముకలదండలే యెక్కువై తోఁచెనా రత్నహారంబుల రాజి లేదొ ?
భూతిపూతయె నీకు భోగమై తోఁచెనా మంచిగందములమీఁదమనసు లేదొ?
యేమిచోద్యము నీచర్య లెంచఁదరమె, ఫణిపతికినైన భారతీపతికినైన,మ-

శ్రీమహాలక్ష్మి నీచెల్లెలై యుండఁగాఁ బులితోలు గప్పిన పుణ్యమేమి
యన్నపూర్ణయు నీకు నర్ధాంగియై యుండ విషము భక్షించిన వింత యేమి
సఖుఁడై కుబేరుండు సరసనె యుండఁగా భుజగభూషణుఁడైన పోఁడిమేమి
యింద్రుఁ డెప్పుడు నీకు హితవరై యుండఁగా భస్మధారుండైన భాగ్యమేమి
నీదులీలలు వర్ణింప నేర్పు గలదె,పద్మసంభవునకునైనఁ బరమపురుష, మ-

విప్రుండు విష్ణుండు వేదంబు నొకరాశి సకలశాస్త్రపురాణసమ్మతముగ
రాజును ఖడ్గంబు వాజియు నొకరాశి సకలశాస్త్రపురాణసమ్మతముగ
వీణయు రతియుఁ బూవిల్తుండు నొకరాశి సకలశాస్త్రపురాణసమ్మతముగ
గడు మూఢుఁడును మూర్ఖగార్దభంబొకరాశిసకలశాస్త్రపురాణసమ్మతముగ
సుజనులొటనునొకరాశిసుకవులెల్లఁ,గుజనులొటనునొకరాశికుకవులెల్ల,మ-

అశనవసనముల నడుగునో యడుచునను బలుకకున్నావేమొ పరమపురుష
గరళభక్షకుఁడవు గజచర్మధరుఁడవు భూతి దేహమునిండఁ బూసినావు
పెద్దకుమారుని పెండ్లిసేయఁగ లేవు భైరవునకుఁ గట్టుబట్ట లేదు
యీశ్వరుండై యుండి యింత లేమిడి యేమి నీమాయలన్నియు నీకుఁ దెలియు
నైనఁగానిమ్ముమతియేమియడుగ లేదు,నీదుపదభక్తి యేచాలునిశ్చయముగ
మదనమదభంగ మహితక్షమాశతాంగ,కరధృతకురంగకంచియేకామ్రలింగ.

శ్రీకాళహస్తి నాశ్రితులను రక్షింపఁ బవనలింగమనంగఁ బ్రబలితీవు
అమరఁ దేజోలింగ మన నరుణాద్రిని విబుధులు గొనియాడ వెలసితీవు
ఆత్మవిదులఁ బెంప నలచిదంబరమున నాకాశలింగమై యలరితీవు

జంబుకేశ్వరమున జగములఁ బోషింప నప్పులింగ మనంగ నమరితీవు
అధిప! దక్షిణకాశిని నతులితముగఁ, బృధివిలింగాభిధానుఁడై పుట్టితీవు, మ-
జలదంబు నిబిడమై చదలఁ బర్వఁగఁ జేసి పూర్వవాయువులు నింపొందఁ జేసి
గంభీరముగ మహాఘననినాదముతోడ మెఱపు లుత్తరమున మెఱయఁజేసి
యేఱులఁ జెఱువులు నేకార్ణవంబుగా భూమి నిండార సంపూర్ణముగను
గురియించు వర్షంబు గొబ్బున లేకున్న సకలసస్యాదుల సార మణఁగు
నీదుజడలందుజాహ్నవినిండియుండ, నెంతమాత్రముయాపనియిందుమౌళి, మ-
అర్ధనారీశ్వర హరిసుతయుతుఁడవై భారతరణమునఁ ధీరుఁడగుచు
గురుభీష్మకృపకర్ణకురుయోధముఖ్యుల రథవాజిగజభటరాజిమీఁద
నర్జునాశుగములకన్న మున్నుగ మహాతీవ్రమై దిక్కులు తేజరిలఁగఁ
బ్రళయకాలానిలబాడబాగ్నులరీతి మండెడు నీదృష్టిమార్గణముల
విగతజీవులుగాఁ జేసి వేగముగను, విజయునకువిజయమొసఁగినవీరుఁడీవె, మ-
పంచాక్షరీమంత్రపరన భక్తిధ్యానధారణాదులకు సంధానకరణి
పంచాక్షరీమంత్రపరన బ్రహ్మజ్ఞానవరులకునెల్ల సౌవర్ణకరణి
పంచాక్షరీమంత్రపరన యోగానందసంపన్నులకును విశల్యకరణి
పంచాక్షరీమంత్రపరన జీవన్ము సిద్ధాత్ములకును సంజీవకరణి
మంత్రరాజంబునిదియెముమ్మాటికనుట, నక్షరాభ్యాసమేసాక్షియవనిలోన-
తన్నుఁదా నెఱిఁగెడి తత్త్వంబు తెలియక వేసగాండ్రయి విఱ్ఱవీఁగువారు
అద్వైతుల మటంచు నాశలు వీడక దేశాలవెంబడిఁ దిరుగువారు
తనగురువాక్యంబు తానమ్మఁ జాలక వేఱె దేశికులను వెదకువారు
మంత్రతంత్రంబుల మహిమలఁజూపుచు యోగులమంచును నుండువారు
ఆదిమధ్యాంతరహితుఁడవైననిన్నుఁ, దెలియనేరక భ్రాంతిచేఁ దిరుగువారు-
బ్రహ్మాండభాండంబు పటపటఁ బగులంగ నార్చుచుఁ గరటిదానవుఁడు కడఁగి
వాలవిక్షేపణోద్వేలవాతాహతిఁ జటులధరాధరసమితి పగుల
సంఘటించుచు మహాసంరంభుఁడై దేవసంఘంబు నదలింప సరభసముగ
నంబర మదరంగ నట్టహాసము చేసి యఖిలలోకంబులు హర్షమంద
నద్భుతపరాక్రమక్రీడ నసురవరుని, దునిమితివి నీప్రతాపమెంతనినుతింతు, మ-
సద్గురుపదభక్తిసంపన్నుఁ డగువాఁడు (నిర్వికల్పసమాధి) నిన్నుఁ గాంచు
నింద్రియముల రోసి యేషణత్రయిఁబాసినిస్సంగుఁడగువాఁడు నిన్నుఁగాంచు

వేదాంతసిద్ధాంతవిజ్ఞానపరిపూర్ణ నిత్యతపోనిధి నిన్నుఁగాంచు
నుపమ తెలియక యూరకే యుపవసించి,గాసిఁజెందిననిన్నెట్లు గనఁగవచ్చు-
కారణాచార్యుల కరుణచెందినవాఁడు శ్రవణమనోధ్యాన సహితుఁడగును
శ్రవణసుఖధ్యాన సహితుఁడై తగువాఁడు నిర్వికల్పసమాధి నిల్వనేర్చు
నిర్వికల్పసమాధి నిలువనేర్చినవాఁడు సమనస్థభావంబునందుఁ బొందు
సమనస్థభావంబునందుఁబొందినవాఁడు నానందభరితుఁడై యమరియుండు
నట్టియానందమే బ్రహ్మమనుచుఁదెలిసి,నిత్య(మోక్షంబె)యినియనినిన్నుఁజెందు-
అబ్జసన్నిభగాత్ర యమరబృందస్తోత్ర పావనచారిత్ర ఫాలనేత్ర
కాళికాహృదయేశ కాశీపురనివేశ కలుషజాలవినాశ గగనకేశ
హాలాహలాహార యహిరాజకేయూర సద్భక్తమందార సమరధీర
సజ్జనపరిపాల సద్గుణగణలోల కరిచర్మవరచేల గానలోల
యనుచునుతియింతునిన్ను నేననుదినంబు, నన్నుదయఁజూడుమమ్మిలిఁగన్నతండ్రి-
పటుఘటితానేకబంధురఘంటికానినద మజాండంబు నిండి మ్రోయఁ
గనకరత్నప్రభాకలితమై విలసిల్లు కంఠహారంబులు ఘనత మెఱయ
ఫాలతలంబునఁ భస్మచిహ్నితమైన సింహతలాటంబు చెలువు మీఱఁ
బదనూపురస్థిత పద్మరాగోజ్జ్వలప్రభలు దిక్తటముఁ బ్రజ్వరిల్ల
రజితగిరిఁగేరుతనుకాంతి రంజిలంగఁ, బరఁగు నీ వాహనము నేను భజనసేతు-
పంచవింశతితత్త్వపద మెఱింగినవాఁడు చేతనాములమాయఁ జిక్కువడునె?
యోగశాస్త్రానందయుతుఁడైనవిద్వాంసుఁడన్యశాస్త్రాపేక్ష నాసపడునె?
యాత్మతీర్థస్నాన మభిరుచి గల్గిన బాహ్యతీర్థంబుల బాధపడునె?
తన్నుఁ దా నెఱిఁగెడి తత్త్వజ్ఞుఁ డగు యోగి దేవాలయంబులఁదిరుగువడునె?
యెఱుకలేకున్నదీనియందేమిగలదు, యెఱుకగలిగినధన్యుఁడేయెక్కువంత్రు-
కైలాసనగము నీకాణాచి కాఁబోలు దీనులరక్షింప దిగువరావు
నీమశృంగారంబు నీయాటపాటలు నీపుత్రసంపద నీదుభటులు
ఎవరికి లేవని యెంచియున్నాఁడవు సమముగాఁ జూడవు సకలజనుల
నీయోగ మంతయు నీసతియైనట్టి కామాక్షిదేవిచే ఘనత మెఱసె
ననమనేత్రుఁడవనుమాటయర్థమయ్యె, భక్తుఁడనుగాననినుదూఱఁబల్కినాఁడ-
రాజయోగానందరసపరిపూర్ణుఁ డౌ పురుషుఁడే ధన్యుఁడు పుడమిలోన
నధిపునిరణమునం దచలుఁడై హతుఁడైనపురుషుఁడే ధన్యుఁడుపుడమిలోన

భాగ్యసంపూర్ణుఁడై (పరఁగ) దానమొసంగుపురుషుఁడేధన్యుఁడు పుడమిలోన
సత్యశౌచంబులు సద్గుణములు గల్గు పురుషుఁడే ధన్యుఁడు పుడమిలోన
నితరనరులనుధరలోన నెన్న నేల, నరులె వారలు ధాత్రి వానరులుగాని, మ-
సరసమంజుళపారిజాతాదిసుమముల సద్భక్తి నీపూజ సలుపవలయు
గోపాల శ్రీకృష్ణ గోవింద యనుచును బలుమాఱు హరిభక్తిఁ బలుకవలయు
సద్ధర్మ(జపతపస్సత్య)శౌచంబుల జాడలు వీడక సలుపవలయు
సాధుసజ్జనులకు సత్కారము లొనర్చి పలుసంగరహితుఁడై పరఁగవలయు
నిట్టిసద్గుణములు లేనిహీనమతులఁ, బురుషులందు రెబుధులు కాపురుషులనక-
పటునటజ్జ్వాలికాభయదపావకశిఖాచటులోగ్రతరతనుచ్ఛటలు వెలుఁగ
దళితకరోద్ధూతధరణీపరాగంబు కమలభవాండంబుఁ గ్రమ్ముకొనఁగ
వాలవిక్షేపణాభీలవాతాహతి నిబుధవిమానముల్ వ్రీలితూలఁ
ప్రళయావసరమేఘపటలి మ్రోసినరీతిఁ బళపళధ్వనుల నంబరము పగులఁ
దనర నేతెంచుశార్దూలదనుజుఁగిట్టి, పట్టి యదరింప గెంటిన భవుఁడ వీవ-
అమరేంద్రయమవరుణాదిదేవత లెల్లఁ దపమున నేకదా ధన్యులైరి
గంధర్వకిన్నరగరుడోరగాదులు తపమున నేకదా ధన్యులైరి
కశ్యపగార్గేయకణ్వాదిమును లెల్లఁ దపముననే కదా ధన్యులైరి
బంధవిముక్తులై పరమయోగీంద్రులు తపముననే కదా ధన్యులైరి
పాపములు వాయుఁ దపమున భ్రాంతివీడుఁ
దపము లేకున్న మోక్షంబు తగులువడదు, మదనమద... .. 58
పులితోలు పావాలు పూసలపేరులు భూతిపూఁతయు కావిబొట్టు నుదుట
జపమాల పూసల జటజట జరపుచుఁ గన్నులుమూయుచుఁ దిన్నగాను
గొణగొణగొణుఁగుచు గుటకఁ గనఁజాలక భేషజంబులచేతఁ బెద్ద లనుచు
మంత్రతంత్రంబుల మాయలు చేయుచు నశనార్థులగుచును వాశవిడక
తిరుగువారల కది యేల తెలియఁబడును, నీకటాక్షంబు లేకున్న నిత్యపదవి-
పరమశివా నీదుభక్తితపనకాంతి దురితాంధకారంబుఁ దొలఁగద్రోయుఁ
బురహర నీపాదపూజయన్ బడబాగ్ని సంసారజలనిధి శౌర్యమణఁచు
నాగభూషణ నీదునామస్మరణపవి యజ్ఞానకుధరంబు నణఁగఁజేయుఁ
గందర్పహర నీదుకరుణయే యనిలుఁడై పామరజలదంబుఁ బాయఁజేయు
ననుచు శ్రుత్యాదిగ్రంథము లాడుచుండు, నెంతవారలకైన ననునిది యెనిజము-

అబ్జాక్షుఁ డనియెడు నభిధాన మతనికి నబ్జశేఖరుఁ డను నాఖ్య నీకు
ఫణిశయనుం డను ప్రఖ్యాతి యతనికి ఫణిభూషణుం డను ప్రతిభ నీకు
నగధరుం డనియెడు నామ మాతనికిని నగనివాసుం డనునడక నీకు
శ్రీధరుఁ డనియెడుసిద్ధాంత మతనికి శ్రీకంఠుఁ డనియెడు చెలిమి నీకు
హరియనెడిపేరు నతనికి హరుఁడనీవు, అంతరం బేమి యిరువురకరసిచూడ
మదనమదభంగ మహితక్ష్మాశతాంగ, కరధృతకురంగ కంచి యేకామ్రలింగ.

ఎన్నిజన్మంబుల నెత్తితినో కదా యిఁకమీఁద జనన మేనెత్తఁజాల
నీసౌఖ్యములె చాలు నిందుకళాధర నమ్మియున్నాఁడను నన్నుఁ బ్రోవు
మెంత వేఁడినఁ గాని యేమని పలుకవు మంచిదా యెను నాదు మనవి వినుము
నీదయ రావలె నిన్ను నేఁ గనవలె నీపాదముఁ దలంతు నిజముగాను
దనయుఁడగువాఁడ దేమైనఁ దప్పుచేయఁ, గాచిరక్షింపవలయును గన్నతండ్రి-

శ్రీరామచంద్రుఁడు సీతామహాదేవి యనుజవిభీషణు లాంజనేయ
హరితనయాదిమహావీరవరులతో వనధితీరంబున విశ్రమించి
నినుఁ బ్రతిష్ఠ యొనర్చి నీపూజఁ గావించి రామలింగం బను నామ మొసఁగి
తనపురి కేతెంచి తల్లులఁ గని మ్రొక్కి తమ్ము లందఱుఁ గొల్వఁ దనదు రాజ్య
భారము వహించి బుధలోకభవ్యమైన, క్రతువులొనరించి త్రిభువనఖ్యాతిఁ గాంచె-

అరయఁగా మున్నూటయఱువది వ్రతములు సత్యవ్రతముతోడ సమము గావు
దానంబు లెన్నైనఁ దలపోసి చూచిన నన్నదానముకన్న మిన్న గావు
మంత్రంబు లెన్నైన మది నెంచి చూచిన గాయత్రితోడుత గణన గావు
విద్య లెన్నైనను వివరించి చూచిన నధ్యాత్మ*

(రామాయణంబు)న రాజరాజును గొట్టి విక్రమార్కుఁడు మహావీరుఁ డయ్యె
భాగవతంబునఁ బాంచాలరాజుతోఁ గుంభకర్ణుఁడు పిడిగ్రుద్దులాడె
ననుచుఁ దెలియని ప్రౌఢోక్తులాడుచుండు, నెగ్గులేనట్టిమూర్ఖుఁడు సిగ్గులేక-

అఖిలవిద్యలకెల్ల నాధార మౌటను సర్వజ్ఞుఁ డను పేరు సంభవించె
రణరంగమున మహారౌద్రమూర్తివి గాన రుద్రాభిధానంబు రూఢి యయ్యె
భక్తవాంఛితసుఖప్రదుఁ డౌటచేతను శంకరనామంబు సంభవించె
నైశ్వర్యముల కెల్ల నాకరం బగుటను నీశ్వరుం డనుచును నెన్నఁ గలిగె
సకలభూతమయుఁడవు శాశ్వతుఁడవు, నాదిమధ్యాంతరహితుఁడవభవుఁడీవె-

* ఒక పత్రము లేనందునఁ గొన్ని పద్యములు లోపించినవి.

## ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా వారు. పరిషద్ద్వా

శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.
శ్రీరాణీ వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మజగపతిబహద్దరుగారు-తుని రాణిగారు.
కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.
వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుఁడుగారు.
రావుసాహేబ్ డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ., ఎల్. టి. (Ph. D.

లు.

శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., యల్. టి.
దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. ఎల్
అళక్కి వేంకటాద్రిమయ్యగారు.
కేశవరపు కామరాజుగారు.
కోకా వేంకటసుబ్బారావు నాయుఁడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.
పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.
పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావు నాయుఁడుగారు.

# కాకినాడ-ఆంధ్రసాహిత్యపరిషత్తులో

## వెలకు దొరకు గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము- చదలువాడ మల్లయకవి | రు | 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... | | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు ... | | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థళం కృష్ణమాచార్యులుగారు | | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... | | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము- జ. రామయ్యపంతులుగారు. | | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి ... | | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... | | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... | | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... | | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | | 0 | 4 | 0 |
| 18 | హ్రస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు ... | | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు ... | | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—గంగాజమ్మ ... | | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁకుఁడు | | 0 | 12 | 0 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | | 1 | 4 | 0 |
| 23 | రెడ్డినాఁటి రెండు శాసనములు ... | | 0 | 4 | 0 |
| 24 | ఆంధ్రధాతుమాల ... | | 0 | 12 | 0 |
| 25 | శాసనపద్యమంజరి ... | | 0 | 12 | 0 |
| 26 | శతకసముచ్చయము (ప్రథమభాగము) ... | | 0 | 12 | 0 |
| 27 | పరిషత్పుస్తకభాండాగారము (ద్వితీయభాగము) ... | | 0 | 8 | 0 |
| 28 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి ... | | 0 | 8 | 0 |
| 29 | రసాభరణము—అనంతకవి ... | | 0 | 8 | 0 |
| 30 | చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) ... | | 0 | 8 | 0 |
| 31 | ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు ... | | 1 | 0 | 0 |
| 32 | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య ... | | 0 | 8 | 0 |
| 32 | ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతివ్యాఖ్యతో ... | | 0 | 8 | 0 |

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada

శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**

సంపుటము. ౨౧ { ఆంగీరసనామసంవత్సరము. మార్గశిరపుష్యమాసములు. } సంచిక ౫.



కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1933.

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౧. { ఆంగీరసనామసంవత్సరము. మార్గశిరపుష్యమాసములు. } సంచిక ౫.


## కృష్ణదేవరాయలు-ఆముక్తమాల్యద.


టేకుమళ్ల అచ్యుతరావుగారు ఎం. ఏ., యల్. టి. రాజమహేంద్రము.


(వెనుకటిసంచిక తరువాయి)

గ్రంథనిర్మాణము గుఱించి వ్రాయునపుడు శిల్పమునుఁ గూర్చియు శైలినిఁ గూర్చియుఁ గొంచెముగాఁ జెప్పుటయైనది. ఇప్పు డీరెండువిషయములను సూక్ష్మముగఁ బరిశీలనఁజేసి వానియందలి గుణదోషములను సోదాహరణముగ నిరూపించెదను.

శిల్పము:—కథాశిల్పము రెండువిధములుగ భాగింపవచ్చును. (i) ఇతివృత్తకథనము (ii) వర్ణనము. ఇతివృత్తకథన మీగ్రంథమునఁ బూర్వోత్తరసందర్భశుద్ధిగను దీర్ఘవిలంబనములు లేకుండగను గొనసాగింపఁబడినది. వర్ణనము లట్లుగాక యతిదీర్ఘములుగను కథాపోషణమునకు సంబంధింపకుండఁగను బ్రత్యేకముగ వర్ణనానైపుణ్యముకొఱకే చేయఁబడినవి. కావుననే యీరెంటికిని సమన్వయము కుదురలే దని వెనుక సూచించితిని. కథకు వర్ణనములు పరిపోషకములుగ నుండవలెను. వర్ణనలకు నితివృత్తకథన ముపయోగకరముగా నుండవలెను. ఈరెంటికిని నన్యోన్యమైత్రి లేనికారణమున నీకావ్యమందలి శిల్పమునుగూర్చి వ్రాయునపు డీరెంటిని వేఱువేఱుగ నిరూపింపవలసినదే !

— ఇతివృత్తకథనము —

ఈకావ్యమందలి కథాకథనము మంచి ప్రౌఢముగను గడుసుఁదనము తోను, జక్కనినేర్పుతోను జేయఁబడినది. శ్రమ యావంతయైనను వ్యర్థ మగుట లేదు. కథాప్రణాళిక కడు జిగిబిగిగ, గాఢముగ, ననుస్యూత మై కమ్మచ్చు నుండి తీఁగసాగునట్లు నిబ్బరముగను సూటిగను నడచును. కథాకల్పనము దిట్టముగ దట్టించి నేసిన బట్టవలె నిబిడమై నీరంధ్రమై మనోజ్ఞముగ నున్నది. ఇతరకవులు సామాన్యముగ రసవృద్ధికొఱకుఁ జేర్చు ప్రాసంగికకల్పనలు, దృష్టాంతములు, సందర్భావశ్యవర్ణనలు మున్నగునవి యీకవి చాలవఱకుఁ గ్రుచ్చిపెట్టి కథాకథనమున నెక్కడ నంతరాయము గలుగకుండఁ జెప్ప నుద్యోగించెను. కథాసరణిలో రసపుష్టికొఱకుఁ బనికివచ్చెడు నితివృత్తములను మంచినేర్పుతో నేర్చి కూర్చికొని యచ్చటచ్చట పొందిక యైన యతుకులను బెట్టి బిగువైనయల్లికగాఁ గథాబంధనము నెఱవేర్చెను. ఇంతటిగాఢబంధనము శ్రీనాథునియందుఁ గానఁబోము. పెద్దన్న తిమ్మన్నలయందును సామాన్యముగా లేదు. దీనికి సరిచూడవలె నన్న పింగళి సూరన్న గ్రంథములకుఁ బోవలెను. ఇటువంటి జటిలమగు నితివృత్తబంధ మానిరుపమాన కవితాశిల్పియే కనఁబఱిచినాఁడు. కావున పింగళి సూరన్నకుఁ గృష్ణరాయలే కొంత మార్గదర్శి యయ్యె నని చెప్పవచ్చును. అయిన నీచక్రవర్తికవి కథాశిల్పమునకు నాకవిచక్రవర్తి కథాశిల్పమునకు నొకించుక తారతమ్య మున్నది. పింగళి సూరన్నకథాసంఘటనమునఁ గృష్ణరాయలదానికంటె నెక్కుడు రసము, గాంభీర్యము, వచోవిలాసము, జాణతనము, నిర్భరకౌతూహలనిష్పత్తి వెల్లివిరియుచున్నవి. ఉదాహరణములు.

(1) ప్రథమమున విష్ణుచిత్తునికథ నరయుఁడు:— వేసవికాలవర్ణన మైనతరువాత-

క. అప్పును వేసవి విభవము, విప్పుగఁ దన్నగరనికటవృషగిరిహరికిన్
దెప్పతిరుణాళ్లురా ముద, మొప్పన్ బరదేశపుఁ డొక్కఁడు భక్తిన్.

అని ప్రారంభించి యాపిరిసలపని వేగమునఁ గథానివేదమునఁ బరుగులెత్తెను. ప్రతిపద్యమందును గంథాశములను నిర్వక్రక్రమమునఁ గ్రుత్తముగ నొడువుచుఁ గథయం దంతరాయ మెంతయైనను గలుగనీయక యొకమెట్టు తరువాత రెండవమెట్టునకు వేవేగమె చేరుచువచ్చెను. ఇట్లీయతిత్వరితగతిని విష్ణుచిత్తుని బాండ్యరాజ్యసభకుఁ గొంపోయి యచ్చటిపండితులను స్వల్పకాలములో స్వల్ప

శ్రమతో నోడింపించెను. ఇది యెంతయు నెంత రమణీయముగ నున్నదో చెప్ప నలవి కాదు! వాగతీతము! వర్ణనాతీతము! ఇట్టిరభసగతియే విష్ణుచిత్తుఁడు ప్రాసంగికముగఁ జెప్పిన ఖాండిక్యకేశిధ్వజసంవాదమునఁ గూడఁ గానంబడుచున్నది. దీనియందలి గమన వేగ మన్నిటికంటె నెక్కువ. విస్మయజనకము లగుదీర్ఘవర్ణనలతో విపులముగ వ్రాయ ననువగు నీచక్కనికథను కొద్దిపాటి స్థలములో నిమిడ్చి రసము తగ్గకుండ వలసినయంశముల నన్నిటిని యథావసరముగఁ బెంచి యతిమనోహరముగ రచించెను. ఈకవీశ్వరుని క్రోడీకరణశక్తియు, రసభావనిరూపణసామర్థ్యమును శ్రోతృహృల్లసనచాతుర్యమును సంపూర్ణముగఁ దెలుపుట కీకథానక మొక్కటియే చాలును. ఆంధ్రవాఙ్మయమునందలి మనోజ్ఞ మగు కథారచనమును నిరూపించెడు ముఖ్యోదాహరణములలో నిది యొకటి యని తప్పక చెప్పఁదగ్గది.

స్థాలీపులాకన్యాయముగ నీతునుకను దిలకింపుఁడు.

క. హరిణాజినోత్తరీయుఁడు, నిరాయుధుఁడు నగుచు నతని నెలవగునడవిన్
జొర గొట్టికాండ్రు డక్కైముఁ, బరికించి యెఱింగి కలయఁబడి కూఁతలిడన్.

గీ. వలస బెదర నృపతి కలఁగక ప్రజవగ, లార్పఁ బనిచి కనుమలందు నిలువ
వేఱువేఱ యేర్చివిలుమందిఁ బనిచి తాఁ, దఱుకుపెండె మలుకవోడమ వెడలె.

క. పచ్చురిపుఁ జూపులనె చుఱు, వుచ్చుచుసిరిఁగొనుటమగుడఁబోడముటరుపము
చ్చిచ్చుసను వెచ్చమరి వి,ద్యుచ్చలచాపజ్యఁదూపు దొడుగుచుఁ బలికెన్.

మ. ధనధాన్యద్విరదాశ్వగోధనసమేతం బెల్ల సామ్రాజ్యమున్
గొనియుం జాలక తాటకేయఫలభుక్స్ఫాటాకృతిన్ జింకతో
లున నాచ్ఛన్నుఁడవై ప్రశాంతుగతి మాలోఁ జొచ్చి ప్రాణంబులన్
గొననే తెంచితె? దుర్మతీ! కెడపెద న్గ్రూరంపుభల్లంబునన్.

మహా. అనినం జేయెత్తి యోహో యలుగక విను కానాతతాయిన్ బ్రమాదం
బున వైకల్యంబు యాగంబునకుఁ బొడమునే భూసురశ్రేణి వేఁడన్
నినునావేదించి పంపె న్నృప యతఁ డెఱుఁగు న్నిష్కృతి న్వేఁడు పోపో
మ్మనికోపమ్మైన రోపమ్మయిన విడువు మెట్లైనమే లింకనన్నన్.

ఈతీరునఁ బ్రతికథను సంక్షేపముగ నుడువుటయం దీకవికి నద్భుతశక్తి యున్నను మొత్తముమీఁద సర్వావయవసమన్వయమునమాత్ర మీశక్తి వెనుకఁబడి గ్రంథమును విరళబంధముగను నియమరహితముగను బెంపుచేసినది.

కథాశిల్పమున శిథిలబంధము గలుగుటకు హేతువులు-

(1) మూలకథ కిసుమంతయు సంబంధము లేని యుపాఖ్యానములను జేర్చి యనవసరముగ గ్రంథముఁ బెంచుట. (2) ఋత్వాదివర్ణనములలో మూల కథ మునిఁగిపోవునట్లు వానిని విపరీతముగఁ బెంచుట. (3) ఆవర్ణనలకు మూల కథకును దగినసంబంధములు కలుగఁజేయకపోవుట. ఈమూఁడువిధముల కథాశిల్పము శిథిలబంధముగా నేర్పడినది.

(11) వర్ణనలు:—వర్ణనలవిషయములోఁ గవి తనయావచ్ఛక్తిని వినియోగించి యనేకవిధములైన కల్పనలు చేయ నుద్దేశించుకొనెను. ప్రతిమహాప్రబంధములోను నిర్ణీతములైన యష్టాదశవర్ణనములలోఁ గొన్నియైన నుండవలెను గదా! పురశైలఋత్వాదివర్ణనలు ముఖ్యములు. ఈకవి ఋతువర్ణనలకు గ్రంథమందుఁ జాలభాగము వినియోగించెను. గ్రీష్మవర్షశరద్ధేమంతవసంతములన్నియుఁ గ్రమమున వర్ణించి వర్షఋతువు ననుసరించి వేసరక రాజనీతి యని మఱియొకగొప్పవర్ణనము సుమా రెనుబదిపద్యములదానినిఁ జేర్చెను. జలక్రీడావిరహాదివర్ణనలు విడుచుటకు వీలు లేదు గదా! ఈవర్ణన లన్నియు మొత్తమున కావ్యమందలి సగము భాగము నావరించినవి. కావ్యమం దున్నసుమారు 870 గద్యపద్యములలో నీవర్ణనములు 400 లకుఁ బైగా నున్నవి. ఈఋతువర్ణనలు బహుశః, అప్పుడప్పుడు ప్రాస్తావికముగను యాదృచ్ఛికముగను గవి వ్రాసినపద్యములగుత్తు లని నాయూహ. ఏలయన వానియందొక సరియైన క్రమము లేదు. ముందు నుండి వెనుకకు, వెనుకనుండి ముందుకు నూఁగులాడుచుండును. మహాచక్రవర్తిముఖమున రాజనీతి వినెడుభాగ్యము మన కిచ్చుటఁ గలిగిన దని సంతసింపవచ్చును, గాని, కథాశిల్పక్రమముం బట్టిచూచిన నీసుదీర్ఘమగు రాజనీతివర్ణన మెంతయుఁ గథాప్రణాళికకు నిరోధ మని చెప్పవలసియున్నది.

ఇంతియగాక యొండురెం డనౌచిత్యంబులు గూడ దీనియందుఁ గాన్పించుచున్నవి. (1) విష్ణుచిత్తునికిఁ గావించిన బ్రహ్మరథోత్సవపువర్ణనమున శ్రుతిపవిత్ర మగువేదగానము గాని, భగవద్భక్తిపూరితము లగుకీర్తనల రసావేశము గాని సూచించెడు వర్ణన లెక్కువగా నుండిన సమయోచితముగ నుండును గదా! అట్టివి లేక కేవలము శృంగారరసాతిశయస్ఫోరకము లగువేశ్యావర్ణనములు నర్తకీనృత్యాభినయములు విటీవిటాభిసారికాపరస్పరసమ్మేళనములు; నిత్యాది జఘన్యశృంగారరసప్రేరకము లగువిషయములనే ముఖ్యముగ వర్ణించుట యనౌచిత్య మని నాకుఁ దోఁచుచున్నది.

(౨) విష్ణుచిత్తునకు బాలిక యగు గోదాదేవి మొట్టమొదట దొరకిన యుద్యానవనమును వర్ణించుచు నందు స్త్రీపురుషు లుపరతియందలి గెల్పోటముల యానందము ననుభవించుచుందు రని విశేషముగ వర్ణించెను. ఆయుద్యానవనమునందు నిత్యము జరుగు నుపరతిక్రియలకును గోదాదేవి జన్మకును నేట్టిసంబంధ మున్నదియో మనకుఁ దెలియరాదు. అట్టిగుప్తశృంగారక్రీడలవలన నాగోదాదేవి జనించినది? తేనియెడల నచ్చటి వీరాయితవర్ణనము యొక్క స్వారస్యమేమి? అయోనిజయుఁ బవిత్ర మైనదియు నగుబాలిక- గోదాదేవి నింద్రియ నిగ్రహమూర్తి యగు విష్ణుచిత్తుఁ డాలోకనము చేయుసమయమున స్వచ్ఛమైనదియు, నిర్లోలమైనదియు, నిర్వికారమైనదియు నగు ప్రకృత్యాదివర్ణనమును గల్పించిన నెంతయోగ్యముగ నుండునో యాలోచింపుఁడు?

ఇట్టి యనౌచిత్యము లచ్చటచ్చట లేశమాత్రములుగఁ గాన్పించుచున్నవి. భక్తాగ్రేసరుఁ డగువిష్ణుచిత్తుఁడు తనదుహితను న్యాయముగ శ్రీరంగనాథస్వామి లోనకైకొనె నని యబ్రహ్మణ్యము మూర్చుచుఁ బరుగులిడుట విరస మగువిషయము. ఈదృశంబు లగు నెరసులు, మధురసప్రవాహములో మక్షికములపగిది నిక్కావ్యమహాసుధలో నెచ్చటెచ్చటనో సూక్ష్మదృష్టికి గోచరించినను, రసమాధుర్యముఁ గ్రోలువారి కెంతమాత్రము బాధకములు గావు.

శైలి:—ఈకావ్యమందలి శిల్పమందు వలెనె శైలియందును ద్విధావృత్తి గాన్పించుచున్నది. కథాసరళియందు శైలివేఱు. వర్ణనభాగములందు శైలి వేఱు. మహాకవి తిక్కన చెప్పినట్లు "అలంతియలంతితునియలు సంధించిన కావాళి వలె" కథాసరళియందలిశైలి చిన్నచిన్నమాటలతోఁ జక్కగను జిక్కగను గ్రుచ్చబడి జిగిబిగిగ సొగసుగ తీఁగవలె సాగుచున్నది. పదములయందలి పటుత్వము రచనయందు రాగముఁ జూడఁదగును. రాగముకంటెఁ బటుత్వమే హెచ్చు. మచ్చునకైనను వ్యర్థపదములును బాదపూరణపదములును గానరావు. ధారాళ మగుప్రాసంగికశైలిని వ్రాయుట యీచక్రవర్తికవితోఁ బ్రారంభింపఁబడినట్లు నే నూహించుచున్నాను. ఈతని ననుకరించి యతిశయించినవాఁడు పింగళి సూరన్న యని నామదికిఁ దోఁచుచున్నది. కథాకథనభాగము లెంతయు మనోహరముగా నున్నను వానియందు బాహుళ్యముగా మృదుత్వము మాధుర్యమును గాన్పింపవు. ఈచక్రవర్తికి నేలకో సంగీతజ్ఞానము సున్న. ఎచ్చటెచ్చటనో క్వాచిత్కముగఁ దప్పఁ దఱచుగ నీతనిపద్యములు శ్రుతికటువులుగాను

గఱగఱలాడుచున్నట్లున్నవి. కందిరి నూనె మెఱుఁగని బండ్లు గులకరాళ్ల మీఁద నడచినట్టు లీపద్యములు సాపుగాను స్నిగ్ధముగాను జదువఁబడవు. సమకాలికు లగుపెద్దన్న, తిమ్మన్న, మల్లన్న, ధూర్జటి మొదలగు కవివరులకృతులు స్వీకరించెడుభాగ్య మీయనకుఁ గలిగినను వారివలె శ్రావ్యముగఁ గబ్బము చెప్పెడుయోగ్యత కలుగలేదు. ఈకవిని రాబర్టుబ్రానింగుతోఁ బోల్పవచ్చును. ఆయాంగ్లేయకవీశ్వరునివలె నీకవియు నర్థగాంభీర్యమునకుఁ గాను శబ్దప్రౌఢిమకుఁ బేరొందియుఁ గవిత్వరీతియందు లాలిత్యము లేక శ్రుతికటువగుపదగుంఫనము చేయుచువచ్చెను. ద్రుతస్వరములు, స్నిగ్ధద్విత్వాక్షరములు, సరళసంధులు, నిత్యాదులగుపదసంధానసామ్యరీతులను లక్ష్యముచేయక విడిచిపెట్టెను. ఉదాహరణము:-

ఉ. అంబరవాసు లగ్నిఁ గ్రియకై ద్యుమణిస్ఫటికోపలంబునం
దుం బడయన్ శరజ్జలదతూలపరంపరఁ గొంతపై ఘటిం
పం బెలుచన్ జనించి మఱి మట్టున నిల్వక యాక్రమించెఁ గాఁ
కం బరితాపమూన ననఁ గాసె మొగుల్విరియెండ లత్తఱిన్.

మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ప్రబంధమందలి శైలినిఁ గూర్చి వ్రాయుచు "దీనియందలి శైలి యోజోగుణభూయిష్ఠము. ఓజస్సనఁగా దీర్ఘసమాసములను గలిగియుండుట" అని చెప్పిరి. ఈప్రకారము శ్రీవారు గ్రంథమందలి శైలినిగుఱించి చేసిననిర్ణయము గొప్పపొరపాటని నాయభిప్రాయము. దీర్ఘసమాసములు కొన్ని వర్ణనభాగములలోఁ దక్కఁ దదితరస్థలములలోఁ గానరావు. ప్రాయికముగా నిచ్చటి శైలియందుఁ జిన్నచిన్నపదములను గూర్చుటయే కాన్పించుచున్నది. ఔక్కాచికముగాఁ గొన్ని యుదాహరణములఁ జూడుఁడు.

ఉ. ఎన్నినుఁ గూర్తు నన్న విను మే మును దాల్చిన మాల్య మిచ్చున
ప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పుము మున్ను గొంటి మే
వన్ననదండ యొక్కమగవాఁ డిడ నేను దెలుంగురాయఁడన్
గన్నడరాయ యక్కొదవఁ గల్పు ప్రియాపరిభుక్తభాక్కథన్.

క. ఉన్నట్ల యుండెఁ గా దరి, కిన్నరులను నావఁ జేర్చుక్రియ వెసఁ దాఁకో
కున్నట్ల యుండి కాలం, బున్నరులకు వయసుఁబుచ్చు మోసము వెచ్చున్.

ఇట్టిచక్కనిపద్యము లనేకములను జూడఁగలము. వర్ణనలలో సహితము తఱచు చిన్నచిన్నపదములను జక్కగాఁ గూర్చుటయే యున్నది. కాఁబట్టి దీర్ఘస

మాసములచే శైలి కాఠిన్యము వహించిన దని చెప్పుట పొరపాటనియే నా యభిప్రాయము. మఱి యింక నేకారణమున నీకావ్యమందలిశైలి క్లిష్ట మని యుఁ బాకము నారికేళపాక మనియుఁ బండితులచేఁ బరిష్కరింపఁబడినది? స మాసదైర్ఘ్యముచేఁ గాక పదకాఠిన్యముచే దీని క్లిష్టత యేర్పడిన దని చెప్పు ట యెక్కువయొప్పిద మని తెలుప సాహసించుచున్నాను. ఈమహాకవికిఁ గఠిన ము లగుమాఱుమూలపదములను నిఘంటువులనోటనుండి బైటకు లాగి తన గ్రంథమందు వాడుకొనుటయం దభిలాష యెక్కువ. సామాన్యముగా నితరకవు లు వాడుకచేయు శబ్దములకు బదులుగా నీకవి కఠినమైన నిగూఢపర్యాయప దములను వాడుకచేసెను. ఉదాహరణముగాఁ గొన్నిపదముల నీవ్యాసమునం దే 'కృష్ణరాయని ప్రతిభాశిజ్ఞానము'లను శీర్షికక్రిందఁ జూపఁబడెను. ఈవైచి త్ర్యము చాలచోట్ల కాన్పించుచున్నది. కావుననే యీకవి వీనినిఁ బ్రత్యేకము గా బుద్ధిపూర్వకముగా వాడినాఁ డని చెప్పవలసియున్నది. ఈవిషయము గు ఱించి అక్కిరాజు ఉమాకాంతముగా రిచ్చిన యభిప్రాయముతో నే నేకీభవించు చున్నాను. "శ్రుతికటు పదములు, అస్థానస్థసమాసములు, ప్రసన్నపదము లు న్నప్పటికి వాటిని వదలి ఆయర్థమునందే వాడిన యప్రయుక్తపదములు (నిఘం టువులలో మాత్ర ముండినవి, కవులు తఱచుగా వాడనివి, ప్రసన్నపదములు తెలిపే అర్థమునే తెలిపెడివి, అయిన మూలగొట్టుపదములు) ఇట్టి వన్నికావ్య ములందు దోషము లని కావ్యప్రకాశ, సాహిత్యదర్పణ, విద్యానాథీయాదులను జదివి తెలిసికొనియుంటిని, అనేక కావ్యములు చదివితిని, పైనుదాహరించిన వన్ని దోషము లన్నమాట నాకు నిశ్చయబుద్ధి కలిగినది. కాని యీదోషము లన్ని యుండుటవల్ల ఆముక్తమాల్యదకు దుర్జ్ఞానత్వ మనే యొక గొప్పతనము వచ్చినట్టును మూలగొట్టు నిఘంటుపదము లుండుట కావ్యమునకు గొప్పలక్షు ణమైనట్లున్ను శాస్త్రిగా రుపన్యసించిరి. (శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారు) కాని యామాటలయందు నాకుఁ బ్రమాణబుద్ధి కలుగలేదు." అక్కి రాజు ఉమాకాంతము:-(తెలుగుదేశవాఙ్మయపత్రిక 1921 నవంబరు సంచిక)

ఈవిమర్శన మంతయు నుత్తమకావ్యాదర్శముల నాధారముగఁ జేసికొ నినదై యుండుట వలన స్వచ్ఛ మగుకవితాౌరభమును గ్రోలువా రందఱు నంగీ కరింపకతప్పదు. కావున నీగ్రంథమందు ముఖ్యముగా నాక్షేపింపఁదగినది భా షాకాఠిన్యము. ఈశబ్దకాఠిన్య మొకయుత్కృష్టలక్షణముగా, కేవలపండితులు

(శ్రీ. వే. వేంకటరాయశాస్త్రులువారి వంటివారు) తలంపవచ్చును. నిజముగా శాస్త్రులువారీవిషయమునుగుఱించియే వారిపీఠికలోను పీఠికానుబంధములోను జాలవఱకు శ్రమపడిరి. వారు చేసినకృషి యంతయు నాంధ్రలోకమునకు మహోపకారమే. అయిన నిటువంటి కావ్యములు శ్రీవారివంటి మహాపండితులు నమలి రసము గ్రహింపఁగలిగినవి గాని సామాన్యవిద్యావంతు లగు నస్మదాదులు గ్రహించి యాస్వాదింపఁగలిగినవి కావు. శ్రీశాస్త్రులువారు దీనిది పక్వపనసఫలపాక మని చెప్పిరి. అగుఁగాక పనసపండ్లలో బురదపనస యనికూడ నొకరకపు పనస యున్నది దానియం దంతయుఁ బీఁచు. అచ్చటచ్చటఁ జిన్నచిన్నతొనలున్నను, ఆతొనలు నమలిన జిగురుముద్ద గొంతునఁ బట్టుకొని మనుష్యుని నుక్కిరి బిక్కిరిచేయును. అట్టిపనసపాకమే దీని దని చెప్పవచ్చును.

భాషాకాఠిన్య మిట్లుండ రసభావములవిషయ మెట్లిది? ఈకావ్యమందలి భావములకు రెండురూపములున్నవి. రోమనదేవుఁ డగు జేనసునకు రెండుముఖము లున్నవఁట. అటులే యీకవి భావప్రపంచము రెండుముఖములు ధరించియున్నది. చక్కనిప్రకృతిస్వరూపము ముగ్ధులొలుకుచు, నిద్దంపుతళుకులు గులుకుచు, సహజసౌందర్యరసముఁ జిలుకుచు వఱలుచున్నది.

రెండవప్రపంచము:—మానవసృష్టి నతిక్రమించి యతటప్రవాహములఁ బోలు నూహాతరంగిణుల నోలలాడి యెక్కొక్కచో లోకోత్తరమనోజ్ఞరూపములు దాలిచియుఁ బలుతావుల వికృతాకారము లగపఱిచియు భావనాశక్తి యతిశయావేశమునఁ జిందులు త్రొక్కుచున్నది ఈరెండుప్రపంచములను సర్వస్వతంత్రుఁడగు నధికారివలెఁ దనకరతలాధీనము చేసికొనెను. ప్రకృతిలక్ష్మినిఁ జిత్రించెడునేర్పసమానము! దాని నతిక్రమించెడు నాతురతయు నప్రతిమానమే! యథావద్వస్తువర్ణనములు చూచిన నీచక్రసర్తిదృష్టిపథమునఁ బడనివిషయము లేనిదైన నీచరాచరప్రపంచమున నున్నవా? యని సంశయింపవలసివచ్చును! లోకానుభవ మతిక్రమించి యుత్ప్రేక్షించునప్పు డీచక్రవర్తి కల్పనాశక్తి యున్నతావస్థనుబొందిన దేమో యని సంశయింపవచ్చును.

ఈయుభయమార్గములను విశదీకరించుపద్యములను బుంఖానుపుంఖములుగఁ జూపవచ్చును. దిఙ్మాత్రముగ నీక్రిందిపద్యముల వీక్షింపుఁడు.

i చక్కనిస్వభావోక్తి:—

చ. తడి తలడిగ్గి ముంప జడతం దుదతెప్పలఁ గన్నుఁబీడి, పు
  ల్పొడుచుచు నీరు ముంగఱల పోలిక ముక్కునఁ గూడ నొటిఁ గొం

తొడియుచు గూటికట్ట సగ మొత్తుచు త్రెక్కవిదుర్చు మున్నుగా
వడకుచుఁగాక చేష్టుడిగి వక్షము పక్షులు జానువుల్ చొరన్.

ii మనోహరమగు నుత్ప్రేక్ష:—

మ తలఁ బక్షచ్ఛటఁ గ్రుక్కి బాతువులు కేదారంపుఁగుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుపస్నాతప్రయాతద్విజా
వళిపిండీకృతశాటు లన్నవిఁ దదావాసంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గ న్వెసఁ బాఱ వానిఁ గని నవ్వ న్వాలిగోప్యోఘముల్.

iii తలచించుకొన్న యుత్ప్రేక్ష:—

చ. జలధర ముప్పుతోఁ బులు సొసంగు రసం బని యప్పయోధి నిం
పొలయఁగఁ గ్రోలి పై దధిపయోధియుఁ గ్రోలఁగఁ బ్రాఁచిడాట చే
న్బులుసుఁ గఱ్ఱఁ గ్రాయ నవెపో వడగండ్లన రాలెఁ గానినాఁ
డిలఁ బడు వానిఁ దిన్నయపుడే చలిఁ బండ్లు వడంగ నేఁటికిన్.

శైలి యందలి మఱియొకవిశేషము:—ఆంధ్రకవులలో శ్రీనాథుఁడే మొట్టమొదటఁ దనకావ్యములో దేశకాలవర్ణనలయందుఁ గొంత ప్రత్యేకతయు యథార్థస్థితియు, నైజప్రకృతిరూపమును Lccal colour and individuality యిచ్చినాఁడు. తన కాశీఖండములో వారణాసీపురవర్ణనమున యథార్థ మగు స్థలజ్ఞానము కాన్పించుచున్నది భీమేశ్వరపురాణమున దక్షారామపురీవర్ణనము గూడ నట్లే యున్నది అపురమును బరిసరగ్రామములను బ్రత్యక్షముగాఁ జూచి యచ్చటి చెట్లు చేమలు పంటలు మున్నగునవి యున్నవి యున్నట్లు వర్ణించి వాని ప్రతిబింబము తీసినాఁడు. హరవిలాసమున నున్న కాంచీపురవర్ణన మాపట్టనమునకుఁ గేవలము ఛాయాపటము తీసినయట్లున్నది. కాలపరిస్థితులవిషయమునఁ గూడ నిట్టిస్వాభావికవర్ణనలే యలరారుచున్నవి. ఈప్రకారముగానే "ఆముక్తమాల్యద" లోఁ గూడ దేశకాలపరిస్థితివర్ణనలలోఁ గవి తాను స్వయముగాఁ గని వినిన యంతయును వర్ణించినాఁడు. శ్రీవిల్లుపుత్తూరువర్ణనమునఁ బ్రత్యేకముగా నాస్థలానుభవము మిక్కిలి చక్కగాఁ జిత్రింపఁబడినట్లు కాన్పించుచున్నది. అట్లె పాండ్యదేశపు రాజసభవర్ణనమును, ఇంక సమకాలికదేశకాలపరిమాణవ్యవస్థలను యథాస్థితముగా ననేకస్థలములఁ బొందుపఱిచినాఁడు. మచ్చునకై యీపద్యమును జూడుఁడు.

చ. రయమున వృష్టికై యొదిఁగి రచ్చలపై విధియింతు రుగ్రతన్
హయపతిమీఁద దంతిపతి నాతనిపై నృపతిం గజాదిని

ర్ణయముల మొత్తులాడుదురు మబ్బొకయించుక విప్ప విచ్చుమొ
గ్గయి మఱి పాఱిపోదురు సమస్తదిశాగతులైన యధ్వగుల్.

దీనియందుఁ దనకాలమున జరుగుచున్న ఘోరసమరములవిషయము నెంత హాస్యగుంభితముగ వర్ణించెనో చూడుఁడు ! నృపతి యగుతానును హయపతి యగుబహుమనీసుల్తానును గజపతియగు కటకరాజును హోరాహోరిగఁ బోరుచుండిరి గదా ! ఈవిషయమును వర్షాకాలవర్ణనలో నిమిడ్చెను!

ఇట్లు సమకాలికవిషయములను దమకావ్యములలోఁ జొప్పించుపద్ధతి కృష్ణదేవరాయలతోఁ బ్రారంభించినను పెద్దన్న, తిమ్మన్న, మున్నగువారియం దంత కాన్పింపదు. ఈవిషయమునఁ బింగళి సూరన్న రాయల నెక్కువగ ననుకరించెను. భావప్రపంచమున నింత సర్వస్వతంత్రుఁడు గా విహరించిన మహాకవి రసనిరూపణమున నొకింత కుంటువడి యుండుట యాశ్చర్యజనకము గదా. తనయాస్థానకవు లగుపెద్దనాదులతో దీటుకొనఁదగు ప్రతిభాగౌరవములు గలిగియు, సర్వజ్ఞబిరుదమునకు నాచనసోమునితో సమానముగాఁ బోటీవహింపఁగల బుద్ధిశాలియు నై యీకవివతంసుఁడు రసవికసనవిషయమున, ముఖ్యముగా శృంగారరసవర్ణనవిషయమున నామేటికవులతోఁ దులఁదూఁగ లేకపోయె నని చెప్పవలసినందుకుఁ జింతిల్లుచున్నాను. ఇతనిశాంతరసవర్ణనము మనోహరముగ నుండి మనహృదయములయందు భక్తి నావిర్భవింపఁజేయఁగలదు. విష్ణుచిత్తుని జీవితవర్ణన మంతయు శాంతరసయుతమే కదా ! "గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికా వహనంబో" ఇత్యాదిపద్యముల నాభక్తిమూర్తి శాంతచిత్తత, యతిమృదులముగ నభివర్ణింపఁబడినది. మఱి వీర, రౌద్ర, భయానక, బీభత్సరసములు తత్తదనుగుణ స్థలముల నధికనైపుణ్యముతోఁ జిత్రించెను. మాలదాసరి యెదురుకొన్న బ్రహ్మరాక్షసుని వర్ణించినభాగము లు చదివిన శరీరము కంపించును. బుద్ధిచలించును.

"ఎలనీటిబోఁడలఁ బులఁబోలె మెదడెల్ల జుఱ్ఱివైచిన డొల్లుపుఱ్ఱెగములు.

ఇత్యాదిపద్యము లుదాహరణములు.

అయినను శృంగారరసవిషయములో మాత్ర మింత ధ్రువముగాఁ జెప్ప లేము. ఆముక్తమాల్యదయు నామెచెలికత్తెలును శృంగారరసప్రసంగములు చేయునప్పుడు హృదయము రసానుకంపన మొందుటలేదు. ఆముక్తమాల్యద విరహోత్కంఠితయై కలవరించుచున్ననుఁ జెలికత్తెలు నిర్వికారముగ నూఱి

డింపుమాటలు పలుకుచున్నను, బారకుని యుల్లంబున ననుకంపాలేశము కలుగుటలేదు. చిత్తరువున లిఖించిన దృశ్యముఁ జూచిన నెంతమాత్రము హృదయస్పందనము కలుగునో యంతియ కాని తాదాత్మ్యరూప మగురసపారవశ్యము కలుగ లేదు. విరహిణి యైనవరూధినీపరిదేవనము వినిన, భవభూతి చెప్పినట్లు "అపిగ్రావారోదం త్యపి దళతి వజ్రస్య హృదయం" అన్నమాటలు యథార్థములగుచున్నవి. రాతిగుండియు చెదరిపోవును. మఱి మానవునిహృదయము కరఁగిన దనిన నెంత ?

అసూయాపరవశ యైన సత్యభామాక్రందనము వినిన నెవ్వరిమనస్సు జాలిఁగొనదు ? అట్టివికారము లెవ్వియు నాముక్తమాల్యదయవస్థలు పుట్టింపఁజాలకున్నవి. ఆముక్తమాల్యదవిరహావస్థను వర్ణించుచుఁ జెలికత్తెలు చెప్పినమాటలు వినుఁడు.

చ. ఎఱుఁగరుగా యొకద్భుతము నీచెలి దీర్ఘికఁ దీర్థమాడ నా
యఱుతఁ దగిల్చి పోవు దనహారము వోయిన నేనుబోవుచుం
మఱవక వెంటఁబోవ జలమగ్నత నైనది సున్నమైనఁ దాఁ
గఱకటెఁ బెట్టి సొమ్మమగుఁ గాని నిజార్తి యెఱుంగ దేమియుం.

మ. అనినన్ స్రగ్విణి వల్లెఁ దన్నుఁ జెలులారా నే లతాడోలఁ జి
క్కన నూపం దెగి వ్రాల దీనిచను ద్రేఁకం బేక్రియం దాల్తునా
యని పట్టం దినమధ్యమార్కరుచిఖద్యన్మంజుకల్ వోని వా
డినపాలిండ్లను బెండుబొమ్మగతి నుండె న్నూఁటుం జుల్లనై !

ఈ రెండుపద్యములలోను రసజ్ఞానముకంటె రసాయనజ్ఞాన మెక్కువగాఁ గవి కనఁబఱిచినాఁడని చెప్పవలసియున్నది. విరహతాపముచే ముత్యము లుడికి పోయి జలక్రీడాసమయమున నీరు తగులగానే సున్నపుగుల్ల విడిపోయినట్లు విడి సున్నమైన దని చెప్పినాఁడు. ముత్యమును సున్నము నొకపదార్థమే యను రసాయనవిషయమును ఋజువు చేసినది గాని, యామె విరహాతిరేకమును మన మనస్సునకు స్ఫురింపఁజేయఁజాలదు. అట్లే యా రెండవపద్యమందలి విషయమును, ఆమెశరీరము విరహానలముచే మిక్కుటమైన వేఁడిమిఁ బొంది క్రీడాడోలికగా నున్న లేఁదీఁగను శోషించి త్రెంపి వేసినదఁట- (కాల్చివేసిన దని చెప్పిన మఱింత బాగుగా నుండునుగదా !!) ఇట్టి విపరీతభావములప్రోవులే యీ కవియొక్క శృంగారరసవర్ణనలు ! ఉద్రేకమునుఁ దదుచితరసభరితశబ్దజాలముచే

సహజముగ వర్ణించుట యీకవి మెఱుఁగఁ డని నా మదికిఁ దోఁచుచున్నది. పెద్దన్న కావ్యమందలి "ప్రాంచద్భూషణబాహుమూలరుచితో" అనియు, తిమ్మన కావ్యమందలి, "ఇందునిభాస్య మైతొడవు లేల ధరింపవు" అనియు నిట్టి రసార్ద్రపద్యములు చాలఁ దక్కువగ నీ గ్రంథమునఁ గాన్పించుచున్నవి. ఉద్రేకావస్థను స్వాభావికముగ వర్ణింపలేనిలోప మీకవియందు ముఖ్యముగఁ గానవగును. కాన నీతనికవిత్వమునందు భావోద్రేకముకంటె భావగాంభీర్యమును, రసవిజృంభణముకంటె బుద్ధిప్రకాశము నెక్కువగాఁ గాన్పించుచున్నవి.

అలంకారములయందుఁ బ్రాయికముగా నర్థాలంకారములే యీకవి వాడియుండెను. ఉపమ, రూపకము, ఉత్ప్రేక్ష, స్వభావోక్తి, అతిశయోక్తి, యిత్యాద్యర్థాలంకారములలో నేదో యొకటి ప్రతిపద్యమునందును జూడనగును. ఉత్ప్రేక్ష లన్నిటికంటె నెక్కువగా నున్నవని యిదివఱలోనే చెప్పితిని. శబ్దాలంకారములు మిక్కిలి యరుదుగాఁ బ్రయోగింపఁబడినవి. అచ్చటచ్చట శ్లేష చక్కగఁ జమత్కారముగ వాడఁబడినది.

శా. అప్పూల్వారిధిచేతఁ బుచ్చికొని కార్యంబైన మున్నొన్న య
య్యప్పూ ల్దాచనియు న్సవృద్ధికముగా నవ్వార్ధికే తీర్పఁగా
నప్పుణ్యాతివిశుద్ధజీవుఁడు నిజాచ్ఛాంగంబులం దోఁచున
ట్లొప్పారె న్శశిబింబగర్భితములై ద్యోచారిశుభ్రాభ్రముల్.

అనుప్రాసములును యమకములును నెచ్చటను గాన్పింపవు. శబ్దార్భటి శబ్దాలంకారవికారముఁ బొందలేదు. కావున నీకవియు శైలివిషయములోఁ బెద్దనాదిమహాకవులదారినే పోయె నని నిర్ణయింపవచ్చును.

ఈకావ్యమందుఁ బద్యశైలికంటె గద్యశైలి నిరుపమానముగఁ దేజరిల్లుచున్నది యని నాయభిప్రాయము. వచనభాగములలోఁ బదలాలిత్యము, అర్థవైశద్యము, అన్వయసౌలభ్యము, మెండుగఁ జూపట్టుచున్నవి. కృష్ణరాయనిగద్యశైలియందు సామాన్యము లగువాడుకపదములనే ముఖ్యముగాఁ గానవచ్చును. వాక్యములు నాతిదీర్ఘములు గాక కవియొక్క యభిప్రాయములను దేటతెల్లముగాఁ దెలుపుచున్నవి. నాచనసోమనాథుఁడు, శ్రీనాథుఁడు మున్నగువారి వక్ర ప్రౌఢదీర్ఘసమాసములను జేర్చి కాని యనుప్రాస యమకాది శబ్దాలంకారముల కొఱకుఁ బెనఁగులాడి గాని వచనశైలి యతికఠినము చేయఁబడ లేదు. పద్యశైలియందుకంటె నీవచనములయందు స్వరమాధుర్య

మెంతయో వీనులకు విందొనరించుచున్నది. గద్యలలో లలితమృదులోక్తులు గూర్పఁగలిగిన గ్రంథకర్త పద్యములలోఁ గర్కశకాఠిన్యమునకుఁ బాల్పడుట యెంతయో విస్మయజనకముగ నున్నది. ఇందలి పద్యములు ధారాళముగాఁ బ్రవహింపలేదని యిదివఱలోఁ జెప్పఁబడినది. కాని వచనము లట్లుగాక శ్రుతిసంతుష్టిదాయకము లగురసస్నిగ్ధపదముల మధురగుంఫనములములుగాఁ జదువం జదువ నానందము హెచ్చించుచుండును. ఈ యుదాహరణముఁజూడుఁడు:—

"అని యిట్లు త్రపాభరంబున నుపాలంభదంభంబుగఁ జేయు పునఃపునస్మరణంబున నంతఃకరణరాగంబు తేటపడం జెలిమిబోటు లీబోటి కైటభారి యెడ నాటుకొన్న కన్నెకస్తూరి లజ్జావశంవదయై......స్మరగర్భంబుగా నిట్లనిరి"

ఇంత మనోహరముగానే యితరవచనములుగూడ రచింపఁబడినవి.

పాత్రపోషణము:— ఈకావ్యమందలి పాత్రపోషణము మనుచరిత్రాది సామాన్యకావ్యములవలె నుండదు. సామాన్యముగాఁ గావ్యములయందుఁ గథాపాత్రలగుస్త్రీపురుషులు తమతమవ్యక్తులను బట్టియు, శక్తులను బట్టియు, యోగ్యతాయోగ్యతలను బట్టియుఁ దమ జీవితచర్యల నిర్ణయించుకొనెదరు, భగవంతుఁడు ప్రత్యేకముగను బ్రత్యక్షముగను, నిగ్రహానుగ్రహసంవిధానము సలుపుచుండుట గానిపింపదు. ప్రవరుఁడు తనసౌశీల్యముచేతను, ఇంద్రియనిగ్రహముచేతను వరూధినీసంపర్కమునుండి తప్పించుకొనియెను. వరూధిని తన యైంద్రియభోగేచ్ఛకు బానిసయై కుహనాప్రవరుని మాయలలోఁబడి తనశీలముఁ గోల్పోయెను. పారిజాతాపహరణమున భగవంతుఁ డగుశ్రీకృష్ణుఁడును సత్యభామయు నున్నగువారు సామాన్యస్త్రీపురుషులవలెనే సుఖదుఃఖములను యోగక్షేమములను గనఁబఱుచుటయు మానుషత్వనియమముల నతిక్రమింపక ప్రాపంచికభోగేచ్ఛాద్యనుభవములను వెలయించిరి. ఇట్లే తక్కినయనేకప్రబంధములందు స్త్రీపురుషపాత్రలు స్వయంవ్యక్తియు స్వయంశక్తియు స్వాతంత్ర్యమును గనఁబఱుపఁగలిగిరి.

ఆముక్తమాల్యదయం దట్లుగాక కథాపురుషుల ప్రవర్తనములు వేఱుగఁ జిత్రింపఁబడినవి. ఈకథయందు భగవంతుఁ డగు మహావిష్ణువే సర్వాధికారి; భగవంతుఁడు సర్వజ్ఞుఁడు, సర్వశక్తుఁడు, సర్వవ్యాపి యను నిర్వచన మీగ్రంథమందుఁ బూర్తిగ నెలకొల్పఁబడినయది. మహావిష్ణువు కార్యాకార్యప్రేరకశక్తిరూపమాత్రముగ నుండక ప్రత్యక్షముగ సాకారరూపము వహించి కథాపురు

షుల పరస్పర జీవితచర్యల నిర్ణయించుచు వచ్చెను ఇతర కావ్యములయందుఁ గథాపాత్రలస్థితిగతులు నాటకరంగము నందలి స్త్రీపురుషుల యన్యోన్య సంయోగవియోగములవలెఁ గాన్పించును. ఈకావ్యమునందలి కథాపురుషులనడవడు లన్నను తోలుబొమ్మలాటలోఁ బ్రదర్శింపఁబడు క్రియాకలాపము వలె గోచరించును తోలుబొమ్మలాటలోఁ దెరపైన నాడుచున్న బొమ్మలన్నింటిని నాడించి పాడించెడుసర్వస్వతంత్రాధికారి వేఱుగ నుండును గదా? అట్లే యీ కావ్యమందును సర్వజ్ఞుఁడు ను సర్వశక్తుఁడు నగుమహావిష్ణువు ప్రత్యక్షముగాఁ గథాపురుషుల నందఱిని జన్త్రసాలభంజికలవలె సల్లాపప్రమోదముల నాడించుచున్నాఁడు. విష్ణుచిత్తుని మధురలో జరుగుచున్న పండితసభకు వెళ్లుమని మహావిష్ణు వానతీయఁగ నతను చదువెఱుఁగని యజ్ఞాని నని యనేకవిధములఁ జెప్పికొనినను మహావిష్ణువు తనరాణియగు నాదిలక్ష్మికిఁ దనయద్భుతఘటనాఘటన ప్రభావముఁ గనఁబఱుచుటకుఁగ నావిష్ణుచిత్తుని వెంటనే సభకుఁ బంపించి పరకాయప్రవేశముచేసినట్లు చదు వెఱుఁగని తనకింకరునిచే మహావాదము చేయించి యాఱితేఱిన పరమతమహాపండితుల నవలీలగా గెల్పించి తనవిజయముఁ బ్రకటించుకొనెను.

"క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నో పకరణే" అను వాక్యము సార్థకమైనది. కథానాయిక యగుగోదాదేవి కాజన్మతః మహావిష్ణుసంసేవనమే పరమావధిగా నుండెను. విష్ణుప్రాప్తి దక్క యామెకు వేఱు జీవనమే లేదు. అట్లే ఖాండిక్యకేశిధ్వజరాజన్యులు౹౦-ఖాండిక్యునకుఁ గేశిధ్వజుఁడు రాజ్యము దిరిగి యిచ్చివేయుటకు నిచ్చగించి బతిమాలుకొనినను మోక్షప్రదాత యగు విష్ణునిసేవదక్క మఱి దేనిని నభిలషింప నని మొండిపట్టు పట్టి తనయమాత్యపరివారముల హితబోధనను సరకుచేయలేదు. కేశిధ్వజుఁడు తాగెలిచినరాజ్యము దనస్పర్థి యగు ఖాండిక్యునికొడుకున కొప్పగించి యపవర్గప్రదాత యగు శ్రీ మహావిష్ణుని పాదసేవఁ జేయ నూల్కొనెను!

యామునాచార్యుఁడు రాజ్యసుఖములలోఁ దగుల్కొని తనపూర్వులగు వైష్ణవభక్తాగ్రేసరుల సంప్రదాయములను విష్ణుసేవాప్రవత్తులను మొదలంట మఱచి శ్రీరంగనాథునిపాదములఁ జూచినమాత్రమునఁ గలలోనుండి మేల్కాంచినరీతినిఁ దనపూర్వవృత్తాంత మంతయుఁ దెలిసికొనెను. మాలదాసరి తాను ప్రభాతసమయంబునఁ బాడిన విష్ణుస్తోత్రమందలి చరమ గీతమాత్రమున బ్రహ్మ

రాక్షసుఁడు తనవికృతాకారముపీడి "ధూమపటలినుండి వెడలుశిఖిఁబోలెఁ జూడఁజూడ వైష్ణవుఁడై నిలిచె సోమశర్మ" అని చెప్పినట్లు స్వచ్ఛమగు వైష్ణవబ్రాహ్మణుండయ్యె. ఇట్లెక్కడఁజూచినను వైష్ణవమహిమయె. స్త్రీపురుషులవ్యక్తి జీవితములు వేఱుగ నగపడవు. విష్ణుప్రభావము లేనిది యొకరిని మఱియొకరు మార్చలేరు తీర్చలేరు. "సర్వం విష్ణుమయం జగత్" అన్నవిధివాక్య మీగ్రంథమందు మూలాగ్రముగ నిరూపింపఁబడినది కావున నీగ్రంథమునకు 'విష్ణుచిత్తీయ' మనుటకుబదులుగా 'విష్ణుశక్తీయ' మని కాని 'విష్ణుభక్తీయ' మని కాని యనిన సార్థక మగు నని తోఁచుచున్నది.

కాఁబట్టి పాత్రపోషణమునం దీకవికిఁ దనప్రావీణ్యముఁ బ్రత్యేకముగ నీగ్రంథమునఁ జూపింపఁగల యవకాశములు తక్కువ మైనవి. అయిన న్లోకవిశేషము మాత్రము గమనింపఁదగ్గది. మహావిష్ణుమాహాత్మ్యమునకు లోఁబడి జీవితములయందలి తదితరచర్యలయందుఁ గథాపురుషులు తమతమప్రత్యేకమానవకర్తధర్మమర్మములను గడుంగడు శ్లాఘనీయముగా నిర్వర్తించుకొనిరి. వారితత్తజ్జీవితప్రవృత్తుల నీమహాకవి యతిమనోహరముగా వర్ణించినాఁడు. విష్ణుచిత్తుఁడు తనయింట నతిథుల నహోరాత్రములు సంతర్పించుట, దేవాలయములలో వటపత్రశాయికి నిత్యకైంకర్యములు చేయుట-అనఁగాఁ బువ్వులమొక్కలకు గొప్పుద్రవ్వుట, నీరువోయుట, దేవ్రనిపాలకి మోయుట, దివిటీపట్టుట- యిత్యాది యూడిగములు చేయుట-తనధర్మపత్నికి వంటింటిపొగచేఁ గన్నులకు జబ్బు రాకుండ నెండుకొబ్బరిడొక్కలను జాగ్రత్తపెట్టి యిచ్చుట, తనపెంపుడుకొమార్తెయగు గోదాదేవియం దపరిమితానురాగముఁ గనఁబఱచుట, యీమొదలైన సుగుణసంపత్తియంతయు నత్యంతహృదయంగమముగా నభివర్ణింపఁబడినది.

గోదాదేవికిఁ దనపెంపుడు తల్లిదండ్రులయందుఁ గలయనురాగపుఁబెంపు తెలిసికొనుట కవకాశము గలుగలేదు. బాల్యము నుండియు నామె జీవితము జనార్దనునిసేవాతాత్పర్యములలో లీనమయ్యెను. ఈయమమానవత్వము నామమాత్రము. కథానాయకుఁడగు శ్రీరంగనాథుఁడువలెనె కథానాయికయు నతిమానుషవ్యక్తి యయ్యెను. ఖాండిక్యకేశిధ్వజులసుచరిత్ర మీయార్యభూమిని జన్మించినరాజన్యవరేణ్యులజీవితచరిత్రముల కెంతయు వాసి తగ్గదు. క్షుద్రజీవనము చేయుచు ధనాశాపిశాచావేశముఁ బొందిన నామమాత్రబ్రాహ్మణుఁడు కట్టకడకు బ్రహ్మరాక్షసుఁ డట్లగునో సామశర్మజీవితము వలన ద్యోతక మగును

బ్రహ్మరాక్షసుఁడన రాక్షసకృత్యములకు నలవడిన బ్రాహ్మణుఁడే యని యీకథయందు విశేషముగ విశదీకరింపఁబడినది.

ఈపైనఁ జేర్కొనినఁ కథాపురుషుల జీవితచరిత్ర వర్ణన లన్నియు నొకయెత్తు శివమతస్థుఁడగు పాండ్యరాజును వైష్ణవభక్తురాలగు నతనిభార్యయు వారిజీవితచరిత్రముల యభివర్ణన మంతయు నొకయెత్తు. ఈచక్కనియుపాఖ్యానము స్వభావసమృద్ధిగాఁ గవిచే నిరూపింపఁబడినది ఈకథయందు మహావిష్ణు వెట్టెట్టో యాత్మగోపనము చేసికొని మనుష్యమాత్రు లెట్లు స్వస్వబుద్ధులతో ముముక్షుమార్గముకొఱ కె ట్లన్వేషింతురో యాదృశ్యము మనకుఁ బ్రసాదించెను. "ద్రవిడమండలంబున మద్భక్తులు తఱచగుటను దద్దేశంబున కొండయుం డతండగుటను, రక్షణశిక్షణంబులు రాజముఖంబునంగాక నేన సాక్షాత్కరించి చేయుమియు" నిట్లాలోచించి మహావిష్ణువు స్వప్రకాశముగ నాపాండ్యరాజునకుఁ గాని యాతనిభార్యకుఁ గాని, యామునాచార్యునకుఁ గాని సాక్షాత్కరించి యాదేశం బీయకయె తనమనోరథంబు నెఱవేర్చికొనఁగలిగెను. ఈ మార్గమును కావ్యమందలి తదితరవిషయములలోఁ గూడ నవలంబించినచో నెంతయో సమంజసముగా నుండెడిదిగదా!

పాండ్యరాజు శైవుఁడగుటచే జంగమదేవరలకు విధేయుఁడై వైష్ణవులను బ్రాహ్మణులను బీడించుచుండెడువాఁడు. ఆతనిపట్టపుదేవి వైష్ణవభక్తురాలు. ప్రాతఃకాలముననే లేచి తులసీపూజచేసియు వైష్ణవకథలు వినియు నేకాదశీదినముల నుపవాసంబులుచేయుచుఁ దనయక్కజమగు విష్ణుభక్తి నిలుపుకొనుచువచ్చెను. ఆమైన నాసుశీలకుఁ దనభర్తయం దనురాగము భక్తియు లేశమంతయుఁ దగ్గలేదు. పతిసేవయుఁ బతిపూజయుఁ బొరపొచ్చెములేకయే చేయుచుండెను. ఇట్లుండ యామునాచార్యుఁడను వైష్ణవవటు వాపాండ్యరాజును శైవమతమునుండి వైష్ణవమతములోనికి మార్చుటకుఁ బూనుకొని యందుకుగా నొకగొప్పమహాసభ నేర్పాటుచేయించి యాసభలో శైవపండితులతోఁ దాను వాదముచేసి వారి నోడించి వైష్ణవమతము స్థాపించి తద్విధముగ నారాజునకు విష్ణునియందు భక్తికుదురునట్లు చేయ నుద్దేశించెను. ఈప్రకారము సభచేయించుట కొఱకు రాజునకు విన్నపము చేయుటకైనను నితరులు వెఱతురు కాని పతివ్రతయగు రాణిమాట కెంతయు రాజు విధేయుఁడగుటచే నామె మాత్రమె యట్టి యసాధ్యపుఁబనికిఁ జొరకొనఁ దగియుండెను. కాన

యామునాచార్యుఁడు మహారాణికి దౌవారికులద్వారా తనసంకల్పము విన్నవించుకొని సభ కావించుకొనెను. అందు యామునుఁ డభ్యస్తవిద్యాసంపన్నుఁడగుటచే శైవమతాచార్యుల నవలీలగా గెలిచి ప్రతిజ్ఞాపూర్వకముగఁ బాండ్య రాజును విష్ణుభక్తిపరాయణుని జేసెను. ఈకథ యంతయు సలలితముగఁ జిత్రింపఁబడినది. ఇందలిపాత్రపోషణ మపూర్వపరిశీలనాశక్తిని వెల్లడిచేయుచున్నది. చక్రవర్తుల యంతఃపురస్త్రీల జీవితములును, వారి యాచారవ్యవహారములును, ప్రజలకు నాయసూర్యంపశ్యలకు నెట్లెట్లు సందర్శనాకాంక్షాఫలములు కలుగుచుండునో యావిషయములన్నియు బహుసూక్ష్మముగ వర్ణింపఁబడినవి. అంతఃపురములో నుండు రాణివాసపుస్త్రీలు కేవల మైంద్రియసుఖ పరాయణులుగా నుండక సామాన్యజనుల కష్టసుఖముల ననురాగదృష్టితో నారయుచు వారి కనేకవిధములఁ దగుద్రవ్యసహాయము చేయుచుందు రని యీచక్రవర్తికవిమూలముగాఁ దెల్ల మగుచున్నది.

శ్రీకృష్ణరాయని ప్రతిభావిజ్ఞానములు:-ఇంతవఱకు నీకావ్యమందలి గుణదోషములను నాశక్తికొలందియు వ్యాసావకాశమునుబట్టియు వివరించితిని. ఇంక మహాకవి శ్రీకృష్ణదేవరాయని ప్రతిభాసామర్థ్యములను జీవితాశయములను సాంఘికరాజకీయాధ్యాత్మికధర్మముల నీప్రబంధమునుండి తెలియవచ్చినంతమట్టుకుఁ గ్రోడీకరించెదను. ఈగ్రంథమును జదువునప్పుడు ముఖ్యముగఁ బ్రతిపాఠకునికిఁ దోఁచునభిప్రాయ మేది యనిన నాగ్రంథమందలి శబ్దబాహుళ్యమును శబ్దకాఠిన్యమును సామాన్యముగ నాంధ్రదేశమందుఁ బేరెన్నిక పొందిన యాంధ్రప్రబంధములలో దేనియందు నీకవి వాడుకచేసినన్ని కఠినపదములు సంస్కృతమునఁ గాని యాంధ్రమునఁ గాని బహుశః శ్రీనాథుఁడు తప్ప మఱి యెవ్వరును వాడు చేసియుండ రని నాయభిప్రాయము. నిఘంటువులు నశించినయెడల నపరూపక (Rare) పదముల బ్రదుకే మగునో యని యీకవి తప్పక వానినే వాడెనో యనునట్లనితరకవిప్రయుక్తము లగుపదములను దఱచు వాడుచువచ్చెను. సామాన్యముగ నితరకవులు 'దవానలము' 'దవాగ్ని' యనునప్పు డితను "దవధుభరము" అనెను. 'కపిల' లేక 'పింగళ' యనుశబ్దమున కితఁడు 'కడార' అని వాడెను. 'అల్పకాల' యనుదానికి 'అల్పానేహః' అనియు 'కరిణి' యనుటకు 'వశా' యనియు, 'సరణి' 'పద్ధతి' అనుటకు 'పద్యా' అనియు నిట్లనేకము లగు నపరూపశబ్దములనే వాడెను.

ఈ కవియొక్క సర్వంకషశబ్దపరిచితినిఁగూర్చి శ్రీ వేంకటరాయశాస్త్రిగారీక్రిందివిధమున నభిప్రాయపడియున్నారు. "ఈయనకు నాంధ్రగైర్వాణకావ్యాదివాఙ్మయ మెల్ల జిహ్వాగ్రగతము. ఇందలి యనుబంధములోని మహాకవి ప్రియశబ్దజాలములను "తృణతా, తెండి, మత్తల్లి, కర్కరీ" యిత్యాదులం గనునది. సంస్కృతశబ్దశాస్త్రపాండిత్య మసాధారణము-శబ్దోపదేశమున నిది మనుచరిత్రకుఁబైది."

మఱి రెండవయభిప్రాయ మేమనిన:-ఈకవియొక్క సర్వస్వతంత్ర ప్రపంచజ్ఞానము-కృష్ణదేవరాయలు చక్రవర్తివంశమునఁ బుట్టి, పెరిఁగి చక్రవర్తియై లోకమందలి నానాతరగతుల సంఘజీవితముల నెట్లు కనిపెట్టఁ గలిగెనో యద్భుతజనకమైనవిషయము. ఈమహాకవికిఁ జరాచర ప్రపంచమునం దేదియుఁ దెలియరాకుండ లేదు. మృగజీవితములు, పక్షిజీవితములు, జలచరజీవితములు, మున్నగువాని నతిసూక్ష్మముగ గ్రహించినట్లు తెలిపెడుపద్యములు గలవు. ఇంక మానవకోటిలో రాజుమొదలు రెడ్డివఱకును, బ్రాహ్మణుఁడు మొద లంత్యజునివఱకు నన్నిజాతులు నన్నివర్ణములు వారివారి జీవితములలో యోగక్షేమములు, కష్టసుఖములు, నాచారములు, నలవాటులు, నిష్టానిష్టములు, వృత్తులు, వేయేల సమస్తవిషయములు నీతనికిఁ గరతలామలకములైనట్లు విస్పష్ట మగు ఋజువులు కాన్పించుచున్నవి. "విద్యలకు నెల్ల నుత్తమవిద్య కవిత దానిఁ దెలియుట విశ్వమంతయును గనుట" యని యప్పకవి చెప్పినమాటలు నిజమయ్యెను.

సూక్ష్మదృష్టిని వాఙ్మయమును బరిశీలించినరీతినిఁ బ్రపంచము నంతనుఁ బరిశోధించినట్లు తెల్ల మగుచున్నది. ఈసర్వస్వతంత్రవిజ్ఞాన మంతయు ననేకసందర్భములలోఁ జూపించినాఁడు. పాండ్యరాజుభార్య యనుదినము చేయుగుప్తదానధర్మములను జూచిన సీమన్నుఱేఁడు తనరాణివాసమున జరుగుచున్నదినచర్యక్రమమును గనిపెట్టె నని చెప్పవచ్చును. ఆవిషయము నిచ్చట నుద్ధరించెదఁ జూడుఁడు.

"నానాదేశాగతదీనానాథవృద్ధభూసురకుటుంబములకు, ధాన్యాజినపటాదులును, వటువులకుం బెండ్లిండ్లకనుపనీతుల కుపనయనంబులకుఁ బంగ్వంధబధిరాదులకు సౌరభేయాదియానంబులు, మఱియుఁ జెఱువు గడమపడియెననియుఁ, బేదగుడులకుఁ బూజ నడువ దనియు, నెడవునం జలిపందిరిడియెద మనియుఁ దిథి చిక్కెననియుఁ, దీర్ఘయాత్ర చనియెద మనియు, వ్రతోద్యాపన

కనియు, నారాణివాసంబు గుప్తాగుప్తప్రకారంబులం బంపు ద్రవ్యంబుఁ దెచ్చి యిచ్చుచుదునప్పగు వర్షధరులచేతులకుం గ్రందుకొని చేసాచిన........"

విష్ణుచిత్తుని బ్రహ్మరథ మెక్కించి మధురాపురమునుండి శ్రీవిల్లిపుత్తూరు తీసికొనిపోవునప్పుడు చేసిన మహోత్సవము ముఖ్యముగాఁ జదివితీరవలెను. ఆవర్ణనము బ్రహ్మరథోత్సవమునకుఁ దగినది కాకపోయినను జక్రవర్తి దిగ్విజయయాత్ర జరిగించి రాజధానియందుఁ బ్రవేశించునపుడు రాజబంధువులు సామంతరాజులు పురజనులు కలసి జరిగించిన యూరేగింపు టుత్సవము కన్నులకుఁ గట్టినట్టు కాన్పించును. ఇట్టి యుత్సవము లెన్నియో కృష్ణదేవరాయలకు జరుపఁబడియుండును. ఆయుత్సవములలో జరుగు ప్రతివిశేషమును సూక్ష్మపరిశీలనక్రమమున మనకన్నుల యెదుట జరుగుచున్నట్లు చిత్రించినాఁడు. ఈవర్ణనము పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు జైమినిభారతమున వ్రాసిన దండయాత్రవర్ణనతో సరిచూడవచ్చును. ఇట్టివర్ణనలను గ్రోడీకరించి మనము ప్రత్యేకముగాము ద్రించిన,ప్రాచీనకాలమందలి హైందవరాజకీయజీవితదృశ్యములు సినిమాపటములవలె మనయనుభవములోనికి రాఁగలవు.

పల్లెటిగ్రామములలో నున్న కర్షకులవృత్తి జీవితములను వివరించు విశేషము లనేకసందర్భములలోఁ జెదరి యున్నవి. వారి యిండ్లతీరు, వారి భోజనపదార్థములు, వేఱువేఱు ఋతువులలో వారెట్లు కాలము గడుపుచుందురో వారి విహారములు, వినోదములు, నాటపాటలు, నివన్నియుఁ, బూసగ్రుచ్చినట్లు సూక్ష్మాంశములతో నచ్చటచ్చట నభివర్ణింపఁబడినవి.

మ. గురుగుం జెంచలిఁ దుమ్మి లేదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁబొరంటి నూనియలతోఁ గట్టావికుట్టారికో
గిరముల్ మెక్కి తమిం గొమల్ పొలమువోఁ గ్రేపుల్ మెయుల్నాక మే
కెరువుంగుంపటిమంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్.

వీనియన్నిటికంటె మహత్తరచిత్రమైన విషయ మొకటి కలదు. దానినిఁ జదివినఁ గడుంగడు నచ్చెరువు కలుగుచుండును. మాలదాసరి బ్రహ్మరాక్షసుని యుపాఖ్యానములో బీదబ్రాహ్మణుఁ డెట్లు డబ్బు సంపాదించి కూడఁబెట్టుకొనెనో యావర్ణన మతిచిత్రముగా నున్నది. గ్రంథవిస్తరభీతిచేఁ గొంచెముమాత్ర మిట నుదహరించెదను.

"సీ. బహువర్ణద్విజు నకల్పపుఁ బాదితం బిడి
పసిఁడికై తా వాని బంతిఁ గుడిచి" (ఆ 6 పద్య 69)

ఇట్లనేకనిదర్శనములు చూపవచ్చును. వీనిని బట్టి యీకవియొక్క నానారూపవిజ్ఞానము తెలియవచ్చుచున్నది. ఈమహాకవి సూక్ష్మపరిశీలనలోఁ జేరనివి మఱియు లెవ్వియైన నీపృథివియం దున్నవా యని సంశయింపఁ దగినంతసర్వంకషప్రజ్ఞ యీతనియందుఁ గానంబడుచున్నది.

ప్రజలపట్ల సానుభూతియు, నానావర్ణజాతులయం దనురాగమిశ్రితాదరణయు, ముఖ్యముగా దేవబ్రాహ్మణభక్తియు నీభూజానియంతఃకరణమందు స్థిరముగా మొలచి యున్నవి. ప్రజాపీడన మనిన నీపుడమిఱేఁ డెంత భయపడెనో యీతఁడు రచించిన రాజనీతిక్రమమును జదివిన బోధపడఁగలదు.

క. ఏపట్టున విసువక రం, తూపరుఁడవు గమ్ము ప్రజల చక్కి విపన్నుల్
గూపెట్టిన విని తీర్పుము, కాపురుషులమీఁద నిడకు కార్యభరంబున్.

గీ. దేశవైశాల్య మర్థసిద్ధికిని మూల, మిలయొకింతైన గుంటకాల్వలు రచించి
నయము పేదకు నరిగోరునను వొసంగి, ప్రబలఁ జేసిన నర్థధర్మములు పెఱుఁగు.

క. త్రివిధోత్పాతము లొదవిన, నవనివిభుఁడు విడువవలయు నధికద్రవ్యం
బవనీసురముఖసురముఖ, పవనసఖముఖములభుక్తి బలిహోమవిధిన్.

ఈయవనీశుని రాజనీతిక్రమ మీగ్రంథమందు విధించినదానికిని బ్రసిద్ధముగాఁ దనరాజ్యమందుఁ దాను నిర్వహించినదానికి నించుకైనను భేదము లేదు. ప్రబంధనిర్మాత యగుకృష్ణదేవరాయఁడు నాంధ్రసార్వభౌముఁ డగుకృష్ణదేవరాయఁడు నొక్కఁడే యని ఘంటారవముగాఁ జెప్పవచ్చును.

కాని మతవిషయమం దట్లు చెప్పుటకు వీలు లేదు. మతాభినివేశమున నాముక్తమాల్యదకర్తయుఁ జరిత్రపురుషుఁ డగుశ్రీకృష్ణదేవరాయలును వేఱు మనుష్యులుగాఁ జెప్పవలసియున్నది. తనరాజ్యపరిపాలనమందుఁ జూపిన పరమత సహనమును దనగ్రంథమందుఁ జూపిన పరమత దుస్సహనమును—ఈరెంటిని సరిపెట్టుట కవకాశము లేకున్నది. శ్రీశైలమందు మల్లికార్జునస్వాములవారికి, నమరావతియందు నమరేశ్వరునకు, ద్రాక్షారామమున భీమేశ్వరునకు భూరిదానములు చేసిన యీహిందూమహాచక్రవర్తి తనగ్రంథమం దెట్లు శైవమతగురువుల నిష్కారణముగా నిరసించి దూషించెనో చెప్ప వీలు లేకున్నది. శైవాచార్యుల నందఱిని 'శ్రేలెడుదుర్మదాంధు ల'ని నికృష్టముగాఁ దిట్టినాఁడు. గ్రంథమం

దుఁ జూచిన కృష్ణదేవరాయలు వీరవైష్ణవుఁడు. చరిత్రయందుఁ జూచిన కృష్ణదేవరాయలు సర్వసమహిందూమతస్థుఁడు. ఈభిన్నప్రకృతి తీక్ష్ణముగా మతవిషయములయందుఁ గాన్పించుచున్నది.

శ్రీనాథుఁడు ప్రత్యేకముగా శైవగ్రంథముల వ్రాసెను. కాని వైష్ణవులను దూషించుట లేదు. శ్రీకృష్ణదేవరాయ లట్లుచేయక శైవమతదూషణముఁ గావించెను. వీరవైష్ణవముఁ బ్రకటించిన యాంధ్ర గ్రంథములలో నిదియే మొదటిది.

ఉపసంహారము:—ప్రపంచమం దెక్కడఁ జూచినను మహాచక్రవర్తులు గ్రంథములు వ్రాయుటయే యరుదు. అందు ముఖ్యముగాఁ బద్యకావ్యములను వ్రాయుట యెక్కువయరుదు అట్టివిషయములో నాంధ్రవాఙ్మయమున కొక యమూల్యాలంకార మనఁదగు పద్యకావ్యరాజమును రచించిన యుత్కృష్టభాగ్య మొకయాంధ్రమహాచక్రవర్తికిఁ గలుగుట యాంధ్రుల యలభ్యయోగ మనిసర్వదా కొనియాడఁదగియున్నది.

ఈమహాకావ్యము రసవంత మయినపద్యకావ్య మగుటయే గాక గీర్వాణాంధ్రభాషావైదుష్యములకు నికషోపల మనియుఁ జెప్పఁదగియున్నది. భాషావిషయమునఁ బారంగతత్వముఁ బొందిన దని చెప్పినను గూడ దీనిప్రాశస్త్యవర్ణనము పూర్తి యగుట లేదు. ప్రాపంచికవిజ్ఞాన ప్రదర్శనమునఁ గూడ నగ్రస్థాన మలంకరింపఁదగి యున్నది. కావున నీకావ్యమతల్లి మూఁడువిధములగు యశోభూషణంబులను ధరించి యాంధ్రమహాజనులహృదయసీమల నద్భుతామోదములు పెంపొందించుచున్నది.

తీఱిక లేని చక్రవర్తి తీరుబడి చేసికొని యీకావ్యకన్య నలంకరించిన కతనఁ గొంతవఱకు రూపరేఖావిలాసములలోఁ గొఱవడుట తప్పినది కాదు. ఆయొచ్చెము లన్నియు జనకు ప్రమాదాలసతజనితంబులు. "ప్రమాదో ధీమతామపి" యని యార్యన్యాయము. ఏది యెట్లున్నను రాజకుటుంబములో జనించిన కన్యకాలలామలు సహజలక్ష్మీసంపన్నలు కదా. వారి లోపముల నెంచుట యెరికిఁ జెల్లు? కాన కించిద్దోషలేశము లున్నను జాతిరత్నములవలె నిట్టికావ్యపుత్రికలు సర్వజనసమాదరణీయములే. అట్లే యీకృష్ణరాయకవీంద్రుని కావ్యేందిర నిత్యసంస్తవనీయమై శాశ్వతకీర్తిని నెగడొందుఁగాక !

---

# శివయోగసారము.

మారేమండ రామారావుగారు బి. ఏ. ఆనర్సు. బి. ఇడి. రాజమహేంద్రము.

చరిత్రమునకును మతమునకును గూడ మిక్కిలి ముఖ్యమగు నీగ్రంథము చరిత్రకారులదృష్టి నాకర్షింపలేదు. ఇయ్యది పూర్వోత్తరభాగములు గలది. ఒక్కొక భాగమున నాల్గాశ్వాసములు గలవు. ఇందలి యుత్తరభాగము వారంగల్ శైవప్రచారిణీమండలివారిచే ముద్రింపఁబడినది. హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధకమండలివారియొద్దఁ బూర్వార్ధ చతుర్థాశ్వాసమును రాజమహేంద్రవర గౌతమీగ్రంథాలయమున మొదటి మూఁడాశ్వాసములును గలవు. పైగ్రంథాలయప్రతి యరుదైనది. శిథిలావస్థలో నున్నది. సుమారైదుమాసములకుఁ బూర్వము నేను జూచినపు డందలి నాలుగైదుపుటలలో నెడమవైపున నొక యంగుళముభాగము మాత్రము పోయినది. కొలఁదిదినములక్రిత మీవ్యాసమును రచించునపుడు తిరిగి యాగ్రంథమును బరిశీలింపఁగా నాఱవపుటలో సగముభాగ మదృశ్యమై యితరస్థలములలో గొన్ని క్రొత్తశిథిలము లేర్పడినవి. గ్రంథమునఁ గొన్ని తప్పులు కూడ గలవు. ఆంధ్రలోక మీగ్రంథమునుగూర్చి జాగ్రత్తదీసికొనవలసియున్నది.

కృతికర్త:—ఈగ్రంథమును రచించినవాఁడు గణపతిదేవుఁడు. అవతారికలో నీతఁడు తనవంశమును వర్ణించి యందుఁ దనకుముందుండిన వంశీయులను బేర్కొనియున్నాఁడు. మహావిష్ణువునకు బ్రహ్మపుట్టెను. ఆతనికి గౌండిన్యముని జన్మించెను. కౌండిన్యగోత్రమున నానగార్యుఁ డుద్భవించెను. ఆతనికిఁ బెదమల్లన పినమల్లనయను నిర్వురుసుతులు గల్గిరి. అందు, పెదమల్లన సోమపెదగన్నయలను పుత్త్రులను బడసెను. వీరితల్లి పోచమాంబిక. సోమయకు అప్పాంబికయందు మనుమగన్నయ గల్గెను. పెదగన్నయకు గౌరమవలన అన్నయదేవుఁడు పుట్టెను. మనుమగన్నయకు మల్లమాంబికవలన రుద్రుఁడు, ఇమ్మడిరుద్రుఁడు, ముమ్మడిరుద్రుఁడు నను ముగ్వురుసుతులును,సోమాంబికయను కూఁతును గల్గిరి. ఇందు రుద్రుఁడు గౌరాంబికను బెండ్లాడి గణపతి, పోబలుఁడు నను తనయులఁ గాంచెను. ఈగణపతి అన్నమాంబ నుద్వాహమై మల్లమ, గౌరమయను దుహితలను, అన్నయ, రుద్రుఁడు, ఆదిమూలుఁడు ననుపుత్త్రులను గాంచెను. ఆదిమూలునికి లక్కమాంబవలన జనించినవాఁడు గణపతిదేవుఁడు. ఈతఁడే శివయోగసారరచయిత.

కవివంశమునకు కొలనివారనియు, నిందులూరివారనియు నామములు గలవు. దీనికి మూలపురుషుఁడగు నానగార్యుఁడు "ఇందులూరివిభుఁడు" అన్నకొండపురిలో నివసించుచు మిగుల విఖ్యాతుఁడైయుండెను. దీనినుండి యీనానగార్యుఁ డిందులూరు నగ్రహారముగనో లేక నాయంకరముగనో యనుభవించుచుండెననియు, నందుచే నాతనివంశమున కిందులూరివా రనునామము వచ్చెననియుఁ దోఁచుచున్నది. ఈవంశీయులలో మూఁడవపురుషాంతరమువాఁడగు సోమయ కాకతీయగణపతిదేవచక్రవర్తి వెలనాఁడు దండయాత్రలలోఁ బాల్గొని కొలనిపురమును జయించి యంతటినుండియుఁ గొలని సోముఁ డని పేరొందెను. ఈతనికిఁ దరువాతవార లీ'కొలని'శబ్దమునే గృహనామముగ స్వీకరించిరి. దానఁజేసి శివయోగసారగ్రంథకర్త కొలని గణపతిదేవుఁ డగుచున్నాఁడు. ఈతఁడు కౌండిన్యగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు రాయచౌహత్తమల్ల, అభినవకామధేను, అన్యాంగనాసహోదర- బిరుదవిభ్రాజితుఁడు, నూతన కవితానిపుణుఁడు. శివయోగసారముగాక నీకవి పశుపాశపతిజ్ఞానము, అశరీరభవజయము, మనోబోధయను కృతులను 'దేశ తెనుఁగున' రచించెను. కలకంఠుని కరుణచే నీతఁడు జనులౌనౌనని పొగడఁ 'గృతుల నాటకముల నేర్పున' రచనగావించెను. ఇంతకుమున్నే 'శివయోగసారసముచ్చయము' వ్యాప్తిలో నుండెనఁట. దానినాధారముగఁ జేసికొని, కవి తనగురుఁడును, శివయోగసార కృతిభర్తయు నగు నూకనార్యునికృతి మాతృకగా శివయోగసార మను గ్రంథమును రచియించెనని తెలియుచున్నది.

కొలని గణపతిదేవకవి కాలమును నిర్ణయించుటకుఁ గొన్నియాధారములు గలవు. గ్రంథారంభమునం దీకవి సంస్కృతకవులను నుతించి, నన్నయ తిక్కన సోమనాధ చక్రపాణి రంగనాది యాంధ్రకవులను నుతించియున్నాఁడు. దీనినిబట్టి యీతఁడు క్రీ. శ. 13 వ శతాబ్దికిఁ దరువాత నుండె నని తెలియుచున్నది. కొలనివంశీయులలో నీగణపతిదేవుఁ డెనిమిదవతరమువాఁడు. ఈతని ముత్తాతకు జ్యేష్ఠుఁడు నైదవతరమువాఁడునగు కొలనిరుద్రదేవుఁడు కాకతీయ ప్రతాపరుద్రచక్రవర్తికడ సేనానిగనుండి క్రీ. శ. 1326 లో నొకధర్మమును జేసినటు లొకశాసనమునుండి తెలియుచున్నది. అప్పటినుండియుఁ దరమునకు ముప్పదేండ్లవంతున లెక్కించినచో, కొలని గణపతిదేవుఁడు క్రీ.శ. 15 వ శతాబ్దిప్రథమపాదమునం దుండె నని స్పష్ట మగుచున్నది. సుప్రసిద్ధాంధ్రకవియగు

శ్రీనాథు నీగణపతిదేవ్రఁడు స్మరింపకుండుటగూడ నీతఁడు శ్రీనాథునకిఁబూర్వుఁడనియే దెల్పుచున్నది.

కృతిభర్త:—ఇందులూరి నూకనారాధ్యుఁడు శివయోగసారమును గృతి నందెను. గ్రంథావతారికలో నీతనివంశప్రశంసగూడఁ గలదు. వేఁగినాఁటిలో హారీతగోత్రజుఁ డాపస్తంబసూత్రుఁడునగు నూకనార్యుఁడు ప్రసిద్ధివహించెను. ఈతని తనయుఁ డగు బల్లప్రెగడ సిరవద్యాపురరాజులకడ నమాత్యుఁడుగ నుండెను. తత్సుతుఁడు నాగమంత్రియు నిడుదవోలిచక్రవర్తుల కమాత్యుఁడుగనే యుండెను. అతనికి కొమ్మాంబయందు నూకరాజుజనించి కొమ్మాంబను బరిణయమయ్యెను. ఈదంపతులకు నాగయవల్లభేంద్రులను సిర్వరుతనయులు గల్గిరి. ఇందు నాగయ 'రాయచౌహత్తమల్ల'బిరుదాన్వితుఁడై కొలని రుద్రదేవునిపౌత్రియు గణపతిపుత్రియునగు గౌరియనునామెను బెండ్లాడెను. ఈతఁడు ధర్మార్థకామములను సాధించి తుదకు సన్న్యసించి, కాశీక్షేత్రమునఁ బాశుపతవ్రతదీక్షనుండి మోక్షమునందెను. ఈనాగయమంత్రికి నూకయ పుట్టెను. ఈతఁడు పూడికొమ్మరాజుపుత్రికయగు గౌరిని బిదప లక్ష్మీదేవిని బెండ్లాడెను. మహాపండితుఁడగు తండ్రికి శుశ్రూష యొనర్చి యీతఁడు "సకలవేదపురాణశాస్త్రార్థసారవిజ్ఞాతయు, నాధ్యాత్మసంవేత్తయు నై," 'చన్నగురుసదాశివయోగినాఁ' బరగుచు 'కాశికాదేశముఖ్యప్రదేశములఁ జరించి కులకోటుల నుద్ధరించె'ను. దీనినుండి గణపతిదేవకవి నూకనమంత్రికి సన్నిహితబంధువును, "ఇది శ్రీగురు చన్నసదాశివయోగీంద్రపాదారవిందసుధాకరాయమాన"యనుగద్యమునుండి శిష్యుఁడును గూడ నైయుండెనని స్పష్టమగుచున్నది.

చారిత్రకాంశములు:—శివయోగసారమునుండి యనేకచారిత్రకాంశములు వెలువడుచున్నవి. ఇందుఁ గొన్ని యితరప్రమాణములను బలపఱుచునవిగను మఱికొన్ని నూతనములుగను గన్పడుచున్నవి. (1) కాకతిరుద్రునకిందులూరి పెదమల్లన పినమల్లనయను సచివులుండిరి. వా రాతనిచే నాయకత్వములను బడసి యోరుగల్లునం దుండిరి. (2) రుద్రుఁ డోరుగల్లును గట్టించెను. హానుమకొండ రుద్రేశ్వరాలయశాసనములో నీరాజు తానుజయించిన శత్రునగరముల పేరిట నోరుగల్లులో విభాగములను నిర్మించెనని చెప్పఁబడి యున్నది. ... లో నానగరము రె... నిర్మింపఁబడె యున్నది. శివయోగసార మీవిషయ మవిశ్వసనీయ మని చూపుచున్నది.

(3) గణపతిదేవచక్రవర్తికడ దండనాథుఁడుగనుండి కొలని సోముఁ డారాజు వెలనాఁడుకళింగదండయాత్రలలోఁ బాల్గొనెను. ఇది నూత్నాంశము. (4) పెదగన్న, మనుమగన్నమంత్రులు రుద్రాంబికకాశ్రితులై యనేకసమరములలో విజయ మందిరి (5) "బాహత్తరిదుర్గంబులు, సాహసులై రుద్రమాంబశౌర్యము కతనన్" అను పద్యభాగమును బట్టి రుద్రమదేవి దా స్వయముగ యుద్ధరంగముల కేగుచుండెనను క్రొత్తవిషయము దెలియుచున్నది. (6) ఇందులూరి అన్నయదేవుఁ డొకశైవయోగి కపరావతారము (7) అన్నయరుద్రులు ప్రతాపరుద్రచక్రవర్తికడ నాయకులుగ నుండిరి. (8) అన్నయ రుద్రాంబకూఁతురగు రుయ్యంబను బెండ్లాడెను. ప్రాచీనచరిత్రములందలిగాథ నీవిషయము బలపఱుచుచున్నది. (9) అన్నయదేవుని బిరుదములు, విజయములు అపూర్వవిషయములు. (10)రుద్రదేవుని పాండిత్యము, విజయములు,బిరుదములు నూతనవిషయములు. (11) ఈరుద్రుని సోదరి యగు సోమాంబిక కాకతిరుద్రునిమంత్రి యగు విద్ధిరాజునకు భార్య. (12) విడుదవోలులో నొకరాజవంశ ముండెడిది. ఈరాజులకడ శివయోగసారకృతిభర్త యగు నూకనమంత్రిపూర్వులు మంత్రులుగ నుండిరి. (13) రుద్రాంబ గణపతిదేవుని పుత్రిక.

వ్యక్తికచరిత్రము—ఇంతవఱకును శివయోగసారకృతికర్తృభర్తలను గూర్చియు, నాగ్రంథమునుండి తెలియ నగు నూతనచారిత్రకాంశములను గూర్చియు వ్రాసియుంటిమి. ఇందులూరివంశీయులచరిత్రమునకును గాకతీయులచరిత్రమునకును సన్నిహితమగు సంబంధము గలదని యింతవఱకును స్పష్టమైనది. ఈవంశమునందలి పురుషుల చరిత్రమునుగూడ సంగ్రహముగఁ బరిశీలింపవలసి యున్నది—

(1) సోమమంత్రి—'సకలవేదశాస్త్రసంపన్నుఁడు'. ఈతఁడు బహుసైన్యసమేతుఁ డై "యేకశిలాపురితూర్పుదిక్కునంగలరిపుభూములెల్లఁ'గొనెను. (నెరికాడి) మండలీకులఁ నవలీలఁదోలెను. గోగులనాడు, కొలనివీడునను దుర్గములను జయించెను. గోదావరినిదాఁటి 'పన్నెండుమన్నియములనోడిచి', కళింగరాజుల రాజ్యమునఁ గొంతభాగమును జయించెను.

(2) ఇందులూరిఅన్నయ—మహాపరాక్రమశాలియగు నీతఁడు పన్నెండువేలరౌతులకు నైదులక్షలకాలుబలమునకు నధిపతిగనుండి యోరుగల్లుప్రాగ్ద్వారము మొదలు సింహాచలమువఱకునుగల ప్రదేశమును బాలించుచుండెను. యో

పూరిరాజుల నోడించెను. వేఁగినాఁటిలో సూరపురమును, యోలచెర్లాది డెబ్బదిరెండుదుర్గములను జయించెను. ఆర్వేలశూరులతో, కళింగరాజగు గజపతితోఁబోరి యాతనిని బాఱఁదోలెను. దక్షిణదేశమునకేగి పంచపాండ్యులను జయించెను. తురకలను బలాయితులఁజేసి ప్రతాపరుద్రచక్రవర్తిచే బహూకరింపఁబడెను. ఈయన్నయదేవునికి 'మూరురాయరజగదాదిగండ, జగమర్త్యగండ, సమ్మెటనారాయణ, కలియుగభీమ, మండలికఘంటానినాద, రాయచౌహాత్తమల్ల, స్థలగిరివనదుర్గజలకోటమల్ల' మున్నగుబిరుదము లనేకము లుండెడివి. మహాదైశ్వర్యసంపన్నుఁడయ్యు నీతఁడు బంధులయెడ నెక్కు డాదరమును జూపి వారిని దనయధీనమునం దనేకోద్యోగములలో నుంచెను. పైతృకములగు కొలనిపురమున్నగువానిపైఁ దనయన్నకుమారుఁడగు రుద్రదేవుని, రాజమహేంద్రవరదుర్గమునఁ దనమేనమఱఁది యగు పర్వతమల్లును, దనయన్నయల్లుఁడగు తేవన నోలచెర్లదుర్గమునను, నూజెళ్ళలో బంధువులగు మంగిరాజసింగరాజులను, నిల్పెను. అన్నయదేవునకు లకుమాంబ, అద్రిజ, యను దారలు కులసతులు. వీరలు గాక నీతఁడు కాకతీయరాజ్ఞి యగు రుద్రాంబిక తనయ యగు రుయ్యాంబను గూడఁ బెండ్లాడెను. ఇటులు బలపరాక్రమములతో శోభించుచుఁ గాకతీయరాజన్యులకు సన్నిహితబంధువై యీమహామంత్రి రాజగౌరవము భోగములననుభవించుచుండెను. ఈతనికి "అయిదువన్నెలగొడుగు, వింజామరలు, గజసింహకేతువులు, గంధవారణము, ఐదుఘంటలు, పులితలాటము, ప్రధానఘోటకము" మున్నగు రాజలాంఛనము లుండెడివి. ఇట్టులుండియు నీమంత్రి యాముష్మికమును మఱవక కళింగమునందలిమహేంద్రగిరిమొదలు కృష్ణానదీతీరమువఱకునుగల భూభాగమునఁ గూపారామతటాకాదిప్రతిష్ఠల ననేకముల నొనర్చెను.

(౩) ఇందులూరి రుద్రుఁడు—ఈతఁ డన్నయదేవుని కన్నివిషయముల నెనయయ్యెను. ఈతనికి, కొలనిపురము కేంద్రస్థానము. చేబ్రోలు, పదినపురము, దేవపురపుకోట, కంచెర్ల, ఓలచెర్ల, నూజళ్ళ, శూరవరము, రాజమహేంద్రవరము, కురుమతుగుకోట, చామర్లకోట, పిఠాపురము, బోడసకుఱ్ఱు, బెండ్లపూడి మున్నగు స్థలము లీతనిస్వాధీనమునం దుండినవి. ఈతఁడు 'కాళింగరాయవిభాళుఁడు' 'వీర(మా)కారవసుంధరవిక్రమేశబల్లహులు నోఁదగిన పంచపాండ్యరాయ మానమర్దనుఁడు' కలుకోటను జయించి యాతఁడు

కాకతిభూపాలుని మెప్పువడసెను. ఈరుద్రదేవునకు 'బాహాత్తరిదుర్గనాయక, రాయచౌహత్తమల్ల, ఇరువత్తుగండ' మున్నగుబిరుదము లుండెడివి. శౌర్యమునకుఁ దోడుగ నీమహనీయునకు నిరుపమమగు వైదుష్యముగూడఁ గలదు. సకలాగమప్రాజ్ఞుఁడని యీతనిని సద్విప్రులెల్ల నుతించుచుండిరి. "శైవవైష్ణవసిద్ధాంతశాస్త్రవేది" యు, "సదమలోపేత దర్శనజ్ఞానమూర్తి" యు నగు నీతనిని "నరులెల్ల వ్యాకరణబ్రహ్మ"యని కీర్తించుచుండిరి. బంగారునకుఁ దావివలె నీతనిశౌర్యవైదుష్యములకు, వితరణాసక్తి వన్నెఁదెచ్చెను. "అనుపమచరితుఁడగు రుద్రనరేంద్రుని కరాళవారిధారలచేఁ దనియని భూపతిసుతులును, దనియని ధరణీసురులును ధరణిఁ గలరే" యనుటనుబట్టి యీతని మహత్త్వము వెల్లడి యగుచున్నది. ఈరుద్రదేవుఁడు "బ్రహ్మణ్యరాజు"గఁ బేర్కొనఁబడియున్నాఁడు.

సమస్యలు — శివయోగసారావతారికయందలి విషయములనుండి కొన్నిసమస్యలు బయల్వెడలుచున్నవి. వానిలో ముఖ్యమైనవాని నిటఁ బేర్కొని మఱియొకవ్యాసమున సవిమర్శముగఁ జర్చింతుము- (1) ఇందులూరన్నయదేవునకును ప్రతాపచరిత్రాదులందలి శివయోగయ్యకును సంబంధ మేమైనఁ గలదా ? (2) ముమ్మడంబ రుద్రాంబికకుఁ బుత్రికయేనా ? (3) ప్రతాపరుద్రచక్రవర్తి తండ్రియగు మహాదేవరా జెవ్వఁడు ? (4) శివయోగసారకృతిపతిపూర్వికుల కాశ్రయమొసంగిన నిడుదవోలిపాలకు లెవరు ? (5) ప్రతాపరుద్రునికిఁ గాకతీయరాజ్యాధిపత్య మెట్లు వచ్చెను ? (6) కాకతీయులవైవాహిక సంబంధములు ? (7) కొలనిరుద్రదేవుని వైదుష్యము.

(సశేషము.)

# గ్రం స్వీకారము.

1. యమున—ఇది యనువాదగ్రంథమండలి వారు ప్రకటించెడు గ్రంథములలో మొదటిది. ఈగ్రంథమండలి సంపాదకులు శ్రీ మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రిగారును, శ్రీదార్శనికపండిత నేరేళ్ళ నారాయణమూర్తిగారును. ప్రచురణస్థానము విశాఖపట్టనమండలములోని పాలకొండ. మండలీసంస్థాపకులు శ్రీ యెఱ్ఱాపాత్రుని కూర్మినాయుఁడుగారు. వంగభాషలోనుండి సంపాదకులలో నొకరగు శ్రీ రామచంద్రశాస్త్రిగారిచే నాంధ్రీకరింపఁబడినది. ఈయనువాద సమితివారు యథామూలముగనే కాక యేది యెట్లనువదించిన రసవంతముగ నుండునో యట్లనువదించుచున్నారు. కథాభిధానమునను, పాత్రతత్త్వమునను మూలగ్రంథకారుని ముఖ్యాభిప్రాయమునను గూడ మార్పు లవసరము ననుసరించి మార్పు చేయుచున్నారు. భాష యీకాలపు గ్రాంథికము. ఇట్టి యనువాదగ్రంథములు రెండేసిమాసముల కొక్కటిగాఁ బ్రకటింతురు. ఇంచుమించు 250-300 పుటలుగల నవల యాఱణాల వెలకుఁ జందాదారులకుఁ బంపుచుందురు. భాషాసేవయే ముఖ్యోద్దేశముగాఁ గలవారు గావుననే చవుకగా నిచ్చుచున్నారు. యమున నాలుగుఖండములును 218 పుటలును గలది. అచ్చు చక్కనిది.

2. ప్రేమ—అనువాదగ్రంథమండలి రెండవగ్రంథము. హిందీభాషనుండి దార్శనికపండిత నేరేళ్ళ నారాయణమూర్తిగారిచే నాంధ్రీకరింపఁబడినది. పాలకొండతాలూకా తలవరము నివాసులు శ్రీ గేదెల శ్రీరాములునాయుఁడుగారు ప్రధానపోషకులుగానుండి యీప్రేమ ముద్రణవ్యయము నొసంగి యౌదార్యమును భాషాభిమానమును బ్రకటించుచున్నారు. ఇదియు సుమారు 200 పుటలుగలది. వీని వెంట ననుబంధగ్రంథములు కూడఁ బ్రకటించుచుందురు. రసవంతముగా నుండుటకై మూలగ్రంథకారుని ముఖ్యాభిప్రాయములలోఁ గూడ మార్పుచేయసాహసించిన యీసంపాదకులు, ఖగేనుఁడు మొదలగు కొన్ని పేరులనుగూడ మార్చుటకుఁ దలఁతు రని నమ్ముచున్నాము. సవరణలలో, మరిదిగారూ! అనుదానిని మరదిగారూ అని సవరించిరి. అందు సవరణయవసర మైనచో మఱఁదిగారూ అనిన లోప మేమికల్గునో! మరదిగారను

నది నిర్దుష్టమా ! అయిష్ట మనిష్టమని సవరించిరి. తప్పుపట్టుటకుఁ గాదుగాని భాషాభిమాను లగు వీరు, కొందరైన- కథాసంవిధానమేకాక, భాషాసౌష్ఠవమునుగూడఁజూడఁదలఁచువారు కూడ నుందురు గావున నర్ధానుస్వారశకట రేఫములనుగూడఁ బాటించి సర్వాంగసుందరముగా గ్రంథములను బ్రకటించుచుందు రని కోరుచున్నాము. అవి పాటింపకున్న నిబ్బందియేమందురా తాము లపాకులు, యీలకులు, విద్యుద్ద్వన-(రూపాయినోటు) ఇట్టివియు సవరణలోఁ జేర్పనక్కఱలేదు. మామాటలు నచ్చెనేని యట్లుచేయవచ్చును. లేదేని మానవచ్చును. యోజింపఁగోరెదము.

చందాదారులకు గ్రంథము వెల రు 0-6-0. ఇతరులకు రు 0-10-0. ఇంతచవుకగా నేగ్రంథప్రకాశకులును బాపుటలేదు. ఇది నిక్కముగ వీరిభాషాభిమానమే.

---

3. విచారసంగ్రహము—సాధుధ్యానానందులవారిచే శ్రీనటనానంద స్వామి ద్రావిడభాషయందు రచించిన దానింబట్టి తెనిఁగింపఁబడినది ఇది కర్మభక్తి యోగజ్ఞానములను నాల్గుమార్గములసారమును దేటగఁ జెప్పుచున్నది. అరుణాచలక్షేత్రమందు భగవాన్ శ్రీరమణమహర్షులు 1901-2 సం॥లో గంభీరం శేషయ్యగారను బ్రాహ్మణోత్తమున కుపదేశించిన వాక్యములసంపుటి. 48 ప్రశ్నల కుత్తరములుగలవు. మచ్చునకై 17 ప్రశ్నయు నుత్తరమునుదిలకింపుఁడు.

ప్రశ్న—ఆత్మయే హృదయమునందు బ్రహ్మముగ ప్రకాశించుచున్న దనుట యెటులు ?

ఉత్త—దీపజ్వాలయందుగల ఖాళీస్థలమందుండు భూతాకాశము ఆ జ్వాలకు లోను వెలిని అభేదముగ నిండి హద్దులేక ప్రకాశించుటవలె హృదయమునందు ఆత్మజ్యోతిలోనునుండు జ్ఞానాకాశమున్ను ఆయాత్మజ్యోతికి లోనను వెలిని అభేదముగ నిండి హద్దుమీరి వెలుగుచున్నది. ఇదియే బ్రహ్మమనబడును.

బ్ర॥ శ్రీ॥ పండిత పురాణం సూర్యనారాయణతీర్థులవారిచేఁ బరిశోధింపఁబడి కృష్ణాజిల్లా ఘంటసాలపాలెయములో నుండు శ్రీ శాంతి శిక్షాశ్రమము తరుపున ముద్రింపఁబడినది. వెల రు 0—4—0 కావలసినవారు సాధుధ్యానానందంగారు శ్రీ శాంతిశిక్షాశ్రమము, ఘంటసాలపాలెయము, చల్లపల్లి పోస్టు కృష్ణాజిల్లా అని వ్రాసితెప్పించుకొనవచ్చును.

4. ఆనందదాసుచరిత్ర—(శ్రీకోదండరామ విలాసము) గ్రంథకర్త గుంటూరుమండలస్థ చాగంటిపుర వాస్తవ్యుఁ డగు మారూరి మహానందిరెడ్డి గారు. శ్రీవాసుదాసస్వామి (వావిలికొలను సుబ్బారావుగారును) వీరిశిష్యులు ఆనందదాసు (మారూరి మహానంది రెడ్డి)గారు వీరిఛాయాపటము మొదటఁ గలదు. యక్షగానము- భజనవిధానము, వైరాగ్యప్రకరణము, దుఃఖశాంతి, తీర్థసేవనము, శ్రీరామకైంకర్యము, విఘ్ననిరోధము, సీతావిన్నపము, శ్రీరామానుగ్రహము, కోదండరామసేవక సమాజవిజ్ఞప్తి, ఫలశ్రుతి యను భాగముల నొప్పుచున్నది. కొన్నిపద్యములు:—

ఉ. ఎంతని వేఁడువాఁడ, జగదీశ్వర నీపదపంకజాతముల్
స్వాంతము నందు నిల్పి యనిశంబు భజించుట నీ వెఱుంగవే
పంతముఁ బూనె దేల ననువంటి యభాగ్యునిఁ బ్రోవఁ గూడదే
చింతల ముంతువే సకలసేవిత కృష్ణ రమేశ మాధవా!

ఉ. ఏల మతిభ్రమంపడెద వీవు కృపానిధి జానకీధవుం
డేలినవాఁడు గల్గ గుణహీనులఁ జేరి చరింపనేల గో
పాల జనార్తిహారుఁ డగు ప్రాజ్ఞుఁ డతండు భజించువారలన్
మేలు గొనంగఁ జేయును సుమీ తనయా యనుమాన మేటికిన్.

ఒంటిమిట్ట—భక్తిసంజీవనీ పత్రికకనుబంధముగా మాకుఁజేరిన యీగ్రంథము మహారాజశ్రీ కలగొట్ల రామకృష్ణారెడ్డిగారి ద్రవ్యసహాయముచే ముద్రింపఁబడినది. వెల రు 0-4-0 లు.

---

5. యోగసంకలనము:—ప్రథమభాగము. (కర్మయోగము) కాకినాడ నాట్యకళావిజ్ఞానగ్రంథమండలి తృతీయకుసుమము. శ్రీ అరవిందఘోషుగారి యాంగ్లగ్రంథమునకుఁ దెనుఁగు-మధ్వశ్రీ దాల్తాబాదు గోపాలకృష్ణారావుబి ఏ. గారిచే నాంధ్రీకరింపఁబడి ప్రకటింపఁబడినది. వెల రు 1-4-0. 166 పుటలలో శ్రీ అరవిందఘోషుగారి "The synthesis of yoga" అను గొప్పయోగశాస్త్రములోని యొక్కభాగ మిది. 46 పుటల యుపోద్ఘాతము గలదు. సాధనచతుష్టయము, ఆత్మసమర్పణము, కర్మసన్యాసము, గీత, త్యాగము-త్రివిధమార్గము, ధర్మశాస్త్రము, ఉత్తమేచ్ఛ, పరిపూర్ణసన్యాసము, కర్మాధిపతి, కర్మ-ఇట్లని పండ్రెండధ్యాయము లీపుస్తకములో నున్నవి. ఇదియొక కథగాదు. విషయమును గ్రహించుట సులభసాధ్యముగాదు. యోగాభ్యాసపరులకుఁ గాని తత్త్వముభో

థపడదు. తదభిమానులుఁ దదాసక్తులు దీనింజదివి కృష్ణారావు పంతులుగారి శ్రమకుఁ దగినఫల మొసంగుదురుగాక. ఆంధ్రీకరణమును శైలియుఁ జిత్తగింపుఁడు. విషయ మెంతపటుకు మనకుఁ దెలియునో—

"యోగమనఁగా స్వభావవృద్ధిచే నావరణబలాత్కారముచే వ్యక్తితో నుపయోగింపఁబడు నవకాశములచే నెమ్మదిగా వృద్ధిపొందుచున్న మందగమన విధానమును విడిచి, గమ్యస్థానమును సరాసరి పొందించు వ్యక్తిగల స్వతంత్రమగు తీవ్రవృద్ధి విధానమును స్వీకరించుట. అనంతమగు క్రమవృద్ధిని చెప్పుచు గమ్యస్థాన మనుట తప్పి కావచ్చును కాని సమీపగమ్యస్థానము కల దని, తత్ప్రాప్తికై మనుజుఁడు వృద్ధిపొందు చున్నాఁ డని, నూతనజన్మ యదే యని, విపులప్రకాశజ్ఞానమదే యని, దివ్యమానుషత్వ మదే యని మనము గ్రహించవలెను. మనము కోరునది పూర్ణమైనమార్పు. జీవునకు మాత్రమే కాదు. మన స్వభావము యొక్క యన్ని భాగములకు"—79 పుట.

---

6. సర్వేగణితచంద్రిక—గ్రంథకర్త చదలువాడ కోటినరసింహముగారు. క్షేత్రగణితము దీనియందలివిషయము. పాఠ్లూరిమల్లనవలె నింగ్లీషుపద్ధతిని భూములు కొలుచు నిప్పటి విధానము పద్యములలోఁ జెప్పి దానిక్రింద వివరణము వ్రాసి గ్రామోద్యోగులు మొదలగువారి కుపయోగపడునట్లు కోటి నరసింహముగారు లోకోపకార మొనర్చినారు.

" అవధరింపుము బాలురకైనఁ దెలియు, రీతిఁ బద్యంబులందు ధాత్రీగణితము విపులవిషయాన్వితంబయి వెలయుచుండు,నట్లొనర్చెదఁ గొను భవదంకితముగ. పద్యములయందుఁ జేరగుప్తముగనుండు,విషయములు గద్యశైలిలోవిశదపఱతు నన్న పూర్ణేశ్వరా త్వత్కృపాతిశయము, నంది సర్వేగణితచంద్రి కాఖ్యకృతిని.

అని ప్రతిజ్ఞగావించియున్నారు.'సర్వే' కొలతలలోఁ గొంతప్రవేశమున్న వారీపుస్తకమును జదివి పూర్ణజ్ఞానమును సంపాదింపవచ్చును. ప్రతివిషయమునకుఁ దగినట్లు ప్రతిమలు గలవు. లెక్కలు చేసి చూపింపఁబడినది. చిట్టచివరఁ బ్రత్యుత్తరములు గలవు. 60 సాధకములలోఁ గావలసిన సర్వేవిషయము సర్వమును గలదు. కొన్నిపద్యములు :—

సీ. తలవెంట్రుకలను వెడలుపుగా నెన్మిది నిలుపఁగా షుషువగుఁ గొలతకొఱకు
నట్టి షష్వష్టకం బైనఁ గాష్ఠంబగుఁ గాష్ఠాష్టకము యవగర్భమగును

యవగర్భములు దచ్చి నైన నంగుళ మగు నంగుళాల్ ద్వాదశం బైననడుగు
అడుగులు మూఁడైన నగుగజం బట్టి యిర్వది రెండుగజములఁబరఁగుగొలుసు
గొలుసు లీరైదు వర్లాంగగుం దలంప, నట్టివర్లాంగు లెనిమిదైన మైలు
గా నెఱుంగఁగఁదగునుదైర్ఘ్యంపుఁగొలత, వినుతఖగరాజతురగవృధ్వీశతాంగ.
గీ. ఎనిమిదంగుళములకిసుమంత తగ్గలింక, గుసు నూఱులింకులైన గొలుసు
గొలుసు లెనుబదింటఁ గలుప మైలగు భవా, నీహృదబ్జమిత్ర నిటలనేత్ర.
గీ. పొలముగొలుచుచున్నపుడె కాగితంబున, స్కేలు బిట్టులేక చేతితోడ
గణిక డించుమించుగా గీయ స్కెచ్చియా, మదనభంగ యఘతమఃపతంగ.
గీ. స్కేలు కంపాసు బిట్టలచేత నెన్ని, కునులు పొలమునునైనఁ ద్రికోణములుగఁ
జేసి వరసగఁగూర్చి సంక్షిప్తముగను, వ్రాయుపటమును ప్లానంద్రు వామదేవ

ఈకోటి నరసింహముగారే కవిత్వచింతామణియను పుస్తకమును వ్రాసి యున్నారు. దానిసహాయమున స్వయంకృషిచేఁ బాలురు వ్యాసలేఖనమును గవిత్వమును జెప్పననువగును.

పై రెండుగ్రంథములును - కవిగారియొద్ద గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా అచ్చమ్మపేఁట పోస్టు, ఊటుకూరులో దొరకును. సర్వగణితచంద్రిక వెల రు 1. కవిత్వచింతామణి రు 0-12-0.

(7) విదుల- కీర్తిశేషులగు ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిగారి భారతనవనీతములోనిది. విదులాపుత్రసంవాదము 'దౌత్యభంగానంతరముఁ దన్నుఁ జూడ వచ్చినకృష్ణునితోఁ గుంతినాకొడుకుల కియ్యది వినిపించి పౌరుషము గలిగి జీవింపుఁడని తెలుపుమా' యని చెప్పినకథ. వీరవనిత యగు విదుల శత్రుపరాభూతుఁ డయి డాగియున్న తనసుతుని సంజయుఁ డనువానిని బ్రేరేపించి శత్రువులపైకి యుద్ధమునకంపుట యిందువిషయము. తిక్కన సోమయాజి సూచించెను గాని విపులముచేయలేదు. దానిని శాస్త్రిగారు పూర్తిగఁ దెనిఁగించిరి. భారతనవనీతములోని ద్రౌపదీచరిత్రమును బాఠకులు పరిషత్పత్త్రికాముఖమునఁ దెలిసికొనియున్నారు. ఈవిదులయు నట్టిదే. హిందూసుందరినుండి పునర్ముద్రితము.

దీనికి విద్వాన్ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు టిప్పణికూడ వ్రాసినారు. అది కడపటఁ గలదు. వ్యాసభారత నవనీతము యుద్ధపంచకము తప్పశక్తి నపర్వములు సిద్ధముగానున్నవి. ధనికులు దీనిముద్రణమునకై శాస్త్రిగారి పుత్రులకుఁ దోడ్పడఁదగును—

శ్రీరస్తు.

# హంససందేశము

—మహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రి

## —ప్రథమాశ్వాసము—

శా. శ్రీమంతుం డగుదేవుఁ డాతఁడు పవిత్రీభూతమార్తాండవం
శామోదం బలరన్ జనించి భువి మాయామానుషుం డౌచు సి
తామార్గాదృతిఁ బావనిం బనిచి జ్ఞాతస్వార్థుఁ డై కోమలాం
గీమోహంబున రేయి కల్పముగ వేగించె న్మహాధీరతన్. ౧

మ. అతఁ డంతం గపినాథు సేన నడపన్ యత్నించుచో వేగ భూ
సుతకున్ దూరనివాసి యాటకు మనస్తుందీభవద్వేదనా
గతుఁడై యప్పు డుషస్సునందును దటాకక్రీడితంబుం బరా
జితరాకాదివసామృతాంశుకరరాజిన్ రాజహంసం గనెన్. ౨

చ. అవనిసుతాసమానగతి యామెదుకూలపటంబు వోలుచు
న్నవపువు నామెనూపురపునాదము గల్గినహంస నెంతో క
న్గవఁ దిలకించి వీరుఁ డణుకాలము మూర్ఛిలెఁ దన్మయాత్ముఁ డై
యవసరమందుఁ బూవిలుతు నాజ్ఞ దురంత మటంచు నెంచెదన్. 3

మ. అతియత్నంబున లక్ష్మణాగ్రజుఁడు లబ్ధాశ్వాసుఁ డై యప్పు డా
సతిప్రాణంబులు నిల్పఁగోరి తమితో సందేశ మంపింప నా
దృతిఁ బూజించె సరోజరాజిని బతత్రిన్ దూతలాభంబు దా
నతివం గౌఁగిటఁ గూర్చుకంటె బహుమోదావాది యౌఁ గామికిన్. ౪

మ. హనుమాను న్బహుమానిఁ జేయు టణువం తైతోఁచ నెంతేసప
ర్య నుపాసించుచుఁ గోరె భ్రాంతమతి దాత్యానర్హ్వచక్రాంగమున్
ఘనశైలద్రులతాదుల న్విరహదుఃఖాయ న్మనోయుక్తు ల
ర్థనసేయన్ సుఖదుఃఖవేది నొకటిం బ్రార్థించు టేమబ్రమే. ౫

శా. వేదాంభోధివిభాగవేది యగునావిశ్వాత్మ సద్వంశ్యమున్
వేధోవాహన మంచు సిద్ధు లనఁగా విందు న్మను న్నిన్ను వా
ణీదేశస్థితిచే గతిప్రగుణమా నీకు న్లభించెన్ శ్రుతి
స్వాదార్హామృతమాధురీగుణముఁ దత్సావర్ణ్యముం బొందుటన్. ౬

ఉ. ఈయిహమం దొకానొకర మేము మనుష్యులలోనఁ గేవలం
బోయి సఖా ! మహాజగ మహో యనఁగా ఖగరాజ వీవు గా
దే? యయినన్ త్రిలోకోద్ధరణహేతువునం దగు దీవు దూత్యముం
జేయఁగ ధాతయు న్సకలసృష్టిసమర్థుఁడు సూతుఁ డయ్యెఁగా.
మ. జగ మన్యంబుగ స్వీయమా మహిమ నిచ్ఛామాత్ర నిర్మింపఁగాఁ
దగు నిక్ష్వాకులయిట్టిదుర్దశను సందర్శించి యంభోధిను
ద్యగరిష్ఠోర్ములచేఁ ద్రికూటగిరి దృశ్యాదృశ్య మౌచోఁ దదం
కగతన్ రాక్షసరాజధాని యగులంకం జూడఁబోవం దగున్.
చ. చెలువుఁడ ! దివ్యతీర్థముల సీమయుఁ జందనకాననాప్తమున్
మలయసమీరమాతయును మౌక్తికసూతికి మందిరంబు నై
నలువగు దక్షిణాదిశకు నా ప్రమదంబును పితజీవముం
దలఁచుచు రాక్షసోర్వి యను తల్లవదోషము నోర్చి యేగుమీ. ౯
మ. ఘనవాగ్ధికవి దూరమం దమరఁ బ్రజ్ఞాహీనులుం బోలె నీ
వును గైలాసమునందు నుండుతఱిఁ గ్రొవ్వుం గొంచుఁ గేక ల్వెలం
గ నటింపం గని వన్యకేకులు శరత్కాలంబునం గన్నువో
యినవై మూకత నొంద మార్గమున నీకెంతేని సమ్మోదమౌ. ౧౦
ఉ. క్రోలి సరాగపద్మినుల క్రొత్తమధు న్మెలమెల్ల లీలతోఁ
గాలమునందు మేలుకొను కల్వలపఙ్క్తిఁ బరిభ్రమించి స
చ్ఛీల ! వనేభదానముల స్విన్నుఁడు గంధవహుండు సేవచే
లాలనఁజేయు నిన్ బరిమళంబుల స్వాతిశయంబు దెల్పుచున్. ౧౧
మ. సమకాలోదయ బంధుజీవములు యుష్మద్బంధు లౌటం బరా
గము లచ్చోఁ బవమానుచేఁ బనిచి నీగాత్రంబుపై నంగరా
గము నెంతో యలఁద న్నివాచరణలాభౌసంగతున్ గాంగఫే
నమహాబింబు గిరీశశేఖరనిశానాథున్ స్మరింపింపవే. ౧౨
ఉ. సౌరకరంబు లంతరపుసన్నశలాకల నెన్నఁగా సునా
సీరునికార్ముకార్థమనుచిత్రపటంబున నంచు మించఁగా
మారుత మానుకూల్యగతి నై వెనువెంట వహింప మింటిపై
శారదవారివాహములు ఛత్రము లయ్యెడు రాజహంసమా. ౧౩
చ. జనకుని యజ్ఞవాటికను సాగినసీత జనించినట్టి సీ
తను సఖిఁ జూచె దీగతి ముదంబున నచ్చట కేగి మిత్రమా

తనతను వామె నాకొఱకుఁ దా నెటులో ధరియించుచుండి ధా
త్రిని బరిపూర్తిఁగాంచిన పతివ్రతయన్న యశంబు నొందెడిన్. ౧౪

మ. తనలోకోదయము మోద మూనుఁ గద నీద వ్వంతికం బొందు ప
ద్మిని స్వాదూత్పల నేఁడె వత్తు నని యామె న్నెల్ల లాలింపు మ
వ్వనితామైత్రిని వీణమించు మధుకృద్వ్యాజ్యాధురి న్నీకు నీ
వసిలో మంచిది యన్న సమ్మతిని దెల్పం జూచునం చెంచెదన్. ౧౫

మ. అనురక్తి న్నబరాంగన ల్పతులతో నద్రి న్నికుంజంబు లం
దును గూర్చుండి క్షణంబు నిన్నుపహసించుంగా వితర్కింప నా
వనజశ్రేణిని చుండి నీవెగురునీ ప్రాపింప యామ్యాశ ద
వ్వున నే పక్షబలాతిశాయులు ఖగంబు ల్గన్పడం దోల్గుచున్. ౧౬

చ. అనుపమలీల నీ వెగిరినప్పుడు కన్రుసుధారసంబుతో
నెనయగు నీదుఛాయ మెయి నీమణిమాల్యవదద్రి మించుచో
మనసుననుండి చంద్రుని మండలమున్ సృజియించు నాదిదే
వుని సుమహాతిరేకమును బూనెడునో రజనీకరాకృతిన్. ౧౭

చ. పడమర తూర్పుమార్గములు పావని నాకు వచించె వానిలోఁ
బడమర త్రోవ చేరువు నపాయము నయ్యెడ నిత్యవృష్టి నో
చెలువుఁడ మెల్లవీథుల విచిత్రములం గనుచుండి లీనమా
నెడ నెటులే మఱల్పుసుమి దృష్టి మదర్థము ప్రాక్పథంబునన్. ౧౮

మ. నికటంబొందిన నీసుధార్ద్రరవము న్విన్నట్టి భ్రూవృత్యశా
న్యకటాక్షంబుల కృత్రిమాదరణ రమ్యంబై ప్రకాశింప స్వీ
యకుటీనిర్గతముగ్ధభామినులు నీవంచున్నది న్నిశ్చయిం
చికనన్ దాఁటుమి శైలకాననదీసీమంబు లీదేశమున్. ౧౯

మ. సుమధన్వాకులముగ్ధభావమున నిక్షుచ్ఛాయలందుం బ్రవా
శమయి న్నయ్యను శాలిగోపికలు సల్లాపంబు లేవేవో నం
భ్రమతోఁ జల్పుచు గీతిభేదములఁ గర్ణాటాంధ్రదేశీయమి
శ్రములం బాడుచు మోహమొందు తటి నాస్వాదింపు తన్మాధ్వమున్. ౨౦

మ. దనుజద్వేషినివాసము న్మణిమూర్ధంబున్ ధరాధారి యా
టను సాక్షాత్కృతశేషుఁడే యి దని చూడ న్గానవు ల్లాఘవం

బున నభ్రంబులు సంచరింపఁ గుబుసంబుస్వీడుఁ డాఁ దత్క్షణం
బనఁగా ముందట వేంకటాద్రి బహునేత్రానందమౌఁ బిమ్మటన్. ౨౧

చ. అలగిరి మర్త్యులెక్క త్రిదివౌకసులుం దిగి శుద్ధసాత్త్వికా
త్మలఁ దమ రొండొరు ల్తరతమత్వము వీడుచు సర్వసామ్యస
త్ఫలపరిపాకభూతిమహితం బగు నచ్చట గుంపుఁగూడి పూ
జలు సలుపన్ యథేచ్ఛముగ శక్తిని మాధవు సత్కరింపుచున్. ౨౨

మ. స్తిమితం బొందుమి యన్నటు ల్పొలిన వేదిం దీర్చి నీకు న్సువ
ర్ణముఖర్యాపగ గోచరించు నట గోత్రప్రాంతయామ్యాశ వ
న్యమహీజంబులు చెంత భాసిలఁ బ్రసూనంబు ల్సపర్యానిమి
త్త మనన్ ధూర్జటి కూర్మి హస్తములచేతం దెచ్చి యర్పించుచో. ౨౩

శా. నీమంజుధ్వని మాని గాఢముగ దీనిం గూడి వానీరవృ
క్షామోదాతిమృదూభవత్పులినవాతాధూతిచేత న్మహా
వ్యామోహుండవు గాక పొమ్మి యపు డన్యాగమ్యవీథిం దటీ
సీమావాసకిరాతు లెల్లఁ దమచేఁ జిక్కింపకుండ న్నినున్. ౨౪

మ. చని తుండీరసుమండలంబునకుఁ బశ్చాత్తాల మీక్షించి యం
దున సత్యవ్రత మన్న క్షేత్రమునకుం బొమ్మా కృతౌఘక్షయం
బున కచ్చోఁ బతి యజ్ఞహానికి నదీభూతాంగియౌ వాణి నో
ర్చెను విశ్వైకనియామసేతు వగు నా శ్రీనాథుఁడే సేతువై. ౨౫

మ. అచట న్సంతతగీతనాదబహురత్నాంచద్గుణ న్భూమిదే
వ్యుచితాలంకృతిఁ గాంచిఁ గాంచె డట నేత్రోత్సాహియౌఁ జుమ్మి హ
స్త్యచలావాసియు సత్యకాముఁ డలద్వంద్వాతీతుఁ డౌ పూరుషుం
డచలం బౌతనదృష్టిఁ గన్గొనినవాఁడై కాంచి నెల్లప్పుడున్. ౨౬

శా. ఆవీటిం బ్రణమిల్లుమీ కృతయుగాద్యన్ బ్రహ్మసంకల్పమా
త్రావిర్భూతను జేరి భక్తి వినతంబౌ మూర్ధ మేపారఁ గాం
చీవీథీరజము ల్గజాచలపతి శ్రీవాహవేగోద్ధముల్
దేవాగ్రేసరులు న్శిరంబులను బొందింతు ర్మహాధన్యులై. ౨౭

మ. ఒకచో నప్పురిఁ గంపితామ్రవణ లీలోద్దామియై ముందుఁ ద్ర్యం
బకమౌళీందు హిమాంబు పూనికొని కంపానీరనీరేజమా
లికకుం గాముకుఁ డైనగంధవహుఁ డాలింగించు లోకోపకా
రకుఁడై పిమ్మట నిన్ను నాపుఁ డగు దూరాదాప్తమిత్రుం బలెన్. ౨౮

మ. మిముఁ బోలెం గవుల న్స్మరించు నల బ్రాహ్మీదేవి యానీటి మ
ధ్యమునం బార్శ్వయుగంబునం గొలువ విష్ణ్వాదు ల్శుచిస్వాదునీ
రము వాఱం బొఁగడొందుచుండుఁ దనవర్ణస్తోమము ల్సప్తభే
దమహాస్రోతములై జనించి యమరం దా వేగవత్యాఖ్యతోన్. ౨౯

— కోడూరి దక్షిణామూర్తిశాస్త్రి —

చ. పురుషులపాపము ల్దొలఁచు పుణ్యసరస్వతి నీట సన్మునీ
శ్వరులను గూడి క్రుంకు లిడ స్వచ్ఛతరాంగుఁడవై రజోగుణా
వరణము లేని చిత్తమున భాసిలఁ జేయుచు సర్వలోకముం
బరఁగెడి దుర్ణివారసితభావము నొందెదు లోన బైటయున్. ౩౦

ఉ. ఆనదిగట్టున న్సరసిజాసనునుత్తరవేదిరూపమై
జానగు హస్తిశైలము ప్రశస్త మొనర్చుచు ద్రావిడంబునన్
ఏనదిపజ్జనుండుఘను లీతను వ్రాడ్చిన నిస్తమస్కముం
బూనినవాసుదేవు పదముం గని యుందురొ సౌమ్య! నిచ్చలున్. ౩౧

మ. తులసీదామములన్ స్వకీయతనుకాంతుల్ వృద్ధిగావించి శీ
తలవైశ్వానరుఁ బోలి వేదికపయిం దానుండి సద్భక్తిము
క్తుల నీఁగల్గు రమాకటాక్షముల నెంతో శ్యామ మైనట్టి యా
జలజాక్షాభిధలోకకారణము నీసద్దృష్టిపాత్రంబగున్. ౩౨

శా. శ్రీవిద్యున్యుతదేహము న్మరకతశ్రీమేచకంబుం గృపా
భావాంబూదరమేఘ మందుఁ గని కంపం బింత గైకొనుమా
యేవార్ధంబు భవాదృశోత్తమసుపక్ష్వోద్ధంసనసంపూజ్యమీ
మీవంశంబున మున్ను పుట్టినది యామేఘంబు మేల్ హంసమై. ౩౩

ఉ. నీవిభుయజ్ఞభాగముల నిర్మలసారముఁ గ్రోలువాఁడు వే
దావళిశుద్ధనేత్రము మహాశ్రితలోచనభాగధేయమౌ
దేవుఁడు మ్రొక్కునిన్నుఁ గను దివ్యరసాంచితమోదయుక్తస
ద్భావహితప్రదప్రవణధవ్యకటాక్షనిరీక్షణంబులన్. ౩౪

చ. మధుయుతపద్మముం బలె రమాసతి స్విన్నకరంబుఁ బట్టి స
ద్విధిహితహస్తమందు నొకదివ్యసరోజముఁ బూనుచు న్మనో
వ్యథ చన దేవుఁ డవ్వనవిహారము సల్పినయేని యాహరిన్
బుధనుత వీచుమా వ్యజనముం బలెఁ బక్షముతోడఁ గన్పడన్. ౩౫

చ. ఎదురుగఁ బ్రాఁకుమత్స్యముల నెంతయు స్తంభితమైన సహ్యజా
మృదులఝరంబు నద్దెసల నేగఁ దదంతరభూమి చోల మ
య్యది క్రముకావనీజనివహంబుల నల్లనయై కనందగున్
ముదితుఁడవై చనంగదవె ముందుగ దాటుఁచు మధ్యరాష్ట్రమున్. ౩౬

చ. సురభిహరిద్రతో నెనయుఁ జూర్ణపుఁబూఁతల సాంధ్యరాగముం
బరువపుఁజోఁకపుష్పముల బర్వినకొప్పున ధ్వాంతకౌముదీ
వరకలహంబుఁ బూను నవవారిజనేత్రలు చాటుసూక్తులం
బరఁగుచు దోలపై నయనపర్వ మొనర్తురు నీకు హంసమా. ౩౭

శా. భూదేవీతిలకంబు చోలమున నప్పూర్వాన్యభాగంబు స
మ్మోదం బైచను వర్షదేశము నదీపోష్యం బటం జేరి యెం
తోదూరంబున శ్వేతపర్వతముఁ గన్గో హంస! మగ్నత్రినే
త్రోదారాద్రిసమంబు భూమిబిలమార్గోద్యత్సర్పరాజంబునాన్. ౩౮

శా. ఆశైలస్థితమానవావళితమం బల్లార్చుచున్ స్వప్రభా
వేశత్వంబున జ్ఞానరూపుఁడు బుధేంద్రేష్టుండు సద్భాగ్యుఁడున్
శ్రీశేషాద్రిరతుండు సాగరసుతాస్నేహానుషక్తుండు స
త్కౌశల్యం బాడఁగూర్చు నీకొగి నమస్కారం బొనర్పంగ నే. ౩౯

మ. అలదేవోత్తముకాంతిభంగి నసితం బై మార్దవచ్ఛాయమై
లలి నీలీసుమమంజరీలలిత మై లావొప్పు నక్కానవం
బలఘూత్తంసమ! చూడుమా యది గనన్ హా నీమనం బప్పరో
జలజాస్యాసుఖయోగ్యనందనము హైశ్వర్యంబుఁ బోఁద్రోసెడిన్. ౪౦

మ. పవనుం డేక్రముకాటవిన్ సకలపుష్పవ్రాతసద్ధూళిచే
నవవైతానముఁ జేసి చామరములం గావించి పుష్పంబులం
బుపుసెజ్జ ల్పచరించి పాదములిడన్ భూమిప్రదేశంబులన్
ధవుఁడౌ మన్మథభూమిపాలునకుఁ దా దాస్యంబులం జల్పెడిన్. ౪౧

శా. కావేరీనది రాష్ట్రమున్ ఝరముచేఁ గావించుచున్ రెండుగా
దేవద్వీపవతి న్మహామహిమచే ధిక్కారముం జేయుచుం
బ్రోవై పండినయిక్షుపర్వహతి సంభూతస్వముక్తావళుల్
త్రోవం గ్రాలఁగ నిమ్న మున్నతమునై తోషంబునం బాఱెడిన్. ౪౨

మ. అలసహ్యాంకమునుండి స్పర్శనుఁడు పారావారముం గూర్పఁగాఁ
గలభద్రోక్తులఁ ద్వాదృశద్విజవరుల్ గావింపఁగా దీవనల్
జలజాప్తోదయవేళఁ బూగసుమహాసంబుల్ దరుశ్రేణ్యఁగా
విలసత్పుష్పరసానులిప్తయ యనఁ గావేరీనదిశ్రీ చనున్. ౪౩

చ. వరశుచికై నదు ల్గలియవచ్చి చరింపఁగ నెల్లెడన్ దృఢా
దరణము మానసంబు పయిఁ దగ్గఁగఁ జేయుచు నీమనిన్ సదా
సురవనితాశిరఃస్థలసుశోభితమాల్యసుగంధయుక్తమై
పరఁగెడి చంద్రపుష్కరిణి భర్జితచంద్రగతాఘుఁ గాంతువో. ౪౪

శా. ఎత్తీరంబున మత్స్యులాప్యధనమై యింపొందు శ్రీరంగధా
మోత్తంసుండు వసించు నుండ దనుచు సద్యోగుల్ ప్రశంసించిరో
యత్తీరంబున సాధుసేవ్య మగు శేషాహీంద్రపీఠంబు నీ
చిత్తంబందు విశేషశ్రద్ధగొనుచు న్సేవింపుమా సత్వరన్ ౪౫

మ. విలసద్దివ్యవిమానమధ్యమున నావిర్భావముం జెంది డం
బుల నొప్పారఁగఁ బేటికామరకతంబుంబోలి శేషాహిభో
గలసత్తల్పమునందుఁ బండి కరముం గాంచి మేల్దిండు దీ
ర్ఘలసద్దృష్టులఁ జూచు శ్రీపతిఁ గనంగా నామనం బేగెడిన్. ౪౬

మ. చెలికాఁడా! వెస దాఁటు చోరయుతమై ఝిల్లీరవాభీలమా
నలఘూద్యద్విపినంబుఁ జోలయుతపాండ్యాఖ్యప్రదేశస్థమున్;
అలదేశంబునతిక్రమింపఁగనె చేయంజూచు సద్భావమున్
ఖలసాన్నిధ్యమునం గవీశ్వరులు కల్గింబోరు సచ్ఛుభ్రముల్. ౪౭

చ. అలకలు కంపమంద శిరమందలి గుచ్ఛము జాఱఁ గమ్మలం
గలరతనంబు రాజిల ముఖంబున ముత్తెపుబొట్టు నొప్పఁ బాం
డ్యలలన లెంతయుం గుతుక మందుచు నాస్యము లెత్తి ముద్దులం
గులుకఁగఁ గూయు నిన్నుఁ గనుఁగొందురు దీర్ఘకటాక్షపంక్తులన్. ౪౮

ఉ. ఏవృషభాచలంబున బలీంద్రు నడంచినవిష్ణుదేవు స
త్పావనపాదతీర్థము విభాసిలు ముట్టక రుద్రు నొందలన్
ఆవృషభాచలంబునకు నంచితసుందరనామవిష్ణుసం
భావితవాసభూమికి నమస్కృతి చేయుము భాగ్యరాశికిన్. ౪౯

మ. హరుమెప్పించి మహాస్త్రముల్గొనినవా రాత్మక్షత్రియు, ల్బంధనో
దరమం దుంతు రటంచు భీతిని బయోదంబు ల్సకాలంబునం
గురియ న్సస్యము లొప్ప; యక్షనగరిం గ్రోధించు సత్పత్తనా
మరగేహంబుల నొప్పుపాండ్యములఁ జూడ్మా వే విలోకింపుచున్. ౫౦

శా. తారల్గల్గినయాకసంబుగతి ముక్తాసైకతోపేత మై
పేరుం గాంచిన తామ్రపర్ణినది సేవింపంగఁ జూడ్మా; యకూ
పారంబుం దిగఁద్రావినట్టిముని యవ్వాటి న్వసింప న్సదా
తారం బైనజలంబు నీకిఁకను ముక్తవ్యాధిసాద్గుణ్యమున్. ౫౧

ఉ. వ్యోమమునుం దారకాయుతమునుం బోలినదానిని శుభ్రమౌక్తిక
స్తోమను దామ్రపర్ణినదిఁ జూచి భజింపుము పీతసాగర
శ్రీమదగస్త్యసంయమియుఁ జెంత వసించుట స్వచ్ఛమౌచు ము
క్తామయతన్ జలంబు లొసఁగంగల వచ్చుట నీకు హంసమా. ౫౨

ఉ. ఆనదివారిజం బనెడి యాననముం గడుఁ గ్రోలి తోషివై
యానదియూర్మిబాహువుల యగ్గపుఁగౌఁగిట శీతలుండ వై
యానదిసైకతంబున విహారముఁ జల్పి సుచందనానిలం
బాని శ్రమంబుఁ బోనడుపు మంబుధిఁ దాఁటఁ దలంచి యచ్చటన్. ౫౩

ఉ. ఆనదివామదేశమున కల్లన పోయిన శ్యామతాళికా
నూనతమాలమైనదియు నూత్నభవాద్భుత పక్షిజాతికి
న్నానసమోదమిచ్చునది నవ్యతరంగకలత్సుమౌక్తిక
శ్రీని నెసంగు వేలఁ గను చెంతను గేతకిచూర్ణసైకతన్. ౫౪

శా. శైలాగ్రంబున రెండుచాయలను విస్తారధ్వనిన్ జాఱుగం
గాలోలోరుఝరంబు నారిఁగ నభగ్న శ్రీప్రభాపోచ్చ్వల
ద్వేలం జాపముగాఁగ బాణముగఁ బత్రిశ్రేష్ఠమా నీవుపా
మ్మాలంకాపురిఁ జేసి లక్ష్యమును సౌమ్యా వేగ ముప్పొంగఁగాన్. ౫౫

మ. దవముం గూడినకాననంబు గతి సంధ్యం జేరు వ్యోమంబునా
నవసిందూరము గల్గు సేనఁగువిధానం బట్టుపుట్టంబుఁ బూ
ను విధున్ భాతిఁ దటిత్తుగూడు జలదుంబోలం బ్రనాళాటవుల్
గవియ న్వార్ధినిజూతు వొక్కతనువుం గానున్న ద్వంద్వంబునాన్. ౫౬

మాలిని. దివిజసరిదుపేతా దేవదేవానుజాతా
ప్రవిమలనిజగోత్రా పాండుపుత్రైకమిత్రా
వివిధకుధరచారీ విశ్వరక్షావిహారీ
శివమధురిపురూపా సిద్ధబుద్ధస్వరూపా. ౨౧౫

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలీకభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్రమహారాష్ట్రభూపాలరూప నూపురసుందరచరణారవింద సనదప్రోలి పురవరాధీశ్వర వెలనాఁటి పృథివీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామాత్యపౌత్ర హారితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసువరాజ తనూజ గోపరాజప్రణీతంబైన సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు సాహసాంకువీరసాహసమహోదారత్వప్రశంసనం బన్నది యష్టమాశ్వాసము.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## నవమాశ్వాసము.

### —ఇరువదిరెండవబొమ్మకథ.—

క. శ్రీరామావిహరణగృహ, నారాయణు నలినవికసనగ్రహరాజా
కారాయమాణదివ్యశ,రీరాధ్యున్నతిసనాథుఁ* ద్రిజగన్నాథున్. ౧

శా. భక్తిం గోరి తలంచి భోజనృపుఁ డాభద్రాసనం బెక్క ను
ద్యుక్తుం డై యిరుదిక్కుల న్మెఱపుల ట్లొప్పారుపుణ్యాంగనల్
ముక్తాశేషలు మౌళిపై నిడఁగ సమ్మోదంబుతోఁ జేరఁగా
వ్యక్తాలాపము బొమ్మ పేర్చి† పలికె న్వారించుచుం బెంపునన్. ౨

క. ఓరాజ యాస విడువఁగ, నేరవు మావిక్రమార్కనృపుమాడ్కి మహో
దారత్వముఁ దెగువయు నుప,కారంబును లేక యెక్కఁగాఁ దర మానే.‡

వ. అది యె ట్లన్నఁ దద్గుణంబు లాకర్ణింపుము. ౪

సీ. అష్టభోగంబుల నైశ్వర్యమునఁ గళ బలవైరిఁ బురవైరిఁ బద్మవైరి
నతిశక్తి నిలుకడ వితరణగుణమున నహిరాజు నగరాజు§ నంగరాజు
సాహసోత్సవమున నభిమానమునఁ గీర్తిఁ గపికేతు ఫణికేతు గరుడకేతు
దృఢముష్టిఁ జేసూటి దివ్యాస్త్రసామగ్రి బలరాముఁ రఘురాముఁ బరశురాముఁ
[1]పావనత్వమున ఘనసంపత్తి దీప్తి, ననిలమిత్రుని హరమిత్రు నబ్జమిత్రుఁ
బోలు నితఁ డనిజను లెల్లఁ బొగడుచుండ, నవనితలమే లెనావిక్రమార్కవిభుఁడు.

ఉ. వాసవుమీఱి నిత్యవిభవంబునఁ బేదలఁ బ్రోచి వైరిసం
త్రాసవిహీనుఁ డౌ నతఁడు రాజ్యము మంత్రుల కప్పగించి ప
న్యాసముల న్విదేశగమనంబు చరించుచు నుండ నొక్కెడన్
వేసవి వచ్చెఁ బాంథులకు వేసట పుట్టఁగ వెట్ట గొట్టఁగన్.[2] ౬

ఉ. ఎండకు లావు గల్గఁగ మహీరుహశాఖల నాకు లెల్లఁ బె
ల్లెండల వేఁగ నెండు జల మింకఁగ స్రుక్కఁగఁ బద్మషండము
ద్దండముగాఁగ లోకులు యథావిధి నీడలు గోరుచుండఁగా
రెండవసూర్యునట్లు ప్రసరించె నిదాఘము తద్గుణంబులన్.

---

*దివ్యశరీరార్ధసతీసనాథు-శరీరార్ధసనాథుఁడగు-†పేర్చి-గాఁగ-‡యెక్కఁదరమే నీకున్
§ గిరిరాజు- [1]చాపనైపుణి సంపద సారశక్తి నచ్యుతునిమిత్రు- [2]వెట్టలంటగన్.

క. విరహులమనముల దినమును, బరితాపం బినుమడింపఁ బరిమళములచే
దిరిసెంబులఁ గలిగొట్లం, బరువం బేర్పడఁగ నుష్ణపవనము వీచెన్. ౮

క. మండెడుమార్తాండద్యుతి, నెండను నొండొండ నెఱియ లేర్పడఁగా భూ
మండలము పూర్వమున నవ,ఖండము లయ్యును ననేకఖండము లయ్యెన్.

క. ఉదకముఁ గనవును నీడలు, మొదలారఁగఁ దలఁకుమృగసమూహంబుల యా
పద లెఱిఁగి యిట్టి యమృతా,స్పదమై కడుఁ జల్లనైన చంద్రునిఁ జేరెన్.

గీ. కార్య మయ్యెడు నెడ గర్వంబు పూనక, కాలమహిమఁ దన్నుఁ గాచికొనుట
యుచిత మనుచు వెట్ట కోర్వక చలువకై, యత్తవారిఁ జేరె నచ్యుతుండు.

క. తొడిగినపాముల విసమును, మెడవిసమును నొసలిచిచ్చు మెట్టులవడయున్
ముడివడఁగా వడకాలము, గడపుట కడుఁ గడిఁది యయ్యె గరకంఠునకున్.

క. చల్లనిగంగాజలమును, జల్లనిచందురుని గూడ జడలం దిడి తాఁ
జల్లనికొండకు నాశివుఁ, డల్లుండై కొంత బ్రదికె నావేసవిలోన్. ౧౩

గీ. అమృతశీతలాంశు వగువార్ధిలోనున్న, పద్మనాభునాభిపద్మగృహము
లోనఁ బుప్పొడియును దేనెయుఁ జల్లఁగా, నెండకన్నఱుఁగకుండెనజుఁడు.

సీ. విసనకఱ్ఱలు వట్టివేళ్లచప్పరములుఁ జందనంబులు ఘనసారములును
జల్లనినీళ్లు నిచ్ఛాభోజనంబులు గలవారి కిష్టసౌఖ్యంబు జరుగఁ
బనిచేసి గంజి యైనను నంబలైనను నెద చల్లఁగాఁ ద్రాగి యెచటనైనఁ
బడియుండి వెన్నెలగుడిపాట* వాడఁగా బేదల కాత్మసంప్రీతి గలుగు
మంచురొంపిముసురు లేకమార్గికులకుఁ, జల్లపాటునఁ† బయనంబు సాగుచుండు
నచ్చవెన్నెల సుఖనిద్ర యంబు కేలి, యమరు వేసవి కితరకాలములు సరియె.

క. అమృతము రసమ్ముక్రియ వేఁ,డిమి నెగసి జలంబు కడకు డిగజాఱిన చం
దముగా నవ్వేసవి జల, మమృతంబై జీవములకు సది చవికెక్కెన్. ౧౬

వ. అట్టి దివసంబుల. ౧౭

శా. గూఢంబౌ నిజవర్తనం బమర నాక్షోణీవరుం డంత నా
రూఢుం డై పరభూములందుఁ గడపెం గ్రూరప్రవృద్ధాతపో
ద్గాఢాంభోరుహమిత్రదీప్తివిదళత్సర్వంసహామండల
వ్యూఢారణ్యవిదాహిదావసముదగ్రోష్మంబునన్ గ్రీష్మమున్. ౧౮

* గడుబొట్టవాడగా. † చల్లబూటల.

ఉ. అంత విదర్భభూమిఁ బ్రియమంది చరించి యవంతిరాజు వి
శ్రాంతి యొనర్పఁ గుండినపురంబున కేగి యనంతరంబ య
త్యంత మనోహరం బగు నుపాంతవనాంతము సొచ్చి రుక్మిణీ
కాంతకుఁ దొల్లి తాపి యనఁగాఁ దగు దుర్గగృహంబుఁ జూచుచున్. ౧౯
క. రుక్మి యనుమతము లేకయు, రుక్మాంగదవరదుఁ* డగు వసుం డాగుడిలో
రుక్మాభరణాంచిత యగు, రుక్మిణిఁ గొని చనినెఁ దొల్లి రూఢికి నెక్కన్.
గీ. అట్టిదేవతాలయము పొంతఁ గొలనిలో, జలకమాడి వెడలి జలజములను
భూవరుండు దుర్గఁ బూజించి ముందట, విశ్రమించియున్న వేళ నొకఁడు.
శా. మార్గశ్రాంతి నొకింత డస్సి విలసన్మాకందసారథ్య మా
దుర్గారామము చొచ్చి వచ్చి నరనాథుం జేరి విప్రుండు దా
స్వర్గాచార్యుఁడు వోలె సావిభునిభావం బెల్ల నీక్షించి సం
†సర్గప్రస్తుతి వాక్యవృత్తి నెఱపన్ సంప్రీతితో నిట్లనున్. ౨౨
క. ఆజానుబాహుఁడవు రవి, తేజుఁడ వజ్రాదిచిహ్నధృతచరణుఁడ వం
భోజేక్షణుఁడవు భిక్షు, వ్యాజంబున నున్న చక్రవర్తివి సుమ్మీ. ౨౩
చ. కరులుఁ దురంగమంబులును గాలుబలంబులు నెవ్వి ఛత్రచా
మరములవారు లెంకలును మంత్రులు నయ్యడపంబువాండ్రు నెం
దరిగిరి రాజ్య మొల్లక మృషాకృతిఁ ద్రిమ్మరు టేమి నామతి
స్ఫురణము దప్పకుండ నిఁక బొంకక చెప్పుము నీవు నావుడున్. ౨౪
ఉ. సత్యము నీమతిస్ఫురణ క్షత్రియవంశకరుండ విక్రమా
దిత్యుఁడ నే నవంతినృపతిం బరదేశ విశేషదర్శనం
బత్యనురక్తిఁ జేయఁగ నయంబునఁ ద్రిమ్మరుచుండుదు న్నభా
చిత్యగుణంబు నా కిదియ చెప్పెడి దే మిఁక భూసురోత్తమా. ౨౫
సీ. అనవుడు నాశ్చర్యహర్షంబు లొందుచు భూసురోత్తముఁ డాత్మబుద్ధి మెఱసి
మృదులాంబరంబులు మేనఁ బూనక జోగికైవడి నీకంథ ‡గప్ప నేల
హంసతూలికశయ్యయందు నిద్రింపక బూడిదలోఁ బడి పొరల నేల
ఘనమైనరాజ్య మేకచ్ఛత్రముగఁ గల్గఁ డిరిపెమై యూరూరుఁ దిరుగ నేల
అష్టభోగములకు నాలయం బయ్యు నీ, వష్టకష్టములను నలయ నేల
కుడువఁ గల్గి నీకుఁ గుడువ లేకుండుట, యల్పతరముగాదె యవనినాథ.

*రుక్మాంబరధారి. †సద్భర్గం బ్రస్తుతవాక్యవృత్తి విలసింపన్ స్నేహ్నతో నిట్లనున్. సర్గప్రస్తుత......విలసించన్. ‡నీగంత-నీబొంత.

క. *ననుఁబోటి పేదయైనను, ధనమించుక కలిగె నేనిఁ దనమది ప్రక్కం
దనవనితాదిసుఖంబుల, మనఁ గోరుం బసరమైన మరగదె సుఖముల్. ౨౭
క. వికటం బగుదారిద్ర్యము, నకుఁ గడపల లేక జీవనము బహుళకుటుం
బకుఁడం గావున జరగక, యొకచో రససిద్ధి వడయ నూహించి మదిన్. ౨౮
మ. అలసత్వంబునఁ బ్రొద్దుపుచ్చక నిరాహారుండనై కంచిలో
వలఁ గామాక్షి గుఱించి యుగ్రతప మేఁ బండ్రెండుసంవత్సరం
బులు సేయంగఁ బ్రసన్న గామి పిదపన్ భూపాల నాయాత్మలోఁ
గలఁగంబాఱుచు దేవి దూఱుచును భిక్షావృత్తిమై† వచ్చితిన్. ౨౯
ఉ. నాకు మహాదరిద్రున కనాథునకున్బలిఁ ద్రిమ్మరం దగుం
గాక ధనంబు రాజ్యమును గల్గఁగ జోగిక్రియం జరింపఁగా
లోకులు నవ్వరే నృపులలో నినుఁ బోలెడు నట్టివాని నే
నేకడఁ గానఁ జాలు నిఁక నేగును నీపురికి న్సుఖింపఁగన్. ౩౦
ఉ. నావుడు లేచి యొండువచనమ్ములు ‡వోవఁగనిమ్ము కంచిలో
దేవత నీతపంబునకుఁ దేరకొనం గరుణింప దంటి భూ
దేవకులాగ్రగణ్య యనుదెంచి భవత్ప్రియ మాచరింపఁ ద
త్సేవ యొనర్చి యేను రససిద్ధి ప్రసిద్ధికి నెక్కఁ గాంచెదన్. ౩౧
మ. పొద మాదేవత యున్నభూమి కని యాభూదేవునిం గూడి స
మ్మదలీలం జని రత్నహర్మ్యముల రమ్యంబౌచు సొంపారు సం
పదలం బొంపిరివోవు కంచి నయమొప్పం జూచి యచ్చోటఁ జ
క్కదమాభావనఁ జేరనేగె నృపుఁడా కామాక్షి నీక్షింపఁగన్. ౩౨
మ. అచటం దీర్ఘములాడి శంభునకు దైత్యారాతికిన్ మ్రొక్కి పు
ణ్యాచరిత్రుం డొకరేయిఁ బుచ్చి మఱునాఁ డారాధనాసక్తిమై
నచలంబౌ మతి మూఁడురాత్రులు నిరాహారవ్రతుండైనచో
నుచితస్వప్నమునందు దేవి వలికెన్ యోగప్రసన్నాత్మయై. ౩౩
చ. కల యిది నిక్కువం బనుచుఁ గైకొని ముప్పదిరెండులక్షణం
బులఁ జెలువారునట్టి నరపుంగవుకుత్తుక నెత్తు రిచ్చి ది
గ్బలి యొనరించినన్ ద్రవిణకారణమా రససిద్ధి చేకుఱు
న్వలవదు నీకు నీయనశనవ్రతఖేదము మేదినీశ్వరా. ౩౪

*ననుబోటియంత యైనను. †భిక్షావృత్తినై. ‡లటుండఁగనిమ్ము కంచిలో.

చ. అనవుడు మేలుకాంచి కడు నద్భుత మందుచు విక్రమార్కుఁ డా
గొనములవాని నింక సమకూర్పఁగ నొండెడ కేఁగనేల నా
కని మతిఁ దానె సర్వసుగుణాఢ్యుఁడు గావునఁ దెంపుతోడఁ గ్ర
క్కున నడిదంబు డుస్సి తనకుత్తుక నొత్తె* నుదాత్తచిత్తుఁ డై. ౩౫

క. ఒత్తఁగఁ బ్రసన్నమతి యై, యత్తఱి నడిదంబు వట్టి యాదేవత లో
కోత్తమ నీతెంపున నా,చిత్తం బిగురొత్తె నిష్టసిద్ధి యొనర్తున్. ౩౬

క. అడుగుమ యనవుడు మది నా,యెడఁ గడుఁ గరుణించి తేని నీవిప్రుఁడు దా
నిడుమలఁ బడి పొరలెడిఁ గృప, యొడపక రససిద్ధి యితని కిమ్మని మ్రొక్కెన్.

ఉ. మ్రొక్కిన నద్భుతంబును బ్రమోదము నొందుచు యోగమాత దా
నక్కఱ దీర్చునట్టి రస మాతని కిచ్చి యవంతినాయకున్
మిక్కిలి యింపునం బరిణమించి యదృశ్యత నొందె విప్రుఁ డిం
పెక్కి తదీయవర్తన మనేకవిధంబులఁ బ్రస్తుతింపఁగన్. ౩౮

ఉ. ఆనరనాథుఁ డంత వసుధామరు వీడ్కొని వేడ్కతోడ ను
జ్జేనికి వచ్చెఁ గావునఁ బ్రసిద్ధగుణాఢ్యుని వానిఁ బోలతే
వీనగుఁబాటుచేఁత లిఁక నేటికిఁ గ్రమ్మఱు మన్న నాత్మ†ధా
రానరనాయకుం డతనిఁ బ్రస్తుతిసేయుచు నేగె నింటికిన్. ౩౯

— ఇరువదిమూఁడవబొమ్మకథ —

వ. మఱియుం ద్రయోవింశద్వారప్రవేశోన్ముఖుండై. ౪౦

క. ఏవేళనైనఁ బొక్కిటి, ‡యావెల్లని తమ్మిమొగ్గ యరవిరి గాఁగన్
రేవెలుఁగుఁ బొద్దుఁ గన్నులు,గా వెలిఁగెడివేల్పుకరుణఁ గావుత మమ్మున్.

మ. అనుచు న్భోజవసుంధరాధిపుఁడు పుణ్యాహంబునం జందనా
ద్యనులేపాంబరమాలికాకనకభూషాలంకృతుండై మహా
సన మెక్కం జనుచోట బొమ్మ వలికెన్ క్ష్మానాథ యావిక్రమా
ర్కునిచందంబున దానవైభవము నీకుం జాలదగ్గింపుమా. ౪౧

ఉ ఆతనిదానవైభవమహత్త్వముఁ జెప్పెద భాస్కరాంశసం
§జాతుఁడువాఁడు విక్రమవిశాలభుజాయుగదుర్మదాహిత

* నొత్తెను నంతలోపలన్ † నాత్మలో, నానరనాయకుండతని నర్థినుతింపును.
‡ యావెలినెత్తమ్మిమొగ్గ § జాతుఁడువిక్రమార్కుఁడు విశాల.

వ్రాతవిఘాతదక్షిణుఁ డవంతిమహీశుఁడు తొల్లి చన్న యా
దాతలలోనఁ గర్ణునికిఁ దండ్రిసుమీ తలపోసి చూచినన్. ౪౩

శా. ఆరాజన్యునిపట్టణంబు విబుధేంద్రాకల్పితంబై సుధ
ర్మారూఢంబును భాస్వదీశ్వరవసువ్యాప్తంబునై పుణ్యవి
స్తారంబై యమరావతీపురవిలాసం బంది నిత్యోత్సవా
ధారంబై పరఁగున్ దురంతదురితోదారవ్యథాదూరమై. ౪౪

సీ. అట్టిపట్టణ మేలు నమ్మహీకాంతుఁడు దేశాంతరాసక్తిఁ దిరుగుచుండు
నెలమితో షణ్మాసములు పుచ్చి మగిడిన నప్పుడు మంత్రులు నాప్తజనులుఁ
బౌరు లుదారులుం బరివారమును గూడి పీలికూటంబులు మేలికట్లు
తలిరుఁదోరణములు నలరుపందిరులును మొకరతోరణములుమున్నుగాఁగఁ
బురి యలంకరించి కరిరాజు మున్నిడి, కదలి పంచవాద్యఘనరవముల
నెసఁగ దర్శనంబు లిచ్చి యెదుర్కొని, తెచ్చి రుత్సవంబు పిచ్చలింప. ౪౫

ఉ. ఆజననాయకుండు జవనాశ్వము లెక్కి చెలంగి ముందటన్
రాజులు భృత్యులై కొలువ రత్నవిభూషితమూర్తులైన యం
భోజదళాక్షు లారతులు మున్నుగఁ దన్నుఁ బురస్కరింపఁగా
రాజగృహంబు సొచ్చెఁ గవిరాజనవామరరాజభూజమై. ౪౬

ఉ. ఈపగిదిన్ గృహంబునకు నేగిన యాతఁడు తొల్లి యోగని
ద్రాపరిశీలియయ్యు నుచితంబుగ రాజ్యము చేసి నేర్పునం
దాపసవేషియై జనపదంబులు గ్రుమ్మరి క్రమ్మఱన్ ధరి
త్రీపరిపాలనాభిరతిఁ దేఁకువ కెక్కిన రాముకైవడిన్. ౪౭

ఉ. పెక్కుదినంబు లక్కడ నభీష్టవధూజనమందిరంబులం
దొక్కొకనాఁడు రేయి మదనోత్సవలీలలఁ దేలుచు న్విభుం
డక్కఱ దీఱఁ దొంటి విరహవ్యథ నెక్కుడు స్రుక్కి మిక్కిలి
న్మక్కువ కెక్కువైన [1]మగనాలి గృహంబున రాత్రిపుచ్చుచున్. ౪౮

శా. అంతర్గేహములందుఁ గ్రొవ్విరులపర్యంకంబుపై వేడ్కతోఁ
గాంతారత్నముతోడఁ గూడి పిదపం గందర్పకేలీపరి
శ్రాంతుండై శయనంబు రెండుదెసలన్ రత్నంపుదీపంబు ల
త్యంతంబు న్వెలుఁగొందఁ గామసుఖనిద్రాసక్తుఁడై యుండుచున్. ౪౯

---

[1] మృగనాభిగృహంబున- అని యన్నిప్రతులలోను.

చ. బలబలఁ దెల్లవాఱునెడఁ బార్థివశేఖరుఁ డత్యరిష్టమా
కలఁగని మేలుకాంచి యధికం బగువిస్మయ మంది లేచి తా
జలకము దీర్చి సంధ్యపరిచర్య యొనర్చి యనేకభూషణో
జ్జ్వలనిజమూర్తి యై కొలువుసాలకు వచ్చి కవు ల్నుతింపఁగన్. ౫౦

గీ. వచ్చి దొరలు గొలువ వజ్రసింహాసనా, రూఢుఁడై ముఖాబ్జరుచి యెలర్పఁ
దన్నుఁ గొలుచువారిఁ దగురీతి మన్నించి, తేరకొనఁగ హితులదిక్కుచూచి.

క. వినుఁ డేను రక్తచందన,మున నంగము దోఁగ మేఘమున కెనయగు కా
రెనుఁబోతు నెక్కి యామ్యము,*చనుచుంటినొకండ నంచు స్వప్నముగంటిన్.

క. ఈకల శుభమో యశుభమొ, నా కనవుడు నందఱు స్మనంబుల భీతి
వ్యాకులులై వదనము లా,లోకింపఁగ దృష్టకౌశలుం డొకఁ డనియెన్.

క. ధాతుగుణంబులఁ గల లుప,జాతము లౌ †వినికిఁ జూడ్కి సంస్మరణమునన్
రీతి యెఱిఁగి కల విఱుచుట, నీతి చుమీ విఱుపుకొలఁది నిజమౌనదియున్.

గీ. వినుము ధరణినాథ విన్నప మియ్యెడఁ, దొల్లి యొక్కమనుజవల్లభుండు
దేవుఁ డుదయమైనయావేళఁ గలగని, లేచి యొద్ది వనితఁ జూచిపలికె. ౫౫

క. సన్నపుగట్టుననుండి స,మున్నత మగుకొండమీఁది కుఱికితి నని నేఁ
జిన్నకలఁగంటి నీఫల, మెన్నఁగ నీమదికిఁ జూడ నెట్లగుఁ జెపుమా. ౫౬

వ. ‡నావుడు నది ప్రేమపాత్రం బగుభోగస్త్రీ గావునఁ బరిహాసరూపంబుగా నగుచు దిబ్బనుండి కొండ కుఱుకంబోయిన నడుముం గాలు విఱుగంబడి యెద వనిన. ౫౭

క. నగుచుం గేహము వెలువడి, జగతీపతి జలకమాడి సంధ్యార్చన యొ
ప్పుగఁ దీర్చి యేగి కొలువునఁ, దగువారలవంకఁ జూచి తనకలఁ జెప్పెన్.

క. చెప్పిన గ్రీనతనికిఁ గలలో, నప్పర్వత మెక్కుడిది మహాశుభ మగు నే
చొప్పున ఫల మొనగూడునొ, తప్పక వినిపింతుమనుచుఁదలపోసి యటన్.

క. నీరాజ్య మల్ప మిది యిఁక, నేరీతులఁ జూడ నీకునింకన్నధిక
శ్రీరమ్య మైనరాజ్యము, చేరం గల దనుచు వారు చెప్పిరి పతికిన్. ౬౦

---

*చనియెద నేనొకఁడ. †జాతంబులు. ‡క. నావుడునది భోగస్త్రీ, గావునఁబరియాచకం బుగా గుబ్బలినుం, డావలికొండకు నఱుకం, బోవుట యటఁ గాలు విఱుఁగఁబొరిఁబడె దనినన్. (ఒక్కప్రతి) గ్రీనందఱు.

ఉ. అత్తఱి వచ్చి యొక్కఁడు రయంబున మ్రొక్కి నృపాలశేఖరా
యుత్తరదేశ మేలెడు నృపోత్తముఁ డీల్గిన మంత్రు లన్యులం
జిత్తములందు మెచ్చక విశిష్టగుణాఢ్యుఁడ వంచు రాజ్యము
న్విత్తముఁ గూడ నీ కొసఁగు వేడుకఁ *బుచ్చినఁ గానవచ్చితిన్. ౬౧

చ. అనవుడుఁ జోద్యమంది యతఁ డాప్తులమాటలు నిక్కమైన నె
మ్మనమునఁ బొంగి వారికిఁ గ్రమంబునఁ గోరిన వాని నెల్ల మె
చ్చున కొనఁగూడ నిచ్చి తగుశూరులు వీరులుఁ గొల్వ నుత్తరం
బున కధికప్రతాపమునఁ బోయె నరాతికులంబు బెగ్గిలన్. ౬౨

వ. అంత నద్దేశంబుఁ బ్రవేశించుచు మనోల్లాసంబున. ౬౩

క. తఱచైన మంది ముందఱఁ, †బరువడిఁ జని తలఁగ ధరణిపతి తురగంబుం
బఱపుచు‡ముందలఁదనకల, విఱిచినక్రియ గ్రుంతఁ గాలువిఱుగంబడియెన్.

వ. అప్పు డందఱును హాహాకారంబుల గుంపులుగూడుకొని పలువరింపంగ వా
రిలో §సద్యస్సంధాననిపుణుం డగుజెట్టి పట్టి దట్టి గట్టిగాఁ గట్టి మంత్రించి
¶సుఖితుం జేసిన సుఖాసనంబుపై నాసీనుండై చనంగ. ౬౪

శా. ఆదేశంబున మూలదుర్గ మగుప్రోలావాసమై యున్న ధా
త్రీదేవప్రకరంబుఁ దత్ప్రిజలు మంత్రిస్తోమమును బూజితం
బౌదంతావళముం బురస్సరముగా నంకించి యేతెంచి యా
హ్లాదం బొప్పఁగ రాజుఁ గూడుకొని వాద్యంబు ల్వడిన్ మ్రోయఁగన్.

ఉ. వచ్చినవారికెల్లఁ బతి వైభవ మేర్పడ నల్లపట్టులుం
బచ్చనిపట్టు కెంపు గల పట్టులు సొమ్ములు నాదరంబుతో
నిచ్చి గజంబునెక్కి తరళేక్షణ లాడుచుఁ బాడ వీటిలోఁ
జొచ్చి యమాత్యు లౌననఁగ సుస్థిరుఁడై ధరయేలెఁ గావునన్. ౬౫

క. తెలియక పలుకుట యుచితమె, జలజభవుం బోలునట్టి సచివుని భట్టిం
బిలిపింపు మాతఁ డెఱుఁగని, కల లెవ్వియు లేవు పొందుగా నది చెప్పున్.

చ. అనునెడ భట్టి వచ్చినఁ గృతాదరుఁడై తన పొంత నాసనం
బునఁ దగ నుంచి విక్రమవిభూషణుఁ డాకలఁ జెప్పి యేవిధం
బున నిది యున్న దీవు తలపోసి నిజంబుగ నాకుఁ జెప్పుమా
యనవుడు నయ్యమాత్యవరుఁ డాత్మఁ గలంగి కలంగ కిట్లనున్. ౬౬

*బంచిరి- †బరిపిరి- ‡మొదల. §శల్యసంధాననిపుణు. ¶సుచిత్తుంజేసి.

మ. ధరణీనాయక వీరెఱుంగరె నిషేధం బంచుఁ జెప్ప న్భయా
తురచిత్తంబుల నున్నవార లిచటన్ దోషంబు నిర్దోషము
న్వైరవారం దలపోసి చెప్పఁదగు నుర్వీభర్తకు న్మేలుగాఁ
బరిశీలించు నిజాప్తవర్గమున కీభంగి న్భయం బేటికిన్. ౭౦

గీ. కలకు మొదలిజాము ఫలమొక యేఁటిలో,నందుకొనుద్వితీయయామఫలము
అష్టమాసములకు నబ్బుమూఁడవజాము,ఫలము చూడమూఁడు నెలలఁగలుగు.

క. తొలివేకువగాఁ దూర్పునఁ, దెలుపెక్కఁగఁ గన్నకలలు దినదశకమునన్
ఫలియించుఁ*బసులవిడువం, దలఁకొనుకల సిద్ధిఁ బొందుఁదద్దివసమునన్ ౭౧

క. ఏనుఁగు గుఱ్ఱముఁ బచ్చని, మ్రానును మేడయును మెట్టు మగపసరంబుం
బూని కలలోన నెక్కిన, మానవునకు సుఖము రాజ్యమహిమయుఁగలుగున్.

క. కలలోఁ బాములుఁ దేళ్ళను, జెలగలుగఁ జుచుటయుఁ†జావుఁ జెప్పెడుఁ బోరిమై
మలమంటుట పొందందగు, లలనలఁ బొందుట సుతార్థలాభము చుమ్మీ.

క. ‡తలఁ జేను దినుటయును ప్రే
వులఁ జుట్టఁగఁబడుట మానవుల నెత్తురుఁ గం
డలుఁ బెరుఁగుఁ బాలు మద్యం
బులు [1]నెయ్యిని ద్రావుటయును ముదమగుఁ గలన్. ౭౨

గీ. నీరు నెత్తురుఁ గనిన [2]నిడుదగు నాయువు, మంట గంట పసిఁడిపంట గంట
తెలుపు లెల్ల మేలు కలలోన వెలిమిడి, యెముక ప్రత్తి లవణముముకదక్క.

క. వినుమిఁక [3]మొద్దును గాడిద, నెనపోతును లొట్టిపిట్ట నెక్కిన నన్నం
బును బిండియు నువ్వులు గలఁ, [4]దినఁగన నగుఁ గీడు వసుమతీవరతిలకా.

క. నూనెయుఁ గలియును గ్రొవ్వును, దేనెయుఁ గలఁ ద్రావెనేనతివ్యాధియగున్
వానరముఁ బొగయుఁ గాకియుఁ, గానంబడెనేని గీడు గానఁగవచ్చున్. ౭౩

క. మదగజము దేవరయు మృగ,మదమును గోపురము నీలమణులు న్నవనీ
రదములు ధరణియుయమునయు,నుదకుంభము దక్క నలుపులొప్పవుగలలన్.

చ. జనవర నల్పులందు మహిషం బతినింద్యము దాని నెక్కినన్
ఘనముగఁ గీడు గాన నధికం బగు శాంతి యొనర్చి యాకృతాం

---

*పసులఁ బిడుకఁదలఁకొను- †జావుచేటొదవును మై, ‡తలజేన తీట, [1]నెరయఁద్రావుట-
[2]నిడికగు, నిగడనా. [3]యెద్దును, ప్రోడను, [4]దినఁగోరంగాదు-

తునకు మహోపచారములఁ దుష్టి జనింపఁగఁ జేయ మేలగు
న్నినుఁ బనివంప నిట్లొరులు నేర్తురె రాజవు నీవు నావుడున్. ౧౦

మ. ధరణీశుం డిది యెంతకార్య మని యుత్సాహంబుతో శాంతి చె
చ్చెరఁ గావించి కృతాంతుఁ బూజల నతిక్షేమంకరుం జేసి స
ద్గురులం బేదల విప్రుల న్వరుసతో గోభూతిలార్థంబులం
బరమప్రీతులఁగా నొనర్చి పిదప న్భాండారితో ని ట్లనున్. ౧౧

క. భాండాగారములందుఁ బసిండియు రత్నములుఁ బట్టుఁజీరలు ధనము
న్నిండ నిడి తలుపు లెవ్వియు, నుండఁగనీయకుము నీవు నుండకు మచటన్.

వ. నీ విప్పుడు పెద్దతలవరికి రాజు బండారంబు చూఱవిడిచె నేఁడు మొదలుగా నేడుదినంబులుదాఁక జను లెల్ల నిచ్చకు వచ్చువానిం గొనిపోం డని చాటించి దేశంబువారి నెల్లఁ జూఱకు రండని యాప్తాద్రి బంట్లనూరూరికి బంచుమని చెప్పు మనవుడు భాండాగారికుం డతివిస్మితుండయి ధనకనకాదివస్తువులం గోశగృహంబులు నించి విఘటితకవాటంబులుగఁ జేసి తలవరికిం దత్క్రమం బెఱింగించిన. ౧౩

క. జనపతి యేడుదినంబులు, తనబండారంబు వస్తుతతి చూఱలుగా
నొనరించు వలయునది కొని, చనరో యని యతఁడు వీటఁజాటఁగఁబంచెన్.

క. ఊరూరికిఁ జెప్పఁగఁ దన, వారిని బనుచుటయు నెల్లవారును గుంత
న్వారింపఁబడక చేరెను, వారిక్రియ న్వచ్చి రయ్యవంతీపురికిన్. ౧౫

గీ. వచ్చి వీరువారుఁ జొచ్చి నిచ్చలవిడి, బుడమతోఁట వీటఁబుచ్చునట్లు
నేడుదినము లం దనేకవస్తువులను, గొనుచు నేగి రింపు గొనలుపాఁగ. ౧౬

క. తనిసి ప్రజ చనిన నష్టమ,దినమున బండారి వసుమతీరమణునకున్
వినిపించెఁ బూని చూచిన, ధనసంఖ్య త్రయోదశార్బుదము లయ్యెఁజుమీ.

ఉ. ఈగతిఁ జన్న యాగి ధరణీశ్వర నీకడ లేదు గావునన్
వేగమె క్రమ్మఱం జనుము వీఱిఁడి చేఁతలు మాను మన్న నా
త్యాగనిరూఢికి న్నిగుల నచ్చెరు వందుచు భోజుఁ డాత్మ ని
త్యాగమనంబు రోసి తనయంతిపురంబున కేగె సిగ్గునన్. ౧౮

—ఇరువదినాలుగవబొమ్మకథ—

వ. మఱియు న్శుభదినంబునఁ జతుర్వింశద్వారంబునం గడంగి. ౧౯

క. శీతగిరిబంధు*నూతన,శీతకరాభరణు సింధుశీతలమాళిం
జేతోజాతవిఘాతి, న్భూతివిభూషణుని సర్వభూతాధ్యక్షున్. ౨౦

* దినమణి, శీతకరాంబరుని గగనసింధుశశిధరున్,

చ. తలఁపుచు విక్రమార్కుని కథాశ్రవణంబున కిచ్చగించి యు
జ్జ్వలమణికీలితం బగు దివస్పతియాసన మెక్కవచ్చుచోఁ
బలికెఁ బసిండిబొమ్మ జనపాలక నీమతలం పెఱింగితి
న్వల దననేల మేలు వినవచ్చినవారల మాన్పవచ్చునే. ౯౧

శా. ఓభోజక్షితిపాల నిల్చి వినుమా యుర్వీశుఁ డీశార్చనా
లాభాసక్తుఁడు శక్తుఁ డింద్రసమలీలాచారి యాచారి యా
శాభాగప్రవికీర్ణమాయశమున న్సర్వార్థిదారిద్ర్యము
ద్రాభంగక్షమదృష్టదృష్టి కరుణోదారుండు ధీరుం డిలన్. ౯౨

శా. ఆరాజన్యుఁడు నేల యేలునెడ నత్యాశ్చర్యమా నేఱులై
క్షీరంబు ల్ప్రవహించు మ్రాఁకుల మధుశ్రేణు ల్మహావృష్టి సం
ధారాపాతములై స్రవించు ధరణిన్ ధాన్యంబులుం బర్వతా
కారత్వంబునఁ బండుచుండు నరలోకం బొప్పుఁ దత్సంపదన్. ౯౩

గీ. అట్టి దివసముల జనాధీశ్వరుండు దేశాంతరములు చూడ నరుగు వేళఁ
*బ్రజలవలనఁ దమవిభాగముల్ దీఱక, వైశ్యసుతులు కోరి వచ్చి రటకు.

గీ. వచ్చి సాగి మ్రొక్కి వసుమతీనాయక, నలువురమును సోదరులము మేము
విన్నవింతు మొకట వినుము పురందరపుర మనంగ నొక్కపురము గలదు.

క. సుందరులు మేనకాదులఁ, గ్రిందుపఱుపఁ బురుషు లమరకిన్నరులను లీ
లం దెగడఁగ నాపురికిఁ బురందరపుర మనఁగఁ బేరు రమణీయ మగున్.

ఉ. ఆపురమధ్యమంబున మహారజతాంచితకుంభదీప్తి సం
దీపిత మైన మేడ హిమదీధితి బింబము మీఱు నందు సు†
స్థాపితవైభవుండు ధనదత్తుఁడు మజ్జనకుండు వైశ్యము
ద్రాపరిపాలకుండు ధనదప్రతిరూపకుఁ డుండుఁ బెంపునన్. ౯౪

చ. సదమలచిత్తుఁ డానతని సద్మమునన్ ఘటసన్నిభంబు లౌ
పొదుగులపాలు క్రిక్కిఱిసి భూమి తదీయయశస్స్వరూపమై
చెదరఁగ మందయానములఁ జెన్ను వహించుచు వేల సంఖ్యల
న్మొదవులు కామధేనునిజమూర్తు లన న్విలసిల్లె నయ్యెడన్. ౯౫

---

*ప్రబలమైన ధనవిభాగముల్—ప్రజలవలనఁధర్మభాగముల్.

†సంప్రాపితవైభవుండు ధనవంతుఁడు

క. కలలో నైనను గలవను, దలయెత్తఁగనీక బహువిధంబులధాన్యం
బులరాసులుతద్గృహములఁ, గొలఁదియెఱుఁగరాకయుండుఁగొండలభంగిన్.
క. అనిలునితోడివివాదం,బున డొల్లిన మేరుశిఖరముల కైవ యనఁగా
దినకరున కెదురు *వెలుఁగుచుఁ, గనకంబులప్రోవు లతనిగాదెలనొప్పున్.
క. ఓమనుజాధిప యతనికిఁ, దూమెం డ్లైనను బుట్లు తొంబది పండం
గా మెఱయు పొలముగల స,ద్గ్రామంబులు నూఱుగలవు కంచికి నెనయై.
ఉ. ఈగతిఁ బెక్కుసంపదల నెన్నికకెక్కిన మగ్గురుండు నీ
రోగశరీరుఁడై బ్రదికి రుద్రసఖుం డనఁ గీర్తి దాల్చుచుం
ద్యాగము భోగమున్ జరపి దైవగతిం గడకాలమైన ఖ
ట్వాగతుఁడై తనూభవుల వద్దికి నల్వురఁ బిల్చి యిట్లనెన్ ౧౦౨
సీ. ధరణిపై నిడుఁడు ముందటిక్రియ సాగించుఁ డర్థంబునకుఁ గాటులాడవలదు
క్రమమున నాల్గుమంచముకోళ్ళక్రిందనేఁ బాతినయవిమీఁకుఁ బాళ్లుగాఁగఁ
గై కొనుం డాప్తవర్గంబును బెద్దల వైశ్యధర్మంబుల వదలవలదు
సంతసంబును బుద్ధిమంతులై †పెద్దలఁ బోలి బ్రతుకుఁ డంచు బుద్ధిసెప్పి
మిగుల నడలి నేమ దిగువకు డించిన, యంత గురుఁడుశివునియందుఁగలిసె
నాత్మజాతికుచితమైన సంస్కారంబు, నడపి తద్దినములు గడపి పిదప. ౧౦౩
క. సుముహూర్తంబున నామం,చముకోళులక్రిందఁ ద్రవ్వి చరువులలోఁ జి
ట్టుముకయుమన్నునుబొగ్గులు, నెముకలు వేర్వేఱఁజూచిహృదయములులికెన్.
మ. భువిలో డాఁగఁగఁ జేసె రాగిచరువు ల్పూరించి యీతుచ్ఛవ
స్తువు లేలా మనయయ్య డాఁచె ధన మిచ్చోఁ బెట్టఁడో కాక బు
ద్ధివినాశం బతఁ డొందె నొక్కొ మనలో దృష్టించి యెవ్వాఁడో దొం
గవిధం బచ్చుగఁ ద్రవ్వి చేకొనియెనో కా కంచుఁ దర్కించుచున్. ౧౦౪

* * * *

క. అయ్యపనిగాదు దాసులు, నియ్యెడ దృష్టింపనేర రెవరుం జొర లే
దయ్యముగా నా కెంపులు, దయ్యముగొఱయించెననుచుఁ దలపోఁతలతోన్.
క. మాలోనమ్మకయును నొక, పాలుం దేలకయు బహుసభాస్థలముల నీ
మూలములు చెప్పి విసిగితి, మేలాగున నైన నిర్ణయించు నృపాలా. ౧౦౫
వ. అని విన్నవించిన సుముహూర్తమాత్రప్రయాణోన్ముఖుండు గావున ధర్మా

---

*మెలఁగుచు †పెద్దల బ్రోచి- ****ఇచ్చోటు రెండు పద్యములర్థము కావున్నవి.

ధికారులను మంత్రులను బిలిపించి దీని నిర్ణయింపుఁ డని యప్పగించి విక్ర
మార్కుండు కొన్నిపయనంబులు భట్టిసహాయుండుగాఁ జనిన. ౧౦౮

శా. ధర్మాధ్యక్షులు మంత్రులుం బిదపఁ దద్వాదంబు దీర్ప న్వణి
గ్జర్గం బేమియుఁ గాన లేక నగుచు న్నాకేల కల్లాడ నం
తర్మాయాపరుఁ డైన మీజనకుఁ డర్ధం బుండఁగాఁ బాళ్లుగా
నిర్మించె న్మను బొగ్గు లాది యగువానిం బంచికొం డిమ్ములన్. ౧౦౯

మ. అని హాస్యంబుగఁ జేసి పుచ్చినను నర్థాసక్తులై *వైశ్యనం
దను లూహారికి నేగి చెప్పికొనుచున్ ధాత్రిం బ్రతిష్ఠాననా
మనిరూఢం బగు వీడు చొచ్చి చని తన్మధ్యంబునన్ శాలివా
హనునిం గాంచిరి దివ్యతేజుఁ డయి బాల్యక్రీడఁ గ్రీడింపఁగన్. ౧౧౦

చ. కనుఁగొని దివ్యమూర్తి యని గౌరవ మొంతయుఁ దోఁప మ్రొక్కి యో
దినకరతేజ మాతగవు దీర్పుము ధారుణి నెల్లచోటులం
గనికని చెప్పి నిర్ణయము గానక వచ్చితి మంచుఁ దండ్రి చే
సిన నియమంబు మున్నుగ నశేషముఁ జెప్పిన నక్కుమారుఁడున్ ౧౧౧

క. మీతండ్రియ పాళ్ళులు నిర్ణీతములుగఁ జేసి చనియె నేరక మీరీ
భూతలమునఁ దిరుగఁగ నొక, చాతుర్యము గలుగునట్టి జనుఁడును లేఁడే.†

వ. అయిన నేమి యయ్యేఁ దెలియ వినుండు. ౧౧౩

గీ. ఉముక ధాన్యరాసు లెముకలు పశువులు, మన్ను పొలము గలిగియున్న యాళ్ళ
బొగ్గులును బసిండి ప్రోవులు పాళ్లగా, నిచ్చినాఁడు వానిఁ బుచ్చికొనుఁడు.

గీ. పాదధనము పసులు పసిఁడి యర్ధధనంబు, పావుగొఱఁత ధనము పండుభూమి
ధరణి నధికధనము ధాన్యంబుగావున, వానిఁగొనుఁడు పెద్దవానివరుస.‡

చ. అనవుడుఁ జోద్యమంది కొనియాడుచుఁ గ్రమ్మఱ మ్రొక్కి వైశ్యనం
దనులు కృతార్థులై మగిడి తండ్రిగృహంబున నున్నసొమ్ము లా
తనివచనస్థితిం గొని ముదంబున నుండఁగ విక్రమార్కుఁ డా
య్యనఁ బరదేశము ల్దిరిగి యాత్మపురంబున కేగి యిమ్ములన్. ౧౧౬

చ. వలనుగ నొక్కబాలకుఁడు వైశ్యులపాళులఁ దీర్చెనంచు మం
త్రులు వినిపించిన న్విని విరుద్ధము బాలున కివ్విశేషకా

*నర్థాయాసులై, † వినఁడే. ‡గీ. పాదధనము పసులు పసిఁడిపాదధనంబు, పాదధనము పొలముపంటయూళ్లు. ధరణిపాదధనము ధాన్యంబుగావున, వాని గొనుడు పెద్దవానివరుస,

శల మని చోద్యమంది నిజశత్రునిగా మది నిశ్చయించి భృ
త్యులదెసఁ జూచి వాని నిట దోడ్తేరం డని పంచెఁ బంచినన్. ౧౧౬

ఉ. ఆనరనాథుభృత్యులు మహాబలులేగి రయంబునం బ్రతి
ష్ఠానపురంబు సొచ్చి శిశుసంగతి నాడెడు శాలివాహును
జ్జైనికి విక్రమార్కుని భజింపఁగ రమ్మని పల్కునంత వై
శ్వానరుమీఁద నెయ్యలుకుచందము గానఁగ నయ్యె నయ్యెడన్. ౧౧౭

గీ. వెట్టిజోగిఁ జూపి విక్రమార్కుం డని, వెఱపువెట్టి విఱ్ఱవీఁగవలదు
మీనృపాలకుండు తానె రాజే నేని, నిటకువచ్చి బ్రతికి యేగు మనుఁడు.

క. మీరుం బాలియక పొం డని, వీరుం డై పలికె నంత వీరుం దమయు
ర్వీరమణునకుం జెప్పఁగ, వైరం బిఁకఁ బుట్టె ననుచు వచ్చిరి మగుడన్.

వ. అంతకుము న్నొకదినాధికవర్ష యగు కన్యకకుం బుట్టినవాని నరయం బో
యిన బేతాళుండు నతనియునికి వినిపింపంగ నతని భృత్యులుం జని యో
మహారాజ నీయాజ్ఞతోడంగూడ మమ్ముఁ బాఱఁ ద్రోపించె నబ్బాలుండు బా
లార్కులీలం గ్రాలుచుండు నని చెప్పి *తద్ధిరోక్తు లెఱింగించిన. ౧౨౧

క. కలఁగియుఁ గలఁగక యాతఁడు, బలములు గొలువంగ నేగి పై ఠాణము ద
వ్వులవిడిసినఁ గొందఱు భృత్యులు ముందఱఁ బాఱిగవని దూఱిరి వెలుచన్.

సీ. తూఱి తోరణములు ద్రుంపఁగాఁ బ్రజ లెల్ల నడలిన వారిభయంబు లుడిపి
తండ్రియానాగేంద్రుఁడలఁచితచ్ఛక్తిఁ గృత్రిమరూపములకుఁ బ్రాణములువడసి
కదలుచో నిండ్లు వృక్షంబులుఁ గోటలు జంగమత్వము నొంది సరస నడచె
నొక శాల నెక్కి బాలకుఁ డది యాదిగా శాలివాహనుఁ డను సంజ్ఞఁ దాల్చె
సేన లట్లు వెడలి భూనాథుభృత్యులఁ, బఱపి మొదలిదండుపైఁ గడంగి
పోరునప్పు డురగములు శేషుపంపున, వచ్చి విక్రమార్కువారి నఱఁచె. ౧౨౩

మ. తనసైన్యంబులు ఘోరసర్పవిషనిర్దగ్ధంబు లైన న్మనం
బునఁ జింతించి యతండు వాసుకి మహాభోగేంద్రు సేవించి యా
తనిచేత సుధఁ దెచ్చి సేనలకుఁ జైతన్యంబు రప్పింతు నే
నని యేగె న్నిజభృత్యరక్షణగుణాయత్తుఁడు మంథాద్రికిన్. ౧౨౪

క. ఆమందరగిరితటమున, భూమీశుఁడు భక్తినిష్ఠ భుజగేంద్రకుల
స్వామికిఁ దప మొనరింపఁగ, నామహాసీయుఁడు ప్రసన్నుఁడై వేఁడు మనన్.

---

*తద్విరోధోక్తులు.

క. నీరూపం బమృతోద్భవ,కారణ మటు గాన నీవె కర్తవు నాసే
నారక్షణమునకు సుధా, పూరిత మగుకలశ మిచ్చి పుచ్చు మహీంద్రా.

చ. అని ప్రణమిల్లిన న్ఫణికులాధిపుఁ డయ్యమృతంబు కుండలో
నినిచి ప్రియంబుతో నొసఁగి నీవిఁక నేగుము నావుడు న్రయం
బునఁ దనుతల్లి దాస్యము విముక్తము సేయ సుధారసంబు నే
ర్పునఁ గొని వచ్చుపక్షిపతిపోలికతో నృపుఁ డేగుదేరఁగాన్. ౧౨౮

ఉ. దీప్రముఖప్రసన్నుతు లతిప్రమదప్రకృతిప్రశస్తులో
కప్రియవాదు లప్రకటకార్యులు సుప్రభలందు సూర్యచం
ద్రప్రతిమాను లప్రతిహతప్రతిభాగతి నప్రమేయులౌ
విప్రకుమారు లంతఁ బృథివీపతిఁ జేరి నుతిప్రవీణులై. ౧౨౯

సీ. శివుఁ డిచ్చ మెచ్చి యిచ్చిన దివ్యఫలముఁ గారుణ్యంబుతోఁ గుష్ఠరోగి కిచ్చి
యవధూతుఁ డిచ్చిన యాసిద్ధలింగంబు నాహార మడిగిన యతని కిచ్చి
కంబ మెక్కిననాఁడు కమలాప్తుఁ డిచ్చిన కుండలంబులు యాచకునకు నిచ్చి
యసురేంద్రుఁ డిచ్చిన రసరసాయనములు కలహించునిద్ద ఱర్థులకు నిచ్చి
నయముతోఁ ద్రికాలనాథుఁ డిచ్చినబొంత, యాదిగాఁగ రాచపేద కిచ్చి
వీరవిక్రమార్క ధారుణిఁ జరియించు, పారిజాత మనఁగఁ బరఁగి తీవు.

క. ఖేచరపతిశిబికర్ణద,ధీచుల నినుఁ బోల్పరాదు దీనుల కర్థం
బేచోట నిచ్చి రుర్విని, నీచాగము సర్వవస్తునివహము గాఁదే. ౧౩౦

క. అర్థం బన్యుల నడిగిన, యర్థులు వ్యర్థులును గడు నిరర్థులు నట యో
పార్థివ నినుఁ బ్రార్థించిన, యర్థులు సార్థులుఁ గృతార్థు లధికసమర్థుల్.

మ. అనుచుం బెక్కువిధంబులం బొగడఁగా నాబాలవిప్రద్వయం
బును వారించుచు నింత యేల హృదయాంభోజంబులో నున్న ప్రా
ర్థన మీకే మది వేఁడుఁ డిత్తు ననినన్ ధాత్రీశ్వరా నీవు ద
ప్పనిరాజేంద్రుఁడ వేని యాయమృతకుంభంబిప్డు మాకింపగున్. ౧౩౨

క. అనుచు న్వాలాయఁబుగఁ, దను వేఁడిన మనములోనఁ దత్తఱపడ* కే
మనవచ్చు మీరు నావ,ర్తనమెఱుఁగుదు రెవ్వరొక్కొ దైవతమూర్తుల్.

క. తెలిసెద నని నృపుఁ డావి, ప్రుల సంబోధించి యిచటఁ బొంకకుఁ డధికో
జ్జ్వలము లగునట్టిరూపం,బులమీ రెవ్వరు సమస్తముం జెప్పుఁ డనన్.

* దక్కలపడి-దక్కలపడియే.

పటుతరబ్రహ్మాండభాండోదరుండవు కలుషాంధకారభాస్కరుఁడ వనుచు
నిన్నెంతు సేవింతు నీమహత్త్వం బెన్న నే నెంతవాఁడను నిగమవేద్య
యాదిమబ్రహ్మవు నీదయ నామీఁద నేదయా భక్తవినోద మీఁదఁ
గాదులే పార్వతీగంగాసతులవాదు లాలించుచును మది జాలిఁ జెంది
మఱచితివో లేక యిఁకనైనమనసునుంచి, కాచిరక్షించుకృపయుంచికన్నతండ్రి-
మత్స్యకచ్ఛపకిటిమనుజసింహాకృతి వామనజమదగ్నిరామరామ
హాలిబౌద్ధకల్కిరీతులతోడ భూమిని సాధుల రక్షింప జనన మొంది
సోమక(మందరహేమా)క్షతదనుజబలిరాజరావణబలుల దనుజ
కాంతులఁ దులువలఁ గడతేర్చి నట్టి శ్రీకాంతునంచితముగ ఘటనసేయ
నెవ్వరికిఁదీరునీధైర్య మెంచఁదఱమె, శేషభాషాపతులకైనసిద్ధముగను,మ-
చంద్రశేఖర నీదుచరణకంజములను సేవింపఁగాలేనిచేతు లేల
కందర్పహర నీదుకమనీయమగుమూర్తిఁ గనుఁగొనఁగాలేనికన్ను లేల
విబుధసన్నుత నీదువిశ్రుతసత్కీర్తి విన లేని యట్టియావీను లేల
త్రిపురాంతకా నీదుదివ్యాలయములకుఁ జనఁగలేనట్టి యాజన్మమేల
భక్తిలేకసమర్పించు పత్రియేల, నిత్యమగు......మదన మదభంగ- ౬౭
ఘోరసంసారాంధకారంబులోఁ బడి దారిఁ గానక నీవె దరి యటంచు
నమ్మియున్నాఁడను నను విడనాడకు దీనులపాలిటి దేవుఁ డనుచు
నింత వేఁడినఁగాని యేమనిపలుకవో యింత నిర్దయనీకు నేలపుట్టెఁ
జుట్ట మెవ్వరులేక గట్టుపై నెలకొని చట్టుపట్టిననేలి నట్టివిధము
గాకయుండిన నీకిట్టికఠినచిత్త, మేమికతమున గలుగునో యిందుమౌళి,మ-
తరణివంశంబున దశరథగర్భాబ్ధి పూర్ణచంద్రుం డని పుడమి వెలసి
కౌశికుయాగంబుఁ గరుణతో రక్షించి పదరజమున రాతిఁ బడఁతిఁజేసి
దండధరారికోదండంబు ఖండించి ధరణితనూజ నుద్వాహమయ్యుఁ
బరశురాముని శౌర్యపటిమ లీనముచేసి తనపురికేతెంచి తండ్రివనుప
ననుజజనకజలతోరాముఁడడవికరిగెఁ,గారణం బెంతవారికిఁగడపవశమె,మ-
శ్రీవిష్ణుపాదరాజీవసేవాసక్తి బంధుసంరక్షణప్రబలయుక్తి
తారతమ్యజ్ఞానధారేయతారూఢి నిరతాన్నదానమానితనిరూఢి
సంగీతసాహిత్య సరసజ్ఞతారీతి విదురోపమానాననవీననీతి
నలజయంతాదుల నదలింపఁగలమూర్తి కర్ణశిబీంద్రులకరణి కీర్తి

కలుగవలసినవారలుఘనులు వారిఁ, దలఁచుచుందురుబుధులెందుధన్యులనుచు
మదనమదభంగమహితక్షమాశతాంగ,కరధృతకురంగకంచియేకామ్రలింగ.
దానకర్ణుండని ధరఁ బ్రసిద్ధికి నెక్కి కులము సూతుఁ డటంచుఁ గొదవగాంచెఁ
గదనార్జునుం డని కడుఁ బ్రకాశమునొంది పేడి యై కొన్నాళ్లు పీడఁబడియె
దబ్బఱలాడని ధర్మనందనునకు గజము నెపంబునఁ గలిగె నింద
విలువిద్యనేర్పున వీరుఁడై వెలసిన పరశురాముఁడు భీష్ముబారి నొదిఁగె
సకలలక్షణములయందు సమతఁజెంద, నెంతవారికిఁ దీరదు నీకుఁదక్క ,మ-
పలుమాఱు వేఁడినఁ బలుకకున్నా వదె కోపమా నామీఁదఁ గొదవ లేమి
తల్లి దండ్రియు దాత దైవంబు నీవని మదినెంచియున్నాఁడ మఱపులేక
నేఁజేయుతపమును నిత్యకృత్యంబులు నీకుసమర్పింతు నిశ్చయముగ
గోరినవారికిఁ గొంగుపసిఁడివై దయచేయుదాతని తలఁచినాఁడ
నింకనామీఁదనేరము లెంచి తేని,దోషమనిచూడనిన్ను నేదూఱుకొందు, మ-
గరళంబు ఘోరమై కార్చిచ్చువిధమునఁ బటునటజ్వాలికాప్రభలతోడఁ
బ్రళయకాలానలబాడబాగ్నులరీతి మాఁడుచునున్నది మాన్పరాదు
ఘనవిషజ్వాలలఁ గ్రక్కుచు జగములఁ గాల్పఁగఁదొడఁగెను గ్రమముదప్పి
రక్షించు రక్షించు రాజశేఖర యను సమరగణములకు నభయమొసఁగి
బాలకృష్ణుఁడు వెన్నచేపట్టినటులఁ, బట్టి విషమునుమ్రింగినభవుఁడవీవె, మ-
పరమేశ్వరా యని భక్తితోఁ దలఁచిన భాగీరథీస్నానఫలము గలుగు
సాంబశివా యని సన్నుతిఁ జేసినఁ బరఁగఁ గృష్ణాస్నానఫలము గలుగు
ఫాలనేత్ర యటంచు భజన చేసినఁ దుంగభద్రానదీస్నానఫలము గలుగు
శివశివా యనుచునుఁ జింతనచేసిన మణికర్ణికాస్నానమహిమ గలుగు
సకలతీర్థంబులునుసీవెసాంబమూర్తి,యెఱుకగలిగినవారలకిదియెనిజము, మ-
అతిలోభికి నొసంగు నత్యంతభాగ్యంబు దాతకు లేమిడిఁ దగనొసంగు
ధనవంతునకును సంతాన మొసంగక యతిరిక్తునకుఁ బెక్కుసుతుల నొసఁగు
నరయధర్మాత్మున కల్పాయువు నొసంగుఁ గష్టజీవునకుఁ దీర్ఘాయు వొసఁగుఁ
బందకుఁ జక్కని పణఁతి నొసంగును రూపవంతునకుఁ గురూపి నొసఁగుఁ
గర్మమే యన్నివిధములుకలుగఁజేయు,ననుభవింపక తీఱునేయజునికైన, మ-
ఇంద్రకీలాద్రిని నింద్రతనూజుఁడు నాహారనిద్రలయాశ లుడిగి
యేకాగ్రచిత్తుఁడై యేకపాదంబున నిలిచి సమ్యక్జ్ఞానసిష్ఠ మెఱయఁ

దపమాచరించిన ధైర్యంబునకు మెచ్చి దయకుఁ బాత్రుం డని తలఁచి నీదు
భక్తులలోఁ బ్రియభక్తుఁ డటంచునుఁ బరమపత్త్రరుణాతోఁ బార్థునకును
నఖిలశత్రుభయంకర మయినయట్టి, దివ్యబాణంబు నొసఁగినదేవుఁడీవె,సు-
ధర్మంబుఁ దప్పక ద్రవ్యమార్జించుచు నాశ్రితులను బ్రోచునతఁడు రాజు
ఏలినవానిని నేవేళనైనను వంచనసేయనివాఁడు మంత్రి
యాయోధనంబున నత్యంత ధీరుఁడై యరులతోఁ బోరాడునతఁడు భటుఁడు
కలిగినంతటిలోనఁ గసరి పోఁద్రోలక యాతిథ్య మొసఁగినయతఁడు దాత
ధర్మమునుసత్యమునుశౌర్యదానములును,గలుగువారలుధన్యులుకలియుగమున-
ఆత్మజ్ఞుఁ డౌటకు నాచారమే సాక్షి కులవంతుఁ డగుటకు గుణము సాక్షి
ధర్మాత్ముఁ డౌటకు దాన మిచ్చుటె సాక్షి మంత్రగాఁ డౌటకు మహిమ సాక్షి
యఖిలంబు తానౌట కానందమే సాక్షి భక్తికలిమికి భజన సాక్షి
శ్రీమంతుఁ డౌటకు శృంగారమే సాక్షి కరుణాత్మునకు సాత్త్వికంబు సాక్షి
గురుకటాక్షంబుకలుగుటగుఱియె సాక్షి,సకలభూతంబులకునీవెసర్వసాక్షి,ము-
భండనోద్దండకోదండపాండితి మును పరశురాముఁడు నీపాటివాఁడు
దుష్టరాక్షసకోటి దురములో ఖండింప భరతాగ్రజుండు నీపగిదివాఁడు
భక్తసంఘమునకు భాగ్య మొసంగను శ్రీకృష్ణుఁ డొకఁడు నీచెలువువాఁడు
మోక్షపదం బిచ్చి ముదముతో రక్షింప నారాయణుఁడు నీనడకవాఁడు
ఎన్నివిధములఁజూడమీకిరువురకును,సమముగానిమఱెవ్వరుసాటిరారు,ము-
అజ్ఞానజాడ్యంబు నణఁగింపఁగాఁ బూర్ణచంద్రోదయంబు నీచరణభక్తి
కామాదికోగ్రసంఘములను బోఁద్రోల జీవనూపతి నీనుసేవ భువిని
ప్రకృతిపైత్త్యవికారబాధల నిరసింపఁ జింతామణియె నీనుచేఁత లవనిఁ
బామరభ్రాంతిచేఁ బరఁగు రుగ్మత మాన్ప లోహంబు నీఖ్యాతి లోకులకును
నటులుగాకున్నభవరోగహారుఁడవనుచు,నవనిలో న్యాలభిధానము రెనీకు
మదనమదభంగమహితక్షమాశతాంగ,కరధృతకురంగకంచియేకామ్రలింగ. 80
పదినెలల్ రాతిరిపగలును రాక్షసవనితలతో సీత వసటఁ గుందె
విరటుమందిరమున వెలఁదులసన్నిధి ద్రౌపది యొకయేఁడు దాసియయ్యె
సతదీవ్రులునునేలు సార్వభౌముని భార్య కలహకంటకియింట గాసిఁజెందె
దమయంతి కానలో ధవునిఁగానఁగలేక యలసట చెందెను నవనిలోనఁ
గాలగతి యెంతవారికిఁ గడపవశమె,కమలజునకైనఁ దీఱదు కష్టపడక,మధ-

శాస్త్రంబు లెన్నైనఁ జదువఁగావచ్చును సకలవ్రతంబులు సలుపవచ్చు
మంత్రతంత్రంబుల మహిమ చూపఁగవచ్చు నద్వైతుల మటంచు ననఁగవచ్చు
సంసారమును బాసి సన్న్యసింపఁగ వచ్చుఁ దీర్థయాత్రలకునుఁ దిరుగవచ్చు
సంగీతసాహిత్యజాతు లెఱుఁగవచ్చు దేవాలయంబులఁ దిరుగవచ్చు
జననమరణములును లేనిచదువు చదివి,నిన్నుఁ జెందెడితత్త్వంబు నేర్చుటరుదు-

నీచేతిఖడ్గంబు నిఖిలఁ దోషసమాజభూధరంబులకు దంభోళిధార
నీచేతిశూలంబు నిలిచి నిన్నెదిరించు నరిగజసమితికి నంకుశంబు
నీచేతిబాణముల్ నిష్ఠురప్రతిపక్షమేఘపంక్తికిని సమీరణంబు
నీచేతిపాశంబు నిబిడశాత్రవరాజతామిస్రపంక్తికిఁ దపనకాంతి
యనుచుజగములవెలయునీయాయుధములు,వినుతిసేయుమునిరతంబు వేడుకలర-

పటహాభేరీఢక్కపణవశంఖారావగజబృంహితములకుఁ గలఁకపడక
శింజినీటంకారసింహనాదములకు హరులహేషలకును నదరిపడక
ప్రళయకాలానిలప్రభలతోఁ బుత్తెంచు శరపరంపరలకు శంకపడక
చటులహేతివ్రాతసంఘట్టనోద్భవశిఖికీలలకు మదిఁ జిక్కుపడక
పరుల నెదిరించి ధీరులై పగరనణఁచు,వారి రణశూరులందురు వసుధలోన-

గిరిజామనోహర గీర్వాణవందిత వేదవేద్య మహేశ విశ్వరూప
విన్నప మొక్కటి విను మహాదేవ నే నత్యంతదీనుండ నల్పమతిని
నార్తుఁడ నపరాధి నధికపామరుఁడను శాంతిహీనుఁడ మహాచపలమతిని
నీపాదములె చాల నెఱనమ్మి నిరతంబుఁ బగలును రాతిరి భజనసేతు
నిన్నె గాని మఱెవ్వరి నెఱుఁగ నింకఁ, గావవ లెంచిన నీపెద్దకొడుకుతోడె-

చతురుపాయంబుల జరుగువాఁడె నియోగి పరసతీవిముఖుఁడే పరమయోగి
కలిగి భుజింపనికష్టాత్ముఁడే రోగి కలకొద్దియొసఁగినఘనుఁడె త్యాగి
సంగవిరహితుఁడౌ సాత్త్వికుఁడె విరాగి యత్యంతసుఖుఁడగునతఁడె భోగి
పుణ్యంబు తెలియనిపురుషాధముఁడెమూఁగిమాయవేషధరుండెమహినిజోగి
యనుచుభువినీతిశాస్త్రంబులాడుచుండు, ఁ జితరిపుయూధకాశికావిశ్వనాథ-

పెద్దకుమారుని పెండ్లిసేయఁగఁగోరి కన్యకార్థము నెందుఁ గదలినావొ
భైరవునకుఁ గట్టుబట్ట లేనందునఁ గడువడి ధనదునికడకుఁ జనితొ
తనువందు నొకరిని దలమీఁద నొకరిని మోయుశే కెచ్చట ముడిఁగినావొ

భస్మాసురునిబారిఁ బడలేక పరుగెత్తి యలసియేమూలను నణఁగినావొ
లేకయుండినఁ బిలిచిన రాకయున్న, కారణం బేమి భక్తులకడకునీవు, మద-
సతతంబు నీపాదసరసీరుహములకు సద్భక్తితోఁ బూజఁ జల్పుటకును
నిరతంబు నీధ్యాననిష్ఠతో సుజనుల సాంగత్యమునఁ బ్రొదిసల్పుటకును
సకలభూతంబుల సమతవహించెడి తత్త్వంబుమదిలోనఁ (దగులుటకును)
......చయమునిదబ్బఱలాడక మోక్షంబు గనియెడి ముచ్చటకును
నాదుమదిలోన నెప్పుడు నాటియుండు, నటులఁగోరుచునిన్ను నే నాశ్రయింతు-
బాణాసురుండు నీభక్తుఁ డటందురు మూర్ఖుఁడై మిము జన్యమునకుఁ బిల్చె
దశకంధరుఁడు నీదుదాసుఁ డటందురు కైలాస మగలించె గర్వముసను
భస్మాసురుఁడు బహుభక్తుఁ డటందురు వానిద్రోహం బెన్న వశముగాదు
అరయఘంటాకర్ణుఁ డతిశిష్యుఁడందురు నీధ్యానమే లేదు నిశ్చయముగ
వారివలె నన్నుఁజూడఁగ వలదు దేవ, యనపరాధిని దీనుఁడ నతివిమతిని-
పౌన్నాశ మన్నాశ పెణ్ణాశ వీడిన యోగీంద్రుఁడండు రీయుర్విలోన
నియతి యాచారంబు నిశ్చలచిత్తంబు గల్గివెలయువాఁడు ఘనుఁడు భువిని
సత్యము దానంబు సాత్త్వికములు గల్గు పురుషుఁడు ధన్యుఁడు భూమిలోనఁ
బరమభక్తిజ్ఞానవైరాగ్యసంపన్ను సుజ్ఞాని యందురు సూరిజనులు
అశనవసనార్థులై తత్త్వమరయలేక, భేషజంబులఁ జెందినఁ బెద్ద లనరు-
సకలచరాచరసంఘంబు నిర్మింపఁ గమలసంభవుఁ డధికారి యండ్రు
సకలలోకంబుల సంరక్షణము సేయ నాదినారాయణుఁ డాఢ్యుఁ డండ్రు
ప్రళయకాలంబున బ్రహ్మాండములనెల్ల రూపడంచుటకును రుద్రుఁడండ్రు
పుట్టింప రక్షింపఁ బొడవడంచుటకును ముగ్గురుమూర్తులమూల మగుచు
నబ్జజుఁడు నబ్జనేత్రుండు నబ్జధరుఁడు, నరయ నీవని పలుకుదు రార్యులెల్ల-
సద్వంశమునఁ బుట్టి జాలరి యన్నబడి దాతయై తగు వాని తాతపేరు
ధరమీఁదియాశను దల్లితోడునుఁ జంపి ధర్మాత్ముఁ డగువాని తాతపేరు
దనుజకామిని నేల ననుజరక్తము గ్రోలి తగధీరుఁ డగువాని తాతపేరు
వినువాఁకకొమరుని సునిశితాశుగముల ధరణిఁ గూల్చినవాని తాతపేరు
నక్షరద్వయమభిధానమగయనొక తె, తనయు లేకోదరులుభువిఁదథ్యముగను-
కదనంబు భోగినీసదనంబు మదిలోన సమముగాఁ జూచును శౌర్యశాలి
సింగాణిప్రేటులు చలిగోటిమీటులు సమముగాఁ జూచును శౌర్యశాలి

సాదులపోటులు (సకియపూన్రే)టులు సమముగాఁ జూచును శౌర్యశాలి

*   *   *   *   *

వీరశృంగారరసములు వీరవరుఁడు, సమముగాఁజూచుమనసులోసంతతమును
మదనమదభంగమహితక్షమాశతాంగ,కరధృతకురంగకంచి యేకామ్రలింగ.

భక్తజనంబులు భయపడవలె నని దందశూకంబులఁ దాల్చినావా
దీనులు కనుఁగొని దిగులొందవలె నని పునుకలదండలు పూనినావా
యశనము భృత్యులు నడుగుదురో యని క్ష్వేళంబు ప్రీతి భుజించినావా
వసన మాశ్రితులు కావలె నందురో యని కరటిచర్మము మేనఁ గప్పినావా
యెన్ని మాయలు వన్నిన నిన్నువిడువ
నీదుపదకంజములె సాక్షి నిశ్చయముగ
మదనమదభంగ మహితక్షమాశతాంగ
కరధృతకురంగ కంచి యేకామ్రలింగ. 94

ప్రమోదూతనామసంవత్సర జ్యేష్ఠ శు ౧౩ రోజున
నందికొండ వెంకటరామన్న వ్రాసిన ప్రతి.
(దత్తమండలములలో సంపాదింపఁబడినది )

# ౭-తిరుమల శ్రీ వేంకటేశశతకము.

భుజిమెల్ల భగవచ్ఛాస్త్రి.

—। రేఫప్రాసకందపద్యములు ।—

సిరి యురమున మెఱయఁగ నరి, దరములు కరముల ధరించి దయచే జగముం
బరిపాలించుచు నుంటివి, తిరుమల శ్రీవేంకటేశ ! త్రిదశాధీశా ! ౧

దరదరవిందవిలోచన ! స్ఫురదిందుసమానవదన ! సురవందిత ! సుం
దర ! కుందరదన ! మామం,దిర తిరుమలవేంకటేశ ! త్రిదశాధీశా ! ౨

తరుణారుణచరణా ! భవ,తరణా ! భయహరణ ! గోత్రధర ! కరుణాబ్ధీ !
శరణాగతు ననుఁ బ్రోవుము, తిరుమల- ౩

సరసకవిత్వచమత్కృతి, నురులక్షణసరణి నెఱుఁగ నూఱక కృతినీ
కరుణ నొనరింతుఁ గాను మో, తిరుమల- ౪

కరణంబులు ముక్తికలం,కరణంబులు ఫణికి భద్రకరణము లగు నీ
చరణంబులు మదిఁ దలఁచెదఁ, దిరుమల- ౫

శరణాగతజనపోషా ! సురుచిరమృదుసత్యభాష ! సుందరవేషా !
సురవరహృత్సంతోషా ! తిరుమల- ౬

నిరుపమగరుడతురంగా ! పరమమునీంద్రాఘసంగ ! భవభయభంగా !
నిరవధికరుణాపాంగా ! తిరుమల- ౭

ఉరగాధిపమృదుతల్పా ! కరుణాకర భక్తకల్ప ! కమలాకల్పా !
భరితాబ్జజాండకల్పా ! తిరుమల- ౮

కరివరు మొఱవిని బిరబిర, నరిగి దయం బ్రోచినాఁడ వని వేఁడితి నా
మొఱ వినరాదా నరహరి! తిరుమల- ౯

కరి యేమి కట్న మిచ్చెను ? బరికింపఁగ శబరి యేమి భాగ్య మొసంగెఁ ?
ధర వారిఁ బ్రోవలేదా ? తిరుమల- ౧౦

నిఱుపేదల రక్షింపఁగ, మఱపైన నిఁ కెవ్వ రిలను. మఱి దిక్కయమో ?
శరణాగతవత్సల ! హరి ! తిరుమల- ౧౧

నిరుపమసంపద లిమ్మను, కురిపింపు మటంచు నిన్నుఁ గోరఁగ లేదేఁ
తిరమగుముక్తిని వేఁడితిఁ, దిరుమల- ౧౨

శరణాగతు ననుఁ బ్రోవఁగఁ, నొరు లెవ్వరు సములు నీకు నుపమింపఁగ ? నో
కరుణాబ్ధి ! భక్తవత్సల ! తిరుమల- ౧౩

పురుషోత్తమ! నాకిన్నప, మరమరసేయక గ్రహింపు మతికృపవెలయన్
త్వర నపవర్గ మొసంగుము, తిరుమల- ౧౪

అరయఁగ నైహిక మఱిదు, స్తరదుఃఖప్రదము గాన దయచే భవమున్
మఱినొందింపక ప్రోవుము, తిరుమల- ౧౫

నరతిర్యగాదియోనుల, మఱిమఱి ధరఁబుట్టి గిట్టి మఱవనిభ్రమచే
దరిఁగానని ననుఁగావవె, తిరుమల- ౧౬

సరసీరుహాలోచన! నిను, మఱవక భజియించువారు మహి ముక్తిని గొం
దురు గాన భక్తి నొసఁగుము, తిరుమల- ౧౭

పరమేశ్వర! తొలిమేనుల, మఱచి నినుం దలఁపకున్న మహిఁబుట్టఁ దగెన్
వెఱపేల యిపుడు దలఁపఁగఁ, దిరుమల- ౧౮

కొఱమాలినవిషయంబుల, మరగి నిను భజింపకున్న మతిహీనుఁడనై
పొరలితి బహుజన్మంబులఁ, దిరుమల- ౧౯

దురితము లొనరించుతఱిన్, వరపుణ్యక్రియలు మాని వర్తించునెడన్
వెఱవని మహాపరాధిని, తిరుమల- ౨౦

వరద! భవాంభోనిధి సం, తరణము యుష్మత్కటాక్షతరణిని గాకన్
తరమె యుపాయాంతరములఁ, దిరుమల- ౨౧

ధరలోన లేరు నీసము, లరయంగాఁగలరె యధికు? లంబుజనాభా!
పరులెవ్వరు రక్షకులికఁ, దిరుమల- ౨౨

పరులయెడ దయయు నుపకృతి, పరహితము న్యమము సత్యభాషణము లొగిన్
నెరపని దురితాత్ముఁడనేఁ, దిరుమల- ౨౩

ధరలోన నెల్ల యోనులఁ, బొరిఁ బుట్టుట చచ్చుటయును బుద్ధిఁ దలఁపఁగన్
మురిసివిలజ్జుఁడనైతిని, దిరుమల- ౨౪

అరయక గతజన్మపరం,పరలందుఁ గళత్రపుత్రబంధుగృహాళిన్
దిరమెపు డని భ్రమసితి మదిఁ, దిరుమల- ౨౫

అరుదెంచి తెచటనుండియొ, యరిగెద నేవంకకొక్కొ యదిదెలియక సం
సరణభ్రాంతిని జిక్కితిఁ, దిరుమల- ౨౬

కొఱగాని బ్రదుకునకు మది, మురియుచు ఘనగర్వమదవిమోహంబున స
త్పురుషులనవమానించితిఁ, దిరుమల- ౨౭

ధరమదిరాపేక్షునిగతి, నురుభవదుఃఖానుభవము నొందుచునురలన్
నెఱి భవయత్నముఁ జేసెదఁ, దిరుమల- ౨౮

# ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా వారు. పరిషద్వా జ లు.

శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

# ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.
శ్రీరాణీ వత్సవాయ వేంకట సుందరియ్యమ్మజగపతిబహద్దరు-గారు-తుని రాణిగారు.
కీ శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

# ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

## అధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.
వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు

రావుసాహేబ్ డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ., ఎల్. టి. (Ph. D.
(కోశాధ్యక్షులు.)

శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు
" శిభట్టు సుబ్బయ్యశాస్త్రిగారు.
శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., యల్. టి.
దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. ఎల్.
అళక్కి వేంకటాద్రియ్యగారు.
కేశవపు కామరాజుగారు.
కోకా వేంకటసుబ్బారావు నాయుడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.
పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.
పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావు నాయుడుగారు

**PYDA VENKATACHELAPATI TELUGU MANUSCRIPT**
**PRINT FUND SERIES No. 1.**

# సాంబోపాఖ్యానము.

శ్రీకృష్ణదేవరాయల యల్లుఁడగు

అళియరామరాజునకుఁ బెద్దతండ్రి మనుమఁడగు

## రంగప్పరాజకవి రచించినది.

వసుచరిత్ర కళాపూర్ణోదయములకంటెఁ బూర్వప్రబంధము.

చిత్రశ్లేషలకు నిలయము. అత్యద్భుతవర్ణనలగని. స్వభావోక్తులకు నిధి.

నిర్దుష్టమైనది.

కథ- శ్రీకృష్ణజాంబవతుల తనయుఁడగు సాంబునకును

దుర్యోధనునిపుత్రియగు లక్షణకును వివాహము.

## రాజకవిత్వము, ప్రబంధరాజము.

భాషాభిమానులెల్లరుఁ జదువఁదగినది.

రాయల్ 186 పుటలు- అయిదాశ్వాసములు.

పోస్టువ్యయముగాక- వెల రు 1—0—0 మాత్రమే.

## దొరకుచోటు
## ఆంధ్రసాహిత్యపరిషత్తు- కాకినాడ.

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**


సంపుటము. ౨౧ { ఆంగీరసనామసంవత్సరము. మాఘఫాల్గునమాసములు. } సంచిక ౬.





కాకినాడ:

క్రొత్తపల్లి సూర్యారావుచే బరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-0-0.

విడిసంచిక రు ౦-౮-౦.

1933.

# విషయసూచిక

// ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౧. { ఆంగీరసనామసంవత్సరము. మాఘఫాల్గునమాసములు. } సంచిక ౬.

## ఎదురుకోలు.

తి. వ. నారాయణస్వామిగారు, రుసింగిఅగ్రహారము.

శా. పంప న్బాసి తలఁపువిప్రతన పున్బాపన్గన న్గ్రోల్లుదాఁ
టింపం జాలుపు తేర్ల మన్నియని బొట్టై ల్వచ్చుట ల్గాంచి యా
సొంపున్గుత్తుకకొమ్మ లెంకిమగఁ డచ్చో వచ్చునవ్వారి గు
ర్తింప న్దైమ్మెరకూన మేటియని యర్తిం బిల్చి తానిట్లనున్. ౧

క. అనుమఁడ వినుమనుమఁడ ని,న్నెనయఁగలదంట పుడమినెసఁగునె కడిమిన్
గొనమునఁదెలివిడిచే వి,న్ననువున నెనరునను మెలపునను మాలిమిచేన్. ౨

చ. మనమలపొంతల న్దిరుగు మానిసుల న్గనుఁ గొంటి వారలే
ఘనిఁగొని వాత్లెకంబులకుఁ బట్టగుకానరు రాఁగతంబొ మా
యునికి యెఱింగి వేగనులయుక్కరిబొట్టియఁ డంపఁ దెంపునన్
మనలను ప్రేల్మిడిం గలన మార్కొనరారుగదా తలంపుమా. ౩

ఉ. నిక్కపుజోగు లన్నకరణి న్గలపోయుద షన్నఁ దూపులు
న్జక్కనిసింగిణు ల్దరకసంబులు నూనఁగనేల నేలతేం
డ్లక్కట పీరలంచనఁ గటా వలిపమ్ముల నేది యొండకుం
డక్కుచు నేల నారలు జడ ల్లడుదాల్చుచుఁ గొననుండఁగన్. ౪

క. ఏకతమున నేకతమున, నీకానకు రాఁగతంబొ ? యొడ్డెఱ నెవనిం
జీకాకునొందఁజేయుదు, రో కాకెవ్వానిమనుతురో కనుఁగొనదే ? ౫

ఉ. మారుతురైనచోఁ బిలుకుమార్పుము నెయ్యురకాఁ దలంచుచోఁ
గూరిమిమీఱ మన్ననలకు న్గుఱిగా నొనరించి వారలన్
గారవమొప్ప బందుగులుగా మనసీమును జేర్పు దాయమం
దారపుగాడ్పవౌదువు కదా ! యనఁగా నిను గెల్వ నేరికిన్. ౬

క. వారలపూన్కియుఁ గర్జము, నేరుపును న్లావు నెఱిఁగి నేటుగ మమ్ముం
జేరుదురో నూఁడుగమిం, జేరుదురో తెలియ నుపమచేయుదె? యనఁగన్. ౭

సీ. మంటకంటనెసంగు దంటకన్నేరింటి సరు లెదఁ దఱచుగా నిరవుకొల్పి
నలువబాబాలవెన్నెలనెన్నఁదగు వన్నెనలరుమేనను బూది కలపములఁది
కెంపువన్నియ నింపు నింపుపెన్నెరుల సొజడఁజొళ్ళేముగ నెత్తినడుమఁ జుట్టి
బలుకాన నలరు జోగులబాగు గనుపట్ట మొలనిండ జేగురు వలువఁ జుట్టి
గీ. వలుదసారబుఱ్ఱ నొకకేల నలువుమెఱయ
లాఁతమొకకేలఁ జేకొని లాఁతినెఱుఁగ
నట్టి నిక్కపుబాసవాల్గిట్ట యనఁగ
దనరు వేసమ్ముఁగొనె నీటితాతకూన. ౮

మ. తనదా వాలక మిట్టులేర్పఱిచి వాఁత న్బాఁతపల్కు ల్పెరల్
వినఁగాఁ బల్కుచు గట్టుడిగ్గి యఱవన్ వేవచ్చి చెంగల్వరా
యనిసంగాతికొలంపుదివ్వియలచాయన్జేరి కేల్మోడ్చి వి
న్ననువున్దీమగు నీదిచూలి కడునెయ్యంబొప్పఁ దా నిట్లనున్. ౯

శా. సామీ ! మూఁడుజగమ్ము లేడ్తెఱ గడించంజాలి యేపాదు మీ
రేమన్నీనికడిందిపున్నెముల నెంతేవేడ్కఁ బండింపఁగా
నీమ్రొడ్డి న్నిడిమాసులై పుడమిపై నింపొందుచున్నారొకో ?
మీమీతల్లియుఁ దండ్రి యెవ్వరకొ ? నెమ్మిన్నాకు విన్పింతురే ? ౧౦

ఉ. చెందొవసూడుతేదొలర చెల్వున నల్వున మీఱు మీరలే
కందువనుండు రేదొసఁగు గల్గుటనో విను కొంకిఁబాసి యీ
చందపుబొందుల న్మలలచక్కి మెలంగెదు వేల్పులొక్కొ ? మీ
చందము పేఁ దోయి కరుసంబుగ నింబుగ నానతిత్తురే. ౧౧

ఉ. ఆగడ మొద్దియేని గని యాఱనియారసమొప్ప సిగ్గులన్
దోఁగఁగ నిట్లు కానలకుఁ ద్రోచెనొ మీయొకిమీఁడు; లేక నే
యీగడ కైకె మెకంబులకు నిల్లయి పెల్లుగ బీతుగొల్పుచున్
జేగయుడంచు కానలకుఁ జేరఁగఁ రాఁ గతమయ్యెఁ దెల్పుఁడా. ౧౨

క. ఒడిమెలకునొడిమెలగుమీ,యొడళులురవణములఁబాసి యుండియుఁదేజున్
విడువ వదేకతమున మీ,రయొడళులఁ గైసేయఁ దలఁపరోదొరలారా. ౧౩

క. వినుమెజ్జ లనఁగఁ దగు మి,మ్మనవచ్చునె యన్నదమ్ము లని; మీయెడలం
గనవచ్చు బోఁడుముల తేం,డ్లనవచ్చునొ బానవాలు లని యనఁ దగునో.

క. నడబెడఁగు నొడలిమొనపును,నుడికారపుసొరు తొడల నూల్కొనుతీరున్
వడిఁ దోఁపఁజేయు మీరీ,పుడమి మనుకఁగల్గు రాచప్రోడ లనంగన్. ౧౫

ఉ. ముత్తిగఱానెరాపనుల మోసలల న్బలితంపుఁ దమ్మిఱా
మొత్తపుఁ గూర్పు మాఁడువుల మద్దగు నిద్దపు మూలఱాలచే
నెత్తగు మేడల న్దిరుగ నిమ్మగు మీనునుమెట్టుఁదమ్ము లీ
కత్తులవంటి ఱాలు కడుఁ గాఁడఁగ వాడఁగఁ జేయఁ బాడియే. ౧౬

మ. జడలు న్నారలుఁ దాల్చికానలనె నిచ్చల్ గ్రుమ్మరంగోరు మీ
యొడల న్జానగుబిండ్లుఁ బత్తలిక లెన్నో తూపులు న్గాంచి నా
యెడఁద న్నందియమాట మీకత లొకింతే సుబ్బుదాఁక న్నిమున్
నుడివాలుంబడవాలు లంచనెద నన్నుం గూర్మిచున్నింపరే. ౧౭

ఉ. దాయలలోనఁ జేరఁడు గదా తొవదాయయనుంగుపట్టి యీ
చాయల రక్కెసల్దిరుగు జాడలఁ గన్గొని వారినొంప నీ
తోయమున న్దొన ల్బఱకుఁ దూపులు సింగిణు లొప్పఁగానలన్
డాయఁ దలంచి రొక్కొ చెపుడా కలరూపున నున్నమీకతల్. ౧౮

క. ఈనెలవున మీబందుగు, లేని కడుంగూర్చువార లేని యుఁ గలరే
పూనినకర్జమునకునై, జానగు బాసటను వెనుకఁ జనువారలొకో. ౧౯

క. నిక్కమిది యేని మీకుం, జక్కనిసంగాతినిందె సమకూర్చెద మా
చక్కికి విచ్చేయుదురే, జక్కులకవఁ దెగడు జోగిచందురులారా. ౨౦

మ. కలఁడీగట్టునఁ జెట్టునట్టుగమి లెంకల్గాఁ జొకా యర్తిచే
నలువొ వాఁడను కోతిరాయఁడు దురాన న్మబ్బురాకూన యిల్
వెలలింప న్నెల విందుఁ జేసికొని యోలిన్వాలిపై యొంటమిం
దొలఁగ న్ద్రోయఁగ బాసలై నిలుచుజోదున్గోరి యేకారుచున్. ౨౧

చ. గొనములతావు కయ్యముల కున్దగులావరి తాల్మియిక్క నే
టునకుఁ గలంకు దాయలకు డొంకెన నెయ్యురపాలివేల్పుప్రమా
నన నలరారు జక్కవలయంటుకొమారునితోడిచెల్మి మీ
కెనసిన మేల్మిబంగరున కింపగుతావి యొసంగినట్లగున్. ౨౨

మ. జగముంగంటినిసుంగుతోఁ జెలిమి కిచ్చంజేయువారేని య
జ్జగజెట్టీఁ డొకతెంకయై తనరి నిచ్చ ల్దోడునీడౌచు మీ
వగల స్దీర్పఁగలాఁడు నిక్కమని తేల్పంబూన నేలన్నఁ గ్రో
లగనా పానకమెట్టిదంచు ననవేలా? యారగింపా నెడన్. ౨౩

క. తెమ్మెరకం దీవచువ్వున, నమ్మికతోఁ బల్కి నెనరు నను నిల్చిన డెం
దమ్ముల నలరారిరి చెం,దమ్ములరాకొలపుజింకతాల్పులుమిగులన్. ౨౪

మ. అనుచుం బయ్యెరబొట్టెఁ డాడఁగ బెడంగైనట్టి యామాటలన్
వినుచుం దమ్మిబొజంగువంగసపురేవెల్గైన యాలక్ష్మణుం
డనెఁ దానిట్లని జోగివెన్నెలలరాయా! నీదుపల్కు ల్లడు
న్వినవిందై మదికించె జక్కవలకు న్వేవెల్గురాకన్బలెన్. ౨౫

# అభిజ్ఞానశాకుంతలము.

సాహిత్యవిద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు-రామతీర్థము.

క్రిందటిపరిమత్సంచికలో బ్ర. శ్రీ. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రులు గారు కాళిదాసుశాకుంతలమునందలి దుర్వాసశ్శాపవృత్తాంతము తక్కినయంకముల స్థితికొఱకును, నిర్వహణమునందు నిరూపింపవలసిన యద్భుతప్రతిపాదనము కొఱకును, షష్ఠాంకమునందలి ప్రవాసవిప్రలంభవర్ణనము కొఱకును మాత్ర మగుచున్న దనియు, స్వభావవిషయమున భారతమునందలి శకుంతలాదుష్యంతులే బాగుగఁ జిత్రింపఁబడి రనియు నొకవిషయమును బ్రతిపాదించియున్నారు. దుర్వాసశ్శాపవృత్తాంతాదికము తక్కినయంకములస్థితికి, నద్భుతమునకు, విప్రలంభవర్ణనమునకు నుపకరించుటలో సందేహము లేదు; కాని దానికి ముఖ్యములగు ప్రయోజనము లయ్యవియే కావనియు రసమును నాయకస్వభావమును బరిపోషించుటయే కవ్యుద్దిష్టము లై యుండవచ్చునేమో యనియు నాయాశయము.

మహాభారతమునందలి శకుంతల కొడుకుం గొని పతికడ కేగి తొల్లింటివృత్తాంతము నెఱుకపఱిచినను దుష్యంతుఁ డదియెఱిఁగియు నెఱుఁగనివాఁడు పోలె "ఏ నెఱుఁగ నిన్ను నెక్కడిదానవు? మిన్నక యీ యనుచితంబులు పలుకంగా నేల? యరుగు మంబురుహానన యెందుండి వచ్చి తందులకు వడిన్" అని యనుట యుచితము కాఁగలదా ? "అన్య లెఱుఁగమిఁ జేసి లోకాపవాదభీతి నెఱిఁగియు చిత్తన్విఁ బ్రీతి దప్పి యెఱుఁగనంటిని'' అనువచనమును బట్టి రాజు కోరియే యసత్యమాడినట్లు వ్యక్తము కాకుండునా? దృశ్యకావ్యమున నట్లు నిబంధించినచో సహృదయు లగుసామాజికులకు రసాస్వాద మేరీతిని గలుగఁ గలదో చదువరు లూహింపకపోరు. శ్రవ్యవిషయమునఁ గూడ నిట్టియెడ రాజు సభ్యులకెల్లఁ గలతెఱం గెఱింగించి వారుచెప్పినట్లు నడుచుటను వివరింపవలసి యున్నది. రాజు స్వభావము నెఱింగిన సభ్యులు తద్వాక్యములను విశ్వసింపకుందురా? సులభము లగుమార్గాంతరము లుండఁగా వానిని విడిచి లోకమున నపవాదము కలుగునేమో యని యనుమానించి దానిని సిద్ధాంతీకరించి తన్మూలముగ ననృతము లాడి (పిదప) మఱలఁ దనదే తప్పని యొప్పుకొనుట కూడ రాజుస్వభావమును బరిపోషింపఁజాలదేమో! అప్పటికి గౌరవించినను, సత్య

దూరుఁడును, భీరువు నగురాజు తనయెడఁ బరిపూర్ణ మగునమరాగము చూపు నని శకుంతలమాత్రము నమ్మునెట్లు?

తపోవనమున వైఖానసవ్రతమున నున్నమునికన్యకలు తక్కినప్రసంగము లను మాని శృంగారప్రసంగములనే దొరకొనుట యనుచిత మని శ్రీశాస్త్రులు గారి యభిప్రాయమైనట్లు తెలుచున్నది. కాని శాకుంతలమును శృంగారరస ప్రధాననాట్యముగఁ జేయఁదలఁచిన కవి శృంగారమును వర్ణింపక తక్కినవాసిని వర్ణించి యంతటితో సంకమును లేవనెత్తినచో రసాస్వాదము కాని ప్రథ మాంకప్రయోజనము గాని, బీజముగాని మృగ్యములగునేమో యని నాసందే హము. వనితలకు శృంగారచేష్ట లొకరు మప్పనక్కఱలేదు. యౌవనమే యావ నిని జేయఁగలదు మఱియు నుచితజ్ఞుఁ డగుకవి యౌవనమదోద్రిక్తములగు భావములను జాలవఱకును గప్పిపుచ్చి యెంతటికిని సాధ్యముకాకుండునపుడు "కింపున రిమం ప్రేక్ష్య తపోవన విరోధినో వికారస్యగమనీయాఽస్మిసంవృత్తా" అని శకుంతలచేఁ బ్లుకించియున్నాఁడు. అదియు స్వగతముగనే, కావుననే యచట భావము లేమియు నుద్రిక్తములు కాలేదు.

మహాభారతమునందలి శకుంతలను గనుఁడు. ఆమె దుష్యంతుఁడు చక్ర వర్తియని యెఱిఁగియు, నించుకంతయు లజ్జను గాని సంకోచము గాని ప్రకటిం పక దుష్యంత! అని సంబోధించి యడిగినదే తడవుగఁ దనజన్మవృత్తాంతమును తూ, చా, లు తప్పకుండ నేకరువుపెట్టినది. తొలుత రాజు "కణ్వదర్శనా ర్థినైవచ్చితి; నాతఁ డెక్కడ?" అని యడుగ నామె "ఫలములఁ దేఁబోయె, నొకింతతాళుఁ" డని నిల్పి యుకారణముగనే మందహాసము సేసెను.౧.అయ్యది మునికన్యకకే కాదు; సామాన్యముగఁ గన్యకకుఁగాని సతియగునామెకుఁ గాని యుచితమై యున్నదేమో కనుఁడు. మఱియొక సగతి శకుంతల తన జన్మవృత్తాంతమును రాజున కెఱింగించుచుఁ దండ్రియగు విశ్వామిత్రుని తపస్సు చెఱచుటకుఁ దనతల్లి యగుమేనక యింద్రలోకమునుండి వెడలునపుడు దేవేం

---

౧ అపశ్యమాన స్తమృషిం తథాచోక్త స్తయా చ సః।
తాం దృష్ట్వాచ వరారోహాం శ్రీమతీం చారుహాసినీమ్॥ ౧౦
దర్శనాదేవహి శుభే త్వయా మేఽపహృతం మనః॥ ౧౩
ఏవ ముక్తాతుసా కన్యా తేన రాజ్ఞా తదాశ్రమే।
ఉవాచ హాసతీ వాక్య మిదం సుమధురాక్షరమ్॥ ౧౪
[మహాభారతే ఏకసప్తతితమోఽధ్యాయః॥]

త్రుని గోరినకోరికలను సిగ్గుమాలి వివరించినది. [మేనక విశ్వామిత్రుని జేరనరుగునపుడు వాయుదేవుఁడు వస్త్రము నెగురఁగొట్టవలె ననియు, మన్మథుఁడా సమయమున సాయపడవలె ననియు మేనక కోరినకోరికలు] ౨. అట్లు వివరించుట వనితాలోకమున కెంతటిలజ్జాకరమో పాఠకు లూహింపకపోరు.

శకుంతల యంతటితో విరమించెనా ? లేదు. తనజనయిత్రి యగు మేనక తపోవనమును జేరి విశ్వామిత్రునికిఁ బ్రణమిల్లి యెట్లు నాట్యము నొనర్చిన గాలిచేఁ దనకట్టు వలువ యెగిరిపోవునో యారీతిని నృత్య మొనర్చె ననియు, నంత నావస్త్ర మెగిరిపోయిన దనియు నెగిరినదానిని నెమకు నెపమున వివస్త్రయై మునిసమీపస్థానమున కరుదెంచె ననియు, నపుడు ముని యామె రూపసౌందర్యసంపదకు ముగ్ధుఁడై మోహించి యామెం గూడెననియు, నంతట వారికిఁ దాఁబుట్టితి ననియుఁ జెప్పెను. 3. ఇట్లు నిర్లజ్జయగు మహాభారతశకుంతలకంటె, కాళిదాసుని శకుంతలయే యుచితరీతిని జిత్రింపఁబడిన దని తేలకమానదు. ఇట్టియెడ మహాభారతపక్షికంటె నాటకపక్షియే స్వభావపరిపోషకముగను సహృదయావర్జకముగను గలదేమో యని నాసందేహము.

---

౨　కామంతు మే మారుత స్తత్రవాసః । ప్రక్రీడితాయా వివృణోతు దేవః॥
భవేచ్చ మే మన్మథ స్తత్ర కార్యే । సహాయభూతస్తు తవప్రసాదాత్॥　౪
[మహాభారతే వనపర్వణి ఏకసప్తతి తమోఽధ్యాయః.]

3　అభివాద్య తతస్సాతం ప్రాక్రీడదృషిసన్నిధౌ ।
యథో వాహాచ వాసోఽస్యా మారుతశ్శశిసన్నిభమ్ ॥
సాఽగచ్ఛత్ త్వరితాభూమిం వాసస్తదభిలిప్సతీ ।
స్మయమానేవ సవ్రీడం మారుతం వరవర్ణినీ ॥
పశ్యతస్తత్ర తస్యర్షే రప్యగ్నిసమచేతసః ।
విశ్వామిత్రస్తత స్తాంతు విషమస్థా మనిందితామ్ ॥
...వాససిసంభ్రాన్తాం మేనకాం మునిసత్తమః ।
అనిర్దేశ్యవయోరూపా మపశ్యత్ వివృతాంతదా ।
తస్యారూపగుణాన్ దృష్ట్వా సతువిప్రర్షభ స్తదా ।
చకారభావం సంసర్గే తయాకామవశంగతః ।
న్యమన్త్రయత చాప్యేనాం సాచాప్యైచ్ఛ దనిందితా ।
తౌ తత్ర సుచిరం కాలం వనేవ్యవారతా ముభౌ ।
రమమాణౌ యథాకామం యథైకదివసం తథా ॥
జనయామాస సముని ర్మేనకాయాం శకున్తలామ్ ॥
[మహాభారతే వనపర్వణి ద్విసప్తతితమోఽధ్యాయః॥]

# కొన్ని గ్రంథాంతపద్యములు.

క. గుడికొమ్ము ఏత్వ మైత్వము, వడి నొత్వౌత్వములు సున్న లొనరఁగ రేఫల్
దిడిదప్పి వ్రాయకున్నను, గడుసరులవి యెర్గి వ్రాసి కరుణింపవలెన్.

క. వ్రాలాశ్వభ్రలు తప్పులు, చాలంగల వేను శబ్దసంగతు లెఱుఁగన్
గేలింబెట్టక నవ్వక, పోలంగా దిద్దరయ్య బుధజనులారా.

ఉ. తప్పనిచోటఁ దప్పనుచుఁ దప్పని యారస మూనఁ బోకుఁడీ
తప్పినఁ దప్పు గల్గెనని తప్పని స్తత్కృప మీరుదిద్దుఁడీ
యొప్పు టొకింత గల్గ మది నుబ్బుఁడు పండితులార మీకునేఁ
దప్పని శిష్యుఁడన్ గురులఁ దప్పనె శిష్యునికీర్త్యకీర్తియున్.

గీ. వ్రాఁతతప్పువలన వాచకులగువారు, తప్పుగలిగెనేని తగినయెడల
వలయునక్షరములు వెలయంగ దిద్దుఁడీ, సుకవులైనవారు సుస్థిరముగ.

క. లక్షణమెఱుఁగను బ్రతిఁదగ, వీక్షించి లిఖంచినాఁడ నిందులతప్పుల్
అక్షరలోపము లొదవిన, లక్షణవిదులార సైచి లలి దిద్దుఁ డొగిన్.

క. ప్రతిఁ జూచి వ్రాసినాఁడను, అతిశ్వభ్రలువ్రాలుఁ జూడ నన్నియుఁ దప్పుల్
యతిగణప్రాసము లెఱుఁగను, మతిమంతులు తప్పుదిద్ది మన్నింపరయా.

క. సందియముపలదు నిదె మీ, కందఱకును వేడ్కతోడ నంజలిచేతున్
ఇందునఁ దప్పులు గలిగినఁ, బొందుగ దిద్దుటకునేను భూసురులారా.

క. ప్రతినున్నరీతివ్రాసితి, నతిశయ కవితా ప్రచార మది యెఱుఁగను శ్రీ
సతిపతికరుణను దప్పులు, మతిమంతులు చూచి దిద్ది మన్నింపవలెన్.

శ్లో. సరభసకర వేగా ద్భ్రష్టవర్ణాదిదోషో
యదిహభవతువా చాపుస్తకే హస్తదోషః
అవిదితపరదోషజ్ఞానపీయూషపూర్ణాః
శరకృతమపరాధం క్షన్తుమర్హన్తి సన్తః.

శ్లో. తైలాద్రక్షే జ్జలాద్రక్షే చ్చోరా దగ్నిభయాత్తథా
మూర్ఖహస్తేననోపేయా దేవం వదతి పుస్తకమ్.

శ్లో. బద్ధహస్తకటిగ్రీవ స్తబ్ధచక్షు రధోముఖమ్
కష్టేనలిఖితం గ్రంథం పుత్రవత్పరిపాలయేత్.

శ్లో. భీమస్యాపి రణేభంగో మునేరపి మతిభ్రమః
యదిశుద్ధం తదన్యత్ స్యాత్ మమదోషో నవిద్యతే.

శ్లో. యాదృశం పుస్తకందృష్టం తాదృశం లిఖితంమయా
అబద్ధోవా సుబద్ధోవా మమదోషో నవిద్యతే.

# శాంత యెవరికూఁతురు?

( తులసి లక్ష్మీనారాయణమూర్తిగారు-ఇంజరం. )—

జగన్నాటకసూత్రధారుఁడు ను శేషశాయి యు శ్రీవల్లభుఁడు నైన శ్రీమన్నారాయణుఁడు మునులచేతను, నింద్రాది బృందారకులచేతను బ్రార్థితుఁడై రాక్షసనాశము చేయుటకొఱకు భువిని రామావతారము నెత్తెను. చాలకాలమునుండి సంతానశూన్యుఁడై పరితపించుచున్న దశరథున కీతఁడు పుత్రుఁడై జన్మించెను రాముఁడు పుట్టుటకుముందు దశరథుఁడు మునుల యాజ్ఞ నశ్వమేధయాగముఁ జేసెను. అయ్యశ్వమేధయాగమునకు శాంత భర్త యైనఋష్యశృంగుని రావించినఁ గాని యాగఫలము సంప్రాప్తము కాదని తెలిసి యాతని రావించి సఫలమనోరథుఁడై దశరథుఁడు సుఖముండె నని పురాణములు చెప్పుచున్నవి. అట్టి దశరథుని మనోరథప్రాప్తికి హేతు వైన ఋష్యశృంగునిజాయ యగుశాంతవృత్తాంతమును దెలిసికొనుట యావశ్యకమై యున్నది. ఈమె యెవరికొమారితయో విచారించుటయే యీవ్యాసముయొక్క ముఖ్యోద్దేశ్యము

చాలమంది యభిప్రాయము శాంత దశరథునికొమార్త యనియే; ఆమె నాతఁడు రోమపాదుఁ డనురాజునకు దత్తతగా నిచ్చెననియు రోమపాదుఁ డీమెను స్వీకరించి కన్నపుత్రికకంటె నెక్కువ మక్కువతోఁ బెంచె ననియు లోకమున నొక ప్రతీతి కలదు. ఆవిషయమునే భవభూతికూడఁ దనయుత్తరరామచరితనాటకములో నిట్లు చెప్పియున్నాఁడు.

శ్లో. కన్యాం దశరథో రాజా శాన్తాం నామ వ్యజీజనత్
అపత్యకృతికాం రాజ్ఞే రోమపాదాయ తాం దదౌ.

దేని నాధారముగఁ జేసికొని యిట్లు చెప్పెనో తెలియదు. వాల్మీకిరామాయణమునం దెక్కడను గూడ నీవిషయమై యిట్లు వ్రాసియుండలేదు.

ఈమె దశరథునికొమార్తయే యైనపక్షమున రామాదుల జననమువలెనే యీమెజననప్రకారముకూడ రామాయణమునఁ జెప్పఁబడియుండును. రామాయణమున నెచ్చటను శాన్తాజననక్రమము చెప్పఁబడియుండలేదు.

మఱియు దశరథునకుఁ గౌసల్యాదులు ముగ్గురుమాత్రమే భార్యలున్నట్లు రామాయణమునఁ బ్రసిద్ధముగ నున్నది. ఈముగ్గురికంటె నితరభార్యలు దశరథునకు లేరు. వీరిలో నెవరికిని శాంత యనుకొమార్తె లేదు.

మఱియు నాఁడుబిడ్డ నత్తవారింటికిఁ బంపి యప్పు డప్పుడు మఱలఁ బుట్టినింటికిఁ దీసికొనివచ్చుట లోకప్రసిద్ధవ్యవహారమైయున్నది. కడుబీదవారైనను నాఁడుబిడ్డ నత్తవారింటికిఁ బంపి మఱలఁ దీసికొని రాకుండ నుండరు. అట్టివిషయములో శ్రీరామునివివాహము మొదలగుశుభముహూర్తములకుఁ గూడ దేనికిని శాంత వచ్చి యున్నట్లు కనుపట్టదు. తీసికొని రాకపోవుటకుఁ గారణము దశరథునకుఁ గూఁతునందుఁ బ్రేమాభావమా? లేక ధనాభావమా? కూఁతురున్న నట్లెన్నటికిని జేయఁజాలఁడు.

మఱియు శాంతను దశరథుఁడు రోమపాదునకు దత్తతగా నిచ్చె ననుట యసంభవము ఏలయన- లేక లేక వార్ధక్యమున జన్మించిన యొక్క కూఁతు నన్యుని కెట్లుదత్తతగా నివ్వఁగలఁడు. చాలమంది సంతానముఁ గలవాఁడైనను నీయఁజాలఁడు లోకమున నెట్టిబీదవాఁడైనను దుదకు బిచ్చ మెత్తుకొనువాఁడు కూడ నొక్కకూఁతు నన్యులకుఁ బెంచుకొనుట కీఁజాలఁడు. అట్టి తఱి సకలభూమండలము నేకచ్ఛత్త్రముగఁ బరిపాలించుచు, రఘుకులాన్వయచంద్రుఁడై పాకశాసనాది బృందారకులచే నెన్నఁబడిన ప్రతాపముఁ గల దశరథుఁడేడ! లేక లేకఁ గలిగినయొకుంగుఁగూఁతు నితరులకు దత్తతగా నిచ్చుటేడ! ఎన్నటికి నట్లు సంభవింపదు.

“దశపూర్వేషాం దశాపరేషాం మద్వంశ్యానాం సర్వేషాం పితౄణాం నరకా దుత్తీర్య త్రైస్నాకం విష్ణులోకే నివాససిద్ధ్యర్థం శ్రీలక్ష్మీనారాయణప్రీతయే సాలంకృతకన్యాదాన మహం కరిష్యే” అని మహాసంకల్పముతోఁ గన్యాదానము స్వయముగఁ జేసికొనక యిరువదితరములవారిని దరింపఁ జేసి స్వర్గలోకనివాసము నిచ్చు కన్యాదానమును విడనాడి దశరథుఁ డేకపుత్త్రికమైనశాంతను దత్తతగా నిచ్చునా? ఎన్నటికి నీయఁడు.

కావున శాంత దశరథుని కొమరిత యెన్నటికిని గానేరదు. రోమపాదుని కుమారి యః యే చెప్పవలయును.

వాల్మీకిరామాయణమునందుఁ గూడ నిట్లు చెప్పఁబడియున్నది. దశరథుఁడు పెద్దకాలము సంతానశూన్యుఁడై పరితపించుచు నొకనాఁడు వసిష్ఠాది మునీశ్వరులను మంత్రిసామంతాదులను రావించి సభఁజేసి “మహాత్ములారా! నరుని బుత్త్రుఁడే నరకమునుండి ముక్తి నొందించును. కావుననే యార్యులు, “పున్నామ్నో నరకా త్త్రాయత ఇతి పుత్త్రః” అని చెప్పియున్నారు, అట్టిపుత్త్ర

శూన్యుఁడనై "అపుత్రస్య గతిర్నాస్తి" యనునట్లు గతిలేక నరకకూపమునఁ బడవలయునా? లేక పుత్రప్రాప్తికేమేని సాధనమున్నదా యని వారలనడిగెను.

అప్పుడు వసిష్ఠాదులు "మహారాజా పుత్రకామేష్టిని జేసిన నీకుఁ దప్పక పుత్రప్రాప్తి కలుగు నని చెప్పిరి. దానికి సంతసించి దశరథుఁడు వారల నడిగి యాగమునకుఁ గావలసిన సంభారముల నన్నిటిని సిద్ధముచేయ నారంభించెను. ఇంతలో నొకనాఁడు సూతుఁడు రహస్యముగ దశరథునితో "మహారాజా! నీవు పుత్రులు లేక దుఃఖించుచుండఁగా నాకాలముననే రోమపాదుఁ డనురా జుండుననియు, నొకప్పు డాతనిదేశ మనావృష్టిచేఁ బీడింపఁబడు ననియు, నట్టితఱి నాతనికి శాంతయను కుమారిక యుండు ననియు, నామెను విభాండక సుతుఁ డైనఋష్యశృంగున కిచ్చి వివాహము చేయఁగా ననావృష్టి నివారణ మగు ననియు నప్పు డారోమపాదుని యల్లుం డైన ఋష్యశృంగునిఁ దోడ్తెచ్చి పుత్రకామేష్టిఁ జేసిన దశరథునకు సంతానము కలుగు ననియు సనత్కుమారు లవారు చెప్పియున్నారు. కావున ఋష్యశృంగుని యాగమునకు రావింపుఁడు. అప్పుడు మీకు సంతానము కలుగు"నని సూతుఁడు చెప్పఁగా విని దశరథుఁడు సంతసించి వెంటనే రోమపాదుని రావించి యంతయుఁ జెప్పి యాతనిచే శాంతను ఋష్యశృంగున కిప్పించి వివాహముచేయించి యాతనియల్లుఁడైన ఋష్యశృంగుని రావించి యాగముఁ బూర్తిచేసెను. ఇట్లుండఁగా శాంత దశరథుని కుమారిక యనుట యెట్లు?

మఱియు నీవిషయమే భాస్కరరామాయణములోఁ గూడ నిట్లున్నది. ఈయర్థము కలపద్యమును గ్రింద నుదాహరించుచున్నాను.

సీ. ఏకాంతమున సూతుఁ డిట్లను దశరథుఁ గనుఁగొని భూమీశ కశ్యపునకుఁ
దగ విభండకమునితనయుఁ డై పుట్టెడి నామునీశ్వరునకు ననఘమూర్తి
చిరపుణ్యుఁడగు ఋష్యశృంగుఁడుపుట్టెడు రోమపాదుండనుభూమివిభుఁడు
జనియించికూఁతునామునికిచ్చి నెమ్మదిఁ దనయింటనిడుకొనితనరఁగలఁడు

నీవతనితోడఁ బొత్తునునెఱయఁ జేసి, యతనిఁ బ్రార్థించి యారాజునల్లుఁడైన
ఋష్యశృంగునిఁదోడ్తెచ్చిఋషులుమెచ్చ, బుత్రకామేష్టిఁ జేయించిపుణ్యమహిమ.

ఇట్లుండుటచేతను శాంత జన్మవృత్తాంతము రామాయణమునం దెచ్చ టను గానఁబడకుండుటచేతను, రోమపాదునిఁ బ్రార్థించి యతనియల్లుఁ డైన ఋష్యశృంగునిఁ దోడ్తెమ్మని చెప్పుటచేతను దశరథునికి శాంతయను పుత్రిక లేదని చెప్పుటయే యుక్తము. ఎటులైనను శాంత జన్మవృత్తాంతము ప్రమాణ గ్రంథములం దెచ్చటను విపులముగ వ్రాయఁబడియుండ లేదు. నేనీవ్యాసమును జిజ్ఞాసచే వ్రాయుచున్నాఁడను.

# గ్రంథస్వీకారము.

నీతిచంద్రిక:—శ్రీపరవస్తు చిన్నయసూరిగారు రచియించినది- చిన్న య్యసూరిగారు 1853 సంవత్సరమున మొదటికూర్పుగాను 1856 వ సంవత్సర మున రెండవకూర్పుగాను ముద్రించి ప్రకటించిన మూలగ్రంథమునుబట్టి యా రెండుకూర్పులలో నున్నట్లుగా నిపుడు బ్ర॥ రావుసాహేబు గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారిచేఁ బ్రకటింపబడినది 16 పుటల ప్రస్తావనలో నీపుస్తకమును గుఱించి విశేషములు వ్రాయఁబడియున్నవి. వెల రు 0-8-0 పర్లాకిమిడిలో శ్రీ రామమూర్తి పంతులుగారియొద్ద దొరకును.

(2) లేమొగ్గ—కందుకూరి రామభద్రరావుగారు రచించినది. అర్చన, హిమవంతము, భాస్కరోదయము-ఈరీతిగా 18 ఖండకావ్యములు గలవు. అన్నియు గీతపద్యములు- ఇందుఁ గొన్నిగృహలక్ష్మిపత్రికలోఁ బ్రకటింపఁబడినవి. అందం దచ్చుపొరపాటులును చేతిపొరపాటులునుగలవు. వెల తెల్పఁబడియుండలేదు. రాజవరములోఁ గవిగారియొద్ద దొరకును.

(3) సుమవల్లి—కవిమిత్రులు రచించినది- 35 పుటలలోఁ దెనుఁగున నింగ్లీషున ఖండకావ్యములు గలవు. ఈకావ్యకర్తలగుకవిమిత్రులందఱును కాకినాడ కళాశాలలోనివిద్యార్థులే. మంచిదళసరికాగితములు, చక్కని యచ్చు, అపూర్వకల్పనలు, నిర్దుష్టరచన-యీపుస్తకమునఁగలదు. కళాశాలలోని యాంధ్రోపాధ్యాయులును నాంగ్లోపాధ్యాయులును దమశిష్యులను బ్రోత్సహించుటచే తనే యీచిన్నిపొత్తము వెలువడినది. కవితాప్రసూనము, వెన్నెలరేయి, రాధ పిలుపు, నెలపొడుపు-ఇత్యాది, యనేకఖండకావ్యము లిందున్నవి. వెల0-6-0.

(4) శ్రీమదాంధ్రకార్తికమాహాత్మ్యము- (పురాణము) పడమటిగోదా వరిజిల్లా కొవ్వూరుబోర్డుహైస్కూలునందాంధ్రపండితు లగు బ్ర॥ అనిపెద్ది జగ న్నాథశాస్త్రిగారియాంధ్రీకరణము. 169 పుటలు, నాలుగాశ్వాసములు. ఆం ధ్రగీర్వాణముల రెంటను జాల నిష్ణాతు మగుపక్షిని శాస్త్రిగారు రచియించిరి. ఈపురాణము కార్తికమాసములో మోక్షపరులు చదువఁదగినది. రెండుపద్య ములు మచ్చుచూడుఁడు—

మ. హతకామాద్యరివర్గుఁడై విపులభక్త్యన్వీతుఁడై సర్వవ
స్తుతలిన్ శ్రీహరిగాఁ దలంచుచు సముద్భూతప్రమోదాశ్రు పూ

రితనేత్రుండయి నృత్యము నలుపుచుఁ శ్రీవల్లభుం బాడు న
య్యతికిఁ బోనము వెట్టె నయ్యమ నమస్యల్సెక్కు గావించుచుఁ - 72పుట
చ. అతఁ డొక బ్రాహ్మణోత్తమున కిప్పిడెఁ జాలధనంబు వత్సర
త్రితయ మతిక్రమించెను తఱిఁ ధనమిప్పుడ తెమ్మటంచు భూ
క్రతుభుజు నన్యదేశమునఁ గాంచి నిరోధమొనర్ప విప్రుఁడు
న్నతిఁ దలపోసి యిట్లనిసె మంజులవాక్చతురత్వ మేర్పడన్. 80 పుట.

పుటలమీఁద నాశ్వాసచిహ్నములును బద్యములకు సంఖ్యయును లేకుండుటచేఁ గ్రంథము చదువు వారికి సౌకర్యము తక్కువగా నుండవచ్చును. వెల రు 1-0-0.

(5) నిర్వచనభారతగర్భరామాయణము — గ్రంథకర్త- గుంటూరుజిల్లా గురజాలనివాసులు మ॥ రావిపాటి లక్ష్మీనారాయణకవిగారు. ప్రతిపద్యమునందును భారతకథయు రామాయణకథయు వచ్చునట్లు చెప్పుటలోఁ బింగళి సూరనార్యుని రాఘవపాండవీయాదులు మన మెఱిఁగినవియే- ఇది యట్టిది కాదు. ఇందు రామాయణార్థమిచ్చు న్యోకపద్యగర్భమందు భారతార్థమిచ్చు గీతమో కందమో బైలువెడలుచుండును. "ఇట్టి కష్టతరమగురచనకుఁ బూనుకొన్న యీకవి రచనలో నావిన్నయంతలో వ్యాకరణాదిదోషములు లేశమును గానవచ్చుటలే" దని శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారును—"ఈప్రయత్నము మున్నెవ్వరును జేసియున్నట్లు నాయెఱింగినంతదనుక గనఁబడదు. ఇది విశ్వామిత్రసృష్టివలెఁ గాక శతానందసృష్టివలె 'సకలజనానందకరము'' అని జనమంచి శేషాద్రిశర్మగారును సదభిప్రాయముల నిచ్చియున్నారు. ఒక్కమచ్చుపద్యము.

సీ. మందరబోధ రామువనవాసము పదునాలుగేండ్లు భరతపాలనమును
ధవు వేఁడి తాటకా(ధర్మరాజుసిరిఁబడపడిహరించెఁజూ)తసుమగాత్ర
తరుణికై కవిభుద త్తద్వివరముల మో(దమున; రహిసుయోధనమహితకృతి)
ప్రభుమంత్రిసిద్ధంబు (పాయనిధృతితోడఁ జేయించెఁగృష్ణాంశు) శిష్టురాము
శ్రీకి; రప్పించి వానిచే సీతమగని, సర్వముం జెప్పెఁ గైక; కౌసల్యగోడు
గనెవినిస్వపుతరాజ్యాధి(కహరణము;నుమాన్విఘనుఁడగుహరి)వంశమఁడనుండు
ఇందలి గర్భగీతములో భారతార్థ ()మిట్టి గుర్తులనడుమ నిమిడినది.
గీ. ధర్మరాజుసిరిఁ బడపడిహరిఁచె జూ, దమున రహి సుయోధనమహితకృతి
పాయనిధృతితోడఁ జేయించెఁగృష్ణాంశు,కహరణము;మాన్విఘనుఁడగుహరి.

అందందు లఘుటీకయుం జేర్పఁబడినది. ఈకవిగారి శ్రమకు భాషాభిమానులు సాయపడి తగినఫలితము నొసంగఁదగును. వెల రు 0-8-0.

(6) ముద్రారాక్షసము—నాటకము. మహాకవి విశాఖదత్తుని సంస్కృతనాటకమునకు బ్ర॥ పాలెపు వేంకటసూర్యగోపాలప్రధానుల యాంధ్రానువాదము- సులభముగా ననువాదమునందలి మార్గమును గనిపెట్టుటకై మొట్టమొదటఁ బ్రత్యంకమున మూలమునం గల శ్లోకముల నిచ్చియున్నారు. అనువాదము చాలస్వతంత్రముగ నున్నది. ప్రథమశ్లోకముఁజూడుఁడు:-

శ్లో. ధన్యా కేయం స్థితా తే శిరసి శశికలా కింను నామైతదస్యా
నామైవాస్యా స్తదేత త్పరిచిత మపి తే విస్మృతం కస్య హేతోః
నారీం పృచ్ఛామి నేన్దుం కథయతు విజయా న ప్రమాణం యదీన్దు
ర్దేవ్యా నిహ్నోతు మిచ్ఛో రితి సురసరితం శాఠ్య మవ్యాద్విభోర్వః ॥

సీ. భవదుత్తమాంగంబుపయి నెక్కి ధన్యత వెలయు వీ రెవరు జాబిల్లిగారు
వీరిపేరిదియొకో వీరిపే రిదియె కా మెఱఁగినదానవు మఱచితేల
చందురుఁ గాదు నేసుందరి నడిగెద మఱిచందురుం డప్రమాణ మేని
యాబాల్యముగ భక్తి ననుసరించెడుచేటి విజయయే దేవికి విన్నవించు
నిట్టి వక్రోత్తరంబుల నిచ్చుచుండి, పర్వతతనూజనుండి దివ్యస్రవంతి
మఱుఁగువడఁజేయుటకునునెమ్మదిఁదలంచు,శివునిశాఠ్యంబుమిమ్మురక్షించుఁగాక

దీనివెల అణాలు ౧౨. కవిగారియొద్ద అమలాపురములో దొరకును.

(7) వేమభూపాలవిజయము:—గ్రంథకర్త బ్ర॥ రావాడ వేంకటరామశాస్త్రిగారు. బళ్ళారి శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల, 5వ పుష్పము.

అద్దంకిని రాజధానిగఁ జేసికొని కొండవీడుదుర్గమును బాలించిన ప్రోలయవేమభూపాలునియన్న యగు మాచమహీపాలునికిఁ బౌత్త్రుఁడును, పెదకోమటి భూపతికిఁ బుత్త్రుఁడును నగు పెదకోమటి వేమభూపాలుఁ డీకావ్యమునకు నాయకుఁడు, అభినవభట్టబాణుఁడు రచించిన వేమభూపాలచరిత మను గీర్వాణగద్యకావ్యమును బట్టి శ్రీమాన్ ఆర్. వి. కృష్ణమాచార్యులుగా రాంధ్రమున వచనముగ సంగ్రహించివ్రాసిన దాని కిది పద్యరూపగ్రంథము. మూఁడుల్లాసములు, సుమారు రెండువందలపద్యములు, కవనము మృదుమధురముగనున్నది.

గీ. లలితకళలక్కిక లావణ్యశేవధి, శాంతిసీమ తావు సత్యమునకు
దయకుఁ బుట్టినిల్లు తగినమారటపుట్టు, వలయరుంధతిసతికనంగఁజాలి. 2-3

క. నృపతిదయాంచితమతియై, వ్యపగతభీతులను జేసి వారలనెల్లన్
స్వపదముల నుండఁబనిచెను,విపులకృపయతోడవుగాదెవీరవరులకున్.2-47

మూల్యము 0-6 0. బళ్ళారిలో దొరకును.

చ. సురపతి గొన్నయశ్వమునుఁ జూడఁదలంచి మదీయబంధువుల్
ధరణిని వ్రచ్చి సాగరముఁ దారు ప్రతిష్ఠ యొనర్చి రిష్ఠ సా
గర మిట గుప్తపక్షముల గ్రావముల న్నినుఁగూడఁ బంచినన్
సరసుఁడ త్రోసివేయకు ప్రశస్తసపర్యను శ్రాంతిలేమినిన్. ౫౭

శా. మైనాకంబున నున్నపద్మసరసిన్ మార్గశ్రమం బేగ నా
సీనుండై మకరందధారలను బ్రాశింపన్ బలంబొంది ని
వానీరాకరశేషముం జన సువేలాద్రిం గనుంగొందువో
పానీయాహతిమార్ద్రవాన్వితశిలాప్రాచుర్యసత్సాలమున్. ౫౮

ఉ. ఏగిరిపజ్జ నీటఁ బడు నీప్రతిబింబమె చంద్రునట్లుగా
బాగగు ముత్తెముల్ వెలుఁగుభంబులుగా సురుచిప్రవాళముల్
త్రేగగు తెక్కలం దునుమ వెల్వడు రక్తపుఁబ్రోవులుంగ భూ
భాగమునందుఁ బశ్చిమపుభాగపుసంధ్య దనర్చుచుండెడిన్. ౫౯

శా. ఏయద్రిం గలకాననం బుదధిబంహిష్ఠోర్మిసంక్రామితా
మేయప్రాభవరత్నవిద్రుమములన్ మేల్పల్లవాఢ్యంబు దై
తేయార్తిన్ సుర లొప్పఁదెచ్చి యటఁ బాఁతింపంగ మందారముల్
బూయుం బుష్పమరందవాసనల నెప్డుం గ్రాలు నాగోత్రమే. ౬౦

మ. మహితం బౌపులినంబునం జెలఁగు శ్రీమద్రాజహంసింబలెన్
మహి లంకాపురి శ్వేతసౌధసితసమ్మానంబునం గాంచె దా
బహువాతోచ్ఛలదుత్పతాకకర యేవాల్గంటి సన్నుంగనన్
బహుమానించెడునట్లు నిల్చు నెదుటన్ భవ్యప్రణాదంబులన్. ౬౧

శ్రీరస్తు.

# హంససందేశము.

## ద్వితీయాశ్వాసము.

ఉ. ఆకృతిసుందరుల్ శుభవిహారలు చారురవల్ సశింజలుల్
స్వీకృతశుద్ధగాత్రు సితవేషలు సన్నయనుల్ సుదృష్టులుం
బ్రాకృతవాఙ్మ్య సన్మధురవాక్యలు మానసగు న్మనోజ్ఞలుల్
ఏకడ దేవభామలు రహిం జెలఁగింతురు నిన్ను సామ్యతన్. ౧

శా. శాపం బిచ్చినఁ జత్తునన్న వెఱచే శాలానిబద్ధాత్మలం
గోపానన్ దనుజుం డొసర్పఁగ లతాంగుల్ నిప్పుఁగాల్పంగ దా
మోపంగాఁ దగువారలయ్యు సితవర్ణోత్కృష్టలై భూసుతా
కోపంబే తమరక్షఁగాఁగ నెటనెక్కొంద్రో దివౌకస్సతుల్. ౨

చ. మణిమయతుంగశృంగముల మాంసలమైన సువేల మొంది స
ద్గుణ, సురవర్యులందెగడు కోణపనాథుఁడు ప్రోవ నేపురీ
మణి కనకాద్రిపైఁ గలయ మర్త్యపురిం బిలువంగఁ గేతన
ప్రణుతకరాగ్రభావముల ప్రాల్చెననం దగు మండనస్థితిన్. ౩

ఉ. వానలువో భవద్విహృతి వైభవయుక్త శరత్తునందు నె
చ్చో నిశ గర్వభావమునఁ జూపినవవ్వ లనంగఁ జంద్రికల్
మానసముల్ హరింప సురమానిను లోడ్చినయశ్రు లెచ్చఁగా
నూని శశాంకకాంతములనుండి జలంబులు పాఱుచుండెడిన్. ౪

శా. సీతాశోకహుతాశనప్రభలచే శ్రీవాతపుత్రామితో
ద్భూతంబై నమహాగ్నిచే భసితమై పోల్పేదు నాలంక నా
వైదేయాధిపభీతి నిశ్చితమతిన్ దైత్యేంద్రతల్పోత్తముల్
స్ఫీతంబై యలరన్ సృజింతురు పురాసృష్టిన్ హసింపం గడున్. ౫

శా. ఆలంకాపురిమధ్యభాగమున దేవారాతిసద్మంబు నా
నాలంకారయుతంబుఁ గాంచి ముదము న్నాకామరద్వంద్వముం
గూలంగ్రుక్కిన వ్యోమయానముల త్రొక్కుళ్లందు కాదాలయం
బాలోకించి దురంతదుఃఖమును నాహా కాంతు వాక్రుమ్మెడిన్. ౬

చ. కనుబొమమోడ్పుచేఁ గదలు, గాలిని దేజునసీతభానుఁ డో
యనఁదగు భానునిం గలిగి యన్నిఋతు ల్వేలయుంగ న్యోకటన్

జనకజశోకవహ్ని కనుజత్వమునొందు నశోకము ల్వేలుం
గ ననిలజప్రచారమునఁ గందిననిష్కుటముల్ భజింపుమా. ౭

ఉ. ఆతరువాటి నాకసమునందు ముదంబున నున్న యండజ
వ్రాతముతోడ మండలము వాఱుచు నట్టిటుఁ గాంచిన న్మహీ
జాతకు దుర్దశ న్సుఖ మొసంగెడి బంధువు న్ర్త బసక్తభూ
షాతతి శింశుపాతరువుఁ జయ్యనఁ గాంచెదు సౌమ్య యచ్చటన్. ౮

మ. చెలికాఁడా, తరుమూలమందు పవనక్షేత్రంబునంబుట్టి యే
స్థలమం దున్నను ద్రాపహీన మగుచున్ సామర్థ్యసంపత్తిచే
నలకాలంబున వీర్యశ్శుల్లమున స్వాయత్తంబు నైయొప్పు దో
తలరత్నంబు దినేశవంశగతరత్నం బప్డు దృశ్యంబగున్. ౯

శా. ఆమీనాక్షియు నానతభ్రువయు నాయత్యంతసత్శీల యా
హేమస్వచ్ఛవరాంగి యాసుకుచభారేమన్నమత్తన్వి యా
భామారత్నము వేదిమధ్యయు భవత్ప్రాగల్భ్యసంచార నా
ప్రేమస్థానపుఁగన్నుఁ జక్కఁదనపు న్వీడేలు చేల్పుం బలెన్. ౧౦

మ. అతిమోహంబున బాధనొందుచునో క్షేమాయత్తవార్తం బత
త్తతికిం జెప్పుచునో మదర్థముగ భద్రప్రాప్తి దవ్వంచు నం
తతముం దెల్పునిమిత్తము ల్గలుగ నేత్రవ్యాప్తబాష్పంబుతో
సతి యీదిక్కును జూచుచుండఁ గనో హంసా నీసుకంటం బడున్. ౧౧

శా. భావింపంబడునో రఘూద్వహుని శుంభద్గాత్రసంస్పృష్టి లే
దో వాక్రువ్వఁగ భూషణవ్రజము నెంతో పల్కుచుం గాని యా
భావోద్భూతసుఖంబు మానసమున న్భావించుచుం గాని యం
దావర్తించును సీత కీదృశగతిన్ దైవంబె కల్గించెఁగా. ౧౨

ఉ. మాలనియింటఁ గాయుసుకుమారమనోహరకౌముదిం బలె
న్నీలవిషావనీజవన నీతసురద్రుమశాఖయుం బలెన్
బాలిశుసన్నిధి న్నుడువుపండితసత్కవిసూక్తియుం బలెన్
బాలను మైథిలిం దలఁతు బాధితఁగా నసురాలయంబునన్. ౧౩

శా. వానం గుందినపద్మినీలతవలెన్ వ్యర్థంపుఁబల్కుంబలెన్
హీనానేకపమైనధేనుకవలెన్ హీనార్థవాక్కోర్కినా
గానం బంకిలమామృణాల మన మేఘచ్ఛన్నచాంద్రింబలెన్
దానిర్లజ్జ ద్వితీయమాడ్కి హరినద్ధన్యంకువ ట్లొప్పెడిన్. ౧౪

చ. స్మరశరభీతిపోవ మును మామకదేహముఁ గౌఁగిలించుచే
వెరవని యెంచి భూషణముఁ బెట్టిన దస్సియు నంగరాగముం
జెరచెరఁ బూయ ఖేదమును జెందుచుఁ గష్టము సంస్మరింపమ
ర్భర మగునంగకంబుల ధరాజనయిత్రిని గౌఁగిలించెడిన్. ౧౫

చ. కరమున మాటిమాటికి నిగారపుటుంగర మస్మదీయమున్
ధరణము సేయఁగాఁ బులకితం బగునంగముఁ దాల్చి మానికం
బరయఁగ లేనియాఁదలను నంగజుకాఁకల వేఁగు చిత్తుచో
పరితలమందు నద్దికొని పల్మఱుఁ గన్నులు మోడ్పుచుండెడిన్ ౧౬

మ. అనసూయాసతి మాతృతుల్య మునుపే యత్యంతపుణ్యార్జితం
బనఁగా నొప్పిన దివ్యగంధమును దేహంబందుఁ బూసెన్ స్థిరం
బనుకూలంబుగ సీత కాయువతి ధారాకారనేత్రాంబువుల్
స్తనయుగ్మంబుపయిం బడం బిదప నాసౌగంధ్యముం బాసెడిన్. ౧౭

శా. చేతిన్నించుట మున్ను జిక్కుఁగను నాచేబద్ధమా స్త్వచ
వ్రాతంబు న్సతిదేహగంధరతి నూర్ధ్వం బెత్త భూమిన్ రమా
నూతిం బూజయొనర్ప బంభరముల న్సొంపారుచున్ దేవతా
వ్రాతప్రేషిత మైనమంజరివలెన్ భాసిల్లు వీక్షింపఁగాన్. ౧౮

ఉ. వానరు లద్రినుండి సజవంబునఁ దెచ్చిన యుత్తరీయపున్
జానున నొప్పుదాని నినుసంగతిఁ జేసిన హాఁసిరూపులం
బూనినదాని బాలరవిపొల్పున నొప్పినవస్త్రరాజముం
బూనిన సీత సంజయెఱుపుం గనుచంద్రుని రేఖఁ బోలెడిన్. ౧౯

మ. చనుమార్గంబును దెల్పనో యనఁ బదాబ్జాతంబునందుండి భూ
మిని స్రస్తంబయి హంసరావ మగునామేల్దక్షిణోన్నూపురం
బునకుం దుల్యము నూరులం బదముఁ బెంపుంగూర్చి నాహస్తమం
దెనయుం గూడెడి వామనూపురము నెంతేఁజూచుఁ గొమ్మన్ వ్యథన్. ౨౦

ఉ. వాడినవృక్షపల్లవనిభంబులు నుజ్ఝితభూషణప్రసూ
నేడితముల్ ప్రతీకముల నెంతయు నొప్పి శరీరకాంతిలో
నీడలుగా లతల్బెరయ నెట్టనఁ గాఁకలఁ గించిదూనమై
పాడఱు సీత దానవనిబద్ధసునందనలక్ష్మి, కైవడిన్. ౨౧

ఉ. మానసబాహ్యవృత్తులను మాన్పఁగ నింద్రియసన్నిరోధముం
బూని మనీష నాపయిని బొందఁగఁజేసి యనన్యలభ్యమా
ధ్యాననిరూఢి సంచలతనందని యోగము మన్మథాగమా
ధీనత నభ్యసించు నతితీవ్రత జానకి యాచు నెంచెదన్. ౨౨

ఉ. కాటుక లేనికన్నులు వికాసము లేని ముఖాంబుజంబు నా
రాటము సేయు శ్వాసము భరంబగు బాష్పము భర్తృసంగతిన్
గాటపుఁబల్వరింత గలుగ న్విధిచే నియమింపఁగాఁబడెన్
బోటి కృశాంగి నా చెలిమిఁబొందుటచే మదిఁ దత్తఱించెడిన్. ౨౩

మ. అలసీతాసతి దుర్భరంబయిన దీనావస్థనుం గాంచి లో
న లలింబుట్టిన శోకవేగమును బూనన్శక్యమే నీకు నా
పలభుగ్జాతిని రావణుంబలెను దుర్భావంబుఁగ్రైశోక ని
ర్మలధర్మంబునఁ గూడువారు దయతో రాణింపకుంద్రే భువిన్. ౨౪

మ. నికటస్థం బగుదీర్ఘిక న్మిగులఁ బానీయంబులం ద్రావి నీ
సకలాయాసము పాయ నచ్చట నివాసంబుం దగం జేసి మా
మకవాక్యంబులఁ దెల్లవాఱ వినిపింపం జేయుచున్ రాత్రి నీ
వకలంకస్థితిఁ బుచ్చు రాక్షసులు నిద్రాసక్తులై యుండఁగాన్. ౨౫

శా. మార్గాయాసముఁ బాపుగంధవహముల్ మన్నించి వీవ న్నభో
మార్గంబందలి వెన్నెల ల్పులినసీమం గ్రాల నిద్రించుచున్
దార్గత్యస్థితపద్మకోరకమిళిందధ్వానముల్ రేఁగ నై
రర్గళ్యంబుగ మేలుకాంచి యటఁ గార్యంబు న్విచారింపుమా. ౨౬

చ. కదళిడిపల్లవంబులను గ్రాలెడిశింశుప నెక్కి సీతకు
న్ముదమలరంగఁ గంటఁబడి పుష్పధనుర్ధ్వని తీవ్రమైన నీ
రొద యుడుగంగఁ బ్రేయసి నిరూఢతమోవృతచిత్త లేపుమా
మొదల రఘూద్వహున్ జనకభూపతివర్ణన నొప్పఁజేయుచున్. ౨౭

శా. వీరస్త్రీవరులైన శూరులకు నుఃర్వీభ్యార్చ్చ తచ్చారదన్
స్వారావంబునఁ దెల్పుయుద్ధసమయం బంచేమహాహంసమో
యారాఢ్ఘంసను నీపతి ప్రియుఁడ దీర్ఘాయుస్సమేతుండు నీ
గారాబుంబతి క్షేమవార్త యనుపంగాఁ గాంత నేవచ్చితిన్. ౨౮

ఉ. నాకథఁ జెప్పు నిన్ను నిమినాథతనూజ ముఖాంబుజాతమున్
శోకయుతంబు నెత్తి గడుసుందనమేది మనోముదామృత

స్తోకము సాహచర్యమున శోభిలి రక్తములైన తమ్మిపూ
రేకుల మైత్రిచే వెలయుదృష్టులతోఁ గడుగారవించెడిన్. ౨౯

చ. దశరథుముద్దుఁగోడ లవదాతగుణంబున నొప్పు నిన్నుఁ గాం
చి శమితచిత్తయౌచు సురుచిం గని శుక్లపుఁజంద్రరేఖనా
విశదముఖంబున న్వినఁగ వేడుకఁజెందెడి నాదువార్తల
న్వశగత కాంతవార్తయును భామలకు న్ముదమొప్పఁ గూర్పదే ౩౦

ఉ. చెప్పుమ యిట్టు లాపయి సజీవుఁడు నీదగుభాగ్యరేఖచే
నిప్పుడు కోసలేంద్రుఁడు వచించెను క్షేమము నిన్ను మంగళం
జెప్పుడు రార్య లేపగిది చిహ్నముల న్నియతంబు శ్రేయమూ
యొప్పెడిలక్షణంబుల మహోన్నతలక్ష్మివిగాను నీవిగాన్. ౩౧

శా. ఏరామామణిమండనక్రియయు మున్నెవ్వాని కాలస్యమై
భారంబయ్యెను దైవ మాయబల ద్వీపస్థాలయుం జేయ నే
త్రారోపం బొనరించి దగ్గఱనె యున్నట్టు ల్విచారించునో
యారాముం డిటుపల్కుచుండె సుఖియై యంబా మహాస్యంబునన్. ౩౨

మ. ఘనమైత్రీవివశత్వభావమును జక్కంబూని భోగింపఁగా
మనకాలింగనచుంబనాదికముల న్నాటన్ క్షణంబుం బలెన్
మునుపాశర్వరి యిప్పుడో మననసంభూతాధికక్రీడలన్
ఘనదీర్ఘంబయి క్షీణతం గనక యో కాంతామణీ క్రాలెడిన్. ౩౩

చ. స్తనకలశోత్థితోష్ణములఁ దద్దయు నిర్జితమై వియోగమం
దున నవకాశ మొంది కడుదుండగ మప్పుడ పూనునట్టిదై
యనయము కుందవాసనల నన్నిదెసల్ సురళించునట్టిదై
యనిలము త్వన్ముఖాప్తమగు నబ్జముతో నను దీనుఁజేసెడిన్. ౩౪

ఉ. తేనెలఁగూడి ప్రోషితలతిండిఁ జెలంగి యమోఘవర్తనం
బూను మనోజబాణముల నొప్పుగ దిక్కుల నావరింపఁగాఁ
బూను వసంతు సీతకడఁ బోకుమటంచు వచించె రాముఁ డెం
తో నతిఁగన్న మూర్ధమున నొత్తుభయంబునఁ దవ్యక్తచాపుఁడై. ౩౫

మ. కెలనం బర్విడుకోకిలారవములం గీపెట్టు శబ్దంబుతో
నలకవ్వంపుమలం బొకాలి మెయిపై హత్తించి మల్లీసుమం
బులధూళిన్ భ్రమరంపునంకెలలతోఁ బొల్పారునాతెమ్మెరల్
మలయన్ లక్ష్మణుఁ డార్తుఁడై తిరుగ నన్నాన్చె న్నభస్స్వత్స్మృతీ. ౩౬

మ. అతివా ? నీకడ మంజులప్రసవ ముద్యద్దీప్తి నొప్పం గరం
జతరుల్ లాజమనోహర ప్రసవముల్ సల్లంగ నీపెండ్లి చా
వితముం దోఁచిన మందబుద్ధినగు నేఁ బృథ్వీశు నేనుందు నా
క్షితిపుం డేమను నంచు ఖేదము మనస్సీనుం జనింపింప వే. 3౭

శా. గాలిన్ రాలినయద్రిమల్లికల సద్గంధావృతం బైన యా
శైలాగ్రంబున దైత్యభీతితొలఁగన్ జాయాసమాశ్లిష్టమై
మేలుంగన్న మయూర మాచపలయ స్నేల్గోణము న్రాయ గ
ర్జాలోలుండగు మేఘుచే నటనమూరంభించు హృద్యంబదే. 3౮

చ. అచలగుహాంతరధ్వనులె యాత్తరవంబుగఁ దాపసంగతిం
బ్రచలితమైన నీజనని బాష్పసమేత నొనర్చి నీటుచేఁ
బ్రచురసుమేఘుతాపమున బాధితు నన్గని మేఘపంక్తులాఁ
గి చదలఁ జేయుచోదన మొగిం గడునబ్బురమై ప్రవర్తిలున్. 3౯

మ. తనుసంస్పర్శము వాయువందు శశిపై త్వద్దృష్టి సంస్పృష్టి భూ
మిని నేకాలయవాస మీజగతిపై మేలొక్క శయ్యాస్థితిన్
మినుకుం జుక్కలనొప్పు నాకసమునన్ మేల్పట్టు ధర్మంబు నేఁ
గనుచున్ దుర్విధిచేత దవ్వయిన నిన్గాంతా సమీపించితిన్. ౪౦

శా. నీనేత్రంబుల చెల్మిఁ గాంచి జలజానీకంబు సంఫుల్లమై
జానుం గూర్పఁగఁ గాలయోగ్య మగుసత్సన్నాహముం గూర్చుచు
న్నేనలోఁదగుత్రోవఁ జూపుచు శరచ్ఛ్రీ నన్ను శుభ్రాశ్రమై
యోనాతీ పురికొల్పుచున్నది భవద్వ్యక్తస్థలిం జేరఁగన్. ౪౧

శా. తాతాదేశముచే స్వసోదరునిపైఁ దద్రాజ్యమర్పించి నేఁ
బూతారణ్యముఁ జేరనే సతి పురంబుంబాసి నన్జేరె నా
స్ఫీతోరస్థ్సలిఁ బవ్వళించి స్వభుజాశ్లేషంబునంగ్రాలు నా
సీతన్నిన్నుఁ దృజించి దూరమున నాజీవంబు దుఃఖించెడిన్. ౪౨

మ. జలధిన్ బర్వతపంక్తితోనా విశిఖాసారంబుతోనేన్ ఘటిం
చిలలిన్ సేతువుదాఁటి వానరులు విచ్ఛేదింప లంక న్పనుం
బులయ ట్లల్పదినంబులన్ దనుజులం బోకార్చుచున్ లక్ష్మణుం
డెలనాఁగా కడునించు నీచెవులలో నింపౌధనుర్ఘోషమున్. ౪3

ఉ. రావణుమాళిమంజరుల రాల్పఁగఁ దద్గతవైరబంధముం
బోవఁగ నాకసంబునను బోయెడిపుష్పక మెక్కి భూమికి

స్నీవును నేను బోయి యట నిర్మలమానికృతాభిషేకమున్
దేవి వహించి మున్ను మదినెంచినకోర్కులఁ దీర్చికొందమో. ౭౪

మ. ఖరునిం దొట్టి సమస్తరాక్షసుల లంకానాథసంకాశులం
దరలం జేసి జయంబు గైకొని జనస్థానంబు నేవీడి రా
వరశస్త్రక్షతముల్ భవత్కుచయుగవ్యాప్తోష్మమునోఁక సా
దరసంశ్లేష మొనర్చి కప్పితివి కాంతా? దాని లో నెంచుమా ౭౫

చ. మును శచి పడ్డపాటుల నపూర్వములం దలపోసి శూలపా
ణిని నెడఁబాసి దుఃఖముల నివ్వెఱపడ్డ గిరీంద్రపుత్రికన్
మనమున నెంచి దేహము శమంబునఁ బ్రోవు మదీయజీవితం
బునకును భర్తకై వ్యసనముం గను టాండ్రకు శ్లాఘ్యమేకదా? ౭౬

మ. సహజస్నేహము గల్గుబంధుఁడవు నీసాహ్యంబు మత్కార్యముం
బ్రహరింపందగు నట్లొనర్పక ఫలవ్యాసక్తమై యొప్పెడిన్
సుహృదుం డైనన లేంద్రువార్తఁ గనిము న్నూరుల్ ఫలోపేతఁగా
బహుశుద్ధాత్ముల కార్తరక్షణమె భవ్యంబౌ వ్రతం బండ్రిలన్. ౭౭

చ. జనకతనూజ నిప్పగిదిఁ జల్లనిపల్కుల జీవయుక్తఁగా
నొనరిచి భానువంశజుల యొప్పగు స్నేహము వృద్ధిసేయుచున్
వనజనివాసినిం గలిసి వర్తిలు విష్ణునిమాడ్కి లోకముల్
పనివడి సంచరింపు మనవద్యమరాళినిఁగూడి సౌమ్యుఁడా. ౭౮

ఉ. వాచిక మిట్టులంపి రఘువంశజుఁ డబ్ధినిఁ గట్టి తత్స్మృతిన్
గోచరమైనలంకఁ గని కోఁతులతో దశకంఠుఁ గూల్చి సీ
తాచపలాక్షిఁ గూడి స్వగతంబుగఁ జేయుచుఁ బాదుకాప్రభు
త్వోచితరాజ్యలక్ష్మిని నయోధ్య సనాథను జేసె వేడ్కతో. ౭౯

ఉ. విద్దెలశిల్పి నాఁబరఁగు వేంకటసత్తివిచేతఁ గ్లప్తమై
పెద్దయు శ్రేయమిచ్చునది వింతవిచారపుసానరాపిడిన్
దద్దన వెల్గురామునుడిరత్నము హంస మహీజమిత్త్రముం
బెద్దలు జ్ఞాననేత్రమును విచ్చి చెవిం బరికింత్రుగావుతన్. ౮౦

సంపూర్ణము.

# ప్రార్థన

శా. శ్రీరాముండు మనోజ్ఞవేషుఁడు బుధాశీర్వాదపాత్రుండు దు
ర్వారామేయపరాక్రముండు వినుతవ్యాపారుఁ డంభోధిగం
భీరుం డార్తజనావనవ్రతుఁడు పృథ్వీనాథరత్నంబు సం
సారాంభోనిధిపోత మెల్లపుడు మోక్షంబిచ్చి మమ్మేలుతన్. ౧

మ. ఉరుకౌండిన్యసగోత్రసంభవునిఁ గల్లూర్యన్వయాబ్ధిక్షపా
కరునిన్ వాదవినిర్జితాఖిలబుధున్ గంగాధరాభ్యర్చనా
భరణున్ శిష్యవితీర్ణసత్ఫలుని దుర్వారాంధ్రగీర్వాణవా
గ్గురునిన్ వేంకటరామశాస్త్రిగురు హృత్స్థానంబునందుంచెదన్. ౨

సీ. కరము గుప్తార్థప్రకాశిక యొనరించి సూరిసూరిత్వంబుఁ జూపె జగతిఁ
బత్రికావాద మొప్పఁగఁ జేసి పండిత దిగ్వారణంబులఁ దెరలఁజేసె
నన్యభాషాస్థపదాళి కర్థముసెప్పి వైయాకరణతను బాదుకొల్పె
బహుపూర్వవిశ్రుతభవపత్రములఁ దెల్పి తనకున్న మేధావితనముఁ జూపె,
ఆంధ్రసారస్వతపుసభయందు వెలయు,మహదుపాధ్యాయబిరుదసమ్మానమందె
నతులగౌరవభాజనమై జగమునఁ,గ్రాలెఁ గల్లూరి వేంకటరామశాస్త్రి. 3

సీ. ఆయన కడనేను నమరభాషాభ్యాసమొనరించుటకుఁ బోకమునుపె యతఁడు
తెలిఁగించె మేఘసందేశంబు గవులన దానికీడగునట్టిదాని రుచుల
హంససందేశంబు నాంధ్రీకరించుచుఁ బద్యంబులను నన్ను వ్రాయుమనియె
నిరువదితొమ్మిది విరచించి పద్యముల్ మానెను గారణం బేనెఱుంగ
నంత గురుఁడస్తమింపఁదదాత్మజుండు,రామచంద్రుండు గైకొని గ్రంథసమితి
వచ్చినాకిచ్చియిట్లువాక్రుచ్చెనీదు,గురుకృతగ్రంథశేషంబుగూర్పుమనుచు. ౪

చ. అనినఁ దదాజ్ఞ మద్గురునియాజ్ఞగ నెంచుచుఁ దత్కృతంబుగాఁ
బొనరిచి పొత్తమంతయును బూర్తి యొనర్చితి గాని తద్రసం
బును బదసౌష్ఠవంబుఁ బలువుందన మిందు లభింపఁగల్గునే
ప్రణుతసరోజరూపమును వ్రాసిన సౌరభ మెట్టు లబ్బెడిన్. ౫

సీ. పశ్చిమగౌతమీభాగంబునందున్న నిడదవోల్గ్రామంబునికటమునను
భాసిల్లుచుండిన బాఁపనగూడెంబు గాఁపురంబుగనున్న క్ష్మాసురుండ

శుక్లయజుర్వేదశోభితచిత్తుండఁ గౌండిన్యమునిగోత్రమండితుండఁ
గోడూరి యచ్చన్నకును వేంకమాంబకుఁ బుత్రద్వితీయుండ భూరియశుఁడు
పల్లయార్యుండు గణపతి భ్రాతలుగను, బుట్టినాఁడను దక్షిణామూర్తిశాస్త్రి
యనెడివాఁడను బాండిత్యమల్పమైనఁ, దెలుఁగుఁ జేసితిహంససందేశము భవ ౬

క. గురుకృతపరిశిష్టంబును, గురుతనుజనియోగమునను గూర్చితి దీనిం
గరుణించి విలోకింపఁగ, గురుకవిబుధపుంగవులను గోరెద నతితోన్. ౭

క. కానబుధోత్తములారా?, దీనం గలదోషములను దిగవిడిచి గుణా
ధానముఁగావింపుం డని, నే నతులొనరించు వాఁడ నిరతము మీకున్. ౮

బుధవిధేయుఁడు,
కోడూరి దక్షిణామూర్తిశాస్త్రి.

# శ్రీవేదాంతదేశికులు.

ఈ హంససందేశకావ్యమును రచియించినకవి వేదాంతదేశికులు. ఈయనకే వేంకటనాథుఁ డనియుఁ బేరు. శ్రీమద్రామానుజాచార్యుల యనంతరము సంస్కృతమునందును, తమిళమునందును బెక్కు గ్రంథముల రచియించి విశిష్టాద్వైతమతమును బోషించెను. కేవలము మతగ్రంథములే గాక కావ్యాదుల రచియించుటచే నీతఁడు సర్వతంత్రస్వతంత్ర, కవితార్కికసింహాద్యాది పెక్కు బిరుదనామముల వహించెను. చరిత్రకారు లీతనికాలము, క్రీస్తుశకము, 1268-1369 యని నిర్ణయించియున్నారు అందుచే విద్యానాథాదులకు సమకాలికుఁ డని మనమూహింపవలసియున్నది. మఱియు రసార్ణవసుధాకరకర్తయు వేంకటగిరిసంస్థానాధీశుఁడు నగుసర్వజ్ఞసింగమనాయకుని తాతయగు సింగభూపునికొఱకు సుభాషితనీవి యను నీతిగ్రంథమును, తత్త్వసందేశము మున్నగు వేదాంతగ్రంథములను రచియించె నని యైతిహ్యము కలదు. ఈతనిగ్రంథములు సుమారు నూటయిరువది గలవు. అందు ముఖ్యము లయినవి యాదవాభ్యుదయ, హంససందేశకావ్యములు, సంకల్పసూర్యోదయ మను నాటకము, సుభాషితనీవియను నీతిగ్రంథము, దశావతారస్తోత్రము, పాదుకాసహస్రము, హయగ్రీవస్తోత్రము, దయాశతకము మున్నగుస్తోత్రములు, శిల్పార్థసారము, భూగోళనిర్ణయము, మున్నగు శాస్త్రగ్రంథములు, సేశ్వరమీమాంసా మీమాంసాపాదుక మొదలగు మీమాంసాగ్రంథములు, గీతాతాత్పర్యచంద్రిక, రహస్యరక్ష, శతదూషణి మున్నగువేదాంతగ్రంథములు. వీనిలో మహాకవి కాళిదాసు రచియించినమేఘసందేశము ననుసరించి హంససందేశకావ్యమును, కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయము ననుసరించి సంకల్పసూర్యోదయమును వ్రాయఁబడినవి. జగద్విఖ్యాతయశస్కుఁ డగు అప్పయదీక్షితులు యాదవాభ్యుదయమును బ్రశంసించి వ్యాఖ్యాన మొనర్చియున్నారు.

---

పాఠకమహాశయులారా !

ఈసంచికతో ఆంగీరసనామ సంవత్సరము ముగిసినది. ఇరువది రెండవ సంపుటము శ్రీముఖతోఁ బ్రారంభించుచున్నది. దయతోఁ దమరు తమ రీయ వలసిన చందాలను వెంటనే పంపఁగోరుచున్నారము. ఇదివఱకుఁ జందాలిచ్చి వేసినవారు శ్రీముఖసంవత్సరమునకై పంపఁగోరెదము. అందఱు గ్రాహకులును శ్రీముఖ ప్రారంభమున కొక్కొక్క సంవత్సరము చందా పంపి శ్రీముఖను సార్థకపఱుపఁ గోరుచున్నారము.

ప. అ.

శ్రీరస్తు.

# ఆర్తరక్షామణి.

వడ్డాది సుబ్బారాయఁడుగారు-రాజమహేంద్రము.

---

శా. శ్రీసీతాజలజేక్షణాహృదయరాజీవస్ఫురద్ద్యోమణీ!
కౌసల్యోదరశుక్తిమౌక్తికమణీ! కల్యాణచింతామణీ!
వ్యాసాదిస్తుతిపాత్రపాలకమణీ! వాల్మీకిసత్కృత్యుప
న్యాసాకల్పమణీ! తమస్తరణి! రామా! యార్తరక్షామణీ. ౧

మ. అవివంశంబున భారతక్షితి నయోధ్యన్ మర్త్యతన్ ద్రేత ను
ద్భవమై, పంక్తిరథుండు తండ్రిగఁ దత్కౌసల్య తల్లింగ గా
రవమారంగఁ బెరింగి, సీత సతిగా రాజై, చిరం బేలి తీ
వవనిన్, భక్తి భజింపనేఁడుఁ బ్రజ; రామా! యార్తరక్షామణీ. ౨

మ. జనసందోహ మహాపుఁ గన్గొన నదక్షుంబంచు విశ్వంభరుం
డనువొందం దను భక్తిఁగొల్చి ప్రజ నై కాపత్త్రరంబుం దరిం
పను సంసారము ధారిణిన్ వెలసె భాస్వద్వంశరాత్మౌళియై
యనుచుం బ్రార్యులు; నీవ తత్ప్రభువు; రామా! యార్తరక్షామణీ. 3

శా. శ్రీనాథుం డని, చిన్మయుం డని, ఋషిశ్రేష్ఠుల్ ప్రశంసించి రే
లా నిన్నొక్కని? సూర్యచంద్రకులజుల్ లాఁతుల్ నృపుల్ లేరె? యం
దేనింగాని తలంచిరే యటు? మహోత్కృష్టక్రియల్ సల్పరే
యానాఁ డాప్రభు? లీవు శ్రీహరివె; రామా! యార్తరక్షామణీ. ౪

మ. బిరుదుంబొందెను దారకం బనుచు నీపేఁ; రద్రిరాట్కన్యకే
శ్వరుఁ డద్దాని మహాప్రభావ ముపదేశం బిచ్చుఁ గాశీపురిన్
మరణంబప్పుడు ద్రిప్పు దేహి కుడికర్ణం బందుఁ దద్వర్ణముల్
హరుఁ డూఁదుం; బరమాత్మ వీవరయ; రామా! యార్తరక్షామణీ. ౫

మ. తనయుల్ సల్పినతప్పు లెప్పగిది విన్ దండ్రుల్ దయన్ దిద్దుకొం
డ్రని శంబున్ క్షమియించి; నీవ గుఱి యిం; దారావణబ్రహ్మకున్
వనజాతాసనుఁ డిడ్డ చెడ్డవరముల్ పాటించి, లోకంబు లో
మ నరుండైతి, వికుంఠధాముఁడవు; రామా! యార్తరక్షామణీ. ౬

మ. నరు లాహారమె కాన వారివలనన్ నాశంబు రా దన్నతిన్
వరవారంబున వారి రావణుఁడు చేర్పండయ్యె; వాదించినన్
నరులే కావున, నల్లె వానరుల; దానన్, దత్సురుల్ వానరుల్,
హరిపీవోట ఘటిల్లెఁ దద్వ్యధకు; రామా! యార్తరక్షామణీ.

మ. భువనక్షోభము రావణాదిదనుజుల్ పూర్వంబు గావించి; ర
ట్లపుటన్ వారల దూషణంబుఁ బొనరిం; తౌఁగాని, నీయట్టి సా
ధ్వవనుం డౌనవతారమూర్తి భువియం దావిర్భవింపంగతం
బపుటన్, వారలకొప్పు భూషణము; రామా! యార్తరక్షామణీ. ౮

మ. అవతారంబులఁ దర్జనీప్రభృతులౌ హస్తాంగుళంబుల్ బలెన్
హవణిల్లున్ వరుసన్ మనోహరపురామాభిఖ్య మూఁడున్నతిన్;
మివులన్ మూఁడిట మధ్యమంబు వలెనే మించున్ ద్వదీయంబు హా
ర్యవతారంబు, మహోత్తమం బగుచు; రామా! యార్తరక్షామణీ.

మ. కాంతారాంతరవాసులౌ ఋషులు స్వర్గస్థాదు లస్వప్న ల
శ్రాంతంబున్ బహుభంగులం దమకు దుష్టవ్యాదసంతాన మ
త్యంతంబున్ బొనరించుబాధ లుడుపం బ్రార్థింప, మర్త్యుండవై;
తంతేగాని, నిజానకున్ హరివి; రామా! యార్తరక్షామణీ. ౧౦

మ. సీతన్ సృష్టికి మూలమౌ ప్రకృతిగాఁ, జిత్సత్సుఖాత్మున్ బరం
జ్యోతింగా నినునెంచి, జ్ఞాననిధులౌ యోగుల్, దశాస్యాదిదు
ర్దైతేయోద్ధతులం బొకార్చి, బుధబాధం బాపఁ, బృథ్విన్ నరుం
డైతం, ద్రాత్మనెఱింగి నీమహిమ; రామా! యార్తరక్షామణీ. ౧౧

శా. నీవాపుట్టినచైత్రశుద్ధనవమిన్, సీతాంబకల్యాణమున్
గావింత్రెల్లరు భారతక్షితిఁ, బురగ్రామంబులం బల్లెలన్;
భావింపన్ నిను, నుంత్రు బిడ్డలకు నీనామంబుఁ బ్రేమించి; భ
క్త్యావేశావహదైవరత్నమవు; రామా! యార్తరక్షామణీ. ౧౨

మ. స్త్రీలోకంబున కొజ్జబంతియొగదా సీతాచరిత్రం; బటే
బాలప్రాయమునుండి పూరుషులకుం ద్వత్పూతచారిత్రమున్;
భూలోకంబు తరింపఁ, బుట్టితిరి నీవున్ నీకళత్రంబు; మీ
రా లక్ష్మీకమలేక్షణుల్ నిజము; రామా! యార్తరక్షామణీ. ౧౩

మ. తమకే నన్యులకేని, కష్టములు ప్రాప్తంబౌతఱిన్, గ్రూరకృ
త్యమునేఁ, బాపపుఁగర్మమేని కనిన న్దాలించినప్డున్, మహా
యమబాధం బహుప్రాణిఁగన్నపుడు, నైకాపత్తులన్, నీదునా
మమె కా మానవు లుచ్చరించెదరు; రామా! యార్తరక్షామణీ. ౧౪

మ. హృదయస్థం బగు సర్వకల్మషము పై కేగంగ నాద్యక్షరం
బుదెలన్ మున్ దలవాకిటన్, సరగునన్ మూయున్ ద్వితీయంబు లో
నది వెండిం జొరకుండఁ; దారకమునా నాఖ్యం ద్వదీయంబునే
నదియే కారణ మంచు నెంచెదను; రామా! యార్తరక్షామణీ. ౧౫

మ. కలుషప్రాయపుజీవనంబును ద్రుటిం గావించెడున్ స్వచ్ఛమున్
దలఁపం గాఁ గతకంబువోలెను భవన్నామంబు భవ్యంబు; మ
ర్త్యులకున్ మన్గడ నక్కటా సకలమున్ దొడ్డొత్తఁ గల్పించితీ;
వలసుల్ కానరు దాని వాడుకొన; రామా! యార్తరక్షామణీ. ౧౬

శా. మీవంశంబున కాద్యుఁడౌ రవి, పవల్ మింటం గనన్ వచ్చుచున్
గావించుం దనవేయిచేతులను సంతానంబు లోకాళి; కిం
కీవో, గానఁగరాకయుం, బగలు రేయిన్ ధాత్రిఁ జంద్రాంకితం
బై వెల్గొందెడుపేరఁ, గూర్తైలమి; రామా! యార్తరక్షామణీ. ౧౭

శా. మాలల్, మాదిగ బోయవాండ్రు మొదలౌ మర్త్యాధమవ్రాతముల్
మైలంబాసి తరింప వేఱుగలదే మార్గంబు? నీనామమే
మేలౌమంత్రము వాండ్ర; కిందు గుఱి వాల్మీకుండె; హేమంబుగా
దాలోహంబును స్పర్శవేధి? రఘురామా! యార్తరక్షామణీ. ౧౮

మ. తలక్రిందైనను మంచివిత్తు, ఫలవంతంబైననేలన్ మహా
ఫలమీఁజాలు; "మరామరా" యనుచు నవ్వాల్మీకి, నీనామమున్
దలపైఁ బుట్టలువెట్టునట్టు జపముం దాఁజల్పి, కల్పించెఁ గా
వ్యలలామంబు భవచ్చరిత్రమును; రామా! యార్తరక్షామణీ. ౧౯

మ. అమరించెం గవి వేయికొక్కటిగ గాయత్రీమహామంత్రరా
జము వర్ణంబులు; నాలుగిర్వదిసహస్రంబుల్ ఋషిప్రోక్తముల్
విమలత్వచ్చరితంపు శ్లోకములు; తద్విఖ్యాత సత్కావ్యమా
ద్యము చాటున్ జగతిన్ భవన్మహిమ; రామా! యార్తరక్షామణీ. ౨౦

మ. చెదపుర్వుల్ మెయిఁ బుట్టవెట్టఁ దపమున్ సిద్ధింపఁగావించి, శా
రద నాల్కన్ నిల, నూఁద నారదుఁడు కర్ణంబందు, వాల్మీకి, బ్ర
హ్మాదయున్ సర్వమెఱింగి, నీచరితఁ గావ్యంబల్లి తా మోక్షసం
పదఁ జూఱాడె; మనుష్యమాత్రుఁడవె; రామా! యార్తరక్షామణీ. ౨౧

శా. *నీవత్తొల్లవి కర్థమే నవనియేనిం దానముంజేసి యుం
దో, విఘ్నం డనిపించుకో ననినఁ, దద్యోగీంద్రుఁ డాద్యం గృతిన్
గావింపందు భవద్భవంబునకు పెన్నన్; జ్ఞాననేత్రంబునం
భావిం గాంచి రచించె నందు రది; రామా! యార్తరక్షామణీ. ౨౨

శా. కౌపీనంబును నారగట్టఁ, గసురుల్ గాయల్ దినన్ బండుకోఁ
జాఁపల్ పూరివి, యుండ నాకు గుడిసెల్; సన్న్యాసి కొండేల? మో
క్షాపేక్షన్ రచియించెఁ ద్వచ్చరితఁ గావ్యం బాడి వాల్మీకి, ని
న్నాపద్మాపతిఁగా నెఱింగి మది; రామా! యార్తరక్షామణీ. ౨౩

మ. కవులందుం గనుపట్టుఁ గొందఱయెడం గక్షుద్రి; వారల్ ప్రశం
సవిశేషంబుగ మర్త్యనర్త్వాతకు మించన్ జేయుచుం; డ్రుందునన్
రవకున్ రాతికి భేదమేమిఁ దెలియన్ రామన్, మహర్షిడ్వ్యకా
వ్యవిభున్ నిన్ నరుఁడందు రొక్కొకరు; రామా! యార్తరక్షామణీ. ౨౪

మ. మునినిన్ శ్రీశుఁగఁ గాంచి, నీదుచరితంబుం బల్కె వాల్మీకి మున్;
గనె సీతం గపి కంథిదాఁటి చులుకం గైఁదాల్చి నీముద్రికన్
మనుజుం డుల్లమునందు నిన్నిడి తరింపంగాంచి సంసార, మొ
య్యన ముక్తింగను నిశ్చయంబుగను; రామా! యార్తరక్షామణీ. ౨౫

---

* నీవత్తొల్లవి కర్థమే నవనియేన్ దానముం జేసియుం
దో విఘ్నండనిపించుకో ననినఁ, గన్గోకే నినున్, దత్కృతిన్
గావించెం గథ దెల్పనారదుఁడు, ప్రజ్ఞన్ బ్రహ్మయౌఁగా, నతం
డావాగ్దేవి వసింప నాల్కకొన; రామా! యార్తరక్షామణీ.

గీ. *శాలివాహు నట్లు చంపఁ గడంగు నీ, బలము ఫణులచేతఁ బొలిసినంత
వాసుకికిఁ దపంబు సేసి నీ వమృతము, వడయు మెఱుఁగి మమ్ముఁ బనిచె నతఁడు.
క. వడుగు లయి విక్రమార్కుని, కడకుం జని వేఁడి యమృతకలశము మీఁచే
పడఁ జేసికొనుఁడు యాచకు, లడిగిన వంచింప కిచ్చు నతఁ డని చెప్పెన్.
క. తప్పక చెప్పితి మేమును, దప్పక నీవును యథోచితము సేయుము నీ
చొప్పు వొగడ వేజిహ్వల, యప్పన్నగవిభున కైన నలవియె భూపా. ౧౩౭
వ. అని నిజరూపంబులు చూపినం గొంత చింతించి విక్రమార్కుం డర్థు లడిగి
నం దనకు మోచినపని గాన నీక తలంగె నను నపకీర్తి వచ్చు దీని మీఁద
నఖిలజగదాధార స్తంభం బగుకుంభీనసేంద్రుండును దన్నింతవానిఁగా దలం
చి వీరలం బంచినచోట వృథపుచ్చుట నాదొడ్డతనంబునకు మిగులం గొఱం
త గావున వైరిమనోరథంబులతోడం గూడ నాయశంబు వర్ధిల్లుంగాక యను
చు నిశ్చయించి. ౧౩౮
క. కుండలిబాలకులకు నధి,కుం డగు భుజగేంద్రనాయకుం డటు మెచ్చం
గుండ యమృతంబు నేఁ డీ,కుండఁగఁ దగ దనుచుఁ దప్పకుండఁగ నిచ్చెన్.
ఉ. ఈవెరవొప్ప నర్థులకు నిచ్చి యతం డరుదెంచెఁ గ్రమ్మఱం
గావున నీకు నీగుణము గల్గిన గ్రక్కున దీని నెక్కుమా
నావుడుఁ దద్గుణశ్రవణ నందితచిత్తసరోజుఁడైన భో
జావనివల్లభుండును గృహంబున కేగి మఱి న్నుతింపుచున్. ౧౪౦
శా. సారాచారవిచారచారుచరితస్థానిర్జరవ్రాతచే
తోరాజీవనిరంతరోల్లసిత విద్యోతప్రభాధాముని౦
బారావారపయోవిహారభువనప్రారంభనిద్రాఖ్యమా
యారామాహతకైటభాది ఘనదైత్యస్తోము దామోదరున్. ౧౪౧
శా. శర్వాణీహృదయాంబుజాహిమరుచి న్సర్వంసహాభృద్ధను
ర్గర్వీభూతమహాభుజంగమపతిన్ మందాకినీజూటునిన్
సర్వజ్ఞు న్సకలేశ్వరు న్భువనరక్షాదక్షిణప్రాభవున్
గీర్వాణవ్రజసంతతాభిలషితక్షేమంకరు న్శంకరున్. ౧౪౨
మాలిని. విధురజనశరణ్యా వేదశాస్త్రాద్యగణ్యా
బుధహిత నరవేషా భూమణీభూతశేషా

* శాలివాహుమీఁదనాలంబు సేయు నీ-బలము.

మధుకరనిభ తేజా మౌక్తికాళీసమాజా
మధురిపుహారిరూపా మర్మకర్మస్వరూపా. ౧౮౩

గద్యము. ఇది రాయగజగంధవారణవైరిమండలిక భేకఫణీంద్ర వీర ఘోట్టవిభాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రాళాంధ్రమహారాష్ట్ర భూపాలరూప నూపురసుందరచరణారవింద సనదప్రోలి పురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ కొఱవి వెన్నయామాత్యపౌత్ర హారితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసువరాజతనూజ గోపరాజప్రణీతం బైన సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు విక్రమార్కసాహస పరోపకార స్వప్నశాంతివైభవ దానశూరత్వ ప్రశంసనం బన్నది నవమాశ్వాసము.

---

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## దశమాశ్వాసము.

### —॥ ఇరువదిమ్మిదవబొమ్మకథ. ॥—

క. శ్రీదయితావదనచ్ఛా, యాదర్శీభూతకౌస్తుభారుణతేజో
మేదురవక్షఃస్థలుఁ డా, మోదరుఁ గాకోదరేంద్రయోజితతల్పుఁ. ౧

క. నెమ్మనమునఁ దలఁపుచు మో, హమ్మున సింహాసనమున కరుదెంచినఁ జో
ద్యమ్ముగ నిరువదియేనవ, బొమ్మ వలికె *నడ్డపెట్టి భోజనృపాలుఁ. ౨

క. ఏమని చెప్పుదు నుజ్జయి, నీమనుజాధిపునిభంగి నియతంబుగ నో
భూమీశ్వర దివ్యంబగు, సామర్థ్యము లేక యొక్కఁ జన దెవ్వరికిఁ. ౩

మ. అది యెట్లన్న నెఱుంగఁ ॥జెప్పెద నరివ్యాపాదనాపాదనో
న్మదబాహాయుగళుం డనంతధనదానప్రీణితక్ష్మాతల
త్రిదశస్తోమ నిరంతరస్తుతిలసత్కీర్తిప్రియుం డంగనా
మదనాకారుఁ డవంతినాయకుఁడు సామ్రాజ్యంబుతో నొప్పుచుఁ. ౪

శా. ప్రాతఃకాలమునందుఁ గొల్వున నయప్రఖ్యాతు లారాజులు
న్నీతిన్యస్తమనస్కు లానచివ్రులు న్విద్వాంసులుం గొల్వఁగా
జ్యోతిర్మధ్యమున న్వెలింగెడు హిమాంశుంబోలి సొంపొందుచో
జ్యోతిశ్శాస్త్రవిదుం డొకండు ధరణీశుం గాంచి దీవించుచుఁ. ౫

క. సర్వశుభంబులు నీకడ, నిర్వాహము గలిగి యుండు నీకేమని యా
శీర్వాదం బొసఁగుదు †నా, యుర్వృద్ధి దలంప నవియ యునికికిఁ గోరుఁ.

గీ. ధరణిమీఁద నధికదానధర్మక్రియా, పరున కాయు వది యపార మగుట
తెల్లమనుచుఁ బలికి తిథివారనక్షత్ర, యోగకరణములను నొప్పఁజెప్పె.‡

సీ. ఐదింటఁ దానొప్పఁ డట నెన్మిదింటఁ దొమ్మిదియింటఁ బండ్రెంట మేలు శుక్రుఁ
డిందుఁ డాఱింటను నేడింట మూఁటను బదిటఁ జేకొన్న శుభప్రదుండు
శనిరాహుకేతుభూతనయసూర్యులు మూఁటనాఱింట మేలర్చుఁ డట్ల పదిట
రెంట నైదింట నేడింటఁ దొమ్మిదిటను గురుం డున్న నెల్లకోర్కులు ఫలించు

---

* నడ్డపెట్టి—॥ జెప్పెదనుసువ్యాపాదశాత్రోద్యదయోన్మద, † నాయుర్వర్ధన మదియె తనకు నునికిం గోరుఁ— నాయుర్వృద్ధి దలంప నలని యున్నది మాతృక. ‡ సయుక్తిఁ జెప్పె.

బుధుఁడు జేసినానిషాదుల నిష్టుఁడౌ, వీని కెల్ల దుష్ట వేధ లేమి
ఫలము లొప్పుజన్మభవనంబు మొదలుగాఁ, బదునొకంట నున్నఁ బరమసుఖము.

గీ. అందు*రవితనుజాది మహాగ్రహంబు, లిప్పు డాఱింటనునికి నీయిష్ట మొనరు
గురుఁడు బుధుఁడును బైపయి కొనుట మేలు, శుక్రచంద్రులు మూఁట నిల్చుట శుభంబు

వ. అనుచు శుభస్థానంబులు నతని గ్రహంబులును జెప్పి. ౧౦

క. "ధర్మే తిష్ఠతు తే బు, ద్ధిర్మనుజాధీశ" యనుచు దీవించినఁ ద
ద్మర్మం బెఱింగి నృపుఁడా, ధర్మముచొప్పెట్టి దనిన దైవజ్ఞుండున్. ౧౧

క. నీవది యెఱుఁగవె ధర్మము, ద్రోవం జనువాఁడు భక్తితోఁ దనశక్తిన్
దేవబ్రాహ్మణపూజలు, గావింపఁగవలయు విగతకల్మషుఁ డగుచున్. ౧౨

క. గురువును దేవరగా స, త్పురుషుని గురువుగ నిజాశ్రితుని బ్రాణముగాఁ
బరవనితఁ గన్నతల్లిగఁ, బరధనము విషంబుగాఁగ భావింపఁదగున్. ౧౩

గీ. అన్నదానము దుర్భిక్ష మైనయప్పు, డంబుదానంబు నిర్జలం బైనచోట
నభయదానంబు శరణార్థి యైనవేళఁ, జేయుటు చితంబు ఘనదయాశీలమలర.

క. కృత్యాకృత్యవిచారము, నిత్యోచితదాన మాత్మనియమము బుధసాం
గత్యము పరోపకారము, సత్యము వినయంబు నయము జరపఁగవలయున్.

ఉ. ఈకొలఁదిం దదంగము లనేకవిధంబుల నుండు నన్నియు
న్నీకడ నొప్పుచున్న వవనీవర నాకును విద్యలందుఁ బ్ర
త్యేకసమర్థుఁడై న నృపుఁ డిప్పటి యేఁటి ఫలంబుఁ జెప్పుమా
నాకని యానతిచ్చిన ఘనంబున నాద్విజుఁ డుత్సహించుచున్. ౧౪

మ. మహిమాఖండులుఁ డంచు భూజనులు సంభావింప నీ వింపుతో
మహిఁ బాలించుచుఁ బుణ్యకృత్యముల ధర్మద్రవ్య మార్జింపఁగా
గ్రహదోషంబులు పుట్టి పట్టయిన నోగాజేంద్ర యీయేఁట దు
స్సహపాపగ్రహసంఘ మొం బగునతిక్షామంబు వర్తిల్లెడిన్ ౧౫

ఉ. అక్రమ మాచరించి శని నర్కతనూజుఁడు తొల్లి యున్న యా
†శుక్రుని రాశిఁ దా విడుచుచు న్శకటాకృతి నున్న రోహిణీ
చక్రము దాఁటి మంగళుని సద్మము చేరఁ గడంగి యేఁటిలో
వక్రగతిం జరింపఁగ నవర్షణమై చనుఁ గొన్నివర్షముల్. ౧౬

క. పఱిపఱి నిల పఱియలుగా, ‡నెఱిసిన వనపంక్తు లెండ నిరుపమమగు నా
వఱపునఁ బండ్రెండేడులు, కఱవికి నతివిస్తరంబు గాఁగల దధిపా. ౧౭

* అందురవిదనుజమంత్రిముఖ్యగ్రహమ్ము- † శుక్రునిడాసి- ‡ నెఱసిన వనపంక్తు లెండ నెడ
త్రెవ్వని- (నెడతప్పని)

చ. అనవుడు దీనికడ్డపడునట్టి యుపాయము గల్గెనేని నా
యను వెలిఁగింపు మన్న వసుధామరతృప్తియె కారణంబుగా
నొనరిన దేవతార్చనల హోమములన్ గ్రహపూజ*మున్నుగా
జనవర †శక్తికిం దగిన శాంతియొనర్పుము వర్షణంబగున్. ౨౦

క. ఇనుమున నాశనిరూపం, బొనరించి వినీలవస్త్రయుక్తంబుగ న
ర్చనము రచియించి ఖదిరేం,ధనమున హోమంబు సేయఁ దత్ప్రీతియగున్

చ. అనినఁ ద్రివిక్రముండు మొదలైన పురోహితుల్ గ్రహాదిపూ
జనములు సేయఁ బంచి మృదుశాలిమయాన్నముఁ బాయసంబులున్
మునుముగఁ బిండివంటలు సమూహముగా నొనగూర్చి యిష్టభో
జనముల ‡భూసురు ల్దనియ శాంతి దలంబుగఁ జేసి శక్తితోన్. ౨౨

క. దేశాధీశ్వరుఁ డర్థుల, కాశాపరిపూర్తి సేయ నారాధిత యా
నాశాపురమున దేవిని, వేశాంగణసీమ హోమవిధి గావించెన్. ౨౩

ఉ. ఈగతిఁ బెక్కుహోమములు §నీగుటఁ బూజలుఁ జేసిచేసి వ
ర్షాగమ మేమియుం గవక య్యకట యాగము మీఱు నాశుభో
ద్యోగము వ్యర్థమయ్యె శివయోగినియుం గరుణింపఁ దంచుఁ జిం
తాగతుఁ డైనవేళ ¶గగనస్థలి నయ్యశరీరి యిట్లనున్. ౨౪

ఉ. భూపకులేంద్ర యింత దలపోయఁగ నేటికి యోగమాత యా
[1]శాపురి సంతసిల్లి యతిసత్త్వము నీకొసఁగెం బ్రభావసం
దీపితదివ్యశస్త్రనిహతిన్ దిననాథతనూజవక్రమా
ర్గాపఘనోపరోధ మభయంబునఁ జేయుము వృష్టి గల్గెడున్. ౨౫

ఉ. పంటలు పెక్కుగల్గు నని పల్కిన నానృపుఁ డాత్మలోన ము
క్కంటి రఘూద్వహు న్విజయుఁ గైకొని మ్రొక్కుచు దివ్యబాణము
ల్వింట నమర్చి పంక్తిరథులీలఁ గడంగి ప్రతాపశక్తి మి
న్నంటి గ్రహంబు లెల్ల విరియంగ శనైశ్చరు నడ్డకట్టినన్. ౨౬

ఉ. ఆశని నిల్చి నీబలమహత్త్వము మెచ్చితిఁ దొల్లి నీవు గౌ
రీశునిచేఁ దపంబున నభీష్టము లందితి, నేఁడు శక్తి నా

*మున్నొనర్చుచు- †శక్తికిం దగిన శాంతి యొనర్పను వర్షణంబగున్. యొనర్పుమతర్షణంబులన్.
‡ భూజనుల్దనియ- § నింపుగఁబూజలు- నీగులుశాంతిఁజేసి- ¶గగనాంతమునందశరీరి-
1 శాపురిశక్తిసంతసిలి సత్వము-

*కాళము గట్టి నాదగు ప్రకాశము ద్రుంచితి నేఁటినుండి నీ
దేశములోపలం గఱవు దీఱఁ బ్రజ లున్నతియుం బడఁ జేసెదన్. ౨౭

శా. హార్షం బయ్యె భవత్కృతంబున నృపాలాగ్రేసరా కోరిన
న్వర్షంబు ల్గురియింతు నెప్పుడయిన న్వర్ధిల్లు పొమ్మన్న ను
త్కర్షంబంటిన శౌర్యమొప్పఁగ సుభిక్షం బుర్విఁ దోఁపంగ దు
ర్ధర్షుండై చను†దెంచి భక్తిఁ గొలిచెన్ ధాత్రీశుఁ డాశాపురిన్. ౨౮

వ. అది గావున. ౨౯

క. ఈసామర్థ్యము ‡నీకడ, వీసంబును లేదు మగిడి వెసఁ జను మనినన్
వేసరినభంగి భోజుం, డాసింహాసనము డిగి గృహంబున కరిగెన్. ౩౦

వ. తదనంతరంబ కతిపయదినంబు లరిగిన షడ్వింశతితమద్వారంబునఁ బోవుచు.

## — ఇరువదియాఱవబొమ్మకథ —

క. తెల్లనికొండయు గుజ్జును, దెల్లనిపూఁతయును మేను దెల్లనిపాముం
దెల్లని చుక్కలతేఁడును, దెల్లనిచదలేఱు గలుగు తెల్లనివేల్పున్. ౩౧

శా. చేతఃపద్మమునం దలంచి §విహితాశీర్వాదభూమీసుర
వ్రాతంబున్ హితవర్గముం =గొలువ సౌవర్ణోజ్జ్వలద్భూషణా
స్వీతుండై సుదినంబునం గడఁగి దేవేంద్రాసనాసక్తితో
నేతేరం గని బొమ్మ వల్కె వసుధాధీశు న్నివారించుచున్. ౩౩

క. కార్యంబుగానిచేఁతలు, మర్యాదలుగా నవంతిమనుజేంద్రుక్రియన్
ధైర్యమును సత్యమును నౌ, దార్యంబును లేక మెక్కఁ దగ దన్యులకున్. ౩౪

ఉ. ఆతనిధర్మవర్తనకథామృతపానముఁ గోరు దేని పృ
థ్వీతలనాథ నిల్చి విను ధీరుఁ డుదారుఁడు శూరుఁ డాతఁ డ
త్యాతతకీర్తికాముఁడు ¶సదామితదానవినోది సాహస
ఖ్యాతచరిత్రుఁ డార్తహితకారణశీలుఁడు నేల యేలఁగన్. ౩౫

మ. గజవాజిప్రముఖంబులౌ బలములన్ గర్వంబు రెట్టింప న
క్కజమౌ రాజ్యము సేయురాజులు మదం గంపించి సేవింపఁగాఁ

---

*కాళముమట్టి నాకడఁ బ్రకాశభజించితి. †చనుదెంచె వేగ నెలమిన్ ధాత్రీశుఁ డుజ్జైనికిన్.
‡నీకరవీసంబునులేను. §విహితాశీర్వాదమౌ భూసుర. =గొలువ నాస్వర్ణోజ్జ్వలద్భూషణా
¶సుధాకరదానవినోది. సుదారసదానవినోది.

ప్రజలెల్లన్ ధనధాన్యపుత్రవనితాభాగ్యంబులం బొందియు
న్నిజధర్మంబులు దప్పకుండిరి [1]మహానిర్వాహులై యందఱున్. ౩౬

శా. ఆకాలంబున విక్రమార్కుఁడు విధేయం బైన దేశాంతరా
లోకాసక్తి మహిం జరింపఁ జని వాలుం జోగివేషంబు ని
త్యాకల్పంబుగ నంతటం దిరిగి ప్రత్యావృత్తుఁడై వచ్చుచో
నాకర్ణించె నతండు కాఱడవిలో [2]హంభాయనున్ ధేనువున్. ౩౭

చ. అట విని యిట్టి కాఱడవి నద్భుతమైనది ధేనుఘోష ము
త్కటమదపుండరీకహరిగండకసంకుల మైనచోటి క
క్కట పసు లెట్లు వచ్చె విధికల్పన చూచెద నంచు నేగి ముం
దట గిరిపొంతఁ గొంతయెడ దవ్వుల రేగడ వెంచలోపలన్. ౩౮

గీ. నాల్గుకాళ్ళు రొంపి నాటిన నుంకించి, వెడలి రాఁగఁడంగి వెడలలేక
దీనవదన మైనధేనువుఁ బొడఁగని, యతిదయాళుఁ డయ్యె నవనివిభుఁడు. ౩౯

చ. అనువగువేళ డగ్గఱిన యాయతిథిం, జెఱనున్న భూమిదే
వుని, గడురొంపిఁ బడ్డ పశువున్, వ్యసనాతురుఁ డైన యేలికం,
దన పగవారు గొన్న బిరుదంబున దుఃఖితుఁడైన మిత్రునిన్,
ఘనబలుఁ డయ్యుఁ గైకొననికష్టునిఁ జూడఁగనోడుఁ గాలుఁడున్. ౪౦

గీ. అనుచు వెంచ సొచ్చి తనకాళ్లు గట్టిగాఁ, బెట్టి తోఁకమట్ట పట్టి యెత్తఁ
జట్టుభంగి రొంపి పట్టను వీడక, మొదవు కొంతయైనఁ గదలకుండె. ౪౧

క. *ఆయవసరమున ఘన మగు, నాయావు నపెత్తలేక యలసగతుండౌ
నాయకుని జగము గని నగు,నోయని వెలుఁగుడిగె నన నినుండటఁ గ్రుంకెన్.

గీ. మెట్టు గట్టుఁ జెట్టు మిఱ్ఱును బల్లము, బయలు ననుచు నేరుపఱుపరాక
మిన్ను వచ్చి నేలమీఁద వ్రాలిన యట్లు, దెసలఁ జీకువాలు దీటుకొనియె.

క. పగలు బయలనుండక కొం,డగుహాలలోఁ జొచ్చుకొని యడంగి దినాంతం
బగుదడవె వెడలె గూబలు, నిగుడం †జీఁకట్లు పోలె నీలాకృతులై. ౪౪

సీ. అప్పుడు చీఁకట్ల కుప్పలచొప్పున ఘుమఘుమధ్వనుల మేఘములు వొడమె
నందుల మెఱపు లయ్యంజనాచలభూమి దావాగ్నిశిఖలచందమున మెఱసెఁ
బెల్లుగాఁ బెటులుపెళిల్లున మ్రోయుచుఁ బిడుగులు తోడితోడిఁబడియెఁ గడల

[1] మహానిర్వాణులై యుర్విన్ [2] సంభారవంబారగిన్. *ఆయవసరమున నాఘనుఁ, డా యావును—ఘనుఁడై యాయావును, †జీఁకట్లయట్లు.

రుప్పున వడినెడత్రెవ్వనిగాలితో గప్పకులంతలు చిన్న లవనిఁ దొరఁగెఁ
బిదప నెత్తుగ బోరునఁ బెద్దవాన, కడవలను గ్రుమ్మరించిన వడువు దోఁపఁ
గురియుచుండంగ వఱదలు గ్రుంత మిట్ట, లొక్కకొలఁదిగఁ బాఱె నీళ్లక్కజముగ.

శా. ధారాపాతజలాతిశీతఘనవాతక్లిష్టమౌ వృష్టిలో
నారాజన్యుఁడు *గోవుడించి చన నన్యాయం బటంచు న్మహా
ధీరుండై తనబొంత గప్పె నిజశ్రీదత్తసాహాయ్యుఁడై
యారే యెల్లను దానె మాటగుచు ధర్మాసక్తితో నిల్చెఁగా. ౮౬

గీ. మిత్రుఁ డరిగిన యెడ శత్రువున్నై యిట్లు, గాసి వెట్టిన మదిఁ గలఁగఁ డితఁడు
ధర్మశీలు నెదురఁ దామసగుణములు, నిలువ వనుచు రజని తలఁగిపోయె. ౮౭

శా. ప్రత్యూషం బగునంత వాన వెలిచెం బ్రవ్యక్తమై దిక్కులం
దత్యాభాసము గల్గె జక్కవకవల్ హర్షించెఁ జీఁకట్లు దే
శత్యాగంబుగఁ బాసెఁ దమ్ములు వికాసం బొందఁ బూర్వాద్రి నా
దిత్యుం డుద్గతుఁ డయ్యెఁ గుంకుమగతిం దేజంబు రాజిల్లఁగా. ౮౮

క. పక్షులు వలుకుచుఁ దమతమ, పక్షము లగువానిఁ గూడి బాలార్కరుచిం
బక్షంబులు కెంపడరఁగఁ, బక్షీంద్రుని పిల్ల లనఁగఁ బాఱం దొడఁగెన్. ౮౯

ఉ. అప్పుడు విక్రమార్కుఁడు ప్రయాసము వుట్టఁగఁ దోఁకవట్టి తా
నెప్పటి యట్ల పూసికొని యెత్తఁగ ధేనువు లేవకున్న నే
చొప్పు నెఱుంగ లేక యిది చూడఁగ సన్నము చాల వ్రేఁగు నా
కప్పరమేశుఁ డిచ్చిన మహాబల †వ్యక్కిడ సుర్కై స్వక్కటా. ౯౦

ఉ. కొమ్ములు వట్టి యెత్తఁ బధికుం డొకఁ డైనను గల్గఁ డెట్టి ఘో
రమ్మగు కానలోపల నరప్రసరం బది యెట్లు గల్గు నా
యిమ్ముల యత్న మేల ఫలియించుఁ బరాకృతవృత్తి నైన భా
గ్యమ్మునఁ గాక యంచు మదిఁ గందుచు ముందఱఁ బాఱఁ జూచినన్. ౯౧

సీ. ‡గజములంతేసి మృగంబులఁ జెండాడు గోరు లంకుశముల కొలఁదిమీఱఁ
జాఱలు తనచేతఁ జచ్చినజీవుల ప్రక్కబొక్కలక్రియ నక్కజముగఁ
న్నొక్క వెట్టినఁ బ్రజ నవ్వఁ గూలఁగఁ జేయు కాలదండాకృతి వాల మెసఁగ
మదిఁ గ్రోధవహ్నికి మొదలైన నిప్పులపెంపునఁ గన్నుల ¶ కెంపు గదుర

*వజ్జిడించి, ధేనడించి. †మిక్కుడ. ‡గజములయంతవ్యాగ. ¶ కెంపుదేర.

బ్రణుతవీరరసము పట్టినకడవనాఁ, దనరు రౌద్రరసము దాన యగుచు
నవని [1]మ్రింగుమాడ్కి నాపులించెనుమహా, వ్యాఘ్ర మొకటి కానవచ్చె నెదుట.

క. కని దీని నెత్తఁ దోడ్పడు, మనుజుని దలఁపంగఁ బసులమారియె వచ్చె
న్ననుఁ గండమాలమీఁదను, మొనకురుపుం బుట్టె నన్న మోసంబాయెన్.

చ. ఇది కడు దుస్తరం బనుచు నెంతయు నాతురుఁ డైన నంతలోఁ
జెదరక బంటుమీఁదఁ బరజించుచు డగ్గఱుశూరుకై వడిం
బదములచప్పు డేర్పడనిబాగునఁ బొంచి చలించి వాలముల్
వదనము చేయి నెత్తుకొని వ్యాఘ్రము పైఁబడియెం గడిందిగన్. ౫౮

క. పడునెడ నడ్డముసొచ్చిన, పుడమివిభుం గదిమి యెడమభుజ మడిచెఁ దనుం
బొడగనియుఁబొడుచు వెఱఁగియు, జడియుఁ డను మంబొగడి చేతఁ జఱచినమ్రాడ్కిన్.

గీ. పెడమరించి యతనిఁ దొడరక యాపులి, మిత్తిభంగిఁ గుత్తిమీఁది కుఱికి
మును దిలీపుఁ డిష్టముగఁ గాచునందిని, నెగసిపట్టు నామృగేంద్రుకరణి. ౫౯

క. ఉఱికిన నాపులితల దెగ, నఱకినఁ బులి మాయ మైన నథమున సుర ల
త్తఱి మెచ్చి పుష్పవర్ష ము, తఱచుగఁ [2]గురియించి రథయదాయకుమీఁదన్.

చ అవనివరుండు నెమ్మనమునం దతివిస్మయ మంద న్శోక లా
ఘవమున లేచి పల్వలము గ్రక్కున వెల్వడి కుత్తి లోచనో
త్సవమగు దివ్యభావమున సన్నిధి నైకొని యేచు గామధే
నువ నిను మెచ్చితి న్నదికి నూఱ్ఱానునిష్టము వేఁడు నాపుడున్. ౬౦

క. తద్భాషణమున మదిఁ గడు, నద్భుతముఁ బ్రియంబు నిగుడ నాతఁడుసురసం
పద్భోగభాగ్యనిధి యని, సద్భావముతోడ మిగుల సన్నుతుఁ డగుచున్.

క. అమృతాహారులు నసురులు, నమృతంబునకై మహాప్రయాసముతో న
య్యమృతాంభోనిధి దరువఁగ, నమృతము నీయందు కలుగ నటఁ బుట్టితివే.

క. పుట్టినయి ల్లంబుధి తోఁ, బుట్టువు లమృతేందు[3]కల్పభూజము లనియ
ప్పట్టున నూరక మనఁగా, నిట్టి విరోధంబు నీకు నేలా కలిగెన్. ౬౧

గీ. తల్లి యింతకును గతం బేమి తెలియఁగా, నానతీయవలయు ననుచు మ్రొక్కి
నిలిచి యున్న సురభి నృపవర్యుఁ దనపుత్రు, రీతి మిగుల నాదరించి పలికె.

సీ. పురుహూతుఁ డొకనాఁడు గురుఁడాదిగాఁగల విబుధసంఘుంబు సేవింపుచుండ
నూర్వశియునురంభయునుమంజుఘోషయునాతిలోత్తమయునునాఘృతాచి

[1] నవని బీటుపెట్టి యావులించెను. [2] గురియుంజేసి రథియ దాయకునిపై వేడ్కన్. [3] కల్ప భూజాదులచే, పట్టునంగలోకమనఁగా.

ప్రియదర్శనయు సుకేశియును మేనకయు నా నెనమండ్రు దివ్యనాయికలు గొలువ
గరుడగంధర్వకిన్నరపన్నగేంద్రులు తమనియమంబులు తగ భజింప
వసువులును రుద్రు లుభయపార్శ్వముల నుండ
సిద్ధు లెనిమిది తనపొంతఁ జేరి నిలువఁ
దుంబురుఁడు నారదుఁడును బ్రస్తుతులు సేయ
నధికసంపదఁ గొలువున్న యవసరమున. ౬౩

శా. పర్యాయప్రకృతప్రసంగముల సంభాషించుచో దేవతా
చార్యుం డోసకలజ్ఞ నారదమునీశా నేఁటికాలంబునం
గార్యాకార్యవిచారముం గృపణరక్షాదక్షకత్వంబు నౌ
దార్యంబున్ ఘనధైర్యముం గలిగి యేధాత్రీశుఁ డొప్పున్ భువిన్. ౬౪

మ. అనిన న్నారదుఁ డోసుపర్వకులవంద్యా యిప్పు డుర్వీస్థలి
న్మనుజాధీశులు లెక్కమీఱఁ గల రేక్ష్మాపాలురున్ దీనపా
లనధైర్యంబున లావున న్వితరణోత్సాహంబున న్విక్రమా
ర్కునిసాదృశ్యము నొందలే రతనిఁ బేర్కొన్న న్శుభోదర్కముల్. ౬౫

చ. అని పలుకంగఁ దావిని మహాసనసంస్థితుఁ డైన పాకశా
సనుఁ డతివిస్మయంబుఁ గనుసంతసముం బొడమంగ సమ్ముఖం
బున నిలుచున్న నన్నుఁ గని పూని ధరిత్రికిఁ బొమ్ము విక్రమా
ర్కునిసుగుణమ్ము లేర్పడుచు చూపను గైకొనుమంచుఁ బంచినన్. ౬౬

ఉ. నే నిట వచ్చి యిచ్చటికి నీవును రాఁగల వంచు దుర్బలం
బైన గవాక్షతిన్నిలుచునంతట వచ్చితి వింద్రుమాయ న
వ్వానయు గాలియుం గలిగె వ్యాఘ్రము పైఁబడుట య్యె నన్నియు
*న్మానవనాథ యిన్నిటికి మానుగ నోర్చితి గాన మెచ్చితిన్. ౬౭

ఉ. నావుఁడు సమ్మదం బతిఘనంబుగఁ బొంగి యవంతినాథుఁ డో
దేవి భవద్విలోకనము దివ్యపదస్థితికారణంబు నా
దైవము గల్గెఁ జాలు వివిధంబగుసంపద నీశుభానుకం
పావిభవంబునం గలదు భవ్యుఁడ నైతి నటంచు మ్రొక్కినన్. ౬౮

శా. క్షోణీనాయక నేఁటి మెచ్చునకు నీ సాక్షాత్తిఁ గైకొమ్ము గీ
ర్వాణాధీశుఁడుఁ బొందలేని శుభము ల్ప్రాపించు నీకంచు న

* న్మానవనాథపైచియభిమానము దాల్చితిగాన.

క్షీణోల్లాసముతోడ వచ్చు సురభిం జేపట్టి దీనాతుర
త్రాణాసక్తుఁ డతండు క్రమ్మఱి మహోత్సాహంబుతో వచ్చుచున్. ౧౯

ఉ. అంపిలు గట్టి చేత నొకయష్టి ధరించుచు నెత్తిపెండ్రుక
ల్చింపల ప్రేలఁగా ముదిమి జీవనరంబులు తక్కిసు యా
కంపిత మైనవక్షు మనుకంపకు హేతువుగాఁగఁ బ్రార్థనా
లంపటుఁ డయ్యె మేనికి బలం బొడఁగూడమిఁ గుందువిప్రునిన్. ౨౦

చ. కనుఁగొని యేల కుందెదవు కారణ మే మిది చెప్పు మన్న నో
యనఘ మహాదరిద్రుఁడ ననల్పకుటుంబికుఁడ న్వినష్టజీ
వనుఁడను జావఁగోరి యిట వచ్చితి దే మని చెప్ప నావుఁడు
న్ననమున నిట్టితెం పుడుగుమా యని రాజు కృపార్ద్రచిత్తుఁడై. ౨౧

క. నే వేఁడినకోరుకు లివి, గా వనఁగా రాదు గానఁ గారుణ్యముతో
నీవిప్రుని రక్షింపను, దేవి పొమ్మనుచుఁ గామధేనువు నిచ్చెన్. ౨౨

ఉ. ఇచ్చి నభఃస్థలంబున సురేశ్వరుఁ డాదిగ దేవసంఘము
ల్మెచ్చఁగఁ దొంటిమార్గమున మిక్కిలి వేడుకతో నవంతికి
న్వచ్చె నృపాలుఁ డిట్టి గుణవైభవ మింకిటఁ గల్గనేని నీ
విచ్చట వచ్చు టొప్పు మనుజేశ్వర యుక్తము నీ వెఱుంగవే. ౨౩

క. నావుడు విని యుజ్జయినీ, భూవల్లభుసద్గుణములు పొగడుచు హితులన్
సేవకుల వీడుకొని భో,జావనివల్లభుఁడు నిజగృహంబున కరిగెన్. ౨౪

వ మఱియును గతిపయదినంబులు జరిగిన. ౨౫

— ఇరువదియేడవబొమ్మకథ —

క. అక్రూరవరదు రణరం,గక్రీడాశమితవిమతుఁ గమలారమణుం
జక్రీశ్వరపర్యంకుని, జక్రాయుధభరణు దుగ్ధసాగరశాయిన్. ౨౬

మ. అతితాత్పర్యమునం దలంచుచు నిలింపాధీశభద్రాసన
స్థితికై సంపద పెంపుమీఱఁగఁ గృతాశీర్వాదభూనిర్జరా
న్వితుఁడై భోజవిభుండు డగ్గఱునెడ న్వీక్షించుచు న్నత్తవిం
శతమద్వారము నొద్ద బొమ్మ సుజనాశ్చర్యంబుగా నిట్లనున్. ౨౭

ఉ. పూతచరిత్రు సాహసవిభూషణుఁ బోలఁ జరించుచోట దుః
ఖాతురుఁ డైనవాఁడు తనకబ్బినయోగికిఁ బాత్రుఁ డంచు నే
జాతివిభేదము న్గుణవిచారము సేయక యిచ్చునట్టి యా
దాతృగుణంబు లేక వసుధావర నీ కిది యెక్కశక్యమే. ౨౮

శా. పాత్రాపాత్రవివేక మంచు ధనలోభం బెక్కడం జేయు నీ
ధాత్రి న్నీతులు గల్గుఁగాక ఘనచింతాఖిన్నుఁ డౌవాఁడె స
త్పాత్రుం డంచు నెఱుంగు టొప్పు ననుచుం దత్కాలదానంబుల
న్మిత్రత్వంబు వహించు సర్వజనులు న్మెచ్చంగ వాఁ డెల్లెడన్. ౭౯

మ. వివరింతు న్విను తద్గుణంబు లఖిలోర్వీనాథసంసేవ్యుఁ డ
య్యవనీపాలకుఁ డొక్కరుండ పరదేశాలోకనాసక్తి యు
త్సవమై సొంపు నటింపఁ గ్రుమ్మరుచుఁ బ్రాసాదోజ్జ్వలం బైన చం
ద్రవతీదుర్గము గాంచెఁ *గాంచి కెనయై రాజిల్లుచు న్నుండఁగన్. ౮౦

ఉ. ఆపుర మద్రిమీఁద వివిధావరణంబు ననేకలోకసం
దీపితమధ్యమం బనుగతిప్రకటీకృతసోమసూర్యవీ
థీపరిణాహరమ్యము నతిస్థిరభూభృదుపాశ్రయంబునై
శ్రీపతియాజ్ఞనుండు నది రెండవయబ్జభవాండమో యనన్. ౮౧

ఉ. ఆనగరంబు సొచ్చి నవహర్మ్యనిరంతరరమ్యవాటికం
బై నవణిక్పథంబున ననంతసువస్తుసమూహదర్శనే
చ్ఛానిరతిం జరించి మణిసంఘటితంబగు నొక్కదేవతా
స్థానముఁ జేరి భిక్షుకువిధంబున నచ్చట విశ్రమింపఁగన్. ౮౨

సీ. చెంగావి వలిపెంబుఁ జెలువార ధరియించి దలముగా మేన గంధంబుఁ బూసి
తిలకంబు కస్తూరిఁ దీర్చి జాదులఁ గలిగొట్లలఁ బాడవుగాఁ గొప్పువెట్టి
కందుదుప్పటిగప్పి యందియ డాకాలఁ గీలించి పువ్వులకోల వట్టి
నిద్దపుకా కుచ్చుల †యుద్దాలు కిర్రని మ్రోయఁగా నల్లాసమునఁ జెలంగి
నలువు రేవ్రుసంగడీ లెలమితోడఁ, బోఁకలాకులు ‡నోడిలోనఁ బోసికొనుచు
జాణతనమున నట్టహాసములు నొలయఁ, బెచ్చు రేగుచుఁ గొలువఁగా వచ్చె నొకఁడు.

క. వచ్చి గుడిసొచ్చి యందఱు, దిచ్చులు తనతిండికొఱకు [1]దీపులువెట్టన్
మెచ్చుచు వేడుకయాటల, నచ్చోటం బ్రొద్దుపుచ్చి యల్లన మగిడెన్. ౮౩

క. మఱునాఁడు పెదవు లెండఁగ, నెఱిచెడి వదనంబు వాడ [2]నిస్సత్త్వముతోఁ
గుఱుగోఁచి గట్టుకొని క్రమ్మఱ వచ్చె న్వాఁడు దుఃఖమలినాకృతియై. ౮౪

* గాంచికి సమత్వం బై వెలుఁగొందఁగన్ - గాంచికి సమానం బై వెలుఁ- † ఉద్దాలు= చెప్పులు. ఉద్దాల మ్రోయఁగా నల్లాసమున జొక్కి- కొయ్యజేరి- ‡ నోటిలోఁబోసికొనుచు.
[1]దీపులుపుట్టన్. [2]నిస్సత్త్వముతో.

గీ. వచ్చి వెచ్చనూర్చి యచ్చోటఁ గూర్చున్న, వానిఁ జూచి మనుజవల్లభుండు
నీవు నిన్న రమ్య మగు వేషమున వచ్చి, నేఁ డి ఁటేల వచ్చినాఁడ వనిన. ౮౯
సీ. చెప్పిన దీన నే సిద్ధియగు న ట్లయ్యె నడిగిన నాకిది యడఁపనేల
మేటి జూదరి యన వాటమగు తిప్పుటమై నాకుచుండుదు నే నహర్నిశంబు
దృష్టియేమఱక [1]సందియు జాగరంబును దిగయును గాళనాఁ దేటపడిన
యచ్చులలోన నే యచ్చైనఁ గైకొని మాటలాడిన యట్ల వేటుగలుగఁ
దలఁపుగతి వచ్చుఁగోరినదాయమునఁగ [2],శకునిజూదముపీనియచ్చోకటియునఁగ
గెలుపునాదిగ నొడ్డుచు గెలుబనేర్చి, మెల్లపిడికిళ్ళు విడిపించియేనకొందు.
క. ధనము గలుగఁ జూచి తమకంబు పుట్టించి, మొదల గెల్వనిచ్చి పిదప గెలిచి
నలువు రానసంగ బలవంతు నైనను, నిలువనాఁగికొందు [3] నిమిషమునను.
క. చతురంగంబున నే నతి,చతురుఁడఁ గరితురగమంత్రిశకటభటప్ర
[4]స్థితి పరహస్తము సేయుదు, క్షితి మెచ్చఁగ రాజు బంటు చేఁ గట్టింతుఁ.
క. ఎక్కడఁ గోరిన దాయము, లెక్కువతక్కువలు గాక యే తేరంగా
నెక్కటి నెత్తమ్మున గొ, మ్మెక్కటియును నాడ నేన య్యెక్కటిఁ జుమ్మా. ౯౦
క. తగులు విరిగ్గమెనఁ గను మె,చ్చుగ నాడుదుఁ బులుల మూఁటజూదంబులలో
మిగులఁగ నేర్పరిబాగిడి, తిగుటఁ సొగటాల నే నతిప్రౌఢుండఁ. ౯౧
ఉ. మేదిని నిట్లు జాణలకు మెచ్చగు నాటలు నేర్చువారికే
నాది యనంగ నొప్పుచు నహంకృతి నిప్పుడు దప్పునాడి యా
జూదమునందుఁ జిక్కి విరసు ల్లను నవ్వఁగ మేనివజ్రభూ
షాదిసువస్తువు ల్గెలిచినాతని కిచ్చి వివర్ణ మొందితిఁ. ౯౨
ఉ. దైవబలంబు లేమి గతి దప్పిన నర్థము గోలుపోయితి
న్నావుడు బుద్ధిగా దని మనంబున కింపు జనింపఁ జేయ ను
ర్వీవరుఁ డిట్లను న్వినుము వీఁడఁ డిచేఁతలు మాను మేదినిఁ
దేవతల న్భజింపు సుగతిస్థితుల్గ్రొక్కట నీకుఁ జేకుఱుఁ. ౯౩
క. †ధనమును సత్యము శౌచం, బును నాదిగఁ గోలుపోవు భువిదుర్వ్యసనం
బని యెన్నఁబడ్డ జూద,మ్మున బ్రుంగుడు వంగుడౌటఁ బొందిది యగునే. ౯౪

---

[1] సందియు జాగరంబును దిగయును గరయునా-సంటయు జాగరంబును దిగయు గరము నై దింటబడిన. [2] ద యవే సి- శనా చికొదు [1] స్థితవరహ స్తము - †ధనము యశమును సత్యంబును...
బుగ్గింగుడు.బుగ్గింగుడౌట-బ్రుంగుడు వ.గ్గుడౌట.

క. జూదమున నలుఁడు చెడియెను, జూదంబున నట్టిధర్మజుండును జెడియెన్
*జూదమున ధాతుపాదము, పాదంబునఁ దొడరఁ జేటువశ్యము గలుగున్.

ఉ. హీతుని తెలంగుఁడన్ హితము నిష్టముఁ జేయుట బుద్ధి చెప్పితి
న్నతిఁ బరికించి దుర్వ్యసనమగ్నుఁడవై చెడకుంటి వేని సు
స్థితి దొనగూడు లోకమునఁ దేఁకువయుం జెడకుండు సన్న నా
†కితవవరుండు నవ్వి యదిగేలిగఁ జేయుచు బల్కెఁ బ్రాఘుఁడై. ౯౮

గీ. ద్యూతకేళిరసము త్రోవ యెఱుంగక, పలికె దీవు వెడఁగుభావమునను
‡వలనుగల్గి వాడఁ జెలువుసీరునుమ్మాడ్కి, దీన నర్థ మొదవు తెరువు పుట్టు.

క. ధనలాభంబుఁ బురాణము, వినికియు వాద్యంబు యోగవిద్యయు శాస్త్రం
బును సంగీతముఁ గావ్యం, బును నాటకములును జూదమున కెనయగునే.

క. గెలుపుతమకమునఁ జిత్తం, బలరంగాఁ గపటజూద మాడక యెవ్వం
డలసుఁ డయి చనియె భువి ని, ష్ఫలజన్ముఁడు వాఁడె కాఁడె పసరముభంగిన్.

క. [1]ఒకరూక వట్టి పదివేలకు నొడ్డుచు నాడినట్టిలాభము గరద
ప్పకయిత్తురుఁ గొండ్రనువరు, లకటా జూదంబులోన నమృతము గలదే. ౧౦౦

ఉ. ఆట జయంబుఁ జేకొనిన నర్థము చేకుఱు దాన మేటిగా[2]
నోటమిఁ జిక్కి ద్రవ్య మిడనోపని పేదల కడ్డమాచు మా
ఱాట భజింప ధర్మ మగు నంతన మోక్షము గల్గుఁ గావునం
దోటికిఁ జూచువార లిది దుర్వ్యసనం బన నమ్మవచ్చునే. ౧౦౧

ఉ. హితభావంబున బుద్ధి చెప్పితివి నాకిష్టంబుగా దాట నం
తతము నొంతసమందఁ జేయ నొకచో దైవంబు దప్పించినన్
మతి వేలొండుల కైకొనే ధనము సంపాదించెఁ బూర్వంబున
న్నతిమంతుం డనురాజు బుద్ధిఁ జని సన్మానంబుతో నుండెనే. ౧౦౨

ఉ. నావుడుఁ దత్కథావివరణంబునకుం జెవి యొని భూవరుం
డావిధ మేర్పడం దెలుపు మన్న దురోదరశీలుఁ డిట్లనున్
దేవసమానుఁడైన జయదేవుఁడు నా ధర యేలుచుండె ర
త్నావళిసంజ్ఞ నొప్పిన మహానగరంబున ధర్మశాలి యై. ౧౦౩

* జూదమునం బాఁబూనదవాదంబున- † కితవరుఁడల్లనవ్వి- ‡ వలనుగల్గియాడ- 1 ఒక మాడపట్టి... కొరదప్పక- గొండ్రిఁదలు, గాఁడ్రినదుడు- 2 దాన గ మమా- దానదానగాదు పేరోటమి.

చ. అతనికిఁ గాంతిరేఖ యనునంగనకుం బ్రథమాంశగణ్యుఁ డౌ
సుతుఁ డుదయించి బాలుఁ డగుచు న్నయశాస్త్రము లాగమంబులుం
గృతులుఁ బఠించి యోగములకీ లొకయింత యెఱింగి సర్వస
మ్మతమగు నేర్పుకల్మి మతిమంతుఁడునాఁ బరఁగెం బురంబునన్. ౧౦౪

మ. అతికాలంబునఁ బెద్దయై నృపుఁడు పుణ్యారణ్యవాసంబు ప్ర
స్తుతమైన న్నయభూషణుం డను నమాత్యుం బిల్చి తత్సన్మతి
న్సుతునిం బట్టము గట్టి యేగ నట నస్తోకప్రభావాఢ్యుఁ డౌ
మతిమంతుం డిల నేలుచుండెఁ దనసామ్రాజ్యంబు పూజ్యంబుగన్. ౧౦౫

క. రత్నాకరమేఖలఁ దన, పత్నిగఁ జేపట్టి సుగుణబంధురుఁ డనఁగా
రత్నావళిలో నాయక, రత్నంబై తేజరిల్లెఁ బ్రజ రంజిల్లన్. ౧౦౬

క. రేలు నిగూఢాకృతితో, వాలు సహాయముగ లోకవార్తలుఁ గీడు
న్మేలును నరయుచుఁ దిరుగఁగ, బాలుని నొకనాఁడు మంత్రి ప్రార్థనచేసెన్.

క. మేదినిలో నీనడవడి, యాదినృపాలకులచరిత మైనది నాకుం
గాదనరా దొకగతి నిది, గాదని యెద న్నాక నొందుగాఁ దలఁపకుమీ. ౧౦౮

గీ. నేఁడు చెప్పవలసె నృపుడ నీజాతక, మడుగునాఁడు బుధుల కడను వింటి
వినుము మొదలియంశమునఁ బుట్టినాఁడవు, చోరశిక్ష నిన్ను సోఁకుననిరి. ౧౦౯

క. రజనిసమయములఁ దిరుగకు, సుజనులతోఁ బొత్తుసేయు సోమకళాంకు
న్భజియింపుము హితులను మముఁ, బ్రజలను జేపట్టు మిదియ ప్రార్థనమాకున్.

గీ. అనుడు బాలనృపతి యూఁగాక యనియొండు, బుద్ధిఁజూచి బ్రదుకు పొందుగాదు
గామకోపలోభగర్వమత్సరమోహ, ములనె కాని *రాజ్యబలముగొనదు.

క. కామక్రోధాదులు ని,స్సీమముగా నిడుపకున్నఁ జేటగు నొకచో
నే మునినై యుండఁగ మఱి, నామీఁదను జోరదండనం బేల యగున్. ౧౧౨

మ. ఇది తప్పంజను టొప్పనంచు నదురే యేకాకియై యేగి భూ
తదయాళుం డనువానిచేత శుభతత్త్వజ్ఞానుఁడై యంబికా
స్పదమధ్యంబునఁ బెక్కునాళ్లు పవనాభ్యాసంబుతో నుండె ను
న్మదసారంగకురంగసంఘపరిగణ్యాంబొనరణ్యాం బులోన్. ౧౧౩

క. పోఁడిమి చెడియును దనమది, వాఁడిమి చెడనీక లబ్ధవైరాగ్యుండై
వాఁడతినియమంబునఁ బగు, †మూఁడేఁడుల దాఁక ధ్యానముననుండంగన్.

* ములనె కాదు రాజుబలము దనకు. † మూఁడేఁడులదనుక – మూఁడేండ్లందాఁక.

మ. ఒకనాఁ డేఁగురుదొంగ లంతికమునం దొప్పారు మందారనా
మకమౌ దుర్గము లీల నేలుచు మహాత్మా పాలుఁడౌ జీవర
క్షకుఁ కన్యాసదనంబు కన్న మిడు వాంఛన్ వచ్చి యద్దేవి క
త్యకల కం బగుభక్తిభావమున సాష్టాంగంబుగా మ్రొక్కుచున్. ౧౧౫
క. లోకేశ్వరి నీకృప నీ, త్మాకాంతుని కూఁతు రగు ప్రకాశినిసొమ్ము
ల్లాకబ్బిన నాదలరెడు, నాకల్పము నీకు నిచ్చి మరిగెదము చుమీ. ౧౧౬
క. అని కానికె మొక్కొని చన, దినసాహసుఁడు గ్రుంకెఁ దమము దిక్కుల నిండెన్
జనులు పను లుడిగి రారెను, లమునకు తెలి ఱుఁ జొచ్చి రానగరములోన్.
మత్తకోకిల. గాలిచీరయు న్వాలిబూడిద గ్రద్దగోరును గొంకియుం
గోలయు న్వెలుగాచ్చుపుర్వులక్రొవి నుంపులబంతియున్
మైలమ్రుకుల కొయ్య కత్తెర మూఁకఁన్నపుఁగ త్తియు
న్నిగిదింపులు నల్లపూఁతయు నేర్పుతోడుగ మ్రుచ్చులు. ౧౧౮
క. చప్పళ్లాలించుచుఁ దమ, చప్పళ్లడఁచుచును జొచ్చి సందులలోనం
జొప్పెఱుఁగకుండ *నేగుచు, తెప్పలు గూలైనడాఁగురింపు చుఁబురిలోన్
గీ. ఉలుకు మ్రగ్గనంత నొకచోట మ్రొక్కల, యొల్ల మొదలకుండి †యన్నకదువు
కొదవియంతనంత గోదుగుచు లోపలి, మెలఁకు వగసి ‡కోటచులుకదాఁటి.
గీ. పాలె మున్న వారిపై న్వాలిబూడిద, మూను చల్లి పెద్ద మగులు కొంత
కూలఁ ద్రవ్వి రాచకూఁతు రుండెడిమేడ, కన్నగించినట్లు గంటువెట్టి. ౧౨౧
క. తొడిదొడిఁ గ్రొవ్వులపుష్పల, విడిచి దివియ లార్చి గంటి వెలుఁ గాలోనం
బడకుండఁ [1]జెలులుమాటుఁగ, నొడమునిద్రయను లుకు లేక యొకరుఁడు సొచ్చెన్.
గీ. అచట నూర్పులరసి యాబాల నిద్రించు, టెఱిఁగి యొయ్య డాయ నేగి వాఁగు
మీఁలఁ బుడికిపట్టు జాలరికై వడిఁ, బుడికి పుచ్చుకొని యొఁ దొడవు లెల్ల. ౧౨౩
సీ. అన్నియు నొలకు నందిచ్చునప్పుడు మును స్వయంవరమున కనుచు డాఁచి
దండియపై నిడ్డ తపనీయమాలిక భుజము సోఁకిన దానిఁ బుచ్చుకొనుచుఁ
గన్నంబు వెడలి సంగడికాండ్రఁ గూడిన నందఱు నుల్లాస మతిశయిల్ల
దుర్గంబు వెలువడి దూరస్థలంబున సొమ్ముల తరబడి చూచునపుడు
వెనుకఁ బురములోన ఘనముగా ఱంతయ్యె, నారెకులు నుదివియ లందికొనుచుఁ
గల్లపుట్టె ననుచు నెల్లదిక్కుల జాడ, లరయఁ జొచ్చి §రతివిహస్తులగుచు.

* నీగుచు † యన్నకరవుఁదిలి- యంకలేచి- ‡ కోటమలు. దాటి- [1] శాలమాటుగ- చెయ్యి
మాటిడి § రతిభయార్తులగుచు.

పరభయనిద్రాభుక్తి, స్మరమోహ క్రియల విగతసంజ్ఞానముచే
నరపశు వనఁ బరఁగితినో, తిరుమల- ౨౯

శరణనఁగ సావిభీషణుఁ, గరుణను ద్రౌపదిని హరినిఁ గాచితి వది నీ
బిరుదైనను ననుఁబ్రోవుము, తిరుమల శ్రీ వేంకటేశ త్రిదశాధీశా! ౩౦

నరహరి! గోవింద! హరీ! పురుషోత్తమ! విబుధమిత్ర! పుణ్యచరిత్రా!
మురహర! వామన! మాధవ! తిరుమల- ౩౧

పరమేశ్వర! కేశవ! శ్రీ,ధర! మధుసూదన! ముకుంద! దానవవైరీ!
ధరణీధరనుత! శౌరీ! తిరుమల- ౩౨

సురుచిర వాక్ప్రౌఢిని వే, మఱు నినుఁ బ్రార్థింపలేని మతిమందుఁడ నన్
గరుణను రక్షింపఁదగుం, దిరుమల- ౩౩

పరమానందాత్మక! శ్రీ,హరి! నీమాహాత్మ్య మజభవాదులకైనం
దరమానె యభినుతింపఁగఁ, దిరుమల- ౩౪

వరభక్తియుక్తనిష్ఠా, పరులను బ్రోచుటయు నెంతప్రాభవ మజ్ఞున్
దరిఁ జేర్చినఁగా యశమగుఁ, దిరుమల- ౩౫

దురితాత్ముఁడ దా భికుఁడన్, దురహంకారాభిమానదూష్యహృదయుఁడన్
శరణాగతుఁడను బ్రోవుము, తిరుమల- ౩౬

నిరతాపరాధి నైనను, శరణొందిన నభయ మిత్తు సత్వర మది నా
పరమవ్రత మని పల్కవె, తిరుమల- ౩౭

కరుణాపయోధి! నీకిం, కరుఁడను శరణంటిఁ బ్రోవఁగాఁ దగుఁజుమ్మీ
మఱవకుము నీదెభారము, తిరుమల- ౩౮

శరణంటి నీపదాబ్జము, శరణంటిని బరుల వేఁడఁజాలను నీవే
దొరవంటి నెటులు చేసినఁ, దిరుమల- ౩౯

నిరతము నీపదభక్తియు, విరతియు దుష్కామహేతు విషయంబులపై
మఱవమి నిను దయసేయుము, తిరుమల- ౪౦

నరు లెంతవార లెన్నఁగ, సుర లైనను నీదుమహిమ జూడఁగ వినఁగా
వెఱగొందుదు రవిషయతం, దిరుమల- ౪౧

అఱనిముసములోన జగ, త్పరికల్పనరక్షణప్రభంగంబుల న
చ్చెరువుగ నొనరించెదవో, తిరుమల- ౪౨

పరుఁడవగు నీవు జీవే, శ్వరజగదాకృతులఁ దోఁచి స్వప్రభచేఁ ద
త్పరవికృతులొంద వెన్నఁడుఁ, దిరుమల- ౪౩

ధరనైంద్రజాలికునిగతి, నిరుపమనిర్బీజజగము నిర్మించెద వా
సరణి యచింత్యంబుగదా, తిరుమల- ౮౮
ఇరవుగ జగములు లోనిడి, మఱిజగములలోనఁ జొచ్చి మహిమదలిర్పన్
నెఱిసాక్షివి గానుందువు, తిరుమల- ౮౯
పరిపూర్ణుఁడ వీవాటను, సొరిది జగంబులను జొరుట చొరకుండుటయున్
సరి వెలిలోనులు లేవికఁ, దిరుమల- ౮౬
హరి! నీయందుఁ బ్రపంచము, పరికల్పితమాట నన్యభావము గలదే?
పరఁగ ననంగాద్వయుఁడవు, తిరుమల- ౮౭
పరికల్పితజగమున కీ, వరయ నధిష్ఠాన మగుట నభివిషయచరా
చరమంతయు నీవకదా, తిరుమల- ౮౮
పరజీవ జగద్భేదము, మఱవని చిదఖండనిత్యమహదాకృతివి
స్ఫురణములు గలుఁగఁజేయవె, తిరుమల- ౮౯
ఎఱుఁగమి నిజరూపము నీ, తెఱఁగున నజ్ఞానమోహతిమిరము తోఁచెన్
ఎఱుక వెలుంగు నొనర్పుము, తిరుమల- ౯౦
కరుణింపవేని మాయా,తరణం బేవిధిని గల్గుఁ? దఱచుగ నాత్మ
స్ఫురణం బె తెఱఁగున నగుఁ, దిరుమల- ౯౧
ఎఱుఁగును వాల్మీకియొకం, డెఱుఁగును నారదుఁడు నభవుఁ డీశ్వరియు భవ
ద్వరనామామృతమహిమనుఁ, దిరుమల- ౯౨
పురుషోత్తమ! నిను బ్రేమను, స్మరియించిన దినమె దినము చర్చింగ భవ
చ్చరణార్చకుండె ధన్యుఁడు, తిరుమల- ౯౩
అరులగు దనుజులఁ బొరిఁగొని, పరమొసఁగితి వరుదె సమతఁ బరఁగెడి నీకుం
బరభావిత మరిభావము, తిరుమల- ౯౪
గురుఁడవు ప్రభుఁడవు సఖుఁడవు, పరుఁడవు బంధుఁడ వఖిలధారకుఁడ వటం
చరసి నెఱనమ్మితిని మదిఁ, దిరుమల- ౯౫
పరమగతిఁ గానకుండిన, నరునకు భువి జన్మకర్మనాశన మింకే
తెఱఁగున నైనఁగల్గునె, తిరుమల- ౯౬
కరములు నినుఁ బూజింపఁగ, మురిసి శ్రుతులు నీచరిత్రమును వినుచుండన్
మఱి మది నినుఁగనఁజేయుము, తిరుమల- ౯౭
పురసంహారకమిత్రా, సరసీరుహపత్రనేత్ర! జలధరగాత్రా!
పరమపవిత్రచరిత్రా! తిరుమల- ౯౮

సురవందితమృదుపాదా, పరిహృతపరజీవభేద! పరమోదారా!
పరకల్పితగుణభేదా, తిరుమల- ౫౯

శరచరకచ్ఛపకిరినర,హరి వయి భృగురామరామహరిబుద్ధతను
స్ఫురణలఁ బ్రభవించితివో, తిరుమల- ౬౦

వరమత్స్యాకృతిసోమకుఁ, బొరిగొని తదపహృతనిగమపుంజముఁ గృపచేఁ
బరమేష్ఠి కొసఁగితివి మును, తిరుమల- ౬౧

సుర లసుర లమృతమునకై, గిరిచే నంబుధి మథింపఁ గ్రిందఁ బడఁగ న
గ్గిరిఁ గూర్మతచే నెత్తవె, తిరుమల- ౬౨

ధర నబ్ధిముంప దితిసుతుఁ, గిరిరూపము నొంది వేగఁ గీటడఁచి వసుం
ధరఁ గోఱను నిల్పితివో, తిరుమల- ౬౩

సురసుతుల నొంచుదైత్యుని, నరహరివై యురముఁ జించి నఖముఖములఁ జె
చ్చెర బాలు నేలితివిగా, తిరుమల- ౬౪

ధర బలి నడిగి వటుత్వము, మెఱయఁ బదద్వయత నాక్రమించి జగముఁ ద
చ్ఛిరమున నడుగిడి యడఁపవె, తిరుమల- ౬౫

మెఱయుచు భార్గవుఁడన నృప,వరులనుముయ్యేడుమాఱు వధియించి వసుం
ధరఁ గశ్యపున కొసంగితి, తిరుమల- ౬౬

వరదశరథాత్మజుఁడవై, శరనిధి బంధించి యాదశగ్రీవు ననిం
బొరిగొని ధరణిజ నేలవె, తిరుమల- ౬౭

తఱిమి ప్రలంబాద్యసురులఁ, బరిమార్చి బలంబు మెఱయ బలరాముఁ డనం
గరిపురిఁ బెకలించితివో, తిరుమల- ౬౮

పురదనుజసతులసద్వ్రత, సరణిని బుద్ధతను జెఱచి చని తత్పతులన్
హరుచేఁ బొలియఁగఁ జేయవె, తిరుమల- ౬౯

దొరకొని కలికలుషము దు,ర్భరమై భువిఁ జెఱుప దాని భంజింపఁగ సుం
దరకల్కివిగా నుందువు, తిరుమల- ౭౦

శరణము గౌతమతరుణికిఁ, దరణము భవమునకు మోక్షదంబగు యుష్మ
చ్చరణము నెఱనమ్మితినేఁ, దిరుమల- ౭౧

కర మొప్పు చతుర్భుజముల, మెఱయు కిరీటాయుధముల మించినసిరిచే
గరుడరథమునఁ జరింతువు, తిరుమల- ౭౨

శిరమున రత్నకిరీటం, బురమునఁ గౌస్తుభము వెలయ నురుకుండలన
త్నరకంకణములఁ జెలఁగెదు, తిరుమల- ౭౩

నిరుపమఘన దేహరుచుల్, కర మొప్ప విశాలహృదయకంజాక్షములన్
మెఱయు నిను భక్తిఁ గొలిచెదఁ, దిరుమల- ౨౪

కరివరద ! రమాలోలా, కరుణాకర ! భక్తపాల ! కాంచనచేలా !
శరణాగతభరణవ్రత, తిరుమల- ౨౫

తరణిసహస్రప్రభలను, మెఱయు భవద్దివ్యదేహమ్మును వైభవమున్
గరుణం గనఁజేయఁ గదే ! తిరుమల- ౨౬

హరి ! పరమపురుష ! నీమ్మృదు, చరణంబులు భక్తమానసస్ఫురణంబుల్
తరణంబులు భవజలధికిఁ, దిరుమల- ౨౭

నిరుపమసంసారాంబుధి, దరిఁ జేర్పఁగ నేల యింక దయరాదయయో?
కరుణారాశివిగావా ? తిరుమల- ౨౮

నిరవధిమోహాంబుధి సం, తరణం బొనరింపుమయ్య ! దవశిఖిసమ సం
సరణము దుర్భరమయ్యా ! తిరుమల- ౨౯

కరి మకరిచేత వడి సెడి, మఱిమఱి నిను వేఁడ మొఱను మఱవక విని స
త్వరఁ జని ప్రోచితివి కదా, తిరుమల- ౩౦

నెఱిబాల్యత గురుని యనా, దరమున నినుఁ జేరికొల్వ దయ ధ్రువునకు స
త్వరమాధిపత్య మొసఁగవె, తిరుమల- ౩౧

ఉరుసోదరపరిభవమున, శరణొందు విభీషణున కసంశయముగ స
త్వర నభయమిచ్చితివిగా, తిరుమల- ౩౨

హరివరునకు నెచ్చెలివై, వెఱవకు మని యభయ మొసఁగి వేగమ వాలిం
బరిమార్చి రాజ్యమిడితివి, తిరుమల- ౩౩

హరి నిందుఁ జూపు మన నర, హరివై స్తంభమున వెడలి యడఁచి దితిజు న
త్తఱిఁ బ్రహ్లాదునిగావవె, తిరుమల- ౩౪

కురుపతిసభ నొందుమహా, పరిభవమున వేఁడ మానభంగ మడఁచి త
త్పరతన్ ద్రౌపదిఁ గాచితి, తిరుమల- ౩౫

నరసారథివై కరుణన్, గురుపతిసుతవైభవంబుఁ గోల్పఱిచి వసుం
ధరఁ గౌంతేయుల కొసఁగవె, తిరుమల- ౩౬

ధరదాసీసుతుఁడైనను, నిరతము భవదీయభక్తినిష్ఠనొసఁగి తా
సురపూజ్యత నారదునకుఁ, దిరుమల- ౩౭

గిఱుపేద సఖుఁడు భక్తిం, దరు దెంచిన నెఱిఁగి ప్రీతి నడుకులు గొని స
త్వరమున సంపదలిడితో, తిరుమల- ౩౮

దురితాత్ముఁ డజామిళుఁడు, మరణార్తిని నీదుపేర మనుసుతుఁ బిలువం
బర మొసఁగితి కడుఁ బ్రేముడిఁ, దిరుమల- ౮౯

గురులుబ్ధవృత్తి నడవిని, దిరుగుచు భవదీయనామదివ్యమహిమచే
ధర వాల్మీకి యశముఁ గొనెఁ, దిరుమల- ౯౦

త్వర నంబరీషుపై ముని,వరుఁ డరయక కృత్తినేయ వాత్సల్యత న
త్తఱిఁ జక్రమనిచి ప్రోచితి, తిరుమల- ౯౧

గురుసుతు శరబాధల ను,త్తరగర్భస్థు నొగిఁ బ్రోవ దయ నుదరము వేఁ
జొరి పరితాపముఁ దీర్పవె, తిరుమల- ౯౨

హరి ! నీదీనదయాళుత, వరభక్తాధీనతయును వర్ణింపఁగ నా
తరమె ? మహాత్మగుణాబ్ధివి, తిరుమల- ౯౩

నెఱి స్వప్రతిజ్ఞఁ దలఁపక, పరమహితుండనుచు భీష్మప్రతిన నిలిపి తొ
దురమునఁ జక్రముఁ జేకొని, తిరుమల- ౯౪

శరతల్పగు గాంగేయుని, బరమధ్యానప్రవిష్టభావుఁడ వగుచుం
శరబాధలణంగింపవె, తిరుమల- ౯౫

గురుఁడవు దైవము సఖుఁడవు, మఱి చుట్టమవంచు నమ్మిమను పాండవులం
గరుణించితి వేవిధములఁ, దిరుమల- ౯౬

పరదైవత మీవని మది, నెఱనమ్మితి నన్నుఁ బ్రోవ నీకు భరంబే ?
దురితము లెన్నక యేలుము, తిరుమల- ౯౭

ఉరుదుష్టతనయుఁ డైనను, బరమకృపామతిని దండ్రి పాలింపఁడె ? మ
త్పరజనకుఁడ వీవ సుమీ, తిరుమల- ౯౮

హరి ! నారాయణ! మాధవ ! నరహరి! శ్రీవాసుదేవ! నలినాక్ష! రమా
వర ! వైకుంఠ ! జనార్దన, తిరుమల- ౯౯

ఉరగాధిపగిరివాసా ! పరమమహోల్లాస ! నిత్యభాసురహాసా !
నిరతిశయసుఖవిలాసా ! తిరుమల- ౧౦౦

సురవినుత ! భోగిశయనా, సరసీరుహపత్రనయన ! జననవిహీనా !
దురితాటవీహుతాశన, తిరుమల- ౧౦౧

స్మరశతసమప్రకాశా ! గిరిజామానసనివేశ ! కృతిపమహేశా !
పరిహృతసర్వపలాశా, తిరుమల- ౧౦౨

నెఱనమ్మితి మనమున నీ,చరణములే గతియటంచు సదయుఁడవై చె
చ్చెరఁ బరమగతి నొసంగుము, తిరుమల- ౧౦౩

సురుచిరఘనదేహరుచిం, గరుణాత్మత వీక్షణములఁ గనకాంబరతన్
దరిసెన మెసంగి యేలుము, తిరుమల- ౧౦౪
అరయఁగ బాలుని నుడువులఁ, బరితోషము నొందుజనకుభంగి నిపుడు నే
మొఱలిడుపల్కులఁ గొనఁదగుఁ, దిరుమల- ౧౦౫
గురుపాండిత్యప్రకటన, పరత న్మెప్పులకుఁ గాదు భక్తిం గృతి నీ
కరుణకొఱకు నేఁ జేసితిఁ, దిరుమల- ౧౦౬
పరమదయాంబోధి ! భవ, త్కరుణ న్శతకం బొనర్పఁగాఁ దగె దీనిన్
సరసతఁ గొను మెటులున్నం, దిరుమల- ౧౦౭
పరమాదరమున నిది యె,వ్వరు చదివిన వినిన నీదు వరకృపచేతం
బరమామృతమును గొందురు, తిరుమల శ్రీ వేంకటేశ త్రిదశాధీశా. ౧౦౮

వరభుజిమెళ్ళాన్వయ భా,సురవిమలాత్రేయగోత్రజుఁడ భగవద్భా
సురుఁడను నీకొసఁగితిఁ గృతి, దిరుమల శ్రీ వేంకటేశ ! త్రిదశాధీశా !
శ్రితహృదయాభీష్టప్రద, శతధృతిముఖవిబుధవంద్య ! చక్రధర ! వశీ
కృతభక్తజనౌఘమన,స్స్మిత ! తిరుమల వేంకటేశ ! త్రిదశాధీశా !
సతతము నెఱనమ్మితి మది, గతినీవయటంచు మిగులఁ గనికరమున స
ద్గతిఁ జేర్పఁ దగదె కమలా, ధృత ! తిరుమల వేంకటేశ ! త్రిదశాధీశా !
జయజయ కరుణాసాగర , జయజయ సర్వజ్ఞ ! సకలజగదాధారా !
జయజయ సర్వజనాధిప, జయ తిరుమల వేంకటేశ ! జయ సర్వేశా !

# ౮. మనోహరశతకము.

లకారప్రాసయుతోత్పలమాలావృత్తములు.

పరశురామపంతుల రామమూర్తికవి.

శ్రీలలనేశరుద్రసరసీరుహగర్భ గణాధిపాంఘ్రులన్
ఫాలము సోఁక మ్రొక్కి యొకపద్యశతంబు రచించి మల్లికా
మాలికగాను మీకును సమర్పణ చేసి తరింపఁగంటి నం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయామనోహరా. ౧

బాలిశుఁ డంచు నన్నని శుభస్థితి కేఁగురుమూర్తి నీరహ
స్యాలయమంత్రమంత్రకలితార్థములం గృపచేసె నట్టినా
పాలిటి లింగమూర్తి పదపద్మనుతుల్గొని నిన్భజింతు నం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయామనోహరా. ౨

శ్రీలలితం బనామయము చిన్మయ మాద్య మనిష్క్రియంబు ని
ర్మాల మఖండ మద్వయ మమూర్త మజం బగు బ్రహ్మ మైన నీ
వాలయసిద్ధి కంత ముదయస్థితి కాది వెలుంగుచుందు వం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయామనోహరా. ౩

ఆలయసంభవస్థితులనందని తొల్లిటి నీదుమూర్తియం
దాలయసంభవస్థితుల కాశ్రయ మై యొకశక్తి తోఁచి ని
న్నాలయసంభవస్థితుల నందెడివానిగ నావరించె నం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయామనోహరా. ౪

ఆలలితాత్మశక్తి విమలాత్మిక మై యొకమాయ యయ్యె న
త్తాలిమి నీశ్వరుండ వయి తద్గుణసంగతి నెంచి చక్రివిన్
శూలివి తమ్మిచూలివగుచున్ స్థితినాశభవార్థి వైతి వం, బాలపురీశ- ౫

ఏలిక మాయతో నెనసి యీశుఁడ వై కనుఁగొన్నమాయ నీ
నేల జలాగ్నివాయువులు నింగియుఁ దద్గుణభాగసంగతిన్
స్థూలము సూక్ష్మ మర్థవితతు ల్జగము లనేకలంబుఁ బుట్టెనం, బాలపురీశ- ౬

పోలిక కాత్మకల్పితవపుత్రయమున్ జడ మాట దానిలో
నీలలితాంశముం బ్రతిజనింపఁగఁ జేసి నజీవుఁ డయ్యె నా
లీల ననేకజీవులు గలింగి జగంబులు నిండియుండి రం, బాలపురీశ- ౭

నీలనదంశఁ బుట్టి భువి నిండిన జీవులలో నొకండ నీ
పాలనె పుట్టినాఁడ నినుఁ బ్రాపుగఁ గైకొని యున్నవాఁడ ని
న్నోలినవాఁడ వేఱుపడిపోయెడివాఁడను గాను గావు మం, బాలపురీశ- ౮
నీలలితాంశమైన నను నీసముఖమ్మున నుండనీక నేఁ
డీలలనాసుతార్థవిషయేషణము ల్పొడసూపి తోడనే
మేలును గీడులం దనుగమింపఁగఁ జేసితి వేమనందు నం, బాల- ౯
మేలిడు సత్కృతంబు బలిమిం దురితం బిడుఁ గీడు తత్క్రియా
మూలము దేహ మట్టి తనుమోహమునం జరియించు జీవుఁ డే
కాలము నేను దత్సముఁడఁ గావున నిన్భజియింతుఁ బ్రోవు మం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయామనోహరా. ౧౦
కాలముఁ గర్మముం గలసి కామములుం బొడసూపి మోదఖే
దాలయమైన దుస్తరభవాబ్ధిని ద్రొబ్బెను గాన నన్నుఁ ద
త్కాలుని కొప్పగింపకను గావుము నిన్మదిలో భజింతు నం, బాల- ౧౧
కాలము వ్యర్థమాయె భవకర్మము లన్ని సమర్థమాయె ని
ల్లాలు సుతు ల్ధనంబు మొదలైనవి స్వార్థము లాయెఁ గాని నీ
లీల లొకించుకైన వినలేదిఁక నేలెద వెట్లు నన్ను నం, బాలపు- ౧౨
కాలములోనఁ గొంత గతకాలము బాల్యము చెల్లె నీవయః
కాలము దారపుత్రకనకభ్రమలం గత మయ్యె నాజరా
కాలము దుర్బలంబు నినుఁ గాంచి భజింపఁగఁ జాలఁ బ్రోవుమం, బాల-౧౩
కాల మొకించుకైన వృథగాఁ జననీదగ దందు నాయువుం
గాలము కొంచెమేని జనఁగాఁ జను రాత్రిపగళ్ల వెంబడిం
గాలుఁడు నిర్దయుండు నటుగావున నిన్ను భజింపఁజేయు మం, బాల- ౧౪
మేలు సతంబు నాఁగ నది మించులఁ బోలు సతంబు మేననం
బోలదు నీరుబుగ్గ యది మ్రోల వసించును మిత్తియంచు నేఁ
జాల విచార మంది నిను సారెకుఁ దల్చుచు నుంటిఁ బ్రోవుమం, బాల-౧౫
మే లచరంబులం జరము మేలు చరంబుల మర్త్యుఁ డందులో
మేలు ద్విజేంద్రుఁ డందులకు మేలు భవత్పదభక్తుఁ డాతనిం
బోలఁగఁ జేసి నన్ను దయఁ బ్రోవక యుండుట మేలు గాద యం, బాల-౧౬
ఆలయ మాలు బిడ్డ లని యాడబముం దలపెట్టి వానిలో
సోలుచుఁ జొక్కుచుండు మని చూచితి వింతియకాని నన్ను నీ
పాల వసింపఁ జేయ విది పాడియె యేమన వచ్చు నిన్ను నం, బాల- ౧౭

# ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు. పరిషద్దా          లు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

# ఉద్ధారకులు.

రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

రాణీ వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మజగపతిబహద్దరుగారు-తుని రాణీగారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

# ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

## అధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు

పెద్దాడ రామస్వామిగారు, ఎం ఏ.,

(కోశాధ్యక్షులు.)

త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.

కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., యల్. టి.

దర్భా వేంకటశివరామరాసుగారు, బి. ఏ, బి. ఎల్.

అళక్కి వేంకటరామయ్యగారు.

కేశవపు శామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయుడుగారు.

పి.శేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి గంగబ్రహ్మరావునాయుడుగారు

**PYDA VENKATACHELAPATI TELUGU MANUSCRIPT**
**PRINT FUND SERIES No. 1.**

# సాంబోపాఖ్యానము.

శ్రీకృష్ణదేవరాయల యల్లుఁడగు
అళియరామరాజునకుఁ బెద్దతండ్రిమనుమఁడగు

## రంగప్పరాజకవి రచించినది.

వసుచరిత్ర కళాపూర్ణోదయములకంటెఁ బూర్వప్రబంధము.
చిత్రశ్లేషలకు నిలయము. అత్యద్భుతవర్ణనలగని. స్వభావోక్తులకు నిధి.
నిర్దుష్టమైనది.

కథ- శ్రీకృష్ణజాంబవతుల తనయుఁడగు సాంబునకును
దుర్యోధనునిపుత్రియగు లక్షణకును వివాహము.

## రాజకవిత్వము, ప్రబంధరాజము

భాషాభిమానులెల్లరుఁ జదువఁదగినది.
రాయల్ 186 పుటలు- అయిదాశ్వాసములు.
పోస్టువ్యయము గాక- వెల రు 1—0—0 మాత్రమే.

## దొరకుచోటు
## ఆంధ్రసాహిత్యపరిషత్తు- కాకినాడ

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada